లియో టాల్‌స్టాయ్

# ఆన్నా కరేనినా




నవల

రెండవ వాల్యూమ్

(భాగాలు 5-8)



"రాదుగ" ప్రచురణాలయం
మాస్కో



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

అనువాదం: ఆర్వియార్

చిత్రకారుడు: ఒ. వెరేయ్‌స్కీ

డిజైన్: పి. ఇవాషెంకో

**Лев Толстой**

АННА КАРЕНИНА

Книга II

*На языке телугу*

**Tolstoy L.**

ANNA KARENINA

A novel

Book II

*In Telugu*

Перевод выполнен по изданию: Л. Н. Толстой.
Собрание сочинений в 22 томах. т. IX.
М., Художественная литература, 1982



సోవియట్ యూనియన్‌లో ముద్రింపబడింది

# యిందులో

# అయిదవ భాగం

## 1

వివాహం బహుశా లెంట్* ముందు జరగదేమోనని ప్రిన్సెస్ ష్చెర్‌బాత్‌స్కీ అనుకొంది. లెంట్ అప్పటికి అయిదు వారాలే వుంది. పెళ్లికూతురి కట్నువర్గం సరంజామా సగం మాత్రమే సమకూరుతుంది. కాని లెంట్ తర్వాతదాకా వాయిదా వేయించడం మంచిది కాదన్న లేవిన్ అభిప్రాయాన్నీ ఆవిడ కాదనలేకపోయింది. యేమంటే ప్రిన్స్ ష్చెర్‌బాత్‌స్కీ ముసలి అత్త చాలా జబ్బుగా రేపో మాపో అన్నట్టుంది. వొకవేళ అటే అయితే మైల శుద్ధి దినం అయేదాకానో, యింకా ముందుకో డేకించాల్సి వస్తుంది. ఆ కారణంగా లెంట్‌కి ముందే సుముహూర్తాన్ని జరిపించడానికి ఆమె సరేనంది. పెళ్లికూతురి కట్నువర్గాన్ని పెద్దా చిన్నా అని రెండు భాగాలుగా చెయ్యొచ్చు. చిన్న భాగం పెళ్లికి తయారవుతుంది. పెద్ద భాగాన్ని తర్వాత పంపించవచ్చు. యీ యేర్పాటు తనకి యిష్టమో కాదో తెల్చి సరిగా చెప్పనందుకు లేవిన్‌మీద ఆమె చిరాకు పడింది. పెళ్లయిన వెంటనే నూతన వధూవరులు యెకాయెకీ లేవిన్ పల్లెటి ఎస్టేట్‌కి వెళ్లే కల్పంలో యీ యేర్పాటు సౌకర్యంగా వుండేటట్టే కని పించింది. ఆ పల్లెలో కట్నువర్గం పెద్ద భాగం వెంటనే అవసరం వుండదు.

లేవిన్ యింకా ఆనందోన్మాదంలోనే వున్నాడు. ఆ మానసిక స్థితిలో తనూ, తన ఆనందమూనే విశ్వంలో యేకైక లక్ష్యంగా కనిపించేయి. తను దేన్ని గురించీ పట్టించుకో నవసరం లేదనీ, ప్రతిదాన్నీ పై వాళ్లు చూసుకున్నారనీ యిక పైనా చూసుకుంటారనీ అతనికి అనిపించింది. అతను తన భవిష్యత్ జీవితం గురించి ఆలోచించలేదు. ఫలానా ఫలానావి చెయ్యాలని అనుకోనూ లేదు. అతనా విషయాల్ని కూడా పై వాళ్లకి వదిలేశాడు. అంతా దివ్యంగా అమరుతుందని నమ్మకంతో వున్నాడు. కోజ్నిషెవ్, అబ్లాన్‌స్కీ, ప్రిన్సెస్‌లు అతని చేత యేవేం చేయించాల్సి వుందో అవన్నీ అతను చేసేటట్టు చూశారు. వాళ్లు యేం చెప్పినా అతను వూఁ అనే అన్నాడు. అతనికి అన్నగారు డబ్బు సమకూర్చిపెట్టాడు. పెళ్లవగానే మాస్కో నుంచి వెళ్లిపోవాలని ప్రిన్సెస్ అంది. విదేశాలకి వెళ్లమని అబ్లాన్‌స్కీ అన్నాడు. అతను అన్నిటికీ వూ అనే అన్నాడు. 'నాచేత మీకెలా కావాలంటే అలా చేయించుకోండి మీ సరదానిబట్టి. నాకు ఆనందంగా వుంది. మీరేం చేసినా నా ఆనందం పెరగదు, పక్కకి మళ్లదు' అనుకున్నాడు. తాము విదేశాలకి వెళ్లాలని అబ్లాన్‌స్కీ సలహా యిచ్చినట్టు అతను కిట్టీకి చెప్పాడు. ఆమె ఆ సలహాని కొట్టిపారెయ్యడమూ, తాము యెలా బతకాలో అన్న విషయంమీద ఆమెకి

స్థిరమైన అభిప్రాయాలు వుండడమూ చూసి అతనికి ఆశ్చర్యం కలిగింది. పల్లెలో లేవిన్‌కి పని వుందనీ, ఆ పనంటే అతనికి పంచప్రాణాలూ అనీ ఆమెకి తెలుసు. తన పని ఆమెకి అర్థం కాదనీ అర్థం చేసుకోవాలనే కోరిక ఆమెకి లేదనీ అతను గ్రహించేడు. అయినా అతని పని చాలా ముఖ్యం అయింది అని ఆమె తెలుసుకోవడానికి అవి ఆటంకం కాలేదు. తను పల్లెలో కాపరం వుంటుంది, అంచేత విదేశాలకి వెళ్ళాలని ఆమె అనుకోలేదు. ఆ దేశాల్లో తను యెన్నటికీ వుండలేదు. తను వుండాల్సింది పల్లెలో, తను అక్కడికే వెడుతుంది. తన అభిప్రాయాన్ని అంత కరాఖండీగా ఆమె చెప్పడం లేవిన్‌కి ఆశ్చర్యం కలిగించింది. యింతకీ అతనికి యెలాగైనా వొకటే. అంచేత అబ్లాన్‌స్కీని తమ ఎస్టేట్‌కి వెళ్ళి అన్నిటినీ తన శక్తి మేరకి సొద్దుపెట్టడానికి లేకుండా పుష్కలంగా వున్న తన మంచి అభిరుచి మేరకి యేర్పాటు చెయ్యమని లేవిన్ అడిగేడు — అక్కడికి అబ్లాన్‌స్కీ తను యేమడిగినా చెయ్యాల్సి వున్నట్టు.

అబ్లాన్‌స్కీ పల్లెకి వెళ్ళి పడుచుజంట గృహ ప్రవేశానికి తగ్గట్టుగా అన్నిట్నీ యేర్పాటు చేసి వచ్చేక వో సారి

"అది సరేగాని, నువ్వు మత సంస్కారం తీసుకున్నట్టు కాగితం సంపాదించేవా?" అని అడిగేడు.

"లేదు, యేం?"

"అది లేకుండా చర్చి వివాహం జరిపించదు."

"బాప్‌రే!" అని లేవిన్ అరిచేడు. "తొమ్మిదేళ్ళయింది చర్చిలో అడుగు పెట్టి. అసలా విషయం గురించి అనుకోనే లేదు" అన్నాడు.

"భేష్!" అని అబ్లాన్‌స్కీ చిరునవ్వు నవ్వేడు. "నన్ను పాషండుడు అని నువ్వు తిడతావు! కాని లాభం లేదు, తెలుసా? నువ్వు ఉపవాసం చేసి, చర్చికి హాజరయి సంస్కారం తీసుకోవాల్సిందే" అన్నాడు.

"కాని నాలుగు రోజులే వ్యవధి వుందే!"

అబ్లాన్‌స్కీ దీనిక్కూడా యేర్పాట్లు చూశేడు. లేవిన్ ఉపవాసం చెయ్యడం, చర్చికి వెళ్ళడం మొదలెట్టాడు. అతనికి మత కర్మకాండ కష్టంగా వుంది. తను నమ్మడు కాని యితరుల నమ్మకాల్ని గౌరవిస్తాడు. యిప్పుడతని మానసిక స్థితి మెత్తగా వుంది. అన్నిటి పట్లా స్పందనాత్మకంగా వుంది. యిటువంటి స్థితిలో నటించడం కష్టమేగాక దాదాపు అసాధ్యం కూడా. యిలాంటి వైభవోపేత స్థితిలో, ఉల్లాసం పొంగిపొర్లేటప్పుడు అబద్ధమేనా ఆడాలి లేదా అపవిత్ర కార్యం అయినా చెయ్యాలి. యిప్పుడు యీ రెండింటిలో యేదీ చేయలేనని అతనికి అనిపించింది. యీ తంతు జరిపించక్కర్లేకుండానే తను ఆ బాపతు పత్రం సంపాదిస్తానని యెంత చెప్పినా అబ్లాన్‌స్కీ టట్‌వీల్లేదని మొండిగానే వున్నాడు — యథావిధిగా మత సంస్కారం తీసుకోవాల్సిందే అన్నాడు.

"యెందుకింత రాద్ధాంతం చేస్తావయ్యా! రెండు రోజులు కళ్లు మూసుకుంటే పోయె! పురోహితుడు మంచి వాడు, లోకజ్ఞుడు. యిట్టే జరిపించేస్తాడు."

మొదటిసారి ప్రాతః ఆరాధనలో పాల్గొన్నప్పుడు తనకి పదహారు పదిహేడేళ్ల వయసప్పుడు వున్న గట్టి మతానుభూతుల తరుణ స్మృతుల్ని జ్ఞప్తికి తెచ్చుకోబోయేడు లేవిన్. కాని అది అసాధ్యం అని త్వరలోనే గ్రహించేడు. తర్వాత యీ తంతుని యెవళ్లనేనా చూడ్డానికి వెళ్లినట్టు యే ప్రాముఖ్యమూ లేని బోలు ఆచారంగా చూడబోయేడు. కాని అలాగా చెయ్యలేకబోయేడు. ఆనాటి వాళ్లకి చాలా మందికి వున్నట్టుగానే మతం పట్ల లేవిన్ వైఖరీ యెంతో అస్పష్టంగా వుంది. అతనికి విశ్వాసం లేకపోయింది. కాని దాని వెనక యేమీ లేదనీ తిరుగులేని నమ్మకం కలిగించుకో లేకబోయేడు. దానా దీనా తను చేస్తున్న పని ప్రాముఖ్యం యేమిటో నమ్మనూ లేక, దాన్ని వొట్టి లాంఛనంగా మొక్కుబడిగా స్వీకరించనూ లేక అతను మత సంస్కారం కోసం తయారయేటంత సేపూ తనకి అర్థం కాని వాటిని చేస్తూ వుండి పోయాడు. అవి అంతర్వాణి బోధించినట్టు అనృతమూ, నిజాయితీలుప్తమూ అని యిబ్బంది పడి పోయేడు, సిగ్గుపడిపోయేడు.

ఆరాధన సమయంలో అతను తన అభిప్రాయాలని ప్రతిఘటించని అర్థాన్ని లాగ ప్రయత్నిస్తూ బోధని వినేవాడు. తర్వాత తను దాన్ని అర్థం చేసుకోలేనని గ్రహించి దాన్ని కాదనాల్సిన స్థితిలో పడేవాడు. అప్పుడు ప్రార్థనని వినకుండా వుండే ప్రయత్నం చేసేవాడు. చర్చిలో వొట్టినే నుంచున్నప్పుడు తన మనసులో యెంతో స్పష్టంగా ఉద్భూతమైన ఆలోచనలకి, పరిశీలనలకి, జ్ఞాపకాలకి లొంగిపోయేవాడు.

ప్రాతః ఆరాధనకి, మధ్యాహ్న ఆరాధనకి, సాయం ఆరాధనకి హాజరయేడు. మర్నాడు మామూలు కంటే పెందరాళే లేచి నాస్తా తినకుండా చర్చికి యెనిమిది గంటలకి నియమంగా చదవాల్సిన ధర్మబోధభాగం వినేటందుకు ప్రాతఃకాల కార్యక్రమాన్ని వినేటందుకు నివేదన చేసుకునేటందుకు వెళ్లేవాడు.

ఓ బీద సైనికుడూ, యిద్దరు ముసలమ్మలూ, కొద్దిమంది అర్చకులు తప్ప చర్చిలో యెవరూ లేరు.

ఓ పడుచు డీకన్ లేవిన్‌ని కలుసుకున్నాడు. ఆ డీకన్ వేసుకున్న పల్చని ఉడుపు కింద ఆయన వెన్నుపట్టి బారుగా రెండు భాగాలుగా స్పష్టంగా కనిపించింది. అతను లేవిన్‌ని గోడవార వున్న వో బల్ల దగ్గరికి తీసికెళ్లేడు. తిన్నగా అక్కడ ధర్మబోధ చదవడం మొదలు పెట్టేడు. అతను చదువుతూ, ముఖ్యంగా "ప్రభువు కృప చూపించుగాక" అనే మాటలు యెక్కువ సార్లు తొందరగా వల్లిస్తూ మాట మింగేసి "ప్రభు కృప చూంచుగాక" అని ధ్వనించేటట్టు చదవడంతో లేవిన్‌కి తన ఆలోచనలు తాళం పెట్టి సిక్కా వేసినట్టు, వాటిని కదిలించకూడదన్నట్టు, లేకపోతే అవి బుర్రని గందరగోళ పరుస్తాయన్నట్టూ అనిపించింది. అంచేత డీకన్ వెనక్కాల నుంచున్నా అతను యేమీ వినిపించుకోలేదు, అర్థం చేసుకో ప్రయ

ల్పించలేదు. తన ఆలోచనల్లో తను మునిగిపోయాడు. 'ఆమె చేతులు యెంత సొగసుగా వున్నాయి' అనుకున్నాడు అంతకు ముందు రోజు సాయంత్రం వో మూల బల్ల దగ్గర తామిద్దరూ కూర్చున్న సంగతిని గుర్తు చేసుకుని. యిప్పుడు వొకళ్ల కొకళ్ళు ప్రత్యేకంగా చెప్పుకోవలసింది యేదీ లేకపోయింది, యీ మధ్య యెక్కువ అలానే వుంటోంది. ఆమె బల్లమీద చెయ్యి పెట్టి దాన్ని మూస్తూ తెరుస్తూ వుంది. అలా చేస్తూ నవ్వింది. అతను ఈ చేతిని ముద్దు పెట్టుకుని, గులాబీ రంగు అరచేతిలో రేకలు చూస్తూ వుండడం గుర్తు చేసుకున్నాడు. 'మళ్లీ ప్రభు కృప చూంచుగాక' అని శిలువ గీసుకుంటూ, వొంగి వందనం చేస్తూ డీకన్ యెంత చురుగ్గా వంగి వందనం చేస్తున్నాడో చూస్తూ, అనుకున్నాడు. 'అప్పుడు ఆమె నా చేతిని తీసుకుని రేకలు చూసింది. "నీ చెయ్యి యెంత ముద్దుగా వుంది" అంది.' అతను తన చేతి కేసీ డీకన్ బండ వేళ్లకేసీ చూశేడు. 'కొంచెం సేపట్లో అయిపోతుందేమో. వుహు, మళ్లీ మొదలెడుతున్నాడుగా వుంది' అనుకున్నాడు ప్రార్థన వింటూ. 'లేదు, అవగొట్టేస్తు న్నాడు, నేలమీదకి వొంగుతున్నాడు. ఆఖర్న చేసే పని కదా యిది' అని అనుకున్నాడు.

తనకిచ్చిన మూడు రూబుళ్ల నోటు అందుకుని డీకన్ అంగరఖా మఖమల్ కఫ్ కింద పైకి కనిపించ నియ్యకుండా పట్టుకున్నాడు. పత్రం రాసి యిస్తానని చెప్పి, ఖాళీగా వున్న చర్చి నేలమీద కొత్త బూట్లు చప్పుడు చేసుకుంటూ బలివితర్ది గది లోపలకి వెళ్లాడు. కొంచెం సేపట్లోనే అతను అక్కడినుంచి యివతలికి తొంగి చూసి లేవిన్‌ని పిలిచేడు. లేవిన్ బుర్రలో తాళం వేసి పెట్టుకున్న ఆలోచన తుట్టరేగింది. కాని అతను దాన్ని తరిమేసుకున్నాడు. 'యేదో రకంగా అయిందనిపిస్తాను' అని అనుకున్నాడు. అనుకొని వితర్ది కమ్మీల దగ్గరికి వెళ్లాడు. అతను మెట్లమీద యెక్కి కుడి వేపు తిరిగి పురోహితుణ్ణి చూశేడు. అతను వో వాలుబల్ల దగ్గర నుంచుని జప గ్రంథం తిరగేస్తున్నాడు. అక్కడా అక్కడా నెరుస్తూ వున్న గడ్డం, అలిసిన కరుణాపూరిత నేత్రాలూ వున్న వృద్ధుడు. అతను లేవిన్ కేసి చూసి కొంచెం తల వొంచి మొక్కుబడిగా ప్రార్థన చదవడం మొదలుపెట్టేడు. చదవడం పూర్తయాక నేలమీదకంటా వొంగి, లేవిన్ కేసి తిరిగేడు.

"మీ పాప నివేదన వింటానికి యిక్కడ క్రీస్తు అదృశ్యంగా వచ్చి వున్నాడు" అని శిలువకేసి చూపిస్తూ అన్నాడు. "పవిత్ర అపోస్తలుల చర్చి బోధనలన్నిట్నీ మీరు విశ్వసిస్తు న్నారా?" అని కళ్లని లేవిన్‌మీదనుంచి తప్పించుకుంటూ, చేతుల్ని అంగవస్త్రంకింద పెట్టుకుంటూ అడిగేడు.

"నాకు సంశయాలున్నాయి, నేను ప్రతిదాన్నీ సంశయిస్తాను" అని లేవిన్ అన్నాడు. అతని గొంతుక అతనికే వికారంగా కనిపించింది.

అతను యింకా చెప్తాడని పురోహితుడు కొద్ది క్షణాలు ఆగేడు. అతను అలా చెప్పక పోవడంతో పురోహితుడు కళ్లు మూసుకుని వోల్గా ప్రాంతం ఉచ్చారణతో 'ఒ'లని నొక్కి పలుకుతూ గబగబా అన్నాడు.

"మానవుడు తన దౌర్బల్యంవల్ల సంశయాత్ముడవవచ్చు. కాని ప్రభువు దయామయుడై మన విశ్వాసాన్ని దృఢతరం చెయ్యాలని మనం ప్రార్థన చెయ్యాలి. యేమిటి మీా దోషాలు?" అని లిప్త కాలం కూడా ఆక్కుండా, యే మాత్రం కాలం వృథా చెయ్యకుండా వుండాలని ఆతృతతో వున్నట్టు, అన్నాడు.

"సంశయమే నా పెద్ద పాపం. నేను ప్రతిదాన్నీ సంశయిస్తాను, యెక్కువగా సంశయాత్మక స్థితిలోనే వుంటాను."

"మానవుడు తన దౌర్బల్యంవల్ల సంశయాత్ముడవవచ్చు" అని పురోహితుడు మళ్లీ అదే పాట పాడేడు. "మీకున్న పెద్ద సంశయం యేమిటి?" అని అడిగేడు.

"నేనన్నిటి పట్లా సంశయాత్మకంగానే వున్నాను. ఫొకో అప్పుడు ఈశ్వరుడి ఉనికే నాకు సంశయంగా వుంటుంది" అని లేవిన్ ఠక్కున అనేశాడు. వెంటనే యేమిటిలా కొంప ములిగే మాట అన్నానని బిత్తరపోయేడు. కాని పురోహితుడిమీద అతని మాటలు యేం చలనం చూపించనట్టుగానే కనిపించింది.

"ఈశ్వరుడి అస్తిత్వం గురించి సంశయం యేం వుంటుంది నాయనా?" అని పురోహితుడు కనిపించీ కనిపించని చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

లేవిన్ యేం మాట్లాడలేదు.

"సృష్టికర్త చేసిన వాటిని చూస్తూ ఆయన అస్తిత్వాన్ని యెలా సంశయించగలరు?" అని పురోహితుడు సామాన్యంగా వుండే స్వరంతో గబగబా అన్నాడు. "ఆకాశంలో నభోమణుల్ని అలంకరించిందెవరు? యిలని సౌందర్య సమన్వితం చేసిందెవరు? సృష్టికర్త తప్ప యెవరు చెయ్యగలరీ పనిని?" అని లేవిన్ కేసి యేం సమాధానం చెప్తావ్ అన్నట్టు చూశేడు.

పురోహితుడితో అస్తినాస్తి తాత్విక విచికిత్స చేసే సమయం అది కాదని లేవిన్‌కి అనిపించింది. అంచేత అడిగిన దానికి సూటిగా సంబంధించిన జవాబు చెప్పాడు.

"నాకు తెలియదు" అన్నాడు.

"తెలియదా? దీన్నంతట్నీ ఈశ్వరుడు సృష్టించాడన్న విషయాన్ని యెలా సంశయించగలరు?" అని పురోహితుడు సరదాగా వుందే అన్నట్టు కనిపించే విస్మయంతో అన్నాడు.

"నాకు యేమీా అర్థం అవడం లేదు" అని తన మాటలు బుద్ధిహీనంగా వున్నాయని అనుకొంటూ సిగ్గు పడుతూ, అలాంటి సందర్భంలో అవి బుద్ధిహీనంగా తప్ప వుండవని భావించుకుంటూ అన్నాడు.

"ఈశ్వరుణ్ణి ధ్యానం చేసి ఆయన సహాయాన్ని అర్థించండి. మహర్షులకు కూడా సంశయం కలిగిన ఘట్టాలు వున్నాయి. తమ విశ్వాసాన్ని పటుతరం చెయ్యమని వాళ్లు అర్థించేరు. సైతాన్ చాలా శక్తివంతుడు, మనం సైతాన్‌కి లొంగకూడదు. ఈశ్వరుణ్ణి ధ్యానించి ఆయన కృపావరాన్ని అర్థించండి. ప్రార్థన చెయ్యండి" అని దడదడ రెట్టించేడు.

తర్వాత పురోహితుడు కొంచెం సేపు యేం మాట్లాడలేదు. దేన్ని గురించో ఆలోచిస్తూ వున్నట్టుగా వుండిపోయేడు.

"మీరు మా చర్చి సభ్యులు, ప్రాపకంలో వున్నవారు ప్రిన్స్ ష్చెర్‌బాత్‌స్కీగారి అమ్మాయిని వివాహ మాడబోతున్నారని విన్నాను" అని మందహాసం చేస్తూ అన్నాడు. "ముచ్చటైన అమ్మాయి" అన్నాడు.

"వూఁ" అన్నాడు లేవిన్ సిగ్గుపడుతూ. 'పాప నివేదన సమయంలో యీ గొడవ యెందుకట?' అనుకున్నాడు.

తను పైకి అడగని ప్రశ్నకి సమాధానంగానా అన్నట్టు పురోహితుడు చెప్పాడు:

"మీరు పవిత్ర వివాహబంధంలోకి వస్తున్నారు. భగవంతుడు మీకు సంతాన ప్రాప్తి కలగ చేస్తాడు, అంతే కదా? సైతాన్ ప్రలోభానికి లొంగి అవిశ్వాసపరులై వుంటే మీరు మీ పిల్లలకి యేం బోధిస్తారు?" అని చిన్నగా మందలిస్తున్నట్టు అన్నాడు. "మీరు మీ బిడ్డల్ని ప్రేమిస్తే మంచి తండ్రిగా వాళ్లకి సిరిసంపదలు హోదాలు మాత్రమే యివ్వాలని అనుకోరు కదా. మీ పిల్లలకి మోక్ష మార్గం చూపించా లనుకుంటారు. సత్య తేజంతో వాళ్ల ఆత్మలు ప్రకాశించాలనుకుంటారు. మీ బిడ్డ 'నాన్నా, యీ ప్రపంచంలోని అందాల న్నిటినీ, యీ భూమిని, నీటిని, సూర్యుణ్ణి, పువ్వుల్ని, గరికల్ని యెవళ్లు సృష్టించారు?' అని అమాయకంగా అడిగితే మీరేం జవాబు చెప్తారు? 'నాకేం తెలీదు' అని చెప్పలేరు కదా! మీరు తెలుసుకోకుండా వుండలేరు. కృపామయుడైన సర్వేశ్వరుడు మీకు దాన్ని విశదం చేశాడు. లేకపోతే 'చనిపోయిం తర్వాత నాకు యేం జరుగుతుంది?' అని మీ బిడ్డ అడిగినప్పుడు మీకే తెలియకపోతే మీరేం చెప్తారు? యెలా జవాబు చెప్పగలరు? మీరు మీ బిడ్డల్ని ఐహిక కామనలకి, సైతాన్ ప్రలోభాలకి యెర చేస్తారా? అది మీ ఘోర తప్పిదం అవుతుంది" అని ఆగి, తల వో పక్కకి వొరగేసుకుని, సౌమ్య దయార్ద్రపూరిత నేత్రాలతో లేవిన్ కేసి చూస్తూ అన్నాడు. లేవిన్ యీ సారి యే జవాబూ చెప్పలేదు. పురోహితుడితో వాదం యెందుకని వూరు కోవడం కాదు, కాని యింతకు ముందు యెవళ్లూ యిలాంటి ప్రశ్నలు తనకి వెయ్యక పోవడం వల్ల. తన పిల్లలు అడిగితేనా, అప్పుడు చూసుకుంటాడు యెలా జవాబు చెప్పవచ్చో, బోలెడు వ్యవధి వుంది.

"మీరు జీవితంలో పక్కకి మళ్లడంకాక వొక మార్గాన్ని యెంచుకునే దశకి చేరుకుం టున్నారు" అని పురోహితుడు చెప్పేడు. "పరాత్పరుడు మీమీద తన కృప వర్షించేటట్టు ప్రార్థన చెయ్యండి" అన్నాడు. "ప్రభువు ఈశుడు ఏసు క్రీస్తు మానవాళిపట్ల వున్న తన అపార ప్రేమతో యితన్ని, తప్పు చేసిన తనయుణ్ణి మన్నించు గాక..." అని ముగింపు ప్రార్థన చేస్తూ పురోహితుడు లేవిన్‌ని ఆశీర్వదించి పంపేశాడు.

యింటికి తిరిగి వచ్చేక లేవిన్ సంతోషంతో హమ్మయ్య అనుకున్నాడు. యిష్టంలేని వొక పని పూర్తయింది, అది కూడా తను అబద్ధం ఆడవలసిన పరిస్థితి రాకుండా పూర్తయింది.

పాపం ఆ ముసలాయన చెప్పిన మాటలు మొదట కనిపించినంత తెలివిహీనంగా లేవు, తను వివరంగా తెలుసుకోవాల్సినదేదో అందులో వుంది అనే వొక అస్పష్ట భావన అతనికి కలిగింది.

'యిప్పుడు కాదు, ముందు ముందు యీ విషయం చూడాలి' అనుకున్నాడు లేవిన్. అతనికి మనసులో యేదో అస్పష్టమైందీ మలినమైందీ అంతకుముందు యెన్నడు లేనట్టుగా తోచింది. మతానికి సంబంధించి యితరులు వున్న స్థితిలోనే తనూ వున్నట్టు, తన మిత్రుడు స్వియాజ్స్కీని విమర్శించి తను అంగీకరించని ఆ స్థితిలోనే వున్నట్టు అనిపించింది.

ఆ సాయంత్రం అతనూ, కిట్టీ కలిసి దాలీ యింటి దగ్గర గడిపేరు. లేవిన్ మహా ఉత్సాహంగా వున్నాడు. తన ఉత్సాహాన్ని గురించి అబ్లాన్స్కీకి చెబుతూ చిన్న కుక్కకి చక్రంలోనుంచి యెగరడం నేర్పితే అది యెంత సంబరంగా వుంటుందో తనకి అలా వుందని అన్నాడు. మొదటిసారి చక్రంలోనుంచి దూకుతూ అది యెంత హుషారుగా వుంటుందంటే అది గుంయ్‌మని అరుస్తుంది, తోక ఆడిస్తుంది, పరవశించి పోయి బల్లమీద గెంతేస్తుంది, కిటికీ తీనెమీద యెగిరేస్తుంది.

## 2

పెళ్లి రోజున లేవిన్ ఆచారం ప్రకారం వధువు దగ్గరికి వెళ్లలేదు (అతను అన్ని ఆచారాలనీ తు. చ. తప్పకుండా పాటించాలని పెద్ద ప్రిన్సెస్, దాలీ పట్టుబట్టేరు). అలా వెళ్లకుండా అతను కాకతాళీయంగా తనని చూడవచ్చిన ముగ్గురు బ్రహ్మచార్లతో హోటల్‌లో భోజనం చేశాడు. వాళ్లు కోజ్నిషెవ్, కతవాసొవ్, చీరికొవ్‌లు. కతవాసొవ్ యూనివర్సిటీ నాటి మిత్రుడు. యిప్పుడతను ప్రకృతిశాస్త్రాల ప్రొఫెసరు. అతను రోడ్డుమీద తగిలితే లేవిన్ హోటల్‌కి తీసుకువచ్చేడు. చీరికొవ్ పెళ్లి పెద్ద. అతను మాస్కో రాజీ కోర్టులో జడ్జి*. లేవిన్, అతనూ కలిసి ఎలుగుబంటి వేటకి వెళ్లారు వొకసారి. యిప్పుడు భోజనం మజాగా సాగింది. కోజ్నిషెవ్ మంచి హుషారుగా వున్నాడు. కతవాసొవ్‌కి గల ప్రత్యేకత అనే దాన్ని చూసి చాలా ముచ్చట పడ్డాడు. తన ప్రత్యేకతని గుర్తించారని గమనించి కతవాసొవ్ పూర్తిగా తన ప్రతిభా విశేష కాంతులు విరజిమ్మేడు. యిక చీరికొవ్ ప్రసక్తం అయిన యే విషయాన్నైనా గానీ సంతోషంగా సరదాగా సై అంటూ అందుకున్నాడు.

"అవును, నిజంగా" అని కతవాసొవ్ తన సహజ బోధనాత్మక ధోరణిలో మాటలు సాగదీస్తూ మొదలుపెట్టేడు. "మనవాడు లేవిన్ యిప్పుడు వొకటో రకం శక్తి సామర్థ్యాలు చూపించేడు. నేను మనలో లేని వ్యక్తిని గురించి మాట్లాడుతున్నాను, యేమంటే లేవిన్ మనలో వాడు కాడు యిక. యూనివర్సిటీ వదిలేటప్పటికే విజ్ఞానశాస్త్రానికి అంకితం అయిపోయేడు. మానవులకి సహజమైన ఆసక్తులు వచ్చేయి. యిప్పుడు యితనికి వున్న శక్తి సామర్థ్యాలు సగం ఆత్మవంచనకీ, మిగిలిన సగం ఆ వంచనని సమర్థించుకోవడానికీ పోతాయి" అన్నాడు.

"వివాహ జీవితాన్ని నీకంటే పట్టుగా శత్రుత్వంతో వ్యతిరేకించేవాణ్ణి నేనింత వరకూ చూడలేదు" అని కోజ్నిషెవ్ అన్నాడు.

"వుహుం, నేను శత్రువుని కాదు, నేను శ్రమ విభజన కావాలనేవాణ్ణి. యిక వేరే యేమీ సృష్టించలేని వాళ్ళు పిల్లల్ని సృష్టించాలి. మిగిలిన వాళ్ళు వాళ్ల ఆనందం కోసం, వికాసం కోసం కృషిచెయ్యాలి. నా దృష్టి అదీ. చాలా మంది యీ రెండింటినీ కలగాపులగం చేసేస్తారు. నేను ఆ బాపతువాణ్ణి గాను*" అన్నాడు కతవాసొవ్.

"మీరు ప్రేమించేరని వింటే నాకెంత కసి తీరుతుందో. మీ పెళ్లికి నన్ను పిలవడం మర్చిపోకండేం" అన్నాడు లేవిన్.

"నేనిప్పటికే ప్రేమించాను."

"అవును కటిల్ ఫిష్‌ని! నీకు తెలుసా?" అంటూ లేవిన్ అన్నగారి వేపు తిరిగి అడిగేడు. "కతవాసొవ్ వొక సిద్ధాంత వ్యాసం రాస్తున్నాడు పోషక పదార్థాలమీదా..."

"కలగాపులగం చెయ్యకండి. దేనిమీద అయితే యేమిటి గనక? నేను నిజంగా ప్రేమిస్తూ వున్నది కటిల్ ఫిష్‌ని."

"కాని మీరు భార్యని ప్రేమించడానికి అది అడ్డం రాదు లెండి."

"కటిల్ ఫిష్ అడ్డం రాకపోవచ్చు కాని, భార్య అడ్డం వస్తుంది."

"ఆవిడెందుకు అడ్డం వస్తుంది?"

"కొంచెం ఆగండి, మీరే చూద్దురు గాని. మీకు వ్యవసాయం అన్నా, వేట అన్నా యిష్టం, వూఁ, మీరు చూద్దురు గాని."

"యివాళ ఆర్ఖిప్ వచ్చేడు. ప్రూద్నొయె దగ్గరున్న అడవుల్లో బోలెడు కణుజులు, రెండు యెలుగుబంట్లు వున్నాయని చెప్పేడు" అన్నాడు చీరికొవ్.

"వూఁ, మరి మీరు నేను లేకుండానే వాటి వేట కోసం వెళ్లాలీ సారి."

"అదుగో బయట పడ్డావు! యిక్కడినుంచి యెలుగుబంటి వేటకో సలాం కొట్టెయ్యచ్చు నువ్వు! మీ ఆవిడ వెళ్లనివ్వదు" అన్నాడు కోజ్నిషెవ్.

లేవిన్ చిరునవ్వు నవ్వేడు. తన భార్య వెళ్లనివ్వదు అన్న వూహ యెంత ఆనందం కలిగించిందీ అంటే ఆ వేట సుఖాన్ని శాశ్వతంగా వదులుకోవడానికి అతను సిద్ధంగా వున్నాడు.

"కాని మీరు లేకుండా ఆ రెండు యెలుగుల్నీ వెంబడించి పట్టడం తలుచుకుంటే బాధగా వుంది. ఖపీలొవొకి కిందటిసారి మనం వెళ్లడం గుర్తుందా? యివాళ కూడా యెంత బ్రహ్మాండంగా వుంటుంది!" అన్నాడు చీరికొవ్.

యెక్కడేనా గానీ ఆమె లేకుండా బ్రహ్మాండం యేం వుంటుంది అని అందామనుకున్నాడు లేవిన్. కాని అలా అని అతనికి దిగ్భ్రాంతి కలిగించడం యెందుకులే అని వూరుకున్నాడు.

"బ్రహ్మచారి జీవితానికి సెలవు చెప్పే యీ తంతులో అర్థం వుంది. నీకు ఆనందం కలగచ్చుననుకో, అయినా గానీ స్వేచ్ఛని వదులుకోవడం యేం బాగా లేదు" అన్నాడు కోజ్నిషెవ్.

''యేం, నిజం చెప్పండి, గోగొల్ కామెడీలోని నాయకుడిలాగా కిటికీలోనుంచి దూకి పారిపోవాలని* వుండదూ మీకు?''

''కచ్చితంగా చెప్తాను వుంటుందని, కాని వొప్పుకోడు'' అంటూ కతవాసొవ్ పగలబడి నవ్వేడు.

''వూఁ, సరే మరి, కిటికీ తెరిచే వుంది... పదండి త్వేర్*కి పోదాం. ఒంటరిగా గుహలో దాంకున్న ఆడయెలుగుని వేటాడచ్చు. అయిదు గంటల రైలుకి వెడదాం. వెనక దిగడి పోయిన వాళ్ల ఖర్మ'' అని చీరికొవ్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

''నమ్మండి నమ్మకపొండి!'' అని లేవిన్ కూడా చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. ''నా స్వేచ్ఛ పోతోందే అన్న విచారం పిసరు కూడా నాకు లేదు. నా హృదయ సాక్షిగా చెప్తున్నా'' అన్నాడు.

''వాహ్వా! మీ హృదయం తల కింద లైపోయి వుంది, మీకందులో యిప్పుడేమీ కనిపిం చదు. కొంచెం ఆగి చూడండి. హృదయం యథాస్థానంలో సర్దుకున్నాక మీకు తెలుస్తుంది'' అన్నాడు కతవాసొవ్.

''అబ్బెబ్బె, నాకు కనీసం సూచనగా అయినా నా... నా... అనుభూతి పక్కన'' (అతను వాళ్ల ముందు 'ప్రేమ' అనే పదాన్ని వాడదలచుకోలేదు) ''నా ఆనందం పక్కన, నా స్వేచ్ఛ పోతోందే అన్న అనుమానమేనా కనీసం తగలాలి కదా. అది లేక పోవడం సరే కదా దానికి శుద్ధ వ్యతిరేకంగా నా స్వేచ్ఛ పోగొట్టుకుంటున్నందుకు నాకు సంతోషంగా వుంది.''

''యేం లాభం లేదు, వ్యవహారం ముదిరిపోయింది'' అని కతవాసొవ్ విచారం వ్యక్తం చేశేడు. ''సరే, పట్టండి అతను కోలుకుందుకు తన స్వప్నాలలో వందోవంతైనా కనీసం సాధించేందుకు తాగుదాం, అలా సాధించడమేనా లోకం యింతవరకూ యెరగని ఆనందమే మరి'' అన్నాడు.

భోజనాల తర్వాత పెళ్లి ముస్తాబు కోసం వాళ్లందరూ వెళ్లిపోయేరు.

లేవిన్ వొంటరిగా వుండిపోయేడు. యీ బ్రహ్మచారుల సంభాషణని నెమరు వేసుకుని మరోసారి తనలో తను అనుకున్నాడు: వాళ్లు అంటూ వున్న స్వేచ్ఛని పోగొట్టుకుంటున్నానే అన్న విచారం పిసరేనా తన మనసులో వుందా? ఆ ప్రశ్నకి అతని పెదాలమీద చిరునవ్వు లాస్యం చేసింది. 'స్వేచ్ఛ? యెందుకు స్వేచ్ఛ? ప్రేమించడంలోనే ఆనందం వుంది, ఆమె ఆలోచనలు తనవిగా, ఆమె కోరికలు తనవిగా — అంటే స్వేచ్ఛ అనేది లేకపోవడం, అదే ఆనందం!'

'కాని ఆమె ఆలోచనలు యేమిటో, ఆమె కోరికలు యేమిటో, అనుభూతులు యేమిటో నీకు తెలుసా?' అని అంతర్వాణి యేదో అతని చెవిలో అంది. అతని చిరునవ్వు మాయమై పోయింది. అతను ఆలోచనలో మునిగిపోయేడు. హఠాత్తుగా యేదో వింత అనుభూతి అతన్ని ఆవహించింది. సంశయాల, భయాల గుప్పిట్లో వున్నట్టనిపించింది — అన్నిటి పట్లా సంశయాలు.

'ఆమె నన్ను ప్రేమించకపోతూ వుంటే? పెళ్లవాలి కాబట్టే నన్ను పెళ్లి చేసుకుంటూ వుంటే? తను యేం చేస్తూ వుందో ఆమెకిగా ఆమెకే తెలియక పోతే?' అనుకున్నాడు. 'ఆమెకి యీ తొలి ప్రేమ మైకం తగ్గచ్చు. పెళ్ల యింతర్వాత నన్ను ప్రేమించడం లేదనీ, యెన్నటికీ ప్రేమించలేదనీ గ్రహించుకోవచ్చు.' చిత్రాతి చిత్రమైన, పరమ దుష్టమైన ఆలోచనలు అతన్ని పీడించాయి. వ్రాన్‌స్కీతో ఆమె వున్న సందర్భాన్ని గురించి గుర్తుచేసుకున్నాడు. అతనికి అసూయ కలిగింది, ముందుటేడంతా వున్న అసూయ. వ్రాన్‌స్కీతో ఆమె వుండగా చూసిన ఆ సాయంత్రం నిన్న సాయంత్రం అయినట్టుగానే అతనికి అనిపించింది. తనతో అన్నీ దాపరికం లేకుండా ఆమె చెప్పలేదేమోనన్న అనుమానం అతనికి కలిగింది.

అతను వెంటనే లేచాడు. 'యిలా జరగడానికి వీల్లేదు' అనుకున్నాడు నిరాశతో. 'ఆమె దగ్గరికి వెడతాను. ఆఖరు సారి ఆమె ముఖంమీదనే అడిగేస్తాను – మనిద్దరం స్వేచ్ఛగా వున్నాం, యిలానే యెప్పటికీ వుంటే మెరుక్కదూ అని. నిత్యం వేధించే బాధ, అవమానం, వంచన వుండడం కంటే మరేదన్నా మెరుగే!' అనుకున్నాడు. అతని మనసంతా విచారంతో నిండిపోయింది. తనని, ఆమెని, ప్రతి వొఖళ్లనీ అసహ్యించుకుంటూ అతను హోటెల్ నుంచి బయల్దేరి వాళ్ల యింటికి వెళ్లేడు.

ఆమె వొక్కత్తీ లోపల గదిలో వుంది. పనిపిల్లకి యేవేవో పురమాయింపులు చేస్తూ ట్రంకు పెట్టెమీద కూర్చుంది. కుర్చీలమీదా, నేలమీదా పడి వున్న రంగురంగుల ఫ్రాక్‌లని కెలుకుతూ వుంది.

"హోయ్!" అని సంతోషంతో వెలిగిపోతూ అతన్ని చూసి అరిచింది. "యెలా నువ్వు... మీరు" (అనాటి దాకా ఆమె అతన్ని కొంత సేపు 'మీరు' అని, కొంత సేపు 'నువ్వు' అని పిలుస్తూ వుంది) "నేనసలు అనుకోనేలేదు! నా గౌన్లూ అవీ యేం కావాలో తీసుకొమ్మని మా అమ్మాయితో చెప్తున్నా..."

"బాగుంది" అని అతను పనిపిల్లకేసి ముటముటలాడుతూ చూశేడు.

"నువ్వెళ్లు, దున్యాషా, మళ్లీ పిలుస్తా" అంది కిట్టీ. "నువ్వా! యేమిటి విశేషం?" అని పనిపిల్ల వెళ్లి పోగానే అడిగింది. అతన్ని 'నువ్వు' అనే పిలిచింది. అతని ముఖం వింతగా వుండడం, కళతగ్గి వుండడం, బాధతో వుండడం గమనించింది. ఆమెకి బెదురు పుట్టింది.

"కిట్టీ! నేను చిత్రహింస పడుతున్నాను. నేనొఖ్ఖణ్ణీ యిలా వేదన పడలేను" అని అతను ఆమె యెదురుగా నుంచుని, అర్థిస్తూన్నట్టుగా ఆమె కళ్లోకి చూస్తూ విచారంగా అన్నాడు. ఆమె కళ్లల్లో ప్రేమ, నిష్కపటత్వం మాత్రమే అతనికి కనిపించేయి. దాంతో తను ఆమెతో చెప్పదలచుకున్నదేదీ నోట్లోనుంచి బయటికి రాదని అతనికి తెలిసింది. అయినా గానీ ఆమె ధైర్యం చెప్పే మాటలు అతని చెవిన పడాలి. "యిప్పటికీ మించిపోలేదని నీతో చెపుదామని వచ్చేను. దీన్ని ఆపు చేసి యింకా సరిదిద్దుకోవచ్చు" అన్నాడు.

"యేమిటి? నాకర్థం అవడం లేదు. యేం జరిగింది నీకు?"

"నీతో యిప్పటికే లక్ష సార్లు చెప్పిందీ, నా మనసులో అనుకోకుండా వుండలేక పోతున్నదీ — నేను నీకు తగను అని. నన్ను పెళ్లి చేసుకోవడం నీకు యిష్టం లేకపోవచ్చు. బాగా ఆలోచించుకో. నువ్వు పొరపాటు పడి వుండచ్చు. బాగా ఆలోచించుకో. నువ్వు నన్ను ప్రేమించడం అసాధ్యం కావచ్చు. అదయితే... యిప్పుడే చెప్పడం మెరుగు" అని ఆమె కేసి చూడకుండా అన్నాడు. "నాకు మహా బాధగా వుంటుంది. లోకులు యేమన్నా అనుకోనీ. యీ బాధకంటే యేదన్నా మెరుగే. యింకా వ్యవధి మించిపోలేదు, యిదే సమయం" అన్నాడు.

"నాకేం అర్థం అవడం లేదు" అందామె భయంతో. "అంటే నువ్వు తెంచుకుందా మని... అఖ్ఖర్లేదని అనుకుంటున్నావా?" అని అడిగింది.

"ఆఁ, నువ్వు గనక నన్ను ప్రేమించకపోతే."

"నీకు పిచ్చెక్కింది" అని ఆమె కోపంతో యెర్రబడుతూ అరిచింది. కాని అతన్ని చూస్తే యెంతో దయనీయంగా వున్నాడు. దాంతో ఆమె కోపం అణచుకుంది. వో కుర్చీ మీదనుంచి ఫ్రాక్ తీసేసి అతని పక్కనే కూర్చుంది. "నువ్వే మనుకుంటున్నావో యేమిటో అంతా వివరంగా చెప్పు" అంది.

"నువ్వు బహుశా నన్ను ప్రేమించవేమోనని. నన్ను యేం చూసి ప్రేమిస్తావ్?"

"అయ్యో! ఖర్మ! యేం చెయ్యను..." అని ఆమె గుడ్లలో నీరు కుక్కుకుంది.

"అయ్యొయ్యో! యెంత పని చేశాను!" అని అతను అరిచి ఆమె ముందు మోకాళ్లమీద వాలి ఆమె చేతుల్ని ముద్దుపెట్టుకోవడం మొదలుపెట్టాడు.

అయిదు నిముషాల తర్వాత ప్రిన్సెస్ గదిలోకి వచ్చేటప్పటికి యిద్దరూ సమాధాన పడ్డారు. తను అతన్ని ప్రేమిస్తున్నానని కిట్టీ చెప్పింది. అంతే కాకుండా యెందుకు అతన్ని ప్రేమిస్తూ వుందో కూడా చెప్పింది. తను అతని అంతరంగంలోకి చూడగలుగుతోంది కాబట్టి అతను దేన్ని ప్రేమిస్తాడో ఆమెకి తెలుసు, అతను ప్రేమించేవన్నీ మంచివే కాబట్టీ అతన్ని ప్రేమించింది అని చెప్పింది. దాంతో అతనికి అంతా స్పష్టపడింది. అంచేత ప్రిన్సెస్ గది లోకి వచ్చేటప్పటికి వాళ్లు పెట్టెమీద కూర్చుని ఫ్రాక్‌లని యేరుతున్నారు, వాదించు కుంటున్నారు. యేమంటే లేవిన్ వివాహ ప్రస్తావన చేసిన రోజున కిట్టీ వేసుకున్న ఫ్రాక్‌ని ఆమె దున్యాషాకి యిస్తానంది, దాన్ని యెవ్వరికీ యివ్వకూడదనీ, దున్యాషాకి నీలంది యివ్వచ్చనీ అతను పట్టుబడుతున్నాడు.

"ఆమె చామన చాయ మనిషి, నల్ల జుట్టుంది ఆమెకి. యిది ఆమెకి నప్పదు అర్థమైందా? నేనంతా ఆలోచించేను."

అతను యెందుకు అక్కడికి వచ్చిందీ తెలుసుకుని ప్రిన్సెస్ అతన్ని నిజంగా కొంత మేరకి, పరిహాసంగా కొంతమేరకి కేకలేసి గబగబా వెళ్లి పెళ్లి కొడుకు ముస్తాబై రమ్మని,

కిట్టీ కేశాలంకరణకి ఆలస్యం కలిగించవద్దనీ, యేమంటే అలంకరణ చేసే షార్ల్ యే క్షణంలోనేనా రావచ్చనీ చెప్పింది.

"వెర్రి పిల్ల యిన్ని రోజులూ యేమీ కతికిందే కాదు, చూడు యెలా వాడిపోయిందో. నువ్వేమో చెత్తంతా పోగుచేసి దాని మనసు పాడు చేస్తున్నావు. వూఁ, వెళ్ళు, వెళ్ళు తయారవు నాయనా" అంది.

లేవిన్ నేరం చేసిన వాడిలాగా హోటెల్‌కి తిరిగి వెళ్ళాడు, కాని గుండె బరువు దిగిన వాడిలా వెళ్ళాడు. కోజ్నిషెవ్, దాలీ, అబ్లాన్‌స్కీ పెళ్ళివారి ముస్తాబు చేసుకుని అతన్ని దేవుడి బొమ్మతో ఆశీర్వదించడం కోసం వచ్చి అతని కోసం యెదురు చూస్తున్నారు. వ్యవధి ఆట్టే లేదు. పైగా దాలీ యింటికి వెళ్ళి ఉంగరాలు జుట్టుకి నూనె రాసి దువ్వి చిన్నవాణ్ణి తీసుకురావాల్సి వుంది. ఆ కుర్రాడు బొమ్మనీ, పెళ్ళికూతుర్ని చర్చి దగ్గరకి తీసుకువెళ్ళాలి. తర్వాత పెళ్ళి పెద్ద కోసం బగ్గీ పంపించాలి, కోజ్నిషెవ్‌ని తీసుకువెళ్ళిన బగ్గీ తిరిగి వచ్చిందో లేదో చూసుకోవాలి... మొత్తంమీద చూసుకోవాల్సిన పనులు బోలెడున్నాయి. అసలు వొక్క క్షణం కూడా వృధా చేసేందుకు లేదు, యేమంటే అప్పటికే ఆరున్నర అయింది.

దేవుడి బొమ్మ ఆశీర్వాదం తంతువల్ల వొరిగింది యేమీ లేదు. అబ్లాన్‌స్కీ పెళ్ళాం పక్కన నవ్వు తెప్పించే గంభీర వాలకం పెట్టి నుంచున్నాడు. బొమ్మ అందుకున్నాడు. లేవిన్‌ని నేల కంటా వొంగి వందనం చెయ్యమన్నాడు. మంచి మనసుతోనే వ్యంగ్య పూరిత మందహాసం చేస్తూ ఆశీర్వదించి మూడు సార్లు ముద్దుపెట్టుకున్నాడు. దాలీ కూడా అలానే చేసింది. తర్వాత వెంటనే హడావుడిగా వెళ్ళిపోయేదే గాని ఆమె బుర్రంతా బగ్గీలని యెక్కడికి యెవరి కోసం పంపాలో అన్న ఆలోచనలతో గందరగోళంగా వుంది.

"మనం యిలా చేద్దాం: నువ్వు మన బండిలో కుర్రాణ్ణి తీసుకు రా, కోజ్నిషెవ్‌గారు కూడా నీతో వస్తారు, మళ్ళీ బండిని వెనక్కి పంపిస్తారు."

"అలాగే, సంతోషం."

"యిప్పుడు అతనితో బయల్దేరదాం, పంపించాల్సిన అన్నిట్నీ పంపించేశావా?" అని అబ్లాన్‌స్కీ అడిగేడు.

"పంపేశాను" అని లేవిన్ జవాబు చెప్పేడు. తను తీసి వుంచమని కుజ్మాకి చెప్పిన బట్టల్ని తీసుకు రమ్మన్నాడు.

## 3

వివాహం కోసం దేదీప్యంగా దీపాలు పెట్టిన చర్చి చుట్టూతా వో గుంపు పోగయింది. ముఖ్యంగా ఆడవాళ్ళు యెక్కువ వున్నారు. లోపలికి వెళ్ళ లేని దురదృష్టవంతులు తోసుకుంటూ, కుమ్ముకుంటూ, కమ్మీల్లోంచి లోపలికి తొంగి చూస్తూ కిటికీల దగ్గర చేరారు.

జెండార్మీవాళ్ళు యిరవై పైగా బగ్గీలని బారుగా నిలబెట్టేరు. చలి గిలీ లెక్క చెయ్య

కుండా వో పోలీసు ఆఫీసరు ధగధగ మెరిసిపోయే యూనిఫాం వేసుకుని గుమ్మం దగ్గర నుంచున్నాడు. బగ్గీలు యింకా వస్తూనే వున్నాయి. పువ్వులు పెట్టుకుని, జీరాడే కుచ్చెళ్లని యెత్తి పట్టుకుంటూ వున్న ఆడవాళ్లు, చర్చిలోకి అడుగు పెట్టేటప్పుడు బొచ్చు శాటుల్నీ, యెత్తు టోపీల్నీ చేత్తో పట్టుకుంటూ వున్న మగవాళ్లు చర్చి లోపలకి వెళుతూ వున్నారు. చర్చిలో వున్న రెండు చాండెలీర్స్‌నీ, బొమ్మల ముందు వున్న అన్ని కొవ్వొత్తుల్నీ అప్పటికే వెలిగించేరు. విగ్రహా వితర్ది అరుణ నేపథ్యంలోని బంగారు రేఖ విగ్రహాల బంగారు పూత చట్టాలు, దీపం సెమ్మెల వెండి, నేలమీద వున్న రాతి చౌకట్లు, తివాసీలు, గాయకబృందం వేదికమీదనుంచి వేలాడే పవిత్ర కేతనాలు, వితర్ది మెట్లు, నలుపు తిరిగిన ప్రాచీన ప్రార్థనా గ్రంథాలు, పొడుగాటి అంగీలు, వైభవంగా వున్న జరీ ఉత్తరీయాలు — అన్నీ ధగద్ధగాయమానంగా వెలిగిపోతూ వున్నాయి. చర్చి కుడి భాగంలో ఫ్రాక్ కోట్లు, తెల్ల టైలు, యూనిఫాంలు, సిల్కులు, శాటిన్లు, వెల్వెట్‌లు, కేశాలు, పుష్పాలు, అనాచ్ఛాదిత భుజాలు, చేతులు, నిడుపాటి గ్లవ్స్ వున్న గుంపులోనుంచి కొంచెం మంద్రస్వరంతో అయినా ఉల్లాసవంతంగా వున్న గొంతు ధ్వనులు యెత్తుగా వున్న చర్చి కప్పుకింద చిత్రంగా జుమ్మంటూ ప్రతిధ్వనిస్తున్నాయి. కిర్రుమని తలుపు తెరుచుకున్నప్పుడల్లా గొంతుకల స్వరం ఆగేది. పెళ్లికొడుకూ, పెళ్లికూతురూ వస్తున్నారేమోనని అందరూ అటే చూసేవాళ్లు. కాని ఆ తలుపు అలా బోలెడు సార్లు తెరుచుకుంది, ప్రతిసారీ ఆలస్యంగా వచ్చిన వాళ్లెవరో రావడం, కుడి వేపున ఆహూతులైన బృందంతో చేరడం జరిగేది. లేదా పోలీసు ఆఫీసరు కన్ను గప్పి లోపలికి దూరిన యెవళ్లో అయి వుండేవాళ్లు. వీళ్లు యెడమ వేపున వున్న బయటి వాళ్ల బృందంలో చేరేవాళ్లు. అప్పటికి ఆహూతులూ, తమంతట తామే వచ్చిన వాళ్లూ వొక్కలాగే నిరీక్షణా దశలన్నిట్నీ దాటేరు.

పెళ్లికొడుకూ, పెళ్లికూతురూ యే క్షణంలోనేనా వస్తారని అనుకున్నారు మొదట్లో, ఆలస్యాన్ని గురించి యేం పట్టించుకోలేదు. తర్వాత కొంచెం సేపట్లోనే గుమ్మం కేసి యెక్కువ సార్లు చూస్తూ యేమీ పొరపాటు జరగలేదు కదా అని వొకళ్ల వొకళ్లు అడగడం మొదలెట్టేరు. ఆఖరికి యీ ఆలస్యం వాళ్లకి యిబ్బందిగా వుంది. బంధువులు, మిత్రులు తాలిమి కనిపింప చేస్తున్నట్టు మాటల్లోకి దిగేరు.

ఆర్చ్ డీకన్ తన విలువైన కాలం వృధా చేస్తున్నారని గుర్తు చేస్తున్నట్టుగా ఓపికలేక గొంతు సవరించుకుంటూ దగ్గేడు. దాంతో కిటికీ రెక్కలు అదిరేయి. గాయక బృంద వేదిక మీద వున్న గాయకులకి వోపిక పోయి కాసేపు గొంతులు సవరించుకుంటూ, కాసేపు ముక్కులు చీదుకుంటూ వున్నారు. పెళ్లికొడుకు వచ్చేడో లేదో చూడ్డానికి పురోహితుడు వో కుర్రాణ్నో వో డీకన్‌నో పంపుతూనే వున్నాడు. బుటే దారీ నడికట్టు వున్న యెర్ర అంగీతో తనే పెళ్లికొడుకు రాక కోసం చూస్తూ ఒకటికి రెండు సార్లు పక్క గుమ్మం దగ్గరికి వెళ్లేవాడు. ఆఖరికి వొక మహిళ గడియారం కేసి చూసుకుని ''చాలా చిత్రంగా వుందే'' అంది. దాంతో

ఆహూతులందరూ యిబ్బందిగా తమ అశ్చర్యాన్ని, అసంతృప్తిని పైకి వెల్లడించేరు. పెళ్లి పెద్దల్లో వొకరు అసలు గొడవ యేమిటో చూద్దాం అని హుటాహుటీన వెళ్లేడు. కిట్టీ తెల్లని గౌనూ, నారింజ పువ్వు*ల గుచ్ఛంతో అలంకరించిన పొడుగు మేలి ముసుగు వేసుకుని ష్చేర్‌బాత్‌స్కీల డ్రాయింగ్ రూమ్‌లో, పెళ్లికూతురి తోడుగా వుండాల్సిన తన అక్క మేడం ల్వోవాతో యెప్పుడనగానో ముస్తాబై నుంచుంది. పెళ్లికొడుకు చర్చిలో వున్నాడని వార్త పట్టుకొస్తూ పెళ్లి పెద్ద యిదిగో వస్తాడు, అదిగో వస్తాడు అని అరగంటకి పైగా వృధాగా యెదురుచూస్తూ వున్నారు.

అక్కడ లేవిన్ లాగు వేసుకుని వెయిస్ట్ కోటుగాని, పై కోటుగాని లేకుండా హోటెల్ గదిలో అటూ యిటూ పచారు చేస్తున్నాడు. క్షణక్షణానికీ తలుపు తీసి వసారాలోకి చూస్తూ వున్నాడు. కాని అతను యెదురు చూస్తూ వున్న మనిషి వసారాలో అగుపడడం లేదు. నిరాశగా చెయ్యి వూపుతూ అయ్యో అంటున్నట్టు అతను తొణుకూ బెణుకూ లేకుండా సిగరెట్ కాలుస్తూ కూర్చున్న అబ్లాన్‌స్కీ దగ్గరికి వెళ్లేవాడు.

"యింత ఘోరమైన నవ్వుతాలు పరిస్థితిలో యెవడన్నా యెప్పుడన్నా పడ్డాడా?" అన్నాడు.

"అవును. కొంచెం తెలివితక్కువగానే వుంది. కాని స్థిమితంగా వుండు, వో క్షణంలో వచ్చేస్తుంది" అని అబ్లాన్‌స్కీ అవునంటూ వోదార్పుగా చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"వూ, చూడు!" అన్నాడు కోపం అణుచుకుంటూ. "వెధవ పనికి మాలిన ఓపెన్ వెయిస్ట్ కోటు!" అని ముడతలు పడిన చొక్కాకేసి చూసుకుంటూ అన్నాడు. "కొంప. దీని నా సామానంతా స్టేషన్‌కి పంపేశారేమో" అని కొంప ములిగినట్టు మూలిగేడు.

"అయితే నావి వేసుకుందువుగాన్లే."

"ఆ పని యెప్పుడో చెయ్యాల్సింది."

"నవ్వుతాలుగా కనిపించకు... కొంచెం వోపిక పట్టు, అన్నీ సర్దుకుంటాయి."

అసలు గొడవ యేమిటంటే లేవిన్ కుజ్మాతో తన బట్టల్ని తీసి పెట్టమన్నప్పుడు ఆ ముసలి నౌకరు అతని కోటుని, వెయిస్ట్ కోటుని, అవసరమైన వాటినన్నిటినీ తీసుకు వచ్చేడు.

"చొక్కా యేదీ?" అని లేవిన్ అరిచేడు.

"తొడుక్కునే వున్నారు కదా!" అని ఆ ముసలతను నిదానంగా జవాబు చెప్పేడు.

వస్తువులన్నిటినీ సర్ది కట్టేసి ష్చేర్‌బాత్‌స్కీల యింటికి తీసుకు పొమ్మని చెప్పినప్పుడు — అక్కడినుంచే నవదంపతులు ఆ రాత్రికే బయల్దేరి వెళ్లిపోవాలి — ఆ ముసలతను వో శుభ్రమైన చొక్కాని తీసి వుంచాలన్న విషయం మర్చిపోయేడు. అతను తీసిపెట్టిందల్లా లేవిన్ సూట్‌ని మాత్రమే. లేవిన్ పొద్దుటినుంచీ వేసుకుని వున్న చొక్కా ముడతలు పడిపోయి వుంది. ఓపెన్ వెయిస్ట్ కోటు వున్నప్పుడు దాన్ని వేసుకోవడం బాగుండదు. యింకో చొక్కాని తేవడానికి వెళ్లాలంటే ష్చేర్‌బాత్‌స్కీల యిల్లు చాలా దూరమాయిరి. అందుకని కొత్త చొక్కా కొని తెమ్మని పంపించేరు. ఆ వెళ్లిన వాడు తిరిగి చక్కా వచ్చేడు — ఆదివారం కాబట్టి అన్నీ

దుకాణాలూ మూసి వున్నాయి. అప్పుడు అబ్లాన్‌స్కీ చొక్కా వొకటి తెమ్మని పంపించేరు. అది మరీ వొదులుగా వుంది, పొట్టి అయింది. యిక చేసేది లేక మూట విప్పి తెమ్మని చెప్పి షేచ్‌ర్‌బాత్‌స్కీల యింటికే పంపేరు. చర్చిలోనేమో ప్రతివాళ్ళూ పెళ్లికొడుకు కోసం యెదురు చూస్తున్నారు. తనేమో యిక్కడ బోనులో వున్న జంతువులాగా అటూ యిటూ గదిలో పచారు చేస్తున్నాడు. వసారాలోకి చూస్తూ ఆ పూటే కిట్టీతో జరిగిన సంభాషణ తర్వాత కిట్టీ యేమనుకుంటోందో అని దిగులుగా భయంతో వొణికిపోతూ బాధపడుతూ వున్నాడు.

ఆఖరికి తప్పు నెత్తిమీద వున్న కుజ్మా వొగురుస్తూ చొక్కా చేత్తో పట్టుకుని గదిలోకి దూకుతూ వచ్చేడు.

"వొక్క పిసరులో దాటిపోయి వుండేది... సామాను బళ్లకెత్తేస్తూ వున్నారు..." అని ఆయాసంతో వొగిర్చేడు.

మూడు నిముషాలు తర్వాత లేవిన్ గడియారం కేసి చూడ్డానికి భయమై పుండుమీద ఉప్పు పడిన వాడిలా హోటెల్ వసారాలోనుంచి హడావుడిగా పరిగెట్టేడు.

అతని వెనకాల తాపీగా వెదుతూ "కంగారు పడి లాభం లేదు, అన్నీ సర్దుకుంటాయి, అన్నీ సర్దుకుంటాయి నే చెప్తున్నాగా నీకు" అన్నాడు అబ్లాన్‌స్కీ.

## 4

"వచ్చేశారు!..." – "అదుగో..." – "ఎవరు?" – "ఆ పదుచతను?" – "అయ్యో పాపం! ఆమె! కళ్లల్లో వున్నాయి ప్రాణాలు!" అనే వ్యాఖ్యలు లేవిన్ పెళ్లికూతుర్ని గుమ్మంలో కలుసుకుని చర్చి లోపలికి వెళ్లేటప్పుడు వినవచ్చేయి.

యెందుకు ఆలస్యం అయిందీ అబ్లాన్‌స్కీ తన శ్రీమతితో చెప్పేడు. వచ్చిన అతిథులు ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ వాళ్లల్లో వాళ్ళు గుసగుసలాడుకున్నారు. లేవిన్ యెవళ్లనీ చూళ్లేదు, దేన్నీ చూళ్లేదు. అతని కళ్లు పెళ్లికూతురి మీదే లగ్నం అయివున్నాయి.

ఆమె యిటీవల సొగసు తగ్గిపోయిందనీ, మామూలుగా వుండే కళ లేదని ప్రతివాళ్ళూ అన్నారు. కాని లేవిన్‌కి అలా అనిపించలేదు. ఆమె జుట్టు యెత్తుగా కొప్పు కట్టుకుంది. దానిమీదనుంచి రవసెల్లా ముసుగు కిందికి జారుతోంది. లేవిన్ ఆ జుట్టుకేసీ ముసుగుకేసీ, తెల్లని పువ్వులకేసీ చిన్నచిన్న జడలుగా కట్టిన నిడుపు మెడపట్టీకేసీ చూశేడు. ఆ జడలు కన్యాన్వితంగా యెంతో స్వచ్ఛంగా వున్న ఆమె పొడుగాటి మెడమీద అటూ యిటూ పడుతు న్నాయి. యెదర మెడ వెల్లడిగా వుంది. ఆమె నడుము పిడికిట పట్టేట్టుగా వుంది. యిదంతా లేవిన్ చూశాడు. ఆమె అతనికి యెప్పటికంటే ముచ్చటగా వున్నట్టు కనిపించింది. ఆ పువ్వులు, ముసుగు, పారిస్‌నుంచి తెప్పించిన గౌను ఆమె శోభని పెంచడం వల్లనని కాదు,

ఆమె భారీగా షోకు చేసుకున్నప్పటికీ కూడా ఆమెకి విలక్షణమైనట్టు వుండే ఆ వదనంలో గోచరమయే మాధుర్యం, ఆమె పెదవులు, ఆమె ముఖానికి ప్రత్యేకం శోభాయమానంగా వుండే అమాయక సహజ భంగిమతో వున్నాయి.

''నువ్వు పారిపోయావేమో అనుకుంటున్నా నింక'' అంది ఆమె చిరునవ్వు నవ్వుతూ.

''అసలేం తెలివితక్కువ పని జరిగిందో చెప్పాలంటే సిగ్గుగా వుంది'' అని అతను సిగ్గుపడి, అప్పుడే దగ్గరికి వచ్చిన కోజ్నిషెవ్ కేసి చూడ్డం అవసరం అయి అటు తిరిగేడు.

''భలే గొడవలే! చొక్కా గొడవ!'' అని కోజ్నిషెవ్ తల ఆడించి చిన్నగా నవ్వేడు.

''అవునవును'' అన్నాడు లేవిన్, యేం చెప్పిందీ వినకుండానే.

''వూఁ, లేవిన్, పెద్ద సమస్యని పరిష్కరించాలిప్పుడు'' అన్నాడు అబ్లాన్‌స్కీ పరిహాసంగా వుండే గంభీర దృక్కుతో. ''సరిగ్గా యిప్పుడే దీని ప్రాముఖ్యం నిర్ణయించగలిగే స్థితిలో వున్నావు నువ్వు. కొవ్వొత్తులు కొత్తవి వుండాలా లేక వాడిన వాటిని వుంచాలా అని నన్ను అడిగేరు. పది రూబుళ్లే తేడా'' అని పెదాల్ని చిరునవ్వు నవ్వేటట్టు పెట్టేడు. ''యేం చెప్పాలో నేను ముందే అనుకున్నాననుకో, నువ్వేమంటావో అని!'' అన్నాడు.

అది వేళాకోళం అని లేవిన్‌కి అర్థమైంది కాని నవ్వలేకపోయేడు.

''వూఁ, చెప్పు, కొత్తవా, వాడినవా?''

''కొత్తవే వుండాలికదా.''

''బాగుంది. యీ గొడవ తేలింది'' అని అబ్లాన్‌స్కీ యికిలించేడు. ''పెళ్లి సమయంలో మనిషి యెంత మనస్థిమితం తప్పిన వాడవుతాడు!'' అని, లేవిన్ వో క్షణం సేపు శూన్యంగా తన కేసి చూసి వధువు కేసి తిరిగినప్పుడు, అబ్లాన్‌స్కీ సూచన చేస్తూ చీరికొవ్‌తో అన్నాడు.

''యిదిగో, కిట్టీ, నువ్వే మొదట తివాసీమీద కాలు పెట్టాలి సుమా'' అని అప్పుడు వచ్చిన కౌంటెస్ నార్డ్‌స్టన్ గుర్తు చేస్తూన్నట్టు అంది. ''మీరు భలే వాళ్లు'' అంది లేవిన్‌ని చూసి.

''బెరుగ్గా లేదూ?'' అని ముసలి అత్త మరీయా ద్మీత్రియెవ్నా అడిగింది.

''చలిగా వుందా అమ్మా, చాలా పాలిపోయినట్టున్నావు. వుండు, కిందికి వంగు'' అని కిట్టీ అక్క మేడం ల్వోవా చిరునవ్వు నవ్వుతూ, కిట్టీ తలమీద వున్న పువ్వుల్ని లావాటి అందమైన చేతుల్ని వృత్తంగా పెట్టి సర్దుతూ అంది.

దాలీ యేదో చెప్దామని వచ్చింది. కాని యేమీ అనలేకపోయింది. యేడుస్తూ తెచ్చి పెట్టుకున్న నవ్వు నవ్వింది.

కిట్టీ కూడా లేవిన్‌లాగానే ప్రతివాళ్లకేసీ అదే పరధ్యానంతో చూసింది. తనతో యెవళ్లేనా మాట్లాడినప్పుడు సమాధానంగా తనకి యిప్పుడు యెంతో నిష్కల్మషంగా వుండే కమ్మని చిరునవ్వునే బదులు యిచ్చింది.

ఆ వేళకి చర్చి అధికారులు అధికార చిహ్నం అయిన ఉడుపులు వేసుకున్నారు. పురోహి

తుడూ, డీకన్ చర్చిలో వెనక్కంటూ వున్న వాలుబల్ల దగ్గరికి వెళ్లేరు. పురోహితుడు లేవిన్ కేసి తిరిగి యేదో చెప్పేడు. కాని లేవిన్ వినిపించుకోలేదు.

"వధువు చెయ్యి పట్టుకుని నడిపించుకు రండి" అని పెళ్లి పెద్ద అన్నాడు.

తను యేం చెయ్యాల్సి వుందో లేవిన్‌కి కొంత సేపటి దాకా తట్టలేదు. వాళ్లు అతనికి అందిస్తూనే వున్నారు, కాని అతను తన యెడం చెయ్యినేనా చాచేవాడు, ఆమె యెడం చేతి నేనా పట్టుకునేవాడు. దాంతో విసుగొచ్చి వాళ్లు చెప్పడం వదిలేశారు. ఆఖరికి అతనికి అర్థం అయింది, తనున్న చోటు మారకుండా తన కుడి చేత్తో ఆమె కుడి చేతిని పట్టుకో వాలి అని. మొత్తంమీద అతను అలా చేశాక పురోహితుడు కొన్ని అడుగులు ముందుకు నడిచి వచ్చి వాలుబల్ల దగ్గర ఆగేడు. చుట్టాలు స్నేహితులు గుంయ్ గుంయ్‌మని మాట్లాడు కుంటూ, కొంగులు జీరాడించుకుంటూ వాళ్ల వెనక వెళ్లేరు. యెవళ్లో వంగి పెళ్లికూతురి కుచ్చెళ్లు సర్దేరు. వెంటనే చర్చిలో కొవ్వొత్తి కరిగి మైనం టపటపమంటూ పడడం వినిపించే టంత నిశ్శబ్దం ఆవహించింది.

పెద్ద పురోహితుడు విడుపాటి శిరోవేష్టం పెట్టుకున్నాడు. అతను రజితకేశాల్ని చెవుల వెనక్కి తోసుకున్నాడు. అతను వెండి జరీ భారీగా అలంకరించిన అంగీ తొడుక్కున్నాడు. దాని వెనక బంగారు బుటే దారీ అల్లికం శిలువ వుంది. అతను అంగీలోనుంచి చేతుల్ని బయ టికి పెట్టి వాలుబల్లమీద దేన్నో తడమడం మొదలుపెట్టాడు.

అబ్లాన్‌స్కీ మెల్లిగా ఆయన దగ్గరికి వెళ్లి చేవిలో యేదో చెప్పి, లేవిన్‌కేసి చూసి కన్ను గీటుతూ తన చోట్లోకి వెళ్లేడు.

పురోహితుడు పువ్వులతో అలంకృతమైన రెండు కొవ్వొత్తులు వెలిగించి మైనం మెల్లిగా కారేటట్టు యెడం చేత్తో వొంచి వధూవరులకేసి తిరిగేడు. లేవిన్ పాపనివేదన విన్న పురోహి తుడే యితను. వధూవరులకేసి విచారభరిత అలిసిన నేత్రాలు లగ్నంచేసి చూస్తూ గాఢంగా విట్టూర్చి అంగీ కిందనుంచి కుడి చెయ్యి యెత్తి పెళ్లికొడుకుని ఆశీర్వదించేడు. అదే రకం గానే, కానీ లీలా మాత్ర జాగరూక మృదుత్వంతో కిట్టీ అవనత శిరసుమీద వేళ్లని వుంచేడు. తర్వాత యిద్దరికీ ఆ కొవ్వొత్తులు అందించి, తను ధూప పాత్రని తీసుకుని మెల్లిగా వెనక్కి వెళ్లేడు.

'యిది నిజమేనా?' అని లేవిన్ తనలో తను అనుకున్నాడు. తిరిగి పెళ్లికూతురికేసి చూశాడు. ఆమె పార్శ్వభాగం పైనుంచి కనిపించింది. ఆమె వొణికే పెదవులని బట్టీ, పక్ష్మా లని బట్టీ తన చూపు ఆమెమీద వున్నట్టు గ్రహించిందని వూహించేడు. ఆమె కళ్లు పైకి యెత్తలేదు, కాని యెత్తుగా వున్న జరీ మెడపట్టీ కదిలి ఆమె గులాబీరంగు చెవిని తాకింది. ఆమె నిట్టూరుస్తున్నట్టు అతను చూశేడు. పొడుగాటి గ్లవ్ తొడుక్కుని కొవ్వొత్తిని పట్టు కున్న ఆమె చెయ్యి వొణికింది.

చొక్కా గొడవ, తన ఆలస్యం, చుట్ట పక్కాలతో మాటలు, వాళ్ల కోపం, తన అవహాస్య

పరిస్థితి అంతట్నీ చూస్తూ వుంటే యిదంతా యెన్నడూ జరగనట్టే వుంది. అతనికి భయం, సంతోషం కలిగేయి.

పొడగరీ, స్ఫుర్ద్రూపీ అయిన ఆర్చ్ డీకన్ వొకరు వెండి ఉత్తరీయం వేసుకుని, కేశాల్ని ఉంగరాలు తిప్పుకుని — అవి టోపీనుంచి అటూ యిటూ యివతలికి వచ్చేయి — ముందుకు చకచకా నడిచి వచ్చేడు. అతను ఉడుపు పొడుగాటి రిబ్బన్‌ని అలవాటుగా రెండు వేళ్లతో పట్టుకుని పురోహితుడి ముందు వచ్చి ఆగేడు.

"భవదనుగ్రహం చూపించు ప్రభూ!" అని కంపించే అలల్లాగా వొక స్వరం తర్వాత వొక స్వరం మెల్లిగా ప్రతిధ్వనితో వచ్చింది.

"ప్రభువు యిప్పుడు, యెప్పుడూ, సర్వదా స్తుతింపబడుగాక" అని పురోహితుడు నాలుబల్లమీద దేన్నో సవరిస్తూ తడుముతూ మెల్లిగా సాగదీసుకునే గొంతుకతో జవాబుగా అన్నాడు. అప్పుడు కిటికీలనుంచి యెత్తుగా వున్న కమాన్లదాకా బంయ్‌మంటూ మారోమ్రగే సంగీత ధ్వనులు అదృశ్య గాయక బృందంనుంచి వచ్చేయి. అవి విస్తరించి స్థాయి పెరుగుతూ తర్వాత వొక క్షణం ఆగి ఆపైన మెల్లిమెల్లిగా లుప్తం అయిపోయేయి.

యెప్పటిలాగా పరలోక రాజ్యం కోసం, ముక్తి కోసం, సినాద్* కోసం, చక్రవర్తి కోసం ప్రార్థనలు జరిగేయి. ఆ రోజు వివాహ బంధంతో ఏకం అవుతూ వున్న ప్రభు భక్త పరాయణులైన లేవిన్, కిట్టీల కోసం ప్రత్యేక ప్రార్థనలు జరిపారు.

"ప్రభూ, మా ప్రార్థన ఆలకించు, వీరిమీద పరిపూర్ణ శాంతియుత ప్రేమనీ, వీరికి నీ తోడునీ అనుగ్రహించు" అనే ఆర్చ్ డీకన్ గొంతుకతో చర్చి మొత్తం పూర్తిగా మమైక్యం చెందినట్టు కనిపించింది.

లేవిన్ ఆ మాటలు విన్నాడు. అతనికి ఆశ్చర్యం కలిగింది. 'వీళ్లకి అనుమానం యెలా తట్టింది తోడు కావాలని, అవును, తోడు' అని కొంచెం సేపటి కితం తనకి కలిగిన భయాలనీ సందేహాలనీ గుర్తు చేసుకుంటూ అతను అనుకున్నాడు. 'నాకేం తెలుసు? యీ భయకారక విషయంలో తోడు లేకుండా నేను యేం చెయ్యగలను? అవును, నాకిప్పుడు తోడు అవసరం' అని అతను అనుకున్నాడు.

డీకన్ ప్రార్థన పూర్తి చేశాక పురోహితుడు పుస్తకం చేత్తో తీసుకుని వధూవరుల్ని ఉద్దేశిస్తూ చదివేడు.

"అజరామర ఈశ్వరా, యే గూటికాగూడుగా వుండే వీళ్లిద్దర్నీ యెడతెగని ప్రేమ బంధంతో కలిపేవు. నీ పవిత్ర నిర్ణయానుసారం ఐజక్, రెబెకాలని వారి సంతతిని ఆశీర్వదించేవు, యిప్పుడు నీ భక్తవరేణ్యులైన లేవిన్, కిట్టీలని ఆశీర్వదించు, సద్ధర్మమార్గాన వారిని నడిపించు. ఈశ్వరుడు ప్రేమాస్పద దయాగుణ పరిపూర్ణుడు. ప్రభువు, కుమారుడు, పవిత్ర ఆత్మ స్తుతింపబడుగాక. ఆదిలో మాదిరీ యిప్పుడూ యెప్పుడూ సర్వదా" అని సాగదీస్తూ చదివేడు. మరోసారి అదృశ్య గాయక బృందం బంయ్‌మని గింగుర్లెత్తించింది.

'"అజరామర ఈశ్వరా, యే గూటికా గూడుగా వుండే వీళ్ళిద్దర్నీ యెడతెగని ప్రేమ బంధంతో కలిపేవు..." యెంత గంభీరమైన అర్థంతో వున్న మాటలు, ఆ సమయంలో అనుభూతం అవుతూ వున్న భావనలకి యెంత అనురూపంగా వున్న మాటలు' అనుకున్నాడు లేవిన్. 'ఆమె కూడా నాకులాగే అనుకుంటోందా?' అనిపించింది అతనికి.

లేవిన్ తల పక్కకి తిప్పి చూశేడు. కిట్టీ చూపుతో అతని చూపు కలిసింది.

ఆ మాటలు తనకిలాగానే ఆమెకీ అనిపించేయని ఆమె చూపు వ్యక్తం చేస్తున్న బావాన్ని బట్టి అతను స్వీకరించేడు. కాని అతను స్వీకరించుకున్నది తప్పు. ఆమె ప్రార్థన మాటల్ని దాదాపు యేమీ అర్థం చేసుకోలేదు. అసలు ఆమె పెళ్ళి తంతులో దేన్నీ వినడమే లేదు. ఆమె వినలేకపోతోంది, అర్థం చేసుకోలేకపోతోంది. ఆమె మనసులో నిండుగా వ్యాప్తించి అధికాధికంగా తీవ్రం అవుతూ వున్న అనుభూతి అంత ప్రబలంగా వుంది. ఆమెకి ఆరు వారాల కితం మనసులో అంకురించి యీ ఆరు వారాలూ యెడతెగని వ్యథకీ, అలాగే సంతోషానికీ కారణంగా వున్నటువంటింది సఫలత్వం పొందుతోందన్న సంతోషానుభూతి అది. ఆరు వారాల నాడు ఆ రోజున అర్బాత్ వీధిలోని తన యింటి డ్రాయింగ్ రూమ్‌లో కావి రంగు ఫ్రాక్ తొడుక్కుని అతని దగ్గరికి వెళ్ళి తనని సమర్పించుకున్న రోజునుంచి, ఆ క్షణం నుంచి, ఆమె హృదయంలో తన గత జీవిత బంధం పూర్తిగా తెగిపోయింది. నూతన, భిన్న, అజ్ఞాత జీవితానికి శ్రీకారం జరిగింది, నిజానికి అదే పాత జీవితం యెడతెగకుండా సాగుతూ వున్నా గానీ. యీ ఆరు వారాలూ ఆమెకి పరమ ఆనందదాయకమైనవి, పరమ వేదనాభరితమైనవి. తన యావజ్జీవితం, సకల కోరికలు, సర్వ ఆశలు తనకి యింకా అర్థం కాని యీ మనిషిమీద కేంద్రీకృతం అయేయి. కాని యీ వ్యక్తికంటే యెక్కువ అజ్ఞాతంగా వున్న అనుభూతి ఆమెని ఆవహించింది. ఆ అనుభూతి ఒక సారి చేరువగా చేస్తూ ఒక సారి దూరం చేస్తూ వుంది. కాని ఆమె జీవితం అదే పాత ఫక్కీలో సాగుతూనే వుంది. పాత ఫక్కీ జీవితంలో వుంటూనే ఆమెకి తత్సంబంధ వస్తువులన్నిటి పట్ల, ఆచారాలన్నిటి పట్ల, తనని ప్రేమించి యింకా ప్రేమిస్తూ వున్న మనుషులందరి పట్ల, తల్లి పట్ల, అప్పటి దాకా తను ప్రాణసమానంగా ప్రేమించే ప్రియమైన, స్నేహపూర్ణుడైన తండ్రి పట్ల ప్రదర్శితమైన తన అదన్య ఉదాసీనత చూసి ఆమెకి త్రాస కలిగింది. ఆ ఉదాసీనత వల్ల తల్లికి దుఃఖం కలిగింది. తన యీ ఉదాసీనత చూసి ఆమెకి కొంచెం సేపు త్రాస కలిగేది, మరు క్షణంలో ఆ ఉదాసీన భావం యేర్పడడానికి కారణభూతమైన పరిస్థితులవల్ల సంతోషం కలిగేది. యీ వ్యక్తితో జీవించడం గురించి తప్ప ఆమె వేరే దేన్నీ గురించీ ఆలోచించలేకపోయింది, దేని పట్లా ఆమెకి కోరిక లేకపోయింది. కాని ఆ నూతన జీవితం యింకా ఉపస్థితం కాలేదు, అది యెలా వుంటుందో స్పష్టంగా ఆమె వూహకి కూడా అందలేదు. యిప్పుడున్నది కేవలం ప్రతీక్ష మాత్రమే. నూతనమూ అజ్ఞాతమూ అయిన దాన్ని గురించిన భయమూ సంతోషమూ మాత్రమే వున్నాయి. అంతే, కొన్ని క్షణాల్లో యీ ప్రతీక్ష, అజ్ఞాత అప్ప

ష్పత, గత జీవిత పరిత్యాగం పట్ల పశ్చాత్తాపం — అన్నీ సమాప్తం అవుతాయి, నూతన జీవితానికి నాందీ ప్రస్తావన జరుగుతుంది. నూతన జీవితం గురించిన అస్పష్టత వల్ల అదంటే భయం కలగడం అనివార్యం అవుతుంది. భయావహం అయినా కాకపోయినా అది ఆరు వారాల నాడే తన అంతరంగంలో అడుగుపెట్టింది. యిప్పుడు దాన్ని పూరికే శంఖంలో పొయ్యడం జరుగుతోందంతే, అది తన ఆత్మలో ముందే జరిగింది.

పురోహితుడు మళ్లీ వాలుబల్ల దగ్గరికి వెళ్లి కష్టంమీద కిట్టీ పెళ్లి ఉంగరాన్ని తీసి — అది చిన్నది — లేవిన్‌ని చెయ్యి చాచమని చెప్పి అతని వేలి చివర తొడిగి "భక్తవరేణ్యుడైన లేవిన్ ప్రభు భక్తపరాయణురాలైన కిట్టీని పరిగ్రహిస్తున్నాడు" అన్నాడు. తర్వాత లేవిన్ పెద్ద ఉంగరం తీసుకుని దుర్బలంగా వున్న కారణంవల్ల దయనీయంగా కనిపించే కిట్టీ గులాబీరంగు చిన్న వేలికి తగిలించి మళ్లీ అవే మాటలు వల్లించేడు.

తాము యేం చెయ్యాల్సి వుందో దాన్ని వధూవరులు ప్రతిసారీ అపసవ్యంగానే చేశారు, అలా చేసిన ప్రతిసారీ పురోహితుడు వాళ్లకి అందిస్తూనే వున్నాడు. ఆఖరికి చెయ్యవలసిన అంతా పూర్తిచేశాక, ఉంగరాల్ని శిలువ గుర్తు గీసినట్టుగా తిప్పి పురోహితుడు పెద్ద ఉంగరాన్ని కిట్టీకి, చిన్న దాన్ని లేవిన్‌కి మళ్లీ యిచ్చేడు. మళ్లీ వాళ్ల వ్యవహారం కలగాపులగం చేసేసి ఉంగరాల్ని వొకళ్ల కొకళ్లు రెండు సార్లు యిచ్చుకున్నారు. యింత జరిగినా యేం చెయ్యాల్సి వుందో అది జరగలేదు.

వ్యవహారం చక్కగా సాఫీగా జరిపించేందుకు దాలీ, చీరికొవ్, అబ్లాన్‌స్కీ ముందుకు వచ్చేరు. దాంతో జనంలో కలకలం రేగింది. నవ్వులు, గుసగుసలు మొదలయేయి. కాని వధూవరుల వదనాలమీద గంభీరత, సమున్నత భావం తొలగలేదు. పై పెచ్చు ఉంగరాలు కలగా పులగం అయేకొద్దీ వాళ్ల గంభీర దృక్కు అధికం అయింది. వొకళ్ల కొకళ్లు ఉంగరాలు తగిలించుకోవాలని చెప్పి అబ్లాన్‌స్కీ నవ్వబోయిన చిరునవ్వు మాయమైంది. తను నవ్వితే వాళ్లకి కష్టం కలగచ్చని అతనికి అనిపించింది.

"ఆదినుంచి నీవు స్త్రీ పురుషులుగా సమస్త ప్రాణులను సృష్టించింతివి" అని పురోహితుడు ఉంగరాలు పెట్టుకున్నాక చదివేడు. "పురుషుని సహకారిగా, సంతతిని వృద్ధి చేయు నిమిత్తము స్త్రీని యిచ్చితివి. ప్రభువైన పరాత్పరా, సత్యమును నీ సంతతిలో స్థాపనీయము చేసి భవదనుగ్రహపాత్రులైన సేవకులతో పితృదేవతలతో నిర్ణయము చేసి తరతరానికీ నీ దాసుడైన లేవిన్‌నీ, నీ దాసురాలైన కిట్టీనీ దయతో చూసి వారి కలయికని విశ్వాస పూరితంగా, మనస్కారంగా ప్రేమతో, సత్యంతో వుందునట్లు అనుగ్రహించమని వేడుకుంటున్నాము..."

వివాహం గురించి తన అభిప్రాయాలు యావత్తూ, తమ జీవితాన్ని యెలా రూపొందించుకోవాలోనన్న కల్పనలు యావత్తూ అనుభవశూన్యమైనవనీ, వివాహం అనేది తనకి అప్పటి దాకా అర్థం కాకుండా అది తనతో నిర్వహింపబడుతూ వున్నా, యిప్పుడు యింకా తక్కువ

అర్థం అవుతూ, యదార్థంలో వేరే యేదోనన్న నమ్మకం లేవిన్‌కి యింకా యింకా యెక్కువగా కలగ సాగింది. తన గొంతుక బిగబట్టినట్టు అతనికి అనిపించింది. అతని కళ్లల్లో నీళ్లు గిరుక్కున తిరిగేయి.

## 5

మాస్కో అంతా చర్చికి తరలివచ్చింది, చుట్టాలు పక్కాలు మిత్రులు యావన్మందీ వచ్చేరు. దేదీప్యమానంగా వెలిగిపోతూ వున్న చర్చిలో పెళ్లి జరుగుతూ వున్నంత సేపూ ధగధగ మెరిసిపోయే బట్టలు వేసుకున్న ఆడవాళ్లు, తెల్లని టైలు, ఫ్రాక్ కోట్లు, యూనిఫాంలు వేసుకున్న మగవాళ్లు అక్కడ చేరారు. పెళ్లి జరుగుతూ వున్నంత సేపూ అక్కడ ఆగకుండా సన్నని సంభాషణ సాగుతూనే వుంది, ముఖ్యంగా మగవాళ్లల్లో. యేమంటే ఆడవాళ్లు పిసరు కూడా తప్పిపోకుండా పెళ్లి తంతుని చూడ్డంలో నిమగ్నం అయిపోయేరు. వాళ్లకి అలాంటి వాటిల్లో యెప్పుడూ మంచి రుచి కనిపిస్తూనే వుంటుంది.

వధువుకి బాగా దగ్గరగా ఆమె అక్కగార్లు డాలీ, ప్రత్యేకం పెళ్లి నిమిత్తం విదేశాల నుంచి వచ్చిన అందమైన పెద్దక్క మేడం ల్వోవా నుంచున్నారు.

''పెళ్లప్పుడు మారీ నల్లగా కనిపించే ధూమ్ర వర్ణం గౌను వేసుకుందేవిటి యిలా?'' అంది కొర్‌సూన్‌స్కాయా.

''ఆమె చాయకి నప్పే రంగు అదే...'' అని ద్రుబెత్‌స్కాయా అంది. ''అసలు వీళ్లు సాయంత్రం పెట్టుకోవడ మేమిటో ముహూర్తం. వ్యాపారం చేసే వర్తకుల మాదిరీ...'' అంది.

''సాయంత్రం పూట అయితే అందం వుంటుంది. నా వివాహమూ సాయంత్రం పూటే అయింది'' అని కొర్‌సూన్‌స్కాయా జవాబు చెప్పింది, నిట్టూరుస్తూ. ఆ సాయంత్రం పూట తను యెంత ముచ్చటగా వున్నదీ, భర్త యెంత పిచ్చి ప్రేమతో వున్నదీ, యిప్పుడు అంతా యెలా మారిపోయిందీ గుర్తు వచ్చి ఆమె నిట్టూర్చింది.

''పెళ్లిళ్లల్లో పెళ్లికొడుకులకి పది సార్లకిపైన పెళ్లి పెద్దగా వున్న వాడికి యిక పెళ్లవదంటారు. యివాళ పదో సారి అలా వుండి గండం గట్టెక్కిద్దామనుకున్నాను, కాని మనకి అవకాశం రాలేదు'' అని కౌంట్ సిన్యావిన్ సొగసుగా వున్న ప్రిన్సెస్ చార్‌స్కాయాతో అన్నాడు. ఆమెకి అతనిమీద ఆశ వుంది.

ప్రిన్సెస్ చార్‌స్కాయా వూరికే మందహాసం చేసింది. ఆమె కిట్టీని చూస్తూ కౌంట్ సిన్యావిన్ పక్కనుండగా తను కిట్టీ స్థానంలో యెప్పుడు నుంచుంటానా అతని పరిహాసాలకి ఎప్పుడు యెత్తిపొడుస్తానా అని అనుకుంటూ వుంది.

కిట్టీ నవరం సిగ పైన కిరీటాన్ని పట్టుకోవాలనుకున్నాననీ, దానివల్ల ఆమెకి సౌభాగ్యం కలుగుతుందనీ యువ ష్చేర్‌బాత్‌స్కీ రాణీవాసపు నికొలాయెవాతో అన్నాడు.

''ఆమె నవరం సిగ చుట్టుకోకుండా వుండాల్సింది'' అని నికొలాయెవా జవాబు చెప్పింది.

తను వలవేస్తున్న వృద్ధ విధురుడు తనని పెళ్లి చేసుకుంటే గనక ఆ పెళ్లి చాలా సాదాగా వుండాలని ఆమె నిర్ణయం చేసుకుంది. "యీ అట్టహాసం నాకు నచ్చదు" అందామె.

నూతన వధూవరులు పెళ్లయిన వెంటనే వెళ్లిపోవడం అనే ఆచారం బాగా వ్యాపిస్తోందనీ, యేమంటే నూతన వధూవరులు యెప్పుడు కొత్తగా సిగ్గుపడుతూ వుంటారనీ దాలీతో కోజ్నిషెవ్ వేళాకోళం ఆడుతూ చెప్తున్నాడు.

"మీ తమ్ముడు గొప్పగా భుజాలు యెగరేసుకోవచ్చు. యింతకంటే మంచి అమ్మాయి అతనికి దొరకదు. మీకు కన్ను కుడుతోం దనిపిస్తోంది నాకు."

"నాకు అది పాత బడిపోయింది దాలీగారూ" అన్నాడు కోజ్నిషెవ్. అతని ముఖంమీద అనుకోకుండానే విచార, గంభీర ఛాయ గోచరమయింది.

అబ్లాన్స్కీ విడాకుల గురించి తన పరిహాసాన్ని వదినగారికి చెప్తున్నాడు.

"ఆమె తలమీద పువ్వుల్ని సరిగా పెట్టాలి" అని ఆమె అతను చెప్పేది వినిపించు కోకుండా అంది.

"అయ్యో పాపం! ఆమె సేవలింపు అంతా పోయింది" అని కౌంటెస్ నార్డ్‌స్టన్ మేడం ల్వోవాతో అంది. "అయితేనేం గాక, అతనామె చిటికిన వేలికి తూగడు! నిజమేనా?" అంది.

"యేం కాదు. అతనంటే నాకు చాలా యిష్టం. అతను నా beau-frère[1] అవడంవల్ల కాదు" అని మేడం ల్వోవా జవాబు చెప్పింది. "యెంత చక్కగా కనిపిస్తున్నాడో చూడండి! యిలాంటప్పుడు నిబ్బరంగా వుండడం, హాస్యాస్పదంగా కనిపించకుండా వుండడం యెంత కష్టం! అతను హాస్యాస్పదంగానూ లేడు, తత్తర పడుతున్నట్టూ లేడు. బాగా చలించిపోయినట్టు కనిపిస్తున్నాడు" అంది.

"యీ సంబంధం కుదురుతుందని మీరు అనుకుంటూనే వున్నారేమో లెండి."

"కొంచెం యించుమించులో. ఆమెకి అతనంటే యెప్పుడూ ప్రేమ వుంది."

"పదండి చూద్దాం, యెవళ్లు మొదట తివాసీమీద అడుగు పెడతారో."

"దానివల్ల యేం వుంది లెండి. మా ష్చేర్‌బాత్‌స్కీ ఆడపడచులందరం మొగుడి మాట వినేవాళ్లమే. అది మా సంప్రదాయంలోనే వుంది."

"కాని నేను వసీలియ్‌కంటె ముందు అడుగు పెట్టాలని పట్టుగా తివాసీమీద అడుగు వేశాను. దాలీ, మీరేం చేశారు?"

దాలీ వాళ్ల పక్కనే నుంచుంది, వాళ్ల మాటలు వింది. కాని జవాబు చెప్పలేదు. ఆమె బాగా చలించిపోయింది. ఆమె కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి. మాటాడ్డానికి నోరు విప్పితే యేడుపు రావచ్చు, అలా వుంది. కిట్టీ, లేవిన్‌లని చూసి ఆమెకి పరమ సంతోషంగా వుంది. ఆమెకి తన పెళ్లి గుర్తు వచ్చి ఉల్లాసంగా వున్న అబ్లాన్స్కీ కేసి చూసింది. ఆమె ప్రస్తుత

---

[1]బావమరిది (ఫ్రెంచి).

స్థితి మర్చిపోయింది. అలనాటి అమాయక తొలి ప్రేమ గుర్తు వచ్చింది. తన గురించేకాక తన స్నేహితురాళ్లనీ బంధువులనీ గురించీ గుర్తు చేసుకుంది. వాళ్ల జీవితంలో వొక్కసారే వచ్చే ఆ ఘనమైన రోజు గుర్తు వచ్చింది. అప్పుడు వాళ్లు కిట్టీకిలాగానే ప్రేమ, ఆశ, భయం నిండిన హృదయంతో వేదిక దగ్గర తమ గత జీవితాలకి వీడ్కోలు చెబుతూ, అజ్ఞాత భవిష్యత్తులోకి అడుగుపెడుతూ నిలబడ్డారు. ఆమెకి అలా గుర్తు కొచ్చిన వధువుల్లో ఆమెకి యిష్టురాలైన అన్నా కూడా వుంది. అలాంటి అన్నా విడాకులు తీసుకునే గొడవలో వుందని కొంతకాలం కితమే తను వింది. ఆమె కూడా నారింజ పుష్పాలు అలంకరించిన తెల్లని లేసు వేసుకుని అమాయకంగా నిర్మలంగా నుంచున్నదే. మరి యిప్పుడు! "యెంత వింతగా వుంటుంది!" అని గొణుక్కుంది.

పెళ్లి జరుగుతూ వున్నంత సేపూ ప్రతి అంశాన్నీ తదేక దృష్టితో చూసిన వాళ్లు కిట్టీ అక్కగార్లు, స్నేహితురాళ్లు, బంధువులూ మాత్రమే కాదు. వేడుక చూడవచ్చిన పై ఆడవాళ్లు కూడా మహా ఉత్సుకతతో, వూపిరి బిగపట్టి, ఆదమరిస్తే యెక్కడ యే వింత పోతుందోనని అంతట్నీ చూశేరు. వధూవరుల ముఖాలమీద గోచరమయేది యే వొక్కటీ పిసరు కూడా తప్పి పోవడం యిష్టం లేనట్టు చూశేరు. అలాగే పరిహాసోక్తులకీ అక్కడా అక్కడా వ్యాఖ్యానాలు చేస్తూ వున్న మగాళ్ల మాటలకి జవాబివ్వక పోవడం సరేసరి మొత్తంమీద వాటిని విననే లేదు.

"ఆమె యెందుకంత యేడుస్తున్నట్టు కనిపిస్తోంది? యిష్టంలేని పెళ్లి చేస్తున్నారా?"

"మన్మథుడిలాంటి పెళ్లికొడుకైతే యిష్టం లేకపోవడం యేమిటి? యెవరన్నా ప్రిన్సా?"

"తెల్లని శాటిన్ వేసుకున్నావిడ అక్కగారా? విను, యీ డీకన్ యేం చించుకుంటు న్నాడో 'స్త్రీలారా మీ స్వపురుషులకు లోబడి యుండుడి' అని."

"యిదిగో చూదొహొ చర్చి గాయక బృందం."

"వుహూఁ కాదు సినాద్‌వాళ్లు.*"

"నేను నౌకర్ని అడిగేను. యెకాయెకీ వాళ్లు జాగీరుకి వెళ్లిపోతారని చెప్పాడు. ఐశ్వర్య వంతులట. అందుకనే సంబంధం యిచ్చేరు తల్లీ తండ్రీనీ."

"అబ్బే, అందుక్కాదు, జోడీ బాగుందని."

"మరీయా వ్లాస్యెవ్నా నే చెప్తే కాదన్నారు, యిలాంటి గౌను వేసుకునే రివాజు వుందంటే. చూడండి ఆ వూదా రంగు బట్టలు వేసుకున్న ఆవిడని, యెవరో రాజదూతగారి భార్యట... ఆమె ఫ్రాక్ యెగరడం లేదు..."

"పెళ్లికూతురు యెంత ముద్దొస్తూ వుంది! ముస్తాబు చేసి తీసుకెళ్లే గొర్రెపిల్లలాగా! యేమన్నా అనండి, ఆడవాళ్లకోసం బాధపడకుండా వుండలేం."

చర్చి గుమ్మంలోనుంచి లోపలికి దూరి రాగలిగిన ఆడవాళ్లు యీ రకంగా మాట్లాడు కుంటూ వున్నారు.

## 6

ఉంగరాలు మార్చుకునే కార్యక్రమం అయేక చర్చిలో పని చేసే వొకరు వచ్చి చర్చిలో మధ్య వున్న వాలు బల్ల యెదర యెర్రని పట్టు తివాసీని పరిచేడు. గాయక బృందం చాలా నేర్పుగా వొక జటిల గీతం ఆలాపించడం మొదలుపెట్టింది. ఆ గీతంలో మంద్రస్వరాలు, తారస్థాయి సప్తకాలు వొకదాని తర్వాత వొకటి పొంగి వచ్చేయి. పురోహితుడు వెనక్కి తిరిగి వధూవరులకి అక్కడ పరిచిన ఎర్రని తివాసీ వేపు సంకేతం చేశాడు. యెవళ్లు మొదట కాలు పెడితే వాళ్లు సంసారంలో పెత్తనం చేస్తారన్న నమ్మకం గురించి వాళ్లిద్దరూ చాలా సార్లు అంతకు ముందు విని వున్నా మొదట కాలు పెట్టాల్సి వచ్చిన యీ సమయంలో కిట్టీకి గాని లేవిన్‌కిగాని అది గుర్తుకు రాలేదు. హెచ్చు స్థాయిలో వస్తూ వున్న వ్యాఖ్యలు గాని, అతను ముందు అడుగు పెట్టాడని కొందరు, లేదు యిద్దరూ వొకే సారి పెట్టారని కొందరూ వాదించుకునే వాదనలు గాని వాళ్లు వినసే లేదు.

వివాహ బంధంలో యేకం అవడం పట్ల వాళ్ల కోరిక గురించీ, వేరే యెవళ్లకేనా వాళ్లు అలాంటి వాగ్దానం చెయ్యడం గురించీ పురోహితుడు మామూలుగా వుండే ప్రశ్నలు వేశాడు. వాటికి వాళ్లు తమ చెవులకే వింతగా ధ్వనించే సమాధానాలు చెప్పేంతర్వాత కొత్త ప్రార్థన మొదలైంది. కిట్టీ ఆ ప్రార్థనా గీతంలోని మాటల్ని విని వాటి అంతరార్థం గ్రహించ ప్రయత్నించింది. కాని గ్రహించలేకపోయింది. అది సాగుతూ వుండగా ఆమె మరింతగా ఆ గంభీర వాతావరణంలో ఆనందోత్సాహాతిరేకంలో మునిగిపోయింది, అక్కడ జరుగుతున్న దానిమీద దృష్టి లగ్నం చెయ్యడం ఆమెకి కష్టం అయింది.

"వీరి ప్రేమ పవిత్రముగానుండి, వీరికి గర్భఫల ప్రసాదం లభించుగాక, పిల్లపాపంతో సుఖమును బడయుదురు గాక" అని ప్రార్థన సాగుతూనే వుంది. భగవంతుడు స్త్రీని ఆదాం పక్కటెముకనుంచి తయారుచేశాడు, అందుకని "పురుషుడు తన తల్లి తండ్రుల్ని వదిలి పెట్టి అర్థాంగితో కలుస్తాడు, ఆ యిరువురూ యేకమవుతారు," అది "వొక మహా రహస్యం" అని ప్రార్థనలో ఉల్లేఖించి వుంది. ప్రభువు వాళ్లకి సంతాన సౌఖ్యం ప్రసాదించాలనీ, ఆయన ఐజక్ రెబెకాలమీద, జోసెఫ్‌మీద, మోజెస్, జిప్పొరాహ్‌ల*మీద వర్షించినలాంటి కృపారసాన్ని వీళ్లమీదా వర్షించాలనీ, వీళ్లు మనమల్ని మునిమనవల్ని కళ్లారా చూసేదాకా ఆయుష్మంతులై వుండాలనీ ప్రార్థన సాగింది. 'యెంత అద్భుతంగా వుంది!' అని కిట్టీ యీ మాటలు వింటూ అనుకొంది. 'కాని దీనికి భిన్నంగా యేమీ జరగదు' అనుకొంది. సంతోషభరిత మందహాసం ఆమె అధరాలమీద లాస్యం చేసింది. ఆ మందహాసం ఆమెకేసి చూస్తూ వున్న వాళ్లందరి వదనాలమీదా మెరుస్తూ ప్రతిఫలించింది.

"ఆమె శిరసుమీద వుంచండి" అని పరోహితుడు కిరీటాన్ని తీసుకురాగానే జనం అన్నారు. యువ షేర్‌బాత్‌స్కీ మూడు బొత్తాంల గ్లవ్ తొడుక్కున్న చెయ్యి వణుకుతూ వుండగా, దాన్ని కిట్టీ తలమీద యెత్తి పట్టేడు.

"తలమీద వుంచండి" అని కిట్టీ చిరునవ్వు నవ్వుతూ మెల్లిగా అంది.

లేవిన్ ఆమెకేసి చూశేడు. కిట్టీ ముఖంలో మెరుస్తూ వున్న ఆనందం చూసి చకితుడై య్యేడు. అతనికి తెలియకుండానే ఆ భావన అతన్నీ వశీభూతం చేసుకుంది. కిట్టీకిలాగానే అతని హృదయమూ సంతోషంతో, ఉల్లాసంతో తరంగించింది.

పెద్ద డీకన్ అపోస్తలుల సందేశాన్ని చదివి వినిపించేడు. ఖంగుమని మోగే కంఠంతో ఆఖరి పాదాల్ని పఠించడం వుంటుందని బయటివాళ్లు యెంతో ఆతృతతో యెదురు చూశారు. ఆ చదవడం యీ యిద్దరికీ చాలా సంతోషకరంగా వుంది. చదును భషకంలో నుంచి నీళ్లు కలిపిన యెర్ర ద్రాక్ష సారాయిని చప్పరించడం సంతోషకరంగా వుంది. పురోహితుడు అంగీ చేతులు వెనక్కి తోసుకుని వాళ్లిద్దరి చేతులూ పట్టుకుని "సంతోషాంతరంగుడవుకమ్మ ఇసయా"* అని ఉచ్చైస్వనంతో ఏకవాద్యనాదం మోగుతూ వుండగా, వాలుబల్ల దగ్గరికి నడిపించుకు వెళ్లి ప్రదక్షిణ చేయించడం యింకా అధిక సంతోషకారకంగా వుంది. షేర్బాత్స్కీ, చీరికొవ్‌లు వధూవరుల శిరసులమీద కిరీటాల్ని యెత్తి పట్టుకుని, కాళ్లు వధువు జీరాడే మైజారు కింద యిరుక్కొని వెనకబడుతూ, పురోహితుడు టక్కున ఆగ్గానే వధూవరుల్ని ఢీకొంటూ ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ, సంతోషంతో మురిసిపోతూ కనిపించేరు. కిట్టీ అధరాలమీద లాస్యం చేసిన మందహాస సౌదామిని చర్చిలో వున్న వాళ్లందర్నీ దీప్తం చేసింది. తనకి లాగానే పురోహితుడూ, డీకన్ కూడా నవ్వాలని అనుకుంటున్నారని లేవిన్‌కి అనిపించింది.

పురోహితుడు కిరీటాల్ని తీసేస్తూ స్వస్తి వచనం చదివి దంపతుల్ని ఆశీర్వదించేడు. లేవిన్ కిట్టీకేసి చూశేడు. అప్పటి దాకా అతనికి ఆమె యెప్పుడు అలా కనిపించలేదు. సౌభాగ్య తేజంతో వెలిగిపోతూ ఆమె వదనం అతిశయించిన సౌందర్యంతో మెరిసిపోతోంది. ఆమెకి యేదో చెప్పాలని లేవిన్‌కి అనిపించింది కాని కార్యక్రమం ముగిసిందో లేదో తెలియక ఆగిపోయేడు. పురోహితుడు ఆ యిబ్బందినుంచి అతన్ని బయట పడేశాడు. దయాన్విత వదనంతో మంద హాసం తొణికిసలాడుతూ వుండగా "మీ భార్యని చుంబించండి, మీరు మీ భర్తని" అని చెపుతూ అతను వాళ్ల చేతుల్లోనుంచి కొవ్వొత్తుల్ని తీసుకున్నాడు.

చిరునవ్వు నవ్వే ఆమె పెదాల్ని లేవిన్ మృదువుగా చుంబించేడు. ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని యేదో తెలియని కొత్త నికటతతో చర్చి బయటికి తీసుకు వెళ్లాడు. అది అంతా నిజమని అతనికి నమ్మకం కలగలేదు, నమ్మకం కలిగించుకో లేకపోయాడు. సిగ్గుతో బెదురుతూ, ఆశ్చర్యచకితంగా వున్న వాళ్ల చూపులు కలిసినప్పుడే అతనికి నమ్మకం కలిగింది, యేమంటే తామిద్దరూ వొకటి అయినట్టు ఆ చూపులు అతనికి అనుభూతం అయేయి.

ఆ రోజు రాత్రి భోజనాల తర్వాత వాళ్లిద్దరూ పల్లెకి వెళ్లిపోయేరు.

అన్నా, వ్రాన్‌స్కీ యూరప్‌లో మూడు నెలలుగా పర్యటిస్తూ వున్నారు. వాళ్లు వెనిస్, రోమ్, నేపుల్స్ నగరాలని చూశేరు. అంతకు కొంచెం ముందే ఇటలీలోని ఓ చిన్న పట్టణానికి వచ్చేరు. అక్కడ కొంతకాలం వుండాలని అనుకున్నారు.

అందమైన హెడ్‌వెయిటర్ లాగు జేబుల్లో చేతులు పెట్టుకుని నుంచున్నాడు. అతని జుట్టు వొత్తుగా వుంది. ఆ జుట్టుకి చమురు రాసుకున్నాడు. మెడ వెనకనుంచి నుదుటిదాకా పాపిడి తీశేడు. ఫ్రాక్ కోటు తొడుక్కుని, తెల్లని లాన్ చొక్కా వేసుకున్నాడు. అది బిగుతుగా వుంది. అతని బాన బొజ్జమీద అలంకారంగా రింగులున్న గొలుసు వేలాడుతోంది. అతను యెదురుగా నుంచున్న పెద్ద మనిషిని కళ్లు రెట్టగించి తిరస్కారపూర్వకంగా చూస్తూ ఆ మనిషి అడిగిన వాటికి పొడిముక్కలతో జవాబు చెప్పేడు. యెవరో పక్క సొల్పునుంచి మెట్ల దగ్గరికి వస్తూ వున్న అడుగుల చప్పుడు విని హెడ్‌వెయిటర్ తల అటు తిప్పి చూశేడు. హోటెల్‌లో వున్న గదుల్లో మహా ఖరీదైన దాన్ని తీసుకున్న రష్యన్ కౌంట్ వస్తున్నాడని చూసి మర్యాద ఉట్టి పడేట్టు జేబుల్లోనుంచి చేతులు తీసేశాడు. తల వొంచి వందనం చేసి, వొక మనిషి వచ్చేడనీ అద్దెకి వొక పెద్ద భవనం తీసుకునే యేర్పాట్లు జరిగేయనీ చెప్పేడు. నిగామాను ఖరారు నామామీద దస్కత్తు చెయ్యడానికి తయారుగా వున్నాడనీ చెప్పేడు.

"బాగుంది, సంతోషంగా వుంది. అమ్మగారు గదిలో వున్నారా?" అని వ్రాన్‌స్కీ అడిగేడు.

"ఆమె షికారు వెళ్లారండి, కాని తిరిగివచ్చేశారు" అని హెడ్‌వెయిటర్ జవాబు చెప్పేడు.

వ్రాన్‌స్కీ వెడల్పాటి అంచులు వున్న మెత్తని టోపీని తీసి చెమటలు కారే నుదుటినీ, జుట్టునీ జేబురుమాలుతో తుడుచుకున్నాడు. అతని జుట్టు బాగా పెరిగి సగం చెవుల్ని కమ్మేస్తోంది. తలమీద బట్ట కట్టిన భాగంమీదకి దాన్ని దువ్వేడు. వ్రాన్‌స్కీ తనకేసే చూస్తూ అక్కడ నుంచున్న పెద్దమనిషికేసి బేఖర్వాగా చూసి వెళ్లిపోబోయేడు.

"యీయన రష్యన్ అండి, మీ కోసం అడిగేడు" అని హెడ్‌వెయిటర్ అన్నాడు.

తెలిసిన వాళ్లు తగలకుండా తప్పించుకుపోయే చోటే లేదా అన్న చిరాకు కొంత, దంపుళ్ల పాట బాపతుగా వున్న జీవితంలో మజా కోసం ఆశ కొంత కనిపిస్తూ వుండగా వ్రాన్‌స్కీ కొంచెం దూరం వెళ్లి నుంచున్న ఆ మనిషికేసి చూశేడు. యిద్దరి చూపులూ వొకే సారి కలిశేయి. యిద్దరి కళ్లూ సంతోషంతో మెరిశాయి.

"గొలెనీశ్చెవ్!"

"వ్రాన్‌స్కీ!"

అతను నిజంగా గొలెనీశ్చెవే. పేజ్‌కోర్*లో వ్రాన్‌స్కీ సహపాఠి. చదువుకునే రోజుల్లో గొలెనీశ్చెవ్ ఉదారవాదిగా వుండేవాడు. స్కూల్ వదిలిపెట్టి వెళ్లిపోయి పౌర హోదా సంపాదించు

కుని* యే కొలువులోనూ చేరలేదు. ఆ తర్వాత వ్రాన్‌స్కీ అతనూ వేరువేరు జీవిత పథాల్లో సాగిపోయేరు, వొక్క సారి మాత్రం కలుసుకున్నారంతే.

ఆ కలుసుకున్నప్పుడు గొలెనీశ్చెవ్ ఉన్నత బౌద్ధిక ఉదారవాద పంథాని యెంచుకున్నాడనీ, తత్ఫలితంగా తన కార్యకలాపాల పట్ల, సైనిక హోదా పట్ల తిరస్కార భావంతో వున్నాడనీ వ్రాన్‌స్కీకి అర్థమైంది. అందుకని వ్రాన్‌స్కీ కూడా గొలెనీశ్చెవ్‌ని చూసి అల వోకగా తన ఉదాసీనతని తెలియచేశాడు. అలాంటి వైఖరిని తెలియచెయ్యడంలో వ్రాన్‌స్కీ గట్టివాడు. దాని అర్థం 'తమకి నా జీవిత విధానం నచ్చవచ్చు, నచ్చకపోవచ్చు, నాకు యీషణ్మాత్రం ఖాతరీ లేదు. కాని తమరు నాకు తెలిసిన వాళ్ళ అనుకోవాలంటే మాత్రం నన్ను గౌరవంగా చూడాలి' అని. వ్రాన్‌స్కీ వైఖరి చూసి గొలెనీశ్చెవ్ తిరస్కారపూర్వక ఉదాసీన భావంతో వుండిపోయేడు. అంచేత యీ ప్రస్తుత కలయిక ఆ దూరాన్ని యింకా యెక్కువ చేస్తుంది అని అనిపిస్తుంది. కాని యిప్పుడు వొకళ్ల నొకళ్లు గుర్తు పట్టి యిద్దరూ సంతోషంతో ముఖాలు చేటంత చేసుకుని హేయ్ అని అరిచేరు. గొలెనీశ్చెవ్‌ని చూస్తే తనకి అంత సంతోషం కలుగుతుందని వ్రాన్‌స్కీ యెన్నడూ వూహించలేదు. కాని బహుశా తనకిప్పుడు యెంత విసుగ్గా వుంటూ వుందో అతను గ్రహించలేకపోయి వుండచ్చును. గత సారి కలుసుకున్నప్పుడు కలిగిన అనిష్టకర అనుభూతిని మర్చిపోయి, నిశ్చలంగా సంతోషంగా మెరుస్తూ వున్న ముఖంతో అతన్ని చూసి వ్రాన్‌స్కీ చేతిని చాచేడు. గొలెనీశ్చెవ్ ముఖంమీద మొదట వున్న అసందిగ్ధ ముద్రని తొలగించే అదే సంతోష భావం గోచరమైంది.

"నిన్ను చూడడం యెంత సంతోషంగా వుంది!" అని వ్రాన్‌స్కీ గట్టిగా వున్న తన తెల్లని పలువరస మెరుస్తూ కనిపించేటట్టు ఆర్ద్రంగా చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"వ్రాన్‌స్కీ యిక్కడకి వచ్చేడని విన్నాను గాని యే వ్రాన్‌స్కీ అయిందీ తెలీలేదు. యెంత సంతోషంగా వుందో చెప్పలేను."

"రా లోపలికి వెడదాం, అయితే యిక్కడ యేం చేస్తున్నావ్?"

"యిక్కడ రెండేళ్ళుగా వుంటున్నాను. పని చేస్తున్నాను."

"అలాగా" అన్నాడు వ్రాన్‌స్కీ ఆసక్తిగా. "పద, లోపలికెడదాం."

వ్రాన్‌స్కీ రష్యన్‌లో మాట్లాడకుండా ఫ్రెంచిలో మాట్లాడడం మొదలుపెట్టేడు. నౌకర్ల ముందు మాట్లాడుకునేటప్పుడు వాళ్లకి తెలియకూడదని వాటిని కప్పిపుచ్చేందుకు ఫ్రెంచిలో మాట్లాడే రష్యన్ల అలవాటు ప్రకారం అలా ఫ్రెంచిలో మాట్లాడేడు.

"నీకు మేడం కరేనినా తెలుసా? మేం యిద్దరం కలిసే యాత్రలు చేస్తున్నాం. ఆవిడ దగ్గరికి వెడుతున్నాను" అని గొలెనీశ్చెవ్ ముఖంకేసి తదేకంగా చూస్తూ ఫ్రెంచిలో అన్నాడు వ్రాన్‌స్కీ.

"ఓహో! అలాగా! నాకు తెలియదు" అన్నాడు గొలెనీశ్చెవ్ అంతపట్టించుకోనట్టు (అతనికి తెలిసివున్నాగానీ). "యిక్కడి కొచ్చి చాలా రోజులైందా?" అని అడిగేడు.

''నేనా నాౖలోజులైంది'' అని ౖవాన్‌స్కీ మళ్లీ అతనికేసి తదేకంగా చూస్తూ అన్నాడు.

'ఆఁ, యితను మర్యాద తెలిసిన వాడే. యీ విషయానికి సంబంధించి యితని వైఖరి యుక్తంగానే వుండచ్చు' అని గొలెనీశ్చెవ్ ముఖంమీద ద్యోతకమయే భావం చూసి అతను ౖపసంగ విషయాన్ని మార్చ ౖపయత్నించడం చూసి ౖవాన్‌స్కీ అనుకున్నాడు. 'యితన్ని అన్నాకి పరిచయం చేస్తాను, యీ విషయంలో యితని వైఖరి యుక్తంగానే వుండచ్చు' అనుకున్నాడు.

అన్నాతో కలిసి యూరప్‌లో పర్యటిస్తున్న యీ మూడు నెలల్లోనూ కొత్త వాళ్లతో పరిచయం అయినప్పుడల్లా తనకీ అన్నాకీ వుండే సంబంధం గురించి వాళ్లు యేమనుకుంటు న్నారా అని ౖవాన్‌స్కీ అనుకునేవాడు. మగవాళ్లల్లో యెక్కువమంది యుక్తమైన వైఖరి వుండేవాళ్లే తగిలారు. కాని అతన్ని గాని, అలా భావిస్తారని అనుకునేవాళ్లని గాని యేమిటా యుక్తమైంది అని అడిగినట్లయితేగనక అతనూ జవాబు చెప్పలేకపోయి వుండేవాడు, వాళ్లూ చెప్పలేకపోయి వుండేవాళ్లు.

యుక్తమైన వైఖరితో వుండేవాళ్లు అని ౖవాన్‌స్కీ అనుకున్న వ్యక్తులకి నిజానికి యే వైఖరీ వుండేదే కాదు. జీవిత క్లిష్ట, అపరిష్కృత సమస్యలు యెదురైనప్పుడు మామూలుగా మర్యాదస్థులు ౖపవర్తించేట్టు వాళ్లు వూరికే ౖపవర్తించేరు. వాళ్లు మర్యాదగా ౖపవర్తిం చేరు. అన్యాపదేశాలూ, అనిష్టకరమైన ౖపశ్నలూ లేకుండా ౖపవర్తించేరు. పరిస్థితినీ దాని అంతరార్థాన్నీ ౖగహిస్తున్నట్టూ, ఆమోదిస్తున్నట్టూ కూడా కనిపించేరు. కాని వివరాల్లోకి పోవడం అనుచితమూ, కుసంస్కారమూ అయినట్టు చూశేరు.

గొలెనీశ్చెవ్ యీ రకం మనిషి అని ౖవాన్‌స్కీ వెంటనే ౖగహించేడు. అంచేత అతన్ని కలుసుకోవడంవల్ల ౖవాన్‌స్కీకి ద్విగుణీకృత సంతోషం కలిగింది. ౖవాన్‌స్కీ అతన్ని అన్నాకి పరిచయం చేసినప్పుడు గొలెనీశ్చెవ్ ౖవాన్‌స్కీ కోరుకుంటున్నట్టుగానే ౖపవర్తించేడు. అతను యిబ్బంది కలిగించే సంభాషణ తప్పించడానికి యేమీ ౖశమ పడక్కర్లేకపోయింది.

గొలెనీశ్చెవ్ అంతకు ముందు అన్నాని చూడలేదు. ఆమె సౌందర్యం చూసి అతను చకితుడయ్యేడు. యింకా యెక్కువగా తన పరిస్థితికి ఆమె అలవాటు పడిన సహజత్వాన్ని చూసి చకితుడయ్యేడు. ౖవాన్‌స్కీ, గొలెనీశ్చెవ్‌తో కలిసి లోపలికి రావడంతో ఆమె సుందర వదనంమీద లజ్జారుణిమ వ్యాపించింది. నిష్కల్మషంగా వున్న ఆ సిగ్గు ఆమె సుందర, నిశ్చల వదనంమీద చాలా శోభగా గొలెనీశ్చెవ్‌కి కనిపించింది. అతనికి యింకా యెక్కువ గొప్పగా భాసించింది యేమంటే ఆమె పరాయి వ్యక్తి ముందు ౖవాన్‌స్కీని యెరమరికల్లేకుండా అలెక్సేయ్ అని పిలిచి, తాము అద్దెకి వొక యింటిని తీసుకుంటున్నామనీ, దాన్ని యిక్కడి వాళ్లు పలాజ్జో అని పిలుస్తారనీ చెప్పడం. తన పరిస్థితి పట్ల యింత దాపరికంలేని వైఖరి కనిపింప చెయ్యడం గొలెనీశ్చెవ్‌కి బాగుందనిపించింది. అన్నా అంత ఉల్లాసంగా, హుషారుగా వుండడం చూసి

వ్రాన్‌స్కీనీ కరేనిన్‌నీ యెరిగిన వాడవడంవల్ల అన్నాని బాగా అర్థం చేసుకున్నట్టు గొలె నీశ్చేవ్‌కి అనిపించింది. ఆమె తనకిగా అర్థం చేసుకోని దాన్ని తను బాగా అర్థం చేసుకున్నట్టు అనుకున్నాడు: భర్తకి దుఃఖం కలిగించి, అతన్నీ కన్న కొడుకునీ వదిలేసి తన పేరుకి కళంకం తెచ్చుకుని కూడా ఆమె యింత ఉత్సాహంగా ఉల్లాసంగా సంతోషంగా యెలా వుండ గలుగుతోందోనన్న విషయాన్ని.

"గైడ్ బుక్‌లో దాన్ని గురించిన ప్రస్తావన వుంది" అని వ్రాన్‌స్కీ అద్దెకి తీసుకున్న పలాజ్జోని గురించి గొలెనీశ్చేవ్ చెప్పాడు. "గొప్ప తిన్‌తోరెత్తో* చిత్రం వుందక్కడ. ఆయన ఆఖరి రోజుల నాటిది" అన్నాడు.

"వో పని చేద్దాం. వాతావరణం చాలా బాగుంది. మనం అక్కడికి వెళ్లి మరో సారి ఆ యింటిని చూద్దాం" అని వ్రాన్‌స్కీ అన్నాకేసి తిరిగి అన్నాడు.

"బాగుంది, అయితే నేను టోపీ పెట్టుకుని వస్తా. ఏం, బయట బాగా వేడిగా వుందంటారా?" అని అన్నా గుమ్మం దగ్గర ఆగి వ్రాన్‌స్కీకేసి చూసింది. మరో సారి ఆమె ముఖంమీద సిగ్గు దొంతరలు లాస్యం చేశాయి.

గొలెనీశ్చేవ్‌తో యెలాంటి సంబంధాలు వుంచుకోవాలని అతని అభిమతం అయిందీ తనకి తెలియదనీ, తను అతను కోరుకున్నట్టే ప్రవర్తిస్తోందో లేదో తెలియదనీ ఆమె చూపుని బట్టి వ్రాన్‌స్కీ అర్థం చేసుకున్నాడు.

వ్రాన్‌స్కీ మృదువుగా చాలా సేపు ఆమెకేసి చూశేడు.

"లేదు, మరీ అంత వేడిగా లేదు" అన్నాడు.

తను అంతా అర్థం చేసుకున్నట్టే ననిపించింది అన్నాకి. ముఖ్యమైంది ఆమె ప్రవర్తన పట్ల వ్రాన్‌స్కీ సంతృప్తిగా వున్నాడు, అంతే. ఆమె చిరునవ్వు నవ్వుతూ చురుగ్గా నడుస్తూ లోపలికి వెళ్లింది.

మిత్రులిద్దరూ వొకళ్లకేసి వొకళ్లు చూసుకున్నారు. యిద్దరూ గజిబిజి పడ్డారు. గొలెనీశ్చేవ్ స్పష్టంగా అన్నాని మెచ్చుకుంటూ యేదో చెప్పాలని అనుకున్నట్టూ కాని యేం చెప్పాలో తోచనట్టూ కనబడ్డాడు. వ్రాన్‌స్కీ కూడా అలా కోరుకున్నాడు కాని భయపడి నట్టు కనిపించేడు.

"వూఁ, అయితే అదన్నమాట" అని వ్రాన్‌స్కీ సంభాషణ మొదలుపెట్టాడు. "యిక్కడ వున్నావన్న మాట. అదే పనిలో వున్నావా యింకా?" అని అడిగేడు. గొలెనీశ్చేవ్ యేదో రచనా వ్యాసంగంలో వున్నాడని యెవరో చెప్పిన విషయం గుర్తుకొచ్చి అలా అడిగేడు.

"వూఁ. 'రెండు సిద్ధాంతాలు' అనే పుస్తకం రెండవ భాగం రాస్తున్నాను" అని గొలె నీశ్చేవ్ తన రచనా వ్యాసంగం గురించి అడిగినందుకు సంతోషపడుతూ అన్నాడు. "కచ్చితంగా చెప్పాలంటే యింకా రాత మొదలెట్టలేదు. విషయం సేకరిస్తున్నాను. రెండవ భాగం విస్తారంగా వుంటుంది. అన్ని రకాల వాదనలనీ సమీకరిస్తుంది. మనం బైజాంటైన్ వారసు

లం అన్న విషయాన్ని మన రష్యన్లెవరూ అర్థం చేసుకోరు'' అని అతను తన దృక్పథాన్ని దీర్ఘంగా, శక్తివంతంగా వివరించడం మొదలుపెట్టాడు.

వ్రాన్‌స్కీకి ''రెండు సిద్ధాంతాలు'' మొదటి భాగం గురించి యేమీ తెలియకపోవడం వల్లా, రచయిత అది విశ్వవిఖ్యాత గ్రంథం అయినట్లు చెపుతూ వుండడంవల్లా మొదట యిబ్బంది కలిగింది. కాని తర్వాత గొలెనీశ్చెవ్ తన ఆలోచనలని వివరించడంతో వ్రాన్‌స్కీ వాటిని అర్థం చేసుకున్నాడు, గొలెనీశ్చెవ్ బాగా చెపుతూ వుండడంతో ఆసక్తి కలిగి విన్నాడు. కాని గొలెనీశ్చెవ్ తను చెప్పే విషయాన్ని గురించి చెప్పే ఆవేశభరిత ఉత్సాహం వ్రాన్‌స్కీకి ఆశ్చర్యాన్నీ, దిగులునీ కలిగించింది. గొలెనీశ్చెవ్ మాట్లాడే కొద్దీ అతని కళ్లల్లో క్రోధాగ్ని అధికమైంది, అతను పరోక్ష ప్రతికక్షులమీద అంత తీవ్రంగా విరుచుకుపడ్డాడు, అతని ముఖ భంగిమ అంత వేదనాభరితంగా, దెబ్బ తిన్నట్టుగా మారింది. వ్రాన్‌స్కీకి పూర్వపు గొలెనీశ్చెవ్ గుర్తు వచ్చేడు. బక్కగా పల్చగా, హుషారుగా, మంచివాడుగా, అందరి పట్లా ఆదరంగా, చదువులో యెప్పుడు మొదటగా వుండేవాడు గొలెనీశ్చెవ్. అలాంటి వాడిప్పుడు యింత రేగిపోవడం యేమిటో వ్రాన్‌స్కీకి అర్థం కాలేదు. అతనికి ఆ ధోరణి నచ్చలేదు. గొప్ప కుటుంబంనుంచి వచ్చిన గొలెనీశ్చెవ్ సాదా రచయితల సరసన పడి అంత కోప్పడిపోవడం, రెచ్చిపోవడం యేమిటో వ్రాన్‌స్కీకి అసలు నచ్చలేదు. యిదేమన్నా లాయకీగా వుందా? వ్రాన్‌స్కీకి అది నచ్చలేదు. కాని గొలెనీశ్చెవ్ బాధపడుతున్నాడని చూసి అతనిపట్ల జాలిపడ్డాడు. అతని భావవ్యక్తీకర, సుందర వదనంమీద బాధ, దాదాపు ఉన్మాద సమమైన బాధ వ్యక్తం అయింది. ఆన్నా వచ్చిన విషయం గమనించకుండానే అతను గబగబా తీవ్రంగా తన వాదనలని వివరించేడు.

ఆన్నా టోపీ పెట్టుకుని, భుజంమీద శాలువా కప్పుకుని అందమైన చేత్తో గొడుగు తిప్పుతూ వచ్చి వ్రాన్‌స్కీ పక్కన నుంచుంది. వెంటనే అతను, తన మీదనే లగ్నం అయిన గొలెనీశ్చెవ్ ముటముటలాడే కళ్లనుంచి చూపు తప్పించుకుని వూపిరి పీల్చేడు. తన అతిలోక సౌందర్య రాశికేసి, జీవంతో సంతోషంతో తొణికిసలాడే సహచరికేసి ఉప్పొంగి వచ్చే నూతన ప్రేమాస్పద దృష్టి మళ్లించేడు. గొలెనీశ్చెవ్ ప్రయాసమీద తేరుకున్నాడు. కొంచెం సేపు అతను మునురుమూతి పెట్టుకుని వుండిపోయేడు. కాని అందరి పట్లా ఆదర పూర్వకంగా వుండే (కనీసం ఆ సమయంలో అలా వున్న) ఆన్నా తన యెరమరికల్లేని మంచి మాటలతో అతన్ని దారిలోకి తెచ్చింది. అనేక విషయాల గురించి ప్రస్తావిస్తూ ఆమె ఆఖరికి చిత్రలేఖనం విషయం తెచ్చింది. అతను దాన్ని గురించి అద్భుతంగా మాట్లాడేడు. ఆమె శ్రద్ధగా వింది. కొత్తగా తీసుకున్న యింటికి వాళ్లు నడిచేవెళ్లారు. దాన్ని బాగా చూశేరు.

''ముఖ్యంగా నాకు వొకటి నచ్చింది'' అని వెనక్కి తిరిగి వచ్చేటప్పుడు ఆన్నా గొలెనీశ్చెవ్‌తో అంది. ''అలెక్సేయ్‌కి మంచి atelier[1] వస్తుంది. నువ్వు తప్పకుండా ఆ గది

---

[1] స్టూడియో (ఫ్రెంచి).

తీసుకో'' అని ఆమె వ్రాన్స్కీతో రష్యన్‌లో చాలా చనువుగా 'నువ్వు' అని పిలుస్తూ అంది. తాము యేకాంతంలో వుండగా గొలెనిశ్చెవ్ దగ్గరి వాడవుతాడనీ అతని దగ్గర యేమీ దాపరికం వుండ క్కర్లేదనీ తెలిసే అలా ప్రవర్తించింది.

''నువ్వు బొమ్మలు గీస్తావా యేమిటి?'' అని గొలెనిశ్చెవ్ వ్రాన్స్కీకేసి తిరిగి అడిగేడు.

''యెప్పుడో గీసేవాణ్ణి, యిప్పుడు మళ్లీ మొదలుపెట్టాను'' అని వ్రాన్స్కీ సిగ్గుతో యెఱ్రబడుతూ అన్నాడు.

''అతనికేం, మంచి ప్రతిభ వుంది'' అని అన్నా సంతోషంగా చిరునవ్వు నవ్వుతూ అంది. ''నాకు విమర్శగా చెప్పేటంత యిది లేదు గాని వున్న వాళ్లు అలా అని చెప్పారు'' అంది.

## 8

అన్నా స్వేచ్ఛనీ వేగంగా స్వస్థతనీ పొందిన ప్రథమ దశలో అక్షంతవ్యంగా సంతోష పడింది, జీవితానందంతో తల మునకలైపోయింది. భర్తకి తనవల్ల కలిగిన దుఃఖ స్మృతి ఆమె ఆనందంలో సొద్దు పెట్టలేదు. ఆ స్మృతి వొక పక్క మహా భయంకరం అయి, దాన్ని గురించి ఆలోచనే చెయ్యలేదు. రెండో వేపున భర్త దుఃఖం ఆమెకి మహదానందాన్ని ప్రసాదించి పశ్చాత్తాప భావాన్నే కలగనియ్యలేదు. జబ్బుపడి కోలుకున్న తర్వాత జరిగిన ప్రతీదీ — భర్తతో సమాధాన పడడం, పొరపొచ్చేలు, వ్రాన్స్కీ ఆత్మహత్యా ప్రయత్నం వార్త, అతను చూడ్డానికి రావడం, విడాకుల ప్రయత్నాలు, భర్త యిల్లు వదిలి వెళ్లిపోవడం, కొడుకుని వదిలిపెట్టడం — యివన్నీ కూడా, జ్వరోద్విగ్న దుష్ట స్వప్నంలాగా భాసించేయి. వ్రాన్స్కీతో కలిసి విదేశాలకి వెళ్లింతర్వాతనే ఆమె వాటినుంచి మేలుకొంది. భర్త పట్ల కలిగిన తప్పు ఆమె మనసులో వెలపరం పుట్టించింది. నీళ్లల్లో మునిగిపోయే వాడి మృత్యు హస్తాన్ని వదిలించుకుని బయట పడేవాడికి కలిగేలాంటి అనుభూతి కలిగింది. అవతలి వాడు మునిగి పోతాడు, అది విచారకరమైన విషయమే. కాని తను బయటపడాలంటే యిదొక్కటే మార్గం. అలాంటి భయంకర సన్నివేశాల్ని గుర్తు చేసుకోకపోవడమే బాగుంటుంది.

భర్తని వదిలిపెట్టేసిన వెంటనే మనసుకి వూరట కలిగించే వొక ఆలోచనా సరళి అన్నాకి తోచింది. ఆ జరిగిన గొడవలన్నిట్నీ నెమరు వేసుకున్నప్పుడల్లా ఆమె ఆ సరళిని గుర్తు చేసుకునేది. 'నేనాయనకి దుఃఖం కలిగించేను నిజమే కాని ఆ దుఃఖంనుంచి లాభం పొందాలని మాత్రం అనుకోలేదు' అనుకునేది. 'నేనూ దుఃఖితురాల్నే, దుఃఖిస్తూనే వుంటాను. నా జీవితంలో ప్రాణప్రదంగా చూసుకునేవి నాకు లేకుండా పోయాయి — నా మంచి పేరు, నా కొడుకు. నేను తప్పు చేశాను అంచేత సుఖం కోరను, విడాకులు కోరను. కళంకిని నన్న అవమానాన్ని, కొడుకు యెడబాటు బాధని అనుభవిస్తాను' అనుకునేది. కాని బాధ పడాలని అన్నా యెంత మనస్ఫూర్తిగా కోరుకున్నా ఆమె బాధితురాలు కాలేదు.

యే రకంగానూ అవమానం పాలవలేదు. వాళ్లు విదేశాలలో రష్యన్ మహిళలకి దూరంగానే వున్నారు. తమకి యిబ్బంది కలిగించని వాళ్లతోనే కలిశారు, తమ కంటే బాగా పరిస్థితిని అర్థం చేసుకున్నట్టు కనిపించిన వాళ్లతోనే కలిశారు. తమ యిద్దరికీ బాగా వున్న నేర్పుతో యెప్పుడూ తమని సంకట పరిచే పరిస్థితి కలక్కుండా చూసుకున్నారు. మొదట్లో ఆమెకి కొడుకు యెడబాటు కూడా బాధ కలిగించలేదు. చంటి పిల్ల, వ్రాన్‌స్కీ కూతురు, యెంతో ముచ్చటగా వుండడంవల్ల, తన దగ్గర ఆ బిడ్డ వొక్కత్తే వుండడంవల్ల బాగా దగ్గరయి అన్నాకి కొడుకు యెప్పుడో గాని గుర్తుకు వచ్చేవాడు కాదు.

జీవితేచ్ఛ, స్వాస్థ్యం చిక్కిన తర్వాత అధికం అయిన ఆ జీవితేచ్ఛ, యెంత అతిశయంగా వుందంటే, జీవిత పరిస్థితులు యెంత నూతనంగా సంతోషంగా వున్నాయంటే అన్నాకి అక్షంతవ్య రూపంలో ఆనందం కలిగింది. వ్రాన్‌స్కీ గురించి బాగా తెలుసుకొనే కొద్దీ అతని పట్ల ఆమె ప్రేమ అంత యెక్కువ అయింది. ఆమె అతన్నిగా అతన్నీ, తనపట్ల అతని ప్రేమకీ కూడా అతన్ని ప్రేమించింది. అతనిమీద తనకి వున్న పూర్ణాధికారం ఆమెకి నిరంతర ఆనందదాయక స్రోతస్సుగా వుండేది. అతని సామీప్యం ఆమెకి సర్వదా సంతోషకరంగా వుండేది. వ్రాన్‌స్కీ వ్యక్తిత్వ సకల గుణాలూ ఆమెకి యెంతలా తెలుస్తూ వుంటే మాటలలో వ్యక్తం చెయ్యలేనంత ప్రేమ ఆమెకి కలిగేది. పౌరదుస్తుల్లో కొత్తగా కనిపించే అతని సుందర రూపం ఆమెని ప్రేమోన్మాద నవయువతికి మల్లే ఆకర్షించింది. అతను అనే ప్రతి మాటా, అతని ప్రతి ఆలోచనా, అతను చేసిన ప్రతి పనీ ఆమెకి యేదో మహోన్నతతో, ఔన్నత్యంతో భాసించేయి. వ్రాన్‌స్కీ పట్ల తన ఆరాధనా భావం ఆమెకే భయకారకంగా తోచేది. అతనిలో లోపాలున్నా యేమోనని వేలు పెట్టి చూపించాలని యెంత ప్రయత్నించినా చూపించలేకపోయేది. అతనితో పోలిస్తే తను యినక రేణువునన్న భావాన్ని వెల్లడిచేసే ధైర్యం ఆమెకి లేదు. ఆ యెరుక అతనికి వస్తే త్వరగా అతనికి తన పట్ల ప్రేమ లుప్తం అయిపోతుందని ఆమెకి అనిపించింది, అతని ప్రేమ లుప్తం కావడం కంటే భయంకరమైంది అన్నాకి లేదు, అలాంటి భయానికి ఆధారాలు లేకపోయినా. తన పట్ల అతని ఆరాధనకి జోహారు చెప్పకుండా, దాన్ని తను యెంత ఘనంగా భావించుకుంటోందో తెలియ చెయ్యకుండా వుండలేకపోయింది. ఆమె దృష్టిలో అతని జీవితం రాజకీయ క్షేత్రంలో మహత్తరంగా రాణించేది. ఆ మహత్వ కాంక్షని అతను తన కోసం త్యాగం చేశాడు. అయినా అతను కలలో కూడా అది పోయిందన్న విచారం వెల్లడి చెయ్యలేదు. అతను ముందటి కంటే అన్నాని యెక్కువ ప్రేమిస్తూ వున్నాడు, యెక్కువ ఆదరం కనబరుస్తూ వున్నాడు. అన్నా తన పరిస్థితి గురించి యెన్నడూ ఆవేదన పడకుండా చూడాలన్న స్పృహ అతనికి సర్వదా వుండేది. యింత ఓజశ్శక్తి సంపన్నుడైన యీ మనిషి అన్నా మాటకు యెదురు చెప్పకపోవడం సరేసరి, అసలు తన మనసులో వున్నది ఫలానా అని పైకి అనను కూడా అనేవాడు కాదు. అంతేకాక అన్నా కోరిక యేమై వుంటుందీ అని వూహించే యేకైక లక్ష్యంతో

వున్నట్టు కనిపించేదు. అన్నా దీన్ని అమూల్యమైందిగా భావించకుండా వుండలేకపోయింది, తన పట్ల అతను చూపించే అమిత శ్రద్ధ, తన పట్ల నిరంతర ఆదరభావం కనిపింపచేసే వాతావరణం ఆమెకి వొకో అప్పుడు భారంగా అనిపించినా.

యిక, వ్రాన్‌స్కీ తన చిరకాల వాంఛితం నెరవేరినా పూర్తి ఆనందంతో వుండ లేకపోయేడు. తన యిచ్ఛా పరిపూర్తి తను అనుభవించ దలచుకున్న ఆనంద మేరునగంలో వొక అణువు మాత్రమేనని అతనికి త్వరలోనే అనిపించింది. కోరికల సాఫల్యమే ఆనందమని భావించే లోక వ్యవహారంలో వున్న తప్పునే తనూ చేశానని అతనికి అనిపించింది. అన్నాతో తన జీవిత సౌభాగ్యాన్ని ముడి వేసుకుని, పౌరదుస్తులకి మారిన కొత్తలో అతనికి అప్పటిదాకా అపరిచితంగా వున్న స్వాతంత్ర్య మధువులు పూర్తిగా అస్వాదితం అయేయి. అలాగే ప్రేమ విశృంఖలత అనుభవంలోకి వచ్చింది. అతని అంతరంగంలో సంతోషం కలిగింది. కాని అది కొంచెం కాలం మాత్రమే వుంది. అతని అంతరంగంలో కోరికలకు కోరిక అయిన అసంతృప్తి పడగ విప్పింది. తనకి తెలియకుండానే అతను ప్రతి క్షణిక చపలతనీ తన కోరిక అనీ, తన ధ్యేయం అనీ భావించుకోవడం మొదలుపెట్టాడు. వాళ్ళు విదేశాల్లో యే బంధనాలూ లేని స్వేచ్ఛతో వుండడంవల్లా, పీటర్స్‌బర్గ్ సమాజ జీవిత వ్యాపకాలకి బాహిరంగా వుండడం వల్లా రోజూ పదహారు గంటలు యేదో వ్యాపకం వుండేటట్టు చూసుకోవాల్సి వచ్చింది. ఒంటరిగా విదేశ యాత్రలు చేసేటప్పుడు తను అనుభవించిన వినోదాలలాంటి వాటిని యిప్పుడు వూహలోకి కూడా రానివ్వడానికి లేదు. కారణం యేమంటే, కొంతమంది తెలిసిన వాళ్లతో కలిసి వో రాత్రి పొద్దు పోయేదాకా విందులారగిస్తూ గడపడంతో అన్నాకి అనుకోని రీతిలో తీవ్రమైన మనోవేదన కలిగి ఆమె విచార గ్రస్తం అయింది. అందుకని యిలాంటి వినోదాల ప్రసక్తే లేదు. యికపోతే యిటాలియన్లతోగాని స్థానిక రష్యన్ సమాజంతోకాని కలవాలి. వాళ్ళు అదీ చెయ్యలేకపోయారు, తమ సంబంధాలు అస్పష్టంగా వుండడంవల్ల. వూళ్లల్లో చూడదగ్గ విశేషాలు అన్నీ ముందే చూశేసారు. దాంతో అవి రష్యన్ వ్యక్తిగా, అర్థం చేసుకోగల శక్తిగల వాడుగా అతనికి ఆకర్షణ కలిగించలేకపోయేయి, ఇంగ్లీషు వాళ్లకి అనిర్వచనీయ ప్రాముఖ్యంతో ఆకర్షణ కలిగించినట్టుగా.

తినదగ్గ వస్తువనే ఆశతో ఆకలిగొన్న జంతువు దేన్ని పడితే దాన్ని అందుకున్నట్టు వ్రాన్‌స్కీ అతర్కంగా వో సారి రాజనీతి శాస్త్రాన్ని, తర్వాత కొత్త గ్రంథాల్ని, మరోసారి చిత్రకళని అంకించుకున్నాడు.

వయసు వచ్చినప్పటినుంచీ అతనికి చిత్రకళపట్ల అభినివేశం వున్న కారణంగా, చేతిలో వున్న సొమ్ము యెలా ఖర్చు చెయ్యాలో తెలియని రేఖాచిత్రాల్ని పోగు చెయ్యడం మొదలుపెట్టిన కారణంగా చిత్రలేఖనం వ్యావృత్తిగా యెంచుకుని, దాన్ని శోధించి తృప్తి కోసం తపించే తన యిచ్ఛా భండారాన్ని దానిమీద వ్యయం చేశాడు.

కళని అర్థం చేసుకునే ప్రతిభ, నిర్దుష్టంగా అభిరుచి పూర్వకంగా తద్రూప చిత్రణ

చేసే నేర్పూ వ్రాన్‌స్కీకి నిజంగానే వున్నాయి. దాంతో చిత్రకారుడికి అవసరమైన లక్షణాలు తనకి వున్నాయని అతను భావించుకున్నాడు. అంచేత, ధార్మిక, చారిత్రక, వాస్తవవాద శైలుల్లో దేన్ని యెంచుకోవాలన్న విచికిత్స కొంతకాలం చేసుకుని అతను చిత్రాలు గియ్యడం మొదలుపెట్టేడు. అతనికి చాలా శైలులు, శాఖలు తెలుసు, యెందులోనేనా అతనికి ప్రేరణ కనిపించేది. కాని అతను వూహించలేకపోయింది, వొక్కటే – శాఖలా శైలులా సంబంధం లేకుండా, తను గీసిన చిత్రం యే శాఖకి శైలికి చెందుతుందన్న పట్టింపు లేకుండా హృదయ ప్రేరణానుసారంగా మాత్రమే దాన్ని గ్రహించాలని. యిది అతనికి తెలియకపోవడంవల్లా, జీవితంనుంచి నేరుగా ప్రేరణ పొందకుండా, కళలో వ్యక్తం అయిన రీతిలో పరోక్షంగా జీవితంనుంచి ప్రేరణ పొందడంవల్లా చాలా శీఘ్రంగా, సునాయాసంగా ప్రేరితుడై అంతే శీఘ్రంగా సునాయాసంగా బొమ్మల్ని గీశేవాడు. అవి తను యే శైలిని అనుకరించ దలచుకున్నాడో ఆ శైలివిలాగానే కనిపించేవి.

అతనికి బాగా స్పందన కలిగించింది యెంతో సొగసుగా, సమ్మోహపూరితంగా వున్న ఫ్రెంచి శైలి. అతను ఆ పద్ధతిలో ఇటాలియన్ వేషధారణలో ఆన్నా చిత్రాన్ని గియ్యడం మొదలుపెట్టాడు. అతనికీ, ఆ బొమ్మని చూసిన అందరికీ అది బాగా కుదిరినట్టు అనిపించింది.

## 9

బొమ్మలు చెక్కిన ఎత్తైన సరంబీలు, గోడలమీద చిత్రాలు, నేలమీద మొజాయిక్ పలకలు, యెత్తైన కిటికీలకి భారీ పసుపుపచ్చ పరదాలు, గోడ గూళ్లల్లో, పొగగొట్టాల తావుల్లో పూలకుండీలు, పోగరపని చేసిన తలుపులు, చిత్ర సజ్జితం అయిన మునురు పడసాలలు వున్న యీ పురాతన ఉపేక్షిత పలాజ్జోలో ప్రవేశించిం తర్వాత దాని బాహ్య రూప విశేషాలు వ్రాన్‌స్కీ మనసులో మధురోహలు కల్పించేయి. తను రష్యన్ జాగీర్దారు, పదవీ విరమణ చేసిన రాజోద్యోగి మాత్రుడు గాక యేదో వికాసవంతుడైన కళా ప్రేమికుడనీ, కళా పోషకుడనీ భావన కలిగింది. అలాగే తనూ ప్రేమకోసం లోకాన్ని, మహత్వ కాంక్షని, ఘనమైన సంబంధ బాంధవ్యాల్ని తృణప్రాయంగా త్యజించిన సామాన్య చిత్రకారుడన్న భావన కలిగింది.

పలాజ్జోకి మారింతర్వాత వ్రాన్‌స్కీ తను అవలంబించిన పాత్రని సంపూర్తిగా సఫలం చేశాడు. గొలెనీశ్చెవ్‌ద్వారా కొంతమంది ఆసక్తికరమైన వాళ్లతో పరిచయాలు చేసుకున్నాక మొదట్లో మనశ్శాంతిగానే వున్నట్ట నిపించింది. ఒక ఇటాలియన్ చిత్రలేఖన ప్రొఫెసర్ పర్యవేక్షణలో అతను ప్రకృతి చిత్రణ చేశాడు. మధ్యయుగాల నాటి ఇటాలియన్ జీవితం గురించి అధ్యయనం చేశాడు. మధ్యయుగాల నాటి ఇటలీ అతన్ని యెంత సమ్మోహం కావించిందంటే ఆ రీతిలో టోపీ పెట్టుకుని, భుజం కింద నుంచి ఉత్తరీయం వేసుకున్నాడు. యీ రెండూ అతనికి యెంతో బాగా నప్పేయి.

"మనం యిక్కడ వుంటున్నాం కాని మనకి యే వార్తలూ తెలియవు" అని వో రోజు ఉదయం తమని చూడ్డానికి వచ్చిన గొలెనిశ్చెవ్‌తో అన్నాడు. "మిహైలొవ్ గీసిన యీ చిత్రం చూశావా?" అని పొద్దుట వచ్చే రష్యన్ పత్రికని అందిస్తూ అన్నాడు. అదే పట్టణంలో వుంటూ వున్న రష్యన్ చిత్రకారుడి గురించి రాసిన వ్యాసాన్ని చూపించేడు. ఆ చిత్రకారుడు వొక చిత్రాన్ని పూర్తిచేశాడు. ఆ చిత్రం గురించి నలుగురినోళ్లల్లోనూ అప్పటికే ఆడుతోంది. దాన్ని అప్పటికే కొనెయ్యడం కూడా అయిపోయింది. అంతటి మహా చిత్ర కారుడికి సహాయాన్నీ ప్రోత్సాహాన్నీ యివ్వనందుకు ప్రభుత్వాన్నీ, అకాడెమీనీ ఆ వ్యాసం విమర్శించింది.

"అతని చిత్రం చూశాను" అని గొలెనిశ్చెవ్ జవాబు చెప్పేడు. "సత్తా వున్న వాడి లాగే కనిపిస్తున్నాడు, కాని అతని కళాధోరణి శుద్ధ తప్పు. క్రీస్తు పట్ల, మతం పట్ల అతనిది ఇవానొవ్ – స్ట్రాస్ – రెనాన్ ధోరణి*" అన్నాడు.

"చిత్రంలో వస్తువు దేన్ని గురించి?" అని ఆన్నా అడిగింది.

"పైలేట్ సముఖంలో క్రీస్తు. నవీన కళాశైలిలో క్రీస్తుని పూర్తి యదార్థవాదంతో యూదుడిగా ప్రదర్శించడం జరిగింది."

చిత్రం వస్తువు గురించిన యీ ప్రశ్న గొలెనిశ్చెవ్ అభిమాన పాత్ర విషయానికి సంబంధించిందవడంతో అతను తన ధోరణిలో మొదలుపెట్టాడు.

"అసలింత ఘోరమైన తప్పు యెలా చేస్తారో నాకు అర్థం కాదు. పూర్వకాలం మహా చిత్రకారుల కృతుల్లో క్రీస్తు మూర్తి నిశ్చితంగా వుంది. వీళ్లు భగవంతుణ్ణిగాక వొక విప్లవకారుణ్ణో, ఋషినో చిత్రించదలచుకుంటే చరిత్రనుంచి సొక్రటీస్‌నో ఫ్రాంక్లిన్‌నో లేదా షార్లెట్ కోర్డేనో* తీసుకోమనండి గాని క్రీస్తుని కాదు. కళలో వ్యక్తం చెయ్యలేని మనిషినే తీసుకుంటున్నారు, పైగా..."

"మిహైలొవ్‌కి రోజు గడవడం కష్టంగా వుందట నిజమేనా?" అని వ్రాన్‌స్కీ అడిగేడు, బొమ్మ బాగోగులు యెలా వున్నా, రష్యన్ కళాపోషకుడిగా కళాకారుడికి సహాయం చెయ్యడం తన బాధ్యత అన్నట్టు.

"యేమో మరి. అతను మంచి రూప చిత్రకారుడు. అతను గీసిన వసీల్చికొవా బొమ్మ చూశేవా? కాని అతను రూప చిత్రాల్ని గియ్యడం మానేస్తాట్ట. అలా అయితే యిబ్బంది పడుతూనే వుండచ్చు. కాని నేను చెప్పేదేమంటే..."

"అతను ఆన్నా బొమ్మ గీస్తాడేమో అడిగితే?" అన్నాడు వ్రాన్‌స్కీ.

"యెందుకు?" అంది ఆన్నా. "నువ్వు గీసిన బొమ్మ తర్వాత నా చిత్రం మరోటి అఖ్ఖర్లేదు. ఆన్యా బొమ్మ గియ్యమను" (తన చంటిపిల్లని ఆమె అలా పిలిచేది) "అదుగో" అని కిటికీలోనుంచి చంటిపిల్లని తోటలోకి తీసికెళ్లిన ముచ్చటైన ఇటాలియన్ దాదికేసి చూసి, తర్వాత వ్రాన్‌స్కీకేసి దృష్టి తిప్పుతూ అంది. అందమైన ఆ ఇటాలియన్ దాది

వదన చిత్రాన్ని వ్రాన్‌స్కీ గీస్తూ వున్నాడు. ఆమె అందం అన్నాకి లోపల గుచ్చుకునేటట్టు వుంది. ఆమె బొమ్మ గీస్తూ వ్రాన్‌స్కీ ఆమె అందాన్ని, మధ్యయుగీన రూపాన్ని పొగిడేడు. ఆ దాది అంటే తనకి యీర్ష్య కలుగుతుందనే భయం వున్నట్టు వొప్పుకునే ధైర్యం లోపల అన్నాకి లేకపోయింది. దాది పట్ల యీర్ష్య పడ్డానికి భయం వేసింది. అందుకని దాది పట్ల చాలా ఆదరం చూపిస్తూ, ఆమె చంటిపిల్లాడ్ని మహా ముద్దు చేసేది.

వ్రాన్‌స్కీ కూడా కిటికీలోనుంచి చూసి తర్వాత అన్నా కళ్లల్లోకి చూశేడు. వెంటనే గొలెనీశ్చెవ్‌కేసి తిరిగేడు.

"నీకు మిహైలొవ్ తెలుసా?" అని అడిగేడు.

"చూశాను. వింత మనిషి, చదువూ సంధ్యా లేదు. యివాళ రోజుల్లో యెక్కడ పడితే అక్కడ తగుల్తూ వుండే కొత్త జడ్డి రకం మనుషుల బాపతు. స్వేచ్ఛాభావుకుల రకం, d'emblée[1], నాస్తికులుగా, సంశయాత్ములుగా, భౌతికవాదులుగా తయారైన వాళ్లు. పాత రోజుల్లో..." అని గొలెనీశ్చెవ్ సాగించేడు. అన్నా, వ్రాన్‌స్కీ యేదో చెప్పబోతున్నారన్న విషయాన్ని పట్టించుకోకుండా, లేదా పట్టించుకోవాలనే దృష్టి కూడా లేకుండా చెప్ప సాగేడు. "పాత రోజుల్లో మతం, చట్టం, నైతిక విలువలు అనే వాటి ప్రకారం శిక్షణ పొందిన వాళ్లు స్వేచ్ఛాభావుకులుగా వుండేవాళ్లు. యెంతో కష్టపడి ఆంతరంగిక పోరాటం జరిగిం తర్వాత స్వేచ్ఛభావుకుల స్థాయికి చేరేవాళ్లు. యిప్పుడేముంది, మనకి వో కొత్త రకం సద్యో జనిత స్వేచ్ఛాభావుకులు తయారయేరు. నీతి నియమాలనేవి తగులడ్డాయనీ మతం అనేది వొకటి యేడిసిందనీ వీళ్లు విని కూడా వుండరు. తమకంటే గొప్పవాళ్లు తమకి ముందు వున్నారనీ వీళ్లకి తెలీదు. ప్రతిదాన్నీ కొట్టి పారేస్తూనే వుంటారు వీళ్లు. వొక్క ముక్కలో చెప్పాలంటే అడివి మనుషుల బాపతు. యిదిగో, యితనూ అంతే. యితను మాస్కోలో రాచ కొలువులో నౌకరు కొడుకట. యే బాపతు చదువు సంధ్యలనేవీ లేవు. అకాడెమీలో చేరి కొంచెం నలుగురి నోళ్లల్లోనూ తన పేరు ఆడ్డం మొదలెట్టాక ముందు చూపు వున్న వాడవడంతో విద్యాభ్యాసం మొదలెట్టాలనుకున్నాడు. అంచేత చదువుకి ఆధారం అని తను అనుకున్న దానికేసి మళ్లేడు — పత్రికలకేసి. పాత రోజుల్లో విద్యాభ్యాసం చెయ్యదలచుకున్న వాడు, మాటకి వో ఫ్రెంచి వాడనుకో, పంచ కావ్యాలతో మొదలెట్టేవాడు. ధర్మశాస్త్రాల్ని, మహా విషాద నాటక రచయితల కృతుల్ని, చరిత్రకారుల గ్రంథాల్ని, తత్వవేత్తల రచనలని పఠించే వాడు, అందుగ్గాను నిద్రాహారాలుమాని శ్రమ పడేవాడు. కాని యివాళ యెత్తుకోవడం యెత్తుకోవడమే నాస్తికవాద సాహిత్యాన్ని! నాస్తికవాద సారాన్ని వెంఠనే జీర్ణించేసుకుంటాడు. అంతే విద్యాధికుడైపోతాడు. అంతేనా! యిరవై యేళ్ల నాటి సాహిత్యం చదివే వాడికి పాత కాలంనాటి గొప్పవాళ్లతో పురాతన నమ్మకాలతో సంఘర్షణ జరిగిన చిహ్నాలు కనిపించేవి,

[1]మొదట్నుంచి (ఫ్రెంచి).

వొకప్పుడు వేరే దృష్టికోణం అనేది వొకటుండేదని తెలుసుకునేవాడు. కాని యివాళ అతనికి సరాసరి యెలాంటి సాహిత్యంతో సంబంధం వస్తోందంటే, అది పురాతన భావాలని ఖండించను కూడా ఖండించకుండా యెకాయెకీ చెప్పేస్తుంది – évolution[1], ప్రాకృతిక వరణం, అస్తిత్వ సంఘర్షణ* తప్ప వేరే యేమీ లేవు అని. నేను రాసిందాంట్లో..."

"వో పని చేద్దాం" అంది అన్నా. ఆమె చాలా సేపటిగా వ్రాన్‌స్కీకేసి సావధానంగా చూస్తూనే వుంది. ఆ చిత్రకారుడి విద్యా విషయాల గురించి అతనికి యేమీ ఆసక్తి లేదనీ, అతనికి సాయం చెయ్యాలనీ, అతనిచేత రూప చిత్రం గీయించా లనుకుంటున్నాడనీ గ్రహించింది. "వో పని చేద్దాం" అంది దడదడ సాగిపోయే గొలెనీశ్చెవ్ ధోరణికి అడ్డకట్ట వెయ్యాలన్న నిర్ణయంతో. "మనం వెళ్లి అతన్ని చూద్దాం" అంది.

గొలెనీశ్చెవ్ ధోరణి కట్టి పెట్టి, చిత్రకారుడి దగ్గరికి వెళ్లడానికి సంతోషంగా సరేనన్నాడు. ఆ చిత్రకారుడి యిల్లు దూరం కావడంతో బగ్గీలో వెళ్లాలని అనుకున్నారు.

అన్నా, గొలెనీశ్చెవ్ పక్కపక్కన, వ్రాన్‌స్కీ ముందు కూర్చున్న బగ్గీ వో గంట తర్వాత అందమైన కొత్త యింటి ముందు ఆగింది. యింటి నౌకరు భార్య వచ్చి మిహైలొవ్ తనని చూడవచ్చిన వాళ్లని స్టూడియోలో కలుసుకుంటాడనీ, కాని ఆ సమయంలో అతను కొన్ని అడుగుల దూరంలో వున్న తన యింట్లో వున్నాడనీ చెప్పింది. అప్పుడు వాళ్లు తమ విజిటింగ్ కార్డులని పంపిస్తూ, తన చిత్రాలని చూపించవలసిందిగా అభ్యర్థన చేశారు.

## 10

చిత్రకారుడు మిహైలొవ్ యెప్పటిలాగానే తన పనిలో వుండగా కౌంట్ వ్రాన్‌స్కీ, గొలెనీశ్చెవ్‌ల విజిటింగ్ కార్డులు వచ్చేయి. ఉదయం అతను స్టూడియోలో పెద్ద చిత్రం గీసే పనిలో వున్నాడు. యింటికి వెళ్లగానే అద్దె యిమ్మని రొక్కించిన యజమానురాల్ని సర్ది పంపనందుకు పెళ్లాంమీద కోప్పడ్డాడు.

"ఆమెతో వాదన పెట్టుకోవద్దని తొంభై సార్లు చెప్పాను నీకు. నువ్వసలే దద్దమ్మవి, యిక ఇటాలియన్‌లో వాదన మొదలెట్టావంటే యింతకు మూడింతలు దద్దమ్మవై పోతావు" అని పెద్ద గొడవ జరిగేక అతను అన్నాడు.

"అయితే అద్దె యివ్వడంలో ఆలస్యం చెయ్యకుంటే, నా తప్పేం వుంటుంది. నా దగ్గర డబ్బుంటే గనక..."

"అబ్బబ్బ! నీకు పుణ్యం వుంటుంది నన్నొదిలి పెట్టు" అని మిహైలొవ్ రుద్ధ కంఠంతో అన్నాడు. చేతులతో చెవులు మూసుకుని అడ్డగోడ వెనక తను పని చేసుకునే గదిలోకి

---

[1] పరిణామ క్రమం (ఫ్రెంచి).

వెళ్లి తలుపు వేసుకున్నాడు. 'చవట!' అని కూర్చుంటూ తిట్టుకున్నాడు. బొమ్మలు గీసే అట్ట తెరిచి తను గీస్తూ వున్న చిత్రం పనిలో చాలా ఉత్సాహంతో మునిగిపోయేడు.

జీవిత శకటం వొడిదుడుకుల్తో నడుస్తూ వున్నప్పుడు, ముఖ్యంగా పెళ్లాంతో తగూ వడ్డప్పుడు చేసినంత ఉత్సాహంగా అతను యెన్నడూ పని చెయ్యడు. 'అబ్బ! దీన్ని తగలెయ్య!' అని పని చేస్తూ అనుకున్నాడు. అతను కోపావేశ పూరితుడైన మనిషి రేఖా చిత్రం గీస్తున్నాడు. బాహ్య రేఖాకృతి దాదాపు గీశేడు కాని అతనికి తృప్తిగా లేదు. 'వుహుం, అదే బాగుంది, యెక్కడుందో అది?' అనుకుంటూ పెళ్లాం దగ్గరికి వెళ్లేడు. ముఖం ముడుచుకుని ఆమె కేసి చూడకుండానే తను వాళ్లకిచ్చిన కాగితం యేమైందని పెద్ద కూతుర్ని అడిగేడు. పనికి రాదని పారేసిన రేఖాచిత్ర కాగితం దొరికింది కాని దానిమీద కొవ్వొత్తి మైనం మరకలు పడి, జిడ్డు అంటుకుంది. అయినా అతను దాన్ని తీసుకుని బల్లమీద పెట్టి కొన్ని అడుగులు వెనక్కి వేసి కళ్లు ముడుస్తూ దానికేసి చూశేడు. వున్నట్టుండి చిరునవ్వు నవ్వి సంతోషంతో చేతులు యెగరేశాడు.

"అద్గదీ!" అని వెంఠనే పెన్సిల్ తీసుకుని గబగబ గియ్యడం మొదలుపెట్టాడు. ఆ కొవ్వొత్తి మరక చిత్రానికి నూతన ముద్ర ప్రసాదించింది.

అతను ఆ నూతన ముద్రని గీస్తూ వుండగా తనకి చుట్టలు అమ్మే మనిషి ఔత్సుక్య భరిత వదనం అతనికి హఠాత్తుగా గుర్తువచ్చింది. ఆ మనిషిది పెద్ద చుబుకం. అతను యీ చిత్రానికి ఆ ముఖం, చుబుకం వున్న ఆకృతి యిచ్చేడు. అతనికి సంతోషంతో నవ్వు వచ్చింది. నిర్జీవ, కాల్పనిక ఆకృతి స్థానంలో సజీవ ఆకృతి వచ్చి అది యెలా మారిందంటే యిక అందులో వేలు పెట్టడానికి లేదు. ఆ చిత్రం సజీవం అయింది, వొక సునిశ్చిత రూపం దానికి వొచ్చింది. ఆ రేఖాచిత్రాన్ని యీ ఆకృతికి అనురూపంగా సవరించవచ్చు. కాళ్లని వేరే పద్ధతిలో పెట్టచ్చు, పెట్టి తీరాలి. యెడమ చెయ్యిని పూర్తిగా మార్చెయ్యాలి. జుట్టుని వెనక్కి గెంటాలి. యీ సవరింపులు చేసినా అతను అసలు చిత్రాన్ని యేమీ మార్చలేదు, ఆకృతిని ఛాదితం చేసే వాటిని మాత్రమే తొలగించేడు. పూర్తిగా కంటికి ఆనకుండా అవరోధంగా వున్న వాటిని తొలగించేడు. అతను గీసే ప్రతి గీతకీ సర్వశక్తితోనూ ఆకృతి తీసుకుని, మరకవల్ల అతనికి తట్టిన రీతిలో చిత్రం మూర్తిమంతం అవుతోంది. అతనికి విజిటింగ్ కార్డులు అందే సమయానికి అతను యేకాగ్రతతో ఆ చిత్రాన్ని పూర్తిచేస్తూ వున్నాడు.

"అయిపోయింది, వస్తున్నా!"

అతను పెళ్లాం దగ్గరికి వెళ్లేడు.

"వూఁ, చాలు! మరి కోప్పడకు సాషా" అని అతను గోముగా, మృదువుగా చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. "నీ తప్పూ వుంది, నా తప్పూ వుంది. అన్నిటికీ చక్కబెడతాగా" అన్నాడు. పెళ్లాన్ని ప్రసన్నం చేసుకున్నాక, మఖమల్ కాలరు వున్న ఆకుపచ్చ రంగు వోవరుకోటు తొడుక్కుని టోపీ పెట్టుకుని, స్టూడియోకి వెళ్లాడు. బాగా కుదిరిన బొమ్మ గురించి పూర్తిగా

మర్చేపోయేడు. బగ్గీలో కూర్చున్నాక తన స్టూడియోకి ప్రముఖ రష్యన్లు వచ్చారన్న ఉత్తే జమూ సంతోషమూ అతన్ని ముంచెత్తేశాయి.

చిత్రకారుడి యేటవాలు బల్లమీద వున్న చిత్రం గురించి హృదంతరాళంలో అతనికి వొకే అభిప్రాయం వుంది, అలాంటి చిత్రాన్ని యెవళ్ళూ యెన్నడూ గీసి వుండలేదు అని. తన చిత్రం రాఫేల్* గీసిన వాటన్నిటి కంటే బాగుందని అతను అనుకోలేదు. కాని తను వ్యక్తం చెయ్యదలచుకున్న భావం, యీ చిత్రంలో యదార్థానికి సాధించినటువంటి భావం యెవరూ యెన్నడూ వ్యక్తం చెయ్యలేదు. అతనికా విషయం కచ్చితంగా తెలుసు, చాలా కాలంగా, తను చిత్రలేఖనం మొదలుపెట్టినప్పటినుంచీ తెలుసు. అయినా కూడా ప్రజల అభిప్రాయాలు, — ఆ అభిప్రాయాలు యెలాంటివైనప్పటికీ, — అతనికి యెంతో విలువైనవి. అవి అతని హృదంతరాళాన్ని స్పందింప చేశాయి. ప్రతి చిన్న వ్యాఖ్య తాత్పర్యం, యెంత సామాన్య మైందైనా, ఆ అభిప్రాయం వెల్లడి చేసేవాడు కళాకారుడిగా తనకి తన చిత్రంలో కనిపించే వాటిలో వొక శకలాన్ని చూసి చేపితే అతని అంతరంగంలో స్పందన కలిగేది. తన చిత్రం చూసి అభిప్రాయం చెప్పేవాళ్ళు తన కంటే గాఢతరమైన అవగాహన వున్న వాళ్ళని, అతను సర్వదా అనుకునేవాడు. వాళ్ళు యెప్పుడూ తన చిత్రాల్లో తనే చూడగలగలేని వాటిని చూస్తారని అతనికి అనిపించేది. వాళ్ళు తమ అభిప్రాయాల్ని చెపుతూ వుంటే వాటిని దర్శించినట్టే కనిపించేది.

అతను చురుగ్గా అడుగులు వేస్తూ స్టూడియో గుమ్మం దగ్గరికి వెడుతూ వున్నాడు. ఉత్తేజంగా వున్నాగానీ అక్కడ నీడలో నుంచుని, తీవ్రంగా గొలెనీశ్చెవ్ చెప్తూ వున్న విష యాన్ని వింటూ, గుమ్మం దగ్గరికి వస్తూ వున్న చిత్రకారుడ్ని చూడ్డానికి ఉత్సుకంగా వున్న ఆన్నా ఆకృతి అతన్ని ఆశ్చర్య చకితం చేసింది. ఆమె దగ్గరికి వెళ్ళేటప్పుడు, చుట్టలు అమ్మేవాడి చుబుకం మాదిరిగా ఆమె ప్రభావం యెలా తన మీద పడి మనసులో ముద్రితమై పోయిందీ అతనికే తెలీలేదు. ఆ ముద్రని అవసరం పడినప్పుడు బయటికి తీస్తాడు. గొలెనీశ్చెవ్ యీ చిత్రకారుడి గురించి చెప్పిందాంతో వ్రాన్‌స్కీ, ఆన్నాలు అప్పటికే నిరాశగా వున్నారు. ఆ చిత్రకారుణ్ణి చూశేక ఆ నిరాశ యెక్కువైంది. మిహైలొవ్ సామాన్యమైన యెత్తు వుంటాడు, స్థూలకాయుడు. అగల్‌బగల్‌గా నడుస్తాడు. గోధుమరంగు టోపీ పెట్టు కున్నాడు. ఆకుపచ్చ రంగు వోవరుకోటు వేసుకున్నాడు. వెడల్పాటి లాగులు యెప్పట్నుంచో ఫాషన్‌గా వుంటూ వున్నా తను యింకా బిగుతు లాగునే తొడుక్కున్నాడు. అతని ముఖం సామాన్యంగా, వెడల్పుగా వుంది. యేదో బెదురు వాలకం కనిపిస్తూ వుంది. కాని తన గరిమ చూపించాలన్న కోరిక దాంతో మిళితం అయింది. యిలాంటి వ్యక్తిని చూడగానే వాళ్ళకి చాలా నిరుత్సాహం కలిగింది.

''దయ చెయ్యండి, దయ చెయ్యండి'' అని అతను ఉదాసీన భావంతో వున్నట్టు కనిపించ ప్రయత్నిస్తూ గుమ్మం లోపలికి వెళ్ళి, జేబులోనుంచి తాళం తీసి తలుపు తెరిచేడు.

స్టూడియో లోపలికి వెళ్ళేక మిహైలొవ్ మళ్లీ యింకో సారి వాళ్ల కేసి చూశేడు. వ్రాన్‌స్కీ ముఖాన్ని, ముఖ్యంగా అతని చెక్కిళ్లని మనసులో ముద్రించుకున్నాడు. అతనిలో వున్న చిత్రకారుడి అంశ భవిష్యత్ ఉపయోగం కోసం సామగ్రిని నిరంతరంగా సేకరిస్తూ పని చేస్తూ వుంటుంది. తన చిత్రాలని వాళ్లకి చూపించే క్షణం దగ్గర పడుతూ వుండడం వల్ల అతనికి ఆందోళన యెక్కువ అవుతూ వున్నా అగోచర చిహ్నాలతో సూక్ష్మంగా ఆ ముగ్గురి గురించీ అతను మనసులో ధారణ చేస్తూనే వున్నాడు. అతను (గొలెనీశ్చెవ్) యిక్కడే వుంటూన్న రష్యన్. అతని పేరేమిటో యెక్కడ కలుసున్నారో, యేం మాట్లాడుకున్నారో మిహైలొవ్‌కి గుర్తులేదు. అతని ముఖం మాత్రమే గుర్తు వుంది, తను చూసిన ముఖాలన్నీ గుర్తు వున్నట్టుగానే. కాని యీ ముఖాన్ని కుహనా ప్రాముఖ్యం వ్యక్తంచేసే బాహిర ఆకృతితో, అభివ్యక్తి హీనంగా వుండే ముఖాల సముహంలోకి నెట్టేసి మనసులో ఆ విభాగంలో వో మూల పడేశాడు అనీ గుర్తు వచ్చింది. గుబురు జుట్టు, విశాలమైన నుదురు పైకి గొప్పతనం భాసింప చేస్తున్నాయి కాని ముఖంలో కొంచెం క్షుద్రతరహా చంచలభావం నాసికా దూలం పైన సన్నగా కేంద్రితమై కనిపిస్తోంది. వ్రాన్‌స్కీ, అన్నాలు ఐశ్వర్యవంతులైన ప్రముఖ రష్యన్లు అయివుంటారనీ, ఐశ్వర్యవంతులైన రష్యన్లందరిలాగానే కళ గిళ యేమీ తెలియని వాళ్లనీ కాని కళా ప్రియులలాగా, కళాభిరుచి కల వాళ్లలాగా వాలకం పెడుతూ వుంటారనీ మిహైలొవ్ వూహించేడు. 'వీళ్లు పాత కళా క్షేత్రాలన్నీ చూసేసి యిప్పుడు నవీన చిత్రకారుల స్టూడియోలని పట్టినట్టున్నారు. జర్మన్ దగా చిత్రకారుడు, రాఫేల్ పూర్వ శైలీ వైఖరి,* టక్కరి ఇంగ్లీషు వాడ్నీ చూసేసి వుంటారు. యిక యేమీ మిగల్లేదు అనిపించుకోడానికి నా దగ్గరికి వచ్చి వుంటారు' అని అతను అనుకున్నాడు. అతనికి కళాప్రియుల ధోరణి బాగా తెలుసు (వాళ్లు యెంత గ్రహణ శక్తిగల వాళ్లైతే అంత అధ్వాన్నంగా వుంటారు). వాళ్లు సమకాలీన కళాకారుల స్టూడియోలని దర్శించడం యెందుకంటే కళ దిగజారిపోయిందనీ, నవీన చిత్రకారుల చిత్రాలని చూసే కొద్దీ పాత కాలం చిత్రకారుల మహత్తర చిత్రాలు యెంత అసామాన్యమైనవో అర్థం అవుతుందనీ చెప్పగలిగే అధికారం సంపాదించడం కోసమే. మిహైలొవ్ దీన్నంతటినీ వూహించేడు. వాళ్ల ముఖాల్లో యిదంతా అతనికి కనిపించింది. అక్కడ వున్న ప్రతిమల్ని, బొమ్మల్ని చూస్తూ తమలో తాము మాట్లాడుకుంటూ, బేఫర్వాగా అక్కడ తిరుగుతూ, అతను పెద్ద చిత్రం మీది తెర యెప్పుడు తీస్తాడా అని చూస్తూ వుండేవాళ్ల ఉదాసీన తేలిక భావం అతనికి కనిపించింది. అయినా గానీ రేఖా నమూనా చిత్రాలని పరుస్తూ, వాటిమీద కప్పిన తెరల్ని తొలగిస్తూ వుండగా అతని ఆందోళన యెక్కువ అయింది. అతని ఆందోళన యెక్కువవడానికి ముఖ్యమైన మరో హేతువూ వుంది. ఐశ్వర్యవంతులూ, ప్రముఖులూ అయిన రష్యన్లు అందరూ మొర

టుగా, బుద్ధావతారాల్లా వుంటారన్న అభిప్రాయం తనకి వున్నా అతనికి వ్రాన్‌స్కీ పట్లా, ముఖ్యంగా అన్నా పట్లా యిష్టత కలిగింది.

"దీన్ని దర్శించండి" అని అతను అగల్ బగల్ నడకతో వో పక్కకి వెళ్లి వో బొమ్మని చూపిస్తూ అన్నాడు. "పైలేట్ ముందు క్రీస్తు, మాథ్యూ — 27" అని పెదాలు ఉత్తేజంతో వణుకుతూ వుండగా అన్నాడు. అతను పక్కకి తప్పుకుని వాళ్ల వెనక నుంచున్నాడు.

వాళ్లు మౌనంగా చిత్రాన్ని చూస్తూ వున్నంత సేపూ మిహైలొవ్ కూడా దానికేసి పై వాడిలాగా, నిష్పక్షపాతంగా చూశేడు. ఆ కాసిని క్షణాల్లోనూ తను కొంచెం సేపటి కితం తిరస్కారపూరిత దృష్టితో చూసిన వాళ్లు చాలా న్యాయమైన ఉత్తమమైన అభిప్రాయాన్ని ఆ చిత్రం గురించి చెప్తారని అతను మనసులో అనుకున్నాడు. తను ఆ చిత్రం గురించి అనుకున్నదంతా, దాన్ని గీస్తూ వుండిన ఆ మూడేళ్లల్లోనూ అనుకున్నదంతా అతను మర్చిపోయేడు. ఆ చిత్రానికి తను నిస్సందేహంగా వున్నాయనుకున్న సొంపు లక్షణాలన్నీ మర్చిపోయేడు. యిప్పుడతను దానికేసి కొత్తగా, పరాయివాడి నిష్పక్షపాత దృష్టితో చూశేడు, అతనికి అందులో చెప్పుకో దగిందేమీ కనిపించలేదు. చిత్ర అగ్రభాగంలో చిరచిరలాడే పైలేట్ ముఖం, క్రీస్తు శాంత వదనం కనిపించేయి. వెనక భాగంలో పైలేట్ పరిచారకులు, అలాగే అక్కడ జరుగుతూ వున్న దాన్ని చూసే జాన్ వదనం కనిపించేయి. యెంతో గవేషణ, యెన్నో తప్పులు, మరెన్నో మార్పులు జరిగిన వాటి ఫలితంగా విశిష్ట చరిత్రతో తన అంతరంగంలో రూపొందిన ఆ ప్రతి వదనం, అతనికి యెంతో మానసిక శ్రమనీ, సుఖాన్నీ కూడా ప్రసాదించిన ఆ ప్రతి వదనం, సముచిత రూపంలో సమతుల ప్రభావం కలిగించేందుకు యెన్నో సార్లు చిత్ర స్థానంలో, వదనాల్లో మార్పులు చేర్పులు చేసిన అవన్నీ, యెంతో ప్రయాస పడి సాధించిన ఆ వర్ణ ఛాయలు పోణిములు అన్నీ — పరాయి వాడి లాగా చూసినప్పుడు చాలా సామాన్యంగా, పౌనఃపున్యంగా చెప్పిన విషయంలాగా కనిపించాయి. అతనికి యెంతో ప్రియమైన క్రీస్తు వదనం, చిత్రంలో కేంద్ర బిందువుగా వున్నటువంటిది, తను గవేషించి సాధించినప్పుడు పారవశ్యపూరితం చేసినటువంటిది పరాయి వాళ్ల కళ్లతో చూసినప్పుడు మహత్వహీనంగా కనిపించింది. అతను బాగా చిత్రించిన (బాగా చిత్రించడం కాదు, యేమంటే అతనికి అందులో చాలా దోషాలు కనిపిస్తున్నాయి) ఆ సైనికులతో, పైలేట్‌తోబాటు టిట్సియాన్, రాఫేల్, రూబెన్స్‌ల* చిత్రాల్లో లెక్కకు మించిన సార్లు చిత్రితమైన క్రీస్తు చిత్రం గోచరమైంది. అదంతా యేదో తుచ్ఛంగా, సామాన్యంగా పురాతన రీతిలో చిత్రించినదిగా — పరమ రసహీనంగా పేలవంగా కనిపించింది. వాళ్లు చిత్రకారుడి సమక్షంలో ఆహా ఓహో అని మెచ్చుకోలు మాటలు చెప్పి, ముఖం చాటయాక వెక్కిరించుకుంటూ నవ్వుతాలు మాటలు ఆడుకోవడంలో అయ్యో పాపం అని అతన్ని గురించి అనుకోవడంలో తప్పేమీ వుండదు అనిపించింది.

అక్కడి నిశ్శబ్దం (యింతా చేసి అది క్షణం కంటే యెక్కువ లేకపోయినా) అతనికి

భారంగా కనిపించింది. నిశ్శబ్దాన్ని భంగించడానికీ, తను మనసులో బెదరలేదని చూపించడానికీ అతను చిక్కబట్టుకుని గొలెనీశ్చెవ్‌నీ ఉద్దేశిస్తూ మాట కదిపేడు.

''మిమ్మల్ని యిదివరకే కలుసుకున్న అదృష్టం నాకు కలిగిందనుకుంటాను'' అని బెరుగ్గా అన్నాకేసీ వ్రాన్‌స్కీకేసీ, వాళ్ల ముఖాల్లో గోచరమయే యే భావాన్నీ తప్పిపోనివ్వకూడదన్నట్టు, చూశేడు.

''కలుసుకోక పోవడమేమిటి? రోస్సీల యింటి దగ్గర కలుసుకున్నాం, గుర్తులేదూ? ఆ ఇటాలియన్ అమ్మాయి – నూతన రాషేల్* – కవిత్వం చదివినప్పుడు'' అని గొలెనీశ్చెవ్ యే మాత్రం సంకోచం లేకుండా చిత్రంమీదనుంచి దృష్టి మళ్లించి అతనికేసి తిరిగి అన్నాడు.

కాని మిహైలొవ్ చిత్రం గురించి తన అభిప్రాయం యేమిటో తెలుసుకోవా లనుకుంటున్నాడని గమనించి చెప్పాడు:

''కిందటి సారి నేను చూసిన దాని కంటే మీ చిత్రం చాలా ముందుకు సాగింది. అప్పటిలాగానే యిప్పుడు కూడా నన్ను పైలేట్ ఆకృతి ఆశ్చర్యచకితం చేస్తోంది. అతని స్వభావాన్ని చాలా బాగా వ్యక్తం చేశారు. దయాళువైన యీ మనిషి అణువణువునా ఉద్యోగ నిర్వాహకుడిగా 'తను యేం చేస్తున్నదీ తనకే తెలియని వాడు'గా చాలా బాగా రూపు కదుతున్నాడు. కాని నాకనిపించడం...''

మిహైలొవ్ భావయుక్త వదనం అనుకోకుండా విరిసింది, అతని కళ్లల్లో మెరుపు మెరిసింది. అతను యేదో చెప్పాలనుకున్నాడు, కాని భావావేశంవల్ల యేమీ చెప్పలేక, గొంతు సవరించుకుంటున్నట్టు నటించేడు. కళని అవగాహన చేసుకుని అభినందించే గొలెనీశ్చెవ్ క్షమతని తను యెంత తక్కువ అంచనా వేసినా, పైలేట్ ముఖం అధికారి భావంతో గోచరమైందన్న అభిప్రాయం యెంత సాదాగా వున్నా, అన్నిటికంటే ఘనంగా వుండే వాటిని వదిలేసి సాదా వాటి గురించి వ్యాఖ్యలు మొదట చెయ్యడం కష్టం కలిగిస్తూ వున్నా ఆ అభిప్రాయం మిహైలొవ్‌కి మహదానందం కలిగించింది. పైలేట్ గురించి గొలెనీశ్చెవ్ చెప్పిందే తన అభిప్రాయమూనూ. గొలెనీశ్చెవ్ వ్యాఖ్య లక్షల కోట్ల యితర వ్యాఖ్యలలో వొకటిగా వుండేదే అయినా, అవన్నీ సమంజసమేనని మిహైలొవ్‌కి తెలిసి వున్నా ప్రస్తుతం గొలెనీశ్చెవ్ వ్యక్తం చేసిన వ్యాఖ్య మహత్వం మాత్రం అతనికి తక్కువగా కనిపించలేదు. ఆ వ్యాఖ్యతో అతని మనసులో గొలెనీశ్చెవ్ పట్ల స్నేహ భావం పొంగిపొర్లింది. మనసులోని దిగులు పటాపంచలైపోయి దాని స్థానంలో తెలియకుండానే ఆనందం వెల్లి విరుస్తూ వచ్చింది. వెంఠనే అతని చిత్రం సంపూర్ణంగా జాగృతమై వర్ణించలేని జటిలతతో సజీవమైంది. తను పైలేట్‌ని అర్థం చేసుకున్న పద్ధతి అదీ అని మిహైలొవ్ చెప్పబోయేడు. గాని మళ్లీ అతని పెదాలు కంపించి మాట్లాడలేకపోయేడు. జనం మామూలుగా ప్రదర్శనశాలల్లో మాట్లాడుకునేటట్టు అన్నా, వ్రాన్‌స్కీలు లోగొంతుకలో మాట్లాడుకున్నారు. చిత్రకారు

డికి యేరకమైన కష్టం కలగకుండా వుండాలన్న మేరకు మెల్లిగా మాట్లాడుకున్నారు. అలాగే, కళా ప్రదర్శనలని చూసేటప్పుడు సునాయాసంగా వచ్చే చులకన మాటలు గొంతు పైకి యెత్తి అనకూడదనే దానివల్ల కూడా మెల్లిగా మాట్లాడుకున్నారు. ఆ చిత్రం వాళ్లనీ ప్రభావితం చేసిందని మిహైలొవ్‌కి అనిపించింది. అతను వాళ్ల దగ్గరికి వెళ్లేడు.

"క్రీస్తు వదనం యెంత అద్భుత భావద్యోతకంగా వుంది!" అని అన్నా వ్యాఖ్యానించింది. ఆ భావం ఆమెని బాగా అలరించింది. చిత్రంలో కేంద్ర బిందువు అదేనని ఆమెకి అనిపించింది. అంచేత దాన్ని మెచ్చుకుంటే చిత్రకారుడికి తృప్తిగా వుంటుందని ఆమెకి అనిపించింది. "పైలేట్ పట్ల జాలి కనబరుస్తూ వుందీ వదనం" అంది.

ఆ చిత్రం గురించీ, క్రీస్తు రూపం గురించీ యెవళ్లేనా వ్యక్తం చేసే లక్షలాది అభిప్రాయాల్లో యిదీ వొకటి. క్రీస్తు పైలేట్ పట్ల జాలిగా వున్నాడని ఆమె అంది. క్రీస్తు భావం దయాపూర్ణంగా తప్ప అన్యంగా వుండలేదు, యేమంటే ప్రేమ, అలౌకిక శాంతి, మృత్యు తత్పరత, శాబ్దిక నిస్సారత వెల్లడి చేసే భావ చేతన అది. పైలేట్ భావం విధి నిర్వహణోద్యోగిగా క్రీస్తు భావం దయా మూర్తిగా తప్ప వుండలేవు. యేమంటే వొకరు దేహభూత మూర్తులు, రెండవ వారు ఆత్మభూత మూర్తులు. యీ ఆలోచనలు, వేరే ఆలోచనలూ మిహైలొవ్ మనసులో తిరుగాడేయి. మళ్లీ అతని ముఖం సంతోషంతో మెరిసింది.

"యీ బొమ్మ యెంత అద్భుతంగా వుంది! యెంత గాలి చుట్టూతా వుంది! యెవళ్లేనా చుట్టూతా నడవచ్చు!" అని గొలెనీశ్చెవ్ అన్నాడు. తను చేసిన యీ వ్యాఖ్యద్వారా ఆ బొమ్మ ఆ భావాలూ తనకి నచ్చలేదని తెలియ చెయ్యాలని అనుకుంటున్నట్టు స్పష్టమైంది.

"అవును, అద్భుత కళా శిల్పం వుంది" అన్నాడు వ్రాన్‌స్కీ. "వెనక వున్న ఆ రూపాలు యెంత స్పష్టంగా కనిపిస్తున్నాయి. దీన్నే శిల్పం అంటారు" అని అతను గొలెనీశ్చెవ్ సంబోధించి అన్నాడు. తమ మధ్య జరిగిన సంభాషణని సూచిస్తూ అలాంటి శిల్ప నైపుణ్యం తనకి ప్రాప్తమవదన్నట్టు వ్రాన్‌స్కీ విచారం వ్యక్తం చేశాడు.

"అవునవును నిజంగా అద్భుతం!" అని గొలెనీశ్చెవ్ అన్నా బలపరిచేరు. సంతోషంతో ఉత్తేజంగా వున్నా శిల్ప సంబంధమైన వ్యాఖ్యతో మిహైలొవ్ హృదయంలో రాయి పడ్డట్టైంది. వ్రాన్‌స్కీకేసి చురచుర చూసి మూతి ముడుచుకున్నాడు. అతను శిల్ప నైపుణ్యం అనే మాట చాలా సార్లు విన్నాడు గాని దాని అర్థం యేమిటైందీ యిదమిత్థంగా బోధపడింది కాదు. వస్తువు ప్రమేయం లేకుండా యాంత్రికంగా చిత్రించే సామర్థ్యాన్ని సూచించడానికి ఆ పదాన్ని వాడడం అతను యెరుగును. యిప్పుడు వ్రాన్‌స్కీ ప్రశంసించిన రీతిలోనే అతను అంతర్గత గుణానికి పోటీగా శిల్పాన్ని పెట్టడం చాలా సార్లు గమనించేడు. చెడ్డ దాన్నుంచి మంచి చిత్రాన్ని తయారు చెయ్యడం కుదిరేటట్టు! మౌలిక చిత్రాన్ని అనావిద్ధంగా వుంచుకుంటూ వూహల్ని అనావృత్తం చేసి రూపం యివ్వడానికి యెంతో యేకాగ్రత, మనస్కారం అవసరం అనీ, యెంత వరకూ చిత్రణ కళకీ లేదా శిల్పానికీ సంబంధం వుంటుందో

అది యిక్కడ లేనే లేదు అనీ అతనికి తెలుసు. తను చూడగలిగేది వో పిల్లాడికో, వంటవాడికో కనిపించగలిగితే వాళ్లు కూడా అనావృత్తం చెయ్యగల సమర్థులుగానే వుంటారు. యెంతో సిద్ధహస్తుడైన, కౌశల్యంగల చిత్రకారుడు కూడా, తను చిత్రిస్తున్న వస్తువు సీమ రేఖలు ముందే మనోగోచరం కాకపోతే యాంత్రిక సామర్థ్యంమీదనే ఆధారపడి యేమీ చిత్రించలేడు. అదీగాక సంభాషణ శిల్ప సంబంధమైన చర్చమీద సాగితే తనని మెచ్చుకునేందుకు లేదని అతనికి కనిపిస్తూనే వుంది. అతను చిత్రించిన వాటిలోనూ, యింకా చిత్రిస్తూ వున్న వాటిలోనూ చూడ్డానికి మంట పుట్టించే నెరసులు యెన్నో కనిపిస్తూ వున్నాయి. అవి అజాగ్రత్తగా తన వూహల్ని అనావృత్తం చేసిన దాని ఫలితం, యిప్పుడు చిత్రాన్ని పాడు చెయ్యకుండా ఆ నెరసుల్ని తొలగించడం సాధ్యం కాదు. యీ బొమ్మలోనే అన్ని ముఖాల్లోనూ, ఆకృతుల్లోనూ యెలాంటి నెరసులు అతనికి కనిపిస్తున్నాయంటే చిత్రాన్ని అవి పాడు చేస్తున్నాయి.

"తమరి అభ్యంతరం లేకపోతే వో మాట చెప్తా" అన్నాడు గొలెనీశ్చెవ్.

"మహా సంతోషం, సెలవియ్యండి" అని మిహైలొవ్ తెచ్చి పెట్టుకున్న మంద హాసంతో అన్నాడు.

"యేమీ లేదు, మీరీ చిత్రంలో మానవ రూపంలో వున్న భగవంతుని ప్రదర్శించారని భగవద్రూప మానవుణ్ణి కాదు అని, మీరలా భావించారనే నేననుకుంటున్నాను."

"నా హృదయంలోలేని క్రీస్తుని నేను చిత్రించలేను" అని మిహైలొవ్ చిన్న బుచ్చు కుంటూ జవాబిచ్చేడు.

"ఆఁ, అలా అయితే, నా మనసులో మాట చెప్పనియ్యండి... మీ చిత్రం చాలా అద్భుతంగా వుంది కాబట్టి నా అభిప్రాయం వల్ల దానికి లోటు రాదనుకోండి, అదీగాక అది నా వ్యక్తిగత అభిప్రాయం. మీకు వర్తించదు. మీ విషయం వేరు. ఉదాహరణకి ఇవానొవ్*ని తీసుకోండి. క్రీస్తుని చారిత్రక వ్యక్తి కిందికి దించదలచుకుంటే ఇవానొవ్ వేరే కొత్త, అస్పృశిత, చారిత్రక విషయాన్ని యెంచుకోవడం మంచిదని నా అభిప్రాయం."

"కాని కళకి సంబంధించి యిదే మహత్తర విషయం అయితే?"

"వెదికితే అనేక విషయాలు దొరుకుతాయి. కాని అసలు విషయం యేమంటే కళ వాదననీ, తాత్పర్య వ్యాఖ్యానాలనీ సహించదు. నమ్మేవాళ్లకీ నమ్మని వాళ్లకీ ఇవానొవ్ చిత్రం వొక్కలాంటి సందేహాల్ని రేకెత్తిస్తుంది: ఆయన భగవంతుడా కాదా? మరి అది యేకైక రసోద్దీపనకి నష్టం కలిగిస్తుంది."

"కాని అలా యెందుకని? విద్యావంతులకి యిలాంటి వాదమే ఉత్పన్నం కాదు" అన్నాడు మిహైలొవ్.

గొలెనీశ్చెవ్ ఆ మాట వొప్పుకోలేదు. యేకైక రసోద్దీపన కలిగించాలన్నది కళకి మూలం అని తన వాదనని రొక్కిస్తూ మిహైలొవ్‌ని పడగొట్టేశాడు.

మిహైలొవ్‌కి ఆవేశం వొచ్చింది కాని తన వాదనకి సమర్థనగా యేమీ చెప్పలేకపోయేడు.

అన్నా, వ్రాన్‌స్కీలు తమ మిత్రుడి పాండిత్యపూరిత వాచాలత్వంవల్ల కొంచెం సేపటిదాకా వొకళ్లకేసి వొకళ్లు చూసుకుంటూ వుండిపోయేరు. ఆఖరికి, మిహైలొవ్ ముందుకు వెళ్లేదాకా ఆగకుండా వాళ్లు మరో చిన్న చిత్రంకేసి నడిచేరు.

"ఆహా! యెంత సుందరంగా వుంది! మణిపూస! అద్భుతం! యెంతటి మహత్తర చిత్రం" అని యిద్దరూ వొక్క సారే చకితులై అన్నారు.

'యేమిటిందులో కనిపించే గొప్పతనం!' అని మిహైలొవ్ అనుకున్నాడు. మూడేళ్ల నాడు గీసిన యీ చిత్రం గురించి అతను మరిచేపోయేడు. వరసగా రాత్రీ పగలూ కొన్ని నెలల పాటు ఆ చిత్రం గీసేటప్పుడు తనకి కలిగిన యాతనల్నీ, తను పొందిన సంతోషాన్నీ అతను మర్చిపోయేడు. పూర్తిచేసిన అన్ని చిత్రాల గురించీ మరిచిపోయినట్టుగానే దీన్ని గురించీ మర్చిపోయేడు. అతనికా చిత్రాన్ని చూడ్డం కూడా యిష్టం లేదు. ఒక ఇంగ్లీషాయన దాన్ని కొంటా ననుకున్నందువల్ల యిప్పుడు దాన్ని యివతలికి తీశేడు.

"ఓ, దీన్ని యెప్పుడో గీశేను" అన్నాడు.

"యెంత ముచ్చటగా వుంది" అని గొలెనీశ్చెవ్ కూడా అన్నాడు. అతనికి ఆ చిత్రం బాగా నచ్చినట్టే వుంది.

ఒక విల్లో చెట్టు నీడలో కూర్చుని యిద్దరు అబ్బాయిలు గాలాల్తో చేపలు పడుతున్నారు. వాళ్లల్లో పెద్దవాడు అంతకు కొంచెం సేపటి కితమే గాలాన్ని నీళ్లల్లో వేసి పూర్తిగా ఆ పనిలోనే మునిగిపోయేడు. యెంతో శ్రమ పడి పొదల వెనకనుంచి బెండుని లాగుతున్నాడు. యితనికంటే చిన్నవాడైన రెండవ వాడు గడ్డిమీద పడుకుని ఆలోచనలో మునిగిపోయిన నీలి కళ్లతో నీళ్లకేసి చూస్తూ వున్నాడు. అతని అందమైన జుట్టు రేగిపోయి వుంది. అతను దేన్ని గురించి ఆలోచిస్తున్నాడు?

వాళ్లు ఆ చిత్రాన్ని యెంతగానో మెచ్చుకోవడంతో మిహైలొవ్ మనసులో ఆ చిత్రం గీసేటప్పుడు వున్న ఉత్తేజ భావం తిరిగి తలెత్తింది. పూర్తి చేసిన చిత్రాల పట్ల అలాంటి వ్యర్థ భావాలంటే అతనికి భయం, అది అతనికి యిష్టం వుండదు. అందుకని దాన్ని గురించిన ప్రశంసలు విన్నప్పుడు సంతోషం కలిగినా అతను మూడో చిత్రంకేసి వాళ్ల దృష్టిని మళ్లించాలనుకున్నాడు. కాని ఆ చిత్రం అమ్మకానికి వుందా లేదా అని వ్రాన్‌స్కీ అడిగేడు. వాళ్ల రాకతోనే చాలా ఆందోళన పడుతూ వున్న మిహైలొవ్‌కి డబ్బు గొడవల ప్రస్తావనలోకి దిగడానికి యిష్టం లేకపోయింది.

"దీన్ని అమ్మడానికే సిద్ధం చేశాను" అని అతను ముఖం ముడుచుకుంటూ అన్నాడు.

వాళ్లు వెళ్లిపోయేక మిహైలొవ్ పైలేట్ సముఖంలో క్రీస్తు వున్న చిత్రం ముందు కూర్చుని వాళ్లు చెప్పిన వాటిని గురించీ, మాటల్లో చెప్పకుండా సూచించిన అభిప్రాయాల

గురించీ నెమరు వేసుకున్నాడు. వాళ్లు వున్నప్పుడు తను వాళ్ల దృష్టితో చూసినప్పుడు కనిపించినవన్నీ యిప్పుడు యేమీ గొప్పగా అనిపించలేదు. అది వింతగా వుంది. అతను తన నిజమైన కళాత్మకతతో ఆ చిత్రాన్ని చూడడం మొదలుపెట్టేడు. దాని నిర్దుష్టత గురించిన ఆత్మ విశ్వాసం, అలాగే దాని ప్రాముఖ్యం అతనికి అందేయి. యివి మిగిలిన అన్ని ఆసక్తులనీ అవహేళన చేసే యేకాగ్రత సాధించడానికి ముఖ్యం, కేవలం దానివల్లనే అతను పని చెయ్య గలుగుతాడు.

క్రీస్తు కాలిని ముందుకు కనిపింప చేయడం బాగా లేదు. అతను వర్ణపట్టికని తీసుకుని పని చెయ్యడం మొదలుపెట్టాడు. కాలుని సరిచేస్తూ అతను వెనక భాగంలో వున్న జాన్ ఆకృతిని చూశేడు. దాన్ని వాళ్లు చూడలేదు, కాని అది కళకి పరాకాష్ఠ అని అతనికి తెలుసు. కాలిని సవరించడం అయేక జాన్ ఆకృతి పని చూద్దామనుకున్నాడు కాని యెంతో భావ వివశుడైపోయి చెయ్యలేకపోయేడు. ఉదాసీన మనస్థితి వున్నప్పుడు పని చెయ్యలేడు, అలాగే అతను తీవ్ర భావావేశితుడైనప్పుడూ పని చెయ్యలేడు, అప్పుడతనికి అన్నీ మరీ స్పష్ట రూపంలో కనిపిస్తాయి. ఉదాసీన స్థితినుంచి తీవ్రభావావేశ దిశకి అంతరం వుంది, వొక దశలో మాత్రమే పని చెయ్యగలడు. యిప్పుడతను చాలా భావావేశితుడై వున్నాడు. అతను చిత్రాన్ని కప్పేద్దామనుకున్నాడు కాని తెరమీద చెయ్యి వేసి ఆగిపోయేడు. పెదాలమీద హర్ష మందహాసం లాస్యం చేసింది. చాలా సేపు జాన్ ఆకృతికేసి చూస్తూ నుంచుండి పోయేడు. ఆఖరికి చిత్రాన్ని విడిచి వెళ్లిపోవడం బాధ కలిగించినట్టు అతను దాన్ని తెరతో కప్పి, అలిసిపోయినట్టుగా, అయినా సంతోష ప్రఫుల్లంగా యింటికి వెళ్లేడు.

ఇంటికి తిరిగివెళ్లిపోతూ వ్రాన్‌స్కీ, అన్నా, గొలెనీశ్చెవ్ విశేషంగా ఉల్లాసభరితులై, జీవంతో తొణికిసలాడుతూ మాట్లాడుకున్నారు. మిహైలొవ్ గురించీ, అతని చిత్రాల గురించీ చర్చించుకున్నారు. 'ప్రతిభ' అనే పదం వాళ్ల సంభాషణలో పునరుక్తంగా వినిపించింది. వాళ్ల అభిప్రాయం ప్రకారం అది జన్మతః సిద్ధించే దాదాపు వొక శారీరక సామర్థ్యం, మస్తిష్క హృదయాలమీద ఆధార పడనటువంటిది. చిత్రకారుడికి అనుభూతం అయిన ప్రతిదానికీ వాళ్లా పేరు తగిలించాలనుకున్నారు. యేమంటే వాళ్లకి యేమీ అర్థం కాని దాన్ని అభివ్యక్తీకరించడానికి ఆ పదం వాళ్లకి అవసరంగా కనిపించింది. అతనికి ప్రతిభ వుందనడంలో సందేహమే లేదనీ కాని విద్య లేకపోవడంవల్ల అది కుంటు పడిందనీ విద్య లేకపోవడమే మన రష్యన్ చిత్రకారులందరి దురదృష్టం అనీ అనుకున్నారు. యేమైనా ఆ యిద్దరు అబ్బాయిలు వున్న చిత్రం వాళ్లకి బాగా హత్తుకుంది, తడవతడవకీ దాని ప్రస్తావనే చేసుకున్నారు.

"యెంత మణిపూస! అంత అలవోకగా యెలా సాధించగలిగేడు! అది యెంత గొప్పగా వుందో కూడా అతను గ్రహించలేకపోతున్నాడు. దీన్ని చెయ్యి జారిపోనివ్వకూడదు, కొనెయ్యాలి" అన్నాడు వ్రాన్‌స్కీ.

# 13

మిహైలొవ్ తన చిత్రాన్ని వ్రాన్‌స్కీకి అమ్మేడు. అన్నా చిత్రాన్ని గియ్యడానికి వొప్పు కున్నాడు. అనుకొన్న రోజుకి అతను వచ్చి బొమ్మ గియ్యడం మొదలుపెట్టేడు.

అయిదవ సారి కూర్చునేటప్పటికల్లా చిత్రం అందరికీ ముఖ్యంగా వ్రాన్‌స్కీకి, రూప తులన రీత్యానే కాకుండా, ఆమె విశిష్ట సౌందర్యాన్ని ప్రతిఫలించడంవల్ల కూడా ఆశ్చర్య చకితంగా కనిపించింది. 'మిహైలొవ్ యింత గొప్పగా యెలా గియ్యగలిగేడు! ఆమెలో అన్నిటి కంటే అతీతంగా వుండే ప్రియమైన ఆత్మిక లక్షణాన్ని కనిపెట్టేటందుకు నాకులాగా ఆమెని యెరిగి వుండడం, ప్రేమించడం అవసరం' అనుకున్నాడు వ్రాన్‌స్కీ. నిజానికి ఆ చిత్రమే అతనికా అతీత ప్రియమైన ఆత్మిక లక్షణాన్ని యెరుక పర్చింది. కాని ఆ లక్షణం యెంత వాస్తవికంగా వుందంటే అతనూ, అలాగే యితరులూ దాన్ని యెప్పట్నుంచో యెరిగి వున్నట్టుగా భావించుకున్నారు.

"యెంత కాలంగానో తన్నుకులాడుతున్నాగాని యేమీ లాభం లేకుండా వుంది" అని వ్రాన్‌స్కీ తను గీసే చిత్రం గురించి అన్నాడు. "అతనేమో యిలా వచ్చేడు అలా గీసేశాడు. మరి దాన్నే శిల్పం అంటారు" అన్నాడు.

"నీకూ పట్టుబడుతుందిలే" అని గొలెనీశ్చెవ్ వూరట కలిగించే మాట అన్నాడు. అతని దృష్టిలో వ్రాన్‌స్కీకి ప్రతిభ వుంది, అంతకంటే ముఖ్యమైన విద్య వుంది. దానివల్ల అతనికి కళ పట్ల ఉన్నత దృక్పథం యేర్పడింది. వ్రాన్‌స్కీ ప్రతిభ పట్ల గొలెనీశ్చెవ్ విశ్వాసం వ్రాన్‌స్కీ తన వ్యాసాల్నీ అభిప్రాయాల్నీ మెచ్చుకోవాల్సిన అవసరంవల్ల కూడా బలపడింది. మెచ్చికోలు, సమర్థన పరస్పరంగా వుండాలి అని అతని అనుభవం చెప్పింది.

పరాయి యిళ్లల్లో, ముఖ్యంగా వ్రాన్‌స్కీ పలాజ్జోలో, మిహైలొవ్ తన స్టూడియోలో వున్నలాంటి వ్యక్తిగా కాక పూర్తి భిన్నంగా వుండేవాడు. అతను మర్యాదగా దూరంలో వుండి పోయేవాడు, తను మన్నించలేని వాళ్లకి దగ్గరవాలంటే భయపడినట్టు. అతను వ్రాన్‌స్కీని యెప్పుడూ 'హుజూర్' అనే పిలిచేవాడు. వ్రాన్‌స్కీ, అన్నా యెన్ని సార్లు వుండమని పిలి చినా భోజనానికి వుండేవాడు కాదు, చిత్రం గీసే సందర్భాలలో తప్ప వాళ్ల యింటికి వెళ్లే వాడు కాదు. అన్నా చాలా మంది పట్లకంటే యితని పట్ల యెక్కువ ఆర్ద్ర భావాన్ని కన బర్చేది. ఆ బొమ్మకి గాను కృతజ్ఞత చూపించేది. వ్రాన్‌స్కీ అతని పట్ల కొంచెం యెక్కువ నమ్రత చూపించేడు. తన చిత్రం గురించి అతని అభిప్రాయం యేమిటో తెలుసుకోవాలని అనుకున్నట్టు వుంది. మిహైలొవ్‌కి కళ పరమార్థం బోధ పరచాలన్న పట్టుదలని మాత్రం గొలెనీశ్చెవ్ చెయ్యి జారనిచ్చుకునేవాడు కాదు. కాని మిహైలొవ్ ఆ అందరిపట్లా వొకే రీతి ఉదాసీనతతో వున్నాడు. తనకేసి చూడ్డం మిహైలొవ్‌కి సంతోషంగా వుందనీ కాని అతను తనతో మాట్లాడ్డం తప్పించుకుంటున్నాడనీ అన్నా గ్రహించింది. వ్రాన్‌స్కీ

చిత్రకళ గురించి తనతో చర్చ చేసినప్పుడు అతను మౌనంగా వుండిపోయేవాడు, వ్రాన్‌స్కీ తన చిత్రాన్ని చూపించినప్పుడూ అంతే మౌనంగా వుండిపోయేవాడు. గొలెనీశ్చెవ్ సొద వినడం యేదో పరీక్షలాగా వుండేది కాని అతనితో యెప్పుడూ వాదించేవాడు కాదు.

మిహైలొవ్ బాగా పరిచయం అయేక అతని ముభావం, అనిష్టకరమైన, యింకా చెప్తే విద్వేషపూరిత, వైఖరి వాళ్లకి వొరుసుకున్నట్టుగా కనిపించేయి. బొమ్మ గియ్యడం పూర్తయాక వాళ్ల చేతుల్లోకి చక్కటి చిత్రం వచ్చింది, అతను రావడం మానేశాడు. అప్పుడు వాళ్లకి తెరిపిన పడ్డట్టు అనిపించింది.

వ్రాన్‌స్కీ అంటే మిహైలొవ్‌కి అసూయ అన్న అభిప్రాయాన్ని, అందరి మనసుల్లోనూ వున్న ఆ అభిప్రాయాన్ని మొదట పైకి గొలెనీశ్చెవ్ వెల్లడి చేశాడు.

"చూడు, ఈర్ష్య అని అనకూడదనుకో, యేమంటే అతనికి ప్రతిభ వుంది. కాని సంపన్న కుటుంబం వాడు, కౌంట్ (వాళ్లందరూ బిరుదుల్ని అసహ్యించుకుంటారు తెలుసా) యే ప్రత్యేక శ్రమా లేకుండా, తనకంటే బాగా కాకపోయినా, తనకిలాగా గియ్యడం, – మరి తనేమో యావజ్జీవితం దీనికి అర్పించాడు – అతనికి మంటగానే వుంటుంది. అసలు కావాల్సింది విద్య, అదే అతనికి పూజ్యం."

వ్రాన్‌స్కీ మిహైలొవ్ పక్షాన సమర్థించేవాడు కాని అతని మనసు లోతుల్లో గొలెనీశ్చెవ్ మాట నిజమేనని అనిపించేది, యేమంటే మరో స్థాయికి, తక్కువ స్థాయికి చెందిన వాళ్లు ఈర్ష్యగా వుండే వుండాలి అని అతను అనుకున్నాడు.

ఆన్నా రెండు చిత్రాలూ మిహైలొవ్‌కీ తనకీ వున్న అంతరాన్ని చూపించి వుండాల్సింది, రెండూ ఆన్నాని యెదురుగా కూర్చోబెట్టుకుని గీసినవే. కాని అతను ఆ అంతరాన్ని చూడలేకపోయేడు. మిహైలొవ్ చిత్రం పూర్తయేక అతను తన చిత్రాన్ని వదిలేశాడు, వూరికే రెండు యెందుకు అనవసరం అనే భావంతోనే అలా చేశాడు. కాని మధ్య యుగాల నాటి జీవితం ప్రదర్శించే చిత్రాన్ని గియ్యడం మాత్రం మానలేదు. అతనికీ, గొలెనీశ్చెవ్‌కీ, ముఖ్యంగా ఆన్నాకీ అది అద్భుతంగా కనిపించింది, యేమంటే అది మిహైలొవ్ వాటికంటే యెక్కువ తమకి తెలిసిన సుప్రసిద్ధ చిత్రాలని పోలి వుంది.

మిహైలొవ్‌కి ఆన్నా చిత్రం గియ్యడం రంజించినా చిత్రం పూర్తయాక అతనికి యింకా యెక్కువ హాయిగా వున్నట్టనిపించింది. కళ గురించి తను యిక గొలెనీశ్చెవ్ సొద వినక్కర్లేదు, వ్రాన్‌స్కీ బొమ్మల గురించి శుభ్రంగా మరిచిపోవచ్చు. చిత్రాలు గియ్యకుండా వ్రాన్‌స్కీని తను ఆపలేడు. వ్రాన్‌స్కీ, యింకా అతనిలాగా కండూతి వున్న ఔత్సాహికులనేకమందీ తమ కిష్టమైన వాటిని తనివిదీరా చిత్రించుకోవచ్చు కాని అది తనకి వెలపరంగా వుంది. యెవడేనా మైనంతో బొమ్మ చేసుకుని దాన్ని ముద్దుపెట్టుకుంటూ వుంటే యెవళ్లూ అతన్ని ఆపలేరు. కాని ఆ బొమ్మని తీసుకుని వో ప్రేమికుడి దగ్గరికి వెళ్లి అతను తన ప్రియురాల్ని లాలించినట్టుగా లాలించడం సరసాలాడ్డం మొదలుపెడితే

అతనికి వెలపరంగా వుంటుంది. వ్రాన్‌స్కీ చిత్రం చూసి మిహైలొవ్‌కి అలాంటి వెలపరమే కలిగింది. అతనికా చిత్రం నవ్వుతాలుగా, చిరెత్తించేదిగా, జాలికొలిపేదిగా తోచింది, అసహ్యంగా కూడా కనిపించింది.

చిత్రకళపట్లా, మధ్య యుగాలపట్లా వ్రాన్‌స్కీ అభిరుచి యెక్కువ కాలం నిలవలేదు. చిత్రకళపట్ల అతనికి యెంత నికర అభిరుచి వుందంటే తను గీసే చిత్రాన్ని పూర్తి చెయ్యకుండా వుంచేశాడు. చిత్రం ఆగిపోయింది. లీలగా గోచరమవుతూ వున్న దాని లోపాలు ముందుకి సాగితే గనక కొండంతలుగా కనిపిస్తాయి అని అతనికి అస్పష్టంగా బోధపడింది. గొలెనీశ్చెవ్‌కీ మాదిరిగానే అతనికీ అయింది. చెప్పడానికి యేమీ లేదని గ్రహించే గొలెనీశ్చెవ్ తన భావాలు పరిపక్వం కాలేదనీ, యింకా పక్వం చేస్తున్నాననీ, విషయం సేకరిస్తూ వున్నాననీ ఆత్మ వంచన చేసుకుంటూ వుంటాడు. కాని అతనికి అది యాతనా కారకమూ, కటుత్వ కారకమూ అవుతుంది. వ్రాన్‌స్కీకి యాతనా లేదు, ఆత్మ వంచనా లేదు, అతను యెట్టి పరిస్థితిలోనూ కటువుగా తయారవడు. అంచేత తన వ్యక్తిత్వ విశిష్ట దృఢత్వానికి అనుగుణంగా అతను చిత్రకళకి నమస్కారం పెట్టేశాడు. అలా చేసినందుకు యే సంజాయిషీలు యివ్వలేదు, యే రకమైన సమర్థనల దాఖలాలూ చూపించలేదు.

కాని యీ వ్యాపృత్తి లేకుండా, తన నిరాశని అర్థం చేసుకోలేని ఆన్నాతో జీవితం అలానే సాగించడం ఆ ఇటాలియన్ బస్తీలో అతనికి విసుగ్గా కనిపించింది. వున్నట్టుండి ఆ పలాజ్జో పాతబడిందిగా, మకిలిగా కనిపించింది. తెరలమీద మరకలు, నేలమీద పగుళ్లు కనిపించేయి. గోడలు బెల్లులు వూడిపోయి కనిపించేయి. సరంబీలకి కన్నాలు కనిపించేయి. అవన్నీ కళ్లకి మంటగా కనిపించేయి. రోజూ చూసే గొలెనీశ్చెవ్, ఇటాలియన్ ప్రొఫెసర్, జర్మన్ యాత్రీకుడు యెంత విసుగు పుట్టించారంటే తక్షణం జీవిత విధానం మార్చుకోవాల్సిన అవసరం అతనికి కనిపించింది. వాళ్లు రష్యాకి, తమ వూరికి వెళ్లిపోవాలని తీర్మానం చేసుకున్నారు. పీటర్స్‌బుర్గ్‌లో అన్నగారితో ఆస్తి వాటా పంపకాలు వేసుకోవాలని వ్రాన్‌స్కీ అనుకున్నాడు. తన కొడుకుని చూడాలని ఆన్నా అనుకుంది. వ్రాన్‌స్కీ పెద్ద జిరాయితీ జాగీర్‌లో వేసవికాలం గడపాలని వాళ్లు అనుకున్నారు.

## 14

లేవిన్ పెళ్లయి మూడు నెలలు అవుతోంది. అతనికి సంతోషంగా వుంది. కాని పిసరు కూడా తను ఆశించినట్టు లేదు. అడుగడుక్కీ తొలినాటి అతని కలల విషయంలో నిరుత్సాహం కలుగుతూనే వుంది. తను వూహించని కొత్త ఆకర్షణలు వచ్చి అలరిస్తూ వున్నాయి. లేవిన్‌కి సంతోషంగానే వుంది, కాని సంసార జీవితంలో అడుగుపెట్టాక తను ఆశించిన రీతిలో అన్నీ లేవని అతనికి అడుగడుక్కీ తెలియవచ్చింది. సరస్సులో నావ జామ్మీగా, అలవోకగా వెడుతూ వుంటే ముగ్ధుడై ఆహా ఓహో అంటూ చూసి ఆనందించేవాడు తనే నావలో వుంటే

యెలా వుంటుందో లేవిన్‌కి అడుగడుక్కీ అలా వుంది. నావని కదల్చకుండా వొట్టినే కూర్చో వడం చాలదని అతనికి తెలుస్తుంది. తను యెక్కడికి పోతూ వున్నదీ, తన కాళ్ల కింద వున్నది నీరుగాని నేల కాదనీ, తను తెడ్లు వేస్తూనే వుండాలి అనీ క్షణకాలం కూడా మరిచి పోకూడదు. కాని అలవాటులేని వాళ్లకి తెడ్లు వెయ్యడం నొప్పిగా వుంటుంది, నావ జాయ్‌గా వెడుతూ వుంటే చూడ్డమే కులాసాగానే వుంటుంది, స్వయంగా తొయ్యడం సంతోషంగానే వున్నా కష్టంగా వుంది అని గ్రహించాడు.

తను యింకా అవివాహితుడుగా వున్నప్పుడు పై వాళ్ల దాంపత్య జీవితంలో కనిపించే చిన్నా చితకా చింతలూ, పొరపొచ్చేలూ, కలహాలూ చూసి యేమి అల్పత్వం అని చిన్నగా నవ్వుకునేవాడు. తనకి పెళ్లయితే యిలాంటివేమీ వుండవని, తన దాంపత్య జీవితపు బాహ్య రూపం కూడా యితరుల దానికంటే భిన్నంగా వుంటుందనీ అతనికి నమ్మకంగా వుండేది. కాని అలా జరగలేదు. అతని దాంపత్య జీవితం విశిష్టంగా వుండడం మాట సరేసరి, అతను యెంతగానో యేవగించుకున్న ఆ చిన్నా చితకా చింతలన్నీ తననీ చుట్టుకున్నాయి. అవి అతని యిష్టానికి విరుద్ధంగా అసాధారణ నిర్వివాద ఘనత్వం సంపాదించుకున్నాయి. ఆ చిన్నా చితకా చింతలతో వేగడం తను అనుకున్నంత తేలిక కాదని అతనికి అనుభవైకవేద్యం అయింది. దాంపత్య జీవితం గురించి తనకి స్పష్టమైన వూహలు వున్నాయని అతను అనుకున్నా యదార్థంలో మగాళ్లందరిలాగా, అతనూ తనకి తెలియకుండానే వివాహ జీవితం అంటే కేవలం ప్రణయ సుఖమనే భావించుకున్నాడు, దాన్ని యే అల్ప విషయాలూ బాధించకూడదనీ అనుకున్నాడు. చిన్నా చితకా చింతలు అటు వేపు తల యెత్త కూడదనీ అనుకున్నాడు. లేవిన్ అనుకున్న దాని ప్రకారం తను తన పని చెయ్యాలి, తర్వాత ప్రణయ సౌఖ్యంలో ఆనందాన్ని ఆస్వాదిస్తూ సేదదీరాలి. అర్ధాంగి కేవలం ప్రేమ భషకంలాగా వుండాలి, అంతే. ఆమెకీ పని వుంటుందన్న విషయాన్ని మగాళ్లందరికిలాగానే అతనూ మరిచిపోయేడు. ఆమె, తన కావ్యగీతిక, ఆరాధ్య దేవత అయిన కిట్టీ, దాంపత్య జీవిత తొలి వారాల సంగతి సరేసరి, తొలి రోజుల్లోనే టేబిల్ క్లాత్‌ల గురించీ, ఫర్నిచర్ గురించీ, చుట్ట పక్కాల పడకల గురించీ, పళ్లేల గురించీ, భోజనాల గురించీ, వంట మనిషి గురించీ వగైరాల గురించీ పట్టించుకుని బాధ పడిపోవడమేమిటో బోధ పడలేదు. పెళ్లయాక విదేశాలకి వెడదామంటే కరాఖండీగా నిరాకరించడం, తను యేం చెయ్యాలో తెలుసుకుని వున్నట్టు యెకాయెకీ పల్లెకి వెడదామనడం తన ప్రేమని గురించి మాత్రమే గాక వేరే వాటి గురించీ ఆలోచించినట్టు వుండడం వివాహం కాక ముందు అతన్ని చకితుణ్ణి చేశాయి. లేవిన్ మనసుకి అప్పుడు కష్టం కలిగింది. యిప్పుడు చిన్నా చితాకా చింతలవల్లా, రచ్చలవల్లా కష్టం కలుగుతోంది. కాని కిట్టీకి అవన్నీ అవసరమేనని అతనికి కనిపించింది. తను ఆమెని ప్రేమించాడు, అందువల్ల కిట్టీ చింతలు తనకి అర్థం కాకపోయినా, వాటిని చూసి తను నవ్వినా వాటిని చూసి ముచ్చట పడకుండా వుండలేకపోయేవాడు. ఆమె మాస్కోనుంచి తెచ్చిన కొత్త ఫర్నిచరుని సర్దింది.

తన గదిని కొత్తగా యేర్పాటు చేసుకుంది, అతని గదిని యేర్పాటు చేసింది. తెరలు అమర్చింది. చుట్టాలు వొస్తే యే గదులు వాళ్లకి వుండాలో, దాలీకి యే గది వుండాలో తీర్మానం చేసింది. తన పని పిల్లకి గది కేటాయించింది. మధ్యాహ్నం భోజనాల గురించి ముసలి వంట మనిషికి పురమాయింపులు చేసింది. అగాఫ్యా మిహైలొవ్నాతో రసవర్గం గురించి వాదన వేసుకుని తనే ఆ పని తీసుకుంది. యివన్నీ చూసి అతనికి నవ్వు వచ్చింది. అనుభవం లేక ఆమె సాధ్య పడని పురమాయింపులు చేస్తూ వుంటే చూసి ముసలి వంటవాడు ముచ్చటగా ఆమెకేసి చూసి యెలా చిరునవ్వు నవ్వేడో లేవిన్ చూశేడు. రసవర్గం గురించి కొత్తగా కాపరానికి వచ్చిన పడుచు యజమానురాలు చేసిన సూచనల గురించి ఆలోచిస్తూ అగాఫ్యా మిహైలొవ్నా స్నేహభావంతో తల వూపడం అతను చూశేడు. పని పిల్ల మాషా తనని చిన్న పిల్లలా చూడ్డంతో మిగతా వాళ్లెవరూ తన మాటని ఖాతరీ చెయ్యడం లేదని యేడుపు మొహం పెట్టుకుని నవ్వుతూ తనతో చెప్పడానికి వచ్చినప్పుడు ఆమె అతనికి యెక్కడలేని మనోహరత్వంతోనూ కనిపించేది. అతనికి అదంతా యిష్టంగా, వింతగా కనిపించేది, యివి లేకుండా కూడా బాగా వుంటుందని అతనికి అనిపించేది.

యిక్కడికి వచ్చేక ఆమె పరిస్థితిలో వస్తూ వున్న పరివర్తన భావాన్ని లేవిన్ గమనించ లేకపోయేడు. పుట్టింటి దగ్గర యెప్పుడేనా క్వాస్ పానీయంతోబాటు కాబేజీ తినాలని మనసు పుట్టినా లేదా మిఠాయి తినాలనిపించినా రెండింటిలోనూ యేదీ దొరికేది కాదు. కాని యిక్కడ, తన యింటికి, తను కోరుకున్న వాటినన్నిట్నీ తెప్పించుకోగలదు. గుట్టల కొద్దీ మిఠాయిలు తెప్పించుకోగలదు, కావలసినంత డబ్బు ఖర్చు పెట్టగలదు, మనసుకి నచ్చిన పిండివంటలు తెప్పించుకోగలదు.

దాలీ పిల్లల్ని తీసుకుని తన దగ్గరికి వస్తే బాగుంటుందని కిట్టీ వూహించుకుంటూ మురిసిపోయేది. ముఖ్యంగా పిల్లలు యిష్టపడిన పిండివంటలనన్నిట్నీ తెప్పించగలదు, దాలీ తన యింటి యేర్పాట్లు చూసి మెచ్చుకుంటూ వుంటే వినగలదు. యెందుకో యేమిటో కిట్టీకి తెలియకుండానే ఆమె బలవంతంగా గృహ జంజాటంకేసి ఆకర్షితమైపోతోంది. వసంతం వస్తోందని సహజ ప్రవృత్తితో అనుభూతి చెంది, యీ ఋతువులో మంచి రోజులూ వుంటాయి, వాన రోజులూ వుంటాయని తెలిసి తన గూడు కట్టుకుంటోంది. అలా కట్టుకునే క్రమంలోనే యెలా దాన్ని కట్టుకోవాలో నేర్చుకునే వేగిరపాటూ పడింది.

చిల్లరమల్లర వాటిపట్ల కిట్టీకి వున్న యీ చింత మొదట్లో లేవిన్ ఉన్నత సౌఖ్యా దర్శాలకి యెంతో విరుద్ధంగా వుండి అతనికి నిరాశ కలిగించిన వాటిలో వొకట్టైంది. కాని అతనికి బోధపడని యీ ప్రియమైన గృహ చింత అతని మనసుని వశం చేసుకోకుండా వుండలేకపోయింది, అది అతనికి వొక నూతన ఆకర్షణ కూడా అయింది.

తమ కలహాలు మరో నిరాశా, ఆకర్షణ హేతువులయేయి. తనకీ తన అర్ధాంగికీ మధ్య మృదుత్వం, ప్రేమ, పరస్పర ఆదరణ తప్ప మరే యితరమైనవీ వుండవని వూహించుకు

న్నాడు లేవిన్. యింతట్లోకి వున్నట్టుండి పెళ్లయిన కొత్తలోనే యిద్దరూ దెబ్బలాడుకున్నారు. అదీ యెంత తీవ్రంగానంటే తనని అతను ప్రేమించడం లేదనీ, అతనికి తనమీద తనకి తప్ప మరి యెవరిమీదా ప్రేమ లేదనీ కిట్టీ అతన్ని దుమ్మెత్తి పోసి యేడుస్తూ చేతులు చాపుతూ వెళ్లిపొమ్మంది.

వాళ్ల మధ్య మొదటి తగూకి కారణం లేవిన్ అరగంట ఆలస్యంగా రావడం. అతను కొత్త పొలాల్ని చూడ్డానికి గుర్రంమీద వెళ్లేడు. తిరిగివచ్చేటప్పుడు అడ్డదారమ్మట రాబోయి దారి తప్పేడు. దాంతో ఆలస్యం అయింది. అంత సేపూ అతను కిట్టీ గురించే, తన ప్రేమ గురించే, తన సంతోషం గురించే మనసులో అనుకుంటూ వున్నాడు. యిల్లు దగ్గర పడే కొద్దీ కిట్టీ పట్ల ప్రేమ భావన అతన్ని అంత అధికంగా దీప్తం చేసింది. కిట్టీని పెళ్లి చేసుకుంటానని అడగడానికి ష్చేర్‌బాల్‌స్కీల యింటికి వెళ్లినంత తీవ్ర భావంతో పరుగులు తీస్తూ కిట్టీ గదిలోకి వెళ్లేడు. కిట్టీ ముఖం వేలాడేసుకుని హఠాత్తుగా అతను అంతకు ముందు యెన్నడూ చూడని రీతిలో కనిపించింది. అతను ఆమెని ముద్దు పెట్టుకుందా మనుకున్నాడు కాని ఆమె అతన్ని తోసేసింది.

"యేం జరిగింది?"

"నీకు హుషారుగా వుంది..." అని కిట్టీ శాంతంగా వుంటూనే విషబాణం వదలాలను కుంటూ మొదలుపెట్టింది.

కాని నోరు విప్పగానే అర్థంలేని యీర్ష్యా భావం పురిపెట్టిన భర్త్సన పదాలు వడిగా వచ్చేయి. ఆ అరగంట సేపూ కదలకుండా కిటికీ దగ్గరే కూర్చుని తను పడిన బాధ అంతా వెళ్లకక్కేసింది. యీ క్షణంలో అతనికి మొదటి సారిగా వొక విషయం అర్థమైంది, తను ఆమెని చెయ్యి పట్టుకుని వివాహం అయేక చర్చిలోనుంచి బయటికి తీసుకు వచ్చేటప్పుడు అర్థం అవనిది అది. ఆమె తనకి సన్నిహితంగా వుండడమే కాదు, తనలో వొక భాగం అని అర్థమైంది. తను, ఆమె యేకమైన ఆ మూర్తిలో ఆమె యెక్కడ ముగుస్తుందో తను యెక్కడ ఆరంభమవుతాడో తెలియలేదు. ఆ క్షణంలో ద్వైధీభాగంగా విభజన అయిన యాతనాపూర్ణ భావన అనుభవంలోకి వచ్చింది, తద్వారా అతనికి ఆ విషయం అర్థమైంది. మొదట అతను గాయపడ్డాడు. కాని వెంటనే ఆమే తను అనే అద్వైత భావంవల్ల ఆమె తనని గాయపర చదు అని అతనికి తెలిసింది. అతను మొదట క్షణంలో, వెనకనుంచి దెబ్బ తగిలిందనుకున్న మనిషిలాగా అనుకున్నాడు. వెనకనుంచి యెవరో కొట్టారనుకుని వాళ్లని టక్కున పట్టు కుందామని గిరుక్కున తిరిగి చూసుకుంటే యెవరూ కాదు తనే పొరపాటున తనని కొట్టు కున్నట్టు ఆ మనిషికి తెలుస్తుంది. యిక యెవర్ని తిడతాడు, తన దెబ్బని తనే భరించి కోపం తగ్గించుకోవాలి.

ఆ తర్వాత యెన్నడూ అతను దాన్ని అంత బలీయంగా అనుభూతి చెందలేదు. కాని యీ సారి అతను చాలా సేపటిదాకా సంబాళించుకోలేకపోయేడు. తను సమాధానం చెప్పి

ఆమె తప్పు వెళ్లడి చెయ్యాలని సహజ ప్రేరణ తోసింది. కాని యిది నీ తప్పు అని ఆమెకి చూపిస్తే యింకా రెచ్చిపోతుంది, తమ దుఃఖానికి కారణమైన అంతరం యింకా పెద్దది అవుతుంది. తప్పుని తన భుజాలమీదనుంచి వదిలించుకుని కిట్టీ భుజాలమీదకి గెంటెయ్యాలని మామూలుగా మనుషులకి వుండే వొక అనుభూతి ప్రేరేపించింది. వెడల్పు అయే అంతరాన్ని సాధ్యమైనంత వేగంగా పూడ్చెయ్యాలని మరో బలీయమైన అనుభూతి ఘోష పెట్టింది. ఆమె అన్యాయపూరిత భర్త్సనని భరించడం అతనికి కష్టమే కాని తనని సమర్థించుకుంటూ ఆమెకి యెక్కువ బాధ కలిగించడం యింకా కష్టం. అతని పరిస్థితి సగం నిద్రలో వున్న మనిషి పడే బాధలా వుంది. ఆ మనిషి బాధతో వున్న ఆ భాగాన్ని కోసెయ్యాలనుకుంటాడు, మెలుకువ తెచ్చుకుని చూస్తే అది తనలోనిదే, దాన్ని కోసెయ్యడం కుదరదు బాధ తగ్గేదాకా అనుభవించాల్సిందే. లేవిన్ అలానే చెయ్య ప్రయత్నించేడు.

యిద్దరి మధ్యా సర్దుబాటు జరిగింది. తప్పు తనదేనని కిట్టీ అనుకుంది. ఆ ముక్క పైకి అనకుండానే లేవిన్ పట్ల మరింత ఆదరం కనబర్చింది. వాళ్లు వొక నూతన, ద్విగుణీకృత ప్రేమ సౌఖ్యాన్ని పొందేరు. అంత మాత్రం చేత కలహాలు రాకుండా పోలేదు. తరచుగా అతి చిన్న విషయాలకి, వూహించని క్షుద్ర కారణాలకీ తగూ వచ్చేది. యెవళ్లు యేది ముఖ్యం అనుకుంటూ వున్నదీ యిద్దరికీ తెలియకపోవడంవల్లా, యిద్దరూ మొదట్లో చిరాగ్గా వుంటూ వుండడంవల్లా కలహాలు యెక్కువగా వచ్చేవి. వొకళ్లు బాగా వుండి, మరొకళ్లు చిరాగ్గా వుంటే యిద్దరికీ రాజీగానే వుండేది. యిద్దరూ చిరాగ్గా వున్నప్పుడు యెంత క్షుద్రమైన వాటిమీద పోట్లాటలు వచ్చేవంటే తర్వాత చూసుకున్నప్పుడు అసలు యెందుకు దెబ్బలాడుకున్నారో యెవళ్లకీ తెలిసేది కాదు. యిద్దరూ బాగా వున్నప్పుడు వాళ్ల జీవితానందం ద్విగుణీకృతంగా వుండేది.

మొదట్లో జీవితం నిజంగా గడ్డుగా వుంది. యిద్దర్నీ బంధించిన పాశం వొకో అప్పుడు వొక వేపు, మరో అప్పుడు మరో వేపు లాగుతూ వుండేది. మొత్తంమీద వాళ్ల వైవాహిక జీవిత మధుమాసం అంటే పెళ్లయిన తర్వాత నెల, వాళ్లూ వాళ్లూ చెప్పగా విన్న మాటలని బట్టి లేవిన్ ఆకర్షితుడైనటువంటిది, కేవలం మధువుల్ని మాత్రమే మిగల్చక, యిద్దరి స్మృతిలోనూ ఆనాటి కటువైన లజ్జాజనక మాసంగా మిగిలింది. తర్వాత వాళ్లు తమ స్మృతిలోనుంచి ఆ వికార లజ్జాజనక అనుభవాల్ని ఆ అటుపోట్ల కాలాన్ని చెరిపి వేసుకో ప్రయత్నించారు. యిద్దరూ మామూలుగా వుండని పరిస్థితి అది, అతను గాని ఆమె గాని తమ తమ స్వభావరీత్యా మామూలుగా వుండని దశ అది.

పెళ్లయిన మూడవ నెలలో, వొక నెల రోజులపాటు మాస్కో వెళ్లివచ్చాకనే వాళ్ల జీవితం సాఫీగా సాగడం ఆరంభమైంది.

# 15

వాళ్లు మాస్కోనుంచి తిరిగి వచ్చేరు. ఏకాంతంగా వున్నందుకు సంతోషంగా వుంది. అతను చదువుకునే గదిలో డస్కు దగ్గర కూర్చుని రాసుకుంటున్నాడు. ఆమె ముదురు వూదా రంగు గౌను తొడుక్కుని లేవిన్ తండ్రి తాతల కాలంనుంచీ ఆ గదిలోనే వున్న తోలు సోఫామీద కూర్చుని ఎంబ్రాయిడరీ పని చేసుకుంటోంది. ఆమె తొడుక్కున్న గౌను ఆమె పెళ్లయిన కొత్తలో వేసుకునేది, అదంటే లేవిన్‌కి యెంతో యిష్టం, ఆ స్మృతులన్నీ అతనికి వస్తాయి. కిట్టీ అక్కడ వుంది అనే యెరుకతో యెంతో సంతోషపడుతూ లేవిన్ ఆలోచించుకుంటూ రాసుకుంటూ వున్నాడు. అతను వ్యవసాయాన్ని వదలలేదు, అలాగే వ్యవసాయం గురించి కొత్త పద్ధతి మూలభూత సిద్ధాంతాల్ని విపులీకరిస్తూ రాయదలచుకున్న పుస్తక రచననీ వదల్లేదు. కాని తన గత జీవితంమీద కమ్మిన అంధకార ఛాయవల్ల ఆ పని, ఆలోచనలు నిస్సారంగా, అల్పంగా యెలా కనిపించాయో అదే రకంగా యిప్పుడు భావిజీవిత జాజ్జ్వల్యభరిత తేజస్సులో దీప్తం అయే సౌఖ్యంవల్ల నిస్సారంగా అల్పంగా కనిపించేయి. అతను తన పని కొనసాగిస్తూనే వున్నాడు. కాని యిప్పుడు తన ధ్యాన కేంద్ర బిందువు మారిందని అతనికి అనిపించింది. తత్ఫలితంగా తన పనిని భిన్న రీతిలో మరింత స్పష్టంగా దర్శించేడు. లోగడ అతని పని జీవితంనుంచి పారిపోయేందుకు సాధనంగా వుండేది. ఆ పని లేకుండా తన జీవితం దుర్భర విచారపూరితంగా వుంటుందని లోగడ అతనికి అనిపించేది. యిప్పుడు జీవిత వైవిధ్య రహిత ఆనంద మధువులనుంచి మళ్లడానికి ఆ పని అవసరం అయింది. తను రాసిన కాగితాల్ని తీసి చదువుకున్నాడు. తన పని బాగా వున్నట్టే కనిపించింది. అది కొత్తగా వుంది, ఉపయోగకరంగా వుంది. తనకి లోగడ వున్న పాత భావాలు చాలా మట్టుకి తీవ్రంగా, అతిరిక్తంగా కనిపించేయి. కాని మనసులో అన్ని సమస్యల్నీ గురించీ పునరాలోచన చేసుకున్నప్పుడు మసక మసగ్గా వున్న బోలెడు భావాలు స్పష్టంగా విశదమయేయి. రష్యాలో వ్యవసాయం యెందుకు లాభదాయకంగా లేదు అన్న దానిమీద వొక కొత్త అధ్యాయం రాస్తూ వున్నాడు. భూమి విభజన లోప భూయిష్టంగా వుండడంవల్లా, యాజమాన్య దోషాలవల్లా మాత్రమే రష్యా బీదరికం రాలేదు. యీ చెడుగుల్ని పెంచి పోషించాయనుకున్న కారణాల వల్ల కూడానని అతను రుజువు చెయ్య ప్రయత్నించేడు. అవేమిటీ అంటే గత కొంత కాలంగా రష్యాకి విదేశీ నాగరికతని కృత్రిమంగా అంటుకట్టడం. ముఖ్యంగా, ఆధునిక రవాణా పద్ధతులు, రైల్వేలు రావడంతో నగరాల్లో జనసాంద్రత యెక్కువై సంపద పెరిగింది. దీని ఫలితంగా వ్యవసాయానికి హాని కలిగించే ఫాక్టరీలు, పరిశ్రమలు, రుణ వ్యవస్థ ఆ రుణ వ్యవస్థని అంటి పెట్టుకువచ్చే స్టాక్ ఎక్స్‌చేంజీ యేర్పడ్డాయి. యివన్నీ దోషాలు. యే దేశ సంపత్తి అభివృద్ధి అయినా సహజ క్రమంలో జరిగితే యివన్నీ కూడా వ్యవసాయ రంగంలో తగినంత శ్రమ వున్నప్పుడు, మంచి పరిస్థితుల్నీ, కనీసం అభివృద్ధికి తగ్గ స్థిరమైన పరిస్థి

తుల్ని స్థాపించినప్పుడు తగిన సమయంలో అవే వస్తాయి. దేశ వనరుల్ని సమతూకంగా అభివృద్ధి చెయ్యాలి, కనీసం యితర శాఖలు వ్యవసాయం కంటే ముందు వెళ్లకుండా చూడాలి. యేమంటే వ్యవసాయంతో తూగేటట్టుగా రవాణా వికాసం వుండేటట్టు చూడాలి. భూమిని సక్రమంగా ఉపయోగ పెట్టకపోవడంతో ఆర్థికపరమైన కారణాల కంటే యెక్కువగా రాజకీయ కారణాలవల్ల రైల్వేల్ని ముందే ప్రవేశపెట్టడం జరిగింది. అవి ఆశించినట్టు వ్యవసాయానికి సహాయం చెయ్యకుండా ముందుకు సాగిపోయి, పరిశ్రమల్నీ, రుణ వ్యవస్థనీ తీసుకువచ్చి వ్యవసాయ ప్రగతిని అడ్డం కొట్టేయి. ఒక జంతువు శరీరంలో యేదేనా వొక ఆవయవం యేకపక్షంగా, తగిన సమయానికి ముందే పెరిగితే మిగతా శరీర అభివృద్ధికి అది బాధాకరం అయినట్టు రష్యాలో రుణ వ్యవస్థని ప్రవేశపెట్టడం, రవాణా సాధనాల్నీ, ఫాక్టరీలనీ తీసుకురావడం అనేవి, — సరి అయిన సమయంలో ఆవశ్యకంగా యూరప్‌లో వచ్చినటువంటివి, — వ్యవసాయ సువ్యవస్థ అనే ముఖ్య సమస్యని దూసుకు ముందుకు పోయి యిక్కడ దేశ సంపద సర్వతోముఖ అభివృద్ధికి హానికరంగా పరిణమించేయి అని అతను భావించేడు.

లేవిన్ తన ఆలోచనలని కాగితంమీద పెడుతూ వుంటే తన భర్త, తనూ మాస్కో నుంచి తిరిగి రావడం కిట్టీ గుర్తు చేసుకుంటూ వుంది. తాము వచ్చేటప్పుడు తనని అధికంగా పొగిడిన యువ ప్రిన్స్ చార్స్కీని చూసి తెలివి తక్కువతనంతో లేవిన్ యెంత అసహజమైన నమ్రత కనబర్చాడో దాన్ని గురించి అనుకుంటూ వుంది. 'యితనికి ఈర్ష్యగా వుంది' అని తనలో తను అనుకొంది. 'బాప్‌రే! మా ఆయన యెంత ముచ్చటైన మనిషి, యెంత అమాయకుడు! నావల్ల యీర్ష్య పడుతున్నాడు! అతనికి తెలిసి వుంటేనా నా దృష్టిలో వీళ్లంతా వంటమనిషి ప్యోత్ర్‌తో సమానం అని!' అని ఆమె వొక వింత స్వాయత్త భావనతో లేవిన్ తల వెనక భాగాన్నీ, యెండకి కమిలిన మెడనీ చూస్తూ అనుకొంది. 'పనిలో నుంచి అతని దృష్టి మళ్లించడం బాధగానే వుంది, పాపం! (అయినా ఫరవా లేదు తర్వాత కూడదీసుకుంటాడు!) అయినా అతని ముఖాన్ని చూడాలి. నేను తనకేసే చూస్తూ వున్నానని అనుకుంటున్నాడా లేదా? అతను యిటు తిరిగి చూడాలని నాకు వుంది. అవును, వుంది, వుంది' అనుకుంటూ తన దృష్టి ప్రభావాన్ని తీవ్రం చేసే కోరికతో అన్నట్టుగా ఆమె కళ్లని విప్పారించి చూసింది.

"అవును యివి మొత్తం రసాన్ని పీల్చి పిప్పి చేసి దొంగ మెరుపుని యిస్తున్నాయి" అని అతను కలం కింద పెడుతూ, తనమీద ఆమె దృష్టి వుందన్న గ్రహింపు వచ్చినట్టు తల తిప్పుతూ గొణుక్కున్నాడు.

"యేమిటి సంగతి?" అని చిరునవ్వు నవ్వుతూ, లేచి నుంచుంటూ అడిగేడు.

'తల తిప్పి చూశేడు' అని ఆమె అనుకొంది.

"యేమీ లేదు, నువ్వు తల తిప్పి చూడాలని అనుకున్నాను" అని తను అతని పనికి

అంతరాయం కలిగించినందుకు అతనికి కోపం యేమన్నా వచ్చిందేమో వెతుకుతున్నట్టు అతని ముఖంలోకి పరీక్షగా చూస్తూ అంది.

"మనం యిద్దరమే యేకాంతంగా వుండడం యెంత బాగుంది! నాకు అలా అనిపిస్తోంది" అని అతను కిట్టీకి దగ్గరగా వస్తూ, సంతోషంతో చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"నాకు చాలా సంతోషంగా వుంది. నేనిప్పుడు యెక్కడికీ వెళ్లను, ముఖ్యంగా మాస్కోకి."

"యేమిటాలోచిస్తున్నావ్?"

"నేనా? నేను యేమాలోచిస్తున్నానంటే... యేమీ లేదు, యేమీ లేదు, రాసుకో. వేరే ఆలోచనలెందుకులే" అని ఆమె పెదాలు ముడుచుకుంటూ అంది. "నేను యీ చిన్న కన్నాల్ని కత్తిరించాలి, చూశేవా?" అంది.

కత్తెర తీసుకుని కత్తిరించడం మొదలుపెట్టింది.

"అసలేమిటి ఆలోచిస్తూ వున్నావో చెప్పు" అని అతను ఆమె పక్కన చేరి చిన్న కత్తెర ఆమె చేతిలో కత్తిరిస్తూ చుట్టు తిరగడం చూసి అడిగేడు.

"ఓ, యేమిటాలోచిస్తున్నాను? మాస్కో గురించి, నీ తల వెనక భాగం గురించి ఆలోచిస్తున్నాను."

"నాకు అంత అదృష్టం యెందుకు కలిగింది? యిది సహజంగా లేదు, నిజం అయినట్టు కనిపించడం లేదు" అని ఆమె చేతిని ముద్దుపెట్టుకుంటూ అన్నాడు.

"నాకు అలాక్కాదు, యెంత యెక్కువ సుఖంగా వుంటే అంత సహజంగా కనిపిస్తుంది."

"నీ ముంగుర్లు చెదిరిపోతున్నాయి" అని అతను ఆమె తలని విదానంగా తనకేసి తిప్పుకుంటూ అన్నాడు. "జుట్టు! చూశావా యెక్కడ కొప్పునుంచి వూడి పడిందో. పోనీ లే, మన పని మనం చేసుకుందాంలే" అన్నాడు.

కాని వాళ్ల పని సాగలేదు. కొంచెం సేపటి తర్వాత టీ తయారుగా వుందని నౌకరు కుజ్మా చెప్పడానికి వచ్చినప్పుడు తప్పు చేసిన పిల్లల్లాగా టక్కని వాళ్లకొకళ్లు దూరంగా జరిగేరు.

"బస్తీనుంచి వాళ్లు తిరిగి వచ్చేరా?" అని లేవిన్ కుజ్మాని అడిగేడు.

"యిప్పుడే వచ్చేరు. టపా విప్పుతున్నారు."

"వెంటనే వచ్చెయ్యి" అని కిట్టీ గదిలోనుంచి బయటికి వెడుతూ అంది. "లేకపోతే నువ్వు లేకుండానే ఉత్తరాలు చదివేసుకుంటా. తర్వాత కలిసి పియానో వాయించుకుందాం" అంది.

ఒంటరిగా వుండిపోయి అతను కిట్టీ కొనిపెట్టిన కొత్త లెదర్ బేగ్‌లో తన కాగితాలు పెట్టుకున్నాడు. రకరకాల చక్కటి హంగులూ వున్న కొత్త వాష్ స్టేండ్ దగ్గరికి వెళ్లి చేతులు కడుక్కున్నాడు. దాన్నీ కిట్టీయే కొంది. లేవిన్ తన ఆలోచనలకి చిరునవ్వు నవ్వుకుని తనని తిట్టుకుంటున్నట్టు తల వూపేడు. పశ్చాత్తాపం లాంటి భావం అతన్ని కలత పెట్టింది. తన ప్రస్తుత జీవితంలో లజ్జా కారకమైంది, పురుష స్వభావ విరుద్ధమైంది, జావజావగా

వుండేదీ, కపూాయ నగర జీవిత సౌఖ్యప్రద జీవితం*లో వుండేది, — అతను తన ప్రస్తుత స్థితికి అలాంటి పేరు పెట్టాడు — యేదో వుందని అతనికి అనిపించింది. 'యిలా బతకడం బాగా లేదు' అని అతను అనుకున్నాడు. 'అప్పుడే మూణ్ణెల్లు అయిపోతోంది, దాదాపు యే పనీ చెయ్యలేదు. మొదటిసారిగా యివాళ కూర్చున్నాను పని చేద్దామని. కాని యేం లాభం? మొదలుపెట్టీ పెట్టకుండానే వదిలేశాను. అంతేనా, రోజువారీ పనిపాట్లు కూడా చూడ్డం లేదు. వ్యవసాయం పన్లు చూడ్డానికి యెప్పుడోగాని వెళ్లడమే లేదు. కిట్టీని ఒంటరిగా వదిలి వెళ్లాలంటే బాధగా వుంటోంది, ఒంటరిగా వదిలేస్తే ఆమెకి విసుగ్గా వుంటుందని. పెళ్లికి ముందు వుండే జీవితం పెద్ద లెక్కలోకి తీసుకోదగ్గది కాదనీ పెళ్లి తర్వాతనే అసలు జీవితం మొదలవుతుందనీ అనుకుంటూ వుండేవాణ్ణి. యిప్పుడు చూస్తే మూణ్ణెల్లు అయిపోతున్నాయి, యింత సోమరితనంతో వ్యర్థంగా యెప్పుడూ గడపలేదు. యిలా అయితే లాభం లేదు. పని చేసుకోవాలి. కిట్టీ తప్పేమీ లేదు. ఆమెని యే రకంగానూ మాట అనలేను. నేనే మరింత దృఢ నిశ్చయంతో వుండాలి, మగవాడి స్వతంత్రతని చూపించాలి. లేకపోతే నేను యీ బతుక్కి అలవాటు పడిపోయి, ఆమెకీ దీన్నే అలవాటు చేస్తాను. ఆమె తప్పు యెంత మాత్రం లేదు' అని అతను అనుకున్నాడు.

అసంతృప్తి చెందిన మనిషి యెవళ్లనో, అందునా తనకి దగ్గరి వాళ్లైన యెవళ్లనో తన అసంతృప్తికి నిందించకుండా వుండడు. లేవిన్ మనసులో కిట్టీ ఆమెకిగా దోషి కాదన్న వూహ (ఆమె యే రకంగానూ దోషి కాలేదు) తారట్లాడింది. కాని ఆమె పెంపకంది ఆ తప్పు, అందులో చాలా తేలికతనం, చంచలత వున్నాయి ('ఆ చవట చార్స్కీ చూడు! కిట్టీ అతన్ని ఆపుదామనుకుంది కాని ఆపలేకపోయింది'). 'పాపం ఆమెకి యిల్లు చూసుకోవడం (అందులో ఆమె మైమరిచిపోతుంది!), తన బట్టలేమిటో తన ఎంబ్రాయిడరీ యేమిటో ఆ గొడవే తప్ప వేరే ఆసక్తులేమీ లేవు. ఆమెకి నా పనిలో ఆసక్తి లేదు. వ్యవసాయం పనులన్నా, రైతులన్నా, పుస్తకాలన్నా ఆసక్తి లేదు. సంగీతంలో ప్రావీణ్యం వుంది కాని అదన్నా ఆసక్తి లేదు. ఆమె యేమీ చెయ్యదు కాని హాయిగా చీకూచింతా లేకుండా వుంది.' ఆమెని గురించి లేవిన్ మనసులో నిష్కారంగా అనుకున్నాడు. కాని అతను ఒక విషయాన్ని అర్థం చేసుకోలేకపోయేడు: ఆమె భర్తకి అర్థాంగిగా, యింటికి యిల్లాలిగా వుంటూ పిల్లల తల్లి అయి వాళ్లకి పాలిచ్చి పెంచి పెద్దవాళ్లని చేసే క్రియాశీల చర్యలు చేపట్టే ఆ సమయం కోసం తయారవుతోందీ అనే విషయాన్ని. ఆమె సహజ జ్ఞానంతో ఆ విషయాన్ని గ్రహించిందనీ, అంతటి భారీ శ్రమకి తయారవుతూనే, ఆడుతూ పాడుతూ తన భావి కుటీరాన్ని నిర్మించుకునే యీ సమయంలో ప్రణయ సుధాంబుధిలో మునకలాడే యీ క్షణాలకి గాను తనని నిందించుకోకుండా వాటిని ఆనందిస్తోందనీ అతను అర్థం చేసుకోలేకపోయేడు.

## 16

లేవిన్ పై గదిలోకి వెళ్లేటప్పటికి అతని భార్య కొత్త వెండి సమొవార్ పక్కన, కొత్త టీ సెట్ పక్కన కూర్చుని వుంది. వృద్ధ అగాఫ్యా మిహైలొవ్నాకి కప్పులో టీ పోసి యిచ్చి చిన్న బల్ల దగ్గర కూర్చోబెట్టింది. తను దాలీ రాసిన ఉత్తరం చదువుకుంటూ వుంది. దాలీ తనూ యెక్కువగా ఉత్తరాలు రాసుకుంటూ వుంటారు.

"చూడండి, మీ శ్రీమతిగారు నన్నిక్కడ కూర్చోబెట్టారు. తనతోబాటు కూర్చోవాలని ఆజ్ఞాపించేరు" అని అగాఫ్యా మిహైలొవ్నా ఆప్యాయంగా నవ్వుతూ కిట్టీకేసి చూసింది.

అగాఫ్యా మిహైలొవ్నా మాటల్ని బట్టి కిట్టీకి ఆమెకీ మధ్య కొంత కాలంగా నడుస్తూ వున్న రహస్య నాటకం ముగిసిందని లేవిన్‌కి అనిపించింది. గృహ నిర్వహణని తననుంచి ఆమె చేతుల్లోకి తీసుకుందన్న మంట అగాఫ్యా మిహైలొవ్నాకి కిట్టీ పట్ల వున్నా కిట్టీ ఆమెని ఆకట్టుకుందనీ, ఆమెని తన పట్ల ఆదరంగా వుండేట్టు చేసుకుందనీ అతనికి అర్థమైంది.

"యిదిగో నీ ఉత్తరం, చదివేను" అని కిట్టీ అతనికి పల్లెటూరి వాటంలో వున్న ఉత్తరాన్ని అందిస్తూ అంది. "ఆమె రాసింది, మీ అన్నగారు చేరదీసిన..." అంది. "లేదు, నేనేం చదవలేదులే. యిది యింటి దగ్గర్నుంచి వచ్చింది, యిది దాలీ రాసింది. వూహించగలవా! సర్మాత్‌స్కీల యింటి దగ్గర పిల్లల బాల్‌కి గ్రీషనీ, తాన్యానీ దాలీ తీసుకు వెళ్లిందట. తాన్యా ఫ్రెంచి మార్కిృస్‌లాగా తయారై వెళ్లిందట."

కాని లేవిన్ ఆమె మాటలు వినలేదు. సిగ్గుతో యెర్రబడుతూ అతను లోగడ అన్నగారి దగ్గర వున్న ఆడమనిషి మాషా రాసిన ఉత్తరం చదవడం మొదలుపెట్టేడు. మాషా అతనికి ఉత్తరం రాయడం యిది రెండవ సారి. మొదటి సారి రాసినప్పుడు అతని అన్నగారు నిష్కారణంగా తనని తన్ని తగలేశాడనీ, తనకి యేమీ అక్కర్లేదనీ, తను పరమ బీదరికం అనుభవిస్తూ వున్నా యేమీ కోరటం లేదనీ హృదయం చలించేలా అమాయకంగా రాసింది. కాని తను లేకపోతే పాపం, యెంతో నికృష్టంగా వున్న నికొలాయ్ చనిపోతాడనీ, లేవిన్ అతని విషయం చూడాలనీ అర్థిస్తూ రాసింది. యిప్పుడు రాసిన ఉత్తరంలో వేరే సంగతులు రాసింది. తను నికొలాయ్‌ని చూసిందట, యిద్దరూ మాస్కోలో కలిసి వున్నారట. వొక గుబేర్నియా కేంద్రానికి వెళ్లారట, అక్కడ అతనికి యేదో కొలువు దొరికిందట. కాని నికొలాయ్ అక్కడ తన పై అధికారితో దెబ్బలాట వేసుకోవడంతో మళ్లీ మాస్కోకి తిరిగివచ్చేరట. దారిలో చాలా జబ్బు చేసిందిట. బహుశా యీ గండం గట్టెక్కలేకపోవచ్చునట. "మీ పేరే పలవరిస్తూ వున్నాడు, పైగా యిప్పుడు చేతిలో చిల్లిగవ్వ లేదు."

"యిదిగో, చూడు, దాలీ నీ గురించి యేం రాసిందో" అని కిట్టీ చిరునవ్వు నవ్వుతూ చెప్పడం మొదలుపెట్టింది. కాని భర్త మొహంలో వచ్చిన మార్పు చూసి ఠక్కున ఆగిపోయింది.

"యేమిటి సంగతి? యేం రాసింది?" అని అడిగింది.

"నికొలాయ్ అన్నయ్యకి రేపోమాపో అన్నట్టు వుందని రాసింది. నే వెడతా అక్కడికి."

ఆ మాటకి కిట్టీ ముఖంలో కూడా మార్పు వచ్చింది. దాలీ గురించీ, తాన్యా మార్కిస్‌గా తయారవడం గురించీ ఆలోచనలు మటుమాయమై పోయేయి.

"యెప్పుడు వెడతావు?" అని కిట్టీ అడిగింది.

"రేపు."

"నేనూ రానా నీతో?" అని అడిగింది.

"కిట్టీ! యేమిటిది?" అని నిష్ఠూరంగా అన్నాడు.

"యేమిటి నువ్వంటూ వున్నది?" అని కిట్టీ కష్ట పెట్టుకుంటూ అంది. లేవిన్ పరుషత్వం, అయిష్టత ఆమెని గాయపరిచేయి. "నేనెందుకు రాకూడదు? నీకేం నేను అడ్డం రానే. నేను...."

"మా అన్న ఆఖరి క్షణాల్లో వున్నాడు కాబట్టి నేను వెడుతున్నా" అన్నాడు లేవిన్. "కాని నువ్వెందుకు...."

"యెందుకా? అందుకే!"

'నా జీవితంలో యిలాంటి విషమ పరిస్థితిలో తను వొక్కత్తీ వుండిపోవాలనీ, విసుగ్గా వుంటుందనీ బాధపడిపోతోంది' అని లేవిన్ అనుకున్నాడు. యిలాంటి విషమ పరిస్థితిలో కిట్టీ ధోరణి అతనికి చిర్రెత్తించింది.

"అసంభవం" అని అతను తెగేసినట్టు అన్నాడు.

వాళ్లిద్దరి మధ్యా దెబ్బలాట వస్తోందని పసికట్టి అగాఫ్యా మిహైలొవ్నా చడీచప్పుడూ కాకుండా కప్పు కింద పెట్టేసి వెళ్లిపోయింది. ఆమె వెళ్లిపోయిన సంగతి కిట్టీ గమనించను కూడా గమనించలేదు. భర్త యీ ఆఖరి మాటలు అన్న గొంతుక ధోరణీ, ముఖ్యంగా తన మాటని అతను నమ్మడం లేదన్న సంగతీ ఆమెని గాయపరిచేయి.

"నేను చెపుతున్నా నువ్వు వెడితే నేనూ కూడా వస్తా. ఆరు నూరైనా నూరు ఆరైనా వచ్చి తీరతా" అని కిట్టీ దడదడ కోపంతో అనేసింది. "యేం యెందుకు సంభవం కాదు? అసంభవం అని యెందుకంటున్నావు?" అంది.

"యెందుకంటే నేను యెక్కడెక్కడికి వెళ్లాలో, యే సందులు గొందులు తిరగాలో, యే పూటకూళ్ల యిళ్లు వెతకాలో బ్రహ్మ దేవుడికి కూడా తెలీదు కాబట్టి. నాతో కూడా నువ్వూ వుంటే యాతనవుతుందని" అన్నాడు లేవిన్ శాంతంగా వుండడానికి ప్రయత్నిస్తూ.

"యే యాతనా పెట్టను. నాకేం అక్కర్లేదు. నువ్వెక్కడుంటే, నేనూ అక్కడే..."

"మరెందుకూ కాకపోయినా ఆ ఆడమనిషి అక్కడ వుంటుంది కాబట్టి, నువ్వామె దగ్గర వుండగలవా" అన్నాడు.

"అక్కడ యెవళ్లుంటారో యేం వుంటుందో నాకు తెలీదు, తెలుసుకో దల్చుకోలేదు.

నా భర్త అన్నగారు అవసాన దశలో వున్నాడు. నా భర్త వెడుతున్నాడు, నేనూ నా భర్తతో వెళ్లాలి అనే నాకు తెలుసు, యెందుకంటే....''

''కిట్టీ, మరోలా అనుకోవద్దు! కాని నువ్వే చూడు. యిది యింత విషమ పరిస్థితి కదా, నాకు యెంతో బాధగా వుంది. నువ్వు వొక్కత్తివీ వుండాలన్న పిరికితనాన్ని యిప్పుడు చూపించడం. నీకిక్కడ వొంటరితనంగా వుంటే మాస్కో వెళ్లు.''

''చూశావా, నువ్వెప్పుడూ తుచ్ఛమైన ఉద్దేశాలే నాకు అంటగడుతూ వుంటావు!'' అని కిట్టీ అవమానంతో కోపంతో కళ్లమ్మట నీళ్లు జలజల కారుతూ వుండగా అంది. ''అలాంటిదేమీ లేదు, పిరికితనం యేమీ లేదు... నా భర్త కష్టంలో వున్నప్పుడు నేనతని పక్కన వుండటం నా కర్తవ్యం అని నాకనిపిస్తూ వుంటే నువ్వు కావాల్సికి నన్ను గాయ పరుస్తున్నావ్, కావాల్సికి నువ్వు అర్థం చేసుకో ప్రయత్నించడం లేదు....''

''యిది ఘోరం! యెవళ్ల బానిసో అవడం!'' అని లేస్తూ తన కోపాన్ని అదుపు చేసు కోలేక లేవిన్ అన్నాడు. కాని తనమీద తనే దెబ్బలు కొట్టుకుంటున్నాడని ఆ క్షణంలోనే అతనికి అనిపించింది.

''నువ్వసలు పెళ్లెందుకు చేసుకున్నావ్? స్వేచ్ఛగా వుంటూ! అంత పశ్చాత్తాప పడే వాడివి పెళ్లెందుకు చేసుకున్నావ్?'' అని ఆమె వొక్క ఉదుట్న గెంతి విసవిసా డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్లిపోతూ అంది.

అతను అక్కడికి వెళ్లేటప్పటికి ఆమె వెక్కుతూ వుంది.

కిట్టీ ఉద్దేశాన్ని మార్చే మాట సరేసరి, ఆమెని శాంతింప చెయ్యాలన్న ప్రయ త్నంతో మాటల కోసం వెతుక్కుంటూ చెప్పడం మొదలుపెట్టేడు. కాని ఆమె అతను చెప్పే మాటలు వినలేదు, వొప్పుకోలేదు. అతను ఆమెమీదకి వాలి, ఆమె తోసేస్తూ వున్నాగానీ ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. ఆమె చేతినీ, జుట్టునీ, మళ్లీ చేతినీ ముద్దు పెట్టుకున్నాడు. ఆమె యేమీ అనలేదు. అతను ఆమె ముఖాన్ని రెండు చేతుల్లోనూ పట్టుకుని ''కిట్టీ'' అన్నాడు. అప్పుడు ఆమె వొక్క సారి మెలుకువ వచ్చినట్టు భోరుమంది, యిద్దరికీ రాజీ కుదిరింది.

ఆ మర్నాడు పొద్దుట యిద్దరూ వెళ్లాలని యేర్పాటు చేసుకున్నారు. ఆమె తనకి యేదన్నా అవసరానికి అందుబాటులో వుండేందుకే తనతోబాటు వస్తోందన్న మాట తనకి నమ్మక మేననీ, మాషా తన అన్నగారితో వుండడం యేమీ అభ్యంతరకర విషయం కాదన్న అంగీ కారం కుదిరిందనీ అతను ఆమెతో అన్నాడు. కాని అతని అంతరంగం లోతుల్లో మాత్రం అతనికి ఆమె పట్లా, తన పట్లా వొక అసంతృప్తి మిగిలిపోయింది. తను వెళ్లవలసిన అవసరం పడినా తనని వెళ్లనివ్వనందుకు అతనికి కిట్టీ పట్ల అసంతృప్తి కలిగింది (యెంత చిత్రమైన విషయమంటే, ఆమె తనని ప్రేమించగలగడమే తన మహాద్భాగ్యంగా భావించిన అతను యిప్పుడు ఆమె తనని మేరమీరినట్టు ప్రేమిస్తోందని బాధపడి పోతున్నాడు!), ఆమెని గట్టిగా వారించ

చనందుకు తన పట్ల అతనికి అసంతృప్తి కలిగింది. అదీగాక అతనికి మనసులో మరో విష యంలో కూడా సమాధానం కుదరలేదు: అన్నగారితో వున్న ఆ ఆడమనిషి యీామె కేమా త్రమూ నసిపడదు. యిద్దరి మధ్యా గట్టిగా మాటామాటా రేగితే యెలా వుంటుందో అన్న దాన్ని తలచుకుంటేనే అతనికి భయంతో వణుకు పుట్టింది. అసలు, కిట్టీ — తన భార్య — బజారు ఆడమనిషి వున్న అదే గదిలో వుండడమనే వూహే అతనికి యేవగింపుగా వుంది, అతన్ని భయంతో కంపింప చేసింది.

## 17

నికొలాయ్ జబ్బుతో మంచం యెక్కిన గుబేర్నియా కేంద్రంలోని ఆ హోటెల్ గుబేర్ని యాలో వుండే బాపతు హోటెళ్లలాంటిదే. శుచి శుభ్రతలూ, సౌకర్యాలూ, అందమూ కూడా వుండే లక్ష్యంతో నవీన నాగరీక సూత్రాలకి అనుగుణంగా కట్టినటువంటిదే. కాని అక్కడికి వచ్చే కాతాదార్ల స్థాయి కారణంగా పైకి ఆధునిక సౌకర్యాల డాబు మిగుల్చుకుని గబగబా దుర్గంధ భూయిష్ట అధమ స్థాయికి దిగ జారిపోతాయి అవి. యీ పై పటారం వల్ల పాతకాలపు దుర్గంధపూరిత హోటెళ్లకంటే అధ్వాన్న స్థాయికి పడిపోతాయి. ప్రస్తుతం యీ హోటెల్ ఆదే అవస్థకి చేరుకుంది. అక్కడ మురికి వోడే యూనిఫాం వేసుకున్న మాజీ సైనికుడొకడు వాకిలి కావలివాడుగా వున్నాడు. అతను సోమరితనంగా సిగరెట్ కాలుస్తూ గుమ్మం దగ్గర వున్నాడు. అక్కడి మెట్లు చవకబారు యినప ముక్కల డిజైన్లతో, రోతగా, దిగాలుగా వున్నాయి. మరకల మరకల ఫ్రాక్ కోటు తొడుక్కున్న పొగరబోతు వెయిటర్ వొకడక్కడ వున్నాడు. హాల్లో బల్లమీద దుమ్ము కొట్టుకుపోయిన మైనం పూలగుచ్ఛం పూలకుండీ వుంది. యిక చుట్టూతా యెక్కడ చూసినా దుమ్మూ ధూళి, చెత్తాచెదారం కనిపిస్తున్నాయి. దీనికి తోడు రైల్వే స్టేషన్లలో వుండేలాంటి ఆధునిక బేఫర్వా వేడుక కనిపిస్తోంది. దీన్నంతటినీ చూసే సరికి శుభ్రమైన జీవితం గడుపుతూ వున్న లేవిన్ దంప తులకి తేడా కొట్టొ వచ్చినట్టు కనబడి రోత పుట్టింది. వాళ్ల గుండెలో బండ పడినట్టైంది. ముఖ్యంగా, అక్కడి వాతావరణం తాము యెదురు చూసే దానితో యే మాత్రం పొసగకుండా వుంది.

మామూలుగా జరిగేటట్టే యిప్పుడూ జరిగింది. యెలాంటి గది కావాలో అడిగిం తర్వాత వొక్క మంచి గది కూడా ఖాళీ లేదని జవాబు చెప్పేరు. ఒక గదిలో రైల్వే ఇనస్పె క్టరెవరో వున్నాట్ట. మరోదాంటో మాస్కో లాయరెవరో వున్నాట్ట. మూడో గదిలో అప్పుడే పల్లెనుంచి వచ్చిన ప్రిన్సెస్ అస్తాఫ్యెవా వుంది. వో మురికి గది మాత్రం ఖాళీగా వుంది, దాని పక్కనే వున్న గది వొకటి సాయంత్రానికి ఖాళీ అవవచ్చునట. లేవిన్ పెళ్లాన్ని తీసుకుని తమకి యిచ్చిన గదికి వెళ్లాడు. తను వూహించినట్టే పరిస్థితి వుండడంతో అతనికి ఆమెమీద

కోపం వచ్చింది. యిక్కడికి రాగానే అన్నగారికి యెలా వుందో యేమిటోనన్న తీవ్ర ఆందోళనతో హుటాహుటీ అతని గది దగ్గరికి వెళ్లడానికి బదులుగా పెళ్లాం సంగతి ముందు చూడాల్సి వచ్చింది.

"నువ్వెళ్లు, ఆయన దగ్గరికి వెళ్లు" అని కిట్టీ నేరం చేసినదాన్లా చూస్తూ లేవిన్‌తో బెరుకు బెరుగ్గా అంది.

లేవిన్ వొక్క మాట కూడా అనకుండా గది బయటికి వెళ్లేడు. గుమ్మంలోనే అతనికి మాషా తగిలింది. అతను వచ్చినట్టు ఆమెకి కబురు అందింది. కాని అతని గదిలోకి అడుగు పెట్టే ధైర్యం ఆమెకి లేకపోయింది. ఆమె మాస్కోలో కనిపించినప్పటిలాగానే వుంది. మెడికి, చేతులకి తెల్లని లేసులేని అదే ఉన్ని గౌను వేసుకుంది. స్ఫోటకం మచ్చల మొహం మీద అదే సౌజన్యపూరిత, జడ భావం వుంది. కాని మొహం కొంచెం లావెక్కినట్టుంది.

"వూఁ, యెలా వుంది అన్నయ్యకి? యెలా వుంది?"

"యేం బాగా లేదు. అస్సలు లేవ లేకుండా వున్నాడు. మీ కోసమే చూస్తూ వున్నాడు. మీరు... ఆమె... మీ భార్య కూడా వచ్చేరా?"

ఆమె యెందుకు గడబిడ పడుతోందో లేవిన్‌కి మొదట అంతు పట్టలేదు. ఆమె కారణం చెప్పింది.

"నే వెళ్లిపోతా. కింద వంట గదికి వెళ్లిపోతా. మీ అన్నకి సంతోషంగా వుంటుంది. ఆవిడ వచ్చేరని అతను విన్నాడు. ఆవిడ్ని యెరుగును, విదేశాల్లో వుండగా పరిచయం అయిన గుర్తు వుంది" అని మాషా అంది.

ఆమె కిట్టీని ఉద్దేశిస్తోందని లేవిన్‌కి బోధపడింది. కాని యేం జవాబు చెప్పాలో తట్టలేదు.

"నడవండి, అక్కడికి వెడదాం" అని లేవిన్ అన్నాడు.

యింకా గట్టిగా వొక అడుగు వేశారో లేదో గది తలుపు తెరుచుకుంది, కిట్టీ బయటికి చూసింది. ఆమె తనకిగా తననీ అతన్నీ యెంత సంకట స్థితిలో పడేసిందోనన్న కారణంగా అతను సిగ్గుతో కోపంతో యెర్రబడిపోయేడు. మాషా యింకా సిగ్గుతో యెర్రబడిపోయింది. ఆమె ముడుచుకుపోయి కుదుళ్లలోకంటా యెర్రబడిపోయింది. యేం చెప్పాలో చెందాలో తెలియక రెండు చేతులతోనూ భుజంమీద వున్న రుమాలు చివళ్లు పట్టుకుని యెర్రటి వేళ్లతో మెలితిప్పడం మొదలుపెట్టింది.

తనకి అర్థం కాని, ఘోరమైన ఆ ఆడమనిషికేసి కిట్టీ చూసిన చూపులో మహా కుతూహలం తటక్కని లేవిన్‌కి కనిపించింది. కాని ఆమె కుతూహలం వొక క్షణం పాటే వుంది.

"ఆయనకి యెలా వుంది? యెలా వుంది?" అని కిట్టీ మొదట అతన్నీ తర్వాత ఆమెనీ అడిగింది.

"యిది మాట్లాడుకునే చోటు కాదు" అని లేవిన్ వరండాలో అటు వస్తున్న యెవళ్లనో చూసి అన్నాడు. ఆ మనిషి కాళ్లు యెగరేసుకుంటూ తన పనిమీద పోతున్నాడు.

"అయితే లోపలికి రండి" అని కిట్టీ కొంచెం తెరుకున్న మాషని చూసి అంది. కాని లేవిన్ ముఖంలో కనిపించిన భయం చూసి "వుహు, వెళ్లండి, వెళ్లి తర్వాత నన్ను పిలవండి" అంది. ఆమె తిరిగి గదిలోకి వెళ్లిపోయింది, లేవిన్ అన్నగారి దగ్గరికి వెళ్లేడు.

లేవిన్ అన్నగారి గదిలోకి వెళ్లి చూసిందీ, అనుభూతి చెందిందీ అతను వూహించనట్టుగా వుంది. అన్నగారు మామూలుగా క్షయ రోగులందరికీ వుండే అనవసరమైన ఆందోళనతో వుంటాడు లెమ్మని లేవిన్ అనుకున్నాడు. ఆ ఆకురాలు కాలంలో అన్నగారు తన దగ్గరికి వచ్చినప్పుడు తనని చకితుణ్ణి చేసిన స్థితి అదీ. మృత్యు సామీప్యపు శారీరక లక్షణాలు మరింత స్పష్టంగా కనిపించవచ్చు, ఎక్కువ నీరసం, మరింత యెండిపోవడం లాంటివి; కాని మొత్తంమీద మునుపటి స్థితిలోనే వుండచ్చు లెమ్మని అనుకున్నాడు. లోగడ అతను వచ్చినప్పుడు అనిపించినట్టే ప్రియమైన అన్న బతకడనీ మృత్యువు పట్ల అదే భయం కలుగుతుందనీ కాకపోతే మరింత తీవ్రంగా వుండచ్చని అనుకున్నాడు. అలా అతను మనసులో వూహించుకుని పరిస్థితిని యెదుర్కోవడానికి తయారై వెళ్లేడు. కాని అక్కడ అతనికి పూర్తిగా భిన్నమైన దృశ్యం కనిపించింది.

ఆ గది చిన్నది. మురికిగా వుంది. గోడమీద అతికిన రంగుల పలకలు శ్రద్ధపట్టక మరకలు మరకలుగా వున్నాయి. పల్చని గోడ అవతలినుంచి యెవళ్లవో గొంతుకలు వినిపిస్తున్నాయి. గదినిండా చెడు వాసనలు కొడుతున్నాయి. అలాంటి గదిలో గోడకి దూరం జరిపిన మంచంమీద దుప్పటీ కప్పుకుని వో శరీరం పడుకుంది. ఆ శరీర బాహువు వొకటి దుప్పటీ పైన వుంది. ఆ బాహువు హస్తం, మోచేతిదాకా వొక్క రీతిగా, సన్నటి సలాకకి ఆట గొర్రు తగిలించినట్టుగా వుంది. తల దిండుమీద వొక పక్కకి వొరిగింది. కణతలమీద స్వేద బిందువుల చెమ్మకి అంటుకున్న పల్చని జుట్టు, ప్రుక్కి పోయి పారదర్శక చర్మం వున్నట్టు కనిపించే నుదురు లేవిన్‌కి కనిపించేయి.

'యీ ఘోరమైన శరీరం మా అన్న నికొలాయ్ కాదు' అనుకున్నాడు లేవిన్. కాని దగ్గరికి వెళ్లి ముఖం చూడగానే అనుమాన ఛాయలు కూడా మిగల్లేదు. ఆ ముఖంలో భయంకరమైన మార్పులు వచ్చినప్పటికీ, తన దగ్గరికి వచ్చిన మనిషికేసి చూడ్డానికి గాను పైకి యెత్తిన సజీవ నేత్రాలని చూస్తే చాలు, చెమ్మగిలిన మీసం కింద పెదాల నీరస కదలిక చూస్తే చాలు యీ మృత శరీరం తన సజీవ సోదరుడన్న భయంకర సత్యాన్ని లేవిన్ గ్రహించడానికి.

మిలమిల మెరిసే నికొలాయ్ కళ్లు గదిలోకి వచ్చిన తమ్ముడికేసి కఠినంగా నిష్కారంగా చూసేయి. తక్షణం ఆ చూపు జీవితుల మధ్య జీవ సంబంధాన్ని స్థాపించింది. ఆ చూపులో ద్యోతకమయే తత్కాల నిష్కారం, తన సుఖశాంతుల పట్ల పశ్చాత్తాపం లేవిన్‌కి అనుభూతం అయేయి.

లేవిన్ నికొలాయ్ చేతిని తన చేతిలోకి తీసుకోగానే అతను చిరునవ్వు నవ్వేడు. ఆ చిరు

నవ్వు నీరసంగా వుంది, కనిపించీ కనిపించనట్టుగా వుంది. ఆ చిరునవ్వు వున్నా కూడా చూపులో ద్యోతకమయే కఠోరత మారలేదు.

''నన్నిలా చూస్తానని అనుకున్నావా?'' అని అతను గొణిగేడు.

''వూఁ... లేదు'' అని లేవిన్ తడబడ్డాడు. ''నువ్వు ముందే, అంటే వెళ్లప్పుడే, యెందుకు వర్తమానం చెయ్యలేదు? నీ కోసం యెన్నో చోట్ల వాకబు చేశాను'' అన్నాడు.

మౌనంగా వుండకూడదని మాట్లాడ్డం తప్పిస్తే లేవిన్‌కి యేం చెప్పాలో తెలియలేదు. ముఖ్యంగా నికొలాయ్ తను అనే ప్రతి మాట ప్రాముఖ్యం యేమై వుంటుందా అని శోధిస్తున్నట్టు చూపు నిలిపి యేమీ మెదలకుండా వుండడంతో మరీ అలా అనిపించింది. తన భార్య కూడా తనతో వచ్చిందని లేవిన్ చెప్పేడు. నికొలాయ్ సంతోషం కనిపింప చేశాడు. కాని తన పరిస్థితి ఆమెని భయపెడుతుందేమోనని గాబరా పడుతున్నానని అన్నాడు. తర్వాత యెవళ్లూ మాట్లాళ్లేదు. వున్నట్టుండి నికొలాయ్ కదిలి మాట్లాడ్డం మొదలుపెట్టేడు. అతని ముఖంలో కనిపించిన భావాన్ని బట్టి అతను యేదో చాలా ముఖ్యమైన, అర్థవంతమైన విషయాన్ని చెప్తాడని లేవిన్ అనుకున్నాడు కాని అతను తన ఆరోగ్యం గురించి చెప్పేడు. డాక్టర్ని తిట్టి పోశాడు. మాస్కోనుంచి గట్టి డాక్టర్ని పిలిపించలేదని బాధపడ్డాడు. అతనికి యింకా బతక వచ్చనే ఆశ వున్నట్టు లేవిన్‌కి అర్థమైంది.

అతను మాట్లాడ్డం ఆపగానే లేవిన్ ఆ అవకాశాన్ని తీసుకుని లేచి నుంచున్నాడు. ఓ క్షణం సేపైనా యాతనాభరిత ఉద్రేకాలనుంచి తప్పించుకుందామని అనుకుని తను వెళ్లి భార్యని తీసుకు వస్తానని అన్నాడు.

''మంచిది, గది శుభ్రం చెయ్యమంటాన్లే. యిది మురిగ్గా వున్నట్టుంది, గబ్బుగా వున్నట్టుంది. మాషా, యిక్కడ శుభ్రం చెయ్యి'' అని అతను కష్టంమీద అన్నాడు. ''శుభ్రం చేసేసి వెళ్లిపో'' అని, తమ్ముడికేసి యేం అన్నట్టు చూశేడు.

లేవిన్ యేమీ జవాబు చెప్పలేదు. వరండాలోకి వెళ్లి ఆగేడు. భార్యని తీసుకు వస్తానని అన్నాడేగాని, అన్నగారి గదిలోకి వెళ్లేక తనకి కలిగిన త్రాసని చూసి ఆమె ఆ గదిలోకి అడుగు పెట్టకుండా వుండేటట్టు ఆమెని వొప్పించాలనుకున్నాడు. 'నాకు మల్లే తనూ యెందుకు యాతన పడ్డం?' అనుకున్నాడు.

''చెప్పు యెలా వుందాయనకి?'' అని కిట్టీ అడిగింది. ఆమె ముఖంలో భయం కనిపించింది.

''అబ్బ, ఘోరం, ఘోరం! నువ్వెందు కొచ్చావిక్కడికి'' అన్నాడు లేవిన్.

కిట్టీ కొన్ని క్షణాల సేపు బెరుగ్గా జాలిగా భర్తకేసి చూసింది. తర్వాత అతని దగ్గరికి వెళ్లి రెండు చేతుల్తోనూ అతని చెయ్యి పట్టుకుంది.

''మంచి వాడివి కదూ! నన్ను ఆయన దగ్గరికి తీసికెళ్లవూ. మన యిద్దరికీ యిది భరించడం తేలిక అవుతుంది. వూరికే నన్నక్కడికి తీసుకు వెళ్లి వదిలిపెట్టెయ్యి, చాలు,

యేం" అని అతన్ని బతిమాలింది. "నిన్ను చూసి, ఆయన్ని చూడక పోవడం నాకు యింకా కష్టంగా వుంటుంది, వూఁ? నేను నీకూ ఆయనకీ యేమన్నా సాయపడతానేమో. వూఁ? నీకు పుణ్యం వుంటుంది, నన్ను తీసికెళ్లు" అని ఆమె తన జీవిత సుఖ సౌభాగ్యాలు దానిమీదే ఆధార పడినట్టు అంది.

లేవిన్ సంబాళించుకున్నాక ఆమె అభ్యర్థనని కాదనలేకపోయేడు. మాషా విషయం పూర్తిగా మర్చిపోయి కిట్టీని అన్నగారి గదిలోకి తీసుకెళ్లాడు.

తేలిగ్గా అడుగులు వేస్తూ, మాటిమాటికీ భర్తకేసి చూస్తూ, ధైర్యంగా సానుభూతిగా కనిపిస్తూ ఆమె రోగి గదిలోకి వెళ్లింది. హడావుడి పడకుండా మెల్లిగా వెనక్కి తిరిగి తలుపు వేసింది. చప్పుడు చెయ్యకుండా గబగబా అడుగులు వేస్తూ రోగి మంచం దగ్గరికి వెళ్లింది. అతను తల తిప్పవలసిన అవసరం లేకుండా అటు వేపే వెళ్లింది. వెంటనే శల్యావశిష్టంగా వున్న అతని పెద్ద చేతిని నవనవలాడే తన పడుచు హస్తంతో పట్టుకుని, ఆడవాళ్లు మాట్లాడే తీరులో యే మ్మాత్రం కష్టం కలగనియ్యకుండా యెంతో జాలి కనబరుస్తూ మృదు సజీవ స్వరంతో అతనితో మాట్లాడింది.

"మనం జర్మనీలో ఖనిజ జలం దగ్గర కలుసుకున్నాం కాని అప్పుడు మనకి పరిచయం అవలేదు" అంది కిట్టీ. "నేను మీ మరదల్ని అవుతానని అప్పుడు మీరు అనుకుని వుండరు" అంది.

"మీరు నన్ను గుర్తుపట్టి వుండలేరు, కదా?" అని నికొలాయ్ కిట్టీ గదిలోకి అడుగు పెడుతూనే తన ముఖంలో లాస్యం చేసిన చిరునవ్వుతో అన్నాడు.

"యెందుక్కాదు, గుర్తు పట్టగలను. మాకు కబురు చెయ్యడం మంచిదైంది. మీ తమ్ముడు రోజూ మిమ్మల్ని జ్ఞాపకం చేసుకుంటూనే వుంటారు, మిమ్మల్ని గురించి అనుకుంటూనే వుంటారు" అంది.

కాని రోగిలో కనిపించిన సజీవ చైతన్యం యెక్కువ సేపు నిలవలేదు.

ఆమె మాట్లాడ్డం ముగించక ముందే జీవంతో తొణికిసలాడేవాళ్ల పట్ల మరణించేవాళ్లకి వుండే ఈర్ష్య కఠోర భావం, నిష్ఠూర భావం నికొలాయ్ ముఖంలో కనిపించేయి.

"మీకు యిక్కడ సౌకర్యంగా వున్నట్టు లేదు" అని ఆమె అతని చూపు తప్పించుకుని గదిని కలియ చూస్తూ అంది. "వేరే గది యిమ్మని హోటల్ ఆయనతో చెప్పాలి" అంది భర్తకేసి తిరిగి. "మన గదికి దగ్గర్లో" అంది.

## 18

లేవిన్ అన్నగారికేసి నిబ్బరంగా చూడలేకపోయేడు, అతని సమక్షంలో నిబ్బరంగా, మామూలుగా వుండనూ లేకపోయేడు. అతని దగ్గర వున్నప్పుడు లేవిన్ కళ్లూ, ధ్యానమూ

తనకి తెలియకుండానే పరదా పడినట్టై పోయేవి. అన్నగారి పరిస్థితిని వివరంగా చూడలేక పోయేడు. లేవిన్‌కి భయంకరమైన వాసన తగుల్తోంది, మురికి, గడబిడ, అన్నగారి యాతనా భరిత స్థితి చూస్తున్నాడు, అతని మూలుగులు చెవిన పడుతున్నాయి. కాని చెయ్య గలిగిందేమీ లేదని అనుకున్నాడు. అన్నగారి పరిస్థితిని వివరంగా చూద్దాం, దుప్పటీ కింద ఆ శరీరం యెలాంటి స్థితిలో వుందో చూద్దాం, శుష్కించిపోయిన కాళ్లు, నడుము, కటి భాగం యెలా వంగిపోయి వున్నాయో చూద్దాం, అతనికి మెరుగ్గా వుండేటట్టు చెయ్యలేకపోయినా కనీసం బాధ యింతలా లేకుండా తగ్గించగలమేమో చూద్దాం అన్న ఆలోచనే అతని బుర్రకి తట్ట లేదు. యీ వివరాల గురించి అనుకుంటే చాలు లేవిన్ వెన్ను పూసలో వొణుకు పుట్టుకొచ్చింది. అన్నగారిని మరింత కాలం బతికించుకునేట్టు చెయ్యడంగాని అతని బాధని తగ్గించడంగాని యే రకంగానూ సాధ్యం కాదని లేవిన్‌కి గట్టి నమ్మకం పాతుకుపోయింది. తమ్ముడు తనకి సాయం చెయ్యడం అసాధ్యమనుకుంటున్నాడని రోగి భావించుకున్నాడు. అందుకని అతనికి తృణీకారం కలిగింది. దాంతో లేవిన్ పరిస్థితి మరీ భారంగా తయారైంది. రోగి గదిలో వుండడమూ అతనికి యాతనగా వుంది, వుండకుండా పోవడమూ యింకా యాతనగా వుంది. మాటిమాటికీ యేదో సాకుతో గదిలోనుంచి బయటికి వెడుతూ, ఒంటరిగా వుండడం సాధ్యం కాకపోవడంవల్ల మళ్లీ లోపలికి వస్తూ యాపన చేశాడు.

కాని కిట్టీ అలా ఆలోచించలేదు, అలా అనుకోలేదు, ఆమె చర్యలూ అలా లేవు. రోగిని చూడగానే ఆమెకి అతని పట్ల జాలి కలిగింది. ఆ జాలి ఆమె నారీ హృదయంలో భర్త హృదయంలో మాదిరీ భయాన్నీ యేవగింపునీ కలిగించలేదు. కాని యేదన్నా చెయ్యాలన్న ప్రేరణని, రోగి పరిస్థితిని వివరంగా తెలుసుకోవాలన్న కోరికని అతనికి సాయపడాలన్న కోరికని కలిగించింది. తను అతనికి సాయం చెయ్యాలన్న విషయంలో యెలాంటి సందేహమూ లేనందుకు, తను అలా చెయ్యగలదు అన్నదాంట్లో కూడా యే మాత్రం సందేహమూ ఆమెకి లేకపోయింది. ఆమె వెంటనే ఆ పనికి నడుంకట్టింది. యే విషయాల గురించి వివరంగా అనుకోవడం భర్తకి వణుకు పుట్టించిందో వాటి మీదే ఆమె తక్షణం దృష్టి పెట్టింది. డాక్టరుకి కబురు చేసింది. మందుల కోసం పంపించింది. తనతో వచ్చిన పని మనిషినీ మాషానీ గది తుడవడానికీ, దుమ్ము దులపడానికీ, కడగడానికీ పురమాయించింది. తనే కొన్నిటిని తుడిచి కడిగింది. దుప్పటీ కింద దేన్నో పెట్టింది. ఆమె సూచనల మేరకి రోగి గదిలో కొన్ని వస్తువుల్ని తెచ్చి పెట్టారు, కొన్ని వస్తువుల్ని అక్కడినుంచి తొలగించేరు. వరండాలో యెవరు యెదురవుతున్నారూ యేమిటీ అనే పట్టింపు లేకుండా ఆమె కొన్ని సార్లు తన గదికి వెళ్లి అక్కణ్ణుంచి దుప్పట్లు, గలేబులు, తువ్వాళ్లు, రోగికి చొక్కాలు వగైరా తీసుకు వచ్చింది.

ఉమ్మడి హాల్‌లో ఇంజనీర్లకి భోజనాల యేర్పాట్లు చూస్తున్న నౌకరు కిట్టీ కబురంపగానే కొన్ని సార్లు ముసురు ముఖం పెట్టుకు వచ్చేడు, కాని ఆమె అడిగిందాన్ని చెయ్యనని అనలేకపోయేడు. ఆమె అంత స్నేహ నొక్కి అడగంతో కాదనడం అతనికి కష్టమయింది.

లేవిన్ దీన్ని దేన్నీ సమ్మతించలేకపోయేడు. రోగికి దానివల్ల లాభం వుంటుందని అతనికి నమ్మకం కలగలేదు. పైగా అతనికి కోపం వస్తుందేమోనని కూడా లేవిన్‌కి భయం కలిగింది. రోగి తనకేం పట్టనట్టుగా పైకి కనిపించినా కోప్పడలేదు. సిగ్గు పడ్డాడు. మొత్తం మీద కిట్టీ చేసిన దాంటో ఆసక్తి చూపించేడు. కిట్టీ పంపిస్తే డాక్టరు దగ్గరికి వెళ్లి అతన్ని తీసుకువచ్చేడు లేవిన్. వచ్చి తలుపు తొయ్యగానే కిట్టీ ఆదేశానుసారం మాషా, నౌకరూ కలిసి అన్నగారికి చొక్కా మారుస్తూ వుండడం కనిపించింది. వెనకనుంచి చూస్తే బారుగా తెల్లగా వున్న కాయం, పొడుచుకువచ్చిన భుజాస్థులు, యెండిపోయిన పక్కటెముకలు, వెన్నుపూస పూర్తిగా అచ్ఛాదన లేకుండా కనిపించేయి. రోగి వేళాడే పొడుగాటి చేతికి మాషా, నౌకరూ కలిసి చొక్కా చేతులు తొడగలేకపోతున్నారు. లేవిన్ రాగానే వెంటనే కిట్టీ తలుపు మూసేసి రోగి వేపు చూడకుండా ముఖం తిప్పుకుంది. కాని రోగి మూలగడంతో ఆమె గబగబా అతని వేపు వెళ్లింది.

"వూ గబగబా కానీండి" అంది కిట్టీ.

"యిక్కడికి రావద్దు" అన్నాడు రోగి కోపంగా. "నేనే నా అంతట..."

"యేమంటారు?" అని మాషా అడిగింది.

కాని కిట్టీ వింది. తన ముందు చొక్కా లేకుండా కనిపించడానికి అతను సిగ్గు పడుతున్నాడనీ, బాధ పడుతున్నాడనీ గ్రహించింది.

"నే చూడ్డం లేదు, నే చూడ్డం లేదు" అని కిట్టీ చొక్కా చేతిని తొడుగుతూ అంది. "మాషా అటు వేపు వెళ్లి సరిగా లాగండి" అంది.

"కొంచెం వెళ్లి నా చిన్న సంచీలో సీసా వుంటుంది, తే" అని భర్తకేసి తిరిగి అంది. "పక్కనున్న చిన్న అరలో వుంటుంది. తీసుకు రా, యీ లోపున యిక్కడ అంతా సర్దేస్తాం" అంది.

సీసా తీసుకుని లేవిన్ తిరిగి వచ్చేటప్పటికి రోగి పడుకున్నాడు, అక్కడ అంతా మారిపోయింది. చెడ్డ వాసన పోయింది. ద్రావకం, అత్తరు కలిసిన సుగంధం వ్యాపించింది. కిట్టీ వో గొట్టాన్ని పెదాల దగ్గర పెట్టుకుని, యెర్రని చెక్కిళ్లతో వూదుతూ దాన్ని చిమ్మింది. యెక్కడా దుమ్మన్న మాట లేదు. మంచం పక్కన నేలమీద వో కంబళీ పరిచి వుంది. బల్లమీద మందు సీసాలు, నీళ్ల సీసా సర్ది వున్నాయి. తుడిచే గుడ్డ కొత్తదీ వుంది. కిట్టీ ఎంబ్రాయిడరీ చేసిందీ వుంది. మంచం పక్క బల్లమీద నీళ్ల గ్లాసు, కొవ్వొత్తి, యేవో చూర్ణాలూ వున్నాయి. రోగికి శుభ్రంగా చేతులూ ముఖమూ కడిగి తల దువ్వి శుభ్రమైన దుప్పట్లమీద యెత్తుగా పేర్చిన దిండ్లకి ఆన్చి పడుకోబెట్టారు. అతను కొత్త చొక్కా తొడుక్కున్నాడు. యెండిపోయిన మెడమీద ఆ చొక్కా తెల్లని కాలరు అంటిపెట్టుకు వుంది. అతని కళ్లు కిట్టీమీదనుంచి మళ్లలేదు, ఆ కళ్లల్లో నూతన ఆశ కనిపించింది.

క్లబ్బులో వెతికి లేవిన్ పట్టుకు వచ్చిన డాక్టరు నికొలాయ్‌కి వైద్యం చేసే పాత డాక్టరు కాదు. నికొలాయ్‌కి అసంతృప్తి కలిగించిన అతను కాదు. యీ కొత్త డాక్టరు స్టెతస్కోప్

పెట్టి విని తల వూపి యేదో ప్రిస్క్రిప్షన్ రాసి మందుని యెలా తీసుకోవాలో మొదట సవివరంగా చెప్పాడు. తర్వాత పథ్య పానాలు యెలా వుండాలో వివరించేడు. పచ్చివిగాని మెత్తగా వుడకబెట్టినవిగాని గుడ్లు తీసుకోవచ్చుట, గోరువెచ్చగా కాచిన పాలల్లో సోడా నీళ్లు కలిపి తీసుకోవచ్చుట. డాక్టరు వెళ్లిపోయేక నికొలాయ్ యేదో లేవిన్‌తో చెప్పాడు. కాని లేవిన్‌కి 'నీ కాత్యా' అనే మాటలే తెలిశాయి. కాని అతను ఆమెకేసి చూసిన తీరుని బట్టి ఆమెని మెచ్చుకుంటున్నాడని లేవిన్‌కి అర్థమైంది. అన్న కిట్టీని కాత్యా అని పిలిచి దగ్గరికి రమ్మన్నాడు.

"నాకు చాలా మెరుగ్గా వుంది" అన్నాడు. "మీ దగ్గర వుండి వుంటే యెప్పుడో బాగయి వుండేది నాకు. యెంత తేలిగ్గా వుంది!" అన్నాడు. అతను ఆమె చేతిని తీసుకుని దాన్ని పెదాల దాకా యెత్తి పట్టుకున్నాడు. కాని ఆమె వెలపరంతో దులపరించకుంటుందేమో అనుకున్నట్టు మళ్లీ వదిలేసి వూరికే నిమిరాడు. కిట్టీ అతని చేతిని తన రెండు చేతుల్లోనూ తీసుకుని అదిమింది.

"నన్ను యెడమ వేపు తిప్పి, వెళ్లి కాసేపు నిద్రపోండి" అని అతను గొణిగాడు.

అతనేమన్నాడో కిట్టీ తప్ప యెవళ్లూ గ్రహించలేదు. ఆమెకి అర్థమైంది. యెందుకంటే అతని ప్రతి కోరిక యేమై వుంటుందో వూహించడంమీదనే ఆమె మనసు లగ్నం అయింది.

"అటు వేపుట" అంది భర్తతో. "ఆయన యెప్పుడూ అటు ఒత్తిగిలే పడుకుంటారు. మీరు సాయం చెయ్యండి, వేరే మనిషిని పిలిస్తే ఆయనకి యిష్టం వుండదు, నేను తిప్పలేను. మీరు చెయ్యగలరేమో" అంది మాషాకేసి తిరిగి.

"నాకు భయంగా వుంది" అంది మాషా.

ఆ భయంకరమైన శరీరాన్ని చేతుల్లో తీసుకోవడం లేవిన్‌కి భయంకరంగా వున్నాగానీ, దుప్పటీ కింద వున్న శరీర భాగాల్ని గురించి అనుకోవడం కూడా అతనికి యిష్టం లేకపోయినా స్పృశించడం భయంకరంగా వున్నాగానీ అతను భార్య చెప్పినట్టే చేశాడు. ఆమెకి బాగా తెలిసిన గంభీర వాలకం పెట్టి — తన యీ వాలకం ఆమెకి బాగా తెలుసు — చేతులు చాచి అన్నగార్ని పట్టుకున్నాడు. తను దారుఢ్యవంతుడే అయినా శుష్కించిపోయిన ఆ అవయవాల భారం అతనికి ఆశ్చర్యం కలిగించింది. అన్నగారి భారీ శల్య హస్తం తన మెడని చుట్టుకోగా తను అతన్ని యెత్తుతూ వుంటే కిట్టీ గబగబా యేం మాట్లాడకుండా తలగడలు యెత్తి, దులిపి రోగి తల కింద సర్దింది, ఆమె నికొలాయ్ జుట్టుని సర్దింది. అది పలచగా వుంది. అతని తలకి మళ్లీ అంటుకుపోయింది.

రోగి తమ్ముడి చేతిని తన చేతిలో పట్టుకున్నాడు. అతను కావాల్సికి యెందుకనో తన చేతిని అతని వేపు లాక్కుంటున్నట్టు లేవిన్‌కి అనిపించింది. యేం విదిలించుకోకుండా అతను ఉగ్గబట్టి వున్నాడు. అవును, రోగి తన చేతిని యెత్తి ముద్దుపెట్టుకున్నాడు. లేవిన్ వెక్కుతో కదిలిపోతూ, ఆపుకోలేక వొక్క మాట కూడా అనలేక గదిలోనుంచి బయటికి వెళ్లిపోయేడు.

19

"మహర్షులకు బోధపడని రహస్యాన్ని* పసిపిల్లలకు అమాయకులకు విశదం చేసితివి" — ఆ సాయంత్రం భార్యతో మాట్లాడుతూ వుండగా లేవిన్ ఆమెని గురించి అనుకున్నాడు.

లేవిన్ తను మహర్షినని భావించుకుంటూ వున్నందువల్ల అతనికి పవిత్ర గ్రంథంలోని యీ పాదాలు గుర్తుకు వచ్చేయని కాదు. అతను వివేకవంతుణ్ణని అనుకోలేదు కాని తన భార్య కంటే, అగాఫ్యా మిహైలొవ్నా కంటే తనకి యెక్కువ అవగాహన వుందని అతనికి తెలియకపోలేదు. మృత్యువు గురించి ఆలోచన చేసినప్పుడు తన సర్వబౌద్ధిక శక్తితోనూ అలా చేస్తాడని అతనికి తెలుసు. మృత్యువు గురించి తను యే మహాత్ముల రచనలు చదివాడో వాళ్లంతా ఆ విషయంమీద గాఢావలోకనం చేసారనీ, కాని దాన్ని గురించి తన భార్య, అగాఫ్యా మిహైలొవ్నాలకి తెలిసిన దాంట్లో శతాంశం కూడా వాళ్లకి తెలియదనీ అతనికి తెలుసు. యీ యిద్దరు నారీమణులు, అగాఫ్యా మిహైలొవ్నా, కాత్య అని తన అన్నగారు సంబోధించిన కిట్టీ, — తనకీ యిప్పుడు అలా ఆమెని పిలవడం యిష్టమైంది — భిన్నమైన వ్యక్తిత్వాలు వున్న వాళ్లైనా యీ విషయానికి సంబంధించి వొకలాగే వున్నారు. జీవితం యేమిటి, మృత్యువు యేమిటి అని యిద్దరికీ నిస్సందేహంగా తెలుసు; అలాగే లేవిన్ ముందు ప్రత్యక్షం అయే ప్రశ్నలని వాళ్లు అర్థం చేసుకోనూ లేరు, సమాధానం చెప్పనూ లేరు. యీ ఘటన ప్రాముఖ్యం గురించి ఆ యిద్దరికీ సందేహం లేదు. లోకంలో వున్న కోట్లాది ప్రజలలాగా ఆ యిద్దరికీ యీ విషయంలో వొకే దృష్టికోణం వుంది. మృత్యువు అంటే యేమిటీ అనేది ఆ యిద్దరికీ తెలుసునని చెప్పడానికి దాఖలా యేమంటే యే రకమైన తటపటాయింపులూ లేకుండా మృత్యు సమీపంలో యేం చెయ్యాలో వాళ్లకి తెలిసి వుండడం, అదంటే భయ పడకపోవడం. లేవిన్, అతనిలాంటి యితరులూ కూడా మృత్యువు గురించి యెంతో విపులీకరించగలిగినా అదంటే యేమిటో వాళ్లకి తెలియదనడం స్పష్టం. యేమంటే వాళ్లకి మృత్యువు అంటే భయం, యెవళ్లేనా చనిపోయేటప్పుడు యేం చెయ్యాలో వాళ్లకి అసలు తెలీదు. అన్నగారు నికొలాయ్‌తో లేవిన్ వొక్కడూ గనక యిప్పుడు వున్నట్లయితే అతను భయ భ్రాంతుడై అన్నగారికేసి చూస్తూ వుండేవాడు, యింకా యెక్కువ భయ భ్రాంతుడై యెప్పుడు అది జరుగుతుందా అని చూస్తూ వుండేవాడు. అంతకుమించి యేమీ చెయ్యలేకపోయి వుండేవాడు.

అంతే కాదు, యేం చెప్పాలో, యెలా యెటు చూడాలో యెలా నడుచుకోవాలో అతనికి తెలీదు. యేవేవో విషయాలు ప్రస్తావించడం నేరం అని, అనుచితం అని అతనికి అనిపిస్తుంది. మృత్యువు గురించీ లేదా యేదన్నా దుఃఖపూరిత విషయాల గురించీ ప్రస్తావించడమూ అనుచితమే. యేం మాట్లాడకుండా కూర్చోవడమూ అనుచితమే. 'అతనికేసి చూస్తే నేను తననే పరీక్షగా చూస్తూ వున్నాననీ తనంటే భయపడుతున్నాననీ అనుకుంటాడు;

చూడనూ — నేను యేవో వేరే వాటి గురించి అనుకుంటూ వున్నానని బాధపడచ్చు. ముని వేళ్లమీద నడిచి వెళ్లానా అతనికి తప్పుగా తోచవచ్చు, గబగబా నడిచానా బాగుండదు.' కిట్టీకి యిలాంటి ఆలోచనలేమీ లేవనేది స్పష్టమే. నిజానికి తన గురించి ఆలోచిస్తూ కూర్చోనే వ్యవధీ ఆమెకి లేదు. ఆమె నికొలాయ్ గురించే ఆలోచిస్తోంది. ఆమెకి యేదో తెలుసు, అంచేత అంతా సవ్యంగా జరుగుతోంది. ఆమె అతనికి తన గురించి చెప్పింది. తన పెళ్లి గురించి చెప్పింది. చిరునవ్వు నవ్వింది. అతన్ని చూసి జాలిపడింది. అతనితో మృదువుగా ప్రవర్తించింది. లోకంలో అద్భుతంగా కోలుకున్న ఘటనల గురించి చెప్పింది. అంతా సాఫీగా సాగింది. అంచేత ఆమెకి తెలుసుననే అనుకోవాలి. కిట్టీ, అగాఫ్యా మిహైలొవ్నాల చర్యలు సహజ ప్రేరణవల్ల, ఐంద్రిక అహేతుక వ్యవహార పరిణామంవల్ల వచ్చినవి కాదు. వాళ్లు రోగి బాధని తగ్గించడానికి ప్రయత్నించడం, శారీరక పోషణ విషయం చూడ్డం మాత్రమే కాక ఆ యిద్దరూ మరణించే వ్యక్తి శారీరక సేవ చెయ్యడం కంటే యెక్కువ అపేక్షించారు, దానికి మరణించే వ్యక్తి శరీరంతో యే సంబంధమూ లేదు. అగాఫ్యా మిహైలొవ్నా ఆ మధ్య చనిపోయిన వ్యక్తి గురించి అంది: "దేముడి దయవల్ల అతనికి ధర్మానుష్ఠానం, పవిత్ర విలేపన సంస్కారం జరిగేయి. ప్రతి వాళ్లకీ పరాత్పరుడు అలాంటి మరణం ప్రసాదించాలి." కిట్టీ కూడా నికొలాయ్‌కి శుభ్రమైన బట్టలు తొడగడం, తాగేందుకు నీళ్లు యివ్వడం, శయ్యావ్రణాల్ని నయం చెయ్యడంలాంటి వాటి గురించి సతమతమవుతూ వున్నా ధర్మానుష్ఠానం, పవిత్ర విలేపన సంస్కారం తీసుకొనేటట్టు అతన్ని మొదటి రోజునే సమ్మతి చేసింది.

లేవిన్ రోగి గదినుంచి రాత్రి పడుకుందుకు తమ రెండు గదులకీ వెళ్లాక తల వాలేసుకుని యేం చెయ్యాలో తోచక కూర్చుండిపోయేడు. భోజనం, పడక యేర్పాట్లు చూడమని చెప్పడం, యిక ముందు యేం చెయ్యాలీ అన్న ఆలోచన చెయ్యడం సరే సరి, అతను భార్యతో మాట్లాడను కూడా మాట్లాడలేకపోయేడు. అతనికి సిగ్గుగా వుంది. కిట్టీ తద్భిన్నంగా మామూలు రోజుల్లో కంటే చురుగ్గా వుంది. మామూలు రోజుల్లో కంటే చొరవగా వుంది. భోజనం తెమ్మని పురమాయించింది. తనే సామాన్లని సర్దింది, పడకలు వెయ్యడానికి చెయ్యి అందించింది. వాటిమీద క్రిమినాశక మందు చల్లడం కూడా మర్చిపోలేదు. యుద్ధానికి ముందు, జీవిత ప్రమాద భూయిష్ట నిర్ణాయక క్షణంలో, వో మగాడికి వచ్చేలాంటి ఉత్సాహమూ, శీఘ్ర గ్రహణ శక్తీ ఆమెకి వచ్చేయి. అలాంటి క్షణంలో ఆ మగవాడు తన సామర్థ్యాన్ని ప్రదర్శిస్తాడు, ఆ క్షణానికి ముందు దాకా వున్న జీవితమంతా వ్యర్థం కాదనీ, ఆ అత్యంత ముఖ్య ఘటనకి సన్నద్ధం కావడమనీ రుజువు చేస్తాడు.

కిట్టీ ప్రతి పనినీ లాఘవంగా చేసింది. యింకా అర్ధరాత్రి కూడా కాలేదు, అన్ని వస్తువులూ చక్కగా యెలా అమిరాయంటే గదులు యిల్లులాగా, యింట్లో వున్న గదుల్లాగా

కనిపించేయి. పడకలు యేర్పాటయ్యాయి. బ్రష్షులు, దువ్వెనలు, అద్దాలు సరిగా సర్ది అమిరేయి. బల్లమీద చేతి తువాళ్లని పరచడం జరిగింది.

అలాంటి సమయంలో తినడం, నిద్రపోవడం, మాట్లాడుకోవడం క్షమించరానివని లేవిన్‌కి అనిపించింది. తన ప్రతి కదలిక అనుచితంగా కనిపించింది. అందుకు విరుద్ధంగా కిట్టీ బ్రష్షులని సరిగా పెడుతోంది, కాని అన్నిట్నీ యెలా సర్దుతోందంటే అందులో నాలిక కరుచుకోవాల్సింది యేమీ లేదన్నట్టు చేస్తోంది.

అయినా యెవళ్లూ తిండి తినలేకపోయారు, నిద్రపోలేకపోయేరు, చాలా సేపటిదాకా మెలుకువగా కూర్చుండిపోయేరు.

"నాకు చాలా సంతోషంగా వుంది. రేపు పవిత్ర విలేపన సంస్కారం తీసుకుందుకు ఆయన్ని వొప్పించాను" అని ఆమె అద్దం ముందు బ్లౌజు తొడుక్కుని కూర్చుని సువాసనలు చిమ్మే తన మెత్తటి జుట్టుని దువ్వుకుంటూ అంది. "నేనీ సంస్కారం యేమిటో యెన్నడూ చూళ్లేదు, కాని ఆయుష్షు కోసం ప్రార్థన చెయ్యడం వుంటుందని అమ్మ చెప్పగా విన్నాను" అంది.

"అతను కోలుకుంటాడని నువ్వు అనుకుంటున్నావా నిజంగా?" అని కిట్టీ దువ్విన జుట్టుమీద పానిచ్చినప్పుడు ఆమె గుండ్రటి చిన్న తల వెనక సన్నటి పాపిడి మాయమై పోతూ వుండడం చూస్తూ లేవిన్ అన్నాడు.

"నేను డాక్టర్ని అడిగేను. బావగారు మూడ్రోజుల కంటే యెక్కువ బతకరని చెప్పాడు. కాని డాక్టర్లేం సర్వజ్ఞులా? సరే, యేమయితేనేం నాకు సంతోషంగా వుంది ఆయన్ని వొప్పించాను" అని ఆమె మొహంమీద పడిన జుట్టులోనుంచి భర్తకేసి చూస్తూ అంది. "యేమన్నా జరగవచ్చు" అని ఆమె అంది. మతం గురించి మాట్లాడినప్పుడల్లా ఆమె ముఖంలో ప్రత్యేక తరహాగా, కొంచెం కొంటెగా, గోచరమయే భావంతో అంది.

పెళ్లికి ముందు మతం గురించి మొదటి సారి మాట్లాడుకున్న తర్వాత యిద్దర్లో యెవళ్లూ ఆ విషయం గురించి మళ్లీ ప్రస్తావించలేదు. కాని ఆమె చర్చికి వెళ్లడం, ప్రార్థనలు చెయ్యడం అనే ఆచారాల్ని, అవి అవసరం అయినట్టు, శాంత చిత్తంలో పాటించేది. లేవిన్ ప్రతికూల విశ్వాసం కనబరిచినా అతను కూడా క్రైస్తవుడేననీ, తనలాగా, తన కంటే యెక్కువ మంచి క్రైస్తవుడేనని ఆమె దృఢంగా నమ్మింది. ఆ విషయం గురించి అతనేం అన్నా అది మగాళ్లకి వుండే పరిహాస ధోరణివల్లనే అనీ అనుకుంది. మంచి యిల్లాళ్ల కంతల్ని కప్పుతారనీ కాని తను కావాల్సికి కంతల్ని చేస్తుందనీ అతను ఎంబ్రాయిడరీ గురించి వ్యాఖ్య చేసినట్టు అంటున్నాడనీ ఆమె అనుకొంది.

"చూశావా, ఆ మనిషి మాషా నువ్వు చేసినట్టు చెయ్యలేకపోయి వుండేది" అన్నాడతను. "నిజం చెప్తున్నా.... నువ్వు రావడం నాకు చాలా సంతోషంగా వుంది. నువ్వు పవిత్రతా మూర్తివి..." అంటూ అతను కిట్టీ చేతిని తీసుకున్నాడు కాని ముద్దుపెట్టుకో

లేదు (మృత్యువు సన్నిధిలో ముద్దుపెట్టుకోవడం అనుచితం అనిపించి). అతను వూరికే చేతిని అదిమి కిట్టీ మెరిసే కళ్లల్లోకి అపరాధిలాగా చూశేడు.

"నువ్వొక్కడివీ యిక్కడ వుండడం మహా యాతనగా వుండేది" అని ఆమె చేతుల్ని యెత్తి ముఖం దాచుకుంటూ అంది. ఆమె ముఖం సంతోషంతో య్రెరబడింది. ఆమె జుట్టుని చిన్నగా ముడి చుట్టి సూదులు గుచ్చుకుంది. "వూహుఁ" అంది. "ఆమెకి తెలీదు పాపం. అదృష్టవశాత్తూ నాకు ఖనిజ జలం దగ్గర చాలా విషయాలు తెలిశాయి."

"యేం, అక్కడ యితనంతటి జబ్బు మనుషులుండేవారా?"

"యింకా అధ్వాన్నంగా వుండే మనుషులుండేవారు."

"పడుచు వాడిగా వున్న రోజులనాటి రూపంలో తప్ప మరోలా అన్నయ్యని వూహించుకోలేకపోతున్నాను. అది చాలా భయంకరంగా వున్న విషయం. చెపితే నమ్మవు నువ్వు అతనెంత అందంగా వుండేవాడో, కాని అప్పుడు నేనతన్ని అర్థం చేసుకోలేదు."

"యెందుకు నమ్మను! ఆయనా నేనూ మంచి నేస్తాలం అయివుండేవాళ్లం అని నాకు అనిపిస్తోంది" అని కిట్టీ ఆగిపోయింది. తన మాటల అర్థ సంకేతానికి భయ విహ్వలితురాలై భర్తకేసి చూసింది. ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగేయి.

"అవునవును, అంతే వుండేది" అని అతను విచారంగా అన్నాడు. "యీ లోకానికి చెందిన మనిషి కాదు అంటూ వుంటారే, అతను నిజానికి ఆ కోవలో మనిషి" అన్నాడు.

"కాని మనకి ముందు ముందు యింకా గడ్డు రోజులున్నాయి. వూఁ, పడుకుందాం" అని కిట్టీ తన చిన్న గడియారంకేసి చూసుకుంటూ అంది.

## 20

### మరణం

మర్నాడు రోగికి ధర్మానుష్ఠానం, పవిత్ర విలేపన సంస్కారం జరిగేయి. ఆ సమయంలో నికొలాయ్ చాలా తీవ్రంగా ప్రార్థన చేశాడు. రంగుల గుడ్డ కప్పిన మేజాపైన దేవ ప్రతిమని పెట్టేరు. నికొలాయ్ కళ్లు దానిమీదనే లగ్నం అయి యెంత ఉత్సాహభరిత వేడికోలుతో తీవ్ర ఆశాపూరితంగా కనిపించాయంటే లేవిన్‌కి వాటిని చూడ్డానికి భయం అయింది. అంతటి ఉత్సాహపూరిత వేడికోలు, తీవ్ర ఆశ అతను అంతగా ప్రేమించిన జీవితానికి వీడ్కోలు చెప్పడం కష్టతమం చేస్తాయని లేవిన్‌కి తెలుసు. లేవిన్‌కి అన్నగార్ని గురించీ, అతని ఆలోచనా రీతి గురించీ తెలుసు. భగవంతుడి పట్ల అతనికి అవిశ్వాసం కలగడానికి కారణం నమ్మకం లేకుండా బతకడం అతనికి సులభమైనందువల్ల అని కాదు. విశ్వరూపం గురించి ఆధునిక శాస్త్రీయ వివరణలు వచ్చిన దాని ఫలితంగా క్రమక్రమంగా భగవంతుడి మీద అతనికి వున్న ఆదరణ భావం తొలిగిపోయింది అని లేవిన్‌కి తెలుసు. అంచేత యిప్పుడు

అతని నమ్మకం సత్యపూరితంగా, ఆలోచనా పరిణామక్రమంగా వచ్చినటువంటిది కాదు, తాత్కాలికమైంది, స్వస్థత చేకూరాలన్న వివేకహీన తీవ్రకామనా ప్రేరిత స్వలాభాపేక్షవల్ల వచ్చినటువంటిది అని లేవిన్‌కి తెలుసు. అద్భుతంగా కోలుకున్న గాథలు చెప్పి కిట్టీ అతని ఆశల్ని రగిలించిందని లేవిన్‌కి తెలుసు. ప్రార్థన చేస్తూ ఆశాపూరితంగా వున్న ఆ కళ్లు, యెండిపోయి శల్యా మాత్రంగా మిగిలి, శిలువ గీసుకుందుకు కూడా నుదుటి దగ్గరకి యెత్తలేని చెయ్యి, బొమికెలు పొడుచుకు వచ్చిన భుజాలు, దేని కోసం అయితే అతను అంత తీవ్రంగా ప్రార్థిస్తూ వున్నాడో ఆ ప్రాణాన్ని యిక నిలబెట్టుకోలేని శూన్య ఛాతీ — వీటిని చూడ్డం లేవిన్‌కి చెప్పలేనంత దుర్భర యాతనగా వుంది. లేవిన్‌కి అవన్నీ తెలుసు. ధార్మిక అనుష్టానం సమయంలో లేవిన్ కూడా ప్రార్థన చేశాడు, నిరీశ్వరవాది అయిన తను వెయ్యి సార్లు చేసినలాంటి వాటినన్నిట్నీ చేశాడు. భగవంతుణ్ణి స్మరిస్తూ అతను అన్నాడు: "నువ్వంటూ వుంటే యీ రోగిని స్వస్థుణ్ణి చెయ్యి (యెన్ని చెప్పినా అనేక సార్లు అలా జరిగింది కదా) అలా చేసి అతన్నీ నన్నూ రక్షించు."

పవిత్ర విలేపన సంస్కారం తర్వాత రోగి ఆరోగ్యం అనూహ్యంగా బాగుపడినట్టు అనిపించింది. గంటదాకా అతనికి దగ్గ నేదే రాలేదు. అతను చిరునవ్వు నవ్వేడు, కిట్టీ చెయ్యి ముద్దుపెట్టుకున్నాడు. కళ్ల నీళ్లు తిరుగుతూ వుంటే ఆమెకి కృతజ్ఞతలు చెప్పి తనకి వొంట్లో బాగా వుందనిపిస్తోందని అన్నాడు. అతనికి యే బాధా అనిపించలేదు. ఆకలి పుట్టి నట్టు, లోపల శక్తి వచ్చినట్టు అనిపించింది. భోజనం తెచ్చినప్పుడు స్వయంగా తనే లేచి కూర్చున్నాడు, కట్లెట్ కూడా కావాలని అడిగేడు. అతని పరిస్థితి యే మాత్రం ఆశాజన కంగా లేదనీ, యెంత కోరుకున్నా అతను బతకలేడనీ తెలిసినా లేవిన్, కిట్టీ వొక గంట సేపు సంతోషభరిత, ఉత్తేజిత స్థితిని, అలాగే తాము పొరపాటు పడుతున్నామేమోనన్న భయ భీత భావాన్నీ కూడా అనుభవించేరు.

"బాగుందా?" — "ఆఁ, చాలా బాగుంది!" — "ఆశ్చర్యంగా వుంది" — "యిందులో ఆశ్చర్యకరమైందేమీ లేదు" — "మళ్లీ బాగయింది" అని వాళ్లు వొకళ్లకేసి వొకళ్లు చూసు కుంటూ గుసగుసలాడుకున్నారు.

యీ భ్రాంతి యెక్కువ సేపు వుండలేదు. రోగి ప్రశాంతంగా నిద్రపోయేడు. కాని అరగంట తర్వాత దగ్గువల్ల మెలుకువ వచ్చింది. వెంటనే అతనికీ, అతని చుట్టు పక్కల వున్న అందరికీ ఆశ అడుగంటింది. అతను వేదన పడుతున్న యదార్ధ స్థితి యే అనుమా నమూ లేకుండా అతనికి, లేవిన్‌కి, కిట్టీకి అంతకు ముందు కించిత్ మాత్రంగా తలెత్తిన ఆశాలేశాన్ని కూడా మిగల్చకుండా హరించి వేసింది.

తనకి అరగంట కితం నమ్మకం కలిగించిన విషయాన్ని గురించి ప్రస్తావించకుండా, ఆ స్ఫురణే లజ్జాకారకం అయినట్టు, ఆఘ్రాణించడానికి చిల్లుల కాగితం చుట్టిన అయొ డిన్ సీసాని యిమ్మని అతను అడిగేడు. లేవిన్ అతనికి సీసాని అందిచ్చేడు. ధార్మిక అనుష్టాన

సమయంలో మాదిరీ తీవ్ర ఆశాపూరిత చూపు చూస్తూ, అయొడిన్ ఆవిరి వాసన చూస్తే మహిమలు జరిగిపోతాయన్న డాక్టరు మాటలు నిజమే కదూ చెప్పు అని లేవిన్‌ని అర్థిస్తున్నట్టు అతని దృష్టి లేవిన్‌మీద లగ్నమైంది.

లేవిన్ డాక్టరు అన్న మాట నిజమేనని ఇష్టం లేకుండా చెప్పడంతో అటూ యిటూ చూస్తూ అతను "యేం, కాత్యా లేదా యిక్కడ?" అని గరగరలాడే గొంతుకతో అడిగేడు. "నీతో యిప్పుడు చెప్తా... ఆమె చెప్పింది కదా అని ఆ తంతుకి వొప్పుకున్నానంతే. ఆమె యెంత ముచ్చటగా వుంది, కాని మనిద్దరం ఆత్మ వంచన చేసుకోలేం కదా. యిదుగో, దీనిమీద నాకు నమ్మకం వుంది" అని సీసాని శల్యామాత్రంగా వున్న చేత్తో నొక్కి పీలుస్తూ అన్నాడు.

అదే రోజు సాయంత్రం ఎనిమిది గంటలకి లేవిన్, కిట్టీ వాళ్ల గదిలో టీ తాగుతూ వుండగా మాషా వగరుస్తూ పరిగెత్తుకు వచ్చింది. ఆమె ముఖం పాలిపోయింది. పెదాలు వొణుకుతున్నాయి.

"ఆయన ప్రాణం పోతోంది" అని గుసగుసలాడుతూ చెప్పింది. "నాకు భయంగా వుంది యిప్పుడే చనిపోతాడని" అంది.

వాళ్లు అతని దగ్గరికి పరిగెత్తి వెళ్లారు. నికొలాయ్ మంచంమీద లేచి వొక చేతిమీద ఆనుకుని వీపుని వొంచి కూర్చున్నాడు. అతని తల వాలిపోతూ వుంది.

"యెలా వుంది నీకు?" అని లేవిన్ వో క్షణం ఆగి మెల్లిగా అడిగేడు.

"వెళ్లిపోతానేమో ననిపిస్తోంది" అని నికొలాయ్ కష్టంమీదే కాని స్పష్టంగా, మెల్లిగా వొక్కొక్క మాటే వదులుతూ అన్నాడు. అతను తల యెత్తలేదు, కళ్లు మాత్రం యెత్తేడు కాని ఆ చూపు తమ్ముడి ముఖం దాకా అందలేదు. "కాత్యా, నువ్వెళ్లిపో" అని అన్నాడు.

లేవిన్ తక్కున లేచి, తప్పదన్నట్టు గుసగుసలాడుతూ ఆమెని బయటికి వెళ్లిపోయే టట్టు హడావుడి చేశాడు.

"వెళ్లిపోతున్నా" అని నికొలాయ్ మళ్లీ అన్నాడు.

"యెందుకలా అంటావ్?" అని లేవిన్ యేదో వొకటి అనాలన్నట్టు అన్నాడు.

"వెళ్లిపోతున్నాను కాబట్టి" అన్నాడు ఆ పదబంధం యిష్టంగా వున్నట్టు రెట్టిస్తూ. "తుది ఘడియ వచ్చింది" అన్నాడు.

మాషా అతని దగ్గరికి వచ్చింది.

"పడుకుంటే మీకు బాగా వుంటది" అంది.

"కొంచెం సేపట్లోనే మాటా పలుకూ లేకుండా పడుకుంటా" అని నికొలాయ్ గొణిగేడు. "చనిపోయి" అని వ్యంగ్యంగా చిరాకు పడుతూ అన్నాడు. "సరే, కావాలనుకుంటే పడుకోబెట్టండి" అన్నాడు.

లేవిన్ అన్నగార్ని నడుంమీద వాలేటట్టు కిందికి పడుకోబెట్టాడు. తను పక్కన కూర్చుని తదేక ధ్యానంతో అతని ముఖంలోకి చూశేడు. మృత్యు శిఖరంమీదకి చేరిన నికొలాయ్ వెల్లకిలా కళ్లు మూసుకుని పడుకున్నాడు కాని నుదుటిమీద కండరాలు అతనేదో దీర్ఘ గాఢ ఆలోచనలో నిమగ్నమై వున్నట్టు కంపించేయి. లేవిన్ అప్రయత్నంగానే అన్నగారి అంతరంగంలో యేం జరుగుతోందా అని అతని ఆలోచన లేమిటో వూహించబోయేడు. కాని అన్నగారి ఆలోచనలని అందులో ప్రయత్నం చేసినా, అతని శాంత గంభీర వదనంమీది భావాన్ని బట్టీ, కనుబొమల పైన కండర చలనాన్ని బట్టీ మరణించే ఆ వ్యక్తికి స్పష్టమవుతూ వున్న దేదో తనకి నిగూఢంగానే మిగిలిపోతోందని లేవిన్‌కి అవగతమైంది.

"అవును, అవును... అదే..." అని మరణించే వ్యక్తి మాట మాటకీ మధ్య ఆగుతూ మెల్లిగా అన్నాడు. "కొంచెం ఆగు" అని మళ్లీ మౌనంగా వుండిపోయేడు. "అదే" అని అతను హఠాత్తుగా, తనకి అన్నీ విశద పడినట్టుగా అన్నాడు. "భగవంతుడా" అని గాఢమైన శ్వాస పీలుస్తూ మూలిగేడు.

మాషా అతని పాదాల్ని తాకింది. "చల్లబడుతున్నాయి" అని గుసగుసలాడింది.

చాలా సేపు, లేవిన్‌కి వొక యుగంలాగా అనిపించినంత సేపు, రోగి నిశ్చలంగా పడుకున్నాడు. కాని అతనికి ప్రాణం వుంది, మధ్య మధ్య నిట్టూర్చేడు. లేవిన్ ఆలోచనా తీవ్రతతో అలిసిపోయేడు. అంత తీవ్రంగా ఆలోచించినా "అదే" అనేదేమిటో అర్థం చేసుకోలేకపోయాడు. మరణించే వ్యక్తిని యెప్పుడో మరిచిపోయినట్టుగా వుంది. లేవిన్ యిక మృత్యువుని గురించి ఆలోచించలేకపోయేడు. అప్రయత్నంగానే అతని ఆలోచనలు కొంచెం సేపటిలోనే తను యేం చెయ్యాలి అనే వాటిమీదే వున్నాయి: మృతుని కళ్లు మూయాలి, బట్టలు వెయ్యాలి, శవపేటికని పురమాయించాలి. చిత్రమైన విషయం, దీంతో అతను చాలా ఉదాసీనంగా ఆయేడు, యే రకమైన విచారమూ, అన్నగారు పోతున్నాడనే బాధా అతనికి లేకపోయేయి. అతని పట్ల అంత సానుభూతి కూడా కలగలేదు. ఆ క్షణంలో అన్నగారి గురించి అతనికి యేమన్నా అనిపించి వున్నట్లయితే మరణించే ఆ వ్యక్తికి ప్రాప్తమై తనకి లభించకుండా దాటిపోయిన జ్ఞానం పట్ల యీర్ష్య, అంతే.

అన్నగారి అంతిమ ఘడియ కోసం చూస్తూ అలా చాలా సేపు అతని పక్కనే కూర్చుండిపోయేడు. కాని ఆ ఘడియ రాలేదు. తలుపు తెరుచుకుంది. కిట్టీ కనిపించింది. ఆమె లోపలికి రాకుండా ఆపాలని లేవిన్ లేచాడు. కాని తను లేవగానే, మరణించే మనిషి కదిలిన అలికిడి అయింది.

"వెళ్లకు" అని నికొలాయ్ చేతిని చాచేడు. లేవిన్ దాన్ని అందుకుని, రెండో చేత్తో పెళ్లాన్ని వెళ్లిపొమ్మని చిరాగ్గా సైగచేశాడు.

అతను మరణించే వ్యక్తి చేతిని తన చేతిలో అరగంట సేపు, గంట సేపు, మరో గంట సేపు పట్టుకునే కూర్చున్నాడు. అతను యిక మృత్యువు గురించి ఆలోచించడమే లేదు.

కిట్టీ యేం చేస్తోందో అనుకున్నాడు, పక్క గదిలో యెవరున్నారో అనుకున్నాడు, డాక్టరుకి సొంత యిల్లు వుందో లేదో అనుకున్నాడు. యేదన్నా యింత తిని నిద్రపోవాలని తపన పడ్డాడు. జాగ్రత్తగా అన్నగారి చెయ్యి వదిలేసి పాదాలు తాకేడు. కాళ్ళు చల్లగా వున్నాయి కాని శ్వాస ఆడుతూనే వుంది. లేవిన్ మరో సారి మునిగాళ్ళమీద బయటికి వెళ్ళబోయేడు కాని మళ్ళీ రోగి కదిలి అన్నాడు:

''వెళ్ళకు.''

. . . . . . . . . . . . . . . . . . . . . . . . .

తెల్లవారింది. రోగి పరిస్థితి యేమీ మారలేదు. లేవిన్ మెల్లిగా చేతిని విడిపించుకుని, మరణించే వ్యక్తికేసి చూడకుండా తన గదికి వెళ్ళి నిద్రపోయేడు. అతను లేచాక అన్నగారు చనిపోయాడని తను వూహించిన వార్తని చెప్పడానికి బదులుగా రోగి ముందటి స్థితికి వచ్చేడన్న వార్తని చెప్పారు. అతను లేచి, దగ్గి, తిని, మాట్లాడి, మళ్ళీ మృత్యువు గురించిన మాటలు మానేసి కోలుకుంటానన్న ఆశ వెల్లడించాడట. కాని ముందటికంటే యెక్కువ చిరచిర లాడుతూ, ఖిన్న చిత్తంలో వున్నాడట. యెవళ్ళూ, లేవిన్ గాని కిట్టీ గాని, అతన్ని శాంతింప చెయ్యలేకపోయేరు. అతను అందరిమీదా చిరాకు పడ్డాడు. ప్రతివాళ్ళ గురించీ కటువుగా మాట్లాడేడు. తన బాధకి ప్రతివాళ్ళనీ దుమ్మెత్తి పోశేడు. ప్రసిద్ధ మాస్కో వైద్యుడి కోసం కబురు పంపించమని అడిగేడు. యెలా వుందని అడిగిన ప్రతిసారీ కోపంతో, తిట్టి పోస్తూ అదే జవాబు యిచ్చేడు:

''యమయాతన పడుతున్నాను, చెప్పలేనంత బాధ!''

రోగి యింకా యింకా యెక్కువ బాధపడ్డాడు. ముఖ్యంగా శయ్యావ్రణాలవల్ల. వాటిని బాగు చెయ్యడం సాధ్యం కాదు. తన చుట్టు పక్కల వున్న వాళ్ళమీద యింకా యెక్కువగా విరుచుకు పడ్డాడు. ప్రతి దానికీ వాళ్ళని తిట్టిపోశేడు, ముఖ్యంగా మాస్కో వైద్యుడి కోసం కబురు చెయ్యనందుకు. అతనికి అన్ని విధాలా సాయం చేద్దామనీ ఉపశాంతి కలిగిద్దామనీ కిట్టీ యెంతో ప్రయత్నం చేసింది కాని వృథా అయింది. ఆమె శారీరకంగా, మానసికంగా నలిగిపోయిందని లేవిన్‌కి స్పష్టంగా అనిపించింది కాని ఆమె ఆ మాటని వొప్పుకోలేదు. అన్నగారు తనని రమ్మని పిలిచి తన దగ్గర కూర్చోమన్న నాటి ఆ రాత్రి జీవితానికి వీడ్కోలు చెప్పే మాటల కారణంగా అందరిలోనూ ఉత్పన్నమైన మృత్యు భావన యిప్పుడు చెదిరి పోయింది. అతని మరణం ఆసన్నమైందనీ, తథ్యమనీ అప్పటికే సగం విగత జీవుడనీ అందరికీ తెలుసు. అందరూ కేవలం వొక్కటే కోరుకున్నారు — అతను త్వరగా చనిపోవాలి అని. కాని అందరూ యీ మాటని దాచుకుని అతనికి అరుకులు తాగించేరు, కొత్త మందుల కోసం, డాక్టర్ల కోసం వెతికేరు, అతన్ని మోసగించేరు, తమని మోసగించుకున్నారు, వొకళ్ళనొకళ్ళు మోసగించుకున్నారు. యిదంతా అబద్ధం — పరమ యేహ్యమైన, ఘృణితమైన, నిందా పూర్వకమైన అనృతం. యీ అనృతాన్ని తన స్వభావ రీత్యానూ, మరణ ముఖంలో వున్న

తన అన్నగార్ని అందరికంటే యెక్కువగా ప్రేమిస్తూ వున్నందు వల్లనూ లేవిన్ యెక్కువ తీవ్రంగా అనుభూతి చెందేడు.

నికొలాయ్ చనిపోక ముందే అతన్నీ కోజ్నిషెవ్‌నీ సమాధాన పరచాలనే ఆలోచన లేవిన్‌కి చాలా రోజులుగా వుంది. అతను కోజ్నిషెవ్‌కి రాశేడు. అతన్నుంచి వచ్చిన జవాబుని నికొలాయ్‌కి చదివి వినిపించేడు. తను రాలేకపోతున్నానని రాస్తూ తనని క్షమించమని తమ్ముణ్ణి హృదయం స్పందించే రీతిలో అర్థించేడు కోజ్నిషెవ్.

రోగి యేమీ మాట్లాడలేదు.

"అయితే అన్నయ్యకి యేం రాయమంటావ్? అతని పట్ల నీకేం కోపం లేదనే అనుకుంటాను" అన్నాడు లేవిన్.

"యేమీ, యేమీ కోపం లేదు" అన్నాడు నికొలాయ్, మనసులో ఆ ప్రశ్న గుచ్చుకుంది అతనికి. "నా కోసం మాస్కో డాక్టర్ని పంపించమను" అన్నాడు.

యాతనా భరితంగా మరో మూడు రోజులు గడిచేయి. రోగి పరిస్థితి మారలేదు. అతన్ని చూసిన ప్రతివాళ్లూ అతను వెళ్లిపోతేనే బాగుంటుందనుకున్నారు. హోటెల్ నౌకర్లు, యజమాని, హోటెల్‌లో వుంటున్న వాళ్లందరు, డాక్టరు, మాషా, లేవిన్, కిట్టీ అలానే కోరుకున్నారు. ఒక్క రోగి మాత్రమే ఆ కోరికని వ్యక్తం చెయ్యలేదు, పైగా మాస్కో వైద్యుడి కోసం పంపనందుకు వాళ్లమీద కోప్పడ్డాడు. మందులు తీసుకున్నాడు, తనకి బాగవుతుందని అంటూనే వున్నాడు. యెప్పుడో అరుదుగా, అనవరత బాధనుంచి నల్లమందు ఉపశాంతి కలిగించిన క్షణాల్లో మాత్రం, యితరులకంటే యెంతో తీవ్రంగా తన మనసులో వున్న దాన్ని అర్ధ నిద్రా స్థితిలో వ్యక్తం చేసేవాడు: "అబ్బ, యిది ముగిసిపోతే బాగుండును!" లేదా "యెప్పుడు అంతమవుతుంది యిది!" అని.

క్రమక్రమంగా యెక్కువ అవుతూ వున్న బాధ తన ప్రభావాన్ని చూపిస్తూ రోగిని మృతికి తయారు చేసింది. బాధని తప్పించే స్థితి యేదీ అతనికి కనిపించలేదు, వొక్క క్షణం కూడా అతను బాధ పడకుండా వుండలేదు. అతని శరీరంలో బాధ పెట్టని, వేదన కలిగించని తావుగాని అవయవంగాని వొక్కటి కూడా లేదు. అతనికి శరీర స్మృతులు, దానికి సంబంధించిన ప్రభావాలు, ఆలోచనలు శరీరం పట్ల కలిగినంతటి వైముఖ్యాన్నీ రెచ్చగొట్టేయి. యితరులు యెదురుగా వుండడం, వాళ్ల గొంతుకలు చెవిన పడడం, తన ఆలోచనలు అన్నీ కూడా అతనికి దుఃఖకారకంగా వున్నాయి. అతని చుట్టు పక్కల వున్న వాళ్లకి యిది అనుభూతం అయింది. అతని సమక్షంలో వాళ్లు మాట్లాడుకునేట్టు వుండలేదు, స్వేచ్ఛగా తిరగలేదు, తమ మనసులో వున్న దాన్ని పైకి చెప్పకోలేదు. అతని మొత్తం జీవితం యిప్పుడు వ్యధాత్మక భావనగా, ఆ వ్యధనుంచి విముక్తి పొందే కోరికగా యేకమైపోయింది.

ఒకటి బహుశా స్పష్టంగా కనిపించింది: తన యిచ్ఛా పరిపూర్తిగా మృత్యువుని సౌఖ్యప్రదాయినిగా పరిగణించేటట్టు చేసే ఉగ్రపరివర్తన అతనిలో వస్తోంది. యిదివరలో

బాధనుంచీ అభావంనుంచీ పుట్టే ప్రత్యేక కోరికలు, ఆకలి, దప్పిక, అలసట లాంటివి యే శరీర వ్యాపారంలోనో సంతుష్టి పడి సుఖాన్ని యిచ్చేవి. కాని యిప్పుడు బాధనుంచీ, అభావంనుంచీ అతనికి యే సంతుష్టీ రాలేదు, పైగా సంతుష్టి పొందేందుకు పడే ప్రతి ప్రయాసంవల్లా కొత్త బాధ ఉత్పన్నం అయేది. దాంతో అతని సకల కోరికలూ వొక కొత్త కోరికతో యేకీభూతం అయేయి — అన్ని బాధలనుంచీ, వాటికి కారణభూతమైన పాంచ భౌతిక కాయం నుంచీ విముక్తి పొందాలన్న కోరిక. కాని యీ ముక్తి కామనని వ్యక్తం చేసేందుకు తగ్గ మాటలు అతని దగ్గర లేకపోయేయి. అందుకని అతను దాన్ని గురించి ప్రస్తావన చెయ్యలేదు. కాని సంతుష్టి పరచడం యిప్పుడు అసంభవం అయిన కోరికలని అలవాటు ప్రకారం కోరుతూనే వున్నాడు. ''నన్ను అటు వేపు తిప్పండి'' అనేవాడు. మరుక్షణంలోనే మళ్లీ యిటు తిప్పమనేవాడు. ''అన్నం పట్టండి'', ''వద్దు, పట్టుకు పొండి'', ''యేదన్నా చెప్పండి యెందుకు నోళ్లు మూసుకు వున్నారు?'' కాని వాళ్లు యేదేనా చెప్పడం మొదలు పెట్టగానే అతను కళ్లు మూసేసుకుని అలసట, ఉదాసీనత, అరుచి వెల్లడి చేసేవాడు.

అక్కడికి వెళ్లిన పదవ రోజున కిట్టీకి నలత చేసింది. ఆమెకి తలనొప్పి వచ్చింది. వమనం అయింది. ఉదయం పూట అంతా మంచంమీదనుంచి లేవలేదు.

అలసటవల్లా, ఆందోళనవల్లా ఆమెకి నలత చేసిందనీ విశ్రాంతిగా వుండాలనీ ఆందోళన కూడదనీ డాక్టరు అన్నాడు.

అయినా మధ్యాహ్నం వేళకి కిట్టీ లేచింది, ఎంబ్రాయిడరీ పని తీసుకుని రోగి గదిలోకి వెళ్లింది. ఆమె గదిలోకి వెళ్లగానే అతను ఆమెకేసి చురచుర చూశేడు. తనకి వొంట్లో బాగా లేదని ఆమె చెప్పినప్పుడు అతను తిరస్కారపూరితంగా చిరునవ్వు నవ్వేడు. అతను ఆ రోజంతా ముక్కుతో రొప్పుతూనే వున్నాడు, దయనీయంగా మూలుగుతూనే వున్నాడు.

''యెలా వుంది మీకు?'' అని కిట్టీ అడిగింది.

''అధ్వాన్నంగా వుంది'' అని కష్టంమీద అన్నాడు. ''నొప్పిగా వుంది'' అన్నాడు.

''యెక్కడ నొప్పి?''

''ఒక చోట అనేమిటి.''

''యివాళ అయిపోతుంది, చూడండి'' అంది మాషా. ఆమె లోగొంతుకలో అన్నా రోగికి వినబడిందనే లేవిన్‌కి అనిపించింది. రోగి చాలా చురుగ్గా వున్నట్టు లేవిన్ గమనించేడు. లేవిన్ వూరుకొమ్మన్నట్టు ఆమెకి సైగ చేసి రోగికేసి చూశేడు. నికొలాయ్ ఆ ముక్క విన్నాడు కాని అతనిమీద దాని ప్రభావం యీషణ్మాత్రం కూడా పడలేదు. అతని చూపు ముందటి లాగానే తిరస్కారపూరితంగా తీక్ష్ణంగా వుంది.

''యెందుకని అలా అనిపించింది మీకు?'' అని లేవిన్ ఆమె తన వెనక్కాలే వరండా లోకి వచ్చినప్పుడు అడిగేడు.

''తనని తను పీక్కుంటున్నాడు'' అంది.

"తనని తను పీక్కోవడమా? అంటే?"

"అంటే యిలా" అని ఆమె తన ఉన్ని ఫ్రాక్ కుచ్చిళ్ళు పీకి చూపిస్తూ అంది. వాస్త వానికి రోగి దేన్నో పెరికి పారెయ్యాలన్నట్లు తనని తనే పీక్కోవడం లేవిన్ చూశేడు.

మాషా జోస్యం నిజమే అయింది. రాత్రి అయే వేళకి రోగి చెయ్యి కూడా పైకి యెత్త లేకపోయేడు. యే మాత్రం చలించని కేంద్రీకరించిన దృష్టితో తన ముందుకే చూస్తూ వుండిపోయేడు. అతను తమకేసి చూస్తాడేమోనని లేవిన్‌గాని కిట్టీగాని అతనిమీదకి వంగినా అతని చూపు మరల్లేదు. అలానే చూస్తూ వుండిపోయేడు. మరణించక ముందే అతని కోసం ప్రార్థనలు చేస్తాడని పురోహితుడి కోసం కిట్టీ కబురు పెట్టింది.

పురోహితుడు ప్రార్థన చేసే సమయంలో మరణాసన్నుడైన రోగిలో యే జీవ చలనమూ కనిపించలేదు. అతని కళ్ళు మూసుకునే వున్నాయి. లేవిన్, కిట్టీ, మాషా అతని మంచం పక్కనే నుంచున్నారు. ప్రార్థన పూర్తవక ముందే మరణించే రోగి కాళ్ళూ చేతులూ చాచుకుని శ్వాస పీల్చి కళ్ళు తెరిచేడు. పురోహితుడు ప్రార్థన పూర్తిచేశాక రోగి చల్లని నుదుటిమీద శిలువ తాకించి తర్వాత దాన్ని తన అంగీలో పెట్టుకున్నాడు. ఒకటి రెండు నిముషాలు మౌనంగా నుంచున్నాక చల్లబడుతూ వున్న రక్తవిహీన భారీ హస్తాన్ని తాకేడు.

"అయిపోయింది" అంటూ పురోహితుడు వెనక్కి తిరగబోయేడు. కాని మృత ప్రాయుడైన వ్యక్తి మీసాల కింద పెదాలు వొక్క సారి కదిలేయి. ఛాతీ లోతుల్లోనుంచి స్పష్టంగా సూటిగా అన్న మాటలు వినవచ్చేయి.

"యింకా పూర్తిగా కాదు... కాస్సేపట్లో."

మరుక్షణం అతని ముఖం చమక్‌మని మెరిసింది. అతని పెదాల కింద చిరునవ్వు కనిపించింది. అక్కడ చేరిన ఆడవాళ్ళు మెల్లిగా మృతునికి బట్టలు వెయ్యడం మొదలు పెట్టారు.

అన్నగార్ని యీ దశలో చూడ్డం, మృత్యు ఉపస్థితి లేవిన్ మనసులో తిరిగి మృత్యు నిగూఢత, దాని సామీప్యం, దాని అనివార్యత కలిగించిన భయాన్ని రేకెత్తించాయి. అన్నగారు జబ్బుతో తన దగ్గరికి వచ్చిన ఆ ఆకురాలు కాలపు సాయంత్రం అతన్నా భయం ఆవహించింది. యిప్పుడా భయం యిదివరలోకంటే తీవ్రంగా వుంది. మృత్యువు నిగూఢత్వం యేమిటైందీ అర్థం చేసుకునే సామర్థ్యం ముందున్నంతగా లేదు. దాని అనివార్యత మరింత భయానకంగా ప్రతీతమైంది. కాని యిప్పుడు అర్ధాంగి దగ్గర వుండడం పుణ్యమా అని ఆ భయ భావం అతన్ని హతాశుణ్ణి చెయ్యలేదు. మృత్యువు వున్నప్పటికీ తను జీవించి ప్రేమించాల్సిన ఆవశ్య కత వుందని అతనికి అనిపించింది. ప్రేమ మాత్రమే తను హతాశుడు కాకుండా రక్షించిందని అతనికి తోచింది. హతాశ భయం అతని ప్రేమని మరింత శక్తివంతం చేసింది, నిర్మలం చేసింది.

ఒక నిగూఢత, భేదించలేని మృత్యు నిగూఢత, తను చూస్తూ వుండగానే జరిగిపోగా

అలాంటిదే భేదించలేని మరో నిగూఢత వచ్చి జీవితానికీ ప్రేమకీ ఆమంత్రణం చేస్తోంది.

డాక్టరు కిట్టీ గురించి తన అనుమానాన్ని ఖాయం చేశాడు. ఆమె నెల తప్పడంవల్ల నలతగా వుంది.

## 21

బెట్సీ, అబ్లాన్స్కీలు తనతో మాట్లాడింతర్వాత తను భార్యని ఆమె మానాన ఆమెని వుండ నివ్వాలనీ తను దగ్గర వుండి ఆమెని కలత పెట్టకూడదనీ, తన భార్య అపేక్షిస్తూ వున్న విషయమల్లా అదేననీ తననుంచి కోరుతూ వున్న విషయమూ అదేనని కరేనిన్‌కి అర్థమైంది. ఆ క్షణంనుంచీ అతను స్తంభీభూతుడైపోయేడు. దేన్ని గురించీ యే నిర్ణయాలూ తీసుకోలేకపోయేడు. తనకి యేం కావాలో కూడా అతనికిప్పుడు తెలియలేదు. యెంతో హుషారుతో తన వ్యవహారాలు చక్కబెట్టడానికి ముందుకు వచ్చిన వాళ్లకి పూర్తిగా దాసోహం అన్నట్టయిపోయి వాళ్లు యేం చెప్పినా చెందినా గంగిరెద్దులా తల వూపేడు. అన్నా యిల్లు వదిలి వెళ్లిపోయేక పిల్లవాడి ఇంగ్లీషు పంతులమ్మ ఆ పూట భోజనం అతనితో కలిసి చెయ్యాలా లేక విడిగానా కనుక్కురమ్మని నౌకర్ని పంపినప్పుడు మాత్రమే మొదటి సారి అతనికి తన పరిస్థితి స్పష్టంగా కళ్లకి కట్టినట్టైంది. దాన్ని చూసి అతను భయ భ్రాంతుడైపోయేడు.

యీ స్థితిలో మహా ఘోరంగా వున్న విషయం యేమిటంటే అతను గడిచిపోయిన దాన్నీ ప్రకృతాన్నీ యే సూత్రంతోనూ బంధించలేకపోవడం, అనుసంధించలేకపోవడం. తను భార్యతో సంతోషంగా గడిపిన గతం అతన్ని కలతబెట్టలేదు. ఆ గతంనుంచి భార్య పక్కదారి పట్టింది అని తెలియ వచ్చిన దశదాకా అతను భయంకరమైన వ్యథాకులిత జీవితం గడపనే గడిపేడు. అది బహు కష్టమైందే కాని కనీసం అర్థం చేసుకోవచ్చు. తను పక్కదారి పట్టేను అని చెప్పేసి ఆమె గనక అప్పుడే వెళ్లిపోయి వుంటే అతను దురటిల్లి వుండేవాడు, హృదంతరాళంలో చింత గూడు కట్టుకుని వుండేదే. కాని యింత నిస్సహాయుడిగా దిక్కు తోచని పరిస్థితిలో పడివుండేవాడు కాదు. కొంతకాలం కితమే తను ప్రసాదించిన క్షమాదానాన్ని, స్నేహశీలతని, జబ్బు చేసిన భార్య పట్లా, పరాయి బిడ్డ పట్లా తన ప్రేమని యే రకంగానూ యిప్పుడు జరిగిన దానితో సమాధాన పరచుకోలేకపోతున్నాడు. అంటే, తన ఔదార్యానికి ప్రతిఫలంగా వచ్చిన ఒంటరితనాన్ని, అవమానాన్ని, తలవంపుల పరిస్థితిని, సర్వులచేత తిరస్కృత, పరిత్యక్త స్థితిని సమాధాన పరుచుకోలేకపోతున్నాడు.

భార్య వదిలిపెట్టి వెళ్లిపోయిన మొదటి రెండు రోజులూ కరేనిన్ అర్జీదార్లని కలుసుకున్నాడు, ఆఫీస్ సెక్రటరీతో మాట్లాడేడు, కమిటీ సమావేశానికి హాజరయేడు, యథాప్రకారం డైనింగ్ రూమ్‌లో భోజనం చేశాడు. యెందుకు అలా చేస్తున్నారు అనే ప్రశ్నే వేసుకోకుండా అతను ఆ రెండు రోజులూ పైకి శాంతంగా, యేం పట్టనట్టుగా వున్నట్టు కనిపించాలనే ప్రయత్నంలో సకల మానసిక శక్తుల్నీ కూడగట్టుకున్నాడు. అన్నా వస్తువు

లనీ, గదులనీ యేం చెయ్యమంటారని అడగవచ్చినప్పుడు పనివాళ్లు జరిగింది అసాధారణం అయిందేమీ కాదనీ, లోకంలో వింత అయిందీ కాదనీ తెలియ చెప్తున్నట్టు కనిపించడానికి విశ్వ ప్రయత్నం చేశాడు. అతను అందులో సాఫల్యం సాధించేడు. అతను దిగాలు పడిపోయాడని యెవరూ అనుకోలేకపోయేరు. ఆన్నా వెళ్లిపోయిన రెండవ రోజున కర్నేయ్ వచ్చి అతనికి వో ఫాషనబుల్ షాపునుంచి వచ్చిన బిల్లు అందించేడు: ఆన్నా ఆ బిల్లు చెల్లించడం మర్చి పోయిందిట. షాపు అసిస్టెంట్ స్వయంగా ఆ బిల్లు పట్టుకు వచ్చేడట. అతన్ని పిలిపించమని కరేనిన్ చెప్పాడు.

"హుజూర్, మిమ్మల్ని యిబ్బంది పెడుతున్నందుకు మన్నించండి. శ్రీమతిగారికి దీన్ని పంపించమని తమరు ఆదేశిస్తే అలాగే చేస్తా, దయచేసి యెక్కడున్నారో చెప్పండి."

కరేనిన్ వో క్షణం ఆలోచనలో పడ్డాడు, కనీసం అలా అని షాపు అసిస్టెంట్‌కి అనిపించింది. తర్వాత గబుక్కున వెనక్కి తిరిగి బల్ల దగ్గర కూలబడ్డాడు. తల చేతుల్లో వాలేసుకుని అతనక్కడ కొంచెం సేపు కూర్చుండిపోయేడు. వొకటి రెండు సార్లు యేదో చెప్ప బోయేడు. కాని చెప్పలేకపోయేడు.

అతని మానసిక స్థితిని అర్థం చేసుకున్న కర్నేయ్ మళ్లీ రమ్మని షాపు అసిస్టెంట్‌ని పంపేశాడు. ఒంటరిగా వుండి పోయేక కరేనిన్ తను దృఢంగా శాంత చిత్తంతో కనిపించాలనే నాటకం ఆడలేనని గ్రహించేడు. తన కోసం యెదురు చూస్తూ వున్న బగ్గీని పంపెయ్యమనీ, యెవళ్లనీ రానివ్వద్దనీ ఆజ్ఞ చేసేడు. గది వదిలి భోజనం చెయ్యడానికి కూడా వెళ్లలేదు.

ఆ షాపు అసిస్టెంట్ చూపుల్ని, కర్నేయ్ చూపుల్ని ఆ రెండు రోజుల్లోనూ తనకి తటస్థ పడిన ప్రతివాళ్లూ చూసే ఆ తిరస్కారపూరిత కఠినమైన చూపుల్ని సహించలేనని అతనికి అనుభవం అయింది. తన పట్ల లోకుల ఘృణభావాన్ని తొలగించలేడని, యేమంటే ఆ ఘృణత్వం తను చెడ్డవాడైనందువల్ల ఉత్పన్నం కాలేదనీ (అలా గనక అయివుంటే మంచి వాడుగా వుండే ప్రయత్నం చేసును తను) కాని లజ్జాకరంగా, వెలపరం పుట్టించేటట్టుగా అభాగ్యుడైనందువల్లననీ అతనికి కనిపించింది. అందుగ్గాను, తన హృదయం ఛిన్నమైనందుకుగాను యెవళ్లూ అయ్యో అని జాలిపడరు అని అతనికి తెలుసు. వాళ్లు తనని నాశనం చేసేస్తారని, చెడ్డగా బాధపడిపోతూ రక్తం కారుతూ కుయ్యో మొర్రోమని మూలిగే కుక్కని సాటి కుక్కలు నాశనం చేసినట్టు, చేసేస్తారని అతనికి తెలుసు. తన గాయాల్ని కప్పి వుంచుకోవడంద్వారా మాత్రమే తోటి మనుషులనుంచి తనని తను కాపాడుకోగలనని అతనికి తెలుసు. అందుకనే అతను రెండు రోజుల దాకా అనుకోకుండానే అలా వుండే ప్రయత్నం చేశాడు కాని సమతూకంగా లేని సంఘర్షణని తట్టుకునే శక్తి లేదని యిప్పుడు అతనికి తెలియవచ్చింది.

తన దుఃఖంలో అన్ని విధాలా యేకాకిగా వున్నాననే స్పృహవల్ల అతని హతాశ మరింత తీవ్రం అయింది. ఒక ఉన్నత అధికారిగా కాక, సమాజంలో గొప్పవాడిగా కాక అతనొక వ్యక్తిగా,

పీడిత వ్యక్తిగా అతని పట్ల సానుభూతి చూపించే మనిషీ, అతను తన హృదయాన్ని విప్పి చెప్పుకోగల మనిషీ పీటర్స్‌బుర్గ్‌లోనే కాదు, యెక్కడా కూడా లేదు.

కరేనిన్ అనాథగా పెరిగేడు. అతనికి వో అన్నగారు వుండేవాడు. ఆ అన్నదమ్ములిద్దరూ తండ్రిని యెరగరు. కరేనిన్‌కి పదేళ్ల వయసప్పుడు తల్లి కన్ను మూసింది. యేదో కొద్దిగా ఆస్తి మిగిలింది. కరేనిన్ పినతండ్రి పెద్ద రాజోద్యోగి, ఆయన చక్రవర్తికి అభిమాన పాత్రుడు. అన్నదమ్ములిద్దర్నీ ఆయనే పెంచి పెద్ద చేశాడు.

కరేనిన్ చదువులో బళ్లో ప్రథమ స్థాయిలో వుండేవాడు. పతకాలతో యూనివర్సిటీ చదువు పూర్తిచేశాడు. పినతండ్రి సాయంతో ఉన్నత ప్రభుత్వ ఉద్యోగంలో చేరాడు. అది మొదలు అతను ఉద్యోగ నిర్వహణా మహత్వ కాంక్షకి అంకితం అయిపోయేడు. బళ్లో చదువుకునే రోజుల్లో గాని, యూనివర్సిటీలో చదువుకునే రోజుల్లో గాని, తర్వాత ఉద్యోగంలో వున్నప్పుడు గాని అతనికి యెవళ్లతోనూ స్నేహపూరిత సంబంధాలు పెరగలేదు. అన్నగారు అతనికి అందరికంటే బాగా మనసుకి సన్నిహితంగా వుండేవాడు కాని అతను విదేశీ మంత్రిత్వ శాఖలో పని చేసేవాడు. యెప్పుడూ విదేశాల్లోనే వుండేవాడు. కరేనిన్‌కి పెళ్లి అయింతర్వాత కొంత కాలానికి స్వర్గస్థుడయేడు.

కరేనిన్ యేదో గుబేర్నియాకి అధిపతిగా వున్నప్పుడు అదే గుబేర్నియాలోనే ఆన్నా పెత్తల్లి వుండేది. ఆవిడ ఐశ్వర్య వంతురాలు. ఆవిడ తన చెల్లెలి కూతురుకీ నడి వయస్కుడైన కరేనిన్‌కీ సంబంధం కలపాలని ప్రయత్నించింది. కరేనిన్ వయసులో యువకుడు కాదు, కాని అతని గవర్నరు పదవికి సంబంధించి యువకుడే. ఆన్నా పెత్తల్లి ఆ యిద్దరికీ మధ్య పొత్తు కలిపి అతను పెళ్లి ప్రస్తావన అయినా చెయ్యాలి లేదా ఆ వూరినుంచి వెళ్లిపోనేనా వెళ్లిపోవాలి అనే పరిస్థితిని కరేనిన్‌కి కల్పించింది. కరేనిన్ సందిగ్ధావస్థలో పడ్డాడు. అల్లా చెయ్యడానికి యెన్ని సబబులు కనిపించాయో, చెయ్యకుండా వుండడానికీ అన్నే కనిపించేయి. యేదీ యిదమిత్థంగా తేలి కనిపించలేదు. యెటూ తేలక సందిగ్ధంగా వున్నప్పుడు యేమీ చెయ్యొద్దు అనే తన సిద్ధాంతాన్ని మార్చుకునే తీర్పు ఆ పరిస్థితిలో అతనికి కనిపించలేదు. కాని అతని ప్రవర్తనవల్ల అమ్మాయి పరిస్థితి, మంచి పేరు అభాసయ్యే టట్టు తయారైందనీ, పెద్ద మనిషిగా తను వివాహ ప్రస్తావన చెయ్యాలనీ ఆన్నా పెత్తల్లి యెవళ్లో తెలిసిన మధ్యవర్తుల ద్వారా అతనికి తెలియచేసింది. అతను అలానే ప్రస్తావించి వధువు అలాగే అర్ధాంగీ అయిన ఆమెకి తన శక్తి మేరకి అనురాగాన్ని అర్పించేడు.

ఆన్నా పట్ల అతని అనురాగంవల్ల అతనికి యితరులెవరి పట్లా హార్దిక సంబంధాల ఆవశ్యకత లేకపోయింది. యిప్పుడు పరిచయస్థులు యింతమంది వున్నా వాళ్ళళ్లు కూడా అతనికి సన్నిహితులు లేకపోయారు. చేరికగా వుండేవాళ్లయితే చాలా మందే వున్నారు కాని స్నేహపూర్వక సంబంధాలు మాత్రం యెవళ్లతోనూ లేకపోయేయి. కరేనిన్ తన యింటికి భోజనానికి రమ్మని పిలిచేవాళ్లు చాలా మంది వుండేవాళ్లు. తను ఆసక్తి చూపించే విషయాల్లో

భాగం పంచుకొమ్మని తను అడగగలిగేవాళ్ళూ వున్నారు. తను ప్రాపకం చూపించే వాళ్ళకి సాయం చేసేవాళ్ళూ వున్నారు. యితర అధికారుల ప్రవర్తన గురించీ ఉన్నతాధికారుల చర్యల గురించీ దాపరికం లేకుండా తను మాట్లాడగలిగే వాళ్ళూ చాలా మంది వున్నారు. కాని అలాంటి వ్యక్తులందరితోనూ అతని సంబంధాలు అలవాటు, ఆచారాలవల్ల సీమితమై, వాటి హద్దు యెట్టి పరిస్థితుల్లోనూ మీరకుండానే వుండేవి. యూనివర్సిటీ రోజుల్లో వొక మిత్రుడు వుండేవాడు. అతనితో తర్వాత తన మంచీ చెడ్డా మనసు విప్పి చెప్పుకోగల మంచి హార్దిక సంబంధాలు వుండేవి. కాని అతనిప్పుడు స్కూళ్ల ఇనస్పెక్టరుగా యెక్కడో దూర ప్రాంతంలో వున్నాడు. పీటర్స్‌బుర్గ్‌లో అతనికి సెక్రటరీ, డాక్టరు బాగా చేరికగా వుండేవాళ్ళు. వాళ్లతో తన మంచి చెడ్డా చెప్పుకోగల స్థాయి సంబంధాలు యేర్పడే అవకాశాలు వున్నాయి.

మిఖయీల్ వసీల్‌యెవిచ్ స్ల్యూదిన్ అతని సెక్రటరీ. స్ల్యూదిన్ దాపరికంలేని వాడు. తెలివైన వాడు, మంచి మనసున్న మనిషి, నిజాయితీపరుడు. తన పట్ల అతను సద్భావన వున్న మనిషి అని కరేనిన్‌కి అనిపించేది. కాని అయిదేళ్ళుగా తామిద్దరూ కలిసి పని చేస్తూ వున్నారు. వాళ్ల మధ్య వున్న ఆఫీసు బాపతు సంబంధాలు మనసులో మాట చెప్పుకునేందుకు అవరోధం కలిగించేయి.

అవసరమైన ఆఫీసు కాగితాలమీద సంతకాలు చేశాక కరేనిన్ కొంచెం సేపు మాట్లాడకుండా స్ల్యూదిన్‌కేసి చూస్తూ వుండిపోయేడు. కొన్ని సార్లు మాట కదలేద్దామని ప్రయత్నం చేశాడు గాని కదలెయ్యలేకపోయేడు. 'నా దుస్థితి గురించి విన్నారా?' అనే వాక్యాన్ని కూర్చుకున్నాడు కూడా, కాని యెప్పటిలాగానే 'వూఁ, అయితే ఆ కాగితాలు తయారు చేయించండి' అనే మాటలతో ముగించి అతన్ని పంపేశాడు.

రెండో వ్యక్తి డాక్టరు, అతనికి కూడా కరేనిన్ పట్ల సద్భావమే వుంది. కాని యిద్దరూ విధులతో తలమునకలై వున్నారనీ సర్వదా హడావుడి పడుతూ వున్నారనీ వొక మౌన అవగాహన ఆ యిద్దరి మధ్యా యెంతో కాలంగా యేర్పడిపోయింది.

కరేనిన్‌కి స్నేహితురాళ్ళు, వాళ్లల్లో అగ్రభాగంలో వుండే కౌంటెస్ లిదియా ఇవానొవ్నా కూడా స్ఫురణకి రాలేదు. అతనికి ఆడవాళ్ల పేరు చెపితే భయమూ, అసహ్యమూ — వాళ్ళు ఆడవాళ్ళు అవడమే కారణం.

## 22

కౌంటెస్ లిదియా ఇవానొవ్నాని కరేనిన్ మరిచిపోయాడు గాని ఆమె అతణ్ని మరిచిపోలేదు. అతను వొంటరితనంతో మహా హతాశుడై వున్న యీ క్షణంలో ఆమె అతని దగ్గరికి వచ్చింది. తను వొచ్చినట్టు కబురు కూడా చెయ్యకుండా తిన్నగా కరేనిన్ చదువుకునే గదిలోకి వెళ్లింది. అతను రెండు చేతుల్లోనూ తల పెట్టుకుని కూర్చున్న స్థితిలో అతన్ని చూసింది.

"J'ai forcé la consigne[1]" అని గబగబా లోపలికి అడుగుపెడుతూ ఉద్రేకంవల్లా హడావుడిగా రావడంవల్లా ఆయాసపడుతూ అంది. "అంతా విన్నాను! కరేనిన్‌గారూ! మిత్రమా!" అంది. ఆమె అతని చేతిని తన రెండు చేతులతోనూ అదిమి అతని కళ్లల్లోకి తన అందమైన సాలోచనాత్మక నేత్రాలతో చూసింది.

కరేనిన్ ముఖం ముడుచుకుని లేచి చెయ్యి విదిలించుకుని ఆమె వేపు వొక కుర్చీ లాగేడు.

"కూర్చోండీ, కౌంటెస్! నేను యెవళ్లనీ చూడడం లేదు కౌంటెస్, యేమంటే వొంట్లో బాగో లేదు" అని అతను అన్నాడు. అతని పెదాలు వణికేయి.

"అయ్యో, కరేనిన్‌గారూ" అని కౌంటెస్ లిదియా ఇవానొవ్నా మళ్లీ అంది. ఆమె కళ్లు అతని కేసే చూస్తూ వున్నాయి. హఠాత్తుగా ఆమె కనుబొమలు పైకి లేచాయి, దాంతో ఆమె నుదుటిమీద త్రికోణం యేర్పడింది. ఆమె పాలిన వదనం యింకా అంద విహీనంగా తయారైంది. తన పట్ల ఆమె జాలి పడుతోందని కరేనిన్‌కి అనిపించింది. ఆమె కళ్లల్లో యే క్షణంలోనేనా కన్నీళ్లు గిర్రున తిరగవచ్చనీ అనిపించింది. కరేనిన్ చలించి పోయేడు. అతనామె బొద్దు చేతిని అందుకుని ముద్దు పెట్టుకున్నాడు.

"ప్రియ మిత్రమా!" అని ఆమె ఆవేశంతో కంపించే స్వరంతో అంది. "మీరు దుఃఖాన్ని దిగమింగెయ్యాలి. చాలా విచారకరమైన పరిస్థితే, కాని వూరటగా వుండాలి."

"నా నడుం విరిగిపోయింది! కుదేలయిపోయాను, నేనింకా బతికే వున్నానూ?" అని కరేనిన్ ఆమె చేతిని వదిలేసి కన్నీళ్లు ఉబికివచ్చే ఆమె కళ్లల్లోకి చూస్తూ అన్నాడు. "నా స్థితి యెంత భయానకంగా వుందంటే నా లోపల కూడా నాకు ఆసరా అందడం లేదు" అన్నాడు.

"ఆసరా అందుతుంది. దాన్ని నాలో వెతకకండి, నా స్నేహం పట్ల విశ్వాసం వుంచమని అర్థిస్తూ వున్నాగానీ" అంది నిట్టూరుస్తూ. "మన ఆసరా భక్తి, ఆయన మనకి ప్రసాదించిన భక్తి. ఆయన మోపిన భారం కష్టమైంది కాదు" కౌంటెస్ పారవశ్యపూరితంగా చూస్తూ అంది. ఆ చూపు అతనికి బాగా తెలుసు. "ఆయన మీకు ఆసరా వుంటాడు, మీకు సాయం చేస్తాడు" అంది.

ఉన్నత భావాలని వ్యక్తం చేస్తూ వున్న యీ మాటలని పలకడంలో ఆమె స్వయంగా చలించిపోయినా, పీటర్స్‌బుర్గ్‌లో అప్పుడు వ్యాపించి వున్న పారవశ్యపూరిత మార్మికతని — అతిశయం వృథా అని కరేనిన్ అనుకున్న మార్మికతని — వెల్లడి చేసినా కూడా యీ సమయంలో వాటిని వినడం అతనికి బాగా ఆహ్లాదంగా కనిపించింది.

"నా శక్తి హరించిపోయింది. నేను కుదేలైపోయాను. నేను మొదట్లో యేమీ చూడలేకపోయేను యిప్పుడు యేమీ అర్థం చేసుకోలేకుండా వున్నాను."

---

[1] నేను మీ నిషేధ ఆజ్ఞల్ని ఉల్లంఘించాను (ఫ్రెంచి).

''అయ్యో కరేనిన్‌గారూ!'' అని మళ్ళీ మళ్ళీ అంది ఆమె.

''యిప్పుడు లేని దాన్ని గురించి నేను పట్టించుకోవడం లేదు'' అని కరేనిన్ అన్నాడు. ''దాన్ని గురించి నాకు బాధలేదు. కాని యిప్పుడున్న నా పరిస్థితికి లోకుల ముందు తల యెత్తుకు తిరగలేను. యిది చెడ్డదే, కాని నేనేం చెయ్యలేను, యేమీ చెయ్యలేను'' అన్నాడు.

''క్షమాదానం అనే మహోన్నత కృత్యాన్ని చేసింది మీరు కాదు, నేనూ అందరూ అభినందించిన ఆ మహత్కార్యాన్ని చేసింది మీరు కాదు. ఆయన, మీ హృదయంలో వుంటూ వున్న ఆయన'' అని కౌంటెస్ లిదియా ఇవానొవ్నా పారవశ్యపూరితమైన కళ్ళు పైకి తిప్పుతూ అంది. ''ఆ కారణంగా మీరు చేసిన పనికి మీరు లజ్జ పడనక్కర్లేదు'' అంది.

కరేనిన్ కనుబొమలు ముడుచుకుని, వేళ్లల్లోకి వేళ్ళు పోనిచ్చి కణుపులు విరుచుకున్నాడు.

''మీరు మొత్తం విషయాలన్నిట్నీ తెలుసుకోవడం అవసరం'' అని అతను కీచు కంఠంతో మొదలుపెట్టాడు. ''మనిషన్న వాడి తాహతుకి పరిమితి అంటూ వుంటుంది, కౌంటెస్. నేను ఆ హద్దు చేరుకున్నాను. యివాళ రోజంతా నేను యేకాకినైన పరిస్థితి ఫలితంగా'' (అతను 'ఫలితంగా' అనే మాటని నొక్కి పలికేడు) ''యింటి విషయాల గురించి అవీ యివీ అడుగుతూనే వున్నారు. నౌకర్లు, పంతులమ్మ, బిల్లులు... యీ చిల్లర గొడవ అన్నీ నన్ను తినేశాయి. నాకు వీటిని భరించడం కష్టమైపోయింది. భోజనం దగ్గర... నిన్న భోజనాల బల్ల దగ్గర్నుంచి లేచి వెళ్లిపోయినంత పనైంది. మా అబ్బాయి చూసే చూపు భరించడం కష్టమైపోయింది. యీ గొడవంతా యేమిటని వాడు అడగలేదు, కాని వాడు అడగ దలచుకున్నాడు, వాడు ఆ ధోరణిలో చూసిన చూపుని తట్టుకోలేకపోయేను. వాడు నాకేసే చూస్తూ గాభరా పడిపోయేడు. కాని యింతటితో అయిందనుకోకండి...''

కరేనిన్ ఆ బిల్లు గురించి చెప్పాలనుకున్నాడు. కాని అతని గొంతుక పెగల్లేదు. నీలం కాగితంమీద రాసిన టోపీ, రిబ్బన్ల బిల్లుని తన పట్ల తనకి విపరీతమైన జాలి కలగకుండా గుర్తు చేసుకోలేకపోయేడు.

''నాకు తెలుసు, తెలుసండీ'' అంది కౌంటెస్ లిదియా ఇవానొవ్నా. ''నాకన్నీ తెలుసు. సహాయం, వూరట మీకు నానుంచి రావు, కాని నేను కేవలం అందుకోసమే యిక్కడికి వచ్చేను, చెయ్యగలిగితే మీకు సాయం చెయ్యాలని. యీ చిన్న చిన్న బరువుల్ని మీ భుజస్కంధాలమీదనుంచి నేను దించగలిగితే... మీ యింట్లో ఆడదాని మాట, ఆడదాని సాయం అవసరం అని నాకు తెలుసు. మీరు ఆ భారం నామీద వదిలిపెడతారా?'' అంది.

కరేనిన్ మౌనంగానే కృతజ్ఞతా భావంతో ఆమె చేతిని నొక్కేడు.

''మీరూ నేనూ కలిసి సెర్యోష సంరక్షణ చూద్దాం. వ్యవహారం విషయాలు నాకంత తెలియవు గాని నేను యీ బరువు యెత్తుకుంటాను. మీ యింటి వ్యవహారాలు నేను చూస్తాను. యిదంతా యేదో నా మంచితనం అని మెచ్చుకోకండి. యిదంతా చేస్తూ వున్నది నేను కాదు...''

"నేను మీ ఋణం యెలా తీర్చుకోగలను?"

"కాని, చూడండి, మీరు అదే తలుచుకుని కుంగిపోకండి, వొక క్రైస్తవుడు ఆశించే ఉన్నత శిఖరాల గురించి సిగ్గు పడకండి. 'వినమ్రులైన వాళ్లే ఉన్నతులుగా వుంటారు.' మీరు నా ఋణం గిణం మాటలే అనద్దు. ఆయనకి ఋణపడి వున్నారు, ఆయన సహాయాన్ని అర్థించండి. ఆయనలోనే మనకి శాంతి, వూరట, విముక్తి, ప్రేమ లభిస్తాయి" అని మళ్లీ కళ్లు పైకి యెత్తి అంది. ఆ తర్వాత నిశ్శబ్దంగా వుండడంతో ఆమె ప్రార్థన చేస్తోందని కరేనిన్ అనుకున్నాడు.

కరేనిన్ ఆమె మాటలు వినేటప్పుడు అతనికి ముందు అప్రియంగా కాకపోయినా అతిశయంగా కనిపించిన మాటలు యిప్పుడు స్వాభావికంగా, సాంత్వనప్రదంగా కనిపించేయి. కరేనిన్‌కి యీ నూతన పారవశ్యపూరిత ధార నచ్చలేదు. అతను ఆస్తికుడే గాని యెక్కువగా రాజనీతిపరంగానే మతంలో అతనికి ఆసక్తి, కొత్త అర్థాలకి వీలు కలిగించే యీ నూతన బోధన అతనికి సూత్రరీత్యా రుచించదు, యేమంటే అది వాదనలకీ, వ్యాఖ్యానాలకీ దారి తీస్తుంది. యింతకుముందు అతను ఆ కొత్త అర్థం పట్ల ఉదాసీనంగా, వో రకంగా విద్వేషంగా కూడా వున్నాడు. కాని ఆ సిద్ధాంతాన్ని అనుసరించిన లిదియా ఇవానొవ్నాతో యెన్నడూ వాదించలేదు. ఆమె అభిప్రాయాలు చూసి యేం మాట్లాడకుండా వూరకుండేవాడు. యివాళ మొదటి సారిగా యెంతో సంతోషంగా ఆమె చెప్పింది విన్నాడు, మనసులో వాటిపట్ల విరోధభావం కలగలేదు.

"మీ మాటలకి, మీ సాయానికీ యెలా బదులు తీర్చగలనో తెలియడం లేదు" అని ఆమె ప్రార్థన ముగించేక అన్నాడు.

కౌంటెస్ లిదియా ఇవానొవ్నా మరో సారి అతని రెండు చేతుల్నీ అదిమింది.

"యిప్పుడు వ్యవహారానికి వస్తాను" అని ఆమె మౌనంగా కన్నీళ్ల జాడల్ని చెక్కిళ్ల మీదనుంచి తుడుచుకుంటూ అంది. "నేనిప్పుడు సెర్యోష దగ్గరికి వెడతాను. యిక తప్పని పరిస్థితిలో మాత్రం మీ దగ్గరకి సాయం కోసం వస్తాను" అని లేచి లోపలికి వెళ్లింది.

కౌంటెస్ లిదియా ఇవానొవ్నా సెర్యోష గదికి వెళ్లింది. కుర్రవాడు బెదిరిపోయేటంతగా వాడి చెక్కిళ్లని కన్నీళ్లతో ముంచెత్తేసి వాళ్ల నాన్న ఋషి అనీ, వాళ్లమ్మ చనిపోయిందనీ చెప్పింది.

కౌంటెస్ లిదియా ఇవానొవ్నా తను అన్న మాట నిలబెట్టుకుంది. కరేనిన్ యింటి పనులన్నీ అజమాయిషీ చేసి నిర్వహించే మొత్తం బాధ్యతని నెత్తిమీద వేసుకుంది. వ్యవహారం విషయాల్లో తనకి చురుకు లేదని అన్నప్పుడు ఆమె నిజమే చెప్పింది. ఆమె పురమాయింపులన్నిట్నీ మార్చాల్సి వచ్చేది యేమంటే వాటిని అమలు జరపడం అసాధ్యం. ఆ మార్పుల్ని కరేనిన్ నౌకరు కర్నేయ్ చేసేవాడు. యెవళ్లకీ ఆచూకీ కూడా తెలియకుండా అతను కరేనిన్

యింటి వ్యవహారాలు చక్కబెట్టేడు. యజమానికి బట్టలు అందిస్తూ నేర్పుగా యేవేమిటి అవసరమో చెప్పేవాడు. అయినా కూడా లిదియా ఇవానొవ్నా సాయం చాలా ఘనంగానే వుంది. ఆమె కరేనిన్ పట్ల తన ప్రేమనీ గౌరవాన్నీ చూపిస్తూ అతనికి నైతిక తోడ్పాటుని యిచ్చింది. ముఖ్యంగా లిదియా ఇవానొవ్నా అతన్ని అసలైన క్రైస్తవుడిగా మార్చింది, అది ఆమెకి చాలా సంతోషం కలిగించింది. యింకోలా చెప్పాలంటే ఉదాసీనంగా యేదో మొక్కుబడికి ఆస్తికవాదిగా వున్న అతన్ని అప్పట్లో పీటర్స్‌బర్గ్‌లో వ్యాప్తిలో వున్న క్రైస్తవ విశ్వాస నూతన అర్థానికి స్థిరామైన, ఉత్సాహపూరితమైన అనుయాయిగా మార్చింది. కరేనిన్ సునాయాసంగా అటు మారిపోయేడు. లిదియా ఇవానొవ్నాకీ అలాంటి దృక్పథాలు వున్న యితరులకి మాదిరీ కరేనిన్‌కి కూడా భావనా గాఢత్వం, అంటే వొక మానసిక క్షమత లేకపోయింది. మానసిక క్షమత వుంటే భావనల్లో కలిగిన ముద్రలు యెంతో వాస్తవికంగా కనిపిస్తాయి, అవి యితర ముద్రలకీ, వాస్తవికతకీ అనురూపతని అపేక్షిస్తాయి. తనకి సంబంధించి నాస్తికులకున్న మృత్యువు తనకి లేదనీ, తనకి పూర్తి విశ్వాసం వుండబట్టి, అది యెంత స్థాయిలో వున్నదీ నిర్ణయించుకునేది స్వయంగా తనే అయివుండి, తన ఆత్మ సకల పాపాలనుంచీ విముక్తం అయిందనీ, భూమ్మీదే తనకి ముక్తి అనుభవంలోకి వస్తోందనీ భావించడంలో అసంభవమైంది గాని, విరుద్ధంగా వున్నది గాని యేమీ అతనికి కనిపించలేదు.

యీ తన విశ్వాస భావనలోని గాంభీర్యతలేమి గురించీ, మృష గురించి లీలగా కరేనిన్ యెరుకలో వుందన్న మాట నిజమే. తను ఆన్నాకి ప్రసాదించిన క్షమాదానం యే ఉచ్చ శక్తి ప్రేరితమూ కాక అనాలోచితంగా సద్యోజనితంగా వొక తత్కాల బోధనకి ప్రేరణగా వచ్చింది. కాని ప్రస్తుతంలో క్రీస్తు తన హృదయ స్థితమై వున్నాడని, కాగితాలమీద సంతకాలు పెట్టేటప్పుడు కూడా ప్రభువు ఆజ్ఞనే తను అమలు పరుస్తూ వున్నాడనీ ప్రతి క్షణం అనుకుంటున్నాడు. అయినా ప్రస్తుతంలో కంటే అప్పుడే యెక్కువ ఆనందం కలిగిందని అతనికి తెలుసు. కరేనిన్‌కి సంబంధించి అలా అనుకోవడం అవసరం. తన అవమాన వ్యాకులిత దశలో వూహించుకున్నదే అయినప్పటికీ అతనికి ఆ ఉచ్చ స్థితి అవసరం. ఆ యెత్తునుంచి, అందరిచేతా తిరస్కృతుడైన తను, మిగిలిన అందర్నీ తిరస్కార దృష్టితో చూడగలడు. అంచేత అతను వాస్తవిక ముక్తికిలాగా యీ కృత్రిమ ముక్తికి అంటి పెట్టుకుపోయేడు.

## 23

కౌంటెస్ లిదియా ఇవానొవ్నాకి చిన్నప్పుడే పెళ్ళయింది. ఆమె అప్పటికి చాలా చిన్న పిల్లగా పారవశ్యపూరిత నేత్రాలతో వుండేది. వరుడు వో సంపన్న ఉన్నత వంశీకుడు, సాధు స్వభావం వున్న వాడు, ఖుషీ మజా మనిషి. పెళ్ళయాక రెండు నెల్లు నిండక ముందే అతను

ఆమెని వదిలేశాడు. ఆమె పారవశ్యపూరిత ప్రణయ నివేదనలు చేసేది, అతను కేవలం వ్యంగ్య పూరిత బాణాలు వదులుతూ శత్రుభావం ప్రదర్శిస్తూ బదులు చెప్పేవాడు. అతని దయా పూరిత హృదయం గురించి తెలిసిన వాళ్లకీ, పారవశ్యంతో వివశురాలైన కౌంటెస్ లిదియా ఇవా నొవ్నాలో అభ్యంతరకరమైంది యేదీ చూడలేని వాళ్లకీ యీ విషయం యేమిటో అంతు బట్టక చిక్కుపడిపోయేరు. అప్పట్నుంచీ వాళ్లు విడాకులు అంటే పుచ్చుకోలేదు గాని విడివిడిగానే వుండిపోయేరు. యెప్పుడన్నా భార్య తటస్థపడితే అతను అదే విషభరిత వ్యంగ్యపూరిత పద్ధతిలో ప్రవర్తించేవాడు. దానికి కారణం యేమిటై వుండేదీ యెవళ్లకీ అంతుబట్టలేదు.

కౌంటెస్ లిదియా ఇవానొవ్నాకి భర్త పట్ల ప్రేమ యెప్పుడో పోయింది. కాని యెప్పుడూ యెవళ్లనో వొకళ్లని ప్రేమిస్తూనే వుండేది. కొంతమంది మగాళ్లని, ఆడవాళ్లని వొక్క సారే ప్రేమిస్తూనే వుండేది. ప్రముఖులు అనుకునే వాళ్లందర్నీ ఆమె ప్రేమించేది. రాజ దర్బారులోకి వచ్చే ప్రతి కొత్త ప్రిన్స్‌నీ, ప్రిన్సెస్‌లనీ ప్రేమించేది. ఆమె రష్యన్ చర్చి బిషప్‌ని ప్రేమించింది. ఉపబిషప్‌ని ప్రేమించింది. పురోహితుణ్ణి ప్రేమించింది. వొక పత్రికా విలేకరిని ప్రేమించింది. ముగ్గురు స్లావ్‌లని, కొమిస్సారొవ్‌ని,* వొక మంత్రిని, డాక్టర్‌ని, ఇంగ్లీషు మిషనరీని, కరేనిన్‌ని ప్రేమించింది. రాజదర్బారులోనూ, సమాజంలోనూ బహు విస్తారమైన సంబంధాలనీ, జటిలమైన సంబంధాలనీ యేర్పాటు చేసుకోవడానికి ఆటుపోట్లతో వుండే యీ ప్రేమలో వొక్కటి కూడా ఆమెకి ఆటంకపడలేదు. కాని కరేనిన్‌కి యీ దురదృష్టం సంప్రాప్తమయి అతన్ని తన ప్రత్యేక సంరక్షణలోకి తీసుకున్నప్పటి నుంచీ, కరేనిన్ సుఖశాంతుల గురించి దృష్టి పెట్టినప్పట్నుంచీ అతని యింటి విషయాలు చక్కబెట్టడానికే తంటాలు పడినప్పట్నుంచీ, తన యితర ప్రేమలన్నీ పైపై మిణుకులే అనీ, నిసర్గమైన ప్రేమ తనకి కరేనిన్ పట్లనే వుందనీ ఆమెకి నమ్మకం కలిగింది. అతని పట్ల యిప్పుడు తనకి కలిగిన ప్రేమ భావం లాంటిది అసలు యెవరిపట్లా యెప్పుడూ అంతకుముందు తనకి కలగలేదని ఆమెకి అనిపించింది. ఆమె తన ముందటి అనుభూతుల్ని ప్రస్తుతంతో పోల్చి విశ్లేషణ చేసుకుంది. జార్ జీవితాన్ని కాపాడకపోయి వుంటే తను కొమిసారొవ్‌ని ప్రేమించి వుండేది కాదు. స్లావ్ సమస్య లేకపోయినట్లయితే గనక రీస్తిచ్ – కుడ్‌జీట్‌స్కీని ప్రేమించి వుండేది కాదు.* కాని కరేనిన్‌ని మాత్రం అతని కోసమే, మరే యితర ప్రభావాల ప్రమేయమూ లేకుండా, ప్రేమించింది. అతని సమున్నత, నిగూఢ ఆత్మ కోసం, సాగదీస్తూ మాటల్ని పలికే కీచు కంఠం కోసం, – ఆమెకి అది మనోహరంగా కని పించింది – అలిసినట్టుండే చూపు కోసం, అతని వ్యక్తిత్వం కోసం, ఉబ్బిన నరాలతో వుండే తెల్లని మృదువైన చేతుల కోసం ప్రేమించింది. అతన్ని కలుసుకోవడం ఆమెకి సంతోషంగా వుండేది. అంతే కాదు, తనని కలుసుకున్నప్పుడు అతనికి యెలా వుంటుందో అనే చిహ్నాల కోసం అతని ముఖంలో వెతికేది కూడా. మాటలతోనే కాక మొత్తం తన వ్యక్తిత్వంతో

అతన్ని సంతుష్టి పరచాలని చూసేది. అతని కోసమన్నెప్పీ ఆమె ముందటి కంటే యెక్కువగా ముస్తాబుమీద శ్రద్ధ పట్టేది. తనకి పెళ్లి కాకుండా, తను బంధంలో యిరుక్కోకుండా వుంటే యెంత మధురంగా వుండేదో కదా అని కలలు గనేది. అతను గదిలోకి వచ్చినప్పుడు తత్తరపాటుతో సిగ్గు పడిపోయేది. అతను యేదన్నా ముచ్చటైన మాట అంటే ఆమె పెదాలమీద పారవశ్యపూరిత మందహాసం లాస్యం చేసేది.

కౌంటెస్ లిదియా ఇవానొవ్నా కొన్ని రోజులుగా మహా ఉత్తేజంగా వుంది. అన్నా, వ్రాన్స్కీ పీటర్స్‌బుర్గ్‌లో వున్నారని వింది. కరేనిన్ పెళ్లాన్ని కలుసుకోకుండా తప్పించాలి తను. ఆ ఘోరమైన ఆడమనిషి అదే వూళ్లో వుంది, యే క్షణంలోనేనా ఆమె తటస్థ పడవచ్చు అనే బాధాకరమైన విషయమే అతనికి తెలియకూడదు.

ఆ 'ఘోరమైన మనుషులు' — ఆమె అన్నా వ్రాన్స్కీలని అలానే పిలిచేది — యెక్కడ వున్నదీ, యేం చెయ్యబోతూ వున్నదీ ఆమె తనకి తెలిసిన వాళ్లద్వారా కూపీలాగేది. తదనుగుణంగా ఆమె తన మిత్రుడు వాళ్లతో భేటీ పడకుండా తప్పించుకునేట్టు అతని కార్యక్రమాల్ని నడిపించేది. వ్రాన్స్కీ నేస్తుడైన వో పడుచు అడ్జుటెంట్ ఆమెకి ఆ సమాచారం యావత్తూ చేరవేసేవాడు. ఆమె ప్రాపకంద్వారా తన పనులేవో జరిపించుకోవాలని అతనికి వుండేది. అన్నా వ్రాన్స్కీలు అక్కడి పనులు పూర్తిచేసుకుని ఆ మర్నాడు వెళ్లిపోతున్నారని అతను కౌంటెస్ లిదియా ఇవానొవ్నాకి వార్త చేరవేశాడు. ఆ వార్త విని తెరిపిన పడ్డట్టు వూపిరి పీల్చిందో లేదో ఆమెకి వో చీటి అందింది. ఆ దస్తూరీ గుర్తు పట్టి ఆమెకి వొణుకు పుట్టింది. అన్నా కరేనినా దస్తూరీ అది. లిఫాఫా దళసరి కాగితంతో చేసింది. అండాకార పసుప్పచ్చ కాగితంమీద పెద్ద నాను ముద్ర వుంది. ఉత్తరం సువాసన చిమ్ముతోంది.

"యెవరు తెచ్చారు?"

"యెవరో హోటెల్‌నుంచి వచ్చిన మనిషి."

కొంతసేపటి దాకా లిదియా ఇవానొవ్నా ఉత్తరం చదివేటంత స్థిమితంగా సర్దుకోలేకపోయింది. ఆందోళనవల్ల ఆమె బాధపడే ఉబ్బసం దగ్గు ప్రకోపించింది. ఆమె ఆందోళన తగ్గించుకుని శాంతంగా అయేక ఫ్రెంచిలో రాసిన ఉత్తరాన్ని చదివింది.

'Madame la Comtesse,[1]

'మీ హృదయంలో పొంగిపొర్లే క్రైస్తవ ధార్మిక భావనలు నన్ను మీకీ ఉత్తరం రాసే అక్షంతవ్య సాహసాన్ని యిస్తున్నాయి. పుత్రుని యెడబాటువల్ల నేను దురపిల్లుతున్నాను. నేను వెళ్లిపోయే లోపున వొక్క సారి వాడిని చూడనివ్వవలసిందిగా అర్థిస్తున్నాను. మీ దృష్టికి తీసుకు వస్తూన్నందుకు క్షమించమని వేడుకుంటున్నాను. కరేనిన్‌గారిని కాకుండా మిమ్మల్ని అర్థించడానికి కారణం యేమిటంటే నా ఉనికిని గురించి జ్ఞప్తి చేసి ఆ దయాంతఃకరణు

---

[1] కౌంటెస్ (ఫ్రెంచి).

దైన వ్యక్తికి బాధ కలిగించడం నాకు యిష్టంగా లేకపోవడం. మీరు ఆయనతో యెంత స్నేహితంగా వున్నారో నాకు తెలుసు, మీరు నన్ను అర్థం చేసుకుంటారని ఆశిస్తున్నాను. మీరు సెర్యోషని నా దగ్గరికి పంపిస్తారా లేక మీరు నిర్దేశించిన వేళకి నేను రానా? లేదా యెక్కడ యెప్పుడు వాణ్ణి యింటి దగ్గర కాకుండా వేరే చోట కలవవచ్చు? మీ ఔదార్యం నాకు తెలిసి వుండడం కారణంగా అనుమతి యివ్వడం వీలు పడదు అనే మాటని విన వలసి రాదనే ధైర్యంతో వున్నాను. నా కన్న కొడుకుని చూడ్డానికి యెంత తపన పడుతు న్నానో మీరు వూహించలేరు, అలాగే మీకు యీ సహాయానికి గాను యెంత రుణపడి వుంటానో అదీ వూహించలేరు.

అన్నా'

యీ ఉత్తరంలో వున్న ప్రతీదీ కౌంటెస్ లిదియా ఇవానొవ్నాకి చిర్రెత్తించింది. ప్రసక్తమైన విషయాలు, తన ఔదార్యం గురించిన సూచన, అన్నిట్నీ మించి కౌంటెస్‌కి అనిపించినట్టు, ఆ ధోరణిలోని సాదాతనం ఆమెకి చిర్రెత్తించాయి.

"జవాబు లేదని యీ చీటీ తెచ్చిన మనిషికి చెప్పు" అంది కౌంటెస్ లిదియా ఇవానొవ్నా. వెంటనే తన రాత బల్ల తెరిచి అదే రోజు మధ్యాహ్నం దర్బారులో జరిగే అతని అభినందన సభలో తను అతన్ని చూడదలచు కుంటున్నట్టుగా కరేనిన్‌కి ఉత్తరం రాసింది.

'వొక ముఖ్య విషయం గురించి మీతో మాట్లాడాలి. మనం కలుసుకున్నాక యెక్కడ మాట్లాడుకోగలిగేదీ నిర్ణయించుకుందాం. మా యింటి దగ్గరైతే బాగుంటుంది. 'మీ' టీ తయారు చెయ్యమంటాను. మనం తప్పకుండా కలుసుకోవాలి. ఆయన శిలువనీ యిస్తాడు, దాన్ని భరించే శక్తినీ యిస్తాడు' అని కరేనిన్‌ని మానసికంగా ముందటినుంచీ తయారు చేసేటందుగ్గాను జతచేసింది.

కౌంటెస్ లిదియా ఇవానొవ్నా కరేనిన్‌కి రోజూ రెండు మూడు చీటీలు పంపే అలవాటు చేసుకుంది. అతనితో యీ విధంగా సంబంధం నిలబెట్టుకోవడం ఆమెకి బాగా వుంది. ప్రత్యక్ష సంబంధాల్లో లేని వొక లాలిత్యపూరిత, నిగూఢ అంశ యిందులో వుంది, అది ఆమెకి యిష్టం.

## 24

అభినందన సభ ముగిసింది. అతిథులు వెళ్లిపోతూ వొకళ్లకొకళ్లు తాజా సమాచారం తెలియ చేసుకుంటూ, అభివాదాలు చేసుకుంటూ, అప్పుడే ప్రదానం అయిన పతకాల గురించి ముచ్చటించుకుంటూ, ఉన్నత ప్రభుత్వ ఉద్యోగాల్లో జరిగిన మార్పుల గురించి ముచ్చ టించుకుంటూ మాట్లాడుకుంటూ వున్నారు.

"కౌంటెస్ మరీయా బొరీసొవ్నాని యుద్ధ మంత్రిగానూ, ప్రిన్సెస్ వత్కోవ్స్క

యాని సేనాధిపతిగానూ నియమిస్తే యెంత బాగుంటుంది'' అని వొక ముసలాయన, పొడుగ్గా వున్న అందమైన వొక దర్బారు పరిచారిక కొత్త ఉద్యోగాల గురించి అడిగిన ప్రశ్నకి జవాబుగా అన్నాడు. ఆయన బంగారు జరీ అల్లిక యూనిఫాం వేసుకున్నాడు. ఆయన జుట్టు పండిపోయింది.

''అయితే నన్ను ఎయి – డి – కేంప్‌గా వెయ్యచ్చు'' అని చిరునవ్వు నవ్వుతూ అందామె.

''అబ్బెబ్బె, మీ ఉద్యోగం అప్పుడే తేల్చేశాంగా. మీరు మత విషయాల శాఖ అధిపతిగా వుంటారు. మీకింద సహాయకుడిగా కరేనిన్ వుంటారు.''

''నమస్తే ప్రిన్స్'' అని ఆ ముసలాయన తన దగ్గరికి వచ్చిన వో పెద్ద మనిషి చేతిని పట్టుకుని అన్నాడు.

''కరేనిన్‌గారి గురించి యేదో అంటున్నారే'' అని ఆ ప్రిన్స్ అన్నాడు.

''ఆఁ యేముంది, ఆయనకీ పుత్యాతొవ్‌కీ అలెగ్జాండర్ నేవ్‌స్కీ ఆర్డరు* యిచ్చేరు.''

''ఆయనకి యిది వరకే యిచ్చారనుకున్నానే.''

''వుహుఁ, లేదు. ఆయనకేసి చూడండి'' అని ముసలాయన జడలల్లిన తన టోపీతో గుమ్మంకేసి చూపిస్తూ అన్నాడు. కరేనిన్ దర్బారు యూనిఫాం వేసుకుని, భుజంమీదనుంచి నడుందాకా ఛాతీపైనుంచి అడ్డంగా కొత్త యెర్ర రిబ్బను కట్టుకుని గుమ్మం దగ్గర యెవరో రాజకీయ మండలి* ప్రముఖ సభ్యుడితో మాట్లాడుతూ నుంచున్నాడు. ''యెంత సంతోషంగా, కులాసాగా వున్నాడు'' అని వో క్షణం ఆగి అన్నాడు. ఆ క్షణంలో అందంగా, క్రీడాకారుడి శరీర సౌష్టవం వున్న వొక కామ్మేర్‌హెర్* చేతిని అదిమేడు.

''ఆయనకి ముసలితనం వచ్చేసింది'' అన్నాడు కామ్మేర్‌హెర్.

''విధుల వల్ల. యిప్పుడు కొత్త పథకం తయారు చేస్తున్నాడు. పాపం సవివరంగా అన్నీ వింటేనే గాని అతన్ని వదలడు'' అన్నాడు.

''ముసలితనం వచ్చేసిందంటారా? Il fait des passions.[1] కౌంటెస్ లిదియా ఇవానొవ్నాకి ఆయన భార్యంటే అసూయగా వుంది.''

''ఆపండి, కౌంటెస్ లిదియా ఇవానొవ్నా గురించి చెడ్డగా అనకండి.''

''యేం? ఆమె కరేనిన్‌గార్ని ప్రేమించడం చెడ్డ అంటారా?''

''మేడం కరేనినా యిక్కడ వుందట! నిజమేనా?''

''అంటే యిక్కడ దర్బార్లో అని కాదు, పీటర్స్‌బుర్గ్‌లో. నిన్న ఆమెనీ, అలెక్సేయ్ వ్రాన్‌స్కీనీ మొర్‌స్కాయ వీధిలో bras dessus, bras dessous[2] చూశాను.''

"C'est un homme qui n'a pas...[3] అని కామ్మేర్‌హెర్ మొదలుపెట్టేడు.

---

[1] ఆడవాళ్లు పడిచస్తున్నారు (ఫ్రెంచి).

[2] చేతిలో చెయ్యి వేసుకుని (ఫ్రెంచి).

[3] అతను యెలాంటి వ్యక్తి అంటే, అతని దగ్గర వుండవు... (ఫ్రెంచి).

యెవరో రాజ కుటుంబరం ఆయన అటు వెడుతూ వుంటే ఆయనకి వందనం చేస్తూ దారి యిచ్చేందుకు మాత్రం కాసేపు ఆగేడు.

అందరూ కరేనిన్ గురించి అడ్డూ ఆపూ లేకుండా మాట్లాడుతూనే వున్నారు, విమర్శిస్తూనే వున్నారు, వెక్కిరింతగా అనుకుంటూనే వున్నారు. గుమ్మం దగ్గర కరేనిన్ రాజకీయ మండలి సభ్యుణ్ణి పట్టుకుని బంకలాగా వదలకుండా తన కొత్త ఆర్థిక పథకాల గురించి సందు యివ్వకుండా నిపులీకరిస్తూనే వున్నాడు.

భార్య తనని వదిలిపెట్టి వెళ్లిపోయిన యించుమించు అదే సమయంలోనే ఉద్యోగస్థులకి సంప్రాప్తించే ఘోర విపత్తు కరేనిన్‌కి సంభవించింది – ఉద్యోగంలో ప్రమోషన్‌లేని దశకి చేరుకోవడం. ఆ దశ వచ్చేసింది, అందరికీ అది స్పష్టంగా కనిపించింది. కాని తన ఉద్యోగ జీవిక ముగిసిందన్న యెరుక కరేనిన్‌కి రాలేదు. స్త్రేమొవ్‌తో ఘర్షణవల్ల గాని, పెళ్లాంతో యేర్పడ్డ చిక్కులవల్ల గాని, లేదా తనే విధిగీసిన వొక హద్దుకి చేరుకున్నందువల్ల గాని, కారణం యేదైతేనేం గాక, ఉద్యోగంలో కరేనిన్ స్థితి అతని ప్రాభవం అంతమయే దశకి చేరింది, అది అందరికీ తెలుసును కూడా. అతని ముఖ్యమైన పదవి యింకా వుండనే వుంది. ప్రభుత్వ ఆయోగాల్లో, కమీటీల్లో యింకా సభ్యుడిగానే వున్నాడు. కాని అతని స్థితి కరిమింగిన వెలగపండు బాపతుగా మిగిలిపోయింది. అతను యేం చెప్పినా అదంతా పాత చింతకాయ పచ్చడి బాపతుగా, దాని అవసరం యేమీ కనిపించనట్టు జనం వినేవాళ్లు.

కాని కరేనిన్‌కి అది గుర్తింపులోకి రాలేదు. రాకపోవడం సరే కదా, ప్రభుత్వ వ్యవహారాల్లో నేరుగా పాల్గొకపోవడంవల్ల అతనికి యితరుల చర్యల్లో లోపాలు, తప్పులు యిదివరకటికంటే యెక్కువ స్పష్టంగా కనిపించేవి, వాటిని సవరించే సూచనలు చెయ్యడం తన కర్తవ్యంగా అతనికి కనిపించేది. భార్య వెళ్లిపోయిన వెంటనే అతను నూతన న్యాయ విధానం గురించి మొదటి వ్యాఖ్య రాయడం మొదలుపెట్టాడు. ప్రభుత్వ పాలనలోని నానా రకాల అంశాల గురించీ రాయబోయే పనికిమాలిన అసంఖ్యాక వ్యాఖ్యల్లో అది వొకటి.

తన పరిస్థితి యెంత అధ్వానంగా వుందో నన్న గుర్తింపు కరేనిన్‌కి లేకపోయింది. అంచేత దుఃఖ పడిపోలేదు. అంత మాత్రమే కాదు అంతకు ముందు యెన్నటికంటే యెక్కువగా తన కార్యకలాపాలతో సంతోషపడ్డాడు.

"పెండ్లికానివాడు ప్రభువును ఏలాగు సంతోష పెట్టగలనని ప్రభువు విషయమైన కార్యములను గూర్చి చింతించుచున్నాడు. పెండ్లియైనవాడు భార్యను ఏలాగు సంతోష పెట్టగలనని లోక విషయమైన వాటిని గూర్చి చింతించుచున్నాడు" అన్నాడు అపోస్తలు పాల్. కరేనిన్ యెక్కువ సార్లు దీన్ని గుర్తు చేసుకునేవాడు – ప్రస్తుతం పవిత్ర గ్రంథాల్లో నిర్దేశితమైన దాని ప్రకారం నడుచుకుంటూ వున్నట్టుగా. భార్య తనని వదిలిపెట్టి వెళ్లిపోయిన క్షణంనుంచీ తను అంతకు ముందటికంటే తన పథకాలవల్ల భగవంతుడికి యెక్కువ సేవ చేస్తున్నట్టు భావించుకున్నాడు.

రాజకీయ మండలి సభ్యుడు స్పష్టంగా తెలిసేట్టుగా చిరాకు పడి, తనని వదిలిపెట్టి వెళ్లిపోవాలనుకోవడం చూసి కరేనిన్‌కి యే యిబ్బందీ కలగలేదు. ఆ సభ్యుడు యెవరో రాజ కుటుంబీకుడు అటు వెడుతూ వుంటే అతని వెనక్కాలే పడి వెళ్లినప్పుడు మాత్రమే కరేనిన్ మాట్లాడ్డం ఆపు చేశాడు.

వొంటరిగా వుండిపోయి కరేనిన్ తన ఆలోచనల్ని కూడదీసుకుందుకు తల వాల్చు కున్నాడు. తర్వాత పరధ్యానంగా చుట్టూతా చూశేడు. కౌంటెస్ లిదియా ఇవానొవ్నాని కలుసుకోవచ్చున్న ఆశతో గుమ్మం వేపు వెళ్లేడు.

'వీళ్లంతా యెంత పుష్టిగా దిట్టంగా వున్నారు!' అని వస్తాదులా వున్న కామ్మేర్‌హెర్‌ని, ఓ ప్రిన్స్‌ని చూసి కరేనిన్ అనుకున్నాడు. కామ్మేర్‌హెర్ సువాసనగా వున్న చెంపల్ని దువ్వుకున్నాడు. ప్రిన్స్ మెడ యెర్రగా వుంది. అతను యూనిఫాంలో వున్నాడు. 'లోకంలో అంతా చెడే అని నిజంగానే అన్నారు' అనుకున్నాడు కామ్మేర్‌హెర్ బలిష్ఠమైన పిక్కలకేసి వోరగా చూసి.

కరేనిన్ నిదానంగా కాళ్లెత్తి అడుగులు వేస్తూ, తన మామూలుగా అలస, హుందా వైఖరితో నడుస్తూ, అతన్ని గురించి మాట్లాడుకుంటూ వున్న వాళ్లకి అభివాదం చేస్తూ లిదియా ఇవానొవ్నా కనిపిస్తుందేమోనని గుమ్మంకేసి చూశేడు. కరేనిన్ దగ్గరికి వచ్చి, ఉదాసీనంగా తల వూపగానే

"హేయ్! కరేనిన్‌గారూ!" అని కళ్లల్లో కసి కనిపిస్తూ వుండగా ఆ ముసలాయన అన్నాడు. "నేను మిమ్మల్ని అభినందించనే లేదు" అన్నాడు కొత్త రిబ్బన్‌ని చూపించి.

"కృతజ్ఞుణ్ణి. యివాళ వాతావరణం యెంత బాగుంది!" అన్నాడు కరేనిన్ 'యెంత బాగుంది' అన్న మాటని తన ధోరణిలో వొత్తి పలుకుతూ.

వాళ్లు తన గురించి వేళాకోళాలాడుకుంటున్నారని అతనికి తెలుసు. విద్వేషం తప్ప మరి యేదీ వుంటుందనీ అతను అనుకోలేదు. అతను దానికి అలవాటు పడిపోయేడు.

గుమ్మం దగ్గర లిదియా ఇవానొవ్నా కనిపించింది. ఛోళీ వెలపలికి వచ్చిన ఆమె భుజాలూ, యిటు రమ్మని సైగ చేసే అందమైన స్వాప్నిక నేత్రాల మిలమిల చూడగానే కరేనిన్ పటుత్వంతో వున్న తన తెల్లని పళ్లు కనిపించేటట్టు చిరునవ్వు నవ్వుతూ ఆమె దగ్గరికి వెళ్లేడు.

లిదియా ఇవానొవ్నా యిటీవల కొంతకాలంగా తన అలంకరణ గురించి శ్రద్ధ పడుతూ వున్నట్టుగా యిప్పుడూ బాగా శ్రద్ధగా ముస్తాబయింది. ముప్పయి యేళ్ల కిందటి దాంతో పోల్చుకుంటే యిప్పుడు ఆమె ముస్తాబవడం ఉద్దేశం పూర్తి తల కిందులుగా వుంది. అప్పట్లో తను యెంత యెక్కువ అలంకారం చేసుకుంటే అంత మేలు అని వుండేది. యిప్పుడు తద్వ్యతిరేకం. తన వయసుకీ, ఆకారానికీ యే మాత్రం నప్పకుండా వుండే రీతిలో ముస్తాబు తప్పకుండా వుంటోంది. కాని యీ అలంకారానికీ రూపానికీ మధ్య తేడా మరీ భయంకరంగా

వుండరాదని ప్రస్తుత ఉద్దేశం. కరేనిన్ విషయంలో ఆమె ఉద్దేశం నెరవేరింది. ఆమె అతనికి ఆకర్షవంతంగా కనిపించింది. అతని పాలిటికి ఆమె, శత్రుత్వ, వ్యంగ్యపూరిత ప్రజా సముద్ర మధ్యంలో వున్న దయా ద్వీపం అంతే కాదు, యేకైక స్నేహ ద్వీపం కూడా.

అపహాసపూరిత చూపుల తీరంలో తచ్చాడుతూ వున్న అతను ఆమె ప్రేమపూరిత దృక్కుకి, చెట్టు యెండ వేపు ఆకర్షితమైనట్టుగా ఆకర్షితుడయేడు.

“అభినందనలు” అని ఆమె కళ్లతో రిబ్బన్‌ని సూచిస్తూ అంది.

సంతోషపూరిత మందహాసాన్ని అణుచుకుంటూ అతను కళ్లు మూసుకుంటూ అలాం టివి తనకి సంతోషాన్నివ్వవు అన్నట్టు భుజాలు యెగరేశాడు. అతను పైకి వొప్పుకోకపోయినా యివే అతనికి ముఖ్యమైన సంతోషకారకాలు అని లిదియా ఇవానొవ్నాకి బాగా తెలుసు.

“యెలా వున్నాడు మన దీపకుడు?” అని సెర్యోషని దృష్టిలో వుంచుకుని కౌంటెస్ లిదియా ఇవానొవ్నా అడిగింది.

“నాకు తృప్తిగా వుందని అనలేను” అని కరేనిన్ కనుబొమలు పైకి యెత్తి కళ్లు తెరుస్తూ అన్నాడు. “సీత్నికొవ్ కూడా తృప్తిగా వున్నట్టు కనిపించడం లేదు” (సీత్నికొవ్ కరేనిన్ తన కొడుకుని అప్పగించిన గురువు. ధర్మశాస్త్రాలు తప్పించి మిగిలిన అన్నీ చెపుతున్నాడతను). “నేను లోగడ వొక సారి మీకు చెప్పినట్టు పెద్దలనీ పిన్నలనీ అందరినీ అలరించవలసిన గొప్ప విషయాల పట్ల యేదో ఉదాసీనత చూపిస్తున్నాడు” అని అతను తనకి ఉద్యోగ ధర్మం యివతల ఆసక్తి కలిగించిన వొకే వొక విషయాన్ని గురించి విపులీకరించడం మొదలుపెట్టాడు: అది కొడుకు శిక్షణ.

లిదియా ఇవానొవ్నా సాయంతో కరేనిన్ తిరిగి జీవితం కేసీ క్రియా శీల కార్యకలాపాల కేసి మళ్లినప్పుడు తన దగ్గర వుండిపోయిన కొడుకు పెంపకం, విద్యాబుద్ధులు చూడ్డం తన బాధ్యత అని అతనికి అనిపించింది. యెప్పుడూ విద్యా విషయాల గురించి చూడని వాడు, యిప్పుడు దాన్ని గురించి సైద్ధాంతిక అధ్యయనం మొదలుపెట్టేడు. మానవ శాస్త్రం, విద్యా శిక్షణ శాస్త్రం, శిక్షావిధి లాంటి విషయాలమీద అనేక పుస్తకాలు చదివేక తన కొడుకు చదువు గురించి వొక ప్రణాళిక తయారు చేశాడు. పీటర్స్‌బుర్గ్‌లో వున్న ఉత్తమ టీచర్ సాయంతో పనికి నడుం కట్టేడు. ఆ పనే అతనికి పెద్ద ధ్యాస అయింది.

“కాని మనసో! వాడికి తండ్రి మంచి మనసు వచ్చింది. అలాంటి మనసు వున్న వాడు చెడ్డవాడు అవడు” అని కౌంటెస్ లిదియా ఇవానొవ్నా చాలా పారవశ్యపూరితంగా అంది.

“కావచ్చు... నాకు సంబంధించి నా విధి నేను నిర్వహిస్తున్నాను. యింక అంతకంటే చెయ్యలేను.”

“మీరు మా యింటికి రావాలి” అని కౌంటెస్ లిదియా ఇవానొవ్నా కొంచెం సేపు ఆగి అంది. “వొక విషయం గురించి మాట్లాడుకోవాలి. మీకు అది కష్టం కలిగించచ్చు.

మీకు ఆ స్మృతులు రాకుండా వుండేందుకు యేమైనా చేస్తాను. కాని పై వాళ్ళు అలా అను కోరు. నాకు 'ఆమె' ఉత్తరం రాసింది. 'ఆమె' పీటర్స్‌బుర్గ్‌లో వుంది'' అంది.

భార్య ప్రస్తావన రాగానే కరేనిన్ వొక్క సారి కంపించేడు కాని వెంటనే మృత్యు జడత్వం అతని ముఖంలో ప్రత్యక్షమైంది. యీ విషయంలో అతని పూర్తి వివశత్వాన్ని అది వెల్లడి చేసింది.

''నేననుకున్నా అలా జరుగుతుందని'' అన్నాడు.

కౌంటెస్ లిదియా ఇవానొవ్నా అతనికేసి పారవశ్యభరితంగా చూసింది. అతని ఆత్మ ఔన్నత్యం పట్ల ప్రశంసాత్మకంగా ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగేయి.

## 25

కరేనిన్ చిన్న విశ్రాంతి మందిరంలోకి వెళ్లేడు. ఆ గది గోడలకి తైలవర్ణ చిత్రాలు వున్నాయి. పింగాణీ సామాను పరిచిన మేజా ఆ గదిలో వుంది. కాని అసలు యింటావిడ అక్కడ లేదు. ఆమె బట్టలు మార్చుకుంటోంది.

టేబిల్ క్లాత్ పరిచిన వో గుండ్రటి బల్ల అక్కడ వుంది. దానిమీద పింగాణీ టీ సెట్ వుంది. వెండి టీ కెటిల్ స్పిరిట్ లేంప్‌మీద వేడి చెయ్యడానికి వుంది. కరేనిన్ పరధ్యానంగా ఆ చిత్రాలకేసి చూశాడు. అవి అతనికి పరిచితమైనవే. తర్వాత వో చిన్న బల్ల దగ్గర కూర్చు న్నాడు. దానిమీద వున్న బైబిల్ అందుకున్నాడు. సిల్కు గౌను రెపరెపలు వినిపించి అతను యీ లోకంలోకి వచ్చేడు.

''హమ్మయ్య! ఆఖరికి టీ తాగుతూ కబుర్లు చెప్పుకుంటూ కూర్చోవచ్చు'' అని కౌంటెస్ లిదియా ఇవానొవ్నా కంపించే చిరునవ్వు నవ్వుతూ అంది. ఆమె గబగబా టీ బల్లకీ, సోఫాకీ మధ్య చేరి కూర్చుంటూ అంది.

కొంత లోకాభిరామాయణం తర్వాత కౌంటెస్ లిదియా ఇవానొవ్నా ఉత్తేజంతో యెర్ర బడుతూ, రొప్పుతూ కరేనిన్‌కి అన్నా రాసిన ఉత్తరాన్ని అందించింది.

దాన్ని చదివేక అతను కొంత సేపు యేమీ మాట్లాడలేదు.

''వీల్లేదని చెప్పే హక్కు నాకు లేదనుకుంటాను'' అని కళ్లు పైకి యెత్తుతూ బెరుకు బెరుగ్గా అన్నాడు.

''అయ్యో! సత్యకాలమాని! మీకు యెందులోనూ చెడు కనిపించదు.''

''అందుకు వ్యతిరేకం, నాకు ప్రతిదాంట్లోనూ చెడు కనిపిస్తోంది. కాని అలా చెయ్యడం న్యాయమేనా?''

అతని ముఖంలో సందిగ్ధత, సలహా కోసం అభ్యర్థన, తోడ్పాటు కోసం అనురోధం, తన అవగాహనకి అందని విషయంలో మార్గ నిర్దేశం చెయ్యమన్న కోరిక కనిపించేయి.

"న్యాయమే. దేనికన్నా అర్థం పర్థం వుండాలి" అని కౌంటెస్ లిదియా ఇవానొవ్నా చెప్పడం మొదలుపెట్టింది. "నేను అవినీతిని అర్థం చేసుకోగలను" అంది, కాని అది నిజంగా నమ్మి అన్న మాట కాదు. యేమంటే ఆడవాళ్లని అవినీతికి పురికొల్పేది ఆమెకి యెన్నడూ అర్థం కాదు. "కాని క్రూరత్వాన్ని అర్థం చేసుకోలేను, అదీ యెవరిపట్ల? మీపట్ల! మీరు వున్న యీ వూరికి ఆమె యెలా రాగలిగిందీ అని! లోకం చూసి తెలుసుకోండి అన్నారు. మీ ఔన్నత్యం గురించీ, ఆమె నీచత్వం గురించీ నాకు తెలిశాయి."

"మొదటి రాయి యెవరు విసురుతారు?" అని కరేనిన్ తన పాత్రపట్ల సంతృప్తి పడుతున్నట్టు అన్నాడు. "నేను ఆమెను క్షమించాను. అంచేత ఆమెకి ప్రేమ అవసరం వున్న దాన్ని లేకుండా చెయ్యలేను, అంటే తన కొడుకుపట్ల ప్రేమని..."

"కాని అది ప్రేమంటారా? కడుపులోనుంచి వచ్చినదేనా? మాటకి మీరు క్షమించారనే అనుకుందాం, క్షమిస్తారనే అనుకుందాం, అంత మాత్రం చేత ఆ కులదీపకుడి మనసు క్షోభ పెడదామా? ఆమె చనిపోయిందని వాడనుకుంటున్నాడు. ఆమె కోసం దేవుణ్ణి ప్రార్థించి ఆమె పాపాలకి ఆమెని క్షమించమని అడుగుతున్నాడు. అదే మేలుగా వుంది. యిప్పుడేమనుకుంటాడు తను?"

"ఆ విషయం నాకు స్ఫురించలేదు" అని ఆమె మాటలు వొప్పుకుంటూ అన్నాడు కరేనిన్.

కౌంటెస్ లిదియా ఇవానొవ్నా చేతులలో ముఖం కప్పుకుని యేమీ మాట్లాడలేదు. ఆమె ప్రార్థన చేస్తోంది.

"నా సలహా గనక అడిగితే" అని ప్రార్థన అవగానే చేతులు దించి అంది. "వొప్పుకో వద్దనే అంటాను. మీరెంత బాధపడుతున్నారో యిది యెలా మీ పుండుని రేపిందో నాకు కనిపించడం లేదూ? మాటకి యెప్పట్లాగే మీరు మీ గురించి అనుకోరనే అనుకుందాం. దాని ఫలితం యేమిటి? మీరు కొత్తగా యాతన పడడం, పిల్లవాడికి లేనిపోని వేదన. తను యింకా అన్నం తినే మనిషే గనక అయివుంటే ఆమె యిలాంటి కోరిక కోరదు. నేనైతే వుహుఁ, వీల్లేదు అని కరాఖండీగా చెప్పేదాన్ని. మీరు వూఁ అంటే ఆమెకి అలా అని ఉత్తరం రాస్తాను" అంది.

కరేనిన్ సరేనన్నాడు. కౌంటెస్ లిదియా ఇవానొవ్నా ఫ్రెంచిలో ఉత్తరం రాసింది.

'ప్రియమైన అమ్మగారూ!

మీ కుర్రవాడికి మిమ్మల్ని గురించి గుర్తు చెయ్యడంవల్ల వాడికి యక్ష ప్రశ్నలు పుడతాయి. ఆ ప్రశ్నలకి చెప్పవలసిన జవాబులు వాడికి పవిత్రమైన విషయాలపట్ల వుండవలసిన భక్తి భావాన్ని నాశనం చేస్తాయి. అందుచేత మీరు మీ భర్తగారి నిరాకరణని క్రైస్తవ ధర్మ

శ్రేయో భావనానురూపంగా గ్రహించవలసిందని చెపుతున్నాను. సర్వశక్తివంతుడైన పరాత్పరుడు తన కృపా సుధని మీమీద వర్షించుగాక.

కౌంటెస్ లిదియా'

యీ ఉత్తరం కౌంటెస్ లిదియా ఇవానొవ్నా స్వయంగా పైకి వొప్పుకోలేని రహస్య లక్ష్యాన్ని సాధించింది. అన్నా మనసుకి శల్యంలాగా గుచ్చుకుంది.

లిదియా ఇవానొవ్నా దగ్గర్నుంచి తిరిగి యింటికి వెళ్లాక కరేనిన్ తన మామూలు కార్యకలాపాలమీద మనసు లగ్నం చెయ్యలేకపోయేడు; ముక్తిమార్గం కనిపెట్టిన ఆస్తికుడిగా వుండిన చిత్త శాంతినీ పొందలేకపోయేడు.

కౌంటెస్ లిదియా ఇవానొవ్నా న్యాయంగానే తన గురించి చెప్పినట్టు భార్య పట్ల తను పవిత్రంగా వున్నాడు. ఆమె దోషి. ఆమె స్మృతి అంత కలత కలిగించి వుండకూడదు. కాని అతనికి మనశ్శాంతి లేకపోయింది. చదివే పుస్తకం బుర్రకెక్కడం లేదు. అన్నాతో తన పూర్వ సంబంధాల వేదనా భరిత స్మృతుల్ని తరిమేసుకోలేకపోయేడు. తన దోషాలుగా యిప్పుడతనికి కనిపించే వాటిని మర్చిపోలేకపోయేడు. గుర్రం పందేల తర్వాత యింటికి తిరిగివచ్చే సమయంలో అన్నా తన ప్రేమ కలాపం గురించి వెల్లడి చేసినప్పుడు తను ప్రతిస్పందించిన విధం (మరీ ముఖ్యంగా ఆమె లోకుల ముందు యెలా నడుచుకోవాల్సిందీ తను కోరడం, వ్రాన్స్కీని ద్వంద్వయుద్ధానికి సవాల్ చెయ్యకపోవడం) అతనికి గుర్తు వచ్చింది. అది అతన్ని పశ్చాత్తాపంతో వేదన పెట్టింది. అలాగే తను ఆమెకి రాసిన ఉత్తరం గుర్తు వచ్చి వ్యథ కలిగించింది. కాని ముఖ్యంగా శుద్ధ అనవసరమైన తన క్షమాదానం, మరొకడి బిడ్డ పట్ల తను చూపించిన బెంగ అతని హృదయంలో లజ్జా పశ్చాత్తాపాల నిప్పులాగా మారి అతన్ని దహించి వేశాయి.

తను ఆమెతో గడిచిన గత జీవితం అంతట్నీ గుర్తు చేసుకుని, తను యెంతో తటాపటాయించి, నంగినంగి మాటలతో వివాహ ప్రస్తావన చేసిందీ గుర్తు చేసుకుని అతను సిగ్గుతో, పశ్చాత్తాపంతో కుంగిపోయేడు.

'కాని నా తప్పు యేం వుంది?' అనుకున్నాడు. యీ ప్రశ్ననుంచి విధిగా యింకో ప్రశ్న పుట్టేది. మిగతా వాళ్లు యీ వ్రాన్స్కీలు, అబ్లాన్స్కీలు.... బలిష్ఠమైన పిక్కలతో వున్న కామ్మేర్ హెర్‌లు వేరేగా అనుభూతి చెందుతారా, ప్రేమిస్తారా వేరేగా వివాహం చేసుకుంటారా? అన్ని వేళలా, అన్ని చోట్లా తన దృష్టిని ఆకర్షించి, తన కుతూహలాన్ని రెచ్చగొడుతూ నేవళింపుగా వుండి జీవితంతో తొణికిసలాడుతూ యెన్నడూ యే సంశయాలకీ గురికాని మనుషులు అతని కళ్ల ముందు ప్రత్యక్షమయేరు. అతనీ ఆలోచనలని తరిమేశాడు. తను వున్నది యీ బుద్బుదప్రాయమైన పాంచభౌతిక జీవితం గడిపేటందుకు కాదనీ, శాశ్వత జీవితం కోసమనీ, తన ఆత్మ ప్రేమతో శాంతితో నిండుగా వుందనీ నమ్మకం కలిగించుకో

ప్రయత్నించేడు. కాని యీ బుద్బుదప్రాయ, తుచ్ఛ జీవితంలో కొన్ని తుచ్ఛమైన పొరపాట్లు తను చేశాననే యెరుక వచ్చి తను నమ్మేటువంటి శాశ్వత ముక్తి లేనట్టు అతన్ని వేదన పెట్టింది. కాని యీ ఆత్మ చేతనా పరీక్ష కొంచెం సేపే వుంది. కొంచెం సేపట్లోనే కరేనిన్ మనసుకి శాంతి, సమున్నత స్థితి తిరిగి వచ్చేయి. దాంతో తను వేటిని గుర్తు చేసుకోకూడదను కుంటున్నాడో వాటిని మర్చిపోగలిగేడు.

## 26

''అయితే, కపితోనిచ్'' అని సెర్యోష తన పుట్టిన రోజుకి ముందు రోజున షికారు వెళ్లి తిరిగివచ్చేక ముసలి పొడగరి దర్వాన్‌కి ఓవర్‌కోటు అందిస్తూ అన్నాడు. సెర్యోష చెక్కిళ్లు యెర్రగా వున్నాయి, హుషారుగా వున్నాడు. దర్వాన్ చిన్నగా వున్న సెర్యోషమీదకి వంగి చిరునవ్వు నవ్వేడు. ''బేండేజీ కట్టుకున్న గుమాస్తా యివాళ మళ్లీ వొచ్చేడా? నాన్న అతన్ని కలుసుకున్నారా?'' అని సెర్యోష అడిగేడు.

''కలుసుకున్నారు. సెక్రటరీగారు బయటికి రాగానే నే వెళ్లి అయ్యగారికి చెప్పా'' అని దర్వాన్ హుషారుగా కన్ను గీటుతూ అన్నాడు. ''యిలా రండి, నే విప్పుతా'' అన్నాడు.

''సెర్యోష!'' అని కుర్రవాడి స్లావ్ ట్యూటర్ లోపలికి వెళ్లే గది గుమ్మం దగ్గర ఆగి మందలింపుగా అన్నాడు. ''సొంతంగా విప్పుకోండి.''

ట్యూటర్ లోగొంతుకలో అన్న మాటని విన్నా సెర్యోష పట్టించుకోలేదు. దర్వాన్ పటకా పట్టుకుని అతని ముఖంలోకి చూస్తూ అక్కడే నుంచున్నాడు.

''నాన్న అతనడిగింది చేశారా?''

దర్వాన్ చేశారన్నట్టు తల వూపేడు.

అతనికీ, సెర్యోషకీ యిద్దరికీ ఆ బేండేజీ కట్టుకున్న గుమాస్తా అంటే ఆసక్తి కలిగింది. ఆ గుమాస్తా కరేనిన్ సాయం అర్థిస్తూ యేడు సార్లు వచ్చేడు. ఒక సారి సెర్యోష అతన్ని గుమ్మంలో చూశేడు. తను వచ్చినట్టు అయ్యగారికి చెప్పమని దర్వాన్‌ని బతిమలాడేడు. తనూ తన పిల్లలూ తిండికి మాడిపోతున్నామని అన్నాడు.

అప్పట్నుంచీ సెర్యోష అడపాదడపా అతన్ని చూస్తూనే వున్నాడు. అతనంటే సెర్యోషకి ఆసక్తి కలిగింది.

''అతను చాలా సంతోషించేడా?'' అని అడిగేడు.

''మామూలుగానా! ఎగిరి గంతేశాడు!''

''యేమన్నా వస్తువు వచ్చిందా?'' అని సెర్యోష కొంచెం సేపు ఆగి అడిగేడు.

''ఆఁ, చిన్న హుజూర్!'' అని దర్వాన్ తల వూపుతూ తల వొంచి మెల్లిగా అన్నాడు. ''కాంటెస్‌గారి దగ్గర్నుంచి.''

అది కౌంటెస్ లిదియా ఇవానొవ్నా పంపిన జన్మదిన కానుక అని సెర్యోష వెంటనే గ్రహించేడు.

"నిజంగా? యేమిటది?"

"కర్నేయ్ దాన్ని నాన్నగారి దగ్గరికి పట్టికెళ్లేడు. చూస్తే చాలా బాగా వున్నట్టే వుంది."

"యెంత పెద్దది? యింత పెద్దదా?"

"చిన్నదే, కాని చాలా బాగుంది."

"పుస్తకమా?"

"కాదు. వేరే యేదో. కాని పదండి, వసీలియ్ లుకీచ్ పిలుస్తూ వున్నారు" అని ట్యూటర్ అడుగుల చప్పుడు దగ్గర పడుతూ వుండడం వినిపించి అన్నాడు. మెల్లిగా ఆ చిన్న చేతిని తన పటకానుంచి విడిపించేడు. ఆ చేతిని వున్న గ్లవ్ అంతకు ముందు సగం విడి వుంది. అతను గుమ్మం కేసి తల వూపి చూపిస్తూ కనుసైగ చేశాడు.

"యిప్పుడే వస్తున్నా, వసీలియ్ లుకీచ్‌గారూ" అని ఆహ్లాదంగా మురిపించే చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. ఆ చిరునవ్వు కర్తవ్య పరాయణుడైన ఆ ట్యూటర్ మనసుని యెప్పుడూ వశం చేసుకునే చిరునవ్వు.

ఆ వేళ సెర్యోష చాలా హుషారుగా వున్నాడు, ఆ రోజు ప్రతీదీ యెంతో ఉల్లాసంగా వుంది. దాంతో అతను దర్వాన్‌కి మరో మంచి వార్త చెప్పకుండా వుండలేకపోయేడు. సమ్మర్ గార్డెన్*లో షికారుచేస్తూ కౌంటెస్ లిదియా ఇవానొవ్నా మేనకోడలు అతనికి ఆ వార్త చెప్పింది. గుమాస్తా గురించిన మంచి వార్త, తన జన్మదిన కానుక వార్తల్తో కలిసి ఆ శుభవార్త రావడంతో దాని ఘనత పెరిగింది. ప్రతి వాళ్లూ సంతోషంగా, ఉల్లాసంగా వుండవలసిన రోజు అది అని సెర్యోషకి అనిపించింది.

"విన్నావా? నాన్నకి అలెగ్జాండర్ నేవ్‌స్కీ పతకం వచ్చింది."

"వినకపోవడమేమిటి? నాన్నగార్ని అభినందించడానికి జనం వచ్చేరు."

"నాన్న సంతోషంగా వున్నారా?"

"యెందుకుండరు? స్వయంగా జార్ అనుగ్రహం చూపిస్తే! కాని నాన్నగారికా అర్హత వుంది" అని దర్వాన్ గంభీరంగా అన్నాడు.

సెర్యోష దర్వాన్ ముఖంకేసి చూస్తూ యేదో ఆలోచనలో పడిపోయేడు. పెరిగిన చెంపల మధ్యనుంచి కిందికి దిగినట్టుండే చుబుకం వున్న ఆ ముఖం సెర్యోషకి బాగా పరిచితమే. సెర్యోష తప్ప యెవళ్లూ ఆ చుబుకాన్ని తలపైకెత్తి కిందనుంచి చూడరు.

"మీ అమ్మాయి యిక్కడికి వచ్చి చాలా రోజులైంది కదా?"

దర్వాన్ కూతురు బాలే నర్తకి.

"పని రోజుల్లో యెలా వస్తుంది? దానికీ పాఠాలు వుంటాయి. చిన్న హుజూర్, మీరు కూడా వెళ్లి చదువుకోవాలి."

గదిలోకి వెళ్లాక చదువుకోవడానికి బదులుగా సెర్యోష ట్యూటర్‌కి తన అనుమానాన్ని వెల్లడి చేశాడు. తన కోసం తెచ్చిన కానుక బహుశా మోటారు అయివుంటుంది. "యేమం టారు?" అని అడిగేడు.

కాని మధ్యాహ్నం రెండు గంటలకి ప్రైవేటు మాస్టారు వచ్చేలోపుగానే వ్యాకరణ పాఠం తయారు చెయ్యాలనే విషయం గురించి వసీలియ్ లుకీచ్ ఆలోచించేడు.

"కాని వసీలియ్ లుకీచ్‌గారూ, యిది చెప్పండి అలెగ్జాండర్ నేవ్‌స్కీ పతకం కంటే పెద్దది యేది?" అని సెర్యోష బల్ల దగ్గర పుస్తకం పట్టుకు కూర్చుని హఠాత్తుగా అడిగేడు. "మీకు తెలుసా నాన్నగారికి అలెగ్జాండర్ నేవ్‌స్కీ పతకం వచ్చింది" అన్నాడు.

వ్లదీమిర్ పతకం దాని కంటే పెద్దదని* వసీలియ్ లుకీచ్ చెప్పేడు.

"యింకా దాని కంటే?"

"అన్నిటికంటే పెద్దది సెయింట్ అంద్రేయ్ పతకం."

"అంద్రేయ్ కంటే పెద్దదో?"

"యేమో మరి తెలీదు."

"యేమిటి? మీకూ తెలీదా?" అని తల చేతిమీద పెట్టుకుని ఆలోచనలో మునిగేడు.

అతనికి ఆలోచనలు యెక్కువ, జటిలమైనవీనీ. ఆ వేళే తండ్రికి వ్లదీమిర్, అంద్రేయ్ పతకాలు రెండూ వచ్చేసి తండ్రి పాఠం చెపుతూ వుంటే యెక్కువ సరసంగా వుంటాడనీ తను పెద్ద వాడయాక అన్ని పతకాలనీ పొందడం గురించీ, అంద్రేయ్ పతకం కంటే యెక్కువ స్థాయి పతకాన్ని పెడితే దాన్ని గురించీ అనుకున్నాడు. అసలు యేదన్నా కొత్త పతకం పెడితే చాలు తను సాధించేస్తాడు. యింకా దానికంటే పెద్ద దాన్ని పెడితే దాన్నీ తనకి యిచ్చేస్తారు.

ఆ రకంగా ఆలోచనలతో కాలం గడిచింది. దాంతో వ్యాకరణం మాస్టారు వచ్చేటప్పటికి క్రియా విశేషణాల సమయ, స్థాన, ప్రకారవాచక పాఠం తయారవలేదు. ఆ మాస్టారికి అసంతృప్తి మాత్రమే కాక బాధ కూడా కలిగింది. మాస్టారి బాధ సెర్యోష మనసుకి కష్టం కలిగించింది. పాఠం చదవనందుకు తప్పు తనదని అతననుకోలేదు. యెంత ప్రయత్నించినా చదవలేకపోయేడు. మాస్టారు చెప్పేటప్పుడు వ్యాకరణం అర్థం అయినట్టే వుండేది. కాని వొక్కడూ వున్నప్పుడు పాఠం యేమీ గుర్తు వచ్చేది కాదు. 'హఠాత్తుగా' అనే చిన్న, స్పష్టమైన మాట ప్రకారవాచక క్రియా విశేషణమో బోధపడలేదు. కాని మళ్లీ మాస్టారు బాధ పడుతున్నాడే అని కష్టం కలిగేది, ఆయనకి అలా అనిపించకుండా చెయ్యాలని అనుకున్నాడు.

మాస్టారు మాట్లాడకుండా పుస్తకం చదువుకుంటూ వున్న సమయం చూసి మొదలు పెట్టేడు.

"మిఖయీల్ ఇవానిచ్‌గారూ, మీ పుట్టిన రోజు యెప్పుడు?" అని అడిగేడు.

"తమరు పాఠం విషయం ఆలోచించడం మెరుగు, బుద్ధి మంతుడైన వాడికి పుట్టిన రోజు గొప్పదేమీ కాదు. అది మిగతా రోజుల్లాంటిదే, పని చెయ్యాలి" అన్నాడు.

సెర్యోష మాస్టారికేసి పట్టి చూశేడు. ఆయన పలచని గడ్డంకేసి, ముక్కు చివర కంటా జారిన కళ్లద్దాలకేసి పట్టి చూశేడు. దాంతో అతను యింకా ఆలోచనల్లో మునిగి పోయేడు. మాస్టారు చెప్పేదేమీ వినలేదు. తను అంటూ వున్న దానిపట్ల ఆయనకే పట్టింపు లేదని అతనికి తెలుసు. ఆయన చెప్పే ధోరణిని బట్టి ఆ విషయం అతను చెప్పగలడు. 'వీళ్లంతా విసుగ్గా వుండే అనవసరమైన విషయాల్ని దంపుళ్ల పాటలా అదే లోకం చెప్తా రెందుకనో? ఆయన నానుంచి దూరం యెందుకు పోతున్నాడు? నేనంటే ఆయనకెందుకు యిష్టం లేదు?' అని సెర్యోష విచారంగా అనుకున్నాడు. దానికి జవాబు దొరకలేదు.

## 27

వ్యాకరణం మాస్టారి పాఠం తర్వాత సెర్యోష తండ్రి దగ్గర కూర్చుని చదవాలి. తండ్రి కోసం యెదురు చూస్తూ సెర్యోష యేదో ఆలోచనలో పడి చిన్న చాకుతో ఆడుకుంటూ బల్ల దగ్గర కూర్చున్నాడు. షికారు వెళ్లినప్పుడు తల్లి కోసం వెతకడం సెర్యోషకి యిష్టమైన పనుల్లో వొకటి. అతనికి మామూలుగా మృత్యువు అన్నా, ముఖ్యంగా తల్లి మృత్యువు అన్నా నమ్మకం లేదు – లిదియా ఇవానొవ్నా అలా అని తనకి చెప్పినా, తండ్రి దాన్ని బల పరిచినా కూడా. అందుకనే ఆమె చనిపోయిందని చెప్పినా కూడా అతను ఆమె కోసం వెతుకు తూనే వున్నాడు. చక్కని పొంకమైన శరీర సౌష్ఠవం, అందమైన నల్లని జుట్టు వున్న యే ఆడావిడ అయినా అతనికి తన తల్లిలాగానే కనిపించేది. అలాంటి మహిళ యెవరు కనిపించినా అతని హృదయంలో యెంతో మార్దవం పొంగేది. దాంతో అతని కంఠం రుద్ధమై పోయేది, కళ్లల్లో నీళ్లు గిరుక్కున తిరిగేవి. ఆమె అప్పుడే తన దగ్గరికి వస్తుందనీ ముఖం మీదనుంచి రవసెల్లా ముసుగు తొలగించుకుంటుందనీ అనిపించేది. అప్పుడు ఆమె ముఖం పూర్తిగా కనిపిస్తుంది, చిరునవ్వు నవ్వుతుంది, తనని చేతుల్తో వాటేసుకుంటుంది. ఆమె సుగంధం తనకి తెలుస్తుంది. ఆమె చేతుల మృదుత్వం తెలుస్తుంది, తను హర్షాతిరేకంతో యేడ్చేస్తాడు. అచ్చం అప్పట్లాగే, వొక సారి సాయంత్రం ఆమె తనని కాళ్లమీద కూర్చోబెట్టుకుని గిలిగింతలు పెట్టి తనని కిలాకిలా నవ్వించి, తను ఆమె ఉంగరాల చేతిని కొరికినప్పటిలాగానే వుంటుంది అనిపించేది. తర్వాత సందర్భవశాత్తూ అతని దాదిద్వారా తల్లి చనిపోలేదని తెలిసింది. అప్పుడు, తండ్రి అలాగే లిదియా ఇవానొవ్నా చెప్పారు తనకి సంబంధించినంత వరకూ ఆమె చనిపోయినట్టేనని. యెందుకంటే ఆమె దుష్టురాలు (ఆ విషయాన్ని అతను యెట్టి పరిస్థితుల్లోనూ వొప్పుకునేందుకు తయారుగా లేదు యేమంటే ఆమెని తను ప్రేమించాడు) అని చెప్పారు. అయినా అతను తల్లి కోసం వెతుకుతూనే వున్నాడు. ఆ వేళ సమ్మర్ గార్డె

న్‌లో వూదారంగు రవిసెల్లా ముసుగు వేసుకున్న వొక ఆమె కనిపిస్తే ఆమె తన అమ్మేనని కొండంత ఆశతో ఆమె తన వేపే వస్తూ వుంటే అదే పనిగా ఆమెకేసే చూస్తూ వుండి పోయేడు. కాని ఆమె తన దగ్గరికి రాకుండా పక్కకి తిరిగి వెళ్ళిపోయింది. ఆ వేళ అతనికి ముందెన్నడూ లేనంతగా ఆమె అంటే ప్రేమ పెల్లుబికింది. అతను ఆ ఆలోచనల్లో మునిగి పోయి పరధ్యానంగా బల్లమీద చాకుతో గీస్తూ తండ్రి రాక కోసం నిరీక్షిస్తూ మిలమిల మెరిసే కళ్లతో శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు.

"నాన్నగారు వస్తున్నారు" అని వసీలియ్ లుకీచ్ చేసిన హెచ్చరికతో యీ లోకంలోకి వచ్చేడు.

సెర్యోష వొక్క ఉదుటున గెంతి తండ్రి దగ్గరికి వెళ్లి అతని చేతిని ముద్దుపెట్టుకుని అలెగ్జాండర్ నేవ్‌స్కీ పతకం వచ్చినందుకు సంతోష చిహ్నాలేమైనా కనిపిస్తాయేమోనని అతని ముఖంలోకి గుచ్చిగుచ్చి చూశేడు.

"బాగా షికారు వెళ్లావా?" అని కరేనిన్ చేతుల కుర్చీలో కూర్చుని పాత నిబంధన పుస్తకాన్ని అందుకుని తెరుస్తూ అడిగేడు. ప్రతి క్రైస్తవుడూ ధర్మశాస్త్ర గ్రంథాలని బాగా తెలుసుకోవాలని అతను సెర్యోషకి పదే పదే చెబుతూ వుండేవాడు. కాని తనే నియమా వళి గురించి తెలుసుకోవడానికి యెక్కువ సార్లు పుస్తకం తీసి చూడాల్సి వచ్చేది. ఆ విషయం సెర్యోష గమనించేడు.

"ఆఁ, చాలా హుషారుగా తిరిగేం, నాన్నా" అని సెర్యోష కుర్చీమీద కాళ్లు అటూ యిటూ వేసి కూర్చుని వూపుతూ — అతనలా చెయ్యకూడదని నిషేధం వుంది — అన్నాడు. "నేను నాద్యాని" (లిదియా ఇవానొవ్నా చేర తీసి పెంచుతున్న ఆమె మేనకోడలు నాద్యా) "చూశేను. మీకు మరో కొత్త పతకం వచ్చిందని ఆమె చెప్పింది. మీకు సంతోషంగా వుందా నాన్నా?" అన్నాడు.

"మొదట, కుర్చీ వూపకు" అన్నాడు కరేనిన్. "రెండవది పతకం కాదు, పని యెక్కువ విలువైంది. నువ్వీ విషయం అర్థం చేసుకోవాలి. నువ్వు బహుమతీ కోసమే పని చేస్తే, చది వితే, నీ శ్రమ భారం అవుతుంది. కాని నువ్వు శ్రమిస్తే" అని కరేనిన్ ఆ వేళ పొద్దుట కర్తవ్య పరాయణత్వంతో నూట పద్దెనిమిది కాగితాలమీద సంతకం చేసిన నీరస కార్యక్రమాన్ని గుర్తు చేసుకుంటూ అన్నాడు. "శ్రమని ప్రేమిస్తూ చేస్తే అప్పుడు నీకు అదే బహుమానం" అన్నాడు.

మృదుత్వంతో, ఉల్లాసంతో మెరిసే సెర్యోష కళ్లల్లో కాంతి వెంటనే మణిగిపోయింది, తండ్రి చూపు ముందు అతని కళ్లు వాలిపోయేయి. తండ్రి సెర్యోషతో మాట్లాడేటప్పుడెప్పుడూ అదే గొంతుకతో మాట్లాడతాడు. అది సెర్యోషకి బాగా తెలుసు, దాంతో అతను కూడా దాన్నే అనుసరించడానికి అలవాటు పడ్డాడు. తండ్రి యెప్పుడూ అతనితో యేదో కాల్పనిక బాలుడితో మాట్లాడినట్టు, యేదో పుస్తకాలల్లో వుండే పిల్లలతో, సెర్యోషలాగా యే

మాత్రం వుండని వాళ్లతో మాట్లాడినట్టు మాట్లాడేవాడు. అంచేత తండ్రి దగ్గర వున్న ప్పుడు పుస్తకాలలోని కాల్పనిక బాలుడిగా వుండ ప్రయత్నించేవాడు.

''నీకిది అర్థం అయిందనుకుంటాను'' అన్నాడు కరేనిన్.

''ఆఁ నాన్నా'' అన్నాడు సెర్యోష కాల్పనిక బాలుడి పాత్రలో.

కొత్త నిబంధననుంచి కొన్ని కీర్తనలని నేర్చుకోవడం, పాత నిబంధన మొదటి అధ్యాయా లనుంచి వల్లెవెయ్యడం ఆ పాఠంలో వున్నాయి. సెర్యోషకి కీర్తనలు బాగా వచ్చు. కాని వప్ప చెప్పేటప్పుడు అతని దృష్టి తండ్రి నుదుటిమీద పడి ధ్యాస మళ్లిపోయింది. తండ్రి నుదుటి యెముక కణతల దగ్గర యెక్కువ వంపు తిరిగి వుంది. ఆ ధ్యాసలో గజిబిజి పడి వో కీర్తన ఆఖరి పాదాలనీ మరోదాని మొదటి పాదాలనీ కలగాపులగం చేశేడు. దాంతో తను చెప్పేది కుర్రవాడికి అర్థం కాలేదన్న భావం కరేనిన్‌కి కలిగి, అతను హుసూరుమన్నాడు.

సెర్యోష యెన్నో సార్లు విని బాగా అర్థం చేసుకోవడంవల్ల వివరణ యెన్నటికీ గుర్తుంచుకోలేని దాన్ని కరేనిన్ ముఖం ముడుచుకుని మళ్లీ వివరించడం మొదలెట్టేడు. సెర్యోషకి సుబోధకమైన 'హఠాత్తుగా' అనే పదం ప్రకార వాచక క్రియా విశేషణం అని గుర్తుంచుకోలేనట్టుగా వుంది. సెర్యోష బెరుకు బెరుగ్గా తండ్రికేసి చూశేడు. అతని బుర్రలో వొక్కటే ఆలోచన వుంది: తండ్రి అప్పుడప్పుడు చేసినట్టుగా, యిప్పుడు ఆయన చెప్పిందాన్ని తన చేత మళ్లీ వల్లె వేయించడు కదా అని. యీ ఆలోచనతో సెర్యోషకి భయం పుట్టేసి యిక యేమీ బుర్రకెక్కలేదు. అదృష్టం బాగుండి తండ్రి వల్లె వెయ్యమనకుండా పాత నిబంధన పాఠం వేపు వచ్చేడు. సెర్యోషకి ఘటనల క్రమం బాగా గుర్తు వుంది. కాని కొన్ని ఘటనలవల్ల యేం తేలుతుందీ అని అడిగితే అతను జవాబు చెప్పలేకపోయేవాడు, అందుగ్గాను వొకసారి దండన పడినా. జల ప్రళయానికి ముందున్న రుషుల ప్రస్తావన వచ్చినప్పుడు అతను జవాబు చెప్పలేక తడబడిపోయి, బల్లమీద చాకుతో గంట్లు గీకుతూ, సణుగుతూ, కుర్చీ వూపుతూ వుండిపోయేడు. అతనికి తెలిసిన వొక్క రుషీ ఈనక్. ఈనక్‌ని బొందితో కైలాసానికి తీసుకువెళ్లారు. అంతకు ముందు కనీసం రుషుల పేర్లయినా గుర్తుండేవి, యిప్పుడు వాటినీ మర్చిపోయేడు. బహుశా ఈనక్ పాత నిబంధనలో తనకి యిష్టమైన పాత్ర కావడంవల్లనో, ఈనక్‌ని బొందితో కైలాసానికి తీసికెళ్లడంవల్లనో ఈనక్ మాత్రం గుర్తు వున్నాడు. యీ ఘటన అతని బుర్రలో ఆలోచనాధారకి ప్రేరకం అయింది. అతనా ధారలో పడిపోయి తండ్రి గడియారం గొలుసుకేసీ తండ్రి వెయిస్ట్ కోటుకి సగం తగిలించిన బొత్తాంకేసీ కళ్లప్పగించి చూస్తూ వుండిపోయేడు.

వాళ్లు యెన్నో సార్లు మృత్యువు గురించి సెర్యోషకి చెపుతూ వున్నా అతనసలు మృత్యువు అనేదాన్ని నమ్మలేదు. తను ప్రేమించిన వాళ్లు చనిపోతారన్న మాట అతను నమ్మలేదు, తనే చనిపోతాడన్న ముక్క అసలు నమ్మలేదు. అది అసంభవమూ, అర్థం కానిదీనీ. కాని ప్రతివాళ్లూ చనిపోతారని అతనికి చెబుతూ వుంటారు. అతను తనకి నమ్మకంగా వుండే

వాళ్లని అడిగేడు. వాళ్లు అవునన్నారు. ముసలి దాది అయిష్టంగానే అయినా, అవునని అంది. కాని ఈనక్ చనిపోలేదు, అంటే అందరూ చనిపోరన్నట్టే కదా. 'అందరూ భగవంతుణ్ణి అలా కొలిచి, ఆయన తమని బొందితో కైలాసం తీసుకు పోయేటట్టు చేసుకోవచ్చు కదా' అనుకున్నాడు సెర్యోష. కాని చెడ్డ మనుషులు, అంటే సెర్యోషకి యిష్టంలేని వాళ్లు, చనిపోవచ్చు. కాని మంచి వాళ్లంతా ఈనక్‌లాగా అవాలి.

''వూఁ, రుషులెవరు?''

''ఈనక్, ఈనక్.''

''ఆ పేర్లు చెప్పేశావ్. సెర్యోష, బాగా లేదు, యేం బాగా లేదు. ప్రతి క్రైస్తవుడూ తెలుసుకోవాల్సిన వాటిని నువ్వు తెలుసుకో ప్రయత్నించకపోతే'' అని నుంచుంటూ అన్నాడు తండ్రి. ''నీకు మరేది ఆసక్తి కలిగిస్తుంది? నాకు నీ వ్యవహారం నచ్చలేదు, ప్యోత్ర్ ఇగ్నాతిచ్‌కీ'' (సెర్యోష ముఖ్య టీచర్) ''నచ్చలేదు. నిన్ను చక్కదిద్దాల్సి వుంది నేను'' అన్నాడు.

తండ్రీ, ముఖ్య టీచరూ యిద్దరూ సెర్యోష పట్ల అసంతృప్తిగా వున్నారు. నిజానికి అతను చదువులో లొక్కుగానే వున్నాడు. కాని అతనికి శక్తి లేదు అనడం మాత్రం తప్పు. తద్వ్యతిరేకంగా టీచర్ తనకి ఉదాహరణగా చూపించే పిల్లల కంటే యెన్నో రెట్లు యెక్కువ శక్తి తనకి వుంది. తండ్రి ఉద్దేశంలో వాళ్లు చెప్పేది తనకి నేర్చుకోవడం యిష్టం లేదని. నిజానికి తను నేర్చుకోలేడు. యెందుకు నేర్చుకోలేడూ అంటే తండ్రి గాని టీచర్ గాని చెప్పేవాటి కంటే యెక్కువ ముఖ్యమైన వాటిని అతని మనసు కోరుతోంది. తన మనసు కోరేదీ, వాళ్ల ఉద్దేశాలూ యెదురు బొదురు అవడంతో అతను టీచర్లతో విరుద్ధ సంఘర్షణ పడుతున్నాడు.

అతని వయస్సు తొమ్మిదేళ్లే. అతను పిల్లవాడే. కాని అతని ఆత్మ అతనికి తెలుసు. దాని విలువ అతనికి తెలుసు. కంటి రెప్పలా దాన్ని కాపాడుకునేవాడు. ప్రేమ తాళంతో తెరిస్తే తప్ప యెవర్నీ లోపలికి రానిచ్చేవాడు కాదు. అతనికి చదువంటే ఆసక్తి లేదని టీచర్లు ఫిర్యాదు చేస్తున్నారు, కాని జ్ఞాన పిపాసతో అతని ఆత్మ తహతహమనేది. అతనికి జ్ఞానం దర్యాన్ కపితోనిచ్‌నుంచి, దాదినుంచి, నాద్యానుంచి, వసీలియ్ లుకీచ్‌నుంచి అందేది, కాని టీచర్లనుంచి కాదు. తండ్రీ, టీచర్లూ తమ వేపు మళ్లించుకుందా మనుకున్న జీవధార నురో దిశకి మళ్లింది, అక్కడ తన జీవాత్మని చూపిస్తోంది.

లిదియా ఇవానొవ్నా మేనకోడలు నాద్యాని చూడ్డానికి సెర్యోష వెళ్లకూడదని తండ్రి శిక్ష వేశాడు. కాని ఆ శిక్ష అతనికి వరం అయింది. వసీలియ్ లుకీచ్ మంచి హుషారుగా వున్నాడు, గాలి మిల్లు తయారు చెయ్యడం యెలాగో అతనికి చూపించేడు. ఆ రోజు సాయంత్రం అంతా ఆ పని చేస్తూనే వున్నాడు. గాలి మిల్లు రెక్క వొకటి పట్టుకుని లేదా దానికి కట్టేసుకుని దాంతోపాటుగా గిరగిర తిరగగలిగేలాంటి దాన్ని యెలా తయారు చెయ్యవచ్చో కల గంటూనే వున్నాడు. ఆ సాయంత్రమంతా సెర్యోషకి తల్లి గుర్తుకు రానే లేదు. కాని

పడక చేరగానే ఆమె హఠాత్తుగా గుర్తు వచ్చింది. ఆమె యెక్కడ దాంకున్నా ఆ మర్నాడు తన పుట్టిన రోజున యివతలికి వచ్చి తనని దర్శించాలని కోరుతూ తన మాటల్లో ప్రార్థన చేశాడు.

"వసీలియ్ లుకీచ్‌గారూ నేను యేమని ప్రార్థించానో వూహించారా? అన్నిటికంటే యెక్కువగా?"

"బాగా చదువుకోవాలనా?"

"వూహుం."

"కొత్త బొమ్మల కోసమా?"

"అబ్బే. మీరెన్నటికీ వూహించలేరు. ఒక అద్భుతమైందాని కోసం. కాని రహస్యం. యిప్పుడు చెప్పను, జరిగాక చెప్తా. వూహించారా?"

"వుహుం. తట్టడం లేదు. తమరే చెప్పండి" అని వసీలియ్ లుకీచ్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. అతను యెప్పుడో గాని అలా నవ్వడు. "సరే, పడుకోండి. కొవ్వొత్తి ఆర్పేస్తాను" అన్నాడు.

"కొవ్వొత్తి లేకుండా కూడా నేను చూసేదీ, ప్రార్థన చేసేదీ నాకు బాగానే కనిపిస్తుంది. చూశారా, నా రహస్యం యించుమించు చెప్పేశాను" అని సెర్యోష కిలకిల నవ్వుతూ అన్నాడు.

కొవ్వొత్తిని తీసుకుపోగానే సెర్యోషకి తల్లి పిలుపు వినిపించినట్టూ, ఆమె దగ్గరికి వచ్చినట్టూ అనిపించింది. ఆమె అతనిమీదకి వాలి ప్రేమ దృక్కుతో నిమురుతోంది. కాని అంతట్లోకీ గాలి మిల్లులు, చాకులు కనిపించి అంతా మసక కమ్మేసింది. అతను నిద్రపోయేడు.

## 28

పీటర్స్‌బుర్గ్‌కి వచ్చేక వ్రాన్‌స్కీ, ఆన్నా వొక గొప్ప హోటెల్‌లో దిగారు. వ్రాన్‌స్కీ కింది అంతస్తులో వొక్కడూ వున్నాడు. ఆన్నా చంటి పిల్లని, దాయిని, పని పిల్లని పెట్టుకుని పై అంతస్తులో నాలుగు గదుల స్వీట్‌లో వుంది.

పీటర్స్‌బుర్గ్ వచ్చిన రోజునే వ్రాన్‌స్కీ అన్నగార్ని చూడ్డానికి వెళ్లేడు. అక్కడ తల్లి కనిపించింది. ఆవిడ యేదో పనిమీద మాస్కోనుంచి వచ్చింది. తల్లీ, వదినగారు మామూలుగానే పలకరించేరు. విదేశ యాత్రల గురించీ, తెలిసిన వాళ్ల గురించీ అడిగేరు కాని, ఆన్నాతో అతని సంబంధాల గురించిన ప్రస్తావన అయినా చేశారు కాదు. ఆ మర్నాడు అన్నగారు హోటెల్‌లో అతన్ని చూడ్డానికి వెళ్లినప్పుడు ఆమెని గురించి అడిగేడు. తనకీ ఆమెకీ భార్యాభర్తల సంబంధమే వుందని తను భావిస్తున్నాననీ, ఆమె విడాకులకి యేర్పాటు చేసి ఆమెని పెళ్లాడతాననీ వ్రాన్‌స్కీ నిర్మొహమాటంగా చెప్పేడు. అప్పటిదాకా అందరు పెళ్లాలకి

మాదిరిగానే ఆమెనీ తను భార్యగా చూస్తున్నట్టు చెప్పాడు. యీ విషయాన్ని తల్లికీ, వదిన గారికీ తెలియ చెయ్యమని అన్నగారికి చెప్పేడు.

"సంఘం వొప్పుకున్నా మానినా నాకు ఖాతరీ లేదు. కాని నా బంధువులు నన్ను తమ బంధువుగా చూస్తే నా భార్యనీ అలాగే చూడాలి" అన్నాడు వ్రాన్‌స్కీ.

అన్నగారికి తమ్ముడి అభిప్రాయాల పట్ల యెప్పుడూ గౌరవం వుంది. కాని సంఘం యిదమిత్థంగా తేల్చి చెప్పని దాకా అతను వొప్పో తప్పో అన్న విషయాన్ని నిర్ణయించలేడు. అతనకిగా అతనికి అందులో తప్పు కనిపించలేదు. అంచేత వ్రాన్‌స్కీతో కలిసి ఆన్నాని చూడ్డానికి వెళ్లేడు.

పై వాళ్లవళ్లేనా వున్నప్పుడు పిలిచే మాదిరిగానే వ్రాన్‌స్కీ అన్నగారి ముందు కూడా ఆన్నాని "మీరు" అనే పిలిచేడు. చాలా సన్నిహిత స్నేహితురాలిగా ఆమెతో మాట్లాడేడు. కాని అన్నగారికి వాళ్ల సంబంధాల గురించి తెలుసని స్పష్టంగా వెల్లడవుతూనే వుంది. ఆన్నా వ్రాన్‌స్కీ జాగీర్‌కి వెళ్లి వుండడం విషయం గురించి వాళ్లు చర్చించేరు.

ఉన్నత సమాజ జీవితంతో యెంతో అనుభవం వున్నప్పటికీ కూడా వ్రాన్‌స్కీ యిప్పుడు తను వున్న కొత్త పరిస్థితి ఫలితంగా యేదో తెలియని దోష భావానికి గురయి బాధపడుతు న్నాడు. తనకీ, ఆన్నాకీ ఉన్నత సమాజ ద్వారాలు మూసుకు పోయాయన్న విషయం అతను తెలుసుకుని వుండాలని యెవళ్లకేనా అనిపిస్తుంది. కాని అలా లోగడ జరిగేదనీ కాని యిప్పుడు, యింత వేగవంతమైన పురోగతి (అతను తనకి తెలియకుండానే అన్ని రకాల పురోగతినీ సమర్థించే వాడయేడు) కారణంగా సమాజం వైఖరి మారిందనీ యీ వైఖరి నిలదొక్కు కుంటుందా లేదా అన్నది యింకా తేలలేదనీ అతని మనసులో యేదో అస్పష్ట భావాలు ఉత్ప న్నం అయేయి. 'రాజదర్బారుతో సంబంధాలున్న గొప్పింటి వాళ్లు ఆన్నాని అనుమతించరు అనేది స్పష్టమే. కాని, బాగా సన్నిహితులు సరిగా అర్థం చేసుకోగలరు, వాళ్లు అలానే అర్థం చేసుకోవాలి' అనుకున్నాడు వ్రాన్‌స్కీ.

తనకి బుద్ధి పుట్టినప్పుడు తన స్థితిని మార్చుకోవచ్చును అని మనిషికి తెలిసినప్పుడు గంటల కొద్దీ కాళ్లు మడం వేసుకు కూర్చోగలడు. కాని అలానే కూర్చుని వుండిపోవాలీ అని అంటే గనక కాళ్లు తిమ్మిరెక్కిపోవడం మొదలవుతుంది, యెటు వేపు చాచాలనుకుం టాడో అటు వేపు తక్కున కుదుపుతాడు, లాగుతాడు. ఉన్నత సమాజం విషయంలో వ్రాన్ స్కీకి యిదే అనుభవం అయింది. సమాజ ద్వారాలు తమకి మూసుకుపోయి వుంటాయీ అని అంతరంగం లోతుల్లో యెరుకలో వున్నా సమాజం మారుతుందో లేదోననీ తమని ఆదరిస్తుందో లేదోననీ చూద్దామని ప్రయత్నించేడు. సమాజం తనని స్వీకరిస్తుంది గాని ఆమెని స్వీకరించదని త్వరలోనే అతనికి తేట పడింది. మార్జాల మూషిక క్రీడలాగా, తన కోసం సాదరంగా పైకి లేచిన చెయ్యి ఆన్నా రాగానే కందికి వాలిపోయేది.

పీటర్స్‌బుర్గ్ సమాజంలో అతనికి తటస్థపడిన మొదటి మహిళల్లో వరసకి తన అక్క అయిన ప్రిన్సెస్ బెట్సీ వుంది.

''యెంత కాలానికి దర్శనమైంది!'' అని ఆమె ముఖం చేటంత చేసుకుని ఆదరంగా పలకరించింది. ''ఆన్నా యేది? యెంత పండగలాగా వుంది నాకు! యెక్కడుంటున్నారు? మీ పెద్ద యాత్రల తర్వాత పీటర్స్‌బుర్గ్ దెయ్యాల కొంపలాగా వుంటుందేమో మీకు! రోమ్ నగరంలో మీ శోభన విహారం బ్రహ్మాండంగా వుండి వుంటుందిలే. వూఁ, విడాకుల విషయం యేమైంది? అంతా అయినట్టేనా?'' అని అడిగింది.

విడాకులు యింకా తరవాయి వున్నాయని వినగానే బెట్సీ ఉత్సాహం సన్నగిల్లడం వ్రాన్‌స్కీ గమనించేడు.

''నామీద రాళ్లు పడతాయి, నాకు తెలుసు'' అందామె. ''అయినా ఆన్నాని పలకరిస్తాను, తప్పకుండా. యెక్కువ రోజులు వుంటారా?'' అని అడిగింది.

నిజంగానే ఆమె ఆ వేళ ఆన్నాని చూసింది. కాని పలకరింపు తీరు ముందటిలాగా లేదు. తన ధైర్యం చూసుకుని గర్వపడినట్టు కనిపించింది. తన స్నేహ శీలత యెంత గట్టిదో ఆన్నా మెచ్చుకోవాలని ఆశించింది. ఆమె ఉన్నత సమాజం కబుర్లు చేరవేస్తూ పది నిముషాల కంటే యెక్కువ వుండలేదు.

''నువ్వు విడాకుల గురించి యేమీ చెప్పావే కాదు. సరే, నాకంటే యేం ఫర్వాలేదనుకో కాని మన ఉన్నత సమాజం వాళ్లు మీరు పెళ్లి చేసుకుంటేనే గాని సరిగ్గా నీ మొఖంకేసి చూడరు. యీ రోజుల్లో విడాకులు మామూలు విషయమేనాయిరి. Ça se fait.[1] అయితే శుక్రవారం వెళ్లిపోతున్నావా? అయ్యో! మళ్లీ వొకళ్లనొకళ్లు చూడ్డం కుదరదే పాపం!'' అని వెళ్లిపోతూ వెళ్లిపోతూ అంది.

ఉన్నత సమాజంనుంచి తను యేం ఆశించవచ్చో బెట్సీ తీరు చూసి వ్రాన్‌స్కీ అర్థం చేసుకుని వుండాల్సింది. కాని తన కుటుంబంలోనే మరో ప్రయత్నం చేశాడు. తల్లి ఆదరిస్తుందన్న ఆశ అతనికే మాత్రమూ లేదు. ఆన్నాని మొదట్లో కలుసుకున్నప్పుడు ఆమె అంటే యెంతో మురిసిపోయిన తల్లి తన కొడుకు జీవితాన్ని నాశనం చేసిందని చెప్పి యిప్పుడు ఆమెమీద కారాలూ మిరియాలూ నూరుతోంది. కాని వ్రాన్‌స్కీ వదినగారు వార్యామీద ఆశలు పెట్టుకున్నాడు. ఆమె రాళ్లు రువ్వదనీ, సరళంగా దృఢంగా ఆన్నాని పలకరిస్తుందనీ, తన యింటికి పిలుస్తుందనీ వ్రాన్‌స్కీ అనుకున్నాడు.

పీటర్స్‌బుర్గ్‌కి వచ్చిన రెండో రోజున వ్రాన్‌స్కీ వార్యాని చూడ్డానికి వెళ్లేడు. ఆమె వొక్కత్తే వుంది. అది చూసి తన మనసులో వున్న దాన్ని నిర్మొహమాటంగా చెప్పేశాడు.

---

[1] సాదా విషయం (ఫ్రెంచి).

''నీకు తెలుసు కదా'' అని ఆమె అతను చెప్పింది విన్నాక అంది. ''నువ్వంటే నాకు యెంత యిష్టమో, నీ కోసం యేది చెయ్యాలన్నా యెంత వెనకాడనో. కాని నేను నోరు మూసుకు కూచున్నా. యెందుకంటావ్? నీ కోసం, అన్నాగారి కోసం నేను యేమీ చెయ్య లేను.'' ఆమె 'అన్నాగారు' అని ప్రత్యేకం వొత్తి పలికింది. ''నన్ను తప్పు పడుతున్నానను కోకు. యెన్నటికీ అలా చెయ్యను. ఆమె స్థానంలో నేను వున్నా అలాగే చేసి వుందును. యీ విషయం లోతుల్లోకి వెళ్లను, వెళ్లలేను'' అని ఆమె బెదురుతూ బెదురుతూ చింతాకులిత మైన అతని ముఖంలోకి చూస్తూ అంది. ''కాని ఉన్నదున్నట్టు అనుకోవాలి కదా. నన్ను వచ్చి ఆమెని చూసి, మా యింటికి పిలవమని అంటావు. రెండు చేతులా కాగలిగించు కొమ్మంటావు. మళ్లీ సమాజం దృష్టిలో పైకి తీసుకు రమ్మంటావ్. కాని కొంచెం నా విషయం చూడు, నేనలా చెయ్యలేను. నాకా ఆడపిల్లలు యెదుగుతున్నారు, కట్టుకున్న మొగుడి కోసం అయినా సంఘంలో నా మొహం చూపించాలి కదా. సరే మాటకి నేను వెళ్లి అన్నాగారిని చూశానే అనుకో. నేను ఆమెని పిలవలేననీ, యింటికి తీసుకురాలేననీ ఆమె అర్థం చేసుకుం టుంది. పోనీ వొక వేళ అలా చేసినా, వేరే రకంగా అనుకునేవాళ్ల కంటబడకుండా చెయ్యాలి నేను. దానివల్ల ఆమెకి కష్టం కలుగుతుంది. నేనామెని పైకి తీసుకు రావడానికి అశక్తు రాల్ని...''

''మీ యింట్లో నువ్వు ఆదరించే వందలాది ఆడవాళ్లకంటే కనా కష్టంగా కిందికి పడిపోయిందా ఆవిడ? అలా అని అనుకోను'' అని వ్రాన్‌స్కీ మరింత వ్యాకులంగా ఆమె మాటకి అడ్డం వెళ్లేడు. తర్వాత యేమీ అనకుండా, వదినగారి తీర్పు తిరుగులేనిదని గ్రహించి, లేచాడు.

''యిదిగో! నామీద కోపగించుకోకు. యిందులో నా తప్పేమీ లేదని అర్థం చేసుకో ప్రయ త్నించు'' అని మళ్లీ బెరుగ్గా చిరునవ్వు నవ్వుతూ అంది వార్యా.

''నీమీద నాకు కోపం యేమీ లేదు'' అని అతను అదే వ్యాకుల పాటు మనసుతో అన్నాడు. ''నాకు రెట్టింపు విచారంగా వుంది. మన స్నేహం చెడిపోతుందని నాకు విచారంగా వుంది. చెడిపోక పోయినా తగ్గిపోవడం ఖాయం. కాని నాకు సంబంధించి వేరే దారి లేదని నువ్వు అర్థం చేసుకో.''

ఆ ముక్క అని అతను అక్కడినుంచి వెళ్లిపోయేడు.

యిక పైన ప్రయత్నాలు చెయ్యడం వృధా అని వ్రాన్‌స్కీకి అనిపించింది. పీటర్స్ బుర్గ్‌లో వుండే ఆ కాసిని రోజులూ యేదో పరాయి వూళ్లో వున్నట్టు వుండాలంతే. ఉన్నత సమా జంలోని పూర్వ పరిచితులతో కలిసి మెలిసి తిరక్కూడదు. తనకి కర్కశంగా తగిలిన అవ మాన కాఠిన్యాల గాయాలు లేకుండా చూసుకోవాలి. పీటర్స్‌బుర్గ్‌లో కరేనిన్, అతని పేరూ యెక్కడ పడితే అక్కడ తగలడం అతనికి మహా కష్టకరంగా వుంది. తను మెదిలితే చాలు కరేనిన్ పేరు వినిపిస్తుంది. కదిల్తే చాలు కరేనిన్ తగులుతాడు. కనీసం వ్రాన్‌స్కీకి అలా

అనిపించింది. యేదేనా వేలుకి దెబ్బ తగిలిన వాడికి ప్రతి చోటా అదే వేలుకి దెబ్బ తగులుతున్నట్టు అనిపించిన విధంగా వుంది వ్రాన్స్కీకి.

పీటర్స్‌బుర్గ్‌కి రావడం మరొకందుకు కూడా వ్రాన్స్కీకి యెక్కువ భారంగా కనిపించింది. యిక్కడికి వచ్చిందగ్గర్నుంచీ అన్నా బోధపడని యేదో కొత్త మనఃస్థితిలో వున్నట్టు కనిపించింది. వొకో సారి అతన్ని ప్రేమతో ముంచెత్తేసేది. మరో సారి ఉదాసీనంగా చిరాగ్గా అభేద్యంగా కనిపించేది. ఆమెని యేదో కలవర పెడుతోంది, దాన్ని ఆమె అతన్నుంచి దాచి పెట్టింది. అతనికి కలిగిన అవమానాల గురించి యేమీ పట్టించుకునేది కాదు, అవి వ్రాన్స్కీ జీవితాన్ని విషపూరితం చేస్తున్నాయి. మరి ఆమె లాంటి సున్నిత హృదయురాలికి మరీ వేదనా భరితంగా వుండి వుండాలి అవి.

## 29

రష్యాకి తిరిగి రావాలన్న అన్నా ఉద్దేశాల్లో వొకటి కొడుకుని చూడటం. ఇటలీ వదిలిన క్షణంనుంచి కొడుకుని చూస్తానసే వూహలతోనే పులకించిపోయింది. పీటర్స్‌బుర్గ్ దగ్గర పడే కొద్దీ కొడుకుని కలుసుకునే సంతోషం గురించి, ప్రాముఖ్యం గురించి ఆమె యెక్కువ కలగంటూనే వుంది. అతన్ని కలుసుకునే యేర్పాటు యెలా చేసుకోవాలీ అన్న ప్రశ్నే ఆమెకి తలెత్తలేదు. వొకే వూళ్లో వుండటంవల్ల కొడుకుని కలుసుకోవడం ఆమెకి సహజంగా వొక సాదా విషయంగా కనిపించింది. కాని పీటర్స్‌బుర్గ్ చేరాక సంఘంలో తన కొత్త స్థానం ఆమెకి స్పష్టంగా విశదం అయింది. కొడుకుని కలుసుకోవడం తేలిక కాదు అని ఆమె గ్రహించింది.

ఆమె పీటర్స్‌బుర్గ్ వచ్చి రెండ్రోజులు గడిచేయి. కొడుకు గురించి వొక్క క్షణం కూడా మర్చిపోలేదు. అయినా అతన్ని చూడడం పడలేదు. యెకాయెకీ యింటికి వెళ్లే హక్కు తనకి లేదని ఆమెకి అనిపించింది. అక్కడ కరేనిన్ తగలచ్చు. అసలు తనని లోపలికి రానివ్వక పోవచ్చు కూడా, తనకి అవమానం కలగవచ్చు కూడా. భర్తకి ఉత్తరం రాయడం, అతనితో యే విధమైన సంబంధమేనా పెట్టుకోవడం అనే ఆలోచనే ఆమెకి మహా యాతనా కారకంగా వుంది. భర్త గురించిన ఆలోచన లేకపోతేనే ఆమె ప్రశాంతంగా వుండగలిగింది. కొడుకు యెక్కడ యెప్పుడు షికారు వెడతాడూ అని వాకబు చేసి అక్కడికి వెళ్లి అతన్ని కలుసుకోవచ్చు. కాని అది ఆమెకి తృప్తి లేదు. కొడుకుని చూడాలి చూడాలి అని యెంతో కాలం తపనపడిపోయింది, యెన్నో విషయాలు చెప్పాలనుకుంది, తనివితీరా కొడుకుని కాగలించుకుని ముద్దులతో ముంచెత్తెయ్యాలని తపించింది. అందుకు సెర్యోష వృద్ధ దాది ఆమెకి సాయపడి వుండేది. కాని ఆ దాది యిప్పుడు కరేనిన్ యింట్లో వుండడం లేదు. యీ రకంగా యెటూ తేలకుండా సందిగ్ధంగానూ, దాది కోసం వెతకడంలోనూ రెండు రోజులు గడిచిపోయేయి.

కరేనిన్‌తో లిదియా ఇవానొవ్నా సన్నిహితంగా వుందని విని, మూడవ రోజున ఆమెకి

ఉత్తరం రాద్దామని నిర్ణయించుకుంది. అందుగ్గాను ఆమె మనసులో చాలా యాతన పడింది. కొడుకుని చూసేటందుకు అనుమతీ భర్త ఉదారత్వంమీద ఆధార పడి వుందని ఉద్దేశ పూర్వకంగా రాసింది. ఆ ఉత్తరాన్ని లిదియా ఇవానొవ్నా కరేనిన్‌కి చూపిస్తే గనక అతను ఉదారంగా కనిపించేటందుకు గాను తిరస్కరించడని ఆమెకి తెలుసు.

ఆ ఉత్తరం పట్టికెళ్లిన మనిషి పరమ క్రూరమైన జవాబు పట్టుకుని తిరిగివచ్చేడు. అసలు వూహించని జవాబు అది. తన ఉత్తరానికి జవాబు లేదు అని! అతన్ని పిలిపించి వివరంగా అన్నీ వింది, చాలా సేపు యెదురు చూసి "జవాబు లేదు" అనే కబురు యెలా వచ్చిందీ అతను చెప్పాక ఆమె అంతకు ముందెన్నడూ లేనంత అవమానంతో దహించుకుపోయింది. అన్నా అవమానితురాలిగా, తిరస్కృతురాలిగా బాధ పడింది కాని లిదియా ఇవానొవ్నా తరపు నుంచి ఆలోచిస్తే ఆమె సబబేనని అర్థం చేసుకుంది. ఆమె తన బాధని యెవళ్లతోనూ చెప్పుకోలేకపోవడంతో అది మరీ తీవ్రం అయింది. ఆమె వ్రాన్‌స్కీకి చెప్పలేకపోయింది, చెప్పదలచుకోలేదు. అతనే తన దౌర్భాగ్యానికి కారణం అయినా తన కొడుకుని చూడ్డం అనేది అతనికి అంత ముఖ్యమైందిగా కనిపించకపోవచ్చు అని ఆమెకి తెలుసు. తన బాధ యెంత తీవ్రమైందో అతను పూర్తిగా అర్థం చేసుకోలేడు అని ఆమెకి తెలుసు. చెప్పిం తర్వాత అతను ఉదాసీనంగా దాన్ని గురించి మాట్లాడితే, అది తనకి అతని పట్ల ద్వేషాన్ని కలిగిస్తుందని ఆమెకి తెలుసు. ఆమె అన్నిటికంటే భయపడింది యిలాంటి స్థితి తలెత్తుతుందనే. అంచేత తన కొడుకుకి సంబంధించిన ప్రతి విషయాన్నీ అతన్నుంచి దాచి పెట్టింది.

రోజంతా ఆమె హోటెల్ గదినుంచి కదల్లేదు. కొడుకుని యెలా కలుసుకోవాలా అని ఆలోచిస్తూనే వుంది. ఆఖరికి భర్తకి ఉత్తరం రాద్దామనుకుంది. ఆమె ఉత్తరం రాస్తూ వుండగా లిదియా ఇవానొవ్నా ఉత్తరం వచ్చింది. కౌంటెస్ లిదియా ఇవానొవ్నా మౌనం ఆమెని పడగొట్టేసి పరాభూతం చేసేసింది. కాని ఆమె ఉత్తరంలో దాగి వున్న భావం చూసి అన్నా కుతకుతలాడి పోయింది. కొడుకు అంటే తనకి వున్న తీవ్ర అనురాగంతో, న్యాయ సమ్మత ప్రేమతో పోల్చి చూస్తే కౌంటెస్ విషపుటాలోచన యెంత దురన్యాయంగా కనిపించిందంటే అన్నా తనని దోషిగా భావించుకోవడం మానేసింది, ఆమెకి యితరులమీద కోపం వచ్చింది.

'యెంత వెన్నపూసిన కత్తులు!' అనుకుంది. 'వాళ్లకి కావాల్సిందల్లా నన్ను అవమానించి నా బిడ్డడిని యాతన పెట్టడమే. నేను దీన్ని చూస్తూ నోరు మూసుకు కూచోనా? నా కంఠంలో ప్రాణం వుండగా అలా చెయ్యను! నాకంటే పాడుది తను! నేను కనీసం మోసం చెయ్యడం లేదు' అనుకుంది. ఆ క్షణంలోనే ఆమె నిర్ణయించుకుంది, మర్నాడు, సెర్యోష పుట్టిన రోజున, తిన్నగా భర్త యింటికి వెళ్లి నౌకర్లకి నజారానా యిచ్చి, అవసరం పడితే లోకరా యిచ్చి, యెలాగైనా కానీ కొడుకుని చూస్తుంది, వాడికి వాళ్లు చెప్పే అబద్ధాల్ని తూటుపొడి చేస్తుంది.

ఆమె ఆట వస్తువుల దుకాణానికి వెళ్లి కొన్ని బొమ్మలు కొని తను చెయ్యవలసిన పని గురించి ఆలోచించింది. పొద్దున్న ఎనిమిది గంటలకి వెడుతుంది, అప్పటికి కరేనిన్ లేవడు. దర్వాన్‌కీ నౌకరుకీ తనని లోపలికి వెళ్లనిచ్చేందుకు గాను చేపట్టున కొంత డబ్బు వుంచు కుంటుంది. ముఖంమీద వేసుకున్న రవసెల్లా ముసుగు తియ్యకుండానే సెర్యోషకి పుట్టిన రోజు కానుకలందచెయ్యడానికి వాడి జ్ఞానపిత పంపించినట్టు, కానుకల్ని వాడి మంచం పక్క పెట్టి రమ్మన్నట్టు చెప్తుంది. యికపోతే, కొడుక్కి యేం చెప్పాలీ అన్న దాన్ని గురించే ఆన్నా యేమీ ఆలోచించలేదు. యెన్ని సార్లు అనుకున్నా యేమీ ఆలోచించలేకపోయింది.

ఆ మర్నాడు ఎనిమిది గంటలకి ఆన్నా వొక్కత్తే అద్దె బండి దిగి తను అంతకుముందు కాపరం చేసిన యింటి సింహద్వారం దగ్గర గంట మోగించింది.

"వెళ్లి యేం కావాలో కనుక్కో. యెవరో ఆడావిడలా వున్నారు" అని కపితోనిచ్ అన్నాడు. అతను భుజాలమీద వోవరు కోటు వేసుకుని, కాళ్లకి బూటు తొడుగులు తొడుక్కున్నాడు. కిటికీలోనుంచి రవసెల్లా ముసుగు ముఖంమీద వేసుకుని గుమ్మం దగ్గర నుంచున్న ఆడ మనిషికేసి చూశేడు.

దర్వాన్ పడుచు సహాయకుడు తలుపు తెరవగానే ఆన్నా లోపలికి అడుగు పెట్టింది. ఆన్నా ఆ పడుచతన్ని యెరగదు. చేతి మఫ్‌లోనుంచి మూడు రూబుళ్ల నోటు వొకటి తీసి అతని చేతిలో పెట్టింది.

"సెర్యోష... చిన్న బాబుగారు..." అని గొణిగింది. అతన్ని దాటుకుని లోపలికి వెళ్లిపోయి వుండేదే. మూడు రూబుళ్ల నోటుని పట్టి చూసిన ఆ నౌకరు ఆమెని రెండవ అద్దాల తలుపు దగ్గర ఆపు చేశాడు.

"యెవరు కావాలి మీకు?" అని అడిగేడు.

ఆమె అతని మాటలు వినలేదు, యే జవాబూ చెప్పలేదు.

ఆ అపరిచితురాలి కంగారు చూసి కపితోనిచ్ గుమ్మం దగ్గరికి వచ్చి యేం కావాలని అడిగేడు.

"ప్రిన్స్ స్కొరొదూమొవ్ నన్ను చిన్న బాబుగారి కోసం పంపేరు" అంది ఆన్నా.

"చిన్న బాబుగారు యింకా లేవలేదు" అని కపితోనిచ్ ఆమెకేసి గుచ్చిగుచ్చి చూశేడు.

తను తొమ్మిదేళ్లు కాపరం చేసిన ఆ యింటి సింహద్వారం, తను వెళ్లిపోయినప్పుడు యెలా వున్నాయో అన్నీ అలానే మారకుండా వున్న ఆ వాతావరణం యింత గాఢంగా తనని కదిలించి వేస్తాయని ఆన్నా వూహించలేదు. సంతోషభరితంగానూ, విచారపూరితంగానూ కూడా వుండే స్మృతులు వొక దాని తర్వాత వొకటిగా ఆమె మనసులో తోసుకుంటూ వచ్చి తను అక్కడికి యెందుకు వచ్చిందో మరిచిపోయేటంత వివశురాల్ని చేశాయి.

"కొంచెం సేపు ఆగుతారా?" అని ఆమె భుజాలమీదనుంచి వోవరు కోటు తీస్తూ అన్నాడు కపితోనిచ్.

కోటు తీస్తూ వుండగా అతను ఆమె ముఖంకేసి పట్టి చూశేడు. అతను ఆమెని గుర్తు పట్టి మాట్లాడకుండా తలవంచి వందనం చేశాడు.

''రండమ్మా'' అన్నాడు.

ఆమె అతనితో మాట్లాడదామనుకుంది. కాని వొక్క మాట కూడా గొంతు పెగల్లేదు. అతనికేసి తప్పు చేసిన దానిలాగా అర్థిస్తున్నట్టుగా వొక చూపు చూసి గబగబా తేలిగ్గా అడుగులు వేస్తూ మెట్లకేసి నడిచింది. కపితోనిచ్ ముందుకు వాలిపోతూ మెట్లకి బూటు తొడుగులు తగులుతూ వుండగా ఆమెని అందుకుందామని వెనక్కాలే పరిగెత్తేడు.

''టీచర్ అక్కడ వున్నారు, ఆయన బట్టలు వేసుకున్నారో లేదో. నేనిప్పుడే ఆయనకి చెప్తా'' అన్నాడు.

అతనేం చెప్తున్నాడో బోధ పడకుండానే అన్నా అలవాటు పడిన ఆ మెట్లు యెక్కుతూనే వుంది.

''యిటు, యెడం వేపండీ అమ్మా. యింకా వాకిలి తుడవ లేదండమ్మా. చిన్న బాబు గారు యిదివరకటి సోఫా గదిలో వుండారమ్మ'' అన్నాడు దర్వాన్ ఆయాసపడుతూ. ''వో క్షణం ఆగిండమ్మా. వో సారి లోపల చూస్తా'' అన్నాడు. ఆమెని దాటుకుంటూ వెళ్లి, యెత్తైన తలుపు తెరిచి లోపలికి వెళ్లి మూశేడు. అన్నా అక్కడే వుండిపోయింది యెదురు చూస్తూ. ''చిన్న బాబు యిప్పుడే లేచారు'' అన్నాడతను మళ్లీ వచ్చి.

అతనా ముక్క అంటూ వుండగానే అన్నాకి చిన్న పిల్లాడు ఆవలించడం వినిపించింది. ఆ చప్పుడుని బట్టి ఆమె కొడుకుని గుర్తు పట్టింది. అతను తన కళ్ల ముందు ప్రత్యక్షమైనట్టే అనిపించింది ఆమెకి.

''లోపలికి వెళ్లనీ, లోపలికి వెళ్లనీ'' అంటూ ఆమె యెత్తైన తలుపుల్లోనుంచి లోపలికి దూరింది. తలుపు పక్క కుడి వేపున వో మంచం వుంది. దానిమీద వొక పిల్లవాడు కూర్చున్నాడు. అతను చొక్కా మాత్రం తొడుక్కున్నాడు. దాని బొత్తాం విడిపోయింది. అతను ఆవలిస్తూ వొళ్లు విరుచుకుంటూ చాచుకుంటూ వున్నాడు. పెదాలు మూసుకుని సంతోషపూరిత నిద్రమగత మందహాసం రూపంలో వున్నట్టు కనిపించేయి. మళ్లీ అతను తలగడమీదకి మెల్లిగా హాయిగా జారేడు.

''సెర్యోష!'' అని ఆమె చప్పుడు చెయ్యకుండా అతని దగ్గరికి వెళ్లి మెల్లిగా అంది.

అతని యెడబాటు కాలం అంతా, అతని పట్ల ఆమెకి గత కొద్ది రోజులూ వెల్లువగా కలిగిన తీవ్ర అనురాగం సమయంలోనూ ఆమె కల్పనలో అతను ప్రాణాధికంగా తను ప్రేమించిన నాలుగేళ్ల పిల్లవాడే. యిప్పుడు అతను తను వదిలిపెట్టి వెళ్లిన నాటి పిల్లవాడిలా లేనే లేడు. నాలుగేళ్ల పిల్లాడితో పోల్చి చూస్తే అతను యింకా పెద్ద వాడయాడు, సన్నబడ్డాడు. అరె, యేమిటి? వీడి ముఖం యెంత సల్పగా వుండేది, జుట్టు యెంత చిన్నగా వుండేది! చేతులు యెంత పొడుగ్గా వుండేవి! తను లోగడ చూసిందానికంటే యెంత మారేడు!

కాని వాడే వీడు, ఆ తల, పెదాలు, మెత్తని మెడ, వెడల్పాటి భుజాలు వీడివే!

"సెర్యోష!" అని అతని దగ్గరగా వెళ్లి మళ్లీ పిలిచింది.

అతను మోచేతిమీద ఆనుకుని కొంచెం పైకి లేచేడు. రేగిపోయిన మెత్తని కుచ్చు జుట్టు వున్న తలని అటూ యిటూ దేన్నో వెతుకుతున్నట్టు తిప్పి కళ్లు తెరిచేడు. కొన్ని క్షణాలు యేం మాట్లాడకుండా పక్కనే నిశ్చలంగా నుంచున్న తల్లికేసి నిదానంగా, యేమిటన్నట్టుగా చూశేడు. సంతోషంగా చిరునవ్వు నవ్వుతూ మళ్లీ కళ్లు మూసుకున్నాడు, మళ్లీ వాలేడు — యీ సారి తలగడమీదకి కాక ఆమె చేతుల్లోకి.

"సెర్యోష! నా బాబూ!" అని ఆమె రుద్ధ కంఠంతో, బొద్దుగా వున్న కొడుకు శరీరాన్ని చేతులతో పెన వేసుకుంటూ అంది.

"అమ్మా!" అని అతను తన మొత్తం శరీరాన్ని ఆమె చేతులు తాకేటట్టు లుంగలు తిరిగిపోతూ అన్నాడు.

నిద్రమగతగా కళ్లు మూసుకునే చిరునవ్వు నవ్వేడు. తన చిన్న చేతుల్ని ఆమె భుజాలమీద వేశాడు, ఆమెకి హత్తుకు పోయేడు. నిద్రపోయేటప్పుడు పిల్లలనుంచి మాత్రమే వచ్చే కమ్మని తావి, వెచ్చదనం ఆమెని ముంచెత్తాయి. అతను తన చెక్కిలిని ఆమె ముఖానికీ, మెడకీ రాశేడు.

"నాకు తెలుసు" అని కళ్లు తెరిచి అన్నాడు. "యివాళ నా పుట్టిన రోజు. నువ్వు వస్తావని నాకు తెలుసు. యిప్పుడే వో క్షణంలో లేస్తా" అన్నాడు.

అలా అంటూనే మళ్లీ నిద్రలోకి జారిపోయేడు.

పిల్లవాడు తను లేని సమయంలో యెలా యెదిగాడో మారేడో అన్నా గమనిస్తూ ఆశగా అతనికేసి చూసింది. దుప్పటి కిందనుంచి బయటికి వచ్చిన దిస కాళ్లని — యిప్పుడవి పొడుగ్గా వున్నాయి — పల్చబడిన చెక్కిళ్లని, తల వెనక క్రాపు చేసిన ఉంగరాల జుట్టుని — తను యెన్నో సార్లు అక్కడ ముద్దుపెట్టుకుంది — ఆమె గుర్తు పట్టింది, గుర్తు పట్టనూ లేదు. ఆమె ఆ అన్ని తావులనీ నిమిరింది. యేమీ మాట్లాడలేకపోయింది. కన్నీళ్లతో ఆమె కంఠం రుద్ధమైపోతోంది.

"యెందుకమ్మా యేడుస్తున్నావ్?" అని అతను నిద్రమగత వదిలి లేచి అన్నాడు. "అమ్మా, యెందుకు యేడుస్తున్నావ్?" అని యేడుపు వచ్చే గొంతుకతో అన్నాడు.

"నేనా? లేదు, యేడవను... సంతోషంతో నాకు యేడుపు వస్తోంది. యెన్ని రోజులైందిరా నాయనా నిన్ను చూసి. వుహుఁ, యిక యేడవనులే" అని ఆమె కన్నీళ్లని ఆపుకుంటూ తల పక్కకి తిప్పేసుకుని అంది. "లే మరి, బట్టలు వేసుకునే వేళయింది నీకు" అని కొంచెం సేపాగి అంది. ఆ వ్యవధిలో తనని తను సంబాళించుకుంది. అతని చేతిని తన చేతిలో పట్టుకునే ఆమె మంచం పక్క కుర్చీమీద కూర్చుంది. ఆ కుర్చీమీద అతని బట్టలు వున్నాయి.

"నేను లేకపోతే బట్టలు యెలా తొడుక్కుంటావు? యెలా..." ఆమె మామూలుగా

సంతోషంగా మాట్లాడబోయింది కాని మాట్లాడలేకపోయింది. మళ్లీ తల పక్కకి మళ్లించుకుంది.

"అమ్మా నేనిప్పుడు చన్నీళ్లతో స్నానం చెయ్యడం లేదు. నాన్న వద్దన్నారు. వసీలియ్ లుకీచ్‌ని చూశేవా? ఆయన యిప్పుడు వస్తారు. అయ్యొయ్యో! నువ్వు నా బట్టలమీద కూర్చున్నావు" అన్నాడు.

సెర్యోష ఫక్కున నవ్వేడు. ఆమె అతనికేసి చూసి చిరునవ్వు నవ్వింది.

"అమ్మా! నా యిష్టమైన మంచి అమ్మ! మా అమ్మా!" అని మళ్లీ ఆమెమీదకి వాలిపోతూ, ఆమెని వాటేసుకుంటూ అన్నాడు. యిప్పుడు మాత్రమే ఆమె చిరునవ్వుని చూసి మాత్రమే జరిగిందేమిటో గ్రహించినట్టు వున్నాడు. "యిదెందుకమ్మా!" అంటూ ఆమె టోపీని తీసేస్తూ అన్నాడు. టోపీ లేకుండా ఆమెని కొత్త తీరులో చూస్తున్నట్టుగా అతను ఆమెని మళ్లీ ముద్దుపెట్టుకున్నాడు.

"నా గురించి యేమనుకున్నావురా? నేను చనిపోయేననుకున్నావా?"

"నేనెన్నడూ ఆ మాట నమ్మలేదు."

"లేదూ? మా నాన్నా! మా బాబూ."

"నాకు తెలుసు, నాకు తెలుసు" అని తనకి యిష్టమైన ఆ మాటల్ని రెట్టిస్తూ అన్నాడు. తన తలని నిమిరే ఆమె చేతిని పట్టుకున్నాడు. ఆమె అరచేతిని తన పెదాల దగ్గరికి తీసుకుని మళ్లీ మళ్లీ ముద్దుపెట్టుకున్నాడు.

## 30

యీ లోపున వసీలియ్ లుకీచ్ గంగ వెర్రులెత్తి పోతున్నాడు. ఆమె యెవరైందీ అతనికి మొదట తెలీలేదు. కాని వాళ్ల మాటలని బట్టి భర్తని వదిలిపెట్టి వెళ్లిపోయిన తల్లి ఆవిడే నని గుర్తుపట్టేడు. అతను ఆవిడని యెరగడు, అతను రాకముందే ఆమె వెళ్లిపోయింది. తను ఆ గదిలోకి వెళ్లాలా వద్దా, కరేనిన్‌కి చెప్పాలా వద్దా అనే ధర్మ సందేహంలో పడ్డాడు. పిల్లవాణ్ణి అనుకున్న వేళకి లేపడం తన కర్తవ్యం అని, అక్కడ వున్నది పిల్లవాడి తల్లా మరొకళ్లా అన్న విషయంతో తనకి ప్రమేయం లేదనీ కడకి తేల్చుకుని బట్టలు వేసుకున్నాక గది గుమ్మం దగ్గరికి వెళ్లి తలుపు తెరిచేడు.

తల్లీ కొడుకుల మమతానురాగపూరిత కౌగిలింతలు, వాళ్ల కంఠధ్వనులు, వాళ్లు అనుకున్న మాటలు అతని మనసుని మార్చేయి. అతను సర్లే అని తల ఆడించి, నిట్టూర్చి తలుపు మూసేశాడు. "వో పది నిముషాలు చూద్దాం" అని రుద్ధ కంఠాన్ని సవరించుకుంటూ, చెమ్మగిల్లిన కళ్లని తుడుచుకుంటూ అనుకున్నాడు.

అదే సమయంలో యింట్లోని నౌకర్లు మహా తలకిందులై పోతున్నారు. యింటావిడ

వచ్చిందనీ, కపితోనిచ్ ఆవిడ్ని లోపలికి రానిచ్చాడనీ, ఆమె సెర్యోష గదిలో వుందనీ, యింటా యన రోజూ ఎనిమిదీ తొమ్మిదీ మధ్య కొడుకుని చూడ్డానికి వెడతాడనీ వాళ్లకి తెలుసు. ఆయనకీ, ఆవిడికీ భేటీ జరక్కుండా చూడాలని అందరికీ తెలుసు. వాళ్లు వొకళ్లకొకళ్లు తటస్థ పడకుండా చూడాలనీ తెలుసు. యింటి వ్యవహారాలు చూసే కర్నేయ్ దర్వాన్ గదికి వెళ్లి ఆమెని యెవళ్లు లోపలికి రానిచ్చేరని అడిగేడు. కపితోనిచ్ ఆమెని లోపలికి రానిచ్చేడని, తనే పిల్లవాడి గదికి ఆమెని తీసుకెళ్లాడనీ తెలిసి ఆ ముసలాడిమీద విరుచుకు పడిపోయేడు. అతను యేం మాట్లాడలేదు. కాని అలాంటి పని చేసినందుకుగాను అతనికి దేవిడీమన్నా అయిపోతుందని కర్నేయ్ బెదిరించగానే కపితోనిచ్ అతనిమీదకి ఉరుకుతూ కోపంగా చేతులు వూపాడు.

"నువ్వు ఆమెని లోపలికి రానివ్వకుండా ఆపుతావు! పదేళ్ళుగా యిక్కడ పని చేస్తున్నావు కాని యెప్పుడన్నా మంచి మాట తప్ప ఆవిడనుంచి విన్నావా? నువ్వు వెళ్లి యిక్కడకి రాకండమ్మా అని చెప్పగలవూ? మీకు మీ కడుపులు నింపుకోవడం తెలుసు. కక్కుర్తి మాట. యెంత సేపూ స్వార్థం, అయ్యగారికి యిచ్చకాలు చెప్పడం, ఆయన ఫర్ కోటు కొట్టెయ్యడం!" అన్నాడు.

"పల్లెటూరి బైతు" అని కర్నేయ్ చీదరించుకుని, అప్పుడే లోపలికి వచ్చిన దాదిని చూశేడు. "కొంచెం ఆలోచించండి, మరీయా యెఫీమొవ్నా! యెవళ్లకీ చెప్పా పెట్టకుండా ఆమెని లోపలికి రానిచ్చేడు. అయ్యగారు యివతలికి వొచ్చే వేళైంది, ఆయన చిన బాబుగారి గదిలోకి వెడతారు" అన్నాడు.

"అయ్యొయ్యో!" అంది దాది. "యెలాగో అలాగ ఆయన్ని తన గదిలోనే కొంచెం ఆపు చెయ్యండి, నేను చిన బాబు గదికి వెళ్లి అమ్మగార్ని యివతలికి తీసుకువస్తాను. అయ్యొయ్యో!" అంది.

దాది సెర్యోష గదిలోకి అడుగుపెట్టేటప్పటికి కుర్రాడు తనూ నాద్యా యెలా గుట్ట మీదనుంచి కిందికి జారిందీ, యెలా మూడు సార్లు పిల్లి మొగ్గలు వేసిందీ తల్లికి చెప్తున్నాడు. ఆమె అతని గొంతుక వింది. అతని ముఖంకేసీ, ముఖంలో మారే భంగిమలకేసి చూస్తూ వుంది, అతని చేతిని తాకుతూ వుంది కాని అతను చెప్పేదాన్ని వొక్క ముక్క కూడా అర్థం చేసుకోలేదు. తను వెళ్లిపోవాలి, వాడ్ని వదిలిపెట్టి వెళ్లిపోవాలి అనే ఆలోచన వొక్కటే వుంది ఆమె బుర్రలో. వసీలియ్ లుకీచ్ గుమ్మం దగ్గరికి రావడం, ఖాండ్రించడం వింది. దాది అడుగులు దగ్గరవడం వింది. కాని ఆమె యేదో సమాధిలో వున్నట్టు కూర్చుండి పోయింది. కదిలే శక్తీ, మాట్లాడే శక్తీ ఆమెకి లేకపోయేయి.

"అమ్మగారూ!" అంటూ దాది ఆమె దగ్గరికి వచ్చి ఆమె చేతుల్నీ భుజాల్నీ ముద్దు పెట్టుకుంటూ అంది. "చిన్న బాబుగారి పుట్టిన రోజుకి దేవుడు యెంత చల్లగా చూశేడు! మీరసలు యేమీ మారలేదండమ్మా!" అంది.

''ఓ! దాది? మీరిక్కడ వున్నట్టు నాకు తెలియదు'' అంది ఆన్నా అప్పుడే యీ లోకం లోకి వస్తూ.

''నేనిక్కడ వుండడం లేదండమ్మా. మా అమ్మాయి దగ్గర వుంటున్నా. చిన్న బాబు పుట్టిన రోజు గదా అని వచ్చేను'' అంది.

దాది వున్నట్టుండి యేడ్చి ఆన్నా చేతిని మళ్లీ ముద్దుపెట్టుకోవడం మొదలెట్టింది.

సంతోషంతో మెరిసే కళ్లతో, పెదాలమీద చిరునవ్వుతో సెర్యోష వో చేత్తో తల్లినీ రెండో చేత్తో దాదినీ పట్టుకుని బొద్దుగా వున్న తన దిసకాళ్లతో తివాసీపైన గంతులు వేశాడు. అమ్మ పట్ల ప్రియమైన దాది చూపించిన స్నేహ భావం అతన్ని సంతోషంతో మునక లెత్తించింది.

''అమ్మా! యీమె యెక్కువగా నన్ను చూడ్డానికి వస్తూ వుంటుంది, వచ్చినప్పుడల్లా...'' అని చెప్పడం మొదలుపెట్టేడు. కాని దాది తల్లి చెవిలో యేదో గుసగుస లాడ్డం, దాంతో తల్లి ముఖంమీద ఆమె స్వభావ విరుద్ధమైన భయం, సిగ్గు వ్యక్తం కావడం చూసి అతను మెదలకుండా వూరికే వుండిపోయేడు.

ఆన్నా కొడుకుమీదకి వాలింది.

''నా బాబూ'' అందామె.

'మరి నే వెళ్లిపోతున్నా' అని ఆమె అనలేదు కాని ఆమె ముఖంలో ఆ భావం వ్యక్తమైంది. సెర్యోష దాన్ని అర్థం చేసుకున్నాడు. ''నా బుజ్జి, బుజ్జి బాబూ'' అందామె అతన్ని చిన్న పిల్లాడిగా వున్నప్పుడు పిలిచే పిలుపుతో. ''నన్ను మర్చిపోవు కదూ? నువ్వు...'' కాని ఆ తర్వాత వొక్క మాట కూడా అనలేకపోయింది.

ఆ తర్వాత బిడ్డతో చెప్పుకోగలిగిన మాటలు యెన్నో ఆమె బుర్రకి తట్టేయి! కాని యీ క్షణంలో ఆమె యేమీ అనుకోలేకపోయింది, యేమీ చెప్పలేకపోయింది. కాని ఆమె చెప్పదలచుకున్న అంతట్నీ అర్థం చేసుకున్నాడు. అమ్మ విచారంగా వుందనీ, ఆమెకి తనంటే యిష్టమనీ అర్థం చేసుకున్నాడు. దాది ఆమె చెవిలో చెప్పిన దాన్ని కూడా అతను అర్థం చేసుకున్నాడు. 'యెప్పుడూ తొమ్మిది గంటలకే' అనే మాటలు విన్నాడు, తండ్రి గురించి ఆ మాటలు అంటోందనీ, తండ్రిని తల్లి కలుసుకోకూడదనీ కూడా అర్థం చేసుకున్నాడు. యిదీ అతనికి అర్థం అయింది కాని వొక విషయం అతనికి అర్థం కాలేదు. తల్లి ముఖంమీద భయం, సిగ్గు యెందుకు కనిపించినట్టు?... ఆమె దోషి కాదు, కాని ఆమె భయపడింది, సిగ్గుపడింది. తన అనుమానం తీర్చుకుందుకు అతను ఆమెని అడుగుదా మనుకున్నాడు కాని ధైర్యం చెయ్యలేకపోయేడు. ఆమె బాధపడుతోంది అని అతనికి కనిపిస్తూనే వుంది. ఆమె పట్ల జాలి కలిగింది. యేమీ అడక్కుండా ఆమెకి హత్తుకుపోయి గుసగుసలాడేడు...

''అప్పుడే వెళ్లకు. ఆయన రారు అప్పుడే.''

అమ్మ అతన్ని పక్కకి తీసుకుపోయింది, అతననే మాట అతనికి అర్థమైందా లేదా

అని చూడ్డానికి. అతను తండ్రిని గురించి అంటున్నాడనే గాక, ఆయన్ని గురించి యేమను కోమంటావ్ అని అడుగుతున్నాడని కూడా అతని బెదిరిన ముఖం చూసి ఆమెకి అనిపించింది.

"సెర్యోష, నా బాబూ!" అందామె. "నాన్నగార్ని ప్రేమించు. ఆయన నాకంటే మంచివారు, దయగలవారు. నేనాయనకి అన్యాయం చేశాను. పెద్దయాక నువ్వే నిర్ణయించుకో" అంది.

"నీకంటే యెక్కువ మంచి వాళ్ళెవళ్ళూ లేరు" అని అతను యేడుస్తూ బాధగా అరిచేడు. ఆమె భుజాలు పట్టుకుని బలం కొద్దీ ఉద్రిక్తత కొద్దీ వణికే చేతుల్తో ఆమెని తన వేపు లాక్కున్నాడు.

"నా బాబూ! నా బుజ్జి బాబూ!" అని ఆన్నా గొణిగి, మౌనంగా రోదించింది, చిన్న పిల్లాడిలా, అచ్చు అతను యేడుస్తున్నట్టే యేడిచింది.

సరిగ్గా అప్పుడే తలుపు తెరుచుకుంది, వసీలియ్ లుకీచ్ లోపలికి వచ్చేడు. మళ్ళీ గుమ్మం దగ్గర అడుగుల చప్పుడు వినిపించింది. దాది బెదిరిపోతూ "ఆయనే" అని మెల్లిగా అంటూ ఆన్నాకి టోపీ అందించింది.

సెర్యోష చేతులతో ముఖం కప్పుకుని మంచంమీదకి వాలి వెక్కి వెక్కి యేడ్చేడు. ఆన్నా అతని చేతులు తోసేసి, కన్నీళ్లతో తడిసిన ముఖాన్ని ముద్దుపెట్టుకుని గబగబా బయటికి నడిచింది. కరేనిన్ ఆమె వేపు వచ్చేడు. ఆమెని చూసి అతను ఆగి తల వంచేడు.

ఆమె అతనికేసి వొక చూపు చూసింది. ఆ చూపులోనే అతని మొత్తం ఆకృతిలోని ప్రత్యేకతలన్నీ స్ఫురణకి వచ్చేశాయి. అతను తనకంటే మంచివాడనీ, దయగలవాడనీ ఆమె వో క్షణంకితమే అంది. అయినా యిప్పుడు అతనిపట్ల ఘృణత్వం, ద్వేషం, కొడుకు కోసం యీర్ష్య ఆమెలో నిండిపోయేయి. వెంటనే ఆమె రవసెల్లా ముసుగు ముఖంమీదకి లాక్కుని, గబగబ అడుగులు వేస్తూ, దాదాపు పరుగులు తీస్తూ గదిలోనుంచి బయటికి వెళ్లిపోయింది.

అంతకు ముందు రోజు సాయంత్రం యెంతో ప్రేమగా, విచారంగా కొన్న ఆట వస్తువుల్ని కూడా బయటికి తియ్యలేకపోయింది. వాటిని తనతో కూడా వెనక్కి తీసుకు పోయింది.

## 31

కన్న కొడుకుని చూడాలని ఆన్నా యెంత తపన పడినా, తను కలయిక గురించి యెంతో వూహించుకుని, సమాయత్తం అయినా కూడా ఆ కలయిక యింత గాఢంగా తనని కదలించి వేస్తుందని ఆమె అనుకోలేదు. హోటల్‌లో తనకి విడిగా వున్న గదులకి వచ్చేక తను అక్కడ యెందుకు వున్నదీ మొదట ఆమెకి అర్థం అవలేదు. 'ఆఁ, అంతా ముగిసింది, నేను మళ్లీ వొంటరిగా వున్నాను' అనుకొంది. టోపీ తియ్యకుండానే నెగడు పక్కన కుర్చీలో కూర్చుంది.

కిటికీల మధ్య బల్లమీద వున్న కంచు గడియారంకేసి తదేకంగా చూస్తూ ఆలోచనల్లో మునిగిపోయింది.

ఆమె విదేశాలనుంచి కూడా తీసుకువచ్చిన ఫ్రెంచి పనిపిల్ల వచ్చి బట్టలు మార్చుకుంటారా అని అడిగింది. ఆన్నా బిత్తరపోయి ఆమెకేసి చూసి.

''తర్వాత'' అంది.

నౌకరు వచ్చి కాఫీ తాగుతారా అని అడిగేడు.

''తర్వాత'' అంది.

ఇటాలియన్ దాది చంటిపిల్లని ముస్తాబు చేసి తల్లి దగ్గరికి తీసుకువచ్చింది. సంరక్షణ బాగా జరగడంవల్ల చంటిపిల్ల బొద్దుగా వుంది. తల్లిని చూసి యెప్పటిలాగా బోసి నోటితో నవ్వి, బొద్దుగా వుండడంవల్ల ముడతలు పడ్డ చేతుల్ని చేపలు రెక్కలు ఆడించినట్టుగా తన్నుకుంటూ వూపుతూ, గంజి పెట్టిన ఎంబ్రాయిడరీ గౌను చప్పుడు చేసేటట్టు తాడించింది. ఆ పిల్లని చూసి నవ్వకుండా వుండడం, ముద్దుపెట్టుకోకుండా వుండడం అసాధ్యం. ఆ పిల్లకి వేలిని అందివ్వకుండా – ఆ వేలిని పిల్ల ముద్దుపెట్టుకుంటున్నట్టు నోట్లోకి లాక్కుంటుంది – వుండడం అసాధ్యం. ఆన్నా యివన్నీ చేసింది. చంటిపిల్లని చేతుల్లోకి తీసుకుని పైకి యెగరేసి పట్టుకుంటూ, నవనవలాడే బుగ్గల్ని బోసి మోచేతుల్ని ముద్దుపెట్టుకుంది. కాని ఆ బిడ్డ సముఖంలో వుండడంతో ఆమె పట్ల తనకి కలిగిన అనుభూతి సెర్యోష పట్ల కలిగిన అనుభూతితో పోలిస్తే ప్రేమే కాదు అని ఆన్నాకి స్పష్టమైంది. చంటిపిల్ల యెంతో ముద్దు వస్తూ వున్న మాట నిజమే కాని కారణం యేమిటో మరి, ఆ పిల్ల హృదయాన్ని స్పందింప చెయ్యడం లేదు. తను ప్రేమించని వ్యక్తికి పుట్టినా మొదటి బిడ్డడు తన ప్రేమ సర్వస్వాన్నీ దొంగిలించేడు. ఆమె ప్రేమ సర్వస్వమూ వాడికి అర్పితం అయింది. యీ పిల్ల చాలా విచారకరమైన పరిస్థితుల్లో పుట్టింది, మొదటి బిడ్డపట్ల చూపించిన శ్రద్ధలో పదో వంతు యీ బిడ్డకి దక్కలేదు. అదీగాక యీ చిన్న పిల్ల భవిష్యత్తులో వక్తిత్వం రూపు తీసుకుంటుంది, కాని సెర్యోష యిప్పటికే దాదాపు వొక వ్యక్తి అయేడు, ప్రేమాస్పదుడయేడు. యిప్పటికే అతనిలో ఆలోచనలూ అనుభూతులూ సంవేదితమవుతూ వున్నాయి. వాడు తనని అర్థం చేసుకున్నాడు, ప్రేమించాడు, తన గురించి ఆలోచిస్తున్నాడు. పిల్లవాడి మాటలూ చూపులూ గుర్తు చేసుకుని ఆమె అలా అనుకొంది. తను శారీరకంగానే కాక ఆత్మికంగా కూడా శాశ్వతంగా వాడికి దూరమైపోయింది. యీ పరిస్థితిని యిక చక్క బెట్టడం కుదరదు.

ఆమె చంటిపిల్లని దాదికి అందించి వాళ్లని పంపేసింది. తర్వాత లాకెట్ తెరిచింది. లాకెట్‌లో సెర్యోష ఫోటో వుంది. అతను యీ చంటిపిల్ల వయసులో వున్నప్పటి ఫోటో. ఆమె లేచి టోపీ తీసేసి ఆల్బమ్ అందుకుంది. ఆ ఆల్బమ్‌లో వేరు వేరు వయసుల్లో తీసిన సెర్యోష ఫోటోలు వున్నాయి. వాటిని పోల్చి చూద్దామనుకుని వాటిని ఆల్బమ్‌లోనుంచి తియ్య

డం మొదలుపెట్టింది. అన్నిటినీ తీసింది, వొక్క దాన్ని తప్ప. ఆ ఫోటో అన్నిటికంటే బాగుంది. సెర్యోష తెల్లని చొక్కా తొడుక్కుని, కుర్చీలో కాళ్లు అటూ యిటూ వేసి కూర్చున్న ఫోటో. కళ్లు ముడుచుకు చూస్తూ పెదాలమీద చిరునవ్వు తొణికిసలాడుతూ వుండగా అది అతని ముఖంలో అన్నిటికంటే విశేషంగా కనిపించే మంచి భంగిమ. ఆమెకి యెంతో యిష్టమైన భంగిమ. చురుగ్గా వుండే తన చిన్న చేతుల్తో ఆ ఫోటోని పీకబోయింది. ఆమె చేతి వేళ్లు యిటీవల బిరుసుగా తయారయేయి. ఆమె ఫోటోని తియ్యడానికి కొన్ని సార్లు ప్రయత్నించింది. కాని అది వూడి రాలేదు. పేపర్ నైఫ్ అందుబాట్లో లేకపోయింది. దాంతో యీ ఫోటోకి పక్క ఫోటో వూడి వచ్చేసింది. (గుండ్రటి టోపీ పెట్టుకుని, పొడుగాటి జుట్టుతో రోమ్‌లో వ్రాన్‌స్కీ తీయించుకున్న ఫోటో అది.) ఆ ఫోటోతోబాటు సెర్యోష ఫోటో కూడా వూడొచ్చింది. 'యిక్కడ అతను!' అని వ్రాన్‌స్కీ ఫోటో చూసి అన్నా అనుకొంది. ఆమెకి అప్రయత్నంగానే తన ప్రస్తుత దుఃఖానికి యెవరు కారకులో గుర్తువచ్చింది. ఆ వూట పొద్దుటినుంచీ ఆమెకి వొక్క సారి కూడా వ్రాన్‌స్కీ గుర్తు రాలేదు. కాని యిప్పుడు ఆ సాహసపూరిత, ఉదాత్త, గాఢ పరిచిత ప్రియమైన ముఖం చూడగానే ప్రయత్నరహితంగా హృదయంలో ప్రేమ వెల్లువలా పొంగి వచ్చింది.

'అవును, యెక్కడున్నాడు అతను? నా బాధకి నన్ను వొదిలేసి యెలా వెళ్లగలిగేడు?' అనుకొంది. తన కొడుకుకి సంబంధించి యే విషయమూ అతనికి చెప్పకుండా దాచి పెట్టిన విషయం మరిచిపోయి అతన్ని తప్పు పట్టుకోవడం మొదలెట్టింది. వెంటనే రమ్మని అతనికి కబురు పెట్టింది. అతని కోసం యెదురు చూస్తూ ఉగ్గబట్టి కూర్చుంది. యెలా తను అతనికి యావత్తూ చెప్పబోయేదీ, అతను యెలా తనని వూరడించేదీ ఆలోచించుకుంటూ కూర్చుంది. అతనితో యెవళ్లో వున్నారనీ, కాని తను కొంచెం సేపట్లో వస్తాడనీ నౌకరు సమాధానం పట్టుకొచ్చేడు. పీటర్స్‌బుర్గ్ వచ్చిన ప్రిన్స్ యాష్విన్ కూడా తనతోబాటు ఆమె దగ్గరికి రావచ్చో లేదో కనుక్కు రమ్మన్నాడనీ నౌకరు చెప్పేడు. 'వొక్కడూ రాడు! నిన్న రాత్రి భోజనాల దగ్గర్నుంచీ నన్ను కలుసుకోలేదు మళ్లీ' అనుకుంది. 'నేను తనకి విషయాలన్నీ చెప్పకునేటట్టు వొక్కడూ రాడు కాని యాష్విన్‌తో కలిసి వస్తాడు' అనుకొంది. వున్నట్టుండి వొక భయంకరమైన ఆలోచన ఆమె బుర్రకి తగిలింది: నామీద అతనికి ప్రేమ లేకపోతే?

గత కొన్ని రోజులూ జరిగిన విషయాల్ని గురించి మనసులో అనుకుంది. అవి యీ భయంకర ఆలోచనకి బలం కలిగిస్తూ వున్నట్టే వున్నాయి. అతను ముందు రోజు ఆమెతో కలిసి భోజనం చెయ్యలేదు. పీటర్స్‌బుర్గ్‌లో తాము విడివిడిగా వుండాలీ అని పట్టుబట్టేడు. యిప్పుడు వొక్కడూ రావడం లేదు, తనతో యేకాంతంగా వుండడం యిష్టం లేనట్టు యెవళ్లో స్నేహితులతో కలిసి వస్తున్నాడు.

'కాని తను నాతో ఆ విషయం చెప్పాలి. నాకది తెలియాలి. నాకా విషయం తెలిస్తే

ఖాయంగా నేనేం చెయ్యాలో నాకు తెలుసు' అనుకొంది. కాని అతను తన గురించి పట్టించుకోవడం లేదు అన్న నమ్మకం కలిగితే తను యే స్థితిలో వుండేదీ వూహించుకొనే శక్తి కూడా ఆమెకి లేకపోయింది. అతనికి తన పట్ల ప్రేమ పోయిందని ఆమె అనుకుంది. హతాశురాలైనటువంటి స్థితిని దర్శించుకుంది, తత్ఫలితంగా మామూలుకంటే యెక్కువ ఆవేశితురాలైనట్టు తోచింది. ఆమె పనిపిల్లని పిలుస్తూ గంట కొట్టి బట్టలు మార్చుకునే గదిలోకి వెళ్లింది. మామూలుకంటే యెక్కువ సేపు ముస్తాబు అవుతూ గడిపింది. ప్రేమ తగ్గిపోయినా తన ఫ్రాకునీ, కేశ అలంకారాన్నీ చూసి ప్రేమిస్తాడని — అవి అతన్ని ముఖ్యంగా ఆకర్షించి పట్టుకునేటట్టు.

ఆమె యింకా తయారవక ముందే గంట మోగింది.

డ్రాయింగు రూమ్‌లోకి వస్తూనే ఆమెకి వ్రాన్‌స్కీ చూపుల కంటే ముందు యాష్విన్ చూపులు స్వాగతం చెప్పాయి. వ్రాన్‌స్కీ ఆమె కొడుకు ఫోటోలు చూస్తూ వున్నాడు. ఆమె వాటిని తియ్యడం మరిచిపోయింది. అలసు ఆన్నా వేపు చూడ్డానికి వేగిర పడలేదు.

"మనం కలుసుకున్నాం" అని తన చేతిని యాష్విన్ పెద్ద చేతికి అందిస్తూ పలకరించింది. యాష్విన్ సిగ్గు పడిపోయేడు. (అతని భారీ ఆకారానికీ, ముతక కవళికలకీ అలా సిగ్గు పడ్డం వింతగా వుంది.) "గత యేడు గుర్రప్పందేల దగ్గర కలుసుకున్నాం. నాకు యివ్వండి" అని వ్రాన్‌స్కీ చేతుల్లోనుంచి తన కొడుకు ఫోటోలు లాగేసుకుంటూ అంది. మిలమిల మెరిసే కళ్లతో వ్రాన్‌స్కీకేసి అర్థవంతంగా చూసింది. "యీ యేడాది పందేలు సరదాగా జరిగేయా? నేను వీటి బదులు రోమ్‌లో కోర్సోలో పందేలు చూశేను. కాని విదేశాల్లో జీవితం మీకు ఆనందంగా వుండదు" అని ఆర్ద్రంగా నవ్వుతూ అంది. "మిమ్మల్ని కలుసుకోవడం బహు తక్కువే అయినా మీ గురించీ, మీ అభిరుచుల గురించీ నాకు బాగా తెలుసు."

"నాకు చాలా విచారంగా వుంది యేమంటే నా అభిరుచులు చాలా చెడ్డవి" అని యాష్విన్ యెడమ మీసాన్ని కొరుకుంటూ అన్నాడు.

కొంచెం సేపు అన్నాతో మాట్లాడిం తర్వాత వ్రాన్‌స్కీ గడియారంకేసి చూడ్డం గమనించి పీటర్స్‌బుర్గ్‌లో యెక్కువ రోజులు వుంటారా అని అడిగి పొడుగాటి కాళ్లని చాచుకుని అతను టోపీ అందుకున్నాడు.

"యెక్కువ రోజులు వుండమేమో" అని ఆమె వ్రాన్‌స్కీకేసి యిబ్బంది పడుతున్నట్టు చూసి అంది.

"అయితే మళ్లీ కలుసుకోమేమో మరి" అని యాష్విన్ లేచి వ్రాన్‌స్కీకేసి తిరిగి అన్నాడు. "మధ్యాహ్నం భోజనం యెక్కడ?" అని అడిగేడు.

"భోజనానికి యిక్కడికి వచ్చెయ్యండి" అని ఆన్నా తీర్మానంగా అంది, యిబ్బంది పడ్డట్టు కనిపించినందుకు తనమీద తనకి కోపం వచ్చినట్టు. పరాయి వాళ్ల ముందు తన స్థితి వెల్లడి అయినప్పుడెప్పుడూ వుండే మాదిరిగా సిగ్గుతో యెర్రబడింది. "యిక్కడ భోజనం అంత

బాగుంటుందని కాదు, కాని కనీసం మీరిద్దరూ కలిసి వుంటారని. పటాలంలో వుండే మిత్రులెవళ్ళూ అలెక్సేయ్‌కి మీ అంత యిష్టులు కారు'' అంది.

''చాలా సంతోషం'' అని యాష్విన్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. ఆన్నా అతనికి బాగా నచ్చిందని ఆ చిరునవ్వు వ్రాన్‌స్కీకి స్పష్టం చేసింది.

యాష్విన్ సెలవు తీసుకుని బయటికి వెళ్ళిపోయేడు. వ్రాన్‌స్కీ గదిలో వుండిపోయేడు.

''నువ్వూ వెడుతున్నావా?'' అని ఆన్నా అడిగింది.

''యిప్పటికే ఆలస్యం చేశాను'' అని అతను జవాబు చెప్పేడు. ''నువ్వు నడుస్తూ వుండు, నిన్ను అందుకుంటాను'' అని యాష్విన్‌ని ఉద్దేశించి గట్టిగా అరిచాడు.

ఆన్నా అతని చేతిని పట్టుకుని, అతనికేసే కళ్ళు లగ్నం చేసి, అతన్ని ఆపడానికి యేం చెప్పాలా అని మనసులో ఆలోచన చేసింది.

''వుండు, నీతో కొంచెం మాట్లాడాలి'' అని అతని చిన్న అరచేతిని తన చేతిలోకి తీసుకుని కంఠంమీద అదుముకుంటూ అంది. ''అతన్ని భోజనానికి రమ్మన్నందుకు యేమన్నా అనుకున్నావా, అలెక్సేయ్?'' అని అడిగింది.

''అబ్బే, మంచి పని చేశావు'' అని అతను ప్రశాంతంగా కుదురైన పలువరస కనిపించేటట్టు చిరునవ్వు నవ్వేడు. ఆమె చేతిని ముద్దుపెట్టుకున్నాడు.

''అలెక్సేయ్, నాపట్ల మారలేదు కదా నువ్వు?'' అని తన రెండు చేతులతోనూ అతని చేతిని నొక్కుతూ అంది. ''యిక్కడ నాకు నరక యాతనగా వుంది. యెప్పుడు వెళ్ళిపోదాం?'' అని అడిగింది.

''త్వరలోనే, చాలా తొందర్లో, నాక్కూడా యెంత యాతనగా వుందో నువ్వు వూహించలేవు'' అన్నాడతను చేతిని లాగేసుకుంటూ.

''సరే అయితే వెళ్ళు, వెళ్ళు'' అని నొచ్చుకుంటున్నట్టు అంది. గబగబా అక్కణ్నుంచి వెళ్ళిపోయింది.

## 32

వ్రాన్‌స్కీ తిరిగి వచ్చేటప్పటికి ఆన్నా లేదు. తను వెళ్ళిన కొంచెం సేపటికి యెవరో మహిళ వచ్చిందనీ యిద్దరూ కలిసి బయటికి వెళ్ళారనీ అతనికి తెలిసింది. తనతో చెప్ప కుండా యెక్కడికో వెళ్ళిపోవడం, యింకా తిరిగి రాకపోవడం, వొక్క ముక్క కూడా చెప్ప కుండా పొద్దున్నే యెక్కడికో వెళ్ళడం, అలాగే ఆ పొద్దుట ఆమె ముఖంలో కనిపించిన వింత ఉత్తేజం, యాష్విన్ ముందు తన చేతులోనుంచి ఆమె తన కొడుకు ఫోటోలు లాగేసు కున్న కోపం — అన్నీ వ్రాన్‌స్కీకి ఆలోచనా ప్రేరకం అయేయి. అన్ని విషయాలనుంచీ దాపరికం లేకుండా ఆన్నాతో మాట్లాడాలని అనుకున్నాడు. ఆమె కోసం డ్రాయింగ్ రూమ్‌లో చూస్తూ కూర్చున్నాడు. ఆన్నా తిరిగివచ్చింది, కాని వొక్కత్తీ రాలేదు. తనతో కూడా వృద్ధ

అవివాహిత మేనత్త ప్రిన్సెస్ అబ్లాన్స్కీని తీసుకువచ్చింది. పొద్దుట వచ్చిన ఆవిడ యీ మేనత్తే. ఆమెతో కలిసే అన్నా యేవో కొనుక్కోవడానికి వెళ్లింది. వ్రాన్స్కీ ముఖంలో కనిపించే ఆందోళన, ప్రశ్నార్థక దృక్కు గమనించనట్టుగా అన్నా తను ఆ పూట యేవేం కొందో ఉత్సాహంగా వర్ణించి చెప్పింది. ఆమెలో యేదో మార్పు వస్తోందని వ్రాన్స్కీకి అనిపించింది. మిలమిల మెరిసే ఆమె కళ్లు క్షణ కాలం సేపు తన కళ్లకేసి చూడగానే వొక బిగబట్టిన యేకాగ్రతా తళుకును ఆమె కళ్లల్లో అతను పసిగట్టేడు. ఆమె మాటల్లోనూ, కదలికల్లోనూ వొక ఆందోళనాపూరిత వడి, సోయగం కనిపించేయి. తను యిద్దరికీ సన్నిహితత్వం యేర్పడే తొలి రోజుల్లో తనని వశం చేసుకున్న అవి యిప్పుడు అతనికి వ్యాకులతనీ, భయాన్నీ కలిగించేయి.

భోజనం బల్ల నలుగురి కోసం యేర్పాటైంది. వాళ్లు భోజనాల గదిలోకి వెడుతూ వుండగా తుష్కేవిచ్ వచ్చేడు. ప్రిన్సెస్ బెట్సీ అన్నాకి అందజెయ్యమన్న కబురు తీసుకువచ్చేడు. తనకి వొంట్లో బాగా లేకపోవడంవల్ల వీడ్కోలు చెప్పడానికి రాలేకపోతున్నానని బెట్సీ కబురు చేసింది. కాని ఆ సాయంత్రం ఆరున్నర తొమ్మిదీ మధ్య అన్నా తన దగ్గరికి రావాలని కోరింది. ఆ టైమ్ ప్రస్తావన విని వ్రాన్స్కీ అన్నాకేసి చూశేడు. అలా టైమ్‌ని నిర్దేశించడంలో ఉద్దేశం అప్పుడు అక్కడ అన్నా తప్ప అన్యులెవరూ వుండరని జాగ్రత్త పడడం అన్న మాట. కాని అన్నా దాని పట్ల దృష్టి పెట్టనట్టు కనిపించింది.

"అయ్యో, కాని నేను ఆరున్నర తొమ్మిదీ మధ్య రాలేను" అని పేలవంగా చిరునవ్వు నవ్వుతూ అంది.

"ప్రిన్సెస్ చాలా నొచ్చుకుంటుంది."

"నేనూనూ."

"మీరు గాయని పత్తి* పాట వినడానికి వెళ్తారా?" అని తుష్కేవిచ్ అడిగేడు.

"పత్తి పాట? ఆఁ, కోరిక రేపెట్టేరు. బాక్స్ టికెట్ దొరికితే వెడతాను."

"నేను యేర్పాటు చేస్తాను" అని తుష్కేవిచ్ సంసిద్ధత వెల్లడించేడు.

"మీకు ధన్యవాదాలు. వూఁ, మాతో కలిసి భోజనం చెయ్యకూడదూ?" అంది అన్నా.

వ్రాన్స్కీ కనిపించీ కనిపించనట్టుగా భుజాలు యెగరేశాడు. అన్నా యేం చేస్తోందో అతనికి యేమీ చాలా మూలం తెలీటం లేదు. వృద్ధ ప్రిన్సెస్‌ని కూడా యెందుకు తీసుకు వచ్చినట్టు, తుష్కేవిచ్‌ని భోజనానికి యెందుకు వుండమన్నట్టు, యిక యింకా బాధ కలిగించే విషయం థియేటర్ బాక్స్ టికెట్ యెందుకు యేర్పాటు చెయ్యమన్నట్టు? ప్రస్తుతం తను వున్న పరిస్థితిలో పత్తి ఒపెరాకి వెళ్లే ఆలోచన యేమిటని – అక్కడ పీటర్స్‌బర్గ్ ఉన్నత సమాజం యావత్తూ పోగవుతుందే? అతను ఆమెకేసి గంభీరంగా చూశేడు. కాని జవాబుగా ఆమె అదే ధిక్కార వైఖరితో సగం సంతోషంగా, సగం హతాశగా కనిపించే చూపు చూసింది. దాని అర్థం యేమిటైందీ అతనికి బోధపడలేదు. భోజనాల దగ్గర ఆమె

అతి అనిపించే హద్దు దాకా ఖుషీగా వుంది. తుష్కేవిచ్, యాష్విన్‌లతో కులుకులు పోతూ ప్రవర్తించింది. భోజనాలయేక తుష్కేవిచ్ ఆమెకి బాక్స్ టికెట్ సంపాదించడం కోసం వెళ్లిపోయేడు. యాష్విన్ సిగరెట్ కాల్చుకోవడానికి వెళ్లిపోయేడు. వ్రాన్‌స్కీ కూడా అతని తోబాటు తన గదికి వెళ్లేడు. కాని కొంచెం సేపట్లోనే తిరిగి మేడమీదకి పరిగెత్తి వెళ్లేడు. ఆన్నా పారిస్‌లో కుట్టించిన దిగు భుజాల లేత రంగు ముఖమల్ శాటిన్ గౌను వేసుకుంది; తలకి ఖరీదైన తెల్లని లేసు కట్టింది. దానివల్ల ఆమె ముఖం పటం కట్టినట్టు కనిపించి, కళ్లు చెదరగొట్టే ఆమె సౌందర్యం దిగంతాలకి కాంతులు ప్రసరింప చేసేటట్టు భాసించింది.

''మీరు నిజంగా థియేటర్‌కి వెదుతున్నారా?'' ఆన్నాకేసి చూడకుండా వుండ ప్రయత్నిస్తూ అడిగేడు వ్రాన్‌స్కీ.

''మీరంత బెదురు బెదురుగా అడగడం యెందుకు?'' అని, అతను తనకేసి చూడ్డం లేదని నొచ్చుకుంటున్నట్టు, అంది. ''యేం, యెందుకు వెళ్లకూడదు?'' అని అడిగింది.

అతనడిగిన ప్రశ్న భావం బోధపడనట్టుగా ఆన్నా నటించింది.

''అబ్బే, కారణం యేం లేదు'' అన్నాడతను ముఖం ముడుచుకుంటూ.

''నేనూ అదే అంటున్నాను'' అని ఆమె కావాల్సికి అతని వ్యంగ్యపూరిత ధోరణిని అవహేళన చేస్తున్నట్టు మాట్లాడింది. చాలా తృప్తిగా సెంటు వాసనతో ఘుమఘుమ లాడే గ్లవ్‌ని తొడుక్కుంది.

''ఆన్నా, మీకు పుణ్యం వుంటుంది చెప్పండి యేమైంది మీకు?'' అని వ్రాన్‌స్కీ, ఆన్నా భర్త వాడే పదాలని, కాకతాళీయంగా వాడుతూ అడిగేడు.

''మీరేం అడుగుతున్నారో నాకు అర్థం కావడం లేదు.''

''అక్కడికి వెళ్లడం బాగోదని మీకు తెలుసునా?''

''యెందుకని? నేనేం వొక్కత్తినీ వెళ్లడం లేదు. ప్రిన్సెస్ వర్వారా ముస్తాబై రావడానికి యింటికి వెళ్లింది. ఆవిడ నాతోబాటు వస్తుంది.''

వ్రాన్‌స్కీ హైరాన, హతాశ వెల్లడి చేస్తున్నట్టు భుజాలు యెగరేశాడు.

''కాని మీకు తెలియదా...'' అని అతను చెప్పడం మొదలుపెట్టేడు.

''నేనేమీ తెలుసుకోవాలను కోవడం లేదు'' అని ఆన్నా అరిచినంత పని చేసింది. ''అను కోవడం లేదు. నేను చేసిన పనికి బాధపడుతున్నానా? లేదు, లేదు, మరో సారి చెప్తున్నా లేదు. వొక వేళ మళ్లీ మొదటినుంచీ యిదే జరిగేటట్టుంటే గనక యిలాగే చేస్తాను. మన కోసం, నా కోసం, మీ కోసం. ముఖ్యమైందల్లా వొక్కటే — మనకి వొకళ్లపట్ల వొకళ్లకి ప్రేమ వుందా లేదా అనేదే. మరి మిగిలిన యేదీ గుడ్డి గవ్వ చెయ్యదు. యెందుకని మనం యిక్కడ వేరే వేరే గదుల్లో వుంటున్నాం? యెందుకు యెక్కువ కలుసుకోవడం లేదు? నేను యెందుకు థియేటర్‌కి వెళ్లకూడదు? నేను నిన్ను ప్రేమిస్తున్నాను, అంతే నాకిక వేరే దేంతోనూ సంబంధం లేదు'' అని ఆన్నా వ్రాన్‌స్కీకి అర్థం కాని విశేషమైన తళుకు

కళ్లల్లో మెరుస్తూ వుండగా అతనికేసి చూస్తూ రష్యన్‌లో అంది. "అదంతా నీ మనసు మారకుండా వుంటే. యెందుకు నువ్వు నాకేసి చూడడం లేదు?" అని అడిగింది.

అతను ఆమెకేసి తిరిగి చూశేడు. ఆమె ముఖ సౌందర్యాన్నీ, సర్వదా ఆమెకి నప్పేటట్టు అమిరే అలంకరణనీ మొత్తం చూశేడు. కాని యిప్పుడు యీ సౌందర్యమూ, సోయగమూనే అతనికి మంట పుట్టిస్తున్నాయి.

"మీకు తెలుసు మీపట్ల నా ప్రేమభావం మారదు. కాని మిమ్మల్ని బతిమాలుతున్నాను వెళ్లద్దు, వేడుకుంటున్నాను" అని వ్రాన్‌స్కీ మళ్లీ ఫ్రెంచిలో అన్నాడు. అతని స్వరం మృదువుగానే వుంది, అర్థిస్తున్నట్టే వుంది, కాని అతని చూపు జడంగా వుంది.

ఆమె అతని మాటలు వినలేదు. అతని చూపులోని జడత్వాన్ని మాత్రమే ఆమె చూసింది. ఆమె చిరాగ్గా అంది:

"యెందుకు వెళ్లకూడదో దయచేసి చెప్పమని వేడుకుంటున్నాను" అని.

"యెందుకంటే మీకు..." అతను చెప్పలేకపోయేడు.

"నాకు నిజంగా యేం అర్థం కావడం లేదు. యాష్విన్ n'est pas compromettant[1]. ప్రిన్సెస్ వర్వారా మిగతా వాళ్లకంటే చెడ్డదీ కాదు. అదుగో, ఆమె వచ్చేసింది!"

## 33

ఆన్నా తన పరిస్థితిని కావాల్సికి అర్థం చేసుకోకుండా ప్రవర్తించినందుకు వ్రాన్‌స్కీకి ఆమెమీద చిరాకు, దాదాపు కోపం మొట్టమొదటి సారిగా కలిగేయి. తన చిరాకు యెందుకో కారణం ఆమెకి చెప్పలేకపోయినందువల్ల కోపం యింకా తీవ్రం అయింది. తను అనుకుంటున్నది ఆమెకి దాపరికం లేకుండా చెప్పగలిగి నట్లయితే యిలా చెప్పేసి వుండేవాడు: 'యీ సింగారంతో, అందరికీ తెలిసిన ప్రిన్సెస్‌తో థియేటర్‌కి వెళ్లడం అనేది పతితురాలిగా నీ పరిస్థితిని వొప్పుకోవడమేనన్న మాట. అంతే కాదు, ఉన్నత సమాజాన్ని ధిక్కరించడమూ అవుతుంది, యిక శాశ్వతంగా అక్కడికి వెళ్లే అర్హత కోల్పోవడమూ అవుతుంది.'

అతను ఆన్నాకి ఆ మాటలు చెప్పలేకపోయేడు. 'కాని ఆమె యెందుకు అర్థం చేసుకోదు? ఆమెని యేం ఆవేశించింది?' అనుకున్నాడు. ఆన్నాపట్ల తన ఆదరం తగ్గిపోతూ వున్న సందర్భంలో ఆమె సౌందర్య స్పృహ అధికం అవుతూ వుందని అతనికి అనిపించింది.

అతను ముఖం ముటముట లాడుతూ గదికి తిరిగివచ్చేడు. యాష్విన్ పక్కన కూర్చున్నాడు. యాష్విన్ పొడుగాటి కాళ్లని కుర్చీమీదకి చాచి పెట్టుకుని సోడా కలిపి బ్రాందీ తాగుతున్నాడు. వ్రాన్‌స్కీ తనకి కూడా దాన్ని తీసుకురమ్మని పురమాయించేడు.

---

[1] యిబ్బంది పడే పరిస్థితిలోకి తొయ్యడు (ఫ్రెంచి).

"నువ్వు లంకోవ్‌స్కీ గుర్రం గురించి చెప్తున్నావు కదూ. మంచి గుర్రం. నన్నడిగితే కొనమంటాను" అని యాష్విన్ తన మిత్రుడి ముసురు ముఖంకేసి వో చూపు చూసి అన్నాడు. "దాని వెనక భాగం దిగలాక్కుపోయినట్టు వుంటుంది కాని కాళ్ళు, తల చూసుకో అక్కర్లేదు, పోటీ లేనివి!" అన్నాడు.

"నాకూ దాన్ని కొందామనే వుంది" అన్నాడు వ్రాన్‌స్కీ.

అతను యాష్విన్‌తో గుర్రాల గురించి మాట్లాడుతున్నాడే గాని లిప్త కాలం కూడా అన్నాని మర్చిపోలేదు, హాల్లో అడుగుల చప్పుడు వినిపిస్తుందేమోనని అప్రయత్నంగానే చెవి పెట్టేడు. నెగడు తీనెమీద వున్న గడియారంకేసి పదేపదే చూశేడు.

"థియేటర్‌కి వెడుతున్నట్టు అన్నాగారు తమకి చెప్పమని నన్ను పంపేరు."

బుడగలు చిమ్మే సోడా నీళ్ళల్లో మరో గ్లాసు బ్రాందీ పోస్తున్న యాష్విన్ గటక్కున దాన్ని తాగేసి లేచి నుంచుని కోటు బొత్తాలు పెట్టుకున్నాడు.

"సరే అయితే, పోదామా?" అన్నాడు. వ్రాన్‌స్కీ యెందుకు ముఖం ముడుచుకున్నాడో కారణం తెలుసునన్నట్టు మూతి మీసాలకింద పెదాలు చిరునవ్వు నవ్వేయి, కాని అతను దాన్ని గురించి పట్టించుకోలేదు.

"నేను రాను" అని వ్రాన్‌స్కీ మబ్బుగా అన్నాడు.

"కాని నేను వెళ్ళాలి. వస్తానని మాట యిచ్చేను. సెలవ్. కాని కావాలంటే నువ్వు స్టాల్‌కి వచ్చి కూర్చోవచ్చు. క్రసీన్‌స్కీ కుర్చీలో కుర్చో" అని యాష్విన్ బయటికి వెళ్ళిపోతూ అన్నాడు.

"లేదు, నాకు వేరే పనుంది."

'పెళ్ళాం జంజాటంగా వుంటుంది, పెళ్ళాం కాకపోతే యింకా యెక్కువ జంజాటంగా వుంటుంది' అని హోటెల్‌నుంచి వెళ్ళిపోతూ యాష్విన్ అనుకున్నాడు.

ఒంటరిగా వుండిపోయి వ్రాన్‌స్కీ గదిలో పచార్లు చెయ్యడం మొదలుపెట్టేడు.

'యివాళ అక్కడ ప్రోగ్రాం యేమిటో? సీజన్‌లో నాలుగోది... అన్నయ్య, వదిన అక్కడికి వెడతారు. అమ్మ కూడా వెళ్ళచ్చు, బహుశా. అంటే మొత్తం పీటర్స్‌బుర్గ్ అంతా అక్కడ పోగవుతుంది. యిప్పుడామె థియేటర్ దగ్గరికి వెళ్ళి వుంటుంది. ఫర్ కోటు విప్పేసి, దీపాల వెలుతురులోకి వెళ్ళివుంటుంది. తుష్కేవిచ్, యాష్విన్, ప్రిన్సెస్ వర్వారా...' అతను వూహించుకుంటూ వున్నాడు. "మరి నేను యేం చెప్పకోను నా గురించి? నేను భయపడుతున్నానా లేక ఆమెని తుష్కేవిచ్ సంరక్షణకి అప్పగించేశానా? యే రకంగా చూసినా యిది మూర్ఖత్వమే... యెందుకు ఆమె నన్ను యిలాంటి పరిస్థితిలోకి నెట్టింది?" అని అతను విసుగ్గా చేతులు విసిరి అనుకున్నాడు.

అలా చెయ్యడంతో అతని చెయ్యి సోడా, బ్రాందీ వున్న బల్లని కొట్టుకుంది. అవి పడిపోయినంత పనైంది. వాటిని పడిపోకుండా ఆపుదామనుకుని పట్టుకున్నాడో లేదో అవి

జారి కింద పడిపోయేయి. కోపం వచ్చేసి మొత్తం బల్లని బోర్ల పడతోసేసి నౌకర్ని పిలవడానికి గంట కొట్టేడు.

"నువ్వు నా దగ్గర పని చెయ్యాలనుకుంటే యేవేం చెయ్యాలో గుర్తుపెట్టుకో" అని లోపలికి వచ్చిన నౌకరుతో అన్నాడు. "మళ్లీ యిలా జరగడానికి వీల్లేదు వీటన్నిట్నీ తీసేసి వుండాల్సింది" అన్నాడు.

తన తప్పేం లేదని అనుకున్న నౌకరు ఆ మాట చెప్పబోయేడు గాని యజమాని ముఖం కేసి చూసి మెదలకుండా వుండాలని అర్థం చేసుకున్నాడు. గబగబ నేలమీదకి వొంగి సీసం పెంకుల్ని యేరడం మొదలుపెట్టేడు.

"యిది నీ పని కాదు, వెయిటర్‌ని పంపించు యిక్కడ శుభ్రం చెయ్యడానికి. నా ఫ్రాక్ కోటు తీసుకురా" అన్నాడు వ్రాన్‌స్కీ.

వ్రాన్‌స్కీ యెనిమిదిన్నర గంటలకి థియేటర్‌లోకి వెళ్లేడు. ఓపెరా జోరుగా సాగుతోంది. వార్డ్ రోబ్ దగ్గర వుండే ముసలి నౌకరు వోవరు కోటు విప్పుకోవడంలో వ్రాన్‌స్కీకి సాయం చేస్తూ అతన్ని గుర్తుపట్టేడు. "హుజూర్" అని పలకరించేడు. వోవరు కోటు టోకెన్ తీసుకునే బెడద పడక్కర్లేదనీ వూరికే ఫోదార్‌ని పిలిచి కోటు తీసుకోవచ్చనీ అన్నాడు. యీ ముసలాడూ, చేతులతో ఫర్ కోట్లు పట్టుకుని వోరగా వేసిన తలుపు సందులోనుంచి ఓపెరా వినే యిద్దరు నౌకర్లూ తప్ప వెలుతురుగా వున్న ఆ వరండాలో యెవళ్లూ లేరు. ఆ తలుపు సందులోనుంచి యెంతో నియతంగా భిన్న స్వరస్థాయిలతో తూగుతూ వుండే వాయిద్య సంగీతం, గాయని కంఠం స్పష్టంగా వినిపిస్తున్నాయి. ముసలి నౌకరు లోపలికి వెళ్లేందుకు తలుపు తెరిచేడు, అప్పుడు ముగింపు చరణాలు వ్రాన్‌స్కీకి బహు స్పష్టంగా వినిపించేయి. వెంటనే తలుపు మూసుకు పోవడంతో పాట ముక్తాయింపు వినబడలేదు. కాని ధనధన చప్పట్లు మోగడంతో ఆ కృతి ముగిసిందని అతనికి అర్థమైంది. చప్పట్లు యింకా మోగుతూ వుండగానే అతను లోపలికి వెళ్లేడు: ఛాండ్‌లీర్ల దీపాలూ, గోడలకి వున్న కంచు సెమ్మెల దీపాలూ చిమ్మే కాంతులతో హాలంతా ధగద్ధగాయమానంగా వుంది. రంగస్థలంమీద ప్రధాన గాయని మందహాసపూరితంగా వొంగి అభివాదం చేస్తోంది. బోసిగా వున్న ఆమె భుజాలు, ఆమె మెడలోని వజ్రాలు కాంతులు చిమ్ముతున్నాయి. యుగళ గీతంలో తనకి తోడుగా వున్న గాయకుడు ఆమె చేతిని పట్టుకుని రాగా ఫుట్ లైట్ల పైనుంచి రంగస్థలంమీదకి దూసుకు వచ్చి పడుతూ వున్న పుష్ప గుచ్ఛాలని ఆమె వొంగి యేరుకుంటోంది. ఫుట్ లైట్లమీదనుంచి ఆమెకేసి పొడుగాటి చేతుల్ని చాచి యేదో బహుమతీ అందిస్తూ వున్న పెద్ద మనిషికేసి ఆమె వెళ్లింది. అతని జుట్టు నిగనిగ లాడుతోంది, మధ్య పాపిడి తీసుకున్నాడు. స్టాల్స్‌లో, బాక్స్‌ల్లో వున్న వాళ్లందరూ ఉత్తేజితులై అటూ యిటూ కదిలేరు, ముందుకి వొంగేరు, అరిచారు, చప్పట్లు చరిచేరు. సంగీత దర్శకుడు తను కూర్చున్న యేత్తైన సీట్లోనుంచి లేచి ఆ బహు

మతీని ఆమె అందుకోవడానికి సాయపడి తర్వాత తన తెల్లని టైని సర్దుకున్నాడు. వ్రాన్‌స్కీ స్టాల్స్ మధ్యకి వెళ్ళి ఆగి చుట్టూ చూశేడు. ఆ వాతావరణం బాగా తెలిసిందే: ఆ రంగ స్థలం, ఆ కోలాహలం, థియేటర్ నిండా కిక్కిరిసిపోయిన పరిచితులు, రసహీన, నానావర్ణ శోభిత దుస్తులు వేసుకున్న ప్రేక్షక బృందం. యెప్పటి మాదిరిగా వ్రాన్‌స్కీ యీ దృశ్యం పట్ల దృష్టి పెట్టలేదు.

యెప్పటిలాగా అపరిచితులైన ఆడవాళ్ళు, వాళ్ళ వెనక అపరిచితులైన ఆఫీసర్లు బాక్సుల్లో కూర్చున్నారు. యెప్పటిలాగా రంగు రంగుల గౌన్లు వేసుకున్న ఆడవాళ్ళు వున్నారు — దేవుడి కెరుక వాళ్ళెవరో అవే యూనిఫాంలు అవే ఫ్రాక్ కోట్లు వున్నాయి. గేలరీల్లో అదే పాటక జనం గుంపులుగా వున్నారు. యీ మొత్తం గుంపులో, బాక్సుల్లోనూ స్టాల్స్ మొదటి వరసల్లోనూ కలుపుకుని సుమారు వో నలభై మంది 'అసలైన' మహిళలు, పురుషులు వుంటారు. వ్రాన్‌స్కీ ఆ హ్రదాలకేసి దృష్టి మళ్ళించేడు. వెంటనే వాళ్ళతో సంబంధ సూత్రం యేర్పడిపోయింది.

అతను లోపలికి వెళ్ళేటప్పటికి వొక అంకం అవడంతో అతను అన్నగారున్న బాక్స్ దగ్గరికి వెళ్ళలేదు. మొదటి వరసకి వెళ్ళి సెర్పుఖొవ్‌స్కాయ్ పక్క చేరాడు. సెర్పుఖొవ్‌స్కాయ్ ఆర్కెస్ట్రా వున్న చోటుకి ఆనుకుని, మోకాలు వొంచి మడమతో తాళం వేస్తూ వ్రాన్‌స్కీని చూసి తన దగ్గరికి రమ్మని చిరునవ్వుతో పిలిచేడు.

వ్రాన్‌స్కీ యింకా ఆన్నాని చూళ్ళేదు. ఆమె వున్న వేపు చూడకూడదని అనుకున్నాడు. అందరి కళ్ళూ మళ్ళిన దిశని బట్టి ఆన్నా యెక్కడ వుందో అతనికి తెలిసింది. అతను దొంగగా చుట్టూతా చూశేడు కాని ఆన్నాని వెతుకుతున్నట్టు కాదు. దుశ్శకునం అనుమానిస్తూ కెరేనిన్ వున్నాడేమోనని వెతికేడు. కాని అదృష్టవశాత్తూ కెరేనిన్ అక్కడ లేడు.

"సైన్యం వాసనలే నీలో లేవు చూడు! యిప్పుడు నిన్ను చూస్తే దౌత్యవేత్తవో, నటుడివో, అలాంటి ఘనమైన యెవడివిగానో కనిపిస్తావు" అన్నాడు సెర్పుఖొవ్‌స్కాయ్.

"ఆఁ, స్వదేశం రాగానే ఫ్రాక్ కోటు వేసేశాను" అని వ్రాన్‌స్కీ చిరునవ్వు నవ్వుతూ మెల్లిగా ఓపెరా గ్లాసులు తీస్తూ అన్నాడు.

"నాకు యీర్ష్యగా వుంది నిన్ను చూస్తే యిందుగ్గాను. విదేశాలనుంచి తిరిగివచ్చేక యిది వేసుకున్నప్పుడల్లా" అంటూ అతను భుజకీర్తులని చూపించి, "నా స్వేచ్ఛ పోయిందే నని బాధపడుతూ వుంటాను" అన్నాడు.

సైన్యంలో వ్రాన్‌స్కీ ప్రమోషన్ గురించి సెర్పుఖొవ్‌స్కాయ్ యెప్పుడో ఆలోచించడం మానేశాడు. కాని అతనంటే సెర్పుఖొవ్‌స్కాయ్‌కి అభిమానం మాత్రం యెప్పటిలాగానే వుంది. ముఖ్యంగా యిప్పుడు మరీ ఆదరంగా వున్నాడు.

"మొదటి అంకానికి నువ్వు లేవు, నాకు బాధగా వుంది."

వ్రాన్‌స్కీ ఓపెరా గ్లాస్‌ని బాక్స్ మొదటి అంతస్తునుంచి రెండో అంతస్తుకేసి తిప్పి

చూస్తూ సెర్పుఖోవ్‌స్కోయ్ చెప్పేదాన్ని పరధ్యానంగా వింటున్నాడు. పాగా వున్న ఆడమనిషి కనిపించింది. ఆమె పక్కన వో బట్ట తల ముసలతను కనిపించేడు. ఒపెరా గ్లాస్ తమ వేపు తిప్పినందుకు వ్రాన్‌స్కీ కేసి కోపంతో గుడ్లు మిటకరించి చూశేడు ఆ ముసలాయన. వ్రాన్‌స్కీకి వున్నట్టుండి ఆన్నా ముఖం చమక్‌మని కనిపించింది. గర్వంగా, ఆశ్చర్యకరమైన అందంతో, లేసు చుట్టే చౌకట్టుతో వుంది. దిగువ వరసలో వో యిరవై అడుగుల దూరంలో అయిదవ బాక్స్‌లో వుందామె. ముందు వేపు కూర్చుంది. కొంచెం వెనక్కి తల తిప్పి యాష్విన్‌తో మాట్లాడుతోంది. అందమైన, వెడల్పాటి భుజాలమీద తీర్చినట్టున్న ఆమె శిరసు, కళ్లల్లోని సంయమిత ఉత్తేజిత తేజం, ఆమె మొత్తం ముఖ కట్టు మాస్కో బాల్‌లో తను ఆమెని చూసిన రూపాన్ని గుర్తుకు తెచ్చాయి. కాని యిప్పుడు యీ సౌందర్యం చూసి భిన్న రీతిలో ప్రతిస్పందిస్తున్నాడు. ఆన్నాపట్ల అతని భావనలో నిగూఢమైంది యేదీ మిగల లేదు, అంచేత యెప్పటికంటే యెక్కువగా ఆమె సౌందర్యం ఆకర్షిస్తూ వున్నాగానీ అది అతని మనసుకి ఖేదకారకంగా వుంది. ఆమె అతని వేపు చూడ్డం లేదు, కాని తనని ఆమె చూసిందని వ్రాన్‌స్కీ గ్రహించేడు.

వ్రాన్‌స్కీ మళ్లీ ఒపెరా గ్లాస్‌లని అటు వేపు తిప్పేడు. ప్రిన్సెస్ వర్వారా ముఖం చాలా యెర్రగా వుంది. ఆమె విపరీతంగా నవ్వేస్తోంది, దాదాపు వంగి వంగి పక్క బాక్స్ లోకి తొంగి చూసేస్తోంది. ఆన్నా విసన కర్ర మూసి బాక్స్ యెర్రటి ముఖమల్ గ్రాదిమీద సన్నసన్నగా తాడిస్తోంది. శూన్య దృక్కులతో, పక్క బాక్స్‌లో యేం జరుగుతూ వుందో చూడనట్టుగా చూడ్డం యిష్టం లేనట్టుగా యెటో కళ్లప్పగించి చూస్తోంది. యాష్విన్ అయితే పేకాటలో బాగా పోయేటప్పుడు వుండే వాలకంతో వున్నాడు. అతను ముఖం ముడుచుకుని యెడం మీసాన్ని యింకా యింకా యెక్కువ కొరికేస్తున్నాడు, పక్క బాక్స్‌కేసి మింగేస్తామన్నట్టు చూపులు విసురుతున్నాడు.

ఆ బాక్స్‌లో కర్‌తాసొవ్ దంపతులు వున్నారు. వ్రాన్‌స్కీ వాళ్లని యెరుగును. ఆన్నాకి కూడా వాళ్ల పరిచయమే అనీ తెలుసు. చిన్నగా బక్కపల్చగా వుండే కర్‌తాసొవ్ భార్య ఆన్నా వేపు వీపు తిప్పి నుంచుంది. భర్త అందిస్తూ వున్న ఉత్తరీయం కప్పుకుంటోంది. ఆమె ముఖం పాలిపోయి కోపంగా వుంది. ఆమె ఆవేశంగా మాట్లాడేస్తోంది. కర్‌తాసొవ్ లావుగా, బట్టతలతో వుంటాడు. అతను ఆన్నాకేసి చూస్తూ, పెళ్లాన్ని శాంతింప చెయ్య ప్రయత్నిస్తున్నాడు. పెళ్లాం బయటికి వెళ్లిపోగానే అతను ఆన్నా తనకేసి చూస్తుందేమో వొంగి వందనం చేద్దామని తచ్చాడేడు. కాని ఆన్నా అతన్ని హేళన చేస్తున్నట్టు వెనక్కి తిరిగి పొట్టిగా క్రాప్ చేయించుకున్న తలని వంచి వింటూ వున్న యాష్విన్‌తో యేదో చెపుతూ వుంది. అభివాదం చెయ్యకుండానే కర్‌తాసొవ్ వెళ్లిపోయేడు. బాక్స్ ఖాళీ అయిపోయింది.

కర్‌తాసొవ్‌లకీ ఆన్నాకీ మధ్య యేం జరిగిందో వ్రాన్‌స్కీకి తెలీదు. కాని ఆన్నాకి అవమానకరమైంది యేదో జరిగే వుంటుందని గ్రహించేడు. తను చూసిందాన్ని బట్టీ,

ముఖ్యంగా అన్నా వదనాన్ని బట్టీ అలా గ్రహించేడు. అన్నా సర్వశక్తుల్నీ కూడగట్టుకుని తను నిర్వహించదలచుకున్న పాత్రని పోషించ ప్రయత్నిస్తోంది. ఆమె నెగ్గింది: యే మాత్రం చలించని నిబ్బరంతో వున్నట్టు దివ్యంగా పాత్ర పోషణ చేసింది. ఆమెని గాని, ఆమె కలిసి మెలిసి వుండే పరిధులు గాని యెరగని వాళ్లెవళ్లేనా, సమాజంలోకి వచ్చి దర్శనమిచ్చే తెగువ చేసిందని, ఆ దర్శనమివ్వడం కూడా రంగు పొంగులతో అలంకరించుకుని మరీ అనీ ఆమె పట్ల సానుభూతి, ఆగ్రహం, ఆశ్చర్యంలాంటి భావాలు వ్యక్తం చేసే ఆడవాళ్ల మాటలు వినని యెవళ్లేనా ఆమె సౌందర్యాన్ని చూసీ, నిబ్బరాన్ని చూసీ ముగ్ధులైపోయి వుండేవాళ్లు. అవమానించేందుకు బొండకొయ్యలో పడేసిన నేరస్థురాలిలాగా ఆమె మానసిక క్షోభకి గురయి వుందన్న భ్రమ కూడా వాళ్లకి కలగదు.

యేదో వ్యాకులం కలిగించేదే జరిగి వుంటుందని వ్రాన్‌స్కీకి అనిపించింది. కాని అదే మిటైందీ తెలియక యాతన పడిపోయేడు. యేదో కాస్తేనా తెలుస్తుందనే ఉద్దేశంతో అన్నగారు వున్న బాక్సుకేసి వెళ్లేడు. కావాల్నికి అన్నా బాక్సుకి యెదురుగా బయటికి పోయేందుకు వున్న దారిని పట్టుకున్నాడు. అతనికి గుమ్మం దగ్గర లోగడ తన రెజిమెంట్ కమాండర్‌గా వున్నతను కనిపించేడు. అతను యెవళ్లో యిద్దరు మిత్రులతో మాట్లాడుతూ నుంచున్నాడు. వాళ్లు కరేనిన్ దంపతుల గురించి మాట్లాడుకోవడం వ్రాన్‌స్కీ చెవిని పడింది. రెజిమెంట్ కమాండర్ అర్థవంతంగా తన మిత్రులకేసి చూపు విసిరి తనని యెంత హడావుడిగా బిగ్గరగా పలకరించిందీ అతను గమనించేడు.

"హేయ్! వ్రాన్‌స్కీ! రెజిమెంట్‌కి యెప్పుడు వస్తున్నావ్? పార్టీ యివ్వకుండా వెళ్ల నివ్వం! మా పాత పాత మిత్రుల్లో వాడివి నువ్వు!" అన్నాడు రెజిమెంట్ కమాండర్.

"అబ్బే! యిప్పుడు కుదరదు. యీ సారి వచ్చినప్పుడు" అని చెప్పి వ్రాన్‌స్కీ గబగబ పరిగెడుతూ మెట్లు యెక్కి అన్నగారి బాక్సు దగ్గరికి వెళ్లేడు.

వ్రాన్‌స్కీ తల్లి, వెండి ఉంగరాల జుట్టు వృద్ధ కౌంటెస్, బాక్సులో వుంది. బయట నడవలో వార్యా, ప్రిన్సెస్ సొరోకినా అతనికి కనిపించేరు.

ప్రిన్సెస్ సొరోకినాని వార్యా లోపలికి తల్లి దగ్గరికి తీసుకెళ్లి మరిదికి చెయ్యి అందించింది. వెంటనే అతని మనసులో వున్న దాన్ని గురించి మాట్లాడ్డం మొదలు పెట్టింది. ఆమె యెప్పుడోగాని అంత ఆవేశంగా వుండదు.

"యిది చాలా హేయం, నీచం, నా దృష్టిలో. Madame కర్తాసొవాకి అలా చేసే హక్కు లేదు. Madame కరేనినా -- " అని ఆమె మొదలుపెట్టింది.

"కాని యేం జరిగింది? నాకేం తెలీదు."

"యేమిటి నువ్వేం వినలేదా?"

"అందరికంటే ఆఖర్న తెలిసేది నాకే అని నీకు తెలుసు కదా?"

"ఆ కర్తాసొవ్ భార్య కంటే పాడు మనిషి యెవళ్లన్నా వుంటారా?"

"యింతకీ ఆమె యేం చేసిందని?"

"మీ అన్నయ్య చెప్పారు. ఆమె అన్నాని అవమానించిందట. పక్క బాక్స్‌లో వున్న వాళ్లాయన అన్నాతో మాట్లాడ బోయేటప్పటికి ఆవిడ రాద్ధాంతం చేసేసిందట. అవమానించే మాటలు యేవో గట్టిగా అరుస్తూ అందట. అని అక్కడినుంచి చక్కా పోయిందట."

"కౌంట్, మీ అమ్మగారు పిలుస్తున్నారు" అని ప్రిన్సెస్ సారోకినా గుమ్మం వెనకనుంచి కేకేసింది.

"నువ్వు వస్తావని చూస్తున్నాను" అని తల్లి హేళనగా అంది. "బొత్తిగా నల్ల పూసై పోయేవు" అంది.

ఆమె సంతోషంతో చిందులు తొక్కే చిరునవ్వుని అణుచుకోలేకుండా వుందని అతను గమనించేడు.

"బాగున్నారా maman! నేను మీ దగ్గరికే వస్తూ వున్నా" అని అతను జడంగా అన్నాడు.

"నువ్వు faire la cour à madame Karenine[1] వెళ్లవేం?" అని ఆమె ప్రిన్సెస్ సారోకినా బయటికి వెళ్లగానే అంది. "Elle fait sensation. On oublie la Patti pour elle[2]" అంది.

"Maman, యీ విషయం గురించి నాతో మాట్లాడవద్దని మీకు చెప్పాను" అని అతను ముఖం ముడుచుకుని అన్నాడు.

"అందరూ అనే ముక్కే నేనూ అన్నాను."

వ్రాన్‌స్కీ యేం జవాబు చెప్పలేదు. ప్రిన్సెస్ సారోకినాతో కాసేపు మాట్లాడి వెళ్లి పోయేడు. గుమ్మంలో అతనికి అన్నగారు కనిపించేడు.

"అరె, అలెక్సేయ్ యెంత రోతగా వుంది! ఆవిడో మూర్ఖురాలు, అః! నేను అన్నా దగ్గరికి వెడదా మనుకుంటున్నానిప్పుడే. పద, వెడదాం" అన్నాడు.

వ్రాన్‌స్కీ అతని మాటలు వినిపించుకోవడం లేదు. గబగబ మెట్లు దిగిపోయేడు. తను యేదో వొకటి చెయ్యాల్సి వుందని అతనికి అనిపించింది కాని యేం చెయ్యాలో తెలీలేదు. అన్నా తనని ఛండాలమైన పరిస్థితుల్లోకి తోసింది. తనూ ఆ పరిస్థితిలో పడింది. అందుకు అతనికి అన్నామీద కోపం వచ్చింది. కాని మళ్లీ వెంటనే ఆమె యెంత బాధ పడిపోతోందో అనిపించి జాలీ కలిగింది. అతను కింది స్టాల్‌కి వెళ్లేడు, ఆమె బాక్స్ ముందు ఆగేడు. బాక్స్ పక్కన స్త్రెమొవ్ నుంచుని అన్నాతో మాట్లాడుతున్నాడు.

---

[1] మదాం కరేనినా సేవకి (ఫ్రెంచి).

[2] ఆమె కుతూహలం రేకెత్తించేస్తోంది. ఆవిడ కారణంగా జనం గాయకి పత్తీని గురించి కూడా మర్చిపోతున్నారు (ఫ్రెంచి).

"మంచి గాయకులిప్పుడు లేరు. Le moule en est brisé.[1]"

వ్రాన్‌స్కీ ఆమెకి అభివాదం చేసి స్త్రేమొవ్‌కి నమస్కారం చేసి ఆగేడు.

"మీరు ఆలస్యంగా వచ్చినట్టున్నారు. యెంత మంచి కృతి వినలేకపోయేరు!" అని ఆన్నా, యెత్తిపొడుపు చూపులాగా వ్రాన్‌స్కీకి అనిపించినట్టు చూస్తూ అంది.

"నాకు సంగీతం గురించి బాగా తెలీదు" అని ఆమెకేసి కటువుగా చూస్తూ అన్నాడు వ్రాన్‌స్కీ.

"ప్రిన్స్ యాష్విన్‌లాగా" అని ఆమె చిరునవ్వు నవ్వుతూ అంది. "పత్తీ మరీ తార స్థాయిలో పాడుతోందంటాడు" అంది.

"కృతజ్ఞతలు" అని కింద పడిన ప్రోగ్రాం కాగితాన్ని వ్రాన్‌స్కీ యెత్తి అందించి నప్పుడు గ్లవ్ తొడుక్కున్న చేత్తో దాన్ని తీసుకుంటూ అంది. ఆ క్షణంలో వున్నట్టుండి ఆమె అందమైన ముఖం కంపించింది. ఆమె లేచి బాక్స్ వెనక్కి వెళ్ళిపోయింది.

రెండవ అంకం మొదలైనప్పుడు ఆన్నా బాక్స్ ఖాళీగా వుండడం వ్రాన్‌స్కీ చూశేడు. వొక "కవాతీనా" లఘు గీత స్వరం ఆలాపన అవుతుండగా శాంతించిన జనంలోనుంచి, అబ్బ, హుష్ అని కోపంతో సన్నగా గొణుక్కునే జనంలోనుంచి, స్టాల్స్ బయటికి వచ్చేడు. హోటెల్‌కి వెళ్ళిపోయేడు.

ఆన్నా అప్పటికే గదికి చేరుకుంది. వ్రాన్‌స్కీ ఆమె గదిలోకి వెళ్ళేటప్పటికి ఆమె థియేటర్‌కి వెళ్ళిన అదే గౌనుతో వొంటరిగా వుంది. గోడ వార వున్న చేతుల కుర్చీలో కూర్చుంది. అతనికేసి వో సారి చూసి మళ్ళీ ముందటిలాగానే కూర్చుండి పోయింది.

"ఆన్నా" అన్నాడు వ్రాన్‌స్కీ.

"నీది! తప్పంతా నీదే!" అని లేస్తూ అరిచింది. కోపం, హతాశ పెన వేసుకు రాగా కళ్ళ నీళ్ళు తరుగుతూ వుంటే ఆమె కంఠం రుద్ధమైపోయింది.

"నువ్వు వెళ్ళద్దు అని బతిమలాడేను, నాకు తెలుసు నీకది కొంచెం యిబ్బందిగా వుంటుందని..."

"యిబ్బంది?" అని ఆమె చించుకుంది. "ఘోరం! నా బొందిలో ప్రాణం వుండగా మర్చిపోలేను. నా పక్కన కూర్చోవడం తనకి తన వంపులట, తనంది!"

"యేదో మూర్ఖురాలి మాటలు!" అన్నాడు వ్రాన్‌స్కీ. "కాని అలాంటి పని యెందుకు, జనాన్ని రెచ్చగొట్టే..."

"నీ నిబ్బరం నాకు అసహ్యం! నన్నీ స్థితికి నెట్టకుండా వుండాల్సింది. నువ్వు నన్ను ప్రేమిస్తే గనక..."

---

[1] వాళ్ళ టైం అయిపోయింది (ఫ్రెంచి).

"అన్నా! నా ప్రేమకీ దీనికీ సంబంధం యేమిటి?"

"నేను నిన్ను ప్రేమించినట్టుగా నన్ను నువ్వు ప్రేమించి వుంటే నేను బాధపడ్డట్టుగా బాధపడి వుంటే..." అని అన్నా వ్రాన్స్కీకేసి చూస్తూ బెరుకు బెరుగ్గా అంది.

ఆమెపట్ల వ్రాన్స్కీకి జాలి కలిగింది. దాంతోబాటు కోపమూ వచ్చింది. ఆమెపట్ల తన ప్రేమ గురించి ఆమెకి నమ్మకం కలిగించేడు. ఆ మాటలే ఆమెని శాంతింప చేస్తున్నాయి అని అతనికి అనిపించింది. అతను ఆమెని మాటల్లో తిట్టకపోయినా మనసు లోపల తిట్టు కున్నాడు.

ప్రేమ గురించి వొట్టుపెట్టుకు చెప్పిన మాటలు అతనికి సాదాగా, నోటితో పలకడం లజ్జ కలిగించేటట్టుగా వున్నా, ఆమె ఆబగా అందుకుంది. క్రమక్రమంగా శాంతించింది. యిది జరిగిన వొక రోజుకి యిద్దరి మధ్యా పూర్తి సఖ్యత యేర్పడింది. వాళ్లు పల్లెకి వెళ్లి పోయేరు.

# ఆరవ భాగం

## 1

దాలీ, పిల్లలూ వేసవి సెలవలు పొక్‌రోవ్‌స్కాయె గ్రామంలో చెల్లెలు కిట్టీతో గడిపేరు. దాలీ సొంత జాగీర్లో యిల్లు శిథిలావస్థలో వుంది. వేసవి కాలం తమ దగ్గరికి వచ్చి వుండమని లేవిన్, కిట్టీ ఆమెని బలవంతం చేశేరు. యీ యేర్పాటు చాలా భేషుగ్గా వుంటుందని అబ్లాన్‌స్కీ బలపరిచేడు. కుటుంబంతో కలిసి వేసవి రోజులు పల్లెలో గడపడం కంటే తనకి యెక్కువ సంతోషకరమైంది లేదు కాని ఉద్యోగ విధులు అడ్డం వచ్చి మాస్కో వదల్లేకపోవడం తనకి బాధగా వుందని అబ్లాన్‌స్కీ అన్నాడు. యెప్పుడో వచ్చి వొకటి రెండు రోజులుండి చూసి వెళ్లేవాడు. దాలీ, పిల్లలూ, పంతులమ్మ వచ్చారు. వాళ్లతో బాటుగా కిట్టీ తల్లి కూడా వచ్చింది. కూతురు వోపలేని మనిషీ, మొదటి కాన్పూ కావడంతో ఆమెని కనిపెట్టి వుండడం తన కర్తవ్యంగా ఆమెకి తోచింది. వీళ్లు కాక విదేశాల్లో వున్నప్పుడు కిట్టీకి స్నేహం కలిసిన వారెంకా కూడా వచ్చింది. పెళ్లయాక వచ్చి కిట్టీని చూస్తానని మాట యిచ్చింది ఆమె. యీ వేసవిలో కిట్టీని చూడ్డానికి వచ్చింది. యీ చుట్ట పక్కాలందరూ లేవిన్ భార్య కిట్టీ తరఫు వాళ్లు. లేవిన్‌కి వాళ్లందరి పట్లా యిష్టం వున్నా తన ప్రపంచం – లేవిన్ ప్రపంచం – దాని పరిసరాలు, లేకపోయాయని అతనికి బాధ కలిగింది. "ష్చేర్‌బాత్‌స్కీ తత్వం" అని అతను పిలిచే ఆ వరద అతని ప్రపంచాన్ని ముంచెత్తేసింది. తన బంధువు అని చెప్పి ఆ వేసవిలో తనని చూడవచ్చినవాడు సవతి అన్నగారు కోజ్నిషెవ్ వొక్కడే. అతనేనా కోజ్నిషెవ్ అంశ యెక్కువ ప్రదర్శించేడు గాని లేవిన్ కుదురుని కాదు. అంచేత లేవిన్ ప్రపంచం అనేది బొత్తిగా లేకుండా పోయింది.

యెంతో కాలం ఖాళీగా వున్న లేవిన్ యిల్లు జనంతో కిటకిటలాడిపోయింది. దాదాపు అన్ని గదులూ నిండిపోయాయి. దాదాపు ప్రతి రోజూ వృద్ధ ప్రిన్సెస్ భోజనాల బల్ల దగ్గర యెంతమంది కూర్చున్నారూ అని లెక్కపెట్టి, పద ముగ్గురు గనక వున్నట్టయితే వో మనవణ్నో, మనవరాలినో వేరే బల్ల దగ్గరకి తీసికెళ్లి కూర్చో పెట్టేది. కిట్టీ దీక్షగల గృహిణిలాగా వేసవి కాలం ఆకళ్లకి తృప్తిగా పెట్టేందుగ్గాను తగినన్ని కోళ్లని, టర్కీ కోళ్లని, బాతుల్ని చేపట్టున వుంచుకునేందుకు చాలా తంటాలు పడేది.

కుటుంబం యావత్తూ భోజనాల బల్ల దగ్గర చేరింది. భోజనాల తర్వాత పుట్టగొడుగుల్ని యేరుకోవడానికి యెక్కడికి వెళ్లాలీ అని దాలీ పిల్లలూ, వాళ్ల పంతులమ్మ వారెంకా

అనుకుంటున్నారు. పుట్టగొడుగులకి సంబంధించిన మాటల్లో కోజ్నిషెవ్ జోక్యం చేసుకోవడం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. కోజ్నిషెవ్ పాండిత్యానికి ప్రతివాళ్ళూ అతన్ని గౌరవించడమే కాదు, దాదాపు ఆరాధిస్తారు.

"నన్నూ మీతోబాటు తీసుకెళ్లండి. పుట్టగొడుగులు యేరడం నాకూ సరదా. నాకు మంచి హుషారుగా వుంటుంది" అని వారెంకాకేసి చూస్తూ అన్నాడతను.

"మాకు చాలా సంతోషంగా వుంటుంది" అని వారెంకా సిగ్గుతో యెర్రబడుతూ అంది. కిట్టీ అర్థవంతంగా దాలీకేసి చూసింది. కొద్ది రోజులుగా కిట్టీకి గిలిగింతలు పెట్టే అనుమానం వొకటి వుంది. అది మేధావీ, విద్వాంసుడు అయిన కోజ్నిషెవ్ పుట్టగొడుగుల కోసం వారెంకాతో వెళతానని సూచించడంవల్ల బలపడింది. తను దాలీకేసి చూసిన అర్థవంత మైన చూపుని యెవళ్ళూ గమనించకుండా వుండడం కోసమన్చెప్పి గబగబా తల్లితో మాట్లాడ్డం మొదలుపెట్టింది. భోజనా లయింతర్వాత కోజ్నిషెవ్ కాఫీ కప్పు చేత్తో పట్టుకుని కిటికీ దగ్గర చేరేడు. అంతకు ముందు తమ్ముడితో మాట్లాడుతూ వున్న విషయాన్ని కొనసాగించేడు. గుమ్మంకేసి వో కన్ను వేసే వుంచేడు. అటునుంచే పిల్లలు అడివిలోకి వెళతారు. లేవిన్ అన్నగారి దగ్గర కిటికీ పక్కన చేరి కూర్చున్నాడు.

కిట్టీ భర్త పక్కన నుంచుంది. వాళ్ల నీరస సంభాషణ పూర్తయితే తను యేదో చెపు దామని అనుకున్నట్టు కనిపించింది.

"పెళ్లయేక నువ్వు చాలా మారిపోయేవు. ముందటి కంటే మంచిగానే అనుకో" అని కోజ్నిషెవ్ లేవిన్‌తో అన్నాడు. తమ సంభాషణ నీరసంగానే వుందన్నట్టు కిట్టీకేసి చూసి చిరునవ్వు నవ్వేడు. "కాని పరమ విరుద్ధ భావాల్ని సమర్థించడం మాత్రం ముందటిలాగానే వుంది, మారలేదు" అన్నాడు.

"నుంచోవద్దు, కిట్టీ, నీకు మంచిది కాదు" అని భర్త ఆమెకేసి అర్థవతుగా చూసి ఆమె కోసం కుర్చీ లాగుతూ అన్నాడు.

"సరే, మంచిది, తర్వాత మాట్లాడుకుందాం" అని కోజ్నిషెవ్ పరిగెత్తుకుంటూ వచ్చే పిల్లల్ని చూసి అన్నాడు.

మొదట తాన్యా వచ్చింది. ఆ పిల్ల బిగుతుగా వుండే తొడుగు వేసుకుంది. వో చేత్తో బుట్టని వూపుతూ, వో చేత్తో కోజ్నిషెవ్ టోపీ పట్టుకుని పక్కకి వొంగిపోతూ తిన్నగా కోజ్ని షెవ్‌కేసే పరిగెత్తుకుంటూ వచ్చింది.

ధైర్యంగా కోజ్నిషెవ్ దగ్గరికి వచ్చి, తండ్రి కళ్లలాగే అందంగా వుండే కళ్లు మిలమిల మెరుస్తూ వుండగా అతనికి టోపీ అందించింది. తనే దాన్ని అతనికి పెడదా మన్నట్టుగా అందించింది. కమ్మగా, బెరుగ్గా చిరునవ్వు నవ్వి తన తెగువతనాన్ని కోమలం చేసింది.

"వారెంకా మీ కోసం చూస్తోంది" అంది తాన్యా. కోజ్నిషెవ్ చిరునవ్వుని 'వూం

కానిమ్మన్నట్టుగా' గ్రహించి, వంచిన అతని శిరసుమీద జాగ్రత్తగా టోపీ సర్దుతూ ఆ ముక్క అంది.

వారెంకా పసుప్పచ్చని నూలు గౌను వేసుకుని, తలకి తెల్లని రుమాలు కట్టుకుని గుమ్మం దగ్గర నుంచుంది.

"వస్తున్నా, వస్తున్నా, వారెంకాగారూ" అని కోజ్నిషెవ్ కప్పులో మిగిలిన కాసిని కాఫీ చుక్కలూ గొంతుకలో పోసుకుని జేబురుమాలునీ, సిగరెట్ కేస్‌నీ జేబుల్లో సర్దుకుంటూ అన్నాడు.

"ముచ్చటైన మనిషి, మా వారెంకా! కదూ!" అని కోజ్నిషెవ్ నుంచోగానే కిట్టీ భర్తతో అంది. కోజ్నిషెవ్‌కి వినిపించాలనీ, అతను తప్పకుండా వినాలనీ ఉద్దేశించే ఆమె గట్టిగా అంది. "యెంత ముచ్చటగా వుంది, మురిపించే అందంతో వుంది!" అంటూ "వారెంకా" అని ఆమెని పిలిచింది. "మీరు మిల్లు చక్రాలు దాటివున్న అడివికి వెడతారు కదా? మేమూ అక్కడికి వస్తాం" అంది.

"కిట్టీ, యేమిటి, నువ్వు మర్చిపోతున్నావ్, ఆఁ?" అని అప్పుడు అక్కడికి వచ్చిన వృద్ధ ప్రిన్సెస్ హెచ్చరించింది. "నువ్వు అలా గట్టిగా అరవకూడదు" అంది.

కిట్టీ పిలవడం, వృద్ధ ప్రిన్సెస్ మందలించడం విని వారెంకా గబగబ కిట్టీ దగ్గరికి వచ్చింది. ఆమె నడక వేగం, ఉత్తేజంగా వున్న ముఖంమీద దూసుకుపోయిన అరుణిమ, ఆమె అంతరంగంలో యేదో అసాధారణమైనది జరుగుతోంది అని వెల్లడి చేశాయి. ఆ అసాధారణమైంది యేమిటో కిట్టీకి తెలుసు. అందుకని వారెంకాని వో కంట కనిపెట్టి వుంది. భోజనాల తర్వాత అడివిలో అతిముఖ్యమైంది జరుగుతుంది అని తను వూహించిన ఆ సంఘటనకి మౌన ఆశీస్సు అందిద్దామనే కిట్టీ యిప్పుడు వారెంకాని పిలిచింది.

"వారెంకా, వొక సంగతి జరిగితే నాకు చాలా సంతోషంగా వుంటుంది" అని ఆమెని ముద్దుపెట్టుకుంటూ, చెవిలో చెప్పింది కిట్టీ.

"మీరూ మాతో వస్తున్నారా?" అని వారెంకా ఆమె మాట విననట్టు నటిస్తూ యిబ్బంది పడి లేవిన్‌ని అడిగింది.

"నూర్పిడి కళ్లందాకా. అక్కడ దిగడిపోతాను."

"అక్కడేముంది పని?" అని కిట్టీ అడిగింది.

"కొత్త బళ్లని చూడాలి. యెంత బరువు యెక్కించచ్చో చూడాలి" అంటూ "నువ్వెక్కడుంటావ్?" అని లేవిన్ అడిగేడు.

"వరండాలో."

## 2

ఆడవాళ్లందరూ వరండాలో చేరారు. మామూలుగా వాళ్లు భోజనాల తర్వాత అలా అక్కడ చేరుతూ వుంటారు. యివాళ అలా చేరడానికి ప్రత్యేక కారణం వుంది. పుట్ట

బోయే బిడ్డ కోసం బట్టలు కుట్టి, పాత్తిగుడ్డలు తయారు చేసే పనితోబాటుగా యివాళ వాళ్లు వో కొత్త పద్ధతిలో జామ్ తయారు చేసే పనిలో వున్నారు. అగాఫ్యా మిహైలొవ్నా నీళ్లు కలిపి జామ్ తయారు చేస్తుంది. యీ కొత్త పద్ధతి అలా కాదు. కిట్టీ తన పుట్టింట్లో పద్ధతిని యిక్కడ ఆచరణలో పెట్టింది. అప్పటిదాకా అగాఫ్యా మిహైలొవ్నాయే జామ్ తయారు చెయ్యడం బాధ్యత వహించేది. లేవిన్‌ల యింట్లో యేం చేసినా సజావుగానే చేస్తారన్న భావనతో వేరే పద్ధతిలో జామ్ కుదరదని అనుకుంటూ స్ట్రాబెర్రీల జామ్‌లో యెవళ్లూ చూడకుండా నీళ్లు పోసేసింది. ఆ పని చేసినందుకు పట్టుబడి పోయింది. యిప్పుడు అందరూ వుండగానే జామ్ తయారుచెయ్యడం మొదలుపెట్టారు. నీళ్లు పొయ్యకుండా రాస్ప్‌బెర్రీల జామ్ తయారు చేస్తున్నారు. నీళ్లు లేకుండా జామ్ యెలా తయారు చెయ్యవచ్చో అగాఫ్యా మిహైలొవ్నా స్వయానా చూడాలి మరి.

అగాఫ్యా మిహైలొవ్నా జుట్టు రేగిపోయి ముఖం ముడుచుకుని, యెర్రబడి పోయి మోచేతుల పై కంటా గౌను చేతులు మడుచుకుని బొగ్గుల కుంపటిమీద పెనాన్ని చుట్లు తిప్పుతూ వుంది. కళ్లు రాస్ప్‌బెర్రీలకేసే మబ్బుగా లగ్నం చేసి చూస్తూ వుంది. జామ్ కుదరకుండా అవి గట్టిపడిపోతే బాగుండునురా దేవుడా అని మనసులో కోరుకుంటూ వుంది. జామ్ తయారు చెయ్యడం కొత్త పద్ధతికి ప్రధాన దర్శకత్వం తన దవడంతో అగాఫ్యా మిహైలొవ్నాకి తన మీద పీకదాకా కసిగా వుంటుందని వృద్ధ ప్రిన్సెస్‌కి తెలుసు. అందుకని వేరే విషయాల మీదకి దృష్టి మళ్లించుకుంటున్నట్టు తను రాస్ప్‌బెర్రీల గురించి పట్టించుకోవడం లేనట్టూ నటించింది. ఆవిడ వేరే విషయాల గురించి మాట్లాడుతూ వుండే గాని కుంపటికేసి మాటి మాటికీ చూస్తూనే వుంది.

"నేను పనిమనుషులకి యెప్పుడు స్వయంగా తగ్గింపు ధరలకి ఫ్రాక్‌లు కొంటాను" అని చెప్పడం మొదలుపెట్టింది ఆవిడ. "చూడమ్మా, తుట్టె తీసెయ్యచ్చేమో" అని అగాఫ్యా మిహైలొవ్నాతో అని, "వద్దమ్మా, నువ్వు సెగ దగ్గరకి రాకూడదు, కుంపటి మరీ వేడిగా వుంది" అంటూ కిట్టీని వారించింది.

"నేను చూస్తాలే" అంటూ దాలీ లేచి మరిగే పంచదార పాకంమీది తుట్టెని జాగ్రత్తగా తీసెయ్యడం మొదలుపెట్టింది. చెంచాకి అంటుకున్న తుట్టెని రాల్చడం కోసం మధ్య మధ్య దాన్ని పళ్లెంలో కొట్టింది. ఆ పళ్లెంలో లేత గులాబీరంగు తుట్టె, దాన్నుంచి దిగే యెర్రని రంగు రంగుల రసం వున్నాయి. 'యెంత యిష్టంగా టీ తాగుతూ నాకుతారు దీన్ని వాళ్లు' అనుకుంది పిల్లల గురించి. జామ్‌లో బాగా వుండే యీ నురుగని పెద్దవాళ్లు యెందుకు తినరో అని తను పిల్లగా వున్నప్పుడు ఆశ్చర్యపోతూ వుండడం ఆమెకి గుర్తు వచ్చింది.

"పనిపిల్లలకి డబ్బులు పడెయ్యడమే మంచిదంటారమ్మా మీ అల్లుడు" అని దాలీ పనివాళ్లకి కానుకలివ్వడం అనే ఆసక్తికరమైన చర్చలో మాట కలుపుతూ అంది. "కాని..."

"డబ్బులెలా యిస్తావ్?" అని ప్రిన్సెస్, కిట్టీ వొక్కసారే అరిచేరు. "బహుమతులైతేనే వాళ్లకి తృప్తి" అన్నారు.

"మాటకి, కిందటేడాది మ్మాత్రోనా సెమ్యోనొవ్నాకి పాప్లిన్ కాకపోయినా అచ్చం పాప్లిన్ లాంటిదాన్నే కొని యిచ్చేను" అంది ప్రిన్సెస్.

"అవును, నాకు గుర్తు వుంది. మీ పేరంటి రోజు* పండక్కి వేసుకుంది."

"యెంత ముచ్చటైన డిజైను వుందో దానిమీద. సాదాగా వుంది కాని చక్కగా వుంది. ఆమెకి అలాంటి ఫ్రాక్ లేకపోయివుంటే నేనే దాన్ని కుట్టించుకుని వుండేదాన్ని. వారెంకా వేసుకుందే, అలాంటి బాపతుది. యెంతో బాగుంది, చవక."

"అయినట్టే వుందేం" అని దాలీ చెంచానుంచి పాకం పళ్లెంలో కారుతూ వుండడం చూస్తూ అంది.

"పాకం వుండకట్టినప్పుడు అయినట్టు లెఖ్ఖ. యింకొంచెం మరగనీమండి, అగాఫ్యా మిహైలొవ్నా."

"అబ్బ! యీ యీగలొకటి సలపాదిలాగా!" అని అగాఫ్యా మిహైలొవ్నా చిరాగ్గా చించుకుంది. "యెలాగైనా అవుతుంది" అని జతచేసింది.

"అయ్! యెంత బాగుంది! దాన్ని బెదిరించకండి" అని కిట్టీ హఠాత్తుగా కమ్మీలమీద వాలిన పిచికని చూస్తూ అంది. ఆ పిచ్చిక రాస్ప్బెర్రీ కాండాన్ని ముక్కుతో పొడుస్తోంది.

"సర్లే, నువ్వు కుంపటికి దూరంగా కూర్చో" అంది ప్రిన్సెస్.

"A propos de వారెంకా[1]" అని కిట్టీ ఫ్రెంచిలో మొదలుపెట్టింది. తాము మాట్లాడుకునే విషయం అగాఫ్యా మిహైలొవ్నాకి తెలియకూడదన్నప్పుడల్లా వాళ్లు ఫ్రెంచిలోనే మాట్లాడుకునేవాళ్లు. "Maman, యివాళ యేదో వొకటి తేలిపోతుందని నేను చూస్తున్న సంగతి మీకు తెలుసు కదా. యేదైందీ మీకు తెలుసు. అబ్బ, యెంత బాగుంటుంది!" అంది.

"సంబంధాలు కుదిర్చే టంతటిదైంది తను!" అంది దాలీ. "యెంత గుట్టుగా, ఆరిందాలా యిద్దర్నీ దగ్గరికి చేర్చిందో చూడండి..."

"Maman, కాని చెప్పండి, మీరేమనుకుంటున్నారు?"

"అనుకోడానికేముంది? ఆయనకి..." (అంటే కోజ్నిషెవ్‌కి) "రష్యాలో ఆణిముత్యం లాంటి పిల్ల దొరుకుతుంది. ఆయనేం పడుచువాడు కాదు కాని యిప్పుడు కూడా ఆయనంటే బోలెడు మంది పెళ్లికావాల్సిన పిల్లలు యెగిరి గంతేస్తూ వస్తా రనిపిస్తుంది నాకు... ఆమె చక్కటి పిల్లే, కాని ఆయనకి..."

"లేదమ్మా, యిద్దరికీ సంబంధించి లోకంలో యింతకంటే మంచి సంబంధం వుండ

---

[1] అన్నట్టు, వారెంకాకి సంబంధించి (ఫ్రెంచి).

దని మీరు అర్థం చేసుకోవడం లేదు. అన్నిటి కంటే యెక్కువ ఆమె చాలా ముచ్చటైన అమ్మాయి'' అని కిట్టీ వేళ్ళు ముడిచి లెక్కపెడుతూ మొదలెట్టింది.

''ఆయనకి ఆమె అంటే చాలా యిష్టంగా వున్నట్టే వుంది'' అని వంత పలికింది దాలీ.

''రెండోది, ఉన్నత సమాజంలో ఆయనకి యెంతో గౌరవం వుంది, అంచేత పెళ్ళాం పేరుమీదా, ఐశ్వర్యంమీదా యింకా పైకి వెళ్ళే అవసరం లేదు. ఆయనకి కావాల్సిందల్లా అనుకూలంగా వుంటూ గొడవా గొష్ఠా లేకుండా సంసారం చేసుకునే చక్కటి యిల్లాలు.''

''అవును, ఆమెతో గొడవా గొష్ఠా లేకుండా వుంటుంది'' అని వంత పలికింది దాలీ.

''మూడవది, యిల్లాలు ఆదరణగా చూడాలి ఆయన్ని. వారెంకా అలానే చూస్తుంది. అబ్బ, యెంత చక్కటి జోడీయో చెప్పలేను. అడివినుంచి వస్తారు, అంతా నిర్ణయమైపోయి వుంటుందనే యెదురు చూస్తున్నాను. కళ్ళతో చూస్తే పట్టేస్తాను. యెంత సంతోషంగా వుంటుంది నాకు! యేమంటావ్, దాలీ?''

''నువ్వు ఆవేశపడకు. నువ్వు ఆవేశ పడకూడదు'' అని తల్లి మందలించింది.

''ఆవేశం లేదమ్మా! యివాళ ఆయన పెళ్లి ప్రస్తావన చేస్తాడనే నాకు అనిపిస్తోంది.''

''యెంత వింత విషయం! మగాళ్ళు యెప్పుడు యెలా పెళ్లి ప్రస్తావన చేస్తారో... దారిలో యేదో అడ్డం వున్నట్టుంది, వున్నట్టుండి అడ్డం పోతుంది'' అని దాలీ సాలోచనగా, అబ్లాన్స్కీతో తన ప్రేమ కలాపం గుర్తువచ్చి చిరునవ్వు నవ్వుతూ అంది.

''అమ్మా, నాన్న మీతో యెలా ప్రస్తావించేరు?'' అని కిట్టీ వున్నట్టుండి అడిగింది.

''లోకంలో లేనిదేం జరగలేదమ్మా, అంతా మామూలుగా వుండేటట్టే'' అని ప్రిన్సెస్ అంది. కాని ఆనాటి సంగతి గుర్తువచ్చి ఆమె ముఖం వెలిగింది.

''సరేననుకోండి, కాని యెలా? ఆయన ఆ ప్రస్తావన చెయ్యక ముందే మీరు ఆయన్ని ప్రేమించి వుంటారు కదా?''

ఆడవాళ్లందరికీ చాలా ముఖ్యంగా వుండే విషయం గురించి తను తల్లితో సమాన హోదాలో మాట్లాడ గలుగుతున్నందుకు కిట్టీకి గొప్ప సంతోషంగా వుంది.

''యేముంది, ప్రేమించాను. మీ నాన్న పల్లెకి మా యింటికి వస్తూ వుండేవారు.''

''కాని అసలు ప్రస్తావన యెలా జరిగింది? అమ్మా?''

''మీ తరం వాళ్లంతా కొత్తగా కనిపెట్టా మనుకుంటున్నారేమో బహుశా, కాని అంతా మామూలుగానే జరుగుతుంది – చూపులతో, చిరునవ్వులతో.''

''యెంత బాగా చెప్పారమ్మా! చూపులతో, చిరునవ్వులతో!'' అని దాలీ వత్తాసు పలికింది.

''కాని నాన్న యే మాటలు అన్నారని?''

''మీ ఆయన యే మాటలు అన్నాడు?''

''తను సుద్దముక్కతో రాశేడు. అబ్బ, అద్భుతం!... యెంతో కాలం గడిచినట్టనిపిస్తోంది నాకు.''

ఆ ముగ్గురు ఆడవాళ్ళూ హాకే విషయం గురించి ఆలోచించడం మొదలుపెట్టేరు. కిట్టీయే మొదట మాట కదలేసింది. ఆమె పెళ్లికి ముందటి శీతకట్టు గురించీ, వ్రాన్స్కీ పట్ల తన వెర్రి వ్యామోహం గురించీ జ్ఞాపకం చేసుకుంది.

"ఒక్కటే వుంది... వారెంకా తొలి ప్రేమ" అని అంది. ఆమె ఆలోచనా ధార సహజంగా యీ విషయం వేపే మళ్లింది. "నేను ఉట్టిపాటున వున్నట్టు కాకుండా వుండేందుకు యీ విషయం కోజ్నిషెవ్‌కి చెప్దామనుకున్నాను. మగాళ్లందరూ" అని ఆమె తక్కన జత చేసింది "మన పూర్వ ప్రేమల పట్ల మహా యీర్ష్యగా వుంటారు."

"అందరూ కాదు" అంది దాలీ. "నువ్వు మీ ఆయన్ని దృష్టిలో వుంచుకుని అలా అంటున్నావు. అతనింకా వ్రాన్స్కీని గుర్తు చేసుకుని బాధ పడుతూనే వుంటాడు. యేం, కాదంటావా? యదార్థం చెప్పు" అంది.

"అవును" అని కిట్టీ కళ్లల్లో సాలోచనాత్మక మందహాసం తెచ్చి పెట్టుకుంటూ అంది.

"అయినా నాకర్థం కాదు" అంటూ కూతుర్ని తను చక్కగా పెంచానన్నట్టు తెలియజేస్తున్నట్టుగా ప్రిన్సెస్ మొదలెట్టి "నువ్వేం తప్పు చేశావని అతనికి బాధ కలగాలి?" అంది. "వ్రాన్స్కీ నీ కూడా కూడా తిరిగాడనా? సరే, అలాంటిది ప్రతి ఆడపిల్లకీ వుంటుంది" అంది.

"కాని అమ్మా, మనం ఆ విషయం గురించి కాదు కదా మాట్లాడుకుంటూ వుంట" అని కిట్టీ సిగ్గుతో యెర్రబడుతూ అంది.

"వుండు, నన్ను చెప్పనీ అమ్మా" అంది ప్రిన్సెస్. "నువ్వే నన్ను వ్రాన్స్కీతో మాట్లాడనివ్వలేదు. గుర్తుందా?"

"అబ్బ! అమ్మా!" అంది కిట్టీ. ఆమె ముఖంలో బాధ కనిపించింది.

"యీ రోజుల్లో మీ బోటి పిల్లల్ని గిరిగీసి కూర్చోపెట్టడం కుదురుతుందా... అయినా మీ సంబంధాలు హద్దు మీరలేదు కదా. నేనే అతన్ని నిలదీసి వుండేదాన్ని. సర్లే, నువ్వు ఉద్రేకపడకూడదు జాగ్రత్త. ఆ విషయం మర్చిపోకు, శాంతంగా వుండు" అంది.

"నేను యేం ఉద్రేకపడ్డం లేదు, maman."

"కిట్టీ అదృష్టం యెంత బాగుంది, సరిగ్గా అన్నా అప్పుడే నన్ను చూడ్డానికి వచ్చింది" అంది దాలీ. "ఆమెకి యెంత దురదృష్టం కలిగిందో చూడు. మరిప్పుడు ప్రతీదీ తల కిందులై కూర్చుంది" అని తనకి తట్టిన వూహకి చకితురాలైంది. "అప్పుడు అన్నా సంతోషంగా వుండేది, కిట్టీ విచారంగా వుండేది. యిప్పుడు ఉల్టా అయింది. అన్నా గురించే యెప్పుడూ అనుకుంటూ వుంటా" అంది.

"అయ్యో అనుకోవద్దూ మరి! పాపిష్టి, రోత మనిషి! అసలు మనసంటూ వుందా ఆమెకి?" అంది తల్లి, కిట్టీ వ్రాన్స్కీని గాక లేవిన్‌ని పెళ్లి చేసుకుందే అనే విషయాన్ని మర్చిపోలేకుండా వుందావిడ.

"యెందుకా విషయం గురించే మాట్లాడతారు?" అంది కిట్టీ చిరాగ్గా. "నేను దాన్ని గురించి ఆలోచించను, ఆలోచించదలచుకోలేదు.... వుహూఁ, ఆలోచించదలచుకోలేదు" అని ఆమె పరిచితమైన భర్త అడుగుల చప్పుడు వరండాలో వినిపించి రెట్టించింది.

"దేన్ని గురించి ఆలోచించదలచుకోలేదు?" అని వరండాలోకి వస్తూ లేవిన్ అడిగేడు.

యెవళ్లూ జవాబు చెప్పలేదు, అతను రెట్టించి అడగనూ లేదు.

"నేను మీ ఆడ ప్రపంచంలోకి చొరబడ్డానేమో, యేమీ అనుకోకండి" అని అందరి కేసీ కొంచెం నొచ్చుకుంటున్నట్టు చూశేడు. తన సమక్షంలో ప్రస్తావించలేని విషయం గురించి వాళ్లు మాట్లాడుకుంటూ వున్నారని గ్రహించేడు.

నీళ్లు పొయ్యకుండా జామ్ తయారు చేస్తున్నారనీ, ష్చేర్‌బాత్‌స్కీల పరాయి ప్రభావం తమ యింట్లో ప్రసరిస్తోందనీ అది బాగా లేదనీ అగాఫ్యా మిహైలొవ్నాలాగా అతనికీ వో క్షణం సేపు అనిపించింది. కాని చిరునవ్వు నవ్వుతూ కిట్టీ దగ్గరికి వెళ్లేడు.

"వూఁ, యెలా వుంది నీకు?" అని యిప్పుడు అందరూ ఆమెని చూసేటట్టుగా చూస్తూ, అడిగేడు.

"దివ్యంగా వుంది!" అంది కిట్టీ చిరునవ్వు నవ్వుతూ. "వూఁ, నీ పనేమైంది?" అని అడిగింది.

"కొత్త బళ్లు పాత వాటి కంటే మూడు రెట్లు యెక్కువ సరుకు మోస్తాయి. యేం, మనం పిల్లల దగ్గరి కెడదామా? గుర్రాల్ని కట్టమని చెప్పేను."

"యేమిటీ! కిట్టీని గుర్రం బండిలో తీసుకెడదా మనుకుంటున్నావా యేమిటి?" అని ప్రిన్సెస్ మందలిస్తున్నట్టుగా అంది.

"గుర్రాల్ని నడిపిస్తూ తోలిద్దాం, ప్రిన్సెస్."

లేవిన్ ఆవిడ్ని యెప్పుడూ అల్లుళ్లందరూ పిలిచినట్టు maman అని పిలవలేదు. ఆవిడకది కష్టంగా వుండేది. కాని ఆవిడ పట్ల అభిమానం గౌరవం వున్నా అలా maman అని ఆవిడ్ని పిలవడం తన తల్లి స్మృతికి అవమానం చెయ్యడమేనని అతనికి అనిపించేది.

"మాతో రండి, maman" అంది కిట్టీ.

"యిలాంటి దుడుకు వాటిల్లో నేను కలగ చేసుకోనమ్మా."

"అయితే నేను నడిచే వెడతా. నాకది బాగుంటుంది" అని కిట్టీ లేచి నుంచుంటూ భర్త చేతిని పట్టుకుంది అంది.

"మంచిదే కావచ్చు, కాని ప్రతిదానికి హద్దు వుంటుంది" అంది ప్రిన్సెస్.

"వూఁ, అగాఫ్యా మిహైలొవ్నా, జామ్ తయారైందా?" అని లేవిన్ ఆమెకి ఉత్సాహం కలిగించాలన్న ఆశతో చిరునవ్వు నవ్వుతూ అడిగేడు. "యేం కొత్త పద్ధతి బాగా వుందా?" అని అడిగేడు.

"కొంతమందికి బాగానే వుంటుందేమో మరి. మన పద్ధతిలో అయితే యెక్కువ ముద్ద కడుతుంది."

"అలా వుంటేనే మంచిది అగాఫ్యా మిహైలొవ్నా, పాడవదు. మన మంచు కొట్లో మంచు కరిగిపోయింది మరి యెక్కడ నిలవ చేస్తాం?" అని కిట్టీ, భర్త యేమనుకుంటూ వున్నదీ వూహించి ఆమెకి ఉత్సాహం కలిగించాలన్న ఆశతోనే అంది. "మరి వూరగాయల విషయానికి వస్తే మీరు పెట్టిన వూరగాయల్లాంటి వాటిని తినేప్పుడూ రుచి చూడలేదని అమ్మ అంటుంది. అంత బాగా వుంటాయి మీ ఊరగాయలు" అని కిట్టీ చిరునవ్వు నవ్వుతూ ఆ ముసలామె తలమీది రుమాలు సర్దుతూ అంది.

అగాఫ్యా మిహైలొవ్నా కిట్టీకేసి చురచుర చూసింది.

"నన్ను బుజ్జగించక్కర్లేదు, చిన్నమ్మా. అతనితో కలిసి మిమ్మల్ని చూస్తే నా మనసుకి నిండుగా వుంటుంది చాలు" అంది. 'ఆయనతో కలిసి' అనకుండా 'అతనితో కలిసి' అని చనువు మాటలు అనడం కిట్టీ మనసుకి హత్తుకుంది.

"మాతోబాటు పుట్టగొడుగులు యేరడానికి రండి. అవి బాగా యెక్కడ దొరుకుతాయో మీరు చూపించగలరు" అంది కిట్టీ.

అగాఫ్యా మిహైలొవ్నా వూరికే చిరునవ్వు నవ్వింది, తల వూపింది. 'మీమీద సంతోషంగా కోపం తెచ్చుకుంటాను, కాని అలా చెయ్యలేను' అని ధ్వనించేటట్టు.

"నా మాట వినండి" అంది ప్రిన్సెస్. "జామ్‌మీద రమ్‌లో ముంచిన కాగితం కప్పండి. మంచు లేకపోయినా అది బూజుపట్టదు" అంది.

## 3

భర్తతో వొంటరిగా వుండే అవకాశం వచ్చినందుకు ముఖ్యంగా కిట్టీకి సంతోషంగా వుంది. యెందుకంటే అతను వరండాలోకి వచ్చి, యేం మాట్లాడుకుంటున్నారని అడిగినప్పుడు తామెవ్వరూ జవాబు చెప్పలేదు, అప్పుడతని మనసులో కలిగిన అసంతృప్తి ఛాయ ముఖం మీద ప్రతిబింబించడం ఆమె గమనించింది.

వాళ్లు మిగతా వాళ్ల కంటే ముందు వెళ్లారు. యిల్లు కనుమరుగైపోయి దుమ్ము కొట్టుకుపోయిన యెగుడుదిగుడు రాస్తామీదకి వచ్చేరు. ఆ రాస్తామీద రై గింజలు, కంకులు చెదిరిపడి వున్నాయి. ఆ రాస్తామీదకి వచ్చేక ఆమె అతని చేతిమీదకి ఆనుకుని గట్టిగా అదుముకుంది. లేవిన్ తనకి కలిగిన క్షణిక అసంతృప్తిని పూర్తిగా మర్చిపోయేడు. యిప్పుడు, ఆమె గర్భవతి అన్న స్పృహ లిప్తకాలం కూడా మస్తిష్కంలోనుంచి తొలిగిపోకుండా వున్నప్పుడు, తను ప్రేమించే స్త్రీ సాన్నిహిత్యంలో అతను వొక నూతన గాఢానురక్తి సుఖద భావనని పొందేడు. ఆ అనుభూతి కామవాసనా విముక్తమైనటువంటిది. చెప్పవలసిన మాటలు యేమీ లేవు.

కాని కిట్టీ గొంతుక వినాలని అతనికి అనిపించింది. గర్భవతి అయేక ఆమె కళ్లల్లో మార్పు వచ్చినట్టే ఆమె గొంతుకా మారింది. కిట్టీ గొంతుకలోనూ, చూపులోనూ వొక కోమలత్వం, గంభీరత వచ్చేయి. యేదేనా వొక ప్రియమైన కార్యంమీద స్థాయీ రూపంలో ధ్యానం కేంద్రితం చేసే వాళ్లకే అలాంటివి వుంటాయి.

"అలిసిపోయినట్టు లేదు కాదా? యింకొంచెం గట్టిగా నామీద ఆనుకో" అన్నాడు లేవిన్.

"లేదు, నీతో వొంటరిగా వుండడం బాగుంది. అందరూ వున్నప్పుడు యెంత బాగా వున్నట్టనిపించినా మనిద్దరం గడిపిన శీతకట్టు సాయంత్రాలు వుంటేనే యెంతో బాగుంటుందనిపిస్తుంది నాకు."

"అవీ బాగున్నాయి, యివి యింకా బాగున్నాయి. రెండూ బాగున్నాయి" అని కిట్టీ చేతిని అదుముతూ అన్నాడతను.

"నువ్విందాకా వచ్చినప్పుడు మేమేం మాట్లాడుకుంటున్నామో తెలుసా?"

"జామ్ గురించా?"

"జామ్ గురించి సరేననుకో. మగాళ్లు యెలా పెళ్లి ప్రస్తావన చేస్తారో అనే విషయం గురించి మాట్లాడుకుంటున్నాం."

"అలాగా!" అన్నాడు లేవిన్. అతను ఆమె చెప్పే మాటల కంటే యెక్కువగా ఆమె గొంతుక వింటున్నాడు. దారిలో గొప్పలూ గోతులూ వున్నాయేమోనని జాగ్రత్తగా చూస్తున్నాడు, ఆమె తొట్రుపడకుండా. వాళ్లు అడివిలోకి చేరారు.

"కోజ్నిషెవ్ గురించీ, వారెంకా గురించీ అనుకుంటున్నాం. నువ్వు గమనించేవా? అలా జరిగితే బాగుంటుంది అని నా తపన" అంది. "యేమంటావ్?" అని అతని ముఖంలోకి గుచ్చి చూసింది.

"యేమనుకుంటున్నానో చెప్పలేను" అని లెవిన్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. "యీ విషయంలో అన్నయ్య యేం అంతుబట్టడు. నీకు చెప్పాను గదా..."

"ఆయన యెవరో అమ్మాయిని ప్రేమించారనీ, ఆమె చనిపోయిందనీ..."

"అది నేను చిన్నపిల్లాడిగా వున్న నాటి మాట. ఆ విషయమేనా నేను యెవళ్లో చెప్పగా విన్నదే. అన్నయ్య అప్పుడెలా వుండే వాడో నాకు గుర్తు వుంది. చాలా సౌమ్యంగా వుండేవాడు. అప్పట్నుంచీ ఆయన ఆడవాళ్లతో యెలా వుండేదీ గమనించేవాణ్ని. ఆడవాళ్ల పట్ల మర్యాదగా వుంటాడు, కొంతమంది ఆడవాళ్లంటే ఆయనకి యిష్టం. అయినా వాళ్లెవరూ ఆయనకి ఆడవాళ్లు కారు, వూరికే మనుషులు అనే నాకు యెప్పుడూ అనిపించేది."

"కాని వారెంకా విషయంలో... ఆయన యేదో భావిస్తున్నట్టే కనిపిస్తోంది..."

"బహుశా కావచ్చు... కాని అన్నయ్యని గురించి తెలుసుకుని వుండడం అవసరం... ఆయన చాలా అసాధారణ, అద్భుత వ్యక్తి. ఆయనకి తెలిసిన జీవితం అల్లా బౌద్ధిక జీవితమే. ఆయన చాలా నిర్మలినుడు, ఉన్నతుడు."

"దానివల్ల ఆయన స్థాయి దిగిపోతుందంటావా?"

"అహెఁ, అది కాదు. ఆయన బౌద్ధిక జీవితానికి అలవాటు పడ్డాడు. లౌకిక జీవితంతో రాజీ పడలేదు. మరి వారెంకా అంటే లౌకిక జీవితమే కదా."

లేవిన్ తన మనసుకి తట్టినట్టుగా ఆలోచనల్ని వ్యక్తం చెయ్యడానికి అలవాటు పడి పోయేడు. సరైన పదాల్ని యెంచుకుని చెప్పే ప్రయత్నం చేసేవాడు కాదు. అప్పుడు తాము వున్న లాంటి అనురాగపూరిత క్షణాల్లో సూచన మాత్రంగా చెప్పినా తన అర్ధాంగి అర్థం చేసుకుంటుందని అతనికి తెలుసు. ఆమె అర్థం చేసుకునేది.

"కాని ఆమె నాకులాంటి లౌకికమైన మనిషి కాదు. ఆయన నన్ను ప్రేమించరని నాకు తెలుసు. మరి వారెంకా ఆత్మికుల్లో ఆత్మికురాలు."

"అలా అనకు, ఆయన నిన్ను ప్రేమిస్తాడు, నాకు చాలా సంతోషంగా వుంది, మా బంధువు లందరికీ నువ్వు యిష్టమే."

"ఆయన నా పట్ల చాలా దయగా వుంటారు కాని..."

"కాని నికొలాయ్ అన్నయ్యలా కాదు. మీకు పొకళ్లంటే పొకళ్లకి యిష్టం కలిగింది" అన్నాడు లేవిన్. "యేం ఆ విషయం గురించి మాట్లాడుకోవచ్చుగా" అన్నాడు. "ఒకో అప్పుడు నన్ను నేనే తిట్టుకుంటూ వుంటాను. నేనతన్ని ఆఖరికి మర్చిపోతానేమోనని భయం వేస్తుంది. అబ్బ, యెంత భయంకరమైన అద్భుతమైన వ్యక్తి అతను... ఆఁ, మనం దేన్ని గురించి మాట్లాడుకుంటున్నాం?" అని కాసేపాగి అడిగాడు.

"ఆయన యెవర్నీ ప్రేమించలేడు అనేనా నీ అభిప్రాయం?" అని కిట్టీ అతని వూహ లకి వాగ్రూపం యిస్తూ అంది.

"ప్రేమించలేడంటే ప్రేమించలేడని కాదు" అని లేవిన్ చిన్నగా నవ్వుతూ అన్నాడు. "అందు కవసరమైన దౌర్బల్యం ఆయనకి లేదు... వూఁ, నాకెప్పుడూ ఆయనంటే ఈర్ష్యగానే వుండేది, యిప్పుడు కూడా, యింత ఆనందంగా నేను వున్నప్పుడు కూడా ఆయనంటే నాకు ఈర్ష్యగా వుంది" అన్నాడు.

"ఆయన ప్రేమించలేడు కాబట్టి ఈర్ష్యగా వుందా?"

"కాదు, ఆయన నా కంటే బాగా వున్నందుకు" అని లేవిన్ చిన్నగా నవ్వేడు. "ఆయన తన కోసం బతకడం లేదు. ఆయన జీవితం విధి నిర్వహణకి అంకితం అయిపోయింది. అందు కనే ఆయన శాంతంగా, సంతృప్తిగా వుంటాడు" అన్నాడు.

"మరి నువ్వు?" అని కిట్టీ యెతికుతంగానే కాని ప్రేమగా చిరునవ్వు నవ్వుతూ అంది.

తనని చిరునవ్వు నవ్వేటట్టు చేసిన ఆలోచనా ధారని ఆమె వివరించగలిగి వుండేది కాదు. కాని అన్నగార్ని అందలం యెక్కిస్తూ తనని తగ్గించుకోవడంలో భర్త నిష్కపటంగా లేడన్న తీర్మానానికి మాత్రం వచ్చింది. అన్నగారి పట్ల ప్రేమవల్ల, తను పరమానందంగా వున్నాడన్న స్పృహవల్ల, మరీ ముఖ్యంగా, యింకా బాగా వుండాలన్న నిరంతర, నిరవద్య కామన

వల్ల అతను నిష్కపటంగా వుండలేకపోతున్నాడని కిట్టీకి తెలుసు. అతనిలో ఆ సుగుణాన్నే కిట్టీ ప్రేమించింది, అందుకనే చిరునవ్వు నవ్వింది.

"మరి నువ్వు? నీకెందుకు అసంతృప్తి?" అని ఆమె ఆదే చిరునవ్వు నవ్వుతూ అంది.

తనకి అసంతృప్తిగా వుందన్న మాట ఆమె నమ్మనందుకు అతనికి సంతోషంగానే వుంది. ఆమె యెందుకు నమ్మలేదో అతను అప్రయత్నంగా రాబట్టేడు.

"నేను సంతోషంగానే వున్నాను, కాని నా పట్ల నాకు అసంతృప్తిగా వుంది" అన్నాడు.

"సంతోషంగా వుంటే అసంతృప్తిగా యెలా వుంటావు?"

"యెలా చెప్పను?... నాకు యింతకంటే యెక్కువ యేమీ అక్కర్లేదు, మాటకి, నువ్విప్పుడు తొట్రుపడకుండా వుండాలి. చూడు, నువ్వలా యెగిరి గంతులెయ్యకూడదు" అని మాట మార్చి, దారిలో అడ్డంగా వున్న దుంగమీదనుంచి ఆమె దాటబోవడం చూసి అన్నాడు. "కాని నేను నా విషయం గురించి ఆలోచించుకుంటూ యితరులతో పోల్చుకున్నప్పుడు, ముఖ్యంగా అన్నయ్యతో, నేను పనికి రానని అనిపిస్తుంది" అన్నాడు.

"యెందుకని?" ఆమె యింకా చిరునవ్వు నవ్వుతూనే అంది. "నువ్వు కూడా యితరుల కోసం పని చెయ్యడం లేదా? నువ్వు చేసే పొలంపని, రైతులతో పని, నీ పుస్తక రచన?" అంది.

"కాదు, నాకు అలా అనిపిస్తుంది ముఖ్యంగా యిప్పుడు. అందుకు కారణం నువ్వు" అని అతను కిట్టీ చేతిని అదుముతూ అన్నాడు. "నేనా పనులన్నీ అర్ధమనస్కంగా చేస్తున్నాను. నేను నిన్ను ప్రేమించినట్టుగా పనిని ప్రేమించినట్లయితే... కాని కొంత కాలంగా బడి పిల్లాడు యింటి దగ్గర చెయ్యాల్సిన లెక్కలు చేసినట్టుగా చేస్తున్నాను" అన్నాడు.

"అలా చూస్తే నాన్నగారి గురించి యేమంటావ్? ఆయన నలుగురి మంచి కోసం యే పనీ చెయ్యడం లేదు" అంది కిట్టీ.

"మీ నాన్నగారా? లేదు. కాని యిందుగ్గాను మీ నాన్నగారిలా మంచితనం, సౌమ్యత, సారళ్యం వుండాలి. కాని నాకు అవి వున్నాయా? నేనేమీ చెయ్యడం లేదు, నాకది మహా బాధగా వుంది. యిదంతా నీ తప్పే. నువ్వు, యిదీ" అంటూ అతనామె గర్భంకేసి చూశేడు, ఆమె దాని అర్థం గ్రహించింది, "లేనప్పుడు నేను యావచ్ఛక్తినీ పనిమీద లగ్నం చేసేవాణ్ణి. కాని యిప్పుడు చెయ్యలేను, అందుకు గాను నా అంతరాత్మ క్షోభ పెడుతోంది. యేదో బడి పిల్లాడు యింటి దగ్గర లెక్కలు చేసినట్టుగా చేస్తున్నాను. బడాయికి..."

"అయితే నువ్వు బావగారి స్థానంలోకి వెళ్లి ఆయిన్ని నీ స్థానంలోకి రానిచ్చు కుంటావా? ప్రజాహితం కోసం పని చేస్తూ, ఆయన చేసినట్టుగా యింటి దగ్గర చెయ్యాల్సిన లెక్కల్లాగా యిక వేరే యేమీ లేకుండా?" అని అడిగింది.

"రానిచ్చుకోను అనేది స్పష్టంగానే వుంది. నేను యెంతో ఆనందంగా వుండడంవల్ల

నాకు యేదీ అంతుబట్టడం లేదు... అయితే నువ్వనుకోవడం ఆయన యివాళ వారెంకాతో పెళ్లి ప్రస్తావన చేస్తాడని?'' అని జత చేశాడు.

''చెయ్యచ్చు, చెయ్యకపోవచ్చు. కాని చెయ్యాలనే యెంతో కోరుకుంటున్నా. కొంచెం ఆగు'' అని కిట్టీ వొంగి దారి పక్క మొక్కమీదనుంచి వో పువ్వుని కోసింది. ''యిదిగో, లెక్క పెట్టు దీని రేకల్ని చేస్తాడు చెయ్యడు అంటూ'' అంది అతనికి పువ్వుని అందిస్తూ.

''చేస్తాడు, చెయ్యడు'' అంటూ లేవిన్ వొక దాని తర్వాత వొకటిగా బారుగా సన్నంగా వున్న దాని రేకల్ని తుంచడం మొదలుపెట్టాడు.

''వుహుఁ, కాదు అలాక్కాదు'' అని ఉగ్గబట్టుకుని అతని వేళ్లకేసే చూస్తూ వున్న కిట్టీ ''నువ్వు రెండు రేకల్ని వొక్కసారే తుంపేశావ్'' అంది.

''యీ చిన్నది లెక్క లేదు లే'' అన్నాడు లేవిన్ పొట్టిగా వున్న వో రేకని తుంపేస్తూ. ''అదుగో, బండి రానే వచ్చింది'' అన్నాడు.

''అలిసిపోయావా, అమ్మా'' అంది ప్రిన్సెస్.

''లేదు పిసరు కూడా అలవలేదు'' అంది కిట్టీ.

''గుర్రాలు కుదపకుండా లాగితే నువ్వు యెక్కచ్చు'' అంది.

కాని బండి యెక్కడం అనవసరం. వాళ్లు అప్పటికే అడివిని అందుకున్నారు. అందరూ బండి దిగి కాలినడకన బయల్దేరారు.

## 4

నారెంకా నల్లని జుట్టుకి తెల్లని రుమాలు చుట్టుకుంది. ఆమె చుట్టుతా పిల్లలు మూగేరు. ఆమె సరదాగా హుషారుగా వాళ్లతో నవ్వుతూ, తనకి యిష్టమైన వ్యక్తి వివాహ ప్రస్తావన చేస్తాడన్న ఆశ కారణంగా ఉత్తేజితంగా కనిపిస్తూ చాలా మనోహరంగా వుంది. ఆమె పక్కన నడిచి వెడుతూ కోజ్నిషెవ్ ఆమెని ముగ్ధుడై చూస్తూ వున్నాడు. ఆమెని చూసినప్పుడు ఆమె నోట్లోనుంచి వచ్చిన అన్ని మంచి మాటలు, తను ఆమె గురించి విన్న మంచి సంగతులు అన్నీ గుర్తు వచ్చేయి. ఆమె పట్ల తన అనుభూతి తను యెప్పుడో పూర్వం పడుచువాడిగా వున్నప్పుడు పొందిన లాంటిదని అధికాధికంగా అతనికి అనిపించసాగింది. ఆమె సామీప్యంలో వుండడం అనే ఆనందం అతనిలో యే మేరకి చేరిందంటే తను యేరిన వో పుట్టగొడుగుని ఆమె బుట్టలో వేశాక — ఆ పుట్టగొడుగు సన్నటి కాడ, ముడతలు పడిన గొడుగు వున్న పెద్ద తెల్లని పుట్టగొడుగు — ఆమె కళ్లల్లోకి చూశేడు. ఆమె ముఖంలో సంతోషమూ భయాందోళనా కలిసిన యెరుపు గోచరమయేయి. దాంతో అతనూ సిగ్గు పడిపోయి, ఆమెకేసి చూసి మౌనంగా చిరునవ్వు నవ్వేడు. ఆ మందహాసం యెంతో వ్యక్తీకరంగా వుంది.

'అలాంటి విషయం గనక అయినట్లయితే నేను బాగా సాకల్యంగా ఆలోచించుకోవాలి, వొక నిర్ణయానికి రావాలి. పిల్లల మాదిరీ క్షణిక ఆకర్షణకి లొంగకూడదు' అనుకున్నాడు.

"అందరితోబాటు అయితే నేను యేరినవి కనిపించవు. విడిగా నే వొక్కణ్ణే వెళ్లి యేరతా" అని అతను వాళ్లు పుట్టగొడుగులు యేరుతూ వున్న చోటునుంచి, మిసిమి గరిక, విస్తారమైన బర్చ్ చెట్లూ వున్న ఆ చోటునుంచి, అడివి లోపలికంటా వెళ్లేడు. అక్కడ తెల్లని బర్చ్ చెట్లు, మధ్యమధ్య బూడిదరంగు ఆస్పెన్ చెట్లు, దట్టమైన హేజెల్ పొదలు వున్నాయి. వో నలభై అడుగులు వెళ్లి కొన్ని పొదల వెనక యెవళ్లకీ కనిపించని చోటుకి చేరాడు. గులాబీ మెరుపు రంగు చిన్న పూల తీగలు అన్ని వేపులా వేళాడుతూ ఆ పొదల్ని కమ్మేయి. అతను అక్కడ ఆగేడు. చుట్టూతా చాలా నిశ్శబ్దంగా వుంది. తేనెటీగల గుంపులాగా యీగలు ఆ బర్చ్ చెట్ల శిఖరాలమీద రొద చేస్తున్నాయి. మధ్యమధ్యన పిల్లల గొంతుకలు చెవిన పడుతు న్నాయి. వున్నట్టుండి దగ్గర్లో వారెంకా మంద్రస్వరం మోగింది. ఆమె గ్రీషని పిలుస్తోంది. కోజ్నిషెవ్ ముఖంలో సంతోషపూరిత మందహాసం లాస్యం చేసింది. అలా మందహాసం చేసే మనఃస్థితి చూసి కోజ్నిషెవ్ యిదేం బాగా లేదన్నట్టు తల వూపి చుట్ట తీసి ముట్టించుకో బోయేడు. బర్చ్ చెట్టు పట్టమీద అగ్గిపుల్లల్ని చాలా సేపు గీస్తూ వున్నా వొక్కటీ వెంగలేదు. బర్చ్ చెట్టు కాండంమీద పల్చటి త్వక్కు భాస్వరం చుట్టూతా ఉంగరం చుట్టుకుపోయి అగ్గిపుల్ల వెంగడం లేదు. ఆఖరికి వొక అగ్గిపుల్ల భగ్గున వెలిగింది, కమ్మని చుట్ట పొగ పెద్ద సుళ్లు తిరుగుతూ సాగి పోయింది, వాలిన బర్చ్ కొమ్మ చెట్టుకింద పెరిగిన పొదమీదనుంచి విశాలమైన తెరలా పోయింది. కోజ్నిషెవ్ మెల్లిగా నడుస్తూ యెగిరిపోతూ వున్న పొగకేసి చూస్తూ తన స్థితిని గురించి ఆలోచించుకున్నాడు.

'యెందుకలా చెయ్యకూడదు?' అని అనుకున్నాడు. 'యిది క్షణిక కోరిక, భావావేశం అయినట్లయితే, యిది ఆకర్షణ మాత్రం అయితే, – పరస్పర ఆకర్షణ, (నిజంగా పరస్పర ఆకర్షణ అనగలను), నా జీవిత విధానానికి ప్రతికూలంగా వుండేదైతే, దీనికి లొంగి పోయి నా జీవిత లక్ష్యాన్నీ, కర్తవ్యాన్నీ వమ్ము చేసిన వాడినవుతాను... కాని అలా కాదు. దీనికి ప్రతి కూలంగా వొక్కటే విషయం వుంది. Marie పోయినప్పుడు ఆమె స్మృతిని పదిలంగా కాపాడుకుంటానని ప్రమాణం చేసుకున్నాను. అదొక్కటే దీనికి ప్రతికూలంగా నే చెప్ప కోగల మాట. కాని అది ముఖ్యమైందే' అనుకున్నాడు కోజ్నిషెవ్. కాని స్వయంగా తనకి అది ముఖ్యమైంది కాదనీ, కేవలం యితరుల దృష్టిలో తన కాల్పనిక కావ్యగీతికా భూమిక వన్నె తగ్గుతుందనీ అనుకున్నాడు. 'అది తప్పిస్తే నా యీ భావనకి ప్రతికూలంగా వొక్క కారణం కూడా కనిపించదు. నా హేతువాదంతో యెంచుకోదలచుకుంటే యింతకంటే మంచి వాళ్ల నెవళ్లనీ పొందలేను' అనుకున్నాడు.

తనకి పరిచయస్తులైన ఆడవాళ్లందర్నీ గురించీ మనసులో బేరీజు వేసుకున్నాడు. కాని తన భార్యలో వుండాలని కోరుతూ హేతుపూర్వకంగా నిదానంగా వెతుకుతూ వున్న గుణాలన్నీ కలిసి వున్న వాళ్లు వొక్కళ్లు కూడా అతనికి దొరకలేదు. వారెంకాలో యౌవన లాలిత్యం, మనో హరత్వం వున్నాయి. అయినా ఆమె చిన్నపిల్ల కాదు. ఆమె తనని ప్రేమిస్తే, పరిణత మనస్కు

రాలైన మహిళలాగా పూర్తి చైతన్యంతో ప్రేమిస్తుంది. యిది వొక విషయం. మరొక విషయం యేమిటంటే ఆమె నవ నాగరిక సమాజ మహిళ కాదు సరికదా, ఆమెకి ఆ సమాజం అంటే వైముఖ్యం స్పష్టంగా వుంది. అలా అని సద్వంశ సంజాతురాలి నడవడిక లేకపోనూ లేదు, సమాజంతో పరిచయం కొరవడనూ లేదు. యివి లేకుండా కోజ్నిషెవ్ జీవిత భాగస్వామినిని వూహించుకోలేకపోయేడు. మూడవదిగా, ఆమె భక్తి పరాయణురాలు. అలా అని చిన్నపిల్లల్లాగా సహజ దయా స్వభావంతో, మంచితనంతో, ఉదాహరణకి కిట్టీలాగా, వుండే భక్తి భావం కాదు. ఆ భక్తి భావ విశ్వాసాలు ఆమె జీవిత ఆలంబన అయేయి. అర్ధాంగిలో వుండవలసిన అన్నీ పొల్లుపోకుండా అతిచిన్న అంశం కూడా ఆమెలో వున్నాయి. ఆమె బీదది, వొంటరిది. అంటే కిట్టీలాగా వో దండు బంధువర్గాన్ని, వాళ్ల ప్రభావాన్ని మొగుడి యింటికి తీసుకు రాదు. ప్రతి విషయానికీ భర్తమీద ఆధారపడుతుంది. భవిష్యత్ కుటుంబ జీవితానికి వాంఛనీయమైన మరో విషయం యిది. యిన్ని సద్గుణాల పోగు అయిన యీ అమ్మాయి తనని ప్రేమిస్తోంది. తను వినయంగా వున్నా యిది ఆమెలో దాగకుండా కనిపిస్తోంది. తనకీ ఆమె పట్ల ప్రేమ వుంది. వున్న వొక్క అవరోధమూ తన వయస్సు. కాని తను దీర్ఘాయుష్మంతులైన కుటుంబం వాడు. వొక్క వెంట్రుక తెల్లబడలేదు. తనని చూసిన ప్రతి వాళ్లూ తనకి నలభైకంటే యెక్కువ వుండవంటారు. వారెంకా కూడా అంది, రష్యాలోనే మనుషులు యాభై యేళ్లకి ముసలాళ్లయి పోయామనుకుంటారు, ఫ్రాన్స్‌లో యాభై యేళ్లవాడు dans la force de l'âge[1] అనీ, నలభై యేళ్లవాడు un jeune homme[2] అనీ అనుకుంటారట. అయినా మనసు యిరవై యేళ్ల వయసులో మాదిరిగా వున్నట్టుంటే వయసుతో పనేముంది? యేటవాలుగా పడుతూ వున్న సూర్య కిరణాల కాంతిలో, పసుపుపచ్చ గౌను తొడుక్కుని చేత్తో బుట్ట పట్టుకుని తేలిక అడుగులతో ముసలి బర్చ్ చెట్ల వారగా నడుస్తూ యిప్పుడు అడివి అటు వేపునుంచి వచ్చే సొగసైన వారెంకా రూపం చూస్తే కలిగింది యౌవన భావం కాదూ? వారెంకా కనిపిస్తూ వున్న యీ దృశ్యాన్ని సూర్య కిరణాల కాంతిలో ప్రతిఫలించే పసుపుపచ్చ ఓట్ క్షేత్ర అవర్ణ్యనీయ సౌందర్యంతో, ఆ ఓట్ క్షేత్రానికి అవల ఆకురాలు కాలపు హరిద్రావర్ణ సుశోభితంగా, క్షితిజ నీలిమ వర్ణంతో కలిసిపోయే దవిష్ఠ ప్రాచీన కాంతార దృశ్యంతో మనసులో మేళవింప చేసుకోవడం ఆ యౌవన భావనా ప్రాగ్భావంవల్ల కాదూ? అతని హృదయం సంతోషంతో తరంగించింది. అతను గాఢంగా చలించిపోయేడు. సర్వమూ నిర్ణయమై పోయిందని అతనికి అనిపించింది. పుట్టగొడుగులు యేరడానికి తడవ తడవకీ నేలమీదకి వొంగే వారెంకా, చురుగ్గా నిలబడి చుట్టూతా చూసింది. కోజ్నిషెవ్ చుట్ట విసిరేసి దృఢంగా అడుగులు వేస్తూ ఆమెకేసి వెళ్లాడు.

---

1 అసలైన వయసు (ఫ్రెంచి).

2 పడుచువాడు (ఫ్రెంచి).

## 5

'వారెంకా, నేను పదుచు వాడిగా వున్నప్పుడు ప్రేమించి నా అర్ధాంగిగా స్వీకరించే ఆదర్శ స్త్రీ యెలా వుండాలో వూహించుకునే వాణ్ణి. నా జీవితం దీర్ఘమైందే, యిప్పుడు మొదటిసారిగా నేను అన్వేషించిన దాన్నంతట్నీ మీలో చూశేను. మిమ్మల్ని ప్రేమిస్తున్నాను, నా శ్రీమతి కమ్మని అడుగుతున్నాను.'

కోజ్నిషెవ్ ఆ సమయంలో మనసులో యీ మాటలు అనుకున్నాడు. అప్పుడు వారెంకా వో పది అడుగుల దూరంలో వుంది. ఆమె మోకాళ్లమీద ఆనుకుని కూర్చుంది. ఆమె పుట్ట గొడుగుని చూసింది, దాన్ని గ్రీష యేరకుండా చేత్తో పట్టుకుని అతన్ని ఆపుతూ బుజ్జి మాషాని రమ్మని పిలుస్తోంది.

"యిటు రా, యిటు! బుజ్జివి! బోలెడు బోలెడు వున్నాయి" అని మనోహరమైన మంద్రస్వరంతో అంటోంది.

కోజ్నిషెవ్‌ని చూసి ఆమె లేచి నుంచోలేదు. తను వున్న భంగిమని మార్చుకోలేదు. కాని అతను అక్కడికి వచ్చిన యెరుక ఆమెకి వుందనీ, ఆమెకి సంతోషంగా వుందనీ అక్కడున్న యీవత్తూ అతనికి తెలియ చేశాయి.

"యేమన్నా దొరికాయా మీకు?" అని అడిగింది. తెల్లని రుమాలు కట్టుకుని, మంద హాసం చేసే ముద్దుగొన ముఖాన్ని అతనికేసి తిప్పుతూ అడిగింది.

"ఒక్కటి కూడా దొరకలేదు. మరి మీకు?" అన్నాడు కోజ్నిషెవ్.

పిల్లలందరూ ఆమెని చుట్టు ముట్టెయ్యడంతో ఆమె జవాబు చెప్ప లేకపోయింది.

"అదుగో ఆ కొమ్మకింద యింకోటుంది" అని బుజ్జి మాషాకి వో పుట్టగొడుగుని చూపిస్తూ అంది. యెండిన గడ్డిపరకవల్ల ఆ పుట్టగొడుగు లేత ఎరుపు గొడుగు రెండుగా చీలింది. అది ఆ గడ్డిపరక కిందనుంచి లేచింది. మాషా దాన్ని రెండుగా తెల్లని ముక్కలుగా చించేస్తూ యేరినప్పుడు వారెంకా లేచి నుంచుంది. "దీన్ని చూస్తే నాకు నా చిన్నతనం గుర్తు వస్తోంది" అంది, పిల్లల్ని వదిలిపెట్టి కోజ్నిషెవ్ దగ్గరికి వస్తూ.

వాళ్లు యేం మాట్లాడుకోకుండా కొన్ని అడుగులు నడిచేరు. అతను యేదో మాట్లాడా లనుకుంటున్నాడని వారెంకా గమనించింది. అది యేమిటైందీ ఆమె వూహించింది. సంతోషమూ, భయమూ ముసురుకు వస్తూ వుంటే ఆమె ఉక్కిరిబిక్కిరి అయిపోయింది. తమ మాటలు యెవళ్లకీ వినబడనంత దూరం వాళ్లు వెళ్లేరు. అయినా కోజ్నిషెవ్ మాట కదపలేదు. వారెంకా మౌనంగా వుండడమే మేలుగా వుండేది. ఆ తర్వాత తమ మనసులో మాట చెప్పు కోవడం సులభం అయివుండేది, అప్పుడే పుట్టగొడుగుల గురించి మాట్లాడడం కంటే. కాని తన యిష్టానికి వ్యతిరేకంగా, యేదో కాకతాళీయంగా నన్నట్టు ఆమె

"అయితే మీకు యేమీ దొరకలేదన్న మాట. అడివి లోపల్లోపల యెప్పుడూ పుట్ట గొడుగులు తక్కువే వుంటాయి" అంది.

కోజ్నిషెవ్ దీర్ఘంగా నిట్టూర్చేడు. యేమీ మాట్లాడలేదు. ఆమె పుట్టగొడుగుల గురించి మాట్లాడినందుకు అతనికి చిరాకు కలిగింది. ఆమె తన బాల్యం గురించి యిందాకా చేసిన ప్రస్తావన గురించి మాట్లాడాలనుకున్నాడు. కాని అతనూ తన యిష్టానికి విరుద్ధంగా నన్నట్టు, కొంచెం సేపు మౌనం తర్వాత ఆమె మాటలకి వ్యాఖ్యగా అన్నట్టు అన్నాడు:

"తెల్ల పుట్టగొడుగులు యెక్కువగా అడివి శివార్లలోనే పెరుగుతాయని విన్నాను. అయినా నాక్కనిపించినా తెల్ల పుట్టగొడుగేదో గుర్తు పట్టలేను."

మరికొన్ని నిముషాలు గడిచాయి. వాళ్ళు పిల్లలనుంచి యింకా దూరం వెళ్ళేరు. వాళ్ళిద్దరూ యేకాంతంగా వున్నారు. వారెంకా గుండె తీవ్రంగా దడదడ కొట్టుకుంటోంది. అది ఆమెకి వినిపిస్తోంది. తన ముఖంమీద అరుణిమ వస్తోందనీ, ముఖం రంగు మారిపోతోందనీ ఆమెకి అనిపించింది. ఆమె యింకా సిగ్గుతో యెర్రబడింది.

మేడం స్థాల్ దగ్గర గడిపిం తర్వాత కోజ్నిషెవ్‌లాంటి వ్యక్తికి అర్ధాంగి కావడం తన మహదదృష్టంగా కనిపిస్తోంది. అదీగాక, తను అతన్ని ప్రేమించిందన్న విషయమూ దాదాపు విశ్వసనీయమే. యిప్పుడు తన రాత తేలిపోతోంది. ఆమెకి అతనేం అంటాడోనన్న దాంతో మనసుకి భయంగా వుంది, యేం చెప్పడో దాంతోటేనీ.

చెపితే యిప్పుడు తన మాట చెప్పాలి లేకపోతే యెప్పటికీ లేదు అని కోజ్నిషెవ్‌కీ అనిపించింది. వారెంకా చూపు, సిగ్గుతో యెర్రబడిన చెక్కిళ్ళు, కిందికి వాలిన కళ్ళు — ప్రతీదీ ఆమె వేదనాపూరిత ప్రతీక్షని వెల్లడిస్తున్నాయి. కోజ్నిషెవ్ ఆ స్థితిని చూశేడు, ఆమెపట్ల అతనికి జాలి కలిగింది. యిప్పుడేమీ చెప్పకుండా వుండడం ఆమెని అవమాన పరచడమేననీ అతనికి అనిపించింది. తన నిర్ణయానికి అనుకూలించే మొత్తం తర్కాన్ని గబగబ మనసులో అవలోకనం చేసుకున్నాడు. యే మాటలతో వివాహ ప్రస్తావన చెయ్యాలో ఆ మాటల్ని కూడా మననం చేసుకున్నాడు. కాని ఆ మాటలకి బదులుగా యే ప్రేరణవల్లనో తెలియకుండానే మరోటి అడిగేడు:

"తెల్ల పుట్టగొడుక్కీ, బర్చ్ చెట్టు కింద వుండే వాటికీ తేడా యేమిటి?"

వారెంకా దానికి జవాబు చెప్పేటప్పుడు ఆమె పెదాలు ఆవేశంతో కంపించేయి.

"గొడుగులో యే తేడానూ లేదు, కాండంలోనే తేడా వుంది అంతే."

ఆ మాటలు అనగానే యిద్దరికీ అర్థమైపోయింది, అంతా ముగిసిందని, యేది చెప్పవలసి వుందో దాన్నిక చెప్పడం కుదరదని. పరాకాష్టకి చేరిన ఉద్రిక్తత తగ్గ నారంభించింది.

"బర్చ్ కింద పెరిగిన పుట్టగొడుగు రెండు రోజులు పెరిగిన గడ్డాన్ని గుర్తుకు తెస్తుంది" అని కోజ్నిషెవ్, యిప్పుడు శాంత పడి, అన్నాడు.

"అవును" అని వారెంకా చిరునవ్వు నవ్వింది. వాళ్ళకి తెలియకుండానే వాళ్ల నడక దిశ మారింది. తిరిగి పిల్లల దగ్గరికి వచ్చేరు. వారెంకాకి విచారమూ, లజ్జా కూడా కలిగేయి. కాని వాటితో పాటు తెరిపిన పడ్డట్టూ అనిపించింది.

కోజ్నిషెవ్ యింటికి తిరిగి వెళ్లి సింహావలోకనం చేసుకున్నాక తన ఆలోచనా ధోరణి సరికాదని అతనికి అనిపించింది. Marie స్మృతికి తను అన్యాయం చెయ్యలేదు.

"ఏయ్, మెల్లిగా, పిల్లలూ, మెల్లిగా" అంటూ లేవిన్ చిరాగ్గా పిల్లల్ని వారించేడు. పిల్లలందరూ సంతోషంగా కేరింతాలు కొడుతూ తమ వేపు దూసుకుంటూ వచ్చేస్తూ వుంటే, తన భార్యమీదకి పడతారేమోనని అడ్డం నుంచుని అలా అరిచేడు.

పిల్లల వెనక్కాలే కోజ్నిషెవ్, వారెంకాలు కూడా వచ్చేరు. కిట్టీకి యేదీ అడిగే అవసరం లేకపోయింది. వాళ్లిద్దరూ, శాంతంగా వుండడమూ, వో రకంగా సిగ్గుపడిపోయి వుండడమూ తన ఆశలు భగ్నం అయేయని ఆమెకి తెలియ చేశాయి.

"వూఁ, అయితే యేమైంది?" అని యింటికి తిరిగి వచ్చేస్తూ వుంటే ఆమెని భర్త అడిగేడు.

"పండలా" అని కిట్టీ మందహాసం చేస్తూ అంది. ఆ మాట్లాడ్డం తీరు, మందహాసం చేయ్యడం తీరు ఆమె తండ్రిని గుర్తుకు తెస్తాయి. అలా తరచూ జరుగుతూ వుంటుంది, అది లేవిన్‌కి యిష్టం.

"పండకపోవడం అంటే?"

"యిలా" అని ఆమె భర్త చేతిని తన చేత్తో పట్టుకుని తన మూతిదాకా లాక్కుని పెదాలు చుట్టి ముద్దు పెట్టుకుంటూ అంది.

"యెవళ్ల వేపునుంచి పండలేదంటావ్?"

"యిద్దరి వేపునుంచీనీ, పండితే యిలా వుండాలి..."

"వూఁ, యెవళ్లో రైతులు వస్తున్నారు."

"చూళ్లేదులే."

## 6

పిల్లలు టీ తాగుతూ వుండగా పెద్ద వాళ్లు మేడమీద బాల్కనీలో చేరి యేమీ జరగనట్టే మాట్లాడుకుంటూ కూర్చున్నారు. కాని అందరికీ తెలుసు, కోజ్నిషెవ్, వారెంకాలకి యింకా బాగా తెలుసు నకారాత్మకమైనదైనా వొక ముఖ్యమైన సంఘటన జరిగింది అని. వాళ్లిద్దరూ, పరీక్ష తప్పి అదే క్లాసులో మళ్లీ చదవడమో లేకపోతే పాఠశాల బహిష్కరణమో జరిగే విద్యార్థికిలాగా వున్నారు. యేదో ముఖ్యమైంది జరిగిందని మిగిలిన వాళ్లకి తెలుసు కాని వాళ్లు వేరే విషయాల గురించి ఉత్సాహంగా మాట్లాడుకుంటున్నారు. ఆ సాయంత్రం లేవిన్, కిట్టీలు మరీ యెక్కువ ఆనందంగా, అనురాగంతో వున్నారు. వాళ్లిద్దరూ తమ ప్రేమవల్ల సంతోషంగా వుండడం అనేదే, అలా సంతోషంగా వుండాలని కోరుకున్నా వుండలేక తత్కారణంగా లజ్జితులైన వాళ్లకి నిందా సూచకంగా అనిపించింది.

"నే చెప్తున్నా కదా. నాన్న అతనితో రారు" అంది వృద్ధ ప్రిన్సెస్.

ఆ సాయంత్రం రైలుకి అబ్లాన్స్కీ వస్తాడని వాళ్లు యెదురు చూస్తున్నారు. కిట్టీ నాన్న తనూ రావచ్చు బహుశా అని రాశేడు.

"యెందుకో చెప్పమంటావా? పడుచు జంటని కొత్త కాపరంలో వాళ్ల మానాన వాళ్లని వుండనివ్వాలని ఆయన మతం" అని ప్రిన్సెస్ అంది.

"నాన్న మమ్మల్ని వొంటరిగానే వదిలేశాడు. ఆయన్ని చూసి యుగాలైనట్టుగా వుంది" అంది కిట్టీ. "మమ్మల్ని నవదంపతులు అంటారేమిటి? యెప్పుడో పాతబడిపోయేం" అంది.

"వూ, ఆయన రాకపోతే నేనూ సెలవు తీసుకుంటానర్రా పిల్లలూ" అని ప్రిన్సెస్ విచారంగా నిట్టూర్చి అంది.

"అదేం మాటమ్మా?" అని కూతుళ్లిద్దరూ వొకే సారి అన్నారు.

"మీరు ఆయన విషయం కూడా ఆలోచించండి. యిప్పుడు..."

పెద్ద ప్రిన్సెస్ కంఠం హఠాత్తుగా రుద్ధమైంది. కూతుళ్ళు మాట్లాడకుండా వొకళ్ల కేసి వొకళ్లు చూసుకున్నారు. 'Maman యెప్పుడూ దేన్ని గురించో వొకదాన్ని గురించి బాధ పడుతూనే వుంటుంది' అంటున్నట్టు వున్నాయి వాళ్ల చూపులు. తను కూతురి యింట్లో వుండడం ప్రిన్సెస్‌కి యెంతో సంతోషంగా వుంటుందని, తను వుండడంవల్ల వాళ్లకి పెద్ద దిక్కుగా వుంటానని ఆమెకి అనిపిస్తూ వుంటుందని అయినా ముద్దుల కడసారి కూతురికి పెళ్లి చేసి అత్తవారింటికి పంపేశాక తమ గూడు చిన్నబోయిందని, తనూ భర్త దిగాలుగా వుంటున్నారనీ వాళ్లకి అర్థం కాదు.

"యేమిటె సంగతి, అగాఫ్యా మిహైలొవ్నా" అని కిట్టీ యేదో గొప్ప రహస్యం వున్నట్టు ముఖంలో అర్థవతు భావం గోచరమవుతూ వచ్చిన ఆమెని అడిగింది.

"రాత్రి భోజనాల విషయం అడుగుదామని."

"సరే అయితే, నువ్వెళ్లి రాత్రి భోజనాల విషయం చూడు. నేను గ్రీష చేత పాఠం వల్లె వేయిస్తాను, యివాళ వాడు పుస్తకమే ముట్టుకోలేదు" అంది దాలీ.

"అది నా భాధ్యత, నే వెడతా, దాలీ" అని లేవిన్ వెంటనే లేస్తూ అన్నాడు.

గ్రీషని హైస్కూల్లో చేర్చారు. వేసవి సెలవల్లో పాఠాలు వల్లె వెయ్యాలని చెప్పారు. దాలీ మాస్కోలో వాడితోబాటు లాటిన్ భాష పాఠాల్ని వల్లె వేసేది. లేవిన్ దంపతుల యింటికి సెలవలకి వచ్చేక కనీసం రోజుకి వొక్క సారేనా లెక్కల్లోనూ, లాటిన్‌లోనూ చాలా కష్టంగా వుండే పాఠాల్ని మళ్లీ చదివిస్తూ వుండేది. లేవిన్ ఆమె బదులు వాడికి తను పాఠం చెప్తానన్నాడు. కాని వొకసారి ఆమె లేవిన్ పాఠం చెప్పడం చూసింది, లేవిన్ గ్రీషకి మాస్కో టీచరు చెప్పినట్టు కాకుండా తన ధోరణిలో చెప్పడం వింది. అందుకని అతనికి కష్టం కలక్కుండా, కొంచెం యిబ్బందిగానే అయినా నిష్కర్షగా చెప్పింది, మాస్కో టీచరు చెప్పినట్టు వొక క్రమపద్ధతిలో పుస్తకాన్ని చదివించాలని, తనే అలా చేయిస్తానని అంది. లేవిన్‌కి అబ్లాన్స్కీ

బేఫర్వాతనంమీద కోపం వచ్చింది. యేమీ తెలియని పెళ్ళాం చేతిలో పిల్లల పెంపకం, విద్యా బుద్ధులు నేర్పడం బాధ్యత పడేశాడు అబ్లాన్స్కీ. రోత కలిగించే బోధనా పద్ధతులు అను సరించే టీచర్లమీద యింకా కోపం వచ్చింది లేవిన్‌కి. కాని గ్రీషకి ఆమె కోరుకున్నట్టే చెప్తానని మాట యిచ్చి తన పద్ధతిలో కాక పాఠ్య పుస్తకం ప్రకారం పాఠాలు చెప్పడం సాగించేడు. అది అతనికి యేమీ రుచించక పోవడంతో యెప్పుడూ పాఠం టైమ్ మరిచిపోయేవాడు. యీ వేళ కూడా అంతే జరిగింది.

"నే వెడతా నువ్వు కూర్చో, దాలీ" అన్నాడు లేవిన్. "మేం అన్నీ సవ్యంగా పుస్తకం ప్రకారం చేస్తాం. కాని మీ ఆయన వచ్చినప్పుడు మేం వేటకి వెడతాం, అప్పుడు పాఠాలు చెప్ప లేను" అన్నాడు.

లేవిన్ గ్రీష గదికి వెళ్ళేడు.

వారెంకా కూడా కిట్టీతో అలానే వుంది. లేవిన్ దంపతుల సౌఖ్యప్రద గృహంలో కూడా తను ఉపయోగపడే దారి ఆమే చూసుకుంది.

"రాత్రి భోజనాల విషయం నేను చూస్తాను, మీరు వుండండి" అని ఆమె అగాఫ్యా మిహైలొవ్నా దగ్గరికి వెళ్ళింది.

"అలాగే, అలాగే, బహుశా లేత కోళ్ళు దొరికినట్టు లేవు. లేకపోతే మన పెట్టల్నే..." అంది కిట్టీ.

"అగాఫ్యా మిహైలొవ్నా నేనూ ఆ విషయం చూసుకుంటాం" అని వారెంకా ఆమెతో కలిసి వెళ్ళిపోయింది.

"యెంత ముచ్చటైన పిల్ల!" అంది ప్రిన్సెస్.

"వొట్టి ముచ్చటైన పిల్లే కాదు, maman, ఆణిముత్యంలాంటి అమ్మాయి."

"అయితే యివాళ అబ్లాన్స్కీ వస్తాడంటారన్న మాట" అన్నాడు కోజ్నిషెవ్. వారెంకాని గురించి మాట్లాడుకోవడం అతనికి యిష్టం లేనట్టు స్పష్టంగా తెలుస్తూనే వుంది. "ఒకళ్ళ కొకళ్ళు యింత తేడాగా వుండే అల్లుళ్ళు కనిపించడం కష్టం" అని సున్నితంగా మందహాసం చేస్తూ అన్నాడు. "ఒకతను కులాసా మనిషి, లోకులు కూడా అలానే కులాసాగా వుంటా రని అనుకుంటాడు, నీట్లో చేపలాగా. రెండో వాడు, మా లేవిన్, ఉత్సాహంగా, చురుగ్గా వుంటాడు. మనసు చాలా సున్నితంగా వుండే మనిషి, కాని నదిమందిలోకి వెళ్ళాడో నీట్లో నుంచి బయట పడ్డ చేపలాగా అయిపోతాడు, దిక్కు తోచనట్టు ముడుచుకుపోతాడు, రెక్కలు కొట్టుకుంటాడు" అన్నాడు.

"అతను అయ్యో దీన్ని శ్రద్ధగా దృష్టి పెట్టి చూడాలే అని ఆలోచించడు" అని ప్రిన్సెస్ కోజ్నిషెవ్‌తో అంది. "మీరు కొంచెం అతనితో చెప్పండి మా అమ్మాయిని" (ఆమె కిట్టీని ఉద్దే శించి అంది) "యిక్కడ వుంచకూడదని, తప్పకుండా మాస్కోకి పంపించెయ్యాలని. డాక్టర్లని మాస్కోనుంచి పిలిపిస్తానంటాడతను."

"Maman, తను అన్నీ చేస్తాడు, అన్నిటికీ తయారయే వున్నాడు" అని కిట్టీ తల్లికి అడ్డం వెళ్లింది. యిలాంటి విషయానికి సంబంధించి తల్లి కోజ్నిషెవ్‌తో మొరపెట్టుకోవడం ఆమెకి నచ్చలేదు.

వాళ్ళు మాట్లాడుకుంటూ వుండగా తోటలో రాతి దారిమీద బండి చక్రాల చప్పుడూ, గుర్రాల బుసలూ వినిపించేయి.

దాలీ భర్తకి యెదురు వెళ్లడానికి లేచిందో లేదో గ్రీష పాఠం చదువుకుంటూ వున్న గది కిటికీలోనుంచి లేవిన్ బయటకి దూకి వచ్చేడు. కూడా గ్రీషని దింపేడు.

"అబ్లాన్‌స్కీయే" అని లేవిన్ బాల్కనీ కిందనుంచి అరిచేడు. "పాఠం చదివేసేం, దాలీ, దిగులు పడకు" అని అరుస్తూ చిన్న పిల్లాడిలాగా బండి వేపు పరిగెత్తేడు.

"Is, ea, id, ejus, ejus, ejus[1]" అని అతని వెనక్కాలే గెంతుతూ యెగురుతూ లాటిన్ భాషాసర్వ నామాల్ని వల్లెవేస్తూ వెళ్లేడు గ్రీష.

"యింకా యెవళ్లో కూడా వున్నారు. బహుశా నాన్నగారేమో" అని లేవిన్ దారి దగ్గర ఆగి అన్నాడు. "నిట్రపాటి మెట్లమీదనుంచి దిగద్దు కిట్టీ, చుట్టు తిరిగి రా" అని హెచ్చరించేడు.

బండిలో వున్న రెండో మనిషి పెద్ద ప్రిన్స్ అనుకున్నాడు లేవిన్, కాని అతను పొరపడ్డాడు. బండి దగ్గరికి వెళ్లి చూస్తే అబ్లాన్‌స్కీ పక్కన కూచున్న మనిషి పెద్ద ప్రిన్స్ కాదు, లావాటి అందమైన పడుచతను. అతను వెనక వేలాడే రిబ్బన్లున్న స్కాచ్ టోపీ పెట్టుకున్నాడు. అతను వాస్య వెస్లోవ్‌స్కీ. ష్చేర్‌బాత్‌స్కీల దూరపు బంధువు. మాస్కో, పీటర్స్‌బుర్గ్ నగరాల్లో శ్రేష్ఠమైన నాగరిక యువకుడు. అబ్లాన్‌స్కీ అతన్ని 'బహుచక్కటి వాడు, వేట వ్యసనం వాడు' అని పరిచయం చేశాడు.

పెద్ద ప్రిన్స్ రాకపోవడం వాళ్లకి కొంత నిరాశ కలిగించిందనిపించినా, వెస్లోవ్‌స్కీ అందుకు యేమీ చలించకుండానే హుషారుగా లేవిన్‌ని పలకరించేడు. తాము అంతకు ముందు కలుసుకున్న సందర్భాన్ని గుర్తుచేశాడు. అబ్లాన్‌స్కీ తనతో కూడా తెచ్చిన కుక్కమీదనుంచి గ్రీషని యెత్తి బండిలోకి తీసుకున్నాడు.

లేవిన్ బండి యెక్కలేదు. వెనక నడిచేడు. అతనికి బాధ కలిగింది పెద్ద ప్రిన్స్ రాలేదని. ఆయనతో పరిచయం యెక్కువయే కొద్దీ ఆయనంటే అభిమానం పెరిగింది లేవిన్‌కి. వాస్య వెస్లోవ్‌స్కీ వచ్చినందుకు బాధ కలిగింది. అతను పరాయివాడు, ప్రస్తుతం పానకంలో పుడకలాంటి మనిషి. పెద్దలూ పిన్నలూ ఉగ్గబట్టుకుని వరండా దగ్గర యెదురు చూస్తున్నారు. అక్కడికి వెళ్లగానే వెస్లోవ్‌స్కీ కిట్టీ చేతిని అతిగా కనిపించే అనురాగంతో, శూరత్వంతో ముద్దు పెట్టుకోవడం చూశాడు.

---

[1] ఆయన, ఆవిడ, అది, ఆయనయొక్క, ఆవిడయొక్క, దాని (లాటిన్).

"మీ ఆవిడా నేనూ cousins[1], పాత పరిచయస్థులం" అని వెస్లోవ్‌స్కీ అన్నాడు. మరోసారి లేవిన్ చేతిని గట్టిగా అదిమేడు.

"వూఁ, అయితే వేట బాగుంటుందా?" అని అబ్లాన్‌స్కీ లేవిన్‌ని అడిగేడు. యేదో మాట అంటూ అందర్నీ పలకరించేడు. "నాకూ, యితనికీ భయంకరమైన కోరికలున్నాయి. Maman, అప్పట్నుంచీ వాళ్ళు మాస్కో రానేలేదు. తాన్యా, యిదిగో, నీకు వో వస్తువు తెచ్చేను. బండి వెనక్కాల వుంది, తెచ్చుకో." అతను యెవళ్ళనీ పలకరించకుండా వదల కూడదన్నట్టు అందరికేసీ తిరుగుతూనే వున్నాడు. "నీకు నేవళింపు వచ్చింది, దాలీ" అని అతను పెళ్ళాం చేతిని ముద్దుపెట్టుకుంటూ అన్నాడు. ఆమె చేతిని పట్టుకుని గోముగా నిమిరేడు.

ఓ క్షణంకితం దాకా మహా హుషారుగా వున్న లేవిన్ యిప్పుడు అందరికేసీ దిగులుగా, అక్కడ జరుగుతూ వున్నదేదీ తనకి నచ్చనట్టుగా చూశేడు.

'యీ పెదాలు నిన్న యెవరి చేతిని ముద్దుపెట్టుకున్నాయో?' అని పెళ్ళాంపట్ల అబ్లాన్‌స్కీ వొలకబోస్తున్న అనురాగం చూసి లేవిన్ అనుకున్నాడు. అతను దాలీకేసి చూశేడు. ఆమె కూడా అతనికి నచ్చలేదు.

'అబ్లాన్‌స్కీ ఆమెని ప్రేమించడం లేదని ఆమెకి ఖాయంగా తెలుసు. తెలిసీ యెందు కంత మురిసి ముక్కలైపోతోంది? అబ్బ, వెలపరం' అనుకున్నాడు లేవిన్.

అతను ప్రిన్సెస్‌కేసి చూశేడు. వో క్షణం కితమే ఆమె యెంతో ఆప్యాయంగా కనిపించింది. అలాంటి ఆవిడ రిబ్బన్ల టోపీ పెట్టుకున్న వెస్లోవ్‌స్కీకి పూర్ణకుంభంతో – అక్కడికి ఆవిడ తన సొంత యింట్లో వున్నట్టు – స్వాగతం చెప్పడమూ అతనికి నచ్చలేదు.

అతను కోజ్నిషెవ్‌కేసి చూశేడు. కోజ్నిషెవ్ వరండాలోకి వచ్చేడు. వచ్చి అబ్లాన్‌స్కీని యెంతో స్నేహంగా పలకరించేడు. కోజ్నిషెవ్‌కి అబ్లాన్‌స్కీ పట్ల యిష్టమూ లేదు, గౌర వమూ లేదు. అది లేవిన్‌కి తెలుసు. అంచేత కోజ్నిషెవ్ ధోరణీ అతనికి నచ్చలేదు.

వారెంకా కూడా అతనికి చీదర కలిగించింది. ఆమె యీ మహానుభావుడికి sainte nitouche[2] లాగా పరిచయం అయింది, మనసులో ఆమె యెలా యెవళ్ళకో వొకళ్ళకి పెళ్ళాం కావాలా అని చూస్తోంది.

కాని అతనికి అందరికంటే కిట్టీ వెలపరంగా కనిపించింది. ఆ పెద్ద మనిషి పల్లెకి వేంచేయడం తనకీ, అలాగే మిగతా వాళ్ళకీ తిరనాళ్ళుగా భావించుకునే సంబరంలో ఆమె కూడా మురిగిపోయింది. అతను ఆమెని చూసి ప్రత్యేకంగా నవ్విన చిరునవ్వుకి బదులుగా ఆమె నవ్విన చిరునవ్వ కంటే వెలపరం కలిగించేది మరొకటి వుండదు.

---

[1] బంధువులం (ఫ్రెంచి).

[2] యోగిని (ఫ్రెంచి).

గట్టిగా మాట్లాడుకుంటూ వాళ్లందరూ యింట్లోకి వెళ్లేరు. అందరూ కూర్చున్నాక లేవిన్ వెనక్కి తిరిగి బయటికి వెళ్లేడు.

తన భర్తని యేదో మనసులో వేధిస్తోందని కిట్టీ గుసునించింది. అతనితో నొంటరిగా మాట్లాడే అవకాశం కోసం చూసింది. కాని తనకి ఆఫీసుగదిలో పని వుందని అంటూ అతను గబగబా వెళ్లిపోయేడు. చాలా కాలంగా అతను తన వ్యవసాయం పన్లకి యివాల్టంతటి ప్రాముఖ్యం యివ్వలేదు. 'యీ జనాలకి ప్రతిరోజూ తిరణాళ్లే. కాని నా పని తిరణాళ్లు కాదు. యీ పని ఆగదు, యిది లేకుండా జీవితం సాగదు' అనుకున్నాడు.

## 7

సాయంత్రం భోజనాలకి రమ్మని కబురు అందేక మాత్రమే లేవిన్ యింటికి తిరిగి వచ్చేడు. యే రకాల వైన్ యివ్వాలా అని కిట్టీ, అగాఫ్యా మిహైలొవ్నా మెట్లమీద నుంచుని చర్చించుకుంటున్నారు.

"యెందుకంత fuss[1] చేస్తున్నారు? రోజూ వుండేదాన్నే కానివ్వండి."

"వుహుఁ, బావ తాగడు... కొంచెం ఆగు. యేమిటి సంగతి?" అని ఆమె అతని వెనక్కాల హడావుడిగా వెడుతూ అంది. కాని అతను ఆమెని పట్టించుకోకుండా కటువుగా అంగలువేస్తూ భోజనాల గదికి వెళ్లేడు. వెస్లొవ్‌స్కీ, అబ్లాన్‌స్కీ భోజనాల గదిలో రంజుగా మాట్లాడుకుంటున్నారు. లేవిన్ కూడా వెంటనే వాళ్ల సంభాషణలో కలిసేడు.

"యేమిటి మరి రేపు వేటకి వెళ్లడమేనా?" అని అబ్లాన్‌స్కీ అడిగేడు.

"ఆఁ, మరి వెళ్లద్దూ" అన్నాడు వెస్లొవ్‌స్కీ. అతను మరో కుర్చీలోకి మారి పక్కగా కూర్చుని, లావాటి కాలిని రెండో కాలి మోకాలిమీద వేసుకున్నాడు.

"సంతోషంగా వెడదాం. యీ యేడాది యెక్కడికేనా వేటకి వెళ్లారా?" అని లేవిన్ వెస్లొవ్‌స్కీని అడిగేడు. అతను వెస్లొవ్‌స్కీ లావాటి కాలికేసి చూస్తూ తెచ్చి పెట్టుకున్న సంతోషంతో అడిగేడు. అతని మనఃస్థితి అలా అవుతూ వుండడం కిట్టీకి తెలుసు. అది అతని స్వభావానికి నప్పదు. "మనకి పెద్ద కంజులు దొరుకుతాయో లేదో తెలీదు కాని చిన్న రకంవి బాగా వున్నాయి. మనం తెల్లవారుతూనే వెళ్లిపోదాం, అలిసిపోవు కదా? యేం, అల సటగా వుందా అబ్లాన్‌స్కీ?"

"నేనా, అలిసిపోవడమా? నా జన్మలో నాకు అలుపనేది లేదు. కావాలంటే పట్టు, రాత్రి జాగారం చేద్దాం. పోయి తిరుగుదాం."

"భేష్, బాగుంది, మంచిది. పదండి, జాగారం చేద్దాం" అని వెస్లొవ్‌స్కీ సై అన్నాడు.

---

[1] రాద్ధాంతం (ఫ్రెంచి).

''నువ్వు రాత్రంతా జాగారం చెయ్యగలవనీ, అందరికీ నిద్దర్లు లేకుండా జాగారం చేయిస్తావనీ మాకు తెలుసు'' అని దాలీ భర్తని చూసి అంది. ఆ అనడంలో సన్నటి యెత్తిపొడుపు కనిపించింది. యీ మధ్య వాళ్ల సంబంధాల్లో అది యెక్కువగా కనిపిస్తోంది. ''నే వెళ్లి పడుకునే వేళయింది... నే వెడుతున్నా. నేను భోజనం చెయ్యను'' అంది.

''వుహుఁ, కాసేపు మాతో కూర్చో రాదా'' అని అబ్లాన్స్కీ భోజనాలు వడ్డిస్తూ వున్న పెద్ద బల్ల దాటి భార్య దగ్గరికి వెడుతూ అన్నాడు. ''యింకా నీతో మాట్లాడాల్సిన విషయాలున్నాయి'' అన్నాడు.

''ఆఁ, వట్టిది, యేమీ లేవు.''

''విన్నావా, వెస్లోవ్స్కీ ఆన్నాని చూడ్డానికి వెళ్లేడు. మళ్లీ వెడుతున్నాడు. వాళ్లు యిక్కడి నో డెబ్బై వెర్స్టే*ల్లో వున్నారు. నేనూ వెడదామనుకుంటున్నాను. వెడతాను. వెస్లోవ్స్కీ యిలా రా!''

వెస్లోవ్స్కీ ఆడవాళ్ల దగ్గరికి వెళ్లి కిట్టీ పక్క కూర్చున్నాడు.

''ఓహ్! చెప్పండి. ఆన్నాని చూశేరా? యెలా వుంది?'' అని దాలీ అడిగింది.

లేవిన్ బల్లకి అటు వేపు కూర్చున్నాడు. ప్రిన్సెస్‌తోనూ వారెంకాతోనూ మాట్లాడుతూ వున్నాడు కాని అబ్లాన్స్కీని, దాలీని, వెస్లోవ్స్కీని, కిట్టీని గమనిస్తూనే వున్నాడు. వాళ్లు మంచి రంజుగా, రహస్యంగా మాట్లాడుకుంటూ వున్నారు. సంభాషణ రహస్యంగా వున్నట్టు కనిపించడమే కాదు, అతనికి గంభీరంగా వింటున్నట్టు కూడా భార్య ముఖం కనిపించింది. ఆమె వెస్లోవ్స్కీ అందమైన ముఖంకేసి చూస్తూనే వుంది, అతను మహోత్సాహంతో యేదో చెప్పేస్తున్నాడు.

''వాళ్లున్న చోట వేలు పెట్టడానికి లేనట్టుగా వున్నాయి అన్నీ'' అని అతను ఆన్నా వ్రాన్స్కీల గురించి అన్నాడు. ''నేను తీర్పు చెప్పకూడదనుకోండి కాని భార్యా భర్తా కలిసి కాపరం చేసే కుటుంబంలో వున్నట్టే వుంది నాకు'' అన్నాడు.

''వాళ్లు యేం చెయ్యాలను కుంటున్నారు?''

''శీతకట్టు మాస్కోలో గడుపుతారనుకుంటా.''

''మనం అందరం కలిసి అక్కడికి వెడితే యెంత బాగుంటుంది! నువ్వు యెప్పుడు వెడుతున్నావ్?'' అని అబ్లాన్స్కీ వెస్లోవ్స్కీని అడిగేడు.

''నేను జూలై నెల వాళ్లతో గడుపుతాను.''

''నువ్వూ వస్తావా?'' అని అబ్లాన్స్కీ భార్యని అడిగేడు.

''ఆమెని చూడాలని నాకు చాలా కాలంగా వుంది, వస్తాను'' అంది దాలీ. ''యేమిటో ఆమెని చూస్తే జాలేస్తుంది. నాకామె బాగా తెలుసు, చాలా మంచి మనిషి. కాని నువ్వు వెళ్లిపోయేక వెడతాను వొక్కత్తినీ. యెవళ్లకీ కష్టం కలగకుండా. నువ్వు లేకుండా వుంటేనే యింకా బాగుంటుంది'' అంది.

"బాగుంది, మరి నువ్వు, కిట్టీ?" అన్నాడు అబ్లాన్‌స్కీ.

"నేనా? నేనెందుకు వెడతాను?" అని కిట్టీ వొక్కసారిగా తీక్ష్ణంగా యెర్రబడుతూ అంది. భర్తకేసి చూసింది.

"మీకు అన్నాగారు తెలుసా? చాలా అందమైన ఆవిడ" అన్నాడు వెస్లోవ్‌స్కీ.

"ఆఁ" అని యింకా యెర్రబడిపోతూ అందామె. లేచి భర్త దగ్గరికి వెళ్ళింది.

"అయితే రేపు వేటకి వెడుతున్నావా?" అని అడిగింది.

ఆ కాసిని క్షణాల్లోనూ, ముఖ్యంగా వెస్లోవ్‌స్కీతో మాట్లాడేటప్పుడు కిట్టీ ముఖం యెరుపెక్కడం చూశాక లేవిన్ యీర్ష్య భావం చాలా యెక్కువైంది. ఆమె యిప్పుడు మాట్లాడిన మాటలకి అతను తన ధోరణిలో వ్యాఖ్య చెప్పుకున్నాడు. తర్వాత ఆ విషయం గురించి తలుచుకున్నప్పుడు యేమిటిది నిజమా అని తోచినా, వెస్లోవ్‌స్కీకి వేట సౌఖ్యాన్ని యిచ్చేటందుకు గాను తను మర్నాడు వేటకి వెడుతున్నట్టేనా అని ఆమె అడిగిందనీ, ఆమె అతన్ని ప్రేమిస్తోందనీ లేవిన్‌కి నమ్మకంగా అనిపించింది.

"ఆఁ, వెడుతున్నా" అని అతను తనకే వెలపరంగా కనిపించిన అస్వాభావిక స్వరంతో అన్నాడు.

"వద్దు, రేపు యింట్లో వుండి పొండి. దాలీ వాళ్ళాయన్ని సరిగ్గా పలకరించను కూడా పలకరించలేదు కదా. యెంత కాలమైందో ఆయన్ని చూసి. యెల్లుండి వెడుదురు గాని" అంది కిట్టీ.

కిట్టీ అన్న యీ మాటలకి లేవిన్ మరోలా వ్యాఖ్యానం చెప్పుకున్నాడు: 'నా దగ్గర్నుంచి 'యితన్ని' తీసుకెళ్ళద్దు. నువ్వు వెళ్ళినా నాకు ఫరవా లేదు. సరదాగా వున్న యీ పడుచతని సాంగత్యం నాకు లేకుండా చెయ్యద్దు' అని.

"అలాగే, నువ్వు కావాలంటే వుండిపోతాం" అని ప్రత్యేకం మధురంగా వుండేటట్టు లేవిన్ అన్నాడు.

వెస్లోవ్‌స్కీ తన ఉనికి యెలాంటి వ్యధకి కారక మవుతోందో గమనించకుండా కిట్టీని చూసి అనురాగభరితంగా నవ్వి, బల్ల దగ్గరనుంచి లేచి ఆమె వెనక వెళ్ళేడు.

ఆ అనురాగపూరిత మందహాసాన్ని లేవిన్ గమనించేడు. అతని ముఖం పాలిపోయింది. వొక్క క్షణం వూపిరి ఆగినంత పని అయింది. 'నా భార్యకేసి అలా చూడ్డానికి యెంత ధైర్యం' అనుకున్నాడు. కోపంతో కుతకుత లాడిపోయేడు.

"వూఁ, రేపు వెడదామా? రేపే వెడదాం" అని వెస్లోవ్‌స్కీ తన అలవాటు ప్రకారం మోకాలిమీద కాలు వేసుకుంటూ అన్నాడు.

లేవిన్ యీర్ష్య యింకా యెక్కువైంది. తను వంచితుడైన భర్తగా అతను భావించు కున్నాడు. తన భార్య, ఆమె ప్రియుడూ సుఖంగా, సౌకర్యంగా వుండేందుకే కేవలం తన అవసరం వున్నట్టుగా అతనికి అనిపించింది... అయినా అతను వెస్లోవ్‌స్కీని అతని వేట

గురించీ, తుపాకుల గురించీ, బూట్ల గురించీ మర్యాదగానే అడిగేడు. మర్నాడు ఉదయం వెళ్లడానికి యిష్ట పడ్డాడు.

లేవిన్ అదృష్టం బాగుండి పెద్ద ప్రిన్సెస్ లేచి, కిట్టీని వెళ్లి పడుకొమ్మని సలహా యివ్వడంతో అతనికి యాతన తప్పింది. కాని లేవిన్‌కి మరో పరీక్ష యెదురైంది. కిట్టీ వెళ్లి పోయేటప్పుడు సెలవు చెప్తున్నట్టుగా వెస్లోవ్‌స్కీ ఆమె చేతిని ముద్దుపెట్టుకోబోయేడు. కాని ఆమె గబగబా చేతిని వెనక్కి లాక్కుని సిగ్గుతో యెర్రబడిపోతూ అమర్యాదగా – అలా ప్రవర్తించినందుకు ఆమెని తల్లి తర్వాత మందలించింది – అంది:

''యిక్కడ అలా చెయ్యరు'' అని.

ఆమె మొదటగా అంత చనువు యివ్వడం తప్పు అని, తర్వాతగా తన అయిష్టతని అలా అమర్యాదగా ప్రదర్శించడం తప్పు అని లేవిన్‌కి అనిపించింది.

''యేమిటి? యిప్పుడు వెళ్లి పడుకోవడంలో అందం యేముంది?'' అన్నాడు అబ్లాన్‌స్కీ. భోజనాలప్పుడు తాగిన ఛషకాల వైన్‌వల్ల అతనికి మధుర, కావ్యమయ మనఃస్థితి వచ్చింది. ''చూడు కిట్టీ'' అని అతను లిండెన్ చెట్ల వెనకనుంచి ఉదయిస్తూ వున్న చంద్రుడికేసి చూపిస్తూ అన్నాడు. ''యింతకంటే అందంగా కనిపించేది యేం వుంటుంది? వెస్లోవ్‌స్కీ, ప్రేమ గీతాలు ఆలాపించే సమయం యిది. అతని స్వరం చాలా బావుంటుంది, తెలుసా? అతనూ నేనూ యిక్కడికి వచ్చేటప్పుడు దారి పొడుగూతూ మా స్వరాలు బాగా కలిసేటట్టు పాడుకుంటూనే వున్నాం. అతను కొన్ని మంచి ప్రేమ గీతాలు తెచ్చేడు – రెండు కొత్తవి. వారెంకాతో కలిసి పాడితే చెప్పావ్, మజా!'' అన్నాడు.

అందరూ పడకలు చేరాక అబ్లాన్‌స్కీ, వెస్లోవ్‌స్కీలు చెట్ల మధ్య దారిలో ప్రేమ గీతాలు పాడుకుంటూ చాలా సేపు షికారు చేశారు. కొత్త పాటలు పాడేరు.

భార్య పడక గదిలో చేతుల కుర్చీలో ఆ పాటలు వింటూ కూర్చున్నాడు లేవిన్. అతను ముటముటలాడుతూ కూర్చున్నాడు. యేమిటి విషయం అని భార్య పదేపదే అడిగినా జవాబు చెప్పకుండా మొండిగా కూర్చున్నాడు. కాని ఆమె ధైర్యం తెచ్చుకుని ''నీకు వెస్లోవ్‌స్కీ వ్యవహారం నచ్చలేదు కదా?'' అని బెరుకు బెరుగ్గా చిరునవ్వు నవ్వుతూ అనేటప్పటికి లేవిన్ బయ్‌న లేచిపోయేడు. తన మనసులో వున్న యావత్తూ చెప్పేశాడు. ఆ చెప్పిన విషయంవల్ల మనసు గాయపడటంతో మరింత రెచ్చిపోయేడు.

లేవిన్ ఆమె ముందు నుంచున్నాడు. సాగదీసుకున్న కనుబొమల కింద కళ్లు భీతావహంగా నిప్పులు కక్కుతున్నాయి. అతను తన శక్తుల్ని అదుపులో వుంచుకుంటూ వున్నట్టుగా ఛాతీ మీద తన బలమైన చేతుల్ని కట్టుకున్నాడు. అతని ముఖం కటువుగా, క్రూరంగా కూడా వుండి వుండేది. కాని కిట్టీని కలిచి వేసిన వేదన దాన్ని తగ్గించింది. అతని దవడలు కంపించేయి, అతని కంఠం రుద్ధం అయింది.

"కాని అర్థం చేసుకో, నాకు యీర్ష్య లేదు, అది యేవగింపు మాట. నాకు యీర్ష్య లేదు, దీన్ని నమ్మను... యెలా చెప్పాలో నాకు తెలీటం లేదు... కాని ఘోరం... నాకు యీర్ష్య లేదు కాని నాకు అవమానంగా, బాధగా వుంది నీ గురించి అలా అనుకోవడానికి కూడా... యెవళ్లేనా నిన్ను అలా చూసే సాహసం చెయ్యడం."

"యెలా చూడ్డం?" అని కిట్టీ అడిగింది. ఆ సాయంత్రం జరిగిన ప్రతి దాన్నీ, ప్రతి మాటనీ వివరంగా పాపభీతితో గుర్తు చేసుకో ప్రయత్నించింది.

వెస్లోవ్‌స్కీ తన వెనకాలే బల్ల రెండో వేపు వచ్చినప్పుడు ఆ క్షణంలో అలాంటిది లీలగా గోచరమైన విషయం తన హృదయం లోతుల్లో కిట్టీకి తెలుసు. ఆ విషయాన్ని చెప్పడం, తద్వారా అతని వ్యధని యెక్కువ చెయ్యడం మాట అటుంచి, అలాంటిది అనిపించినట్టు తనకిగా తనే అంగీకరించలేదు.

"యిప్పుడు నే వున్న పరిస్థితిలో యెవళ్లకేనా యెలా ఆకర్షవంతంగా వుంటాను?"

"అబ్బ!" అని లేవిన్ తల పట్టుకుని అరిచేడు. "అలా అంటావు!.. అంటే నువ్వు ఆకర్షవంతంగా వుండి వుండే..."

"లేదు, లేదు కొంచెం ఆగు! విను!" అని ఆమె అతనికేసి బాధగా జాలిగా చూస్తూ అంది. "నాకు వేరే మగాళ్ల ఉనికే లేనప్పుడు, నిజంగా లేనప్పుడు, నువ్వెలా ఆ మాట అన గలవు?.. నేను యెవళ్లనీ కలుసుకోకుండా వుండాలని వుందా నీకు?" అంది.

మొదట అతని అసూయ ఆమెకి కష్టం కలిగించింది. తను చాలా సాధారణంగా, భోళా భోళీగా యెవళ్లతోనేనా మాట్లాడుతూ కాలక్షేపం చెయ్యకుండా ఆటంక పరచడం ఆమెకి కోపం కలిగించింది. కాని యిప్పుడు భర్త పడే బాధని తప్పించడానికి, అతను ప్రశాంతంగా వుండేటట్టు చెయ్యడానికీ, యిలాంటి చిన్నచిన్న వాటినే గాక అన్నిటినీ కూడా త్యాగం చెయ్య డానికి సిద్ధంగా వుంది.

"నువ్వీ విషయం అర్థం చేసుకో. నా పరిస్థితి యెంత ఘోరంగా, హాస్యాస్పదంగా వుందో" అని లేవిన్ హతశాపూరితంగా అన్నాడు. "అతను నా యింట్లో వున్నాడు, నిజానికి తప్పూ యేమీ చెయ్యలేదు. తన చనువుని చూపించుకోవడం, కాలుమీద కాలు వేసుకు కూర్చోవడం తప్ప. అది సత్ప్రవర్తన అని అతనను కుంటున్నాడు, అందుగ్గాను నేను అతనితో సాయిలాపాయి లాగా వుండాలన్నమాట" అన్నాడు.

"కాని నువ్వు గోరంతలు కొండంతలు చేస్తున్నావు" అని కిట్టీ అంది. అతనిలో అలాంటి యీర్ష్యకి కారకమైన ప్రేమ శక్తికి లోపల్లోపల ఆమెకి సంతోషంగా వుంది.

"యిక అన్నిటి కంటే ఘోరం నువ్వు – నాకు సంబంధించి సర్వదా యెలా వున్నావు, యిప్పుడు యెంతో పవిత్ర పావన మూర్తిగా వున్నావు, మనం యింత ఆనందంగా వున్నప్పుడు, యెంతో గొప్ప ఆనందంగా వున్నప్పుడు... యెవడో త్రాష్టుడు హఠాత్తుగా వూడిపడడం...

వుహుఁ, భ్రష్టుడు కాదు... అయినా అతన్ని తిట్టడం యెందుకు? అతన్తో నాకేం సంబంధం లేదు. కాని నా ఆనందం, నీ ఆనందం యెందుకు..."

"నాకు తెలుసు యెందుకు అలా జరిగిందో" అని కిట్టీ చెప్పడం మొదలుపెట్టింది.

"యెందుకు? అలా యెందుకు జరిగింది?"

"మేం భోజనాల దగ్గర మాట్లాడుకుంటూ వుండగా మమ్మల్ని నువ్వెలా చూశావో నేను గమనించేను" అంది.

"ఆఁ, అదే, అదే" అని లేవిన్ భయపడుతూ అన్నాడు.

తాము దేన్ని గురించి మాట్లాడుకున్నారో ఆమె చెప్పింది. ఆమె ఆవేశపడి మాట్లాడుతూ వుండడంతో ఆమెకి కొంచెం కొంచెంగా ఆయాసం వచ్చింది. ఓ క్షణంసేపు లేవిన్ యేమీ అనలేదు. బెదిరి, పాలిపోయిన ఆమె ముఖంకేసి చూసి వున్నట్టుండి తల పట్టుకున్నాడు.

"కిట్టీ, నిన్ను నరక యాతన పెట్టేస్తున్నాను! నన్ను క్షమించు, నా కిట్టీ! నాకు పిచ్చి పట్టింది. తప్పంతా నాదే. పొట్టి పుణ్యానికి యెందుకూ కొరగాని చెత్తకి నేనెందు కింద వ్యథ పడ్డాను?"

"నువ్వంటే నాకు జాలిగా వుంది."

"నామీద? నామీద? నేను, నేను నిజంగా పిచ్చివాణ్ని. కాని నువ్వెందుకు బాధ పడాలి? యెవడో దారిన పోయే దానయ్యవల్ల మన ఆనందం విషపూరితం అవుతుంద నుకోవడం దారుణం."

"అవును, యిది చాలా బాధాకరమైన విషయమే..."

"వుహుఁ, యేమైనా అతన్ని యీ వేసవి అంతా యిక్కడే వుంచేస్తాను. అతనిపట్ల ఆదరంగా వుంటాను" అని లేవిన్ కిట్టీ చేతిని ముద్దుపెట్టుకుంటూ అన్నాడు. "చూడు, రేపు... ఆఁ, నిజంగానే... రేపు మేం వేటకి వెడుతున్నాం" అన్నాడు.

## 8

మర్నాడు ఉదయం ఆడవాళ్ళు యింకా లేవలేదు, వేటకి వెళ్ళే బగ్గీ, బండీ సింహద్వారం దగ్గరికి వచ్చి నుంచున్నాయి. వేటకి వెడుతున్నారని పొద్దున్నే పసికట్టిన కుక్క లాస్కా చిన్న చిన్నగా మొరుగుతూ గెంతుతూ వుంది. ఆ మొరుగులు గెంతులు అయేక బగ్గీలో తోలేవాడి పక్కన చేరి కూర్చుంది. గుమ్మంకేసే చూస్తూ వుంది. యేమిటి వీళ్ళు యెంతకీ రారు అని అసంతృప్తి పడింది, వేటకి వెడుతున్నారన్న ఉత్తేజం వున్నాగానీ. మొదట వెస్లోవ్స్కీ వచ్చేడు. అతను లావాటి పిక్కల మధ్యదాకా వచ్చేటట్టు కొత్త పెద్ద బూట్లు వేసుకున్నాడు. ఆకు పచ్చని కమీజు తొడుక్కున్నాడు. దాని చుట్టూతా కొత్త తూటా పట్టీ కట్టుకున్నాడు. ఆ పట్టీ తోలు వాసన కొడుతోంది. రిబ్బన్ల టోపీ పెట్టుకున్నాడు. మెడలో వేసుకునే దట్టీలేని

ఇంగ్లీషు తుపాకీని పట్టుకున్నాడు. లాస్కా అతని దగ్గరికి పరిగెత్తి వెళ్ళింది. మిగిలిన వాళ్ళు వూడి పడుతున్నారా లేదా అని అతన్ని తన పద్ధతిలో అడిగింది. అతన్నుంచి యే జవాబూ రాకపోవడంతో తన చోట్లోకి తిరిగి వెళ్ళి తల వొరగేసుకుని, వో చెవి రిక్కించి, ఉగ్గ బట్టుకుని కూర్చుంది. యెట్టకేలకి తలుపు తెరుచుకుంది. అబ్లాన్‌స్కీ పొడల కుక్క క్రాక్ దూసుకుంటూ వచ్చింది. తాజా గాలిలో చక్కర్లు కొడుతూ, వురుకుతూ వచ్చింది. దాని వెనక్కాలే అబ్లాన్‌స్కీ వచ్చేడు. అతని చేతిలో తుపాకీ వుంది. అతని నోట్లో చుట్ట వుంది. ''కిందికి, కిందికి, క్రాక్'' అని అతను ఆప్యాయంగా దాన్ని వూరుకో బెట్టేందుకు అరిచేడు. అది అతని ఛాతీమీద, కడుపుమీద పంజాలు పెట్టుకుని వేట సంచీకేసి వచ్చినప్పుడు అలా అరిచేడు. అబ్లాన్‌స్కీ కురచ కోటు తొడుక్కున్నాడు. యీసులు లేచిపోయిన లాగు తొడుక్కున్నాడు. మెత్తటి చర్మం బూట్లు వేసుకున్నాడు. రైతుల మాదిరీ కాళ్ళకి మేజోళ్ళలాగా గుడ్డ ముక్కలు చుట్ట బెట్టేడు. తలమీద యెప్పటిదో శిథిలమైన టోపీ పెట్టుకున్నాడు. కాని అతని తుపాకీ మాత్రం భేషైంది. అతి కొత్త తయారీ. అతని వేట సంచీ, తూటాల పట్టీ కొత్తవి కాకపోయినా సాటిలేని పనివాడితనంతో వున్నవి.

దిమ్మరిలాగా వేషం వేసుకోవడం, కాని సొమ్ము పెట్టి కొనుక్కోగల అత్యుత్తమమైన పరంజామాని సమకూర్చుకోవడం వేటగాళ్ళ షోకు వేషం అని వెస్లోవ్‌స్కీకి తెలీదు. అతను అబ్లాన్‌స్కీ చూసి యిప్పుడు ఆ విషయాన్ని నేర్చుకున్నాడు. అబ్లాన్‌స్కీ చింకి పాతల్లో హుందాగా, పుష్టిగా, హుషారుగా అసలైన పెద్దమనిషిలా కనిపించేడు. మళ్ళీ సారి వేటకి వెళ్ళినప్పుడు తనూ అలానే తయారవాలని వెస్లోవ్‌స్కీ నిర్ణయించుకున్నాడు.

''యేడీ లేవిన్?'' అని అడిగేడు.

''పడుచు పెళ్ళాం'' అన్నాడు అబ్లాన్‌స్కీ చిరునవ్వు నవ్వుతూ.

''ముచ్చటైన పెళ్ళాం, పైగా.''

''తయారయేడు. మళ్ళీ వెనక్కి పరిగెత్తి వుంటాడు.''

అబ్లాన్‌స్కీ అన్నది నిజమే. లేవిన్ మళ్ళీ పెళ్ళాం దగ్గరికి పరిగెత్తేడు. అంతకు ముందు రోజు సాయంత్రం తను తెలివితక్కువగా ప్రవర్తించినందుకు ఆమె క్షమించిందో లేదో అడగడానికీ, నీకు పుణ్యం వుంటుంది జాగ్రత్తగా వుండు, పిల్లలు దూసుకుంటూ వచ్చి మీద పడతారు చూసుకోమని ఆమెని మందలించడానికీ పరిగెత్తి వెళ్ళేడు. అదీగాక, తను రెండు రోజులు ఆమెని వదిలి వెడుతూ వున్నందుకు ఆమె తనమీద కోప్పడకుండా వుందని ధైర్యం చిక్కడానికీ, ఆమె ఆ మర్నాడు ఉదయం రేండే రెండు ముక్కలు నేను బాగున్నాను అని రాసి చీటీ తనకి పంపించాలని వొత్తిడి చెయ్యడానికి వెళ్ళేడు.

భర్త తనని వదిలి వెడుతున్నందుకు, యిప్పుడు యేకంగా రెండ్రోజులపాటు వెడుతున్నందుకు, కిట్టీ యెప్పటిలాగానే కష్టపెట్టుకుంది. కాని అతన్ని చూడగానే ఆమె తన బాధని మర్చిపోయింది. అతను వేటకి వెళ్ళే ఆతృతతో వున్నాడు. వేట బూట్లు, తెల్లని జుబ్బా వేసుకుని

యెంతో పెద్దగా, దృఢంగా కనిపించేడు. వేటకి వెళ్లే వాళ్ల ఉత్తేజం అతనిలో కనిపిస్తోంది. ఆమెకి అది అర్థం కాదు. అతని సంతోషం కోసం ఆమె తన బాధని మర్చిపోయి, నవ్వుతూ వీడ్కోలు చెప్పింది.

"ఆలస్యం అయింది యేమీ అనుకోకండి" అంటూ అతను గుమ్మంలోనుంచి పరిగెత్తు కుంటూ వచ్చేడు. "నాస్తా పెట్టేరు కదా? జేగురు గుర్రాన్ని కుడి వేపున కట్టేరేం? ఫూ, పోన్లెండి, ఫర్లేదు. లాస్కా, పద, పద, నీ చోట్లో కూర్చో" అన్నాడు.

"వాటిని మందలో కట్టెయ్యి" అని పొట్టేళ్ల గురించి యేం చెయ్యమంటారని అడిగిన పాలేరుకేసి తిరిగి అన్నాడు. "మరేం అనుకోకండి, బాబులూ. మరో చీడ తగులు కుంటోంది" అన్నాడు.

లేవిన్ అప్పుడే సర్దుకు కూర్చున్నాడు. యింతలోకే కొలబద్ద తీసుకుని తన దగ్గరికి వడ్రంగం వాడు వస్తూ వుంటే చూసి బగ్గీలోనుంచి కిందికి వురికేడు. అతనికేసి వెళ్లాడు.

"నిన్న సాయంత్రం ఆఫీసుకి రమ్మంటే రాలేదు. నాకేమో యిప్పుడు ఆలస్యం అయి పోతోంది. యేమిటి సంగతి?"

"తమరు వూఁ అంటే మరో వరస వేస్తా. వొక్క మూడు మెట్లు మాత్రమే నయ్యా. చాలా బాగా కుదురుతుంది. బావుంటుంది."

"నా మాట వినిపించుకోవేం?" అని లేవిన్ విసుక్కున్నాడు. "నీకు ముందే చెప్పాను, మొదట చట్రం కట్టు, తర్వాత మెట్లు పెట్టు అని. యిప్పుడిక చేసేదేమీ లేదు. చెప్పి నట్టు చెయ్యి. కొత్త చట్రం తయారు చెయ్యి" అన్నాడు.

గొడవేమిటంటే యింటికి కొత్త కొంజా యెత్తేటప్పుడు మెట్లని విడిగా చేసి వడ్రంగి దాన్ని పాడుచేశాడు. అంతా తయారయేక చూస్తే వొంపులు వచ్చేయి. పాత చట్రాన్ని అలాగే వుంచి మూడు మెట్లు చేరుస్తానంటాడు వడ్రంగి.

"చాలా పెద్ద పని అవుతుందండి."

"ఆ మూడు మెట్లనీ పెడితే పడిగట్టు యెక్కడికి చేరుతుంది?"

"మీరు గబబిడ చేసేస్తున్నారు" అని వడ్రంగి తిరస్కారంగా చిరునవ్వు నవ్వేడు. "సరైన చోట్లోకే వెడతాయి. కిందనుంచి సరిచేస్తాం" అని వొప్పిస్తున్న కవళిక పెట్టి అన్నాడు. "పైకి యెక్కుతూ వెడతాయి, యెక్కుతూ వెడతాయి. సరిగ్గా సర్దుకుంటాయి" అన్నాడు.

"మూడు మెట్లు అయితే బారు యెంత వుంటుందను కుంటున్నావ్?... అలా అయితే యెక్కడికి వెడతాయి?"

"అది నే జూసుకుంటా, కిందనుంచి సరిచేస్తాం, సర్దుకుంటాయి" అని అతను మొండిగా అంటూనే వున్నాడు.

"అవును, సర్దుకుంటాయి, కప్పుదాకా, గోడదాటి."

''లేదు హుజూర్, కిందనుంచి పైకి వెళ్తాయి. పైకి పైకి వెళతాయి.''

లేవిన్ తుపాకీ తీసుకుని మట్టిలో పడిగట్టు గీయడం మొదలుపెట్టేడు.

''చూశావా?''

''ఆయ్! తమరు సెలవిచ్చినట్టే'' అని వ్రడంగి అన్నాడు. జ్ఞానోదయం అయినట్టు హఠాత్తుగా అతని కళ్లు మెరిశాయి. ''అయితే కొత్త చక్రం చెయ్యాల్సిందే'' అన్నాడు.

''అంచేత నే చెప్పినట్టు చెయ్యి'' అని బండిలోకి యెక్కుతూ లేవిన్ అరిచేడు. ''పూ, పద, ఫిలిప్, కుక్కల్ని పట్టుకో'' అన్నాడు.

ఇంటి గొడవలూ, సంసారం చింతలూ వెనక బడిపోయేక లేవిన్‌కి జీవితం, ఆశ యెంత గాఢమైన సుఖానుభూతిని యిచ్చేయంటే అతనికి మాటా పలుకూ ఆడేందుకు కూడా మనసు పుట్టలేదు. అదీగాక ప్రతి వేటగాడు తన వేట రంగస్థలం చేరినప్పుడు కలిగే సాంద్ర ఉత్తేజ భావం అతనికి కలిగింది. అతని మనసులో యిప్పుడు వొక్కటే ఆలోచన తిరుగుతోంది. కోల్పెన్‌స్కీ బాడవలో యేం దొరుకుతుందీ, క్రాక్‌తో పోటీలో లాస్క యెలా వుంటుందీ, వేటలో తనకి యెలా కలిసి వస్తుందీ అనే ఆలోచనే వుంది. కొత్త మనిషి ముందు తను తేలిపోతే అవమానం కదూ అనిపించింది. అబ్లాన్‌స్కీ తనని మించిపోతాడేమోననే ఆలోచనా అతనికి తట్టింది.

అబ్లాన్‌స్కీ కూడా కొంచెం యించుమించులో యిలాంటి ఆలోచనలే వచ్చేయి. అతనూ మౌనంగా వుండిపోయేడు. వెస్లొవ్‌స్కీ వొక్కడే హుషారుగా మాట్లాడేస్తూ వున్నాడు. అతని మాటలు వింటూ అయ్యో పాపం యితని పట్ల నిన్న సాయంత్రం అన్యాయంగా ప్రవర్తించేనే అని లేవిన్ సిగ్గుపడ్డాడు. వెస్లొవ్‌స్కీ నిజంగానే భేషైన వాడు. భోళాభోళీ మనిషి, సరదా అయిన వాడు, మంచి వాడు. పెళ్లి కాక ముందు అతన్ని కలుసుకొని వుంటే లేవిన్ అతనికి మిత్రుడై వుండేవాడు. జీవితం పట్ల అతని కులాసా వైఖరీ, డాబు ప్రదర్శించాలనే తత్వం లేవిన్‌కి నచ్చలేదు. పొడుగాటి గోళ్లూ, స్కాచ్ టోపీ యింకా యితరమైనవీ తనకి వున్నందుకు అతను గొప్పగా భావించుకుంటూ వున్నట్టుంది. అయినా అతని సత్స్వభావానికీ, నడవడికకీ వీటిని క్షమించవచ్చు. అతని పెంపకం మంచిది, అతనికి ఫ్రెంచి, ఇంగ్లీషు చాలా బాగా వచ్చు. అతను తను చాలులో వుండే మనిషి. అందుగ్గాను లేవిన్‌కి అతని పట్ల యిష్టం కలిగింది.

వెస్లొవ్‌స్కీకి దాసటి గుర్రం నచ్చింది. అది దాన్ జాతి స్తెప్ బీళ్ల గుర్రం. తన పొగడ్తని దాచుకోలేకపోయేడు.

''స్తెప్ బీళ్ల గుర్రంమీద స్తెప్ మైదానంలో దౌడు తియ్యడం యెంత బాగుంటుంది? యేం, బాగోదూ?'' అని అడిగేడు.

స్తెప్ బీళ్ల గుర్రంమీద స్వారీ చెయ్యడం గురించి వెస్లొవ్‌స్కీ లాలిత్య భరిత కల్పన చేసుకోవడం అకల్మష సౌందర్యాన్వితమూ వాస్తవంతో అతకనిదీనీ. కాని అతని అమాయ

కత్వం, అతని అందం, సొగసైన మందహాసం, ముచ్చటైన హావ భావాలతో కలిసి అతన్ని చాలా ఆకర్షవంతం చేసింది. వెస్లోవ్‌స్కీ సాహసం లేవిన్‌కి నచ్చినందువల్ల నైతేనేం, ముందు రోజు సాయంత్రం కలిగిన చెడ్డ వూహాలకి ప్రాయశ్చిత్తం చేసుకోవాలనుకోవడం వల్ల నైతేనేం యిప్పుడు లేవిన్‌కి వెస్లోవ్‌స్కీతో వుండడం ఆహ్లాదంగా వుంది.

మూడు వెర్‌స్తులు వెళ్ళాక తన యాదాస్తు పుస్తకం, సిగార్ కేస్ లేవని వెస్లోవ్‌స్కీ హఠాత్తుగా చూసుకున్నాడు. అవి పోయాయో, లేక వాటిని బల్లమీద వదిలేశాడో తెలియలేదు. యాదాస్తు పుస్తకంలో మూడు వందల డెబ్బై రూబుళ్ళు వున్నాయి. అంచేత యీ విష యాన్ని అంత తేలికగా చూడ్డానికి వీల్లేదు.

"లేవిన్‌గారూ వో మాట చెప్తా. దాన్ గుర్రంమీద యింటికి దౌడు తీసి వెళ్ళి వస్తా. దివ్యంగా వుంటుంది, కదా?" అని బండి దిగబోతూ అడిగేడు.

"అబ్బే, యెందుకు?" అని లేవిన్ మనసులో వెస్లోవ్‌స్కీ కనీసం ఆరు పూడ్లేనా* వుంటాడని గుణించుకుంటూ అన్నాడు. "బండివాణ్ణి పంపిస్తా" అన్నాడు.

బండితోలే వాణ్ణి పంపేరు. లేవిన్ తనే గుర్రాల్ని తోలేడు.

## 9

"మన దారి యెలా? సరిగ్గా చెప్పు" అన్నాడు అబ్లాన్‌స్కీ.

"యిదీ మన కార్యక్రమం: మనం యిప్పుడు గ్వొజ్‌ద్యోవో దాకా వెడదాం. దాని ఆవతలి వేపు పెద్ద కంజుపిట్టల బాడవ వుంది. అక్కణ్నుంచి బాడవ చాలా వుంటుంది. మనకి పెద్ద కంజులూ, చిన్న కంజులూ కూడా కనిపిస్తాయి. యిప్పుడు వేడిగా వుంది. సాయంత్రం అయే వేళకి అక్కడికి చేరుకుంటాం (సుమారు యిరవై వెర్‌స్తులు). సాయంత్రం కూడా వేటాడదాం. రాత్రి అక్కడ దిగడి రేపు ఉదయమే బయల్దేరి పెద్ద బాడవలకి వెడదాం."

"దారిలో యేమీ వుండవా?"

"వున్నాయి గాని, దండుగ వ్యవహారం. పైగా వేడిగా వుంది. భేషైన చోట్లు రెండు వున్నాయి గాని నాకనుమానం యేమన్నా దొరుకుతాయా అని."

ఆ చోట్లకి వెళ్ళాలని లేవిన్‌కే వుంది. కాని అవి యింటికి దూరం కాదు, తను అక్కడికి యెప్పుడు కావాలనుకున్నా వెళ్ళగలడు. పైగా ఆ చోట్లు చాలా చిన్నవి, ముగ్గురు వేటగాళ్ళకి తగ్గంత వేట అక్కడ వుండదు. అందుకని అక్కడ యేమన్నా దొరుకుతాయో లేదో తనకి అనుమానంగా వుందని దాట వేశాడు. వాళ్ళు చిన్న బాడవ అందుకున్నాక లేవిన్ ముందుకు వెళ్ళి పోదామనుకున్నాడు గాని అబ్లాన్‌స్కీ షికారీ దృష్టి దారిలోనే కనిపించే బాడవని పట్టే సింది.

"యిక్కడ వద్దా యేం?" అని బాడవని చూపిస్తూ అడిగేడు.

''లేవిన్‌గారూ వెడదామండీ! యెంత మంచి చోటు!'' అన్నాడు వెస్లోవ్‌స్కీ. లేవిన్ కాదనలేకపోయేడు.

బండి ఆగీ ఆగగానే కుక్కలు వొక దాని వెనక వొకటి గబగబా బాడవకేసి పరిగెత్తి పోయేయి.

''క్రాక్! లాస్కా!''

అవి తిరిగి వచ్చేయి.

''ముగ్గురికీ అక్కడ యిరుకవుతుంది. నేనిక్కడ వుండిపోతా'' అన్నాడు లేవిన్, వాళ్లకి అక్కడ చిన్న కంజులు తప్ప దొరకవన్న భావంతో. కొన్ని పిట్టలు కుక్కలకి బెదిరి యెగిరి పోయి, బాడవపైన చక్కర్లు తిరుగుతున్నాయి, గీగీ మంటూ కూస్తున్నాయి. అక్కడ యేమీ దొరకవు అనిపించింది.

''అబ్బ, రండి, లేవిన్‌గారూ అందరం కలిసి వెడదాం'' అన్నాడు వెస్లోవ్‌స్కీ.

''వద్దు, అక్కడ చోటు చాలా యిరుగ్గా వుంది. వెనక్కి రా, లాస్కా, యేయ్ లాస్కా! మీకు యింకో కుక్క అవసరమా?''

లేవిన్ వెనక దిగడిపోయి బగ్గీ పక్క నుంచుని అసూయగా మిత్రులకేసి చూశేడు. వాళ్లు మొత్తం బాడవ అంతా తిరిగేరు. అడివి కోళ్లు, చిన్న కంజులు తప్ప వేరే యేమీ లేవు. వెస్లోవ్‌స్కీ వొకదాన్ని కొట్టేడు.

''చూశారా, అందుకనే యీ బాడవ దగ్గర ఆగవద్దన్నాను. వొట్టి దండుగ వ్యవహారం'' అన్నాడు లెవిన్.

''ఆఁ, యేదో సరదా. చూశారుగా?'' అని బండిలోకి యెడ్డిగా యెక్కుతూ అన్నాడు వెస్లోవ్‌స్కీ. అతనికి వో చేతిలో తుపాకీ, వో చేతిలో అడివి కోడీ వున్నాయి. ''దీన్ని యెలా కొట్టేనని! మీరు చూశేరా? మనం అసలైన చోటుకి యెప్పుడు చేరతాం?'' అన్నాడు.

హఠాత్తుగా గుర్రాలు యెదరకి లాగడంతో లేవిన్ తల తుపాకీ గొట్టానికి కొట్టుకుంది. తుపాకీ గుండు పేలిన శబ్దం వినిపించింది. వాస్తవానికి గుండు ముందు పేలింది, కాని లేవిన్‌కి అది ముందూ యిది తర్వాతా జరిగి నట్టనిపించింది. విషయం యేమిటంటే వెస్లోవ్‌స్కీ వొక బారెల్ ట్రిగ్గర్‌ని నొక్కుతూ దాని బటన్‌కి బదులు పొరపాటుగా రెండో దాని బటన్ మూశేడు. అదృష్టవశాత్తూ తూటా నేలలోకి పోయింది, యెవళ్లూ గాయపడలేదు. అబ్లానిస్కీ తల వూపి, వెస్లోవ్‌స్కీకేసి చూస్తూ మందలిస్తున్నట్టు నవ్వేడు. అతన్ని మందలించే ధైర్యం లేవిన్‌కి లేకపోయింది. వొక కారణం యేమంటే యే మందలింపేనా గానీ తాము తప్పించుకున్న ప్రమాదం కారణంగానూ, తన తలకి తగిలిన దెబ్బ కారణంగానూ వచ్చినట్టు కనిపిస్తుంది. రెండవ విషయం, వెస్లోవ్‌స్కీ మొదట నిజంగా చాలా బాధ పడిపోయేడు, తర్వాత ముగ్గురికీ సామాన్యంగా కలిగిన బెదురు చూసి నిష్కల్మషంగా నవ్వేశేడు. దాంతో లేవిన్ కూడా నవ్వకుండా వుండలేకపోయేడు.

రెండో బాడవ కొంచెం పెద్దది. వేట చాలా సేపు సాగుతుంది. అక్కడికి చేరాక లేవిన్ ఆగ ద్దని అన్నాడు. కాని మళ్లీ వెస్లోవ్‌స్కీయే బలవంతం చేశాడు. కాని బాడవ ముగ్గురి వేటకీ చిన్నది కావడంతో లేవిన్ గృహస్థధర్మంగా తను బండిలో దిగడిపోయేడు.

వాళ్లు అక్కడికి వెళ్లగానే క్రాక్ తిన్నగా గడ్డి పెరిగిన మిట్టలకేసి పరిగెత్తింది. ముందుగా వెస్లోవ్‌స్కీ దాని వెనక్కాల పరిగెత్తేడు. అబ్లాన్‌స్కీ అతన్ని అందుకునే లోపలే వో కంజు యెగిరింది. వెస్లోవ్‌స్కీ గురి తప్పింది. ఆ పిట్ట కోత పడని గడ్డి మైదానంమీద కూర్చుంది. అబ్లాన్‌స్కీ దాన్ని వెస్లోవ్‌స్కీకి వదిలేశాడు. క్రాక్ దాన్ని చూసింది, వెస్లోవ్‌స్కీ కొట్టేడు. అప్పుడు తిరిగి బగ్గీ దగ్గరికి వచ్చేడు.

"మీరు వేటకి వెళ్లండి, నేనుంటా యిక్కడ" అన్నాడు.

వేట తమకం లేవిన్‌ని ఆవహించింది. అతను కళ్లేల్ని వెస్లోవ్‌స్కీకి అప్పగించి బాడవ మీదకి వెళ్లేడు.

లాస్కా చాలా సేపటిగా తనకి అన్యాయం జరిగి పోతోందే అని బాధ వెల్లడయే స్వరంతో కుయ్యోకుయ్యో మంటూనే వుంది. యీ అవకాశం రాగానే అది నేరుగా వో చోటుకి పరి గెత్తింది. ఆ చోటుని క్రాక్ చూడలేదు, అది లేవిన్‌కి పరిచయమైన చోటు.

"దాన్నెందుకు ఆపవు?" అని అబ్లాన్‌స్కీ అరిచేడు.

"అది పిట్టల్ని బెదరగొట్టదులే" అని లేవిన్ తన కుక్క గురించి గొప్పపోతూ దాని వెనక్కాలే వడివడిగా వెడుతూ అన్నాడు.

లాస్కా దానికి తెలిసిన చోటుకి యెంత దగ్గరికి వెడుతూ వుంటే అంతలా అది వెతికే తీరు గంభీరంగా వుంది. వొక్క క్షణం సేపే దాని దృష్టి చిన్న బాడవ పిట్టవల్ల పక్కకి మళ్లింది అంతే. అది ఆ చోట్లో వొకసారి చుట్టు తిరిగింది. రెండో సారి అలా తిరగ బోయింది. కాని అంతట్లోకీ వొక్కసారి కుదిలి ఆగిపోయింది.

"రా, యిటు రా, అబ్లాన్‌స్కీ" అంటూ లేవిన్ అరిచేడు. గుండె దడదడ కొట్టు కుంటున్నట్టూ, తన చెవుల కిటికీలు తెరుచుకుని అన్ని ధ్వనులూ దూరంతో సంబంధం లేకుండా వచ్చి పడుతూ వున్నట్టూ లేవిన్‌కి అనిపించింది. అన్ని ధ్వనులూ కలగాపులగం అయిపోయి, కాని తీక్ష్ణంగా, వినిపిస్తున్నట్టు అనిపించింది. అతనికి అబ్లాన్‌స్కీ అడుగుల చప్పుడు వినిపించింది. దూరంనుంచి వినవచ్చే గుర్రపు గిట్టల చప్పుడులా వుంది అది. అతను యెగుడుదిగుడుగా వున్న నేలమీద నడుస్తూ వుంటే మట్టి పెళ్ల గడ్డి మొదళ్లతో సహా చీలి పడి పోతూన్నట్టు సన్నని చప్పుడు వినిపించింది. పక్షి రెక్కలు దూసినట్టు చప్పుడైంది. నీట్లో యేదో తపా మనడం అతనికి వినిపించింది, ఆ చప్పుడేమిటైందీ అతనికి తెలియలేదు.

జాగ్రత్తగా అడుగులు వేస్తూ అతను కుక్క దగ్గరికి వెళ్లేడు.

"వురుకు!"

లాస్కా దగ్గర పెద్ద కంజు లేదు గాని, అది చిన్న కంజుని లేపింది. లేవిన్ తుపాకీ బారు

చేశాడు. గురి చూడబోతున్నాడు, అప్పుడు నీటి తపతప చప్పుడు యెక్కువైంది. మామూలుకంటే గట్టిగా యేదో అరుస్తూ వున్న వెస్లోవ్‌స్కీ గొంతుక వినిపించింది. లేవిన్ సరిగా గురి చూడ లేదుగాని యెద్దైతే అదవుతుందని ట్రిగ్గర్ నొక్కేశాడు.

గురి తప్పింది అని ఖాయంగా తెలిసి, అతను చుట్టూ తిరిగి చూశేడు. బగ్గీ, గుర్రాలు రోడ్డుమీద లేవు, బాడవలోకి వచ్చేశాయి.

గురి యెలా వుందో బాగా చూడ్డం కోసమన్చెప్పి వెస్లోవ్‌స్కీ బాడవలోకి తోలుకు వచ్చేశాడు. గుర్రాలు అందులో దిగబడ్డాయి.

'యీ దెయ్యం యెక్కడ తగలడింది!' అనుకున్నాడు లేవిన్ బగ్గీ దగ్గరికి వస్తూ. "బగ్గీని యిక్కడికి యెందుకు తోలుకు వచ్చేరు?" అని కటువుగా అడిగేడు. బండి తోలే వాణ్ణి పిలిచేడు. యిద్దరూ కలిసి గుర్రాల్ని బాడవ బందలోనుంచి లాగే పనికి నడుం కట్టేరు.

లేవిన్‌కి మంటెక్కి పోయింది. యీ గొడవవల్ల తన గురి తప్పింది. గుర్రాలు బురదలో దిగబడిపోయాయి. పైగా గుర్రాల్ని బండినుంచి విప్పుతూ వుంటే అబ్లాన్‌స్కీ గాని, వెస్లోవ్‌స్కీ గాని తనకీ, బండివాడికీ సాయంగా చెయ్యి అందివ్వడం లేదు, తమ యిద్దర్లో యెవళ్ళకీ గుర్రాల్ని యెలా విప్పాలో తెలీదు. తను బండి తోలిన చోటు అచ్చం పొడిగానే వుందని వెస్లోవ్‌స్కీ ధైర్యం చెపుతూ వుంటే లేవిన్ వొక్క ముక్క కూడా జవాబు చెప్పకుండా బండివాడితో కలిసి తన పనిలో వుండిపోయేడు. తర్వాత పనిలో పూర్తిగా మునిగిపోయేడు. అప్పుడు వెస్లోవ్‌స్కీ మడ్‌గార్డ్ విరిగేట్టు మహా ప్రయాసపడి గట్టిగా పట్టుకుని సాయం చెయ్యబోతూ బండిని వెనక్కి లాగుతూ వుండడం లేవిన్‌కి కనిపించింది. అంతకు ముందు రోజు సాయంత్రం వెస్లోవ్‌స్కీపట్ల తనకి కలిగిన భావంవల్ల అతన్ని నిరాదరంగా చూసి నందుకు లేవిన్ తనని తను నిందించుకున్నాడు. ఆ నిరాదరణకి ప్రాయశ్చిత్తం చేసుకుంటున్న ట్టుగా అతనిపట్ల విశేషంగా యిప్పుడు ఆదరం చూపించేడు. అంతా సవ్యంగా పూర్తయేక, బగ్గీ రోడ్డుమీదకి వచ్చింది. అప్పుడు లేవిన్ నాస్తా వడ్డించమని పురమాయించేడు.

"Bon appétit – bonne conscience![1] Ce poulet va tomber jusqu'au fond de mes bottes[2] అని వెస్లోవ్‌స్కీ వల్లించేడు. రెండో కోడి పూర్తిచేసే వేళకి అతనికి మళ్ళీ హుషారు వచ్చింది. "యిక మన కష్టాలు గట్టెక్కాయి. యిప్పుడు ప్రతీదీ దివ్యంగా సాగుతుంది. కాని నా తప్పులకి నేను బోను యెక్కాలి, కదా? వూఁ, నేను మీ ఆటోమెడాన్*ని. చూడండి యెలా తోలతానో!" అని, కళ్లేల్ని బండివాడికి యిమ్మని లేవిన్ అన్నమాటకి జవాబుగా అన్నాడు. "నా అపరాధాలకి ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. యిక్కడ తోలే చోట వుండడం నాకు మజాగా వుంది" అని బండిని యెదరకి పరిగెత్తించేడు.

---

[1] ఆకలి బాగా వుందీ అంటే అర్థం మనసు సాఫీగా వుందని (ఫ్రెంచి).

[2] (అక్షరాలా) యీ కోడి నా మనసు లోతుల్లోకంటా పోతోంది (ఫ్రెంచి).

అతను గుర్రాల్ని, ముఖ్యంగా అదుపు చెయ్యలేకుండా వున్న దాపటి గుర్రాన్ని, అలవ గొట్టేస్తాడని లేవిన్ భయపడ్డాడు. కాని లేవిన్ అనుకోకుండానే వెస్లోవ్‌స్కీ ఉత్సాహ ప్రభావంలో పడిపోయేడు. అతని ప్రేమ గీతాలు విన్నాడు. ఇంగ్లీషు వాళ్లు four in hand[1] యెలా తోలతారో అభినయిస్తూ వర్ణించి చెప్పడం విన్నాడు. అలా నాస్తా అయింతర్వాత మంచి ఉత్సాహంగా తుళ్లుతూ పేలుతూ గ్వొజ్‌ద్యోవ్ బాడవ చేరారు.

## 10

వెస్లోవ్‌స్కీ చాలా వేగంగా తోలడంతో వాళ్లు అనుకున్నదాని కంటే చాలా ముందుగా గ్వొజ్‌ద్యోవ్ చేరుకున్నారు. అప్పటికి యింకా వేడి తగ్గలేదు.

తమ వేట గమ్యస్థానం చేరుకున్నారు. బాడవ విస్తారంగా వుంది. వెస్లోవ్‌స్కీ బెడదలేకుండా యెలా స్వేచ్ఛగా తన వేట సాగించాలా అని లేవిన్ ఆలోచనలో పడ్డాడు. అబ్లాన్‌స్కీకీ అదే ఆలోచన వున్నట్టుంది. యేమంటే వేట మొదలు పెట్టేటప్పుడు నిజమైన వేటగాడెవడికేనా కలిగే ఆందోళన అతని ముఖంలో లేవిన్‌కి కనిపించింది. అబ్లాన్‌స్కీలో కొన్ని కొన్ని సందర్భాల్లో కనిపించే ఖుషీ చలాకీతనం యిప్పుడు లేవిన్‌కి కనిపించింది.

"అయితే యెలా వెడదాం? బాడవ చాలా పెద్దది, చూడండి డేగలు కూడా వున్నాయి" అని అబ్లాన్‌స్కీ తుంగ పైన ఆకాశంలో చక్కర్లు తిరిగే పెద్ద పెద్ద పకుల్ని చూపించి అన్నాడు. "డేగలున్నాయీ అంటే వేటకి పకులు వున్నాయన్న మాట" అన్నాడు.

"ఆఁ, చూడండి బాబులూ" అని లేవిన్ మోకాళ్లదాకా బూట్లు లాక్కుంటూ, తుపాకీ ట్రిగ్గరు పరీక్షగా చూస్తూ మబ్బుగా వున్నట్టు అన్నాడు. "ఆ తుంగ చూశేరు కదా?" అని అతను నది కుడి వేపున రెల్లు సగం కోసి విస్తరించుకున్న పచ్చిక బీటికేసి చూపిస్తూ అన్నాడు. "బాడవ అక్కణ్నుంచి మొదలవుతుంది. తిన్నగా మన ముందు నుంచి, యేం, చూశారా, ఆకుపచ్చగా వున్న చోట. యిక్కణ్నుంచి కుడి వేపు విస్తరించుకుంది, గుర్రాలున్న చోటుకి. అక్కడ మిట్టలున్నాయి, పెద్ద కంజులు అక్కడ వుంటాయి. తుంగ చుట్టూతా, ఆల్డర్ చెట్ల తోపుదాకా, మిల్లుదాకా వుంటాయి. అదుగో అటు చూడండి, తేమగా వున్న చోటుకి, అది అన్నిటి కంటే భేషైన చోటు. ఓ సారి నేనక్కడ పదిహేడు కంజుల్ని కొట్టేను. మనం కుక్కల్ని తీసుకుని విడివిడిగా వెడదాం, తలా వొక వేపూ వెడదాం. మిల్లు దగ్గర కలుద్దాం" అన్నాడు.

"అయితే యెడం వేపు యెవళ్లు, కుడి వేపు యెవళ్లు?" అని అబ్లాన్‌స్కీ అడిగేడు. "కుడి వేపున యెక్కువ విశాలంగా వున్నట్టుంది, మీరిద్దరూ అటు వెళ్లండి, నేను యెడం వేపు వెడతా" అని చాలా యథాలాపంగా అన్నట్టు అన్నాడు.

---

1 నాలుగు గుర్రాల బండి (ఇంగ్లీషు).

"భేష్! మనం పందెం కొట్టేస్తాం. పదండి, పదండి" అని వెస్లోవ్‌స్కీ అందుకున్నాడు.

లేవిన్‌కి యిక చేసేదేమీ లేకపోయింది. దాంతో వాళ్లు అటు వేపు వెళ్లారు.

బాడవలోకి వెళ్లేటప్పటికి రెండు కుక్కలూ వేట వాసన పట్టడం మొదలుపెట్టేయి. నీళ్లు జేగురు రంగుగా వున్న చోటికి వెళ్లేయి. లాస్కా వేటని వెతికే పద్ధతి లేవిన్‌కి తెలుసు. సావధానంగా అన్ని వేపులా వెతుకుతుంది. ఆతనికి ఆ చోటూ తెలుసు, అది అక్కడ కంజుల గుంపుని పట్టేస్తుంది.

"వెస్లోవ్‌స్కీగారూ, యిటు యిటు దగ్గరగా" అని లేవిన్ లోగొంతుకలో అన్నాడు. వెస్లోవ్‌స్కీ నీళ్లల్లో తపతప యీడ్చుకుంటూ వెనక్కాలే వస్తున్నాడు. కోల్పెన్‌స్కీ బాడవలో పొరపాటుగా తుపాకీ పేలిం తర్వాత వెస్లోవ్‌స్కీ తుపాకీ యెటు యెక్కు పెట్టిందీ లేవిన్ చూసుకుంటూ వున్నాడు.

"వద్దులెండి, మీ దారికి అడ్డం యెందుకు నా గురించి పట్టించుకోకండి."

కాని లేవిన్ పట్టించుకున్నాడు, 'కాస్త జాగ్రత్తగా వేటాడుకోండి, వొకళ్లనొకళ్లు కాల్చుకోకండి' అని వచ్చేటప్పుడు కిట్టీ అన్న మాటలు గుర్తు వచ్చేయి. కుక్కలు వొకదాని కొకటి దగ్గరగా వచ్చేయి. దేనికది తన వేటని పసికడుతూ యింకా యింకా దగ్గర పడ్డాయి. కంజుల కోసం చూడ్డం యెంత తీవ్రంగా వుందంటే జేగురు నీళ్లల్లో కాళ్లు యెత్తి అడుగులు వేసేటప్పుడు వినవచ్చే చప్పుడు కంజుల కూతలాగా అనిపించింది. లేవిన్ తుపాకీని వొడిసి పట్టేసుకునేవాడు.

ధన్! ధన్! అని చెవుల పైన దూసుకుపోయే తుపాకీ గుళ్ల చప్పుడు వినిపించింది. బాడవలో లేచి వేటగాళ్ల వేపు అందుకోలేని యెత్తులో యెగురుతూ వస్తూ వున్న అడివి బాతులకేసి వెస్లోవ్‌స్కీ తుపాకీ పేలుస్తున్నాడు. లేవిన్ వెనక్కి తిరిగి చూడలేదు యింకా అప్పుడే కంజులు వొకటి, మరోటి, మూడోది అలా యేడు, యెనిమిది వొకదాని తర్వాత వొకటి యెగిరి వచ్చేశాయి.

ఓ కంజు అడ్డదిడ్డంగా యెగురుతూ వచ్చింది, వెంటనే అబ్లాన్‌స్కీ దాన్ని కొట్టేడు. అది రాయిలాగా నీళ్లల్లో ధామ్మని పడింది. హడావుడి పడకుండా అబ్లాన్‌స్కీ తుంగకేసి యెగిరిపోయే మరో కంజుని కొట్టేడు. తుపాకీ పేలిన చప్పుడుతో బాటే కంజు కింద పడ్డ చప్పుడు వినిపించింది. అది దెబ్బ తగలని రెక్కని తపతప కొట్టుకుంటూ, గెంతబోవడం సగం కోసిన గడ్డిలో స్పష్టంగా కనిపించింది.

లేవిన్‌కి అలా కలిసి రాలేదు. ఆతను మొదటి కంజుకేసి మరీ దగ్గరగా గురి చూసి కొట్టేడు. ఆ గురి తప్పింది. అది పైకి లేవగానే దాన్ని తుపాకీతో వెంబడించేడు. కాని సరిగ్గా అదే సమయంలో మరోటి కిందనుంచి లేచి, అతని దృష్టి మళ్లించింది. దాంతో రెండో సారి కూడా అతను గురి తప్పేడు.

వాళ్లు తుపాకీల్లో తూటాలు మళ్లీ నింపేటప్పుడు మరో కంజు లేచింది. వెస్లోవ్‌స్కీ

ముందుగా తయారై వుండడంతో నీళ్లమీదుగా రెండు సార్లు పేల్చాడు. అబ్లాన్స్కీ తను కొట్టిన కంజుల్ని తీసి సంతోషంతో మెరిసే కళ్లతో లేవిన్‌కేసి చూశాడు.

"వూ, మరి, విడివిడిగా వెడదాం" అన్నాడు అబ్లాన్స్కీ. తుపాకీని యెప్పుడు అవసరమైతే అప్పుడు పేల్చేటందుకు వీలుగా పట్టుకుని కుక్కని యీల వేసి పిలుస్తూ వొక దిశలో బయల్దేరి వెళ్లిపోయేడు. లేవిన్, వెస్లోవ్‌స్కీలు మరో దిశలో వెళ్లేరు.

లేవిన్‌కి యెప్పుడూ అంతే అవుతుంది – మొదటి గురి తప్పిందీ అంటే అతనికి వణుకు పుడుతుంది, చిరాకు వస్తుంది. యిక ఆ రోజంతా సరిగా పేల్చలేడు. యీ రోజునా అంతే అయింది. కంజులు చూస్తే బోలెడు వున్నాయి. దాదాపు అవి కుక్కల పక్కనుంచి, వేటగాళ్ల కాళ్ల దగ్గర్నుంచి యెగురుతూ వున్నాయి. బోలెడు వుండడంతో మొదటి గురి తప్పినా లేవిన్ ఆ నష్టం పూడ్చుకుని వుండేవాడే. కాని అతను యెన్ని సార్లు గురి చూసి కొట్టినా అన్ని సార్లూ గురి తప్పిపోయింది. వెస్లోవ్‌స్కీ ముందు లొక్కు అయిపోయేడు. వెస్లోవ్‌స్కీ మాంచి హుషారుగా గురి అందినా, అందకపోయినా పేల్చేస్తున్నాడు, దేన్నీ కొట్టలేదు అయినా యేమీ పట్టించుకోనూ లేదు. లేవిన్ నిభాయించుకోలేక మరీ దూకుడు పడిపోయేడు. యింకా యింకా యెక్కువ ఆవేశ పడిపోయేడు. ఆఖరికి వొక్క దాన్నీ కొట్టలేననే నిరాశ పడిపోయేడు. లాస్క దీన్ని అర్థం చేసుకున్నట్టే వుంది. దానికి కంజులని పసికట్టడం ఆసక్తి తగ్గింది. యేమిటిది అని మందలిస్తున్నట్టు చీకాకు పడినట్టు వేటగాళ్లకేసి చూసింది. ఒక దాని తర్వాత వొకటి తూటాలు పేలిపోతూనే వున్నాయి. వేటగాళ్ల చుట్టూతా మందుగుండు పొగ కమ్ముకుంది. అయినా లేవిన్ వెడల్పాటి సంచీలో చిన్నచిన్నవి మూడు మాత్రమే కంజులు వున్నాయి. ఆ మూడింటిలోనూ వొకటి వెస్లోవ్‌స్కీ వేట. యింకోటి యిద్దరూ కలిసి కొట్టిన వేట. యీ లోపున బాడవ అవతలి వేపునుంచి అబ్లాన్స్కీ తుపాకీ కాల్పులు వినిపిస్తున్నాయి. మధ్య మధ్య ఆగి ఆగి వినవస్తూ వున్నాయి, కరకుగా వున్నాయి. యేమంటే తుపాకీ పేలినప్పుడల్లా "క్రాక్, క్రాక్, యెత్తి పట్రా" అనే అరుపులు వినిపించేయి.

దీంతో లేవిన్ మరింత ఆవేశ పడిపోయేడంతే. తుంగపైన కంజులు విరామంలేకుండా యెగురుతూనే వున్నాయి. నేలమీద అవి కుయ్యడం, ఆకాశంలో అవి గీపెట్టడం అన్ని వేపుల నుంచీ సందులేకుండా వినిపిస్తూనే వుంది. ఆకాశంలో యెగురుతూ వున్నవి కాసేపు విశ్రాంతిగా నేలమీద వుండేందుకు వేటగాళ్ల ముందు వాలేవి. రెండు డేగల బదులుగా యిప్పుడు డజన్ల కొద్దీ డేగలు బాడవమీద గీపెడుతూ చక్కర్లు కొట్టేయి.

బాడవ సగంపైగా దాటేక లేవిన్, వెస్లోవ్‌స్కీ రైతులు గడ్డి కోత కోసం కేటాయించుకుని బారు వరసలు యేర్పాటు చేసుకున్న చోటికి చేరేరు. ఆ వరసలు చివరలు తుంగ దగ్గర కలుస్తున్నాయి. వాళ్లు కొన్ని చోట్ల గడ్డి కోసి, మడదొక్కి గుర్తులు పెట్టుకున్నారు. ఆ వరసల్లో సగందాకా కోసేశారు అప్పటికే.

కొయ్యని గడ్డిలోలాగా కోసిన గడ్డిలో వేటకి పకులు దొరకవు. కాని లేవిన్ అబ్లాన్స్కీని

కలుసుకుంటానని చెప్పేడు. అందుకని అతనూ, వెస్లోవ్‌స్కీ గడ్డి కోసిన చోటుమీదనుంచీ కొయ్యని చోటుమీదనుంచీ యెదరకి వెళ్లేరు.

''యేమండోయ్, వేటగాళ్లూ!'' అని వొక రైతు పిలిచేడు. అతను గుర్రం విప్పేసిన బండి పక్కన తన మిత్రులతోబాటుగా కూర్చున్నాడు. ''రండి, మాతో కలిసి భోజనం చేద్దురు గాని! వోద్కా తాగుదురు గాని'' అన్నాడు.

లేవిన్ అటు వేటు చూశేడు.

''రండి, రండయ్యా!'' అని వో యెర్రటి ముఖం కులాసా మనిషొకతను తెల్లని పళ్లు కనిపించేటట్టుగా చిరునవ్వు నవ్వుతూ ఆకుపచ్చ సీసాని వూపుతూ అన్నాడు. ఆ సీసా యెండలో తళక్‌మంది.

''Qu'est ce qu'ils disent?[1]'' అని వెస్లోవ్‌స్కీ అడిగేడు.

''వోద్కా తాగడానికి రమ్మని పిలుస్తున్నారు. గడ్డి కోత బంటా వీళ్లేననుకుంటా. నాకేం అభ్యంతరం లేదు తాగడానికి'' అన్నాడు కొంటెగా లేవిన్, వోద్కా భ్రమతో వెస్లోవ్‌స్కీ రైతులతో కలుస్తాడని ఆశిస్తూ.

''వాళ్లు మనకి తాగుడు యివ్వడం యెందుకు?''

''వూరికే సరదాకి. యేం, వెళ్లండి, సరదాగానే వుంటుంది.''

"Allons, c'est curieux[2]."

''వెళ్లండి, వెళ్లండి. మిల్లు దగ్గరికి దారి మీరు పట్టుకుంటారు లెండి'' అని లేవిన్ గట్టిగా చెప్పేడు. వెనక్కి తిరిగి చూస్తే అతనికి సంతోషం కలిగింది, వెస్లోవ్‌స్కీ వొంగి బాడవలో అలసిన కాళ్లతో అడుగులు వేస్తూ శరీరం వూగుతూ వుంటే తలపైన తుపాకీ పట్టుకుని రైతుల దిశలో వెడుతున్నాడు.

''నువ్వూ రావయ్యా'' అని వో రైతు లేవిన్‌నీ పిలిచేడు. ''మరేం ఫర్లేదు, మా వంటలు రుచి చూడు'' అన్నాడు.

లేవిన్‌కి యేదో యింత తినాలనీ తాగాలనీ మనసుగానే వుంది. అతనికి నీరసం వొచ్చేసింది. అడుగడుక్కీ ఆగిపోతున్న కాళ్లని జబర్దస్తీగా యీడుస్తున్నట్టుగా వుంది అతనికి. ఓ క్షణం సేపు సందేహించేడు. కాని ఆ సమయంలో కుక్క ఆగింది. వెంటనే అతని అలసట గిలసట యెగిరిపోయేయి. అతను తేలిగ్గా కుక్క దగ్గరికి వెళ్లేడు. వో కంజు అతని కాళ్ల దగ్గర్నుంచి యెగిరింది. అతను దాన్ని కాల్చి చంపేశేడు. కుక్క కదలకుండా అలానే వుండిపోయింది. ''కొట్టు''. మరో కంజు యెగిరింది. లేవిన్ కాల్చేడు. కాని ఆ రోజు అదృష్టం బాగా లేదు. గురి తప్పింది. అప్పుడతను చంపిన కంజుని వెతకడం మొదలుపెట్టేడు. కాని అతను

---

[1] యేమంటున్నారు వాళ్లు? (ఫ్రెంచి).

[2] రండి, యిదేదో కుతూహలంగానే వుండేటట్టుంది (ఫ్రెంచి).

గడ్డంతట్నీ మడదొక్కేసినా అది కనిపించలేదు. అతను పిట్టని కొట్టి నేలమీదకి పడేశాడని లాస్క నమ్మలేదు. కంజుని వెతకమని అతను ఆజ్ఞాపించినప్పుడు అది వెతుకున్నట్టు నాటక మాడింది కాని నిజంగా వెతకలేదు.

వెస్లొవ్‌స్కీని వదిలించుకున్నా అదృష్టం బాగుపడలేదు. తన వేట బాగా లేకపోవడానికి తప్పు అతనిదేనని తను అనుకున్నాడు. యిక్కడా బోలెడు కంజులు వున్నాయి. కాని లేవిన్ వరసగా గురి తప్పుతూనే వున్నాడు.

పొద్దు వాలినా యెండ వేడిగానే వుంది. లేవిన్ బట్టలు చెమటతో తడిసిపోయేయి, వొంటికి అంటుకుపోయేయి. యెడమ బూటు నిండా నీళ్లు చేరాయి. అది బరువెక్కిపోయింది. అడుగు తీసి ఆడుగేస్తే తపతపమంటోంది. తుపాకీ మందు పులుముకుపోయిన ముఖంమీద చెమట ధారలుగా కారుతోంది. అతని నోట్లో చేదుగా అనిపించింది. తుప్పు వాసనా, తుపాకీ మందు వాసనా ముక్కుకి తగుల్తున్నాయి. కంజుల కూతలు ఆగకుండా చెవుల పడుతున్నాయి. జోడు గుళ్ల తుపాకీ తాకలేనంత వేడిగా వుంది. అతని గుండె దడదడ గట్టిగా కొట్టుకుంటోంది. ఆవేశంతో అతని చేతులు వొణుకుతున్నాయి. అతని కాళ్లు తడబడుతున్నాయి. గడ్డి మోపుల మీద తూలిపోతున్నాడు, బురదలో కూరుకుపోతున్నాడు. కాని యెదరకి వెడుతూనే వున్నాడు, వేట సాగిస్తూనే వున్నాడు. ఆఖరికి చెడ్డ అవమానకరంగా గురి తప్పి అతను తుపాకీనీ టోపీనీ నేలమీదకి విసిరికొట్టేడు.

'అబ్బే! లాభం లేదు! నేను స్థిమితపడాలి' అనుకున్నాడు. తుపాకీనీ, టోపీనీ మళ్లీ తీసుకున్నాడు. కుక్కని పిలిచేడు. బాడవ అవతలికి వెళ్లేడు. పొడినేలమీదకి చేరాక వో మిట్ట మీద చేరి, బూట్లు విప్పేసి, యెడమ బూట్లోనుంచి నీళ్లు వొంపేడు. మళ్లీ బాడవలోకి వెళ్లేడు. తుప్పు రంగు నీళ్లనే తాగేడు. వేడెక్కిన తుపాకీ గొట్టాల్ని తడిపి చల్లబరిచేడు. ముఖమూ చేతులూ కడుక్కున్నాడు. ఆ రకంగా ఆయాసం తీర్చేసుకున్నాక తను గురి తప్పిన కంజు వాలిన చోటికి తిరిగి వెళ్లేడు. యిక యెంత మాత్రమూ దూకుడుగా వుండకూడదని తీర్మానించుకున్నాడు.

నిదానంగా వుండాలని ప్రయత్నించేడుగాని పరిస్థితి ముందటిలాగానే అయింది. సరిగా గురి కుదరకుండానే వేలు ట్రిగ్గర్‌ని నొక్కేసింది. దాంతో వ్యవహారం యింకా దిగజారింది.

బాడవ దాటి అబ్లాన్‌స్కీని కలుసుకోవాల్సిన ఆల్డర్ చెట్ల తోపు దగ్గరికి చేరేటప్పటికి వేట సంచీలో అయిదు పిట్టలు మాత్రమే వున్నాయి.

అబ్లాన్‌స్కీ కంటే ముందు అబ్లాన్‌స్కీ కుక్క కనిపించింది. దుర్గంధ భూయిష్టమైన బాడవ బురద వొంటినిండా అంటుకుని క్రాక్ నల్లగా ఆయింది. వొంగి వంకరగా వున్న ఆల్డర్ చెట్టు కిందనుంచి అది యెగిరి గెంతింది, అది విజేత దర్పంతో లాస్కని వాసన చూసింది. క్రాక్ వెనక్కాల ఆల్డర్ చెట్ల నీడలో అబ్లాన్‌స్కీ మనోజ్ఞమైన విగ్రహం కనిపించింది. అతను కందిపోయి, చెమటలు కక్కుతూ వున్నాడు. అతని కాలరు బొత్తాం

విప్పేసి వుంది. అతను యింకా ముందటిలాగే కుంటుతూ లేవిన్ వేపు వచ్చేడు.

"వూఁ వేట యెలా సాగింది? మీ పేలుళ్లు యెక్కువగానే వున్నాయి" అని సంతోషంగా చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"నీది యెలా వుంది?" అని లేవిన్ అడిగేడు. అసలు అతను అడగవలసిన పనిలేదు, అబ్లాన్స్కీ వేట సంచీ ఉబ్బుగా వుండడం అతను చూడనే చూశాడు.

"ఫరవాలేదు."

అతను పధ్నాలుగు పిట్టల్ని కొట్టేడు.

"భలే బాడవలే! ఆ వెస్లోవ్‌స్కీయే యింతకీ నీ వేటకి దిష్టి కొట్టేడు. యిద్దరు మనుషులకి వొకటే కుక్క, మరి కష్టమే కదా" అని తన విజయాన్ని తగ్గించుకుంటూ అన్నాడు అబ్లాన్‌స్కీ.

## 11

లేవిన్ యెప్పుడూ రాత్రిళ్లు విడిది చేసే రైతు యింటికి లేవిన్, అబ్లాన్‌స్కీలు వెళ్లేటప్పటికి అక్కడ వెస్లోవ్‌స్కీ కనిపించేడు. అతను గది మధ్యలో వున్న బల్లమీద కూర్చున్నాడు. రెండు చేతులతోనూ బల్లని గట్టిగా పట్టుకున్నాడు. పక్కనున్న వాళ్లని కూడా నవ్వేటట్టు చేసే తన సహజమైన హుషారైన నవ్వు నవ్వుతున్నాడు. యీ లోపున యింటావిడ తమ్ముడైన సైనికుడు బురద కొట్టుకుపోయిన అతని బూట్లని విప్పడానికి లాగుతున్నాడు.

"యిప్పుడే వచ్చేను. Ils ont été charmants.[1] చూశారా, వాళ్లు నాకు తిండి పెట్టారు, తాగుడు యిచ్చేరు. ఆ రొట్టె! యేం రొట్టె! అద్భుతం! Délicieux[2]! ఆ వోద్కా! అలాంటి దాన్ని నేను రుచి చూడలేదనుకోండి. పైగా డబ్బిస్తే పుచ్చుకున్నారు కాదు. 'మమ్మల్ని గురించి చెడ్డగా అనుకోకండి, ప్రభూ' అని వొకటే అనడం."

"డబ్బు యెందుకు పుచ్చుకుంటారు, మిమ్మల్ని ఆదరిస్తూ వుంటే? వాళ్లు వోద్కా అమ్ముతున్నా రనుకుంటున్నారా?" అని సైనికుడు ఆఖరికి తడి బూటుని, బురదతో నల్లబడ్డ మేజోడునీ కూడా లాగుతూ అడిగేడు.

గుడిసె అంతా వేటగాళ్ల బూట్లు బురదతో కచాడీ అయిపోయింది. మురికి వోడుతూ వున్న కుక్కల కుళ్లు వుంది. బాడవ దుర్వాసన, తుపాకీ మందు వాసనా గుడిసె నిండా వ్యాపించేయి. యిక అక్కడ చాకులు గాని, ఫోర్కులు గాని లేవు. యిన్ని వున్నా గానీ వేటగాళ్లు వేట తర్వాత వుండే ఉత్సాహంతో భోజనాలు చేశారు, తాగేరు. ముఖం కాళ్లు చేతులు కడుక్కొని, తలలు దువ్వుకుని తుడిచి శుభ్రం చేసిన గడ్డి కొఠారంలోకి విశ్రాంతికి వెళ్లేరు. బండివాళ్లు అక్కడ వాళ్లకి పడకలు యేర్పాటు చేశారు.

---

[1] యీ మనుషులు భలేవాళ్లు (ఫ్రెంచి).

[2] నిజంగా సంతుష్టికరంగా వుంది (ఫ్రెంచి).

చీకటి పడుతోంది గాని యెవళ్లకీ నిద్రలు రావడం లేదు.

సంభాషణ తుపాకుల గురించీ, కుక్కల గురించీ, లోగడ జరిగిన వేటల జ్ఞాపకలకీ, కథలకీ సంబంధించి జరిగింది. తర్వాత అందరికీ యిష్టమైన విషయంమీదకి మళ్లింది. ఆ రాత్రి అలా గడపడం, గడ్డి సువాసన, బండి విరిగి పోవడంలోని చమత్కారం (ముందరి యిరుసు తీసెయ్యడంవల్ల బండి విరిగిందని అతనికి అనిపించింది), తనకి వోద్కా యిచ్చిన రైతుల ఔదార్యం, తమ తమ యజమానుల కాళ్ల దగ్గర పడుకున్న కుక్కలు — అన్నిటి గురించీ వెస్లోవ్స్కీ పొంగిపోయి చాలా సార్లు చెప్పేడు. దాంతో ఉత్సాహం పుట్టి అబ్లాన్స్కీ అంతకు ముందు వేసవిలో యెవరో మాల్థస్ దగ్గర జరిగిన వేట మజా గురించి వర్ణన చేశాడు. మాల్థస్ ప్రసిద్ధ రైల్వే షావుకారు. యీ మాల్థస్ త్వేర్ గుబేర్నియాలో యెంత అద్భుతమైన బాడవలున్నదీ, అతను వాటిని యెలా చూసుకుంటూ వున్నదీ, యెలాంటి మంచి బళ్లల్లో బగ్గీల్లో వేటగాళ్లని తీసుకు వెళ్లిందీ, బాడవ చివర భోజనాలకి గాను యెలాంటి అట్టహాసమైన గుడారం వేసిందీ అబ్లాన్స్కీ చెప్పేడు.

''నిన్ను నేను అర్థం చేసుకోలేను'' అంటూ లేవిన్ గడ్డిపైన మోచేతులమీద ఆను కుంటూ లేచి అన్నాడు. ''అలాంటి వాళ్లంటే నీకు అసహ్యం పుట్టదూ? నాస్తాతో బాటు వో సీసా లాఫీత్ వైన్ భలే మజాగా వుంటుంది కాదనను, కాని అలాంటి భోగం వెల పరంగా వుండదూ? యీ మనుషులు పూర్వం మనకి వుండేవాళ్లే పన్నులు దండుకునేవాళ్లు* అలాంటి వాళ్లు, ప్రజలకి యేవగింపు పుట్టేట్టు సొమ్ము మూట కట్టేసుకోవడమే. అయినా ప్రజలు యేమనుకుంటున్నారో పట్టించుకోరు వాళ్లు. అన్యాయంగా కూడబెట్టిన సొమ్ముతో ఆ యేవగింపునుంచి ముక్తి సంపాదించేస్తారు.''

''బాగా చెప్పేరు!'' అంటూ వెస్లోవ్స్కీ వంత పలికేడు. ''నిజమే. అయినా అబ్లాన్స్కీ bonhomie[1]తో అలా చేస్తున్నాడు. కాని 'అబ్లాన్స్కీ అలాంటి వాళ్లతో స్నేహం చేస్తున్నాడు' అని పై వాళ్లు అంటారు'' అన్నాడు.

''నేనలా చెయ్యను'' అన్నాడు అబ్లాన్స్కీ. ఆ ముక్క అంటూ వుంటే అబ్లాన్స్కీ చిరునవ్వు నవ్వుతూ వున్నాడని లేవిన్‌కి అనిపించింది. ''కాని అతను డబ్బున్న వ్యాపార స్థలకంటే గొప్పింటి వాళ్లకంటే అన్యాయంగా వున్నాడని అనను. వీళ్లంతా బుర్ర ఉపయోగించీ, కష్టపడీ డబ్బు కూడబెడతారు'' అన్నాడు.

''అవును కాని యెలాంటి కష్టం? దేన్నో రాయితీకి సంపాదించి తర్వాత లాభం కోసం అమ్ముకోవడం — దీన్ని కష్ట పడ్డం అంటావూ?''

''ఆఁ, కష్ట పడ్డం అనే అంటాను. అసలు యిలాంటి వాళ్లు లేకపోతే మనకి రైల్వేలు వుండేవా యేమిటి?''

---

[1] సహజంగా వుండే మంచితనం (ఫ్రెంచి).

“కాని రైతులో, శాస్త్రజ్ఞులో పడే కష్టంతో చూస్తే దీన్ని కష్ట పడ్డం అంటామా?”

“ఒప్పుకున్నాం, కాని అతను చేసే పనులవల్ల ఫలితాలు వస్తున్నాయి – రైల్వేలు. ఆ రకంగా అది కష్ట పడడమే. కాని నీకు రైల్వేలంటే యేమీ కొరగానివని.”

“అది వేరే విషయం. వాటికి ఉపయోగం వుందని వొప్పుకోవడానికి సిద్ధమే. కాని పడిన కష్టానికి అనుగుణంగా లేని లాభమంతా అన్యాయమే.”

“యిది అనుగుణంగా వుంది, యిది లేదు అని తేల్చగలవాడెవడు?”

“అన్యాయంగా, మోసంద్వారా సంపాదించిన సొమ్ము” అన్నాడు లేవిన్. న్యాయమైన శ్రమకీ అన్యాయమైన దానికీ మధ్య స్పష్టమైన అంతరం చూపించలేకపోతున్నానే అని అతనికి తెలుస్తూనే వుంది. “మాటకి బేంకుల లాభాలు” అని చెప్ప సాగేడు. “యీ దుర్మార్గం, యే శ్రమా లేకుండా అప్పనంగా సొమ్ము మూట గట్టుకోవడం వుందే సరిగ్గా మన సంకరులు చేసినట్టే వుంది. కాని పద్ధతి మారిందంతే. Le roi est mort, vive le roi![1]* సుంకరులని అంతం చేశామో లేదో రైల్వే అధిపతులు, బేంకుల వాళ్లు తయారయేరు. వీళ్లదీ కష్టంలేని లాభమే” అన్నాడు.

“బహుశా యిదంతా నిజమే కావచ్చు, చాలా తెలివైన ముక్కే కావచ్చు.... క్రాక్, పడుకో!” అని అబ్లాన్స్కీ తన కుక్కని గద్దించేడు. అది గోక్కుంటూ గడ్డిని పీకుతోంది. తర్వాత నిదానంగా, శాంతంగా తన వాదన కొనసాగించేడు. తన దృక్పథం సరైనదని అతనికి నమ్మకం వుంది. “కాని నువ్వు న్యాయమైన కష్టానికీ, అన్యాయమైన కష్టానికీ మధ్య అంతరాన్ని చెప్పలేదు. మాటకి, నాకు మా హెడ్ క్లార్కుకంటే యెక్కువ జీతం వస్తుంది, నాకంటే అతనికి పని యెక్కువ తెలుసు. నీ దృష్టిలో యిది అన్యాయమే కదా?”

“యేమో నాకు తెలీదు.”

“అయితే నన్ను చెప్పనీ. వ్యవసాయంలో నీకు అయిదు వేల రూబుళ్లు లాభం వస్తుంది, పాపం రైతు అహోరాత్రాలూ తన్నుకు లాడినా యాభై రూబుళ్లు కళ్ల చూళ్లేడు, యిదెంత అన్యాయమో నాకు మా హెడ్ క్లార్కుకంటే యెక్కువ జీతం రావడం, మాల్థస్‌కి ఇంజన్ డ్రైవరుకంటే యెక్కువ రావడం అంతే అన్యాయం. యిందుకు విరుద్ధంగా నేను వీళ్ల పట్ల సంఘంలో వున్న శత్రుత్వానికి ఆధారం లేదని అంటాను. అసూయవల్ల వస్తుంది...”

“అబ్బె, ఆ ముక్క సబబు కాదు” అన్నాడు వెస్లోవ్‌స్కీ. “అది అసూయ కాదు, యేమైనా ఆ బాపతు వ్యవహారాల్లో లోపాయికారీ పన్లు వుండకపోవు” అన్నాడు.

“ఆగు, నన్ను పూరా చెప్పనీ” అని లేవిన్ తన ఆలోచనని ముందుకు తీసికెళ్లేడు. “నాకు అయిదు వేల రూబుళ్లు రావడం, మా రైతుకి యాభై రూబుళ్లు రావడం అన్యాయం అని నువ్వు అంటావు అది నిజమే. అన్యాయమే. నాకూ అలానే అనిపిస్తుంది, కాని...”

---

[1] రాజు లేడు, రాజు వర్ధిల్లాలి! (ఫ్రెంచి).

''నిజానికే అంతే! రైతు అహోరాత్రాలూ రెక్కలు ముక్కలు చేసుకుంటూ వుంటే మనం విందులూ మందులూ విహారాలు సేవించడం యేమిటి చెప్పండి?'' అని వెస్లోవ్‌స్కీ అన్నాడు. అతని జీవితంలో యీ సమస్యని మొదటి సారిగా యెదుర్కొంటున్నట్టు తెలుస్తూనే వుంది. అందుకని మనస్ఫూర్తిగానే అలా అన్నాడు.

''ఆఁ, నీకూ అలా అనిపిస్తూనే వుంది కాని అంత మాత్రం చేత నువ్వు రైతుకి నీ జాగీరు ధారాదత్తం చేస్తావా?'' అని కావాల్సికి లేవిన్‌ని ఉడికిస్తున్నట్టు అబ్లాన్‌స్కీ అన్నాడు.

యిటీవల కొంతకాలంగా యీ తోడల్లుళ్లిద్దరి మధ్యా పైకి తేలని వైషమ్యం పుట్టుకొచ్చింది. యిద్దరూ అక్కాచెల్లెళ్లని పెళ్లి చేసుకోవడం దగ్గర్నుంచి యెవరు తమ తమ జీవితాలని చక్కగా మలచుకున్నారు అన్న విషయంలో యిద్దరికీ మధ్య స్పర్ధ వచ్చినట్టుగా వుంది. యీ వైషమ్యం సంభాషణ వ్యక్తిగతం కావడంతో బయట పడడం మొదలుపెట్టింది.

''నన్నెవళ్లూ అలా అడగకపోవడంవల్ల నేను నా జాగీర్‌ని యివ్వను, వొక వేళ నేను అలా యివ్వాలని కోరుకున్నా యివ్వలేను. యెవళ్లకని యివ్వను?'' అని లేవిన్ జవాబు చెప్పేడు.

''యిక్కడున్న యీ రైతుకియ్యి. అతను కాదనడు.''

''కాని యెలా యివ్వను? అతని దగ్గరికి వెళ్లి అతని పేరుమీద పెట్టెయ్యనా?''

''నాకు తెలీదు, కాని నీకు హక్కు లేదు అని పూర్తి నమ్మకం వుంటే...''

''లేదు, నాకు నమ్మకం లేదు. అందుకు వ్యతిరేకంగా, దీన్ని అర్పించే హక్కు నాకు లేదని, యీ భూమిపట్ల, నా కుటుంబంపట్లా నాకు బాధ్యత వుందని నా నమ్మకం.''

''లేదు, కాని అలాంటి అసమానత్వం అన్యాయం అని నువ్వు అనుకుంటే యెందుకని అలా చెయ్యలేవు? అని...''

''నేను చేస్తూనే వున్నాను, కాని వ్యతిరేకార్థంలో. యేమంటే మా యిద్దరి మధ్యా వున్న అంతరాన్ని పెంచే యత్నం యేదీ నేను చెయ్యడం లేదు.''

''మరేం అనుకోకు, నువ్వు చెప్పేది శుద్ధ యెడ్డెతెడ్డెంగా వుంది.''

''అవును, అడ్డదిడ్డం తర్కంలా వుంది'' అని వెస్లోవ్‌స్కీ వత్తాసు పలికేడు. ''ఆఁ, మన గృహస్థు'' అని అప్పుడు కిర్రుమని చప్పుడు చేస్తూ తలుపు తీసి లోపలికి వచ్చిన రైతుని చూసి అన్నాడు. ''యేం, నిద్రపోలేదా?'' అని అడిగేడు.

''యెక్కడి నిద్రండీ బాబూ! పెద్దోరు మీరు పండుకున్నా రనుకున్నా. కాని మీ మాటలు యినిపించేయి. ఆటగొర్రు తీసికెళ్దారని వచ్చేను. తవరి కుక్కలు కరవ్వు కదా!'' అని దిస కాళ్లతో జాగ్రత్తగా లోపలికి అడుగేస్తూ అడిగాడు.

''నువ్వెక్కడ పడుకుంటావ్?''

''రాత్రిళ్లు మేం గుర్రాల కాపాలాగా వుంటాం.''

''ఆహా, యెంత చక్కటి రాత్రి!'' అని వెస్లోవ్‌స్కీ తెరిచి వున్న గుమ్మం గుండా చూస్తూ అన్నాడు. మసక వెలుతుర్లో గుర్రం విప్పిన బండి, యింటి ముందు భాగం

కనిపిస్తున్నాయి. ''వినండి, ఆడవాళ్లు పాడుతున్నారు. ఫరవాలేదు. యెవరా పాడేది?'' అని అతను గృహస్థుని అడిగేడు.

''రైతు అమ్మాయిలయ్యా!''

''పదండి, షికారు పోదాం. నిద్ర యెలాగూ లేదు. అబ్లాన్‌స్కీగారూ, వెడదాం.''

''యిక్కడ యిలా వాలి పడుకునే అలా వెళ్లడం యెంత బాగుంటుంది'' అని అబ్లాన్‌స్కీ వొళ్లు విరుచుకుంటూ అన్నాడు. ''యిలా పడుకోవడం యెంతో బాగుంది'' అన్నాడు.

''అయితే నేనొఖ్ఖణ్ణే వెడతా'' అని వెస్లోవ్‌స్కీ వొక్క ఉదుట్న లేస్తూ, బూట్లు తొడుక్కుంటూ అన్నాడు. ''వస్తా మరి. సరదాగా వున్నట్టనిపిస్తే మిమ్మల్నీ పిలుస్తా. మీరు నాకు వేట మజా రుచి చూపించేరు, మరిచిపోను'' అన్నాడు.

''భలేవాడు, కదా'' అని అబ్లాన్‌స్కీ వెస్లోవ్‌స్కీ అవతలికి వెళ్లిపోయేక, రైతు తలుపు మూసేక అన్నాడు.

''అవును, భలేవాడే'' అన్నాడు లేవిన్. అతని మనసు యింకా ఆ సంభాషణ గురించిన ఆలోచనలోనే వుంది. తను తన ఆలోచనల్ని స్పష్టంగా చెప్పినట్టే అతనికి అనిపించింది. అయినా వాళ్లిద్దరూ తను అడ్డదిడ్డం తర్కంతో తన మనసు సమాధాన పరచుకుంటున్నట్టు యేకగ్రీవంగా అన్నారు. మరి వాళ్లు తెలివితక్కువ వాళ్లూ కాదు, నిజాయితీ లేనివాళ్లూ కాదు. లేవిన్‌కి కష్టం కలిగింది.

''అంచేత సంగతి అదీ బాబూ! నువ్వు యేదో వొక దాన్ని యెంచుకోవాలి. యీ ప్రస్తుత సామాజిక వ్యవస్థ న్యాయమైందని వొప్పుకున్నట్టయితే నీ హక్కుల్ని నువ్వు రక్షించుకో. లేదా మనం అనుభవించే హక్కులు అన్యాయమైనవే, అయినా వీలైనంత సుఖాన్ని జుర్రుకుందాం, నాలాగా, అని వొప్పుకో'' అన్నాడు అబ్లాన్‌స్కీ.

''లేదు, అవి అన్యాయమైనవి అని నువ్వు అనుకుంటే సుఖాన్ని పొందలేవు. కనీసం నేను అలా చెయ్యలేను. నాకు ముఖ్యమైంది నా దోషం లేదని నాకు అనిపించడం.''

''యేం, మనం కూడా అలా వెడదామా?'' అన్నాడు అబ్లాన్‌స్కీ. ఆలోచనతో అతని బుర్ర వేడెక్కి పోయినట్టే వుంది. ''యెలాగూ నిద్రపోలేం, పద'' అన్నాడు.

లేవిన్ మాట్లాడలేదు. తను న్యాయపూరితంగా వున్నాడు అనేది వ్యతిరేకార్థకంగానే తప్ప మరోలా లేదనేది అతనికి కుతూహలం కలిగిస్తోంది. 'వ్యతిరేకార్థకమైందే న్యాయపూరితంగా వుండగలదా?' అని తనలో తను అనుకున్నాడు.

''కొత్తగా కోసిన యీ గడ్డి యెంత ఘాటుగా వుంది'' అని అబ్లాన్‌స్కీ లేస్తూ అన్నాడు. ''యెలాగూ నిద్రపట్టదు. వెస్లోవ్‌స్కీ అక్కడ యేదో వ్యవహారం చేస్తున్నాడు. అతని గొంతుక, ఆ నవ్వు విన్నావా? పద మనమూ వెడదాం. లే'' అన్నాడు.

''వూహూఁ, నేను రాను'' అన్నాడు లేవిన్.

“యేమిటి యిది కూడా సూత్రబద్ధంగానే చేస్తున్నావా యేమిటి?” అని అబ్లాన్స్కీ చీకట్లో టోపీ కోసం తడుముకుంటూ మందహాసంతో అన్నాడు.

“సూత్రప్రాయంగా కాదు. కాని యెందుకు రావడం?”

“జాగ్రత్త, యిరుకులో పడకు” అని అబ్లాన్స్కీ టోపీ అందుకుని లేస్తూ హెచ్చరించేడు.

“అదేమిటి?”

“నువ్వు నీ పెళ్ళాం దగ్గర యెలా వొంగివొంగి వున్నావో నాకు తెలీదనుకుంటున్నావా యేమిటి? నేను విన్నా నువ్వామెతో రెండ్రోజులు వేటకి వెళ్ళడం విషయం యేదో పెద్ద రాజకీయ విషయం అయినట్టు సంప్రదించడం. యేదో కొంతకాలం దాకా అది మనోహరమైన ఆదర్శంగానే వుండచ్చు కాని జీవితాంతం సాగదు. మగాడన్నాక స్వతంత్రం వుండాలి, మగవాడి సరదాలు వుండాలి. మగాడు మగాడిలా వుండాలి” అన్నాడు అబ్లాన్స్కీ తలుపు తెరుస్తూ.

“యేమిటి నీ ఉద్దేశం? వెళ్ళి రైతు ఆడపిల్లలతో సరసాలాడమంటావా?” అని లేవిన్ అడిగేడు.

“మజాగా వుంటే అందులో తప్పేమిటి? Ça ne tire pas à conséquence[1]. దానివల్ల కట్టుకున్న దానికి నష్టం ఆవగింజంత వుండదు, నాకూ సరదాగా వుంటుంది. అన్నిటికంటే ముఖ్యమైనది కాపరాన్ని పదిలంగా చూసుకోవడం. యిలాంటి వాటిని కొంప లోకి రాక్కుండా చూసుకోవాలి. కాని నీ చేతుల్ని కట్టేసుకోకు.”

“అలాగా!” అంటూ లేవిన్ పొడిగా అని అటు పక్కకి మళ్ళేడు. “మనం పెందరాళే లేవాలి. నేనెవళ్ళనీ లేపను గాని తెల్లవారుతూనే వెళ్ళిపోతాను” అన్నాడు.

“Messieurs, venez vite[2]” అంటూ అప్పుడే తిరిగివచ్చిన వెస్లోవ్‌స్కీ గొంతుక వినిపించింది. “Charmante![3] నేనే వెతికి పట్టేను. Charmante! అసలైన గ్రెత్‌ఖెన్*. అప్పుడే మా యిద్దరికీ స్నేహం కలిసింది. అబ్బ! యెంత బాగుంది!” అని అతను ఆమెని యేదో తన కోసమే ముచ్చటైన దానిగా తయారు చేసినట్టు అందుగ్గాను సృష్టికర్తకి ఋణపడి వున్నట్టు ఆనందంతో అన్నాడు.

లేవిన్ నిద్రపోయినట్టు నటించేడు. అబ్లాన్స్కీ ఆకు చెప్పులు వేసుకుని, చుట్ట ముట్టించుకుని అవతలకి వెళ్ళేడు. కొంచెం సేపట్లోనే వాళ్ళ గొంతుకలు వినిపించకుండా దూరం అయిపోయేయి.

లేవిన్‌కి చాలా సేపు నిద్రపట్టలేదు. గుర్రాలు గడ్డి నములుతూ వుండడం వినిపిం

---

[1] యిందులో చెడ్డ ఫలితాలు లేవు (ఫ్రెంచి).

[2] మహానుభావులారా, త్వరగా రండి (ఫ్రెంచి).

[3] చాలా అందమైంది (ఫ్రెంచి).

చింది. రైతు అతని పెద్ద కొడుకుని తీసుకుని రాత్రికాపలా కోసం వెళ్ళిపోయేడు. ఆ తర్వాత కొట్టం మరో మూల సైనికుడు, అతని మేనల్లుడు, అంటే రైతు చిన్న కొడుకు, పడుకోవడం వినిపించింది. ఆ కుర్రవాడు సన్న గొంతుకతో కుక్కల్ని చూస్తే తనకేమనిపించిందీ చెప్తున్నాడు. అవి భయం కలిగిస్తూ వున్నాయి. చాలా పెద్దగా వున్నాయి. యింతకీ అవి వేటేని పట్టుకోవాలీ అని అడిగేడు. వేటగాళ్లు మర్నాడు వేటకి వెళ్లి తుపాకులు పేలుస్తారని సైనికుడు నిద్రమగతగా వున్న బొంగురు కంఠంతో చెప్పేడు. యిక మళ్లీ కుర్రవాడు యేమీ అడక్కుండా "పడుకో, వాస్కా! పడుకో, లేకపోతేనా!" అన్నాడు. వెంటనే సైనికుడు గుర్రు కొట్టడం మొదలుపెట్టేడు. తర్వాత అంతా సద్దు మణిగిపోయింది. గుర్రాల సకిలింపులూ, కంజుల కూతలూ మాత్రమే వినిపించేయి. 'వ్యతిరేకార్థకంలోనేనా?' అని లేవిన్ తనలో తను అనుకున్నాడు. 'అలానే కానీ, అయితే నా తప్పేం వుంది?' అనుకున్నాడు. మర్నాడు చెయ్యాల్సిన పనుల గురించి అనుకున్నాడు.

'పొద్దున్నే లేచి వెడతాను. గట్టి నిర్ణయం చేసుకోవాలి. నిబ్బరంగా వుంటాను. బాడవ నిండా కంజులు తెగ వున్నాయి. పెద్ద కంజులు కూడా. తిరిగి వచ్చేటప్పటికి కిట్టీ పంపే చీటీ వుంటుంది. అవును, అబ్లాన్స్కీ అన్న ముక్క నిజమే. నేను మగాడిలా ఆమెతో ప్రవర్తించడం లేదు. ఆమె కొంగు పట్టుకుని తిరుగుతున్నాను... అయినా మరి యేం చెయ్యాలి? అదుగో మళ్లీ వ్యతిరేకార్థకం' అనుకున్నాడు.

కునుకు పడుతూ వుండగా వెస్లోవ్స్కీ, అబ్లాన్స్కీలు కిలకిల నవ్వుతూ వుండడం, హుషారుగా మాట్లాడుకుంటూ వుండడం వినిపించింది. లేవిన్ వో క్షణం సేపు కళ్లు తెరిచేడు. చంద్రుడు ఉదయించేడు. చక్కగా కాస్తున్న వెన్నెలలో వాళ్లిద్దరూ గుమ్మం దగ్గర నుంచుని మాట్లాడుకుంటూ వున్నారు. అబ్లాన్స్కీ ఆ అమ్మాయిని పక్వానికి వొచ్చిన పండుతో పోలుస్తూ ఆమె సేవళింపు గురించి చెప్తున్నాడు. వెస్లోవ్స్కీ తన నవ్వుతో పక్క వాళ్లూ నవ్వేటట్టు చేస్తూ, యెవరో రైతు అన్న మాటల్ని అప్ప చెపుతూ "నీ పెళ్లాంలాగే వుండేటట్టు చేసుకో" అన్నాడు. లేవిన్ నిద్రమగతగా

"బాబులూ రేప్పొద్దుట" అని నిద్రపోయేడు.

## 12

లేవిన్ పొద్దున్నే లేచాడు. వాళ్లనీ లేపబోయేడు. వెస్లోవ్స్కీ మేజోళ్లు తొడుక్కున్న వో కాలిని బారచాచి బోర్లా పడుకుని గాఢంగా నిద్రపోతున్నాడు. లేవిన్ లేపితే ఉలకలేదు, పలకలేదు. అబ్లాన్స్కీ నిద్రమత్తుగా అంత పొద్దున్నే యేమిటి సొమ్మని అన్నాడు. గడ్డి మీద వో నార హాయిగా ముడుచుకు పడుకున్న లాస్కా కూడా యిష్టం లేనట్టుగా, బద్ధకంగా లేచి వెనక కాళ్లని వొక దాని తర్వాత వొకటి సాగదీసుకుంది. లేవిన్ బూట్లు తొడుక్కుని,

తుపాకీ తీసుకుని, కిర్రుమని చప్పుడు చేసే కొట్టం తలుపుని జాగ్రత్తగా తీసి బయటికి వెళ్లేడు. బళ్లు తోలేవాళ్లు బళ్ల పక్కనే పడుకున్నారు. గుర్రాలు జోగుతున్నాయి. ఓ గుర్రం బద్ధకంగా ఓట్లు దాణా తింటోంది. ఓట్లని తొట్టిలోనుంచి ముట్టెతో పైకి యిటూ అటూ తోసుకుంటూ తింటోంది. బయట యింకా వెలుతురు పరుచుకోలేదు.

"యింత పెందరాళే యెందుకు లేచావు బాబూ" అని రైతు భార్య అప్పుడే బయటికి వస్తూ అతన్ని పాత పరిచితుడిలాగా పలకరిస్తూ అంది.

"వేటకి వెడుతున్నానత్తా. యిక్కడినుంచి బాడవకి యెలా వెళ్లచ్చు?"

"పెరట్లోనుంచి, నూర్పుడు కళ్లం దాటి, తిన్నగా నార చేను దాటి వెడితే దారి వస్తుంది."

యెండకి కమిలిన దిస కాళ్లతో జాగ్రత్తగా అడుగులు వేస్తూ ఆమె లేవిన్‌కి దారి చూపించి కంచె కమ్మీని అతను వెళ్లడం కోసమని తెరిచింది.

"నూర్పిడి కళ్లం దాటితే తిన్నగా బాడవలోకి వెడతావు. రాత్రి మా వాళ్లు అటే మైదానాలకి గుర్రాల్ని తోలుకెళ్లారు."

లాస్కా ముందు పరిగెత్తింది. లేవిన్ చురుగ్గా అడుగులు వేస్తూ నడిచేడు. నడుస్తూ వున్నంత సేపూ ఆకాశంకేసి చూస్తూనే వున్నాడు. తను బాడవ దగ్గరికి వెళ్లే లోపల పొద్దు పైకి యెక్కదు అనుకున్నాడు. కాని సూర్యుడు ఆలస్యం చెయ్యలేదు. లేవిన్ బయల్దేరినప్పుడు ప్రకాశమానంగా వున్న చంద్రుడు యిప్పుడు వెలవెల బోతూ వున్నాడు. కొన్ని క్షణాల క్రితం దాకా స్ఫుటంగా వున్న వేగు చుక్క యిప్పుడు మసకబారి పోయింది. అంతకు ముందు దాకా దూరంలో అస్పష్టంగా వున్న మచ్చలు యిప్పుడు స్పష్టంగా కనిపిస్తున్నాయి. అవి రై కంకులు. పుప్పొడి పోయిన ఆ నార పువ్వుల్ని కోశేసారు. యెత్తుగా పెరిగి, సుగంధం చిమ్ముతూ వున్న నారమీద మంచు బిందువులు సూర్య కాంతి లేకపోవడంతో కనిపించడం లేదు. కాని ఆ మంచు లేవిన్ కాళ్లనీ, నడుం పైకంటా చొక్కానీ తడిపింది. ప్రాతఃకాల పారదర్శక నీరవతలో అతిచిన్న ధ్వనులు కూడా వినిపిస్తున్నాయి. లేవిన్ చెవి పక్కనుంచే జుమ్మంటూ తుపాకీ గుండు దూసుకుపోయినట్టుగా వొక తేనెటీగ దూసుకుపోయింది. తర్వాత మరొకటీ, మూడోదీ అలా దూసుకుపోయేయి. కర్ర గుంజల దడి వెనక వున్న తేనెటీగల పెట్టెలోనుంచి బాడవ దిశలో పోతూ వున్న తేనెటీగలు అవి. ఆ దారి తనని తిన్నగా బాడవ దగ్గరికి తీసుకు వెడుతుంది. పొగమంచుని బట్టి బాడవని గుర్తు పట్టవచ్చు. పొగమంచు వో చోట పల్చగా, వో చోట దట్టంగా వుంది. ఆ మధ్యలో తుంగ, విల్లో పొదలు వున్న భాగాలు ద్వీపాల్లా కానవస్తున్నాయి. బాడవ దగ్గర రోడ్డుమీద రాత్రి గుర్రాల్ని కాపలా కాస్తూ వున్న పిల్లవాళ్లు, పెద్దవాళ్లు కోట్లు కప్పుకుని గాఢంగా నిద్రపోతున్నారు. వాళ్లకి దగ్గర్లోనే బందాలు వేసిన మూడు గుర్రాలు మేస్తున్నాయి. వో గుర్రం కాళ్లకి కట్టికి యినప బందాన్ని గణగణ చప్పుడు చేసింది. లాస్కా ముందుకు వెడతామరి అన్నట్టు అనుమతి కోసం చూస్తూ, ముట్టె యెత్తి వెనక్కి చూస్తూ యజమాని పక్క పక్కనే నడుస్తోంది.

నిద్రపోతూ వున్న రైతుల్ని దాటి దగ్గర దగ్గర బాడవ చేరేక లేవిన్ తూటాలని పరీక్షించి, లాస్కాని వదిలేడు. అక్కడున్న గుర్రాల్లో వొకటి సన్నగా యెరుపు రంగులో వుంది. మూడేళ్ల వయసుది. ఆ గుర్రం కుక్కని చూసి తోక యెత్తి బెదిరి సకిలించింది. మిగిలిన గుర్రాలూ బెదిరి బాడవలో గెంతాయి. బందాలు వేసిన కాళ్లతో నీళ్లలో తపాతపామనీ చిక్కగా వున్న బురదలో కాళ్లు యెత్తుతూ వుంటే గిట్టలు చితచితమని చప్పుడు చేస్తూ వుండగా బాడవనుంచి గెంతాయి. లాస్కా ఆగి గుర్రాలకేసి అసహ్యించుకునే చూపు చూసి యేమిటి మరి అని అడుగుతున్నట్టు లేవిన్‌కేసి చూసింది. లేవిన్ దాన్ని తట్టేడు, వూ కానీ అని సూచిస్తున్నట్టు యీల వేశేడు.

లాస్కా సంతోషంగా పని ధ్యాసలోనే కాళ్ల కింద జవజవ లాడ్తూ వున్న నేలమీద పరిగెట్టింది.

బాడవలోకి పరిగెత్తేక లాస్కా తనకి తెలిసిన మొక్కల వాసననీ, బాడవ గడ్డి వాసననీ అలాగే కొత్తగా వున్న గుర్రాల లద్దెల వాసననీ పట్టింది. వీటితోబాటు దానికి ఉత్తేజం కలిగించే విశేషమైన పక్షి వాసననీ పట్టింది. ఆ ప్రాంతం అంతా ఆ వాసన వ్యాపించింది. అక్కడక్కడ నాచులో, బాడవ మొక్కల్లో యీ వాసన యింకా ఘాటుగా వుంది. కాని యెక్కడ మరీ ఘాటుగా వున్నదీ, యెక్కడ తక్కువ ఘాటుగా వున్నదీ అది పసికట్టలేక పోయింది. అంచేత సరి అయిన దిశని పట్టుకునేందుగ్గాను గాలికి దూరంగా వెళ్లడం దానికి అవసరమైంది. కాళ్లు యెలా పరిగెడుతున్నాయో తెలీకుండానే, లాస్కా బిగిగా పరిగెత్తింది. పిసరు అవసరంపడితే ఆగగలిగేటట్టు పరిగెత్తింది. కుడి వేపు పరిగెత్తింది. తూర్పునుంచి వీచే ప్రత్యూష శీత పవనంనుంచి దూరంగా వెళ్లి గాలికేసి ముట్టె పెట్టింది. ముకు పుటాలు పెద్దవి చేసుకుని నిండుగా గాలి పీల్చేక దానికి పకుల వాసనే గాదు, యెదురుగ్గా వున్న పకుల్నే పసికట్టింది. ఒకటి కాదు రెండు కాదు బోలెడు వున్నట్టు పసికట్టింది. అది వేగం తగ్గించింది. అవి అక్కడే వున్నాయి కాని కచ్చితంగా యెక్కడ అనేది తెల్సుకోలేక పోయింది. కచ్చితమైన చోటు పట్టుకుందుకు అది సుళ్లు తిరిగింది. కాని యజమాని పిలుపుతో ఠక్కున ఆగిపోయింది. "యిదుగో, లాస్కా" అని మరో దిశకేసి చూపిస్తూ అతను అరిచేడు. తను మొదలుపెట్టిన దాన్ని ముగించేక అటు వెళ్లకూడదూ అని అడుగుతున్నట్టు అతనికేసి చూస్తూ ఆగింది. కాని లేవిన్ నీళ్లు నిండిన రెల్లుకేసి అక్కడ వేట వుండ వచ్చునేమోనని చూపిస్తూ మళ్లీ అదే మాట కోపంగా రెట్టించేడు. అది అతని మాట వింది. అతని తృప్తి కోసం అన్నట్టు వెతకడం నటించింది. కొంత దూరం తిరిగి మళ్లీ ముందటి చోటుకే వచ్చి వెంటనే వాసన పట్టింది. అతను యిప్పుడు జోక్యం చేసుకోకపోవడంతో తనేం చెయ్యాల్సిందీ దానికి తెలిసింది. అది కిందికి చూడకుండా, యెగుడుదిగుడు నేలమీద తడబడుతూ, నీళ్లల్లో పడుతూ వుంది. కాని చురుకైన కాళ్లమీద మళ్లీ టక్కుని లేస్తూ చక్కర్లు తిరగడం మొదలుపెట్టింది. ఆ తిరగడం దానికి విషయాన్ని విశదం చెయ్యాలన్న

మాట. పక్షుల వాసన యింకా యింకా యెక్కువగా తెలుస్తోంది. యింకా యింకా యెక్కువ సాంద్రంగా వుంది. వో పక్షి అక్కడనే, మిట్ట వెనక అయిదడుగుల దూరంలో వుందని దానికి హఠాత్తుగా తెలిసింది. అది అలానే ఆగిపోయింది. గట్టిగా వూపిరి కూడా తియ్యలేదు. మహా బిగువుగా నుంచుండి పోయింది. దాని కాళ్లు మరీ పొట్టిగా వుండడంతో యెదర వున్నది యేదీ దానికి ఆనటం లేదు. కాని వాసనని బట్టి పక్షి అయిదడుగుల కంటే యెక్కువ దూరంలో లేదని అది గ్రహించింది. అది యింకా యెక్కువగా పక్షి వాసనని ఆఘ్రాణిస్తూ, దాని కోసం యెదురు చూసే ఆనందాన్ని పొందింది. అది తోకని బారుగా బిగిగా చాచింది. తోక చివర మాత్రం కంపించింది. దాని నోరు సగం తెరుచుకుంది. చెవులు రిక్కించింది. పరిగెత్తడంవల్ల వో చెవి వెనకనుంచి ముడుచుకుంది. అది ఆయాసపడుతూ పక్షిని బెదర కొట్టకుండా నిదానంగా వూపిరి పీల్చింది. జాగ్రత్తగా యింకా జాగ్రత్తగా, తలకంటే యెక్కువగా కళ్లని తిప్పి యజమానిని చూసింది. అతని వాలకం దానికి బాగా తెలుసు. అతని కళ్లు దానికి యెప్పుడు భయం కలిగించేవి. అతను చాలా నిదానంగా అడుగులో అడుగు వేసుకుంటూ యెగుడుదిగుడు నేలమీద త్రొటి పడుతూ వస్తూ వున్నట్టు దానికి అనిపించింది. అతను మరీ చప్పుగా నడిచి వస్తూ వున్నట్టు దానికి అనిపించింది, నిజానికి అతను పరిగెత్తి వస్తూ వున్నా గానీ.

అది వేటని వెతికినట్టు వాలకం పెట్టి, నేలని కరిచి పెట్టుకుపోయి, మూతి సగం తెరిచి, వెనక కాళ్లని యీడుస్తున్నట్టు పెట్టిన పద్ధతి చూసి అది కంజుల వాసన పట్టిందని లేవిన్ గ్రహించి దాని వేపు పరిగెత్తేడు. లేవిన్ మనసులో జయలక్ష్మి వరించాలని ముఖ్యంగా మొదటి పిట్ట వేట అయినా విజయం సాధించాలని, కోరుకున్నాడు. లాస్క పక్కకి వెళ్లీ వెళ్లగానే అతను యెదర చూడ్డం మొదలుపెట్టేడు. తను యెత్తుగా వుండడంవల్ల లాస్క నాసికతో పసికట్టిన దాన్ని కళ్లతో చూశేడు. రెండు మిట్టల మధ్య వో కంజు మరో మిట్ట మీద కూర్చుని వుంది. అది అతని కంటబడింది. అది తల పైకి యెత్తి చప్పుళ్ల వేపు వో చెవి పెట్టి హెచ్చరికగానే వుంది. తర్వాత రెక్కలు కొంచెం కొట్టుకుని మళ్లీ ముడుచుకుని, వింతగా తోక వూపి మిట్ట వెనక్కి పోయింది.

"ఉరుకు, ఉరుకు" అని లేవిన్ వెనకనుంచి లాస్కకి వూపు యిచ్చేడు.

'కాని నేను వెళ్లలేను' అనుకొంది లాస్క. 'యెక్కడికి వెళ్లను? యిక్కడ్నుంచైతే వాటి వాసన తెలుస్తోంది. కాని ముందుకు వెడితే అవి యెక్కడున్నాయో, అవి యేమిటో పట్టుకోలేను' అనుకొంది. కాని లేవిన్ మోకాలితో దాన్ని కొంచెం తోసి ఆవేశంలో గొణిగేడు: "ఉరుకు, లాస్క, ఉరుకు" అని.

'సరే తనకి అలా అనిపిస్తే, అలానే చేస్తాను. కాని నా జవాబుదారీ యేమీ వుండదు మరి' అనుకొంది. దాంతో అది మిట్టల మధ్యకి దూకింది. దానికిప్పుడు యే వాసనా తగిల్లేదు. యేదో వినిపించింది కనిపించింది, యేమీ అర్థం కాలేదు.

ఆ చోటునుంచి వో పది అడుగుల దూరంలో వో పెద్ద గీమనే కూతతో, కంజులకి ప్రత్యేకం వుండే రెక్కల మోతతో వో పెద్ద కంజు లేచింది. గుండు పేలగానే ఆ పక్షి తెల్లని ఛాతీ తడి నేలమీద గట్టిగా తపామని పడింది. రెండో పిట్ట కూడా కుక్క యింకా బెదిరించకుండానే లేవిన్ వెనకనుంచి లేచింది.

లేవిన్ దాని వేపు తిరిగేటప్పటికి అది కొంచెం దూరం పోగలిగింది. కాని అతను పేల్చిన తూటా దాన్ని కొట్టింది. అది మరో యిరవై అడుగులు యెగిరింది. బలంగా పైకి లేచింది, మళ్లీ సుళ్లు తిరుగుతూ గాలిలోకి విసిరిన బంతిలాగా స్రరన కిందికి జారుతూ పొడినేలమీద పడింది.

'బోణీ బాగానే వుంది' అని లేవిన్ వెచ్చగా లావుగా వున్న పిట్టల్ని సంచీలో వేసుకుంటూ అనుకున్నాడు. 'యేమంటావ్ లాస్కా, బోణీ బాగానే వుందా?'

లేవిన్ తుపాకీ నింపుకుని మళ్లీ బయల్దేరేటప్పటికి పొద్దు యెక్కింది, మేఘాల మాటున వున్నా గానీ. చంద్రుడు పూర్తిగా వెలవెల బారిపోయి ఆకాశంలో తెల్లని మేఘంలాగా వున్నాడు. వొక్క నక్షత్రం కూడా కంటికి కనిపించడం లేదు. మంచు బిందువుల వల్ల అప్పటిదాకా తెల్లగా వున్న బాడవ నేల యిప్పుడు బంగారు శోభలో కనిపిస్తోంది. జేగురు రంగు నీళ్లు పసుపుపచ్చగా కనిపిస్తున్నాయి. గడ్డి శ్యామల వర్ణం హరిద్రా హరితవర్ణంగా మారింది. బాడవ పిట్టలు వెండిలా మెరుస్తున్న నదిమీద నిడుపాటి నీడలు పరుస్తూ వున్న చెట్లలో హడావుడిగా వున్నాయి. వో డేగ లేచి, కోసుగా వున్న గడ్డి వాముమీద కూర్చుంది. తల అటూ యిటూ వూపుతూ బాడవకేసి చిరుబురుమనుకుంటూ చూస్తోంది. దొంగ కాకులు పొలాల మీద యెగురుతున్నాయి. దినపొదాల కుర్రాడొకడు గుర్రాల్ని వో ముసలాయన వేపు తోలుకు వెడుతున్నాడు. ఆ ముసలతను అప్పుడే కోటు కిందనుంచి లేచి కూర్చుని గోక్కుంటున్నాడు. తుపాకీ పేల్చిన తర్వాత లేచిన పొగ ఆకుపచ్చ గడ్డి నేపథ్యంలో పాలలా తెల్లగా కనిపిస్తోంది.

ఓ కుర్రాడు లేవిన్ వేపు పరిగెత్తుకుంటూ వచ్చేడు.

"మామా, నిన్న యిక్కడ బాతులు వున్నాయి" అని లేవిన్‌తో చెప్పి కొంత దూరం దాకా అతని వెనక వెనకనే వెళ్లేడు.

లేవిన్ ఆ కుర్రవాడు వుండగా మూడు కంజుల్ని కొట్టడంతో మహా సంతోషంగా వున్నాడు. ఆ కుర్రవాడు ఆహా అని మెచ్చుకున్నాడు.

## 13

వేటలో మొదటి జంతువుగాని, పక్షిగాని చెయ్యి జారిపోకుండా దక్కినట్లయితే మిగిలిన వేటంతా ఘనంగా వుంటుందనే వేటగాళ్ల నమ్మకం నిజమనే తేలింది.

లేవిన్ అలిసిపోయి, ఆకలితో దప్పికతో, అయినా సంతోషంతో, సుమారు వో ముప్పై

వెర్స్తులు తిరిగి, పంధొమ్మిది కంజుల్ని సంచీలో వేసుకుని, సంచీలో పట్టని వో అడివి బాతుని పటకాకి కట్టుకుని తిరిగి వెనక్కి వచ్చేటప్పటికి దగ్గర దగ్గర పదైంది. అతని నేస్తాలు లేచి నాస్తా చేశేరు.

''ఆగండి, ఆగండి, పంధొమ్మిది వుంటాయనుకుంటాను'' అని లేవిన్ కంజుల్ని, పెద్ద కంజుల్ని మళ్లీ లెక్క పెడుతూ అన్నాడు. అవి యెగిరేటప్పుడున్నట్టుగా అందంగా లేవు. ముడుచుకుపోయి వేళ్లాడిపోతున్నాయి. ఆరిపోయిన రక్తం మెరకలతో వున్నాయి. వాటి తలలు వేలబడి వున్నాయి.

లెక్క సరిగానే వుంది. అబ్లాన్స్కీ తనని చూసి అసూయపడ్డం లేవిన్‌కి సంతోషంగా వుంది. కిట్టీ దగ్గర్నుంచి ఉత్తరం తెచ్చిన మనిషి తన కోసం నిరీక్షిస్తూ వుండడమూ సంతోషం కలిగించింది.

'నా వొంట్లో హాయిగా వుంది. సంతోషంగా వున్నాను. నా గురించిన బెంగలేం వద్దు, అలాంటి బెంగలు వుండవలసిన కారణం యేమీ లేదు. యేమంటే యిప్పుడు నాకు కొత్త అంగరక్షకురాలు వచ్చింది, మరీయా వ్లాస్యెవ్నా' (లేవిన్ యింట్లో యీ మధ్యనే చేరిన కొత్త ముఖ్యమైన సభ్యురాలు, మంత్రసాని). 'నేనెలా వున్నానో చూద్దామని వచ్చింది. నేను అంతా బాగానే వున్నట్టు ఆమె అంది. నువ్వు తిరిగివచ్చేదాకా వుండి పొమ్మని ఆమెని అడిగేం. అందరూ క్షేమం. అంచేత నువ్వేమీ బెంగపడక్కర్లేదు, తొందర పడక్కర్లేదు. వేట బాగా వుంటే మరో రోజు వుండు.''

భేషైన వేట, భార్య ఉత్తరం అనే రెండు మహత్తర సంతోషకర విషయాలు, తర్వాత వచ్చిన రెండు అప్రియమైన విషయాల్ని కమ్మేశాయి. లేవిన్‌కి అవి అంతగా కష్టం కలిగించ లేదు. ఒక అప్రియమైన విషయం గోధుమరంగు గుర్రం అలసంగా వుండి యేమీ మేత మెయ్యలేదు. దాన్ని ముందు రోజున యెక్కువ తోలడంవల్ల అలా వుంది. గుర్రం బాగా నలిగిపోయినందువల్లనని చెప్పి బండితోలేవాడు అన్నాడు.

''నిన్న బాగా నలిగిపోయిందండయ్యా. యీ కచ్చా రోడ్లమీద పది వెర్స్తులు పరిగెత్త డం మరి'' అన్నాడు.

రెండో అప్రియమైన విషయం, మొదట అది అతనికి చిరాకు కలిగించినా తర్వాత నవ్వు తెప్పించింది. అదేమిటంటే కిట్టీ తమకి వారానికి సరిపడా సర్దిపెట్టిన తిండి పిసరు కూడా మిగలకుండా ఖర్చయిపోవడం. బాడవనుంచి అలిసిపోయి ఆకలితో తిరిగివచ్చే టప్పుడే అతను పిండివంటల గురించి వూహించుకుంటూ, లాస్క వేట వాసనని పట్టుకో గలిగినట్టుగా వాటి వాసనని గుర్తు చేసుకుంటూ వచ్చేడు. గుమ్మంలో అడుగుపెట్టగానే వాటిని తింటానికి తెమ్మని ఫిలిప్‌కి పురమాయించేడు. అప్పాలు సరేసరి కోళ్ళు కూడా మిగల్లేదని తెలిసింది.

''యేం జఠరాగ్ని యితనిది!'' అని అబ్లాన్స్కీ నవ్వేడు వెస్లొవ్స్కీకేసి తల వూపి

చూపిస్తూ. "నా జఠరాగ్ని తక్కువదని అనను గాని యితనిది అందరినీ సొడ్డు పెట్టేసింది."

"అయితే యేం లే!" అని లేవిన్ వెస్లోవ్‌స్కీకేసి గుర్రుగా చూసి అన్నాడు. "అయితే కొంచెం మాంసం పట్టుకు రా, ఫిలిప్" అన్నాడు.

"అదీ అయిపోయిందండయ్యా. బొమికెల్ని కుక్కలకి వేసేశాను" అన్నాడు ఫిలిప్.

లేవిన్‌కి చాలా కష్టం కలిగి చింకుకున్నాడు.

"యేదో వొకటి మిగిల్చి తగులడాల్సింది!" అతను యేడ్చినంత పని చేశాడు.

"సరే వెళ్లి యీ పిట్టల్ని శుభ్రం చేసి, కాసీ" అని వొణికే గొంతుకతో ఫిలిప్‌కి చెప్పేడు. "కొత్తిమీర వెయ్యడం మర్చిపోకు. పోనీ పాలేనా వున్నాయా?" అన్నాడు.

పాలు తాగేక కడుపు చల్లబడింది. అప్పుడు అయ్యో అనవసరంగా కొత్త మనిషి ముందు చిరాకు పడ్డానే అని సిగ్గు పడ్డాడు. తన కోపాన్ని వేళాకోళం అయినట్టుగా తిప్పేడు.

సాయంత్రం వాళ్లు వేటకి వెళ్లేరు. వెస్లోవ్‌స్కీ కాసిని పిట్టల్ని కొట్టేడు. రాత్రికి యింటికి తిరిగివచ్చేరు.

తిరుగు ప్రయాణం కూడా వచ్చే ప్రయాణంలాగా దారి పొడుగుతా మజాగా వుంది. వెస్లోవ్‌స్కీ పాటలు పాడేడు. తనకి వోద్కా యిచ్చి బాగా చూసిన రైతులని గుర్తు చేసుకున్నాడు. 'మమ్మల్ని గురించి చెడ్డగా అనుకోకండయ్యా' అని వాళ్లు అన్న మాటల్ని గుర్తు చేసుకున్నాడు. తను పల్లె పడుచులతో మజా చెయ్యడం, ముఖ్యంగా ఆ పడుచు పిల్లని, తనని పెళ్లి అయిందా అని అడిగి కాలేదని విన్నాక 'వేరే వాళ్ల పెళ్లాల వెనకబడి తిరక్కుండా తమరి పెళ్లాన్ని తెచ్చుకోండి' అని రైతు అన్న మాటల్ని గుర్తు చేసుకున్నాడు. యిదంతా అతనికి నవ్వు తెప్పించింది.

"మొత్తంమీద మన వేట భలే సరదాగా గడిచింది. యేమంటారు, లేవిన్‌గారూ?"

"నాకూ సరదాగానే అనిపించింది" అన్నాడు లేవిన్ మనస్ఫూర్తిగా. వెస్లోవ్‌స్కీ పట్ల తనకి యింటి దగ్గర అనిపించిన వైషమ్య భావం పోవడమే కాక మహా స్నేహ భావం అతని పట్ల కలగడంతో లేవిన్‌కి మరీ సంతోషంగా వుంది.

## 14

మర్నాడు ఉదయం తన పొలాలూ అవీ తిరిగేక ఉదయం పది గంటలకి లేవిన్ వెస్లోవ్‌స్కీ గదికి వెళ్లి తలుపు తట్టేడు.

"Entrez[1]" అని వెస్లోవ్‌స్కీ గట్టిగా అరిచాడు. "మరేం అనుకోకండి, యీ వాల

[1] రండి (ఫ్రెంచి).

కంతో వున్నందుకు. యిప్పుడే ablutions[1] పూర్తి చేశాను'' అని పొట్టి చెడ్డీతో నుంచున్న వెస్లోవ్‌స్కీ అన్నాడు.

''దాన్ని గురించేం పట్టించుకోకండి'' అని లేవిన్ కిటికీ దగ్గర కూర్చున్నాడు. ''బాగా నిద్రపట్టిందా?'' అని అడిగేడు.

''ఏనుగులు తొక్కినా లేవనంత నిద్రపట్టింది. యివాళ వేటకి బాగానే వుంటుందా?''

''మీరు టీ తాగుతారా? కాఫీయా?''

''యేం వద్దు. నాస్తా తీసుకుంటాను. నాకు భలే సిగ్గుగా వుంది. ఆడవాళ్లంతా లేచారనుకుంటాను. యిప్పుడు కాస్త తిరగడం బాగుంటుంది. మీ గుర్రాల్ని చూపిస్తారేమిటి?''

లేవిన్ అతనికి తోటనీ, గుర్రాల శాలనీ చూపించేడు. పారలెల్ బార్లమీద అతనితో కలిసి వ్యాయామం చేశాడు. తర్వాత తిరిగి యింట్లోకి వచ్చి డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్లేరు.

''వేట దివ్యంగా వుంది, యెన్ని అనుభూతులు మనసులో నాటుకున్నాయి!'' అని కిట్టీ దగ్గరికి వెడుతూ వెస్లోవ్‌స్కీ అన్నాడు. కిట్టీ సమొవార్ వెనక్కాల కూర్చుంది. ''ఆడవాళ్లకి యీ సంతోషం లేకపోవడం యెంత బాధగా వుంటుంది!'' అన్నాడు.

'యిందులో తప్పేముందిలే, యింటావిడ్ని పలకరించాలి కదా' అని లేవిన్ తనలో తను అనుకున్నాడు. అయినా వెస్లోవ్‌స్కీ చిరునవ్వులో, అతను కిట్టీని సంబోధిస్తూ విజేతలాంటి తీరులో చూసిన చూపులో యేదో అభ్యంతరకరమైంది వున్నట్టు అతనికి అనిపించకపోలేదు...

ప్రిన్సెస్ బల్ల అటు వేపున మరీయా వ్లాస్యేవ్నా అబ్లాన్‌స్కీలతో కలిసి కూర్చుంది. లేవిన్‌ని తన దగ్గరికి రమ్మని పిలిచింది. కిట్టీని కాన్పుకి మాస్కో తీసికెళ్లడం గురించీ అక్కడ అందుకుగాను యింటిని సిద్ధం చెయ్యడం గురించీ మాటలు మొదలుపెట్టింది. పెళ్లి సందర్భంలో చేసిన అన్ని యేర్పాట్లూ లేవిన్‌కి యిష్టం లేకపోయినట్టే – వివాహ మహత్వాన్ని యీ యేర్పాట్లు తమ అల్పత్వంతో కించ పరుస్తాయి – పుట్టబోయే శిశువు (యెప్పుడు పుట్టబోయేదీ వాళ్లు తిథులు వేళ్లమీద లెక్క పెడుతున్నారు) పురిటికి చేసే యేర్పాట్లూ అతనికి అంతకంటే యిప్పుడు యెక్కువ అనిష్టకరంగా కనిపించేయి. పుట్టబోయే శిశువుని యెలా గళ్ల గుడ్డల పొత్తిళ్లల్లో కప్పాలీ అనే మాటలకేసి చెవి పెట్టేవాడు కాదు లేవిన్. తెగూ తెంపూ లేకుండా అల్లుతూ వుండే పట్టీలకేసీ, నార గుడ్డతో చేసే త్రికోణాలకేసీ చూసే ప్రయాస పడేవాడు కాదు, వీటికి దాలీ మహత్తర ప్రాముఖ్యం యిచ్చేది. కొడుకు పుట్టడం (పుట్టబోయేది కొడుకే అని అతని నమ్మకం) అనే మహత్తర ఘటన జరుగుతుంది అని అతనికి నమ్మకం చెప్పేరు కాని అతనికి యింకా విశ్వాసం కలగడం లేదు,

---

[1] స్నానాదికాలు (ఫ్రెంచి).

అంత మహత్తరమైన విషయంలా అది భాసించింది. ఆ సంఘటన అతనికి వో వేపున యెంతో అపారమైనదిగా అందువల్ల అసంభవ సౌఖ్యప్రదమైన విషయంగా కనిపించింది. మరో వేపున యెంతో నిగూఢమైన విషయంగా కనిపించింది, జరగబోయే అలాంటి దాన్ని గురించి తమకి తెలిసిందని అనుకోవడం, దాన్ని యేదో సాధారణ విషయంగా తీసుకుని మనుషులు తమ చేతులతో చేసిన వస్తువుకి మల్లే యేర్పాట్లు చెయ్యడం అతనికి ఘృణితంగా, తిరస్కార పూరితంగా కనిపించింది.

కాని ప్రిన్సెస్‌కి అతని మనోభావాలు అర్థం కాలేదు. యీ విషయం గురించి మాట్లాడాలన్నా ఆలోచించాలన్నా అతను విముఖంగా వుండడం చూసి అతనికి యేమీ పట్టలేదనీ, ఉదాసీనంగా వున్నాడనీ ఆమె అనుకొంది. దాంతో ఆమె అతన్ని స్థిమితంగా వుండనివ్వలేదు. ఆమె యిల్లు వెతకమని అబ్లాన్‌స్కీకి చెప్పింది. యిప్పుడు లేవిన్‌ని తన దగ్గరకి రమ్మని పిలిచింది.

"నాకీ గొడవలేం తెలియవు, ప్రిన్సెస్! మీకెలా తోస్తే అలా చెయ్యండి" అన్నాడు లేవిన్.

"మీరు అక్కడికి యెప్పుడు మారేదీ తేల్చుకోవద్దా మరి?"

"నాకు తెలీదు, నమ్మండి. నాకు తెలిసిందల్లా మాస్కో గాని డాక్టర్లు గాని లేకుండానే లక్షలాది బిడ్డలు పుడుతూ వున్నారని... మరి యెందుకు..."

"అలా అనుకుంటే యిక..."

"అబ్బెబ్బె, కిట్టీకి యెలా యిష్టమైతే అలా చెయ్యండి."

"అమ్మో! కిట్టీతో యీ విషయం గురించి మాట మాత్రం అండానికి లేదు. దాన్ని బెదర గొట్టమంటావ్? మొన్న ఏప్రిల్ నేలలో సరైన మంత్రసాని లేకపోవడంవల్ల నతాలీ గలీత్సినా, పాసం, పోయింది."

"మీరు యెలా అంటే అలా చేస్తా" అని లేవిన్ ముబ్బుగా అన్నాడు.

ప్రిన్సెస్ యేదో చెప్పబోయింది కాని అతనావిడ మాటలు వినలేదు. ప్రిన్సెస్‌తో మాటల వల్ల అతనికి కష్టం కలిగిన మాట నిజమే, కాని ఆ మాటలవల్లే కాకుండా సమొవార్ దగ్గర జరుగుతూ వున్న దాన్ని చూసి అతని మనసు వికలమైపోయింది.

'వుహుఁ, యిది అసంభవం' అని మధ్యమధ్య కిట్టీకేసీ, వెస్లోవ్‌స్కీకేసీ చూస్తూ మనసులో అనుకున్నాడు. వెస్లోవ్‌స్కీ కిట్టీమీదకి వాలుతూ, సమ్మోహకరమైన మంద హాసం చేస్తూ ఆమెకి యేదో చెపుతూనే వున్నాడు. ఆమె సిగ్గుతో యెర్రబడిపోయి భావ విహ్వలితురాలవుతోంది.

వెస్లోవ్‌స్కీ వైఖరిలో, చూపులో, మందహాసంలో అనుమానాస్పదమైంది యేదో వుంది. కిట్టీ వైఖరిలోనూ, చూపులోనూ కూడా లేవిన్‌కి అంతే శంకా కారకమైంది కనిపించింది. అతనికి మళ్ళీ ప్రపంచం అంధకార బంధురమైపోయింది. మళ్ళీ, అంతకు ముందు రోజుకి మాదిరిగానే యీషణ్మాత్ర చైతన్య రహితంగా అతను తనకి తెలియకుండానే ఆనంద,

ప్రశాంత, గరిమా శిఖరంమీదనుంచి నిరాశా క్రోధావమానాల అధఃపాతాళంలోకి పడి పోయేడు. మరో సారి అతనికి అందరూ, అన్నీ ఘృణితంగా కనిపించడం జరిగింది.

"మీరు యెలా కావాలనుకుంటే అలా జరిపించండి, ప్రిన్సెస్" అని మళ్లీ అటు వేపు చూస్తూ అతను అన్నాడు.

"తలమీద మనోమాఖ్ కిరీటం మోసేవాడికి మనశ్శాంతి వుండదు"* అని అబ్లాన్‌స్కీ వేళాకోళంగా అన్నాడు. ప్రిన్సెస్‌తో లేవిన్ సంభాషణని ఉద్దేశించి మాత్రమే కాక, లేవిన్ మనో వ్యాకులతని ఉద్దేశించీ అబ్లాన్‌స్కీ అలా అన్నాడని తెలుస్తూనే వుంది. అబ్లాన్‌స్కీ యీ విషయాన్ని గమనించేడు. "యివాళ యింత ఆలస్యం చేశావేమిటి, దాలీ" అని అటు తిరిగేడు.

దాలీని పలకరించడానికి అందరూ లేచి నుంచున్నారు. వెస్లోవ్‌స్కీ లిప్తకాలం సేపు నుంచుని, యువతరం వాళ్లకి మహిళల పట్ల వుండే సున్నిత భావం తక్కువ చూపిస్తూ, మొక్కుబడిగా తల అలా వొంచి వందనం చేసి తనన్న యేదో మాటకి తనే నవ్వుతూ మళ్లీ మాటల్లో పడిపోయేడు.

"మాషా నా గడ్డి నాకు పెట్టింది. రాత్రి కాస్సేపు సుఖంగా నిద్రపోలేదు, మహా పెంకితనంగా వుంది" అని దాలీ చెప్పింది.

వెస్లోవ్‌స్కీ కిట్టీతో మళ్లీ అన్నాకి సంబంధించి ముందు రోజు ప్రస్తావించిన విషయం గురించి మాట్లాడ్డం మొదలుపెట్టేడు. ప్రేమ అనేది సామాజిక పరిస్థితుల్ని అధఃకరించ గలదా అని మాట్లాడుతున్నాడు. కిట్టీకి ఆ విషయం గురించి మాట్లాడ్డం యిష్టం లేదు. ఆ విషయమూ, దాన్ని గురించి మాట్లాడే తీరూ ఆమెకి ఆందోళన కలిగించేయి. అన్నిట్నీ మించి, భర్తకి యిది యేమీ యిష్టంగా వుండదు అని ఆమెకి తెలియడంవల్ల మరీ ఆందోళన పడింది. కాని ఆమె చాలా సరళ స్వభావురాలు, నిష్కపటి కావడంతో ఆ సంభాషణని ఆపలేకపోయింది. ఆ పడుచు వాడి ప్రశంసల వల్ల తనకి కలుగుతూ వున్న సంతోష బాహ్య చిహ్నాల్నీ దాచుకోలేకపోయింది. యీ సంభాషణకి స్వస్తి చెప్పాలని అనుకొంది కాని యెలాగో ఆమెకి తెలియలేదు. తను యేం చేసినా భర్త దృష్టిలో పడుతుందనీ, అపార్థానికి దారి తీస్తుందనీ ఆమెకి తెలుసు. నిజానికి ఆమె మాషాకి యేం జరిగిందని దాలీని అడిగినప్పుడు, వెస్లోవ్‌స్కీ యేమిటీ విసుగు పుట్టించే విషయం ముగుస్తుందా అని నిరీక్షిస్తూ దాలీకేసి యేదో పరధ్యానంగా చూడడంతో లేవిన్‌కి కిట్టీ అడిగిన ఆ ప్రశ్న అసహజంగా, యేవగింపు కలిగించే కుయుక్తిగా కనిపించింది.

"యేం మరి, యివాళ పుట్టగొడుగులు యేరడానికి వెళ్లద్దా" అంది దాలీ.

"వెడదాం, నేనూ వస్తా" అంది కిట్టీ. హఠాత్తుగా ఆమె ముఖం యెర్రబడింది. మీరు కూడా వస్తారా అని మర్యాద కోసం వెస్లోవ్‌స్కీని అడగబోయింది. కాని తక్కున ఆగి పోయింది. "యెక్కడికి వెడుతున్నావ్?" అని తన పక్కనుంచి దృఢంగా నడిచి వెడుతూ

వున్న భర్తని యేదో నేరం చేసిన దానిలా కనిపిస్తూ అడిగింది. కిట్టీ ముఖంలో కనిపించే లపరాధిని భావం అతని అనుమానాల్ని ఖాయం చేసింది.

"మెకానిక్ వచ్చేడట కదా, అతన్ని చూడాలి" అని లేవిన్ ఆమెకేసి కన్నెత్తి చూడ కుండా అన్నాడు.

అతను కిందికి దిగి, యింకా చదువుకునే గది దాటి యివతలికి వచ్చేడో లేదో భార్య పరిచితమైన అడుగుల చప్పుడు అతనికి వినిపించింది. ఆమె హడావుడిగా అటూ యిటూ చూసుకోకుండా వస్తోంది.

"యేమిటి సంగతి?" అని లేవిన్ పొడిగా ఆమెని అడిగేడు. "నాకు తీరికలేదు" అన్నాడు.

"మరేం అనుకోకండి" అని ఆమె జర్మన్ మెకానిక్‌ని చూసి అంది. "మా ఆయనతో కొంచెం మాట్లాడాలి" అంది.

అతను అవతలికి వెళ్ళబోయేడు గాని లేవిన్ అతన్తో "ఫరవాలేదు లెండి" అన్నాడు.

"రైలు మూడు గంటలకి వెళ్ళిపోతుంది కదా?" అని జర్మన్ అడిగేడు. "ఆలస్యం అవకూడదు" అన్నాడు.

లేవిన్ అతనికేమీ జవాబు చెప్పకుండా భార్యతో బయటికి వెళ్ళేడు.

"తమరు యేం చెప్పా లనుకుంటున్నారు?" అని లేవిన్ ఫ్రెంచిలో అడగడం మొదలు పెట్టేడు.

అతను ఆమె ముఖంలోకి చూడలేదు. ఆమె ప్రస్తుతం వున్న పరిస్థితిలో గజగజ వొణికిపోతూ వుందనీ, ఆమె ముఖం చాలా దయనీయంగా, దీనంగా వుందనీ చూడడం కూడా అతనికి యిష్టం లేకపోయింది.

"నేను... నేను చెప్పదలచుకున్నది యిలా బతకడం సాధ్య పడదని, యిది నరక యాతనగా వుందని" అని ఆమె మొదలుపెట్టింది.

"వంట గది నౌకర్లున్నారు యిక్కడ, వూరికే రచ్చ చెయ్యకు" అని అతను కటువుగా అన్నాడు.

"అయితే యిటు పద."

వాళ్ళు మధ్య గదిలో నుంచున్నారు. కిట్టీ ఆ పక్క గదిలోకి వెళ్ళేదే కాని అక్కడ ఇంగ్లీషు పంతులమ్మ తాన్యాకి పాఠం చెప్తోంది.

"అయితే తోటలోకి వెడదాం."

తోటలో దారి వూడుస్తూ వున్న తోటమాలి తగిలేడు. కన్నీటి చారికలు కట్టిన కిట్టీ ముఖాన్ని, వ్యాకులంగా వున్న ఆమె భర్త ముఖాన్ని అతను చూస్తాడన్న పట్టింపు లేకుండా, యేదో ఘోర విపత్తునుంచి పారిపోతూ వున్న వాళ్ళల్లా కనిపిస్తూ వున్నామేమో అనే విషయం గురించి ఆలోచించకుండా వాళ్ళు గబగబ అడుగులు వేసుకుంటూ ముందుకు వెళ్ళిపోయేరు. తమ గుండెల బరువు దింపుకోవాలి, పరిస్థితిని చక్కదిద్దుకోవాలి యిద్దరూ యేకాంతంగా

వుండాలి, ఆ రకంగా యీ దుర్భర వేదనని తొలగించుకోవాలి అని అనుకుని గబగబ అడుగులు వేసుకుంటూ ముందు వెళ్లేరు.

"యిలా బతకడం సాధ్యం కాదు. యిదీ మహా నరక యాతనగా వుంది. నేనూ యాతన పడుతున్నా నువ్వు యాతన పడుతున్నావు. యెందుకిదంతా?" అని, లిండెన్ చెట్ల తోపులోకి ఆఖరికి యేకాంతంగా వున్న బెంచీ దగ్గరికి చేరాక కిట్టీ అంది.

"కాని మొదటగా వో విషయం చెప్పు, అతని తీరులో అభ్యంతరకరమైన, నీచమైన, భయంకరంగా అవమానకారక మైనదేదో వుందంటావా లేదంటావా?" అని అతను అడిగేడు. ఆమె ముందు తన ఛాతీమీద ముష్టి బిగించి, వెస్లోవ్స్కీ వచ్చిన రోజు రాత్రి నుంచున్నట్టుగా నుంచుని అడిగేడు.

"ఆఁ, వుంది" అని ఆమె కంపించే గొంతుకతో అంది. "కాని నువ్వు చూడ్డం లేదా యిందులో నా తప్పేముంది? పొద్దుటినుంచీ అతని ధోరణిని పట్టించుకోకుండా వుండాలనే ప్రయత్నించేను. కాని యీ మనుషులు... అయినా అతను యిక్కడికి యెందుకు వచ్చేడు? మనం యెంత ఆనందంగా వున్నాం!" అని ఆమె రుద్ధ కంఠంతో అంది. వెక్కుతూ వుండడంవల్ల, గర్భిణి కాబట్టి, మొత్తం శరీరం అంతా వూగులాడింది.

వాళ్లని యేదీ తరమలేదు, దేన్నుంచీ వాళ్లు పారిపోనవసరమూ లేదు, తోటలో వున్న యీ బెంచీ వాళ్లకి విశేషంగా యే సౌఖ్యాన్నీ యివ్వనూ లేదు. అయినా యిద్దరూ శాంతంగా, వెలిగిపోతూ వున్న ముఖాలతో తిరిగి యింటికి వెళ్లిపోతూ వుండడం చూసిన తోటమాలికి యేమీ అర్థం కాక ఆశ్చర్యపోయేడు.

## 15

భార్యని మేడమీద దిగబెట్టి లేవిన్ దాలీ వుంటున్న వాటాకేసి వెళ్లేడు. ఆ పూట దాలీ కూడా బాగా కళ విళపడిపోయి వుంది. ఆమె అటూ యిటూ తిరుగుతూ కోపంగా చిన్న పిల్లని కేకలేస్తూ వుంది. ఆ పిల్ల వో మూల యేడుస్తూ నుంచుంది.

"ఆ మూల అలానే రోజంతా నుంచునే వుంటావు, వొక్కత్తివీ తిండి తింటావు, వొక్క బొమ్మ కూడా వుండదు నీకు. కొత్త గౌను కుట్టించను" అని, పిల్లని యిక వేరే యెలా దండించాలో తెలీక, ఆమె అంటోంది.

"యిది పిల్ల కాదు, పిశాచం. యెక్కడ్నుంచి పుట్టుకొస్తున్నాయో దీనికీ పాడు బుద్ధులు" అని లేవిన్‌ని చూసి అంది.

"యేం చేసింది?" అని లేవిన్ ఉదాసీనంగా అడిగేడు. అతను తన వ్యవహారం గురించి దాలీతో మాట్లాడదామని వచ్చేడు. తీరా చూస్తే యిక్కడ యిలా వుంది, దాంతో వచ్చిన వేళ మంచిది కాదని అతనికి చిరాకు కలిగింది.

"యిదీ గ్రీష కలిసి రాస్ప్బెర్రీ పళ్లు యేరుకు రావడానికి వెళ్లేరు, అక్కడ... యేం చేసిందో చెప్పను కూడా చెప్పలేను. అబ్బ, miss Elliot లేకపోవడం యిక్కడ యేం చావొచ్చి పడింది! ఈ కొత్త పంతులమ్మ దేన్ని గురించీ శ్రద్ధ పట్టదు. వొట్టి యంత్రం... Figurez vous, que la petite[1]..."

మాషా యేం చేసిందో దాలీ అతనికి చెప్పింది.

"అంత మాత్రానికే అదేం పాడు బుద్ధీ కాదు, యేదో కొంటెతనం" అని లేవిన్ ఆమెని ఓదార్చబోయేడు.

"కాని నువ్వెందుకు ఆందోళనగా వున్నావు? యేం వొచ్చేవు?" అని దాలీ అడిగింది. "అక్కడ యేం జరుగుతోంది?" అని అడిగింది.

ఆమె గొంతుక ధోరణి బట్టి చూస్తే తను చెప్పదలచుకున్న దాన్ని చెప్పేందుకు యేం కష్టం వుండదని లేవిన్కి అనిపించింది.

"నేనక్కడలేను. కిట్టీ, నేనూ తోటలో వున్నాం. మీ ఆయన వచ్చినప్పట్నుంచీ... మా యిద్దరికీ మధ్య రెండో సారి దెబ్బలాట జరిగింది."

దాలీ అర్థం అయినట్టు, మనసులో మాట గ్రహించగలిగినట్టూ కనిపించే కళ్లతో అతనికేసి చూసింది.

"నువ్వు గుండెమీద చెయ్యి వేసుకుని చెప్పు... కిట్టీలో కాదనుకో, యీ పెద్ద మనిషి ధోరణిలో మొగుడికి అభ్యంతరకరమైంది – అభ్యంతకరమైందే కాదు, ఘోరమైంది అవమానకరమైంది యేదో లేదూ?"

"యెలా చెప్పాలో తెలీటం లేదు... అలాగే మూల నుంచో!" అని తన ముఖంలో లీలగా కనిపించిన చిరునవ్వు చూసి అటు వేపు రావాలనుకున్న మాషాని గద్దిస్తూ అంది. "లోకం దృష్టిలో అతను పడుచు వాళ్లందరూ ప్రవర్తించినట్టే ప్రవర్తిస్తూ వున్నాడు. Il fait la cour à une jeune et jolie femme[2]. ఉన్నత సమాజం పతికి యిది గొప్ప విషయంగా కనిపించాలి మరి" అంది.

"ఆఁ, ఆఁ" అని లేవిన్ ముఖం మాడ్చుకుంటూ అన్నాడు. "కాని నువ్వు గమనించేవు కదా?" అని అడిగేడు.

"నేనే యేమిటి? మా ఆయన కూడా. టీ తాగిం తర్వాత నాతో స్పష్టంగా 'je crois que వెస్లోవ్స్కీ fait un petit brin de cour à కిట్టీ!'[3]" అన్నాడు.

---

[1] వూహించండి యీ పిల్ల... (ఫ్రెంచి).

[2] అతను అందమైన పడుచు ఆమెపట్ల ప్రేమ ప్రదర్శిస్తున్నాడు (ఫ్రెంచి).

[3] కిట్టీతో వెస్లోవ్స్కీ సల్లాపం సాగిస్తున్నట్టు అనిపిస్తోంది (ఫ్రెంచి).

''బాగుంది. యిప్పుడు నా మనసు ప్రశాంతంగా వుంది. అతన్ని గెంటేస్తాను'' అన్నాడు లేవిన్.

''యేమిటి నీకు పిచ్చెక్కిందా?'' అని దాలీ గాభరా పడి అరిచింది. ''నువ్వు యేమంటున్నావ్ తెలుసా? చిక్కబట్టుకో'' అని దాలీ నవ్వుతూ అంది. ''వూ, నువ్వు ఫేన్నీ దగ్గరికి వెళ్లచ్చు'' అని మాషాతో అంది. ''వద్దు, నువ్వు కావాలంటే మా ఆయనతో మాట్లాడతా, అతన్ని యిక్కడినుంచి తీసుకుపోతాడు. మీ యింటికి చుట్టాలు వస్తున్నారని చెప్తాడులే. మొత్తంమీద ఆతను మన యింటి చాలులో వాడు కాదు లే'' అంది.

''వద్దు, వద్దు, స్వయంగా నేనే ఆ పని చేస్తా.''

''కాని మీరు పోట్లాడుకుంటారు...''

''అబ్బే, అలా జరగదు. ఆలా చేస్తే నాకు హాయిగా వుంటుంది'' అన్నాడు లేవిన్. నిజానికి అతని కళ్లు సంతోషంగా మెరిశాయి. ''వూ, దాలీ యీ పాప తప్పు యీ సారి కాయి, మళ్లీ అలా చెయ్యదు లే'' అని పిల్ల తరపున అన్నాడు. మాషా ఫేన్నీ దగ్గరికి వెళ్లలేదు. తల్లి తనకేసి చూస్తుందనే ఆశతో కనుబొమల కిందనుంచి ఆమెకేసి చూస్తూ తల్లి దగ్గరే వస్తాయిస్తూ నుంచుంది.

తల్లి ఆమెకేసి చూసింది. ఆ చిన్న పిల్ల భోరున యేడ్చేసింది. ముఖాన్ని తల్లి కుచ్చెళ్లల్లో దాచేసుకుంది. దాలీ సన్నని చేతిని గోముగా పిల్ల తలమీద వేసింది.

'ఆ మనిషికీ మనకీ మధ్య సరి పడేది యేదీ లేదు' అని వెస్లొవ్‌స్కీ యెక్కడున్నదీ వెతుక్కుంటూ వెడుతూ లేవిన్ అనుకున్నాడు.

హాల్లోనుంచి వెడుతూ స్టేషన్‌కి వెళ్లడానికి బగ్గీని కట్టమని పురమాయించేడు.

''స్ప్రింగు వొకటి విరిగిపోయింది'' అని నౌకరు బదులు చెప్పేడు.

''అయితే నాలుగు చక్రాల బండిని కట్టమను, గబగబా కానీ. యేదీ మన పెద్ద మనిషి?''

''గదిలో వున్నారండి.''

లేవిన్ వెస్లొవ్‌స్కీ గదిలోకి వెళ్లేడు. వెస్లొవ్‌స్కీ సంచీలోనుంచి సామాన్లు తీస్తున్నాడు. తనతో కూడా తెచ్చిన కొత్త ప్రేమ గీతాల పుస్తకాన్ని ముందు పెట్టుకున్నాక గుర్రం స్వారీ చేసేందుకు అవసరమైన తోలు పట్టీలు సరిపోతాయో లేదో చూసుకుంటున్నాడు.

లేవిన్ ముఖంలో యేదన్నా విశేషం కనిపించిందో లేకపోతే తను చేసిన ce petit brin de cour[1] యీ యింట్లో పొసగదని అనిపించిందో మరి కారణం తెలీదు కాని లేవిన్ రాగానే అతను కలవిళ (ఉన్నత సమాజం వ్యక్తి యే మేరకి కలవిళ పడగలడో ఆ మేరకి) పడిపోయేడు.

''మీరు తోలు పట్టీలు కట్టుకుని స్వారీ చేస్తారా?''

---

[1] కొంచెం సరస సల్లాపం (ఫ్రెంచి).

"అవును. దీనివల్ల బాగా శుభ్రంగా వుంటుంది" అని వెస్లోవ్‌స్కీ లావాటి కాలిని కుర్చీమీద పెట్టి కింది కొక్కెం తగిలించుకుంటూ హుషారుగా కళకళ లాడే చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

ఇతను నిజంగా భలే పడుచు వాడే, వెస్లోవ్‌స్కీ తనకేసి చూసిన ఆ కళ్లల్లో కాతరత చూసి అతనిపట్ల జాలి, గృహస్థుగా తనపట్ల సిగ్గు కలిగాయి.

బల్లమీద కర్ర ముక్క వుంది. ఆ పొద్దుట కసరత్తు చేసేటప్పుడు అది విరిగిపోయింది. లేవిన్ ఆ ముక్కని తీసుకుని యెలా మాట కదలెయ్యాలో తెలీక దాన్ని చివర చీల్చడం మొదలుపెట్టాడు.

"నేను అనుకున్నా..." అతని మాట తెగిపోయింది. కాని కిట్టీ గుర్తుకు వచ్చింది. జరిగినదంతా గుర్తు వచ్చింది. దాంతో అతను వెస్లోవ్‌స్కీ కళ్లల్లోకి చూసి నిబ్బరంగా "మీ ప్రయాణానికి గుర్రాల్ని కట్టమన్నాను" అన్నాడు.

"యేమిటి?" అని వెస్లోవ్‌స్కీ తికమక పడిపోయి అడిగేడు. "యెక్కడికెళ్లడానికి?" అన్నాడు.

"రైల్వే స్టేషన్‌కి వెళ్లడానికి" అని లేవిన్ చీలిన కర్ర ముక్కని చివర్ని తుంపుతూ ముసురుగా అన్నాడు.

"మీరెక్కడికేనా హఠాత్తుగా వెడుతున్నారా లేక యేమన్నా జరిగిందా?"

"మాకు చుట్టాలు వస్తున్నారు" అని లేవిన్ కర్ర ముక్క పేళ్లు గట్టి వేళ్లతో యింకా గబగబా చీలుస్తూ అన్నాడు. "లేదు, చుట్టాలు రావడం లేదు, యేమీ జరగలేదు. కాని మీరు వెళ్లిపోవాలి అని కోరుతున్నాను. నా మొరటుతనం గురించి మీరు యెలా అనుకున్నా సరే" అన్నాడు.

వెస్లోవ్‌స్కీ నిటారుగా నుంచున్నాడు.

"మీరు సంగతి యేమిటైందీ వివరించాలని అర్థిస్తున్నాను..." అని అసలు విషయం ఆఖరికి అర్థం చేసుకుంటూ హుందాగా అతను అడిగేడు.

"నేను వివరించలేను" అని లేవిన్ దవడల వణుకుని ఆప ప్రయత్నిస్తూ నిదానంగా అన్నాడు. "మీరు అడగకుండా వుండడం చాలా మంచిది" అన్నాడు.

కర్ర ముక్క పేళ్లనన్నిటినీ చీల్చెయ్యడంతో లేవిన్ లావుగా వున్న ఆ కర్ర రెండు అంచుల్నీ చేతులతో పట్టుకుని దాన్ని రెండుగా విరిచేడు. కిందికి పడిపోయే ముక్కని లాఘవంగా చేత్తో పట్టుకున్నాడు.

బిగిగా వున్న లేవిన్ చేతులు, పొద్దుట వ్యాయామం చేసేటప్పుడు కనిపించిన అవే కండలు, జ్వలించే కళ్లు, నిబ్బరమైన గొంతుక, కంపించే దవడలు చూడగానే వెస్లోవ్‌స్కీకి మాటలు లేకుండానే అంతా విశదం అయిందని తెలుస్తూనే వుంది. అతను సరేనన్నట్టు భుజాలు యెగరేసి హేళనగా చిరునవ్వు నవ్వి తల వొంచేడు.

"నేను అబ్లాన్‌స్కీని చూడవచ్చా?"

వెస్లొవ్‌స్కీ చిరునవ్వు, అతను భుజాలు యెగరేసిన తీరు చూసి లేవిన్ మండి పడ లేదు. 'పాపం యింతకంటే యేం చెయ్యగలడు' అనుకున్నాడు.

"యిప్పుడే అతన్ని మీ దగ్గరికి పంపిస్తాను."

"యేమిటీ పిచ్చి పని?" అని అబ్లాన్‌స్కీ తన స్నేహితుణ్ణి యింట్లోనుంచి గెంటే స్తున్నారని అతని ద్వారా తెలుసుకుని లేవిన్ కోసం వెతికి అతన్ని తోటలో కలుసుకుని అన్నాడు. వెస్లొవ్‌స్కీ వెళ్ళిపోయే దారికేసి చూస్తూ లేవిన్ ఒంటరిగా తోటలో తిరుగుతూ వున్నాడు. "Mais c'est ridicule![1] నిన్నే దెయ్యం పట్టుకుంది? Mais c'est du dernier ridicule![2] నీకేమైంది, ఆ పడుచు వాడు యేదో..."

కాని లేవిన్‌ని పట్టిన దెయ్యం యింకా పీడిస్తూనే వుంది. అందుకనే అబ్లాన్‌స్కీ కారణం గీరణం అని చెప్పి వివరించబోతే లేవిన్ ముఖం మళ్ళీ పాలిపోయింది, అబ్లాన్‌స్కీని మాట్లాడ నియ్యకుండా తుంచేస్తూ అన్నాడు:

"నీకు పుణ్యం వుంటుంది, సాకులు చెప్పకు! నేను మరోలా చెయ్యలేను. నీకూ అతనికీ యిబ్బంది కలిగించినందుకు సిగ్గుగా వుంది నాకు. కాని అతనిక్కడినుంచి వెళ్ళిపోవడంవల్ల అతనికేం అంత విచారంగా వుండదు, నా భార్యకీ నాకూ అతను వుండడం అభ్యంతరకరంగా వుంది."

"కాని అతన్ని అవమానించేవు!' Et puis c'est ridicule![3]"

"అతను నన్ను అవమానించేడు. గాయపరిచేడు. నా దోషం యేమీ లేదు. నేనెందుకు బాధపడాలి?"

"సరే, నువ్విలాంటి పని చేస్తావని నేను యెన్నడూ అనుకోలేదు. On peut être jaloux, mais á ce point, c'est du dernier ridicule![4]"

లేవిన్ గబగబా వెనక్కి తిరిగి సందులోకి మళ్ళేడు. అక్కడ మళ్ళీ వొక్కడూ పచార్లు చెయ్యడం మొదలుపెట్టేడు. కొంచెం సేపట్లోనే అతనికి నాలుగు చక్రాల బండి గణగణ మోత వినిపించింది. చెట్ల వెనకనుంచి వెస్లొవ్‌స్కీ గడ్డిమీద కూర్చుని (దురదృష్టవశాత్తూ బండిలో మెత్తలు లేకపోయేయి) స్కాచ్ టోపీ పెట్టుకుని వెడుతూ వుండడం కనిపించింది. రోడ్డుమీద గతుకులు తగిలినప్పుడల్లా అతని టోపీ పైకి లేస్తూ వుంది.

---

[1] దీన్ని చూస్తే యెవళ్ళన్నా నవ్వుతారు! (ఫ్రెంచి).

[2] చాలా నవ్వుతాలుగా వుంది! (ఫ్రెంచి).

[3] పైగా యిది నవ్వుతాలుగా వుంది (ఫ్రెంచి).

[4] మనిషికి అసూయ వుండచ్చు కాని వో హద్దు వరకూనే – యిది చాలా నవ్వుతాలుగా వుంది! (ఫ్రెంచి).

'యింకేం జరిగింది?' అని లేవిన్ వో మనిషి పరిగెత్తుకుంటూ వచ్చి బండిని ఆపడం చూసి అనుకున్నాడు. అతను జర్మన్ మెకానిక్. లేవిన్ అతన్ని గురించి పూర్తిగా మరిచేపోయేడు. జర్మన్ మెకానిక్ వెస్లోవ్‌స్కీకి దణ్ణం పెట్టి, యేదో చెప్పి బండి యెక్కి పక్కన కూర్చున్నాడు. బండి వెళ్ళిపోయింది.

లేవిన్ చేసిన పని అబ్లాన్‌స్కీకీ, ప్రిన్సెస్‌కీ కోపం తెప్పించింది. స్వయంగా ఆతనికి ridicule[1] మాత్రమే గాక, శుద్ధ దోషి భావం, అవమానం అనిపించింది. కాని తనూ తన భార్యా అనుభవించిన అవస్థ గుర్తుకు వచ్చి, వొక వేళ మళ్లీ ఆతనితో వ్యవహరించవలసి వస్తే యేమి చేస్తానూ అని ప్రశ్నించుకుంటే సరిగ్గా యిదే పని చేస్తానూ అనే జవాబు వచ్చింది.

యేం జరిగిందీ యేమిటీ అనే దాంతో ప్రమేయం లేకుండా సాయంత్రం వేళకి ప్రిన్సెస్ తప్ప — ఆమె మాత్రం లేవిన్ చేసిన పనిని క్షమించలేకపోయింది — మిగిలిన అందరూ మహా ఉల్లాసంగా హుషారుగా వున్నారు. దండనగా యెక్కడికీ కదలనివ్వకుండా యింట్లో పెట్టి తలుపు వేసిన పిల్లల్ని బయటికి పోయి ఆడుకొమ్మంటే యెలా వుంటారో అలాగా, లేదా శాస్త్రోక్తంగా స్వాగత సత్కారాలు జరిగిన పెద్దల్లాగా వున్నారు. ప్రిన్సెస్ లేనప్పుడు వెస్లోవ్‌స్కీ బహిష్కారం అనే దాన్ని గురించి యేదో పాత కథలాగా చెప్పుకున్నారు. హాస్యపూరిత ధోరణిలో మాటలు చెప్పే నేర్పు తండ్రి దగ్గర్నుంచి పుణికి పుచ్చుకున్న దాలీ మూడు నాలుగు సార్లు వెస్లోవ్‌స్కీ భాగోతం చెప్పింది; చెప్పిన ప్రతి సారీ కొత్త మజా జోడించింది. యీ గొప్ప అతిథి కోసం తను కొత్త రిబ్బన్లు చుట్టుకుని, తీరా డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చి చూస్తే యేముందీ, బండి గణగణ వినిపించింది అని వర్ణించి చెప్పి, వారెంకాని పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వేటట్లు చేసింది. నాలుగు చక్రాల బండిలో కూర్చున్న వాళ్లు యెవర నుకుంటున్నారు? పాటల పుస్తకాలూ, మోకాళ్ల తోలు పట్టీలూ పట్టుకుని స్కాచ్ టోపీ పెట్టుకుని గడ్డిమీద కూర్చున ఆ మహానుభావుడు వెస్లోవ్‌స్కీయే!

"కనీసం బగ్గీలోనేనా పంపాల్సింది! వెంటనే నాకు యెవళ్లో 'ఆపండి' అనడం వినిపించింది. ఆతనిపట్ల జాలి కలిగిందేమోననుకుని బయటికి చూద్దును కదా లావాటి జర్మన్ అతని పక్కన కూలబడ్డాడు, బండి వెళ్లిపోయింది... నా కొత్త రిబ్బన్లతో నేను అలానే నిలబడిపోయేను!"

## 16

దాలీ తను అనుకున్న ప్రకారం అన్నాని చూడ్డానికి బయల్దేరింది. చెల్లెలికి కష్టం కలిగిస్తున్నందుకు, మరిదికి విచారం కలిగిస్తున్నందుకు బాధపడింది. వ్రాన్‌స్కీతో యే రకమైన సంబంధాలూ పెట్టుకోకూడదన్న విషయానికి సంబంధించి లేవిన్ దంపతుల

---

[1] నవ్వుతాలుగా వుండడం (ఫ్రెంచి).

అభిప్రాయం యెంత సబబైందీ ఆమెకి తెలుసు. కాని అన్నాని చూడడం, అన్నా పరిస్థితిలో యెలాంటి మార్పు వచ్చినప్పటికీ ఆమెపట్ల తన అభిమానం అలానే వుందని చూపించడం తన కర్తవ్యం అని ఆమెకి అనిపించింది.

అన్నా దగ్గరికి వెళ్లే ప్రయాణానికి సంబంధించి లేవిన్స్ దంపతులమీద ఆధారపడ కూడదనుకొంది. అందుకని అద్దె గుర్రాల్ని తెమ్మని పురమాయించింది. కాని ఆ విషయం తెలియగానే లేవిన్ ఆమె దగ్గరికి వెళ్లి కోప్పడ్డాడు.

"నువ్వు వెళ్లడం నాకు యిష్టం లేదని యెందుకనుకున్నావ్? వొక వేళ నాకిష్టం లేకపోయినా నువ్వు మా గుర్రాలు తీసుకెళ్లక పోవడం యింకా కష్టం కలిగిస్తుంది మాకు" అన్నాడు. "ఖాయంగా వెడుతున్నానని చెప్పలేదు నువ్వు. మొదటి విషయం నువ్వు వూళ్లో గుర్రాలు అద్దెకి తీసుకోవడం నాకు నచ్చదు. యేం, అంతకంటే ముఖ్యం యింకోటుంది. అద్దె గుర్రాల వాడు నిన్ను తీసుకు వెడతానని అనచ్చు. కాని తీసుకు పోక పోవచ్చు. మా గుర్రాలున్నాయి, నాకు కష్టం కలిగించకూడద నుకుంటే తీసుకో" అన్నాడు.

దాలీ కాదనలేకపోయింది. ప్రయాణం స్థిరపరుచుకున్న రోజున లేవిన్ వదినగార్ని పంపించడానికి నాలుగ్గుర్రాల్ని, దారిలో మార్చుకుందుకు అదనంగా మరి కొన్ని గుర్రాల్నీ, సిద్ధం చేయించాడు. వ్యవసాయం పనులు చేసే గుర్రాల్లోనుంచి సవారీ వాటిల్లోనుంచి వాటిని యెంచాడు. అవి జట్టుగా జోడీ కుదరకపోయినా ప్రయాణం వో రోజులో లాగిస్తాయి. ప్రిన్సెస్‌ని యింటికి పంపాల్సిన సమయం, మంత్రసానిని తీసుకు రావాల్సిన సమయం అది. యిందుగ్గాను గుర్రాలు అవసరమైన యీ సమయంలో దాలీకి గుర్రాల్ని యేర్పాటు చెయ్యడం కష్టమే అయినా గృహస్థుగా మర్యాద కోసం దాలీని అద్దె గుర్రాలు తీసుకో నియ్యలేదు. అదీగాక గుర్రాలకి యిరవై రూబుళ్ల చొప్పున అయే ఖర్చు ఆమెకి తక్కువ కాదు. కటకటలాడే దాలీ పరిస్థితి వొకటే తన పరిస్థితి వొకటేనా అనిపించింది లేవిన్‌కి.

లేవిన్ సలహా మేరకి దాలీ తెల్లవారుతూనే బయల్దేరింది. రాస్తా బాగా వుంది. బగ్గీ సౌకర్యంగా వుంది. గుర్రాలు చురుగ్గా పరిగెత్తేయి. బండితోలే వాడితోబాటు నౌకరికి బదులుగా గుమాస్తా కూడా కూర్చున్నాడు. లేవిన్ మరింత జాగ్రత్త కోసం అతన్ని పంపేడు. దాలీకి కునుకు పట్టింది. గుర్రాల్ని మార్చుకోవాల్సిన మజిలీలో మాత్రమే మెలుకువ వచ్చింది.

స్వియాజ్‌స్కీల దగ్గరికి వెళ్లేటప్పుడు లేవిన్ ఆగిన రైతు యింటి దగ్గర దాలీ ఆగి టీ తాగింది. ఆడవాళ్లతో పిల్లల గురించి ముచ్చటించింది. ముసలి రైతుతో కౌంట్ వ్రాన్స్కీ గురించి మాట్లాడింది. రైతుకి వ్రాన్స్కీ తెలుసు, అతనంటే అమిత గౌరవం వుంది. అప్పుడు పది గంటలకి దాలీ ప్రయాణం సాగించింది. యింటి దగ్గర పిల్లలతో బొత్తిగా తీరికలేకపోవడంతో దేన్ని గురించి ఆలోచించుకోవడానికీ ఆమెకి వీలుండేదే కాదు. యిప్పుడు యీ నాలుగు గంటల ప్రయాణంలోనూ అప్పటిదాకా అణిచి పెట్టుకున్న ఆలోచనలు ఆమె

మనసులో ముసురుకుంటూ వచ్చేయి. అంతకు ముందెన్నడూ లేనంతగా తన జీవితం గురించి అన్ని కోణాలనుంచీ అనుకుంది. ఆమెకి తట్టిన ఆలోచనలు ఆమెకే ఆశ్చర్యం కలిగించేయి. మొదట పిల్లల్ని గురించి అనుకుంది. తను లేనప్పుడు పిల్లల్ని జాగ్రత్తగా చూసుకుంటామని తల్లి, కిట్టీ చెప్పినా (కిట్టీ మాట ఆమెకి యెక్కువ ధైర్యం) ఆమెకి వాళ్ల గురించిన బెంగపోలేదు. 'మాషా మళ్లీ చిలిపితనం పోతే? గ్రీషని యే గుర్రమేనా తన్నితే? లిలీ కడుపు నొప్పి యింకా యెక్కువైతే?' అనిపించింది. కాని కొంచెం సేపటి తర్వాత ప్రస్తుత సమయానికి సంబంధించిన ప్రశ్నల స్థానంలో తక్షణ భవిష్యత్తుకి సంబంధించినవి చోటు చేసుకున్నాయి. శీతాకాలం నాటికి మాస్కోలో కొత్త మకాం చూడాలి. డ్రాయింగ్ రూమ్‌కి కొత్త ఫర్నిచరు సమకూర్చాలి. పెద్ద పిల్లకి కొత్త శీతాకాలం కోటు కుట్టించాలి. తర్వాత దూర భవిష్యత్తు గురించిన ఆలోచనలు వచ్చేయి. పిల్లలు పెద్ద వాళ్లయేక యెలా వాళ్ల బతుకు యేర్పాటు చేస్తుంది తను? 'ఆడపిల్లల గురించి బెంగలేదు, మగపిల్లల సంగతే యేమిటో' అనుకొంది.

'నేనే గ్రీషకి పాఠాలు చెప్పడం మంచిదైంది. ఖాళీగా వుండబట్టే, కాన్పులు లేకపో బట్టే చెప్పగలుగుతున్నా. ఆయన్ని నమ్ముకుంటే అయినట్టే. అయినా ఫరవాలేదు. కాస్త మంచి వాళ్ల కడుపు కాళ్లూ పట్టుకుని పిల్లల్ని వృద్ధిలోకి తీసుకొచ్చేస్తాను. కాని ఖర్మ కొద్దీ మళ్లీ నాకు కడుపు వస్తేనో...' ఆడది మహావేదన పడి పిల్లల్ని కనడం యెంత శాపం అనే వూహ తట్టి ఆమె చకితురాలై పోయింది. 'అసలు కనడం అనేది ఫరవాలేదు కాని నవ మాసాలూ మొయ్యడం యెంత యాతన!' అని తన కడపటి కాన్పు, బిడ్డ చనిపోవడం గుర్తు వచ్చి అనుకొంది. యిది గుర్తుకు రాగానే మజిలీ దగ్గర యింతకు ముందు ఆ రైతు ఆడ మనిషితో జరిగిన సంభాషణ గుర్తు వచ్చింది. పిల్లలున్నారా అని దాలీ అడిగినప్పుడు అందమైన ఆ పడుచు జవాబు చెప్పింది:

''ఆడపిల్ల పుట్టింది, కాని దేముడు తీసుకుపోయేడు, అంత్యక్రియలు జరిపించేం.''

''ఆ పిల్ల కోసం యెంతో యేడ్చావేమో?'' అని దాలీ అడిగింది.

''యేడవడం యెందుకు? ముసలాయనకి మనవలు మనవరాళ్లు చాలా మంది వున్నారు. చాలు, ఆ ధ్యాస. పనీపాటూ యేమీ లేదు. చేతులు కట్టాయి పోయేయి.''

ఆ మాట అందంగా హుషారుగా వున్న పడుచు పిల్ల నోటమ్మట రావడం చూసి మొదట దాలీ తల తిరిగిపోయింది. కాని యిప్పుడు గుర్తు చేసుకుంటూ వుంటే ఆ పడుచు అన్న తేలిక మాటల్లో కొంత నిజం లేకపోలేదని దాలీకి అనిపించింది.

'యింతకీ యేమైనట్టు?' అని తన పదిహేనేళ్ల వివాహ జీవితాన్ని వెనక్కి తిరిగి చూసు కుంటూ అనుకుంది. 'కడుపు, వేవిళ్లు, తలదిమ్ము, దేనిపట్లా రుచిలేకపోవడం, యిక అన్నిటినీ మించి వున్న అందం కాస్తా వూడ్చుకుపోవడం. కిట్టీ, పడుచుదనంతో ముచ్చటగా వున్న కిట్టీ కూడా, అందం పోయింది. నా సంగతైతే చెప్పనే అక్కర్లేదు కడుపుతో

వున్నప్పుడు యెంత రోతగా వుంటానో. ప్రసవం, యాతన, నరక యాతన ఆ ఆఖరి క్షణంలో... తర్వాత పాలు యివ్వడం, కంటిమీద కునుకు లేకుండా రాత్రిళ్ళు గడపడం, భయంకరమైన బాధ...'

చూచుకాలు యెంత సలుపు పెట్టేదీ గుర్తు చేసుకుని డాలీ వొడికిపోయింది. ప్రతి కాన్పుకీ ఆమెకి అలానే అయేది. 'యిక పిల్లల నలతలు, అవి యెప్పటికీ వుండే భయమే. వాళ్ళ చదువు సంధ్యలు, దుర్మార్గం బుద్ధులు' (రాస్ప్బెర్రీ పొదల్లో మాషా చేసిన పని ఆమెకి గుర్తు కొచ్చింది) 'పాఠాలు, లాటిన్ భాష — అన్నీ అర్థం గాని కఠోర విషయాలు. యిని చాలదన్నట్టు ఆ బిడ్డ దక్కకపోవడం.' మళ్ళీ దాలీకి కడపటి కాన్పు బిడ్డ పోవడం గుర్తు వచ్చింది. ఆమె మాతృ హృదయంలో యెంతో భారంగా వుండే జ్ఞాపకం అది. మగబిడ్డ, కింకివాయువు వచ్చి పోయేడు. ఆ పిల్లవాడి అంత్యక్రియలు, వాడి చిన్న గులాబీ శవపేటిక పట్ల అందరూ ఉదాసీనంగా వుండడం, వాడి కణతల దగ్గర ఉంగరాలు చుట్టుకున్న జుట్టు, తెల్లని నుదురు, బంగారు శిలువ వున్న గులాబీ శవపేటిక మూత మూసేటప్పుడు ఆశ్చర్యంగానా అన్నట్టు తెరుచుకున్న వాడి చిన్న నోరు చూసినప్పుడు తన యేకాకి మాతృ హృదయం విలవిల లాడిపోవడం గుర్తు వచ్చేయి.

'యిదంతా దేని కోసం? దీనంతటి పరమార్థం యేమిటి? యేముంది? యీ యేడాది గర్భవతిని అవుతూ, మళ్ళీ యేడాది చంటి బిడ్డని సాకుతూ, యెప్పుడూ చిరాగ్గా, గొణుగుతూ సణుగుతూ, నా మట్టుకి నేను వ్యథపడుతూ యితరులకి వ్యథ కలిగిస్తూ భర్తకి యేవగింపుగా వుంటూ క్షణం కూడా మనశ్శాంతి లేకుండా జీవితం గడుపుతాను. యిదంతా సరైన ఆలనాపాలనా లేని నిర్భాగ్యులైన పిల్లల్ని నికృష్టంగా కనిపెంచడం కోసం. లేవిన్ దంపతుల దగ్గర యీ వేసవికాలం గడపబట్టి గాని లేకపోతే మా పని యేమై వుండేదో. కిట్టీ, లేవిన్‌లు యెంతో నేర్పుగా వుండబట్టి మాకు యేమీ కష్టం అనిపించకుండా చూస్తున్నారు. కాని అలా యెల్ల వేళలా జరగదు కదా. వాళ్ళకీ పిల్లలు పుడతారు, వాళ్ళు మాకు సాయం చెయ్యలేరు. యిప్పటికే వాళ్ళకీ గడలు అందడం లేదు. నాన్న సాయం చెయ్యగలడా, ఆయన దగ్గరా పాపం యేమీ మిగల్లేదు. నా అంతట నేను పిల్లల్ని వాళ్ళ కాళ్ళమీద నిలబడేటట్టు చెయ్యలేను, వేరే వాళ్ళు చెయ్యి ఆసరా యిస్తే తప్ప, అదీ యెంతో అవమానంతో. అదృష్టం కలిసొచ్చి అంతా బాగా వుంటుందని ఆశిస్తాను. పిల్లలందరూ బతికి బట్టకడతారనీ ఆశిస్తాను. తల తాకట్టు పెట్టి వాళ్ళని పైకి తీసుకువస్తాను. అప్పుడు కూడా, వాళ్ళు జులాయిలు కాకుండా వుంటే చాలనే నా కోరిక. నేను ఆశించగలిగినదంతా అంతే. యిందు కోసం యెంత యాతన పడాలి, యెంత శ్రమ పడాలి! నా యావజ్జీవితం నష్టమైపోయింది!' మరో సారి ఆమెకి ఆ రైతు యువతి అన్న మాటలు గుర్తువచ్చేయి. ఆమెకి మళ్ళీ ఘోరం అనిపించింది. అయినా రైతు యువతి అన్న కటువైన మాటల్లో యెంతో కొంత నిజం వుందన్న సంగతిని కాదన లేకపోయింది.

''యేం, యింకా యెక్కువ దూరం వుందంటావా మిఖయీల్'' అని దాలీ తనని భయభీతం కావించే ఆలోచనలనుంచి దృష్టి మళ్లించుకుందుకుగాను గుమాస్తాని అడిగింది.

''యీ వూరినుంచి యేడు వెర్‌స్తులుంటుందంటున్నారు.''

బండి వూరి రోడ్డుమీదనుంచి వంతెనమీదకి తిరిగింది. హుషారుగా వున్న రైతు పడతులు, కొంతమంది ఆడవాళ్లు, తుళ్లుతూ పేలుతూ వంతెన దాటుతున్నారు. మోపులు కట్టుకుందుకు గడ్డి వెంటుల్ని భుజంమీద తీసుకు వెడుతున్నారు. పక్కనుంచి బండిపోతూ వుంటే చూసేందుకు కుతూహలంగా ఆగేరు. వాళ్లందరి ముఖాలూ కళకళలాడుతూ ఆరోగ్యవంతంగా, తమ జీవిత ఆనందంతో తనని ఉడికిస్తున్నట్టుగా కనిపించేయి దాలీకి. 'అందరూ నిండుగా జీవిస్తున్నారు, జీవితానందాన్ని జుర్రుతున్నారు' అని బండి ఆ ఆడవాళ్లని దాటి వెళ్లిపోయి, గుట్ట యెక్కేక అనుకుంది దాలీ. గుర్రాలు అలసంగా సరుగెత్తి పాత బండి అలసంగా కమాన్లమీద వూగుతూ వెళ్లింది. 'నేను ఖైదిలాగా, చింతలతో హరించివేసే లోకంనుంచి, బయట పడి వచ్చానిప్పుడు. లిప్త కాలం పాటు నాకు మామూలు స్పృహ వచ్చింది. అందరూ జీవ శక్తితో బతుకుతున్నారు — ఆ రైతు ఆడాళ్లు, అక్క నతాలీ, వారెంకా. నేను యిప్పుడు చూడ్డానికి వెడుతూ వున్న అన్నా, అందరూ — నన్ను మాత్రం జీవితం వంచించింది.'

'వీళ్లేమో అన్నాని మాటలు అంటున్నారు. యెందుకని? యేం నేనామెకంటే బాగున్నానా? గుడ్డిలో మెల్లగా నాకు పెనిమిటి వున్నాడు, నేనతన్ని ప్రేమిస్తున్నాను. నేను కోరుకున్నట్టుగా కాకపోయినా యేదో ప్రేమిస్తున్నాను. అన్నాకి భర్తంటే ప్రేమ లేదు. ఆమె తప్పేముంది? ఆమె జీవితం కోసం తపిస్తోంది. భగవంతుడు మా హృదయాల్లో యీ ప్రేమ భావం విత్తేడు. నేనూ ఆలానే చేసి వుండేదాన్నే కదా. ఆ భయంకర సమయంలో ఆమె మాస్కో వచ్చినప్పుడు ఆమె బోధ వినడంద్వారా మంచి పని చేశానా లేదా అనేది యిప్పటికీ నాకు తెలీదు. నేనూ నా పెనిమిటిని వదిలేసి కొత్త జీవితంలోకి అడుగుపెట్టి వుండాల్సింది. నేనూ ప్రేమించగలిగి వుండేదాన్ని, సరైన అర్థంలో ప్రేమని పొంది వుండేదాన్ని. యిప్పుడు యిదేమన్నా మెరుగ్గా వుందా? నేనతన్ని గౌరవించను, కాని అతని అవసరం నాకు వుంది' అని ఆమె భర్త గురించి అనుకొంది. 'అతన్ని భరిస్తున్నాను. యిది మెరుగ్గా వుందా? అప్పుడైతే యెవళ్లకేనా ఆకర్షకంగా వుండేదాన్ని, అప్పటికింకా సేవలింపు పోలేదు' అని నెమరు వేసుకుంటూ వుంది. వున్నట్టుండి అద్దంలో తను యెలా వున్నదీ చూసుకోవాలని ఆమెకి అనిపించింది. ఆమె ప్రయాణం సంచీలో చిన్న అద్దం వుంది. దాన్ని తియ్యాలని ఆమెకి అనిపించింది. కాని బండితోలేవాడినీ, అతని పక్కన వూగుతూ కూర్చున్న గుమాస్తానీ చూశేక వాళ్లల్లో యెవళ్లేనా వెనక్కి తిరిగి చూస్తే సిగ్గుగా వుంటుందని చెప్పి ఆమె అద్దం యివతలికి తియ్యలేదు.

అద్దం తీసి చూసుకోకపోయినా కూడా, యిప్పటికీ మించిపోలేదనే ఆమెకి అనిపించింది.

ఆమెకి కోస్నిషెవ్ గుర్తువచ్చేడు. తన పట్ల అతను ప్రత్యేకమైన శ్రద్ధ కనబరిచేడు. యిక అబ్లాన్‌స్కీ నేస్తం, మంచి మనిషి అయిన తూరొవ్‌స్తిన్ వున్నాడు. పిల్లలకి యెర్ర జ్వరం వచ్చినప్పుడు తనతో కలిసి వాళ్ల సేవ చేశాడు, తను అంటే పడి చచ్చేవాడు. యింకో అతనూ వున్నాడు, పడుచు వాడు, అబ్లాన్‌స్కీ వేళాకోళం ఆడినట్టు, ఆమె అక్క చెల్లెళ్లందర్లోకీ ముచ్చటగా వుంటుందని అనుకునే అతను. ఆవేశపూరిత, అసంభావ్య ప్రేమ లీలలని దాలీ వూహల్లో ఉద్దీప్తం చేసుకుంది. 'అన్నా సరైన పనే చేసింది, కనీసం నేను అందరిలాగా ఆమెని నిందించను. అమె సుఖ పడుతోంది, మరొకళ్లని సుఖ పెడుతోంది. నాకులాగా అణగారి పోయిన మనిషి కాదు. ఆమె యెప్పటి మాదిరీ పువ్వులాగా, తెలివితేటలతో, అన్నిట్నీ ఆస్వా దించే సామర్థ్యంతో వుంటుందన్న మాట ఖాయం' అనుకొంది దాలీ. వో కొంటె చిరునవ్వు ఆమె పెదాల్ని ముకుళితం చేసింది. అలా అవడానికి అన్నిటికంటే ముఖ్య కారణం ఆమె అన్నా ప్రేమ లీలల గురించి తల పోసుకుంటూ వుంటే, తనని మహా వ్యామోహంతో ప్రేమించా డనుకున్న వూహా వ్యక్తితో కలిసి తనకీ అలాంటి ప్రేమ లీలలు వున్నట్టు ఆమె వూహించు కోవడం. అన్నాకి లాగే తనూ భర్తకి వున్న విషయం యావత్తూ చెప్పేస్తుంది, ఆ ముక్క విని అబ్లాన్‌స్కీ నిశ్చేష్టుడైపోతాడు, చింతాకులితుడైపోతాడు. ఆ భావనే ఆమెకి చిరునవ్వు తెప్పించింది.

అలాంటి వూహలతో ఆమె బండి రాజ పథంమీదనుంచి వాజ్‌ద్వీజెన్‌స్కొయె వెళ్లే దారి చేరే దాకా గడిపేసింది.

## 17

బండితోలేవాడు నాలుగు గుర్రాల బండిని ఆపి కుడి వేపు వున్న రై పొలాలకేసి చూశేడు. అక్కడ కొంతమంది రైతులు వో చెకడా బండి పక్క కూర్చున్నారు. గుమాస్తా కిందికి వురికి వాళ్ల దగ్గరికి వెడదామనుకున్నాడు. కాని అంతలోనే యెందుకు లెమ్మని ఆలోచన చేసి వో రైతుని తన దగ్గరికి రమ్మని పిలిచేడు. బండి ఆగగానే గాలి కూడా తగ్గింది. చెమటలు కక్కుతూ వున్న గుర్రాలమీద జోరీగలు వాలుతున్నాయి. అవి వాటిని చిరాగ్గా తోలేసుకుంటున్నాయి. ఆకురాళ్లమీద కత్తులు పదును పెడుతూ వుంటే వచ్చే చప్పుళ్లు మణిగిపోయేయి. ఓ రైతు లేచి బండి దగ్గరికి వచ్చేడు.

''యేం వొంట్లో వూపిరి లేదా యేమిటి?'' అని గుమాస్తా బండి చక్రాల గాళ్లలో దిసపాదాలతో అడుగులో అడుగు వేసుకుంటూ వస్తూ వున్న ముసలి రైతుని చూసి చిరాగ్గా అన్నాడు. ''చురుగ్గా నడు'' అన్నాడు.

ఆ ముసలాడు ఉంగరాల జుట్టుని వెనక్కి నారతో కట్టుకున్నాడు. అతని వీపు వొంగింది. ఆ వీపుమీద చొక్కా చెమటకి నల్లబడింది. అతను నడక చురుకు చేసి బండి దగ్గరికి వచ్చి యెండకి కమిలిన చేత్తో మడ్ గార్డ్ పట్టుకున్నాడు.

"వాజ్ద్వీజెన్‌స్కాయె వూరేనాండీ? జాగీర్దార్‌గారి హవేలీయా? కౌంట్‌గారి దగ్గరకా?" అని అడిగేడు. "తిన్నగా కొంచెం దూరం వెళ్లండి. అప్పుడు యెడం వేపు తిరగండి. సందు వస్తుంది. అక్కణ్ణే వుంటుంది. యెవరు కావాలండి? కౌంట్‌గారా?" అని అడిగేడు.

"వాళ్లు యింటె దగ్గరున్నారా?" అని దాలీ, అన్నా గురించి ఆ రైతుని యెలా అడగాలో తెలీక, అనుమానంగా అడిగింది.

"ఆఁ, ఆఁ వుండే వుంటారు" అని రైతు దిసపాదంమీద బరువు మార్చుకుంటూ దుమ్ములో మడమ గుర్తూ, కాలి వేళ్ల గుర్తులూ పడగా, అన్నాడు. "వుండే వుంటారు" అని మళ్లీ అన్నాడు. మాట తెగిపోకుండా సంభాషణ సాగించాలని అతనికి వున్నట్టు తెలుస్తూనే వుంది. "నిన్న కూడా యెవరో చూడవచ్చేరు. ఆళ్లింట్లో శానా మంది పెద్ద పెద్దోళ్లు వుంటా వుంటారు... యేంటి రా?" అని గుర్రం బండి దగ్గర కూర్చుని తనకేసి యేదో అరుస్తూ వున్న కుర్రాడికేసి చూస్తూ అడిగేడు. "ఆఁ! యింత కితమే వాళ్లు కోతలు యెలా అవతా వున్నాయో చూద్దామని గుర్రాలమీద యెళ్లారట. యీ పాటికి వచ్చేసే వుంటారండి. తను రెక్కణ్ణుంచండి?" అని అడిగేడు.

"మేం చాలా దూరంనుంచి వచ్చేం" అని బండితోలేవాడు మళ్లీ బండి యెక్కుతూ అన్నాడు. "అయితే దూరం కాదన్న మాట?" అన్నాడు.

"చెప్పానుగా దగ్గర్లోనని. తిన్నగా ముందుకి వెళ్లి..." అని రెట్టించాడు, చేతిని బండి మడ్ గార్డ్‌మీద రాస్తూ.

రైతుతో మాట్లాడిన కుర్రాడు కూడా బండి దగ్గిరికి వచ్చేడు. అతను బలంగా, పొంకంగా వున్నాడు.

"కోతలకి మనిషి కావాలా అండీ?" అని అడిగేడు.

"తెలీదు."

"యెడం వేపు తిరిగితే నేరుగా అక్కడికెడతారు" అని ముసలతను చెప్పేడు. వెళ్లని వెళ్లిపోనివ్వడం యిష్టం లేనట్టూ, మాటలు సాగించాలనే అతనికి వున్నట్టూ తెలుస్తూనే వుంది.

బండితోలేవాడు గుర్రాల్ని అదిలించేడు. బండి కదిలిందో లేదో రైతు మళ్లీ అరిచేడు:

"ఆపు! ఆపయ్యా!"

బండివాడు ఆపేడు.

"ఆళ్లు తమకేసే వస్తా వున్నారు. అరుగో!" అని రైతు అరిచేడు. "అరుగో దౌడు తీయించుకుంటూ వస్తా వున్నారు" అన్నాడు. గుర్రాలమీద స్వారీ చేసుకుంటూ వస్తూ వున్న నలుగురు మనుషులకేసి, బండిలో వస్తూ వున్న యిద్దరికేసీ చూపించేడు.

వ్రాన్‌స్కీ, అతని జాకీ, వెస్లొవ్‌స్కీ, అన్నా గుర్రాలమీద స్వారీ చేస్తూ వస్తున్నారు.

బండిలో ప్రిన్సెస్ వర్వారా, స్వియాజ్‌స్కీ వున్నారు. వాళ్లు సరదాకి స్వారీ వెళ్లారు. పనిలో పనిగా కొత్తగా సంపాదించిన కోత యంత్రాలని చూడాలనీ వెళ్లారు.

దాలీ బండి ఆగగానే గుర్రాలమీద స్వారీ చేసేవాళ్లు పరుగు తగ్గించి గుర్రాల్ని నడిపించేరు. అన్నా, వెస్లోవ్‌స్కీలు యెదర వస్తున్నారు. అన్నా దృఢమైన ఇంగ్లీషు గుర్రంమీద వస్తోంది. ఆ గుర్రం జూలు, తోక కత్తిరించి వున్నాయి. అన్నా యెత్తైన టోపీ పెట్టుకుంది. ఆ టోపీ కిందనుంచి యివతలికి పడిన నల్లని ముంగురుల తలనీ, రూపుతీరిన భుజాలనీ, స్వారీ చేసే వేషంతో నల్లని గౌను కింద వున్న అన్నువ నడుమునీ, గుర్రంమీద ఆమె కూర్చున శాంత సుందర ముద్రనీ చూసి దాలీ ఆశ్చర్యపోయింది.

అన్నా గుర్రంమీద స్వారీ చెయ్యడం మొదట ఆమెకి అనుచితంగా కనిపించింది. మహిళలు గుర్రంమీద స్వారీ చెయ్యడం అనేది యేదో వగల మారితనం అన్న భావం ఆమె మనసులో వుంది. అలాంటిది అన్నా ప్రస్తుత పరిస్థితికి శోభాకరం కాదు. కాని కొంచెం దగ్గర్లో అన్నాని చూసినప్పుడు ఆమె గుర్రంమీద స్వారీ చెయ్యడం అనే దాంట్లో అనుచితం అయింది యేదీ దాలీకి కనిపించలేదు. లాలిత్య భరితమైన దాంతో బాటుగా ఆమె తీరులో, వేసుకున్న బట్టలలో ఆమె వైఖరిలో నడవడికలో యెంత సరళత్వం, శాంతం, హుందాతనం కనిపించాయంటే యింతకంటే స్వాభావికం అయింది యేదీ వుండదని అనిపిస్తుంది.

అన్నా పక్కన వెస్లోవ్‌స్కీ బూడిద రంగు సైనిక అశ్వంమీద వున్నాడు. వేగంగా పరిగెత్తడంవల్ల అది ఉత్తేజంగా వుంది. అతను స్కాచ్ టోపీ పెట్టుకున్నాడు. దాని రిబ్బన్లు యెగురుతూ వున్నాయి. లావుగా వున్న కాళ్లని ముందుకి చాచేడు. అతను చాలా సంతృప్తిగా వున్నాడని కనిపిస్తూనే వుంది. అతన్ని గుర్తు పట్టగానే దాలీ చిరునవ్వు నవ్వకుండా వుండలేకపోయింది. వాళ్ల వెనక్కాల వ్రాన్‌స్కీ వచ్చేడు. అతని గుర్రం మంచి జాతి గుర్రం. అది దౌడు తీసుకుంటూ రావడంవల్ల ఉత్తేజంగా వుంది. వ్రాన్‌స్కీ దాన్ని అదుపులో వుంచేందుకు కళ్లేలు లాగుతూ వున్నాడు.

అతని వెనక్కాల జాకీ వేషంలో వో చిన్న మనిషి గుర్రంమీద వస్తున్నాడు. స్వియాజ్‌స్కీ, ప్రిన్సెస్ వర్వారా వీళ్లని దాటి బండిలో ముందు వచ్చేరు. వాళ్ల బండి గొప్పగా వుంది. పెద్ద నల్ల గుర్రం ఆ బండిని లాగుతోంది.

పాత బండిలో వో మూల ముడుచుకు కూర్చున్న మనిషి దాలీ అని గమనించగానే అన్నా ముఖం సంతోష హాసంతో వెలిగింది. ఆమె హేయ్ అని అరిచింది. జీనుమీద ఎగిరి కూర్చుని గుర్రాన్ని మళ్లీ దౌడు తీయించింది. బండి దగ్గరికి రాగానే యెవళ్లూ చెయ్యి అందివ్వకుండానే సునాయాసంగా కిందికి వురికి గుర్రం స్వారీ వేషంలో వున్న గౌనుని చేతుల్తో పైకి లాక్కుని పట్టుకుని దాలీ దగ్గరికి పరిగెత్తింది.

"నేననుకున్నాను నువ్వేనని, మళ్లీ కాదేమోనని భయం వేసింది. అబ్బ, యెంత సంతోషంగా వుంది! నాకెంత సంతోషంగా వుందో నీకు తెలీదు" అని కాసేపు దాలీ ముఖానికి

తన ముఖం ఆనించి ముద్దుపెట్టుకుంటూ, తర్వాత ఆమెని యెడంగా పట్టుకుని మందహాసంతో ఆమెకేసి చూస్తూ అంది.

"యిదే సంతోషం అంటే, అలెక్సేయ్" అని గుర్రం దిగి తమ వేపు వస్తూ వున్న వ్రాన్‌స్కీకేసి తిరిగి అంది.

వ్రాన్‌స్కీ తలమీదనుంచి యెత్తైన బూడిద రంగు టోపీ తీసి చేత్తో పట్టుకుని దాలీని పలకరించేడు.

"మీ రాకవల్ల మాకు యెంత సంతోషంగా వుందో మీరు వూహించలేరు" అని మాట మాట ప్రత్యేకంగా వొత్తి పలుకుతూ, తెల్లని పలువరస కనిపించేటట్టు చిరునవ్వు నవ్వుతూ, అన్నాడు.

వెస్లోవ్‌స్కీ గుర్రంమీదనుంచి దిగకుండానే తలమీద వున్న స్కాచ్ టోపీ తీసేసి, రిబ్బన్లు కదిలేటట్టు దాన్ని తల పైన వూపుతూ దాలీకి స్వాగతం చెప్పాడు.

"యీమె ప్రిన్సెస్ వర్వారా" అని గొప్ప బగ్గీ తమ దగ్గరికి వచ్చినప్పుడు ఆమె యెవరన్నట్టు దాలీ చూసిన దానికి జవాబుగా చెప్పింది అన్నా.

"ఓహో!" అంది దాలీ. ఆమె ముఖంలో అనిష్టతని సూచించే భావం గోచరమైంది.

ప్రిన్సెస్ వర్వారా దాలీ అత్తగారి చెల్లెలు. ఆమెని దాలీ చాలా కాలంగా యెరుగును, ఆవిడంటే దాలీకి గౌరవం లేదు. ప్రిన్సెస్ వర్వారా జీవితం అంతా సంపన్నులైన బంధువుల యిళ్లల్లోనే బతికింది. యిప్పుడు తనకి యే రకంగానూ చుట్టమూ పక్కమూ కాని వ్రాన్‌స్కీ మీద పడి తింటూ వుండడం, తన భర్తకీ ఆమెకీ గల బంధుత్వం దృష్ట్యా దాలీకి సిగ్గనిపించింది. అన్నా దాలీ ముఖంలో కనిపించిన భావాన్ని గమనించి సిగ్గుపడింది. ఆమె ముఖం యెర్రబడింది. ఆమె గౌను అంచులు వదిలేసింది. అవి కాళ్లకి అడ్డం పడ్డాయి.

దాలీ మాట్లాడకుండా గొప్ప బగ్గీ దగ్గరికి వెళ్లి ముక్తసరిగా ప్రిన్సెస్ వర్వారాకి అభివాదం చేసింది. దాలీ స్వియాజ్‌స్కీని కూడా యెరుగును. వదుచు పెళ్లాం కాపరంతో తన తిక్క మిత్రుడు యెలా వున్నాడని అతను అడిగేడు. తర్వాత పంచమేళం గుర్రాలనీ, మరమ్మత్తు చేసిన మడ్ గార్డుల బండినీ వో చూపు చూసి మహిళలు గొప్ప బండిలో యెక్కాలని ప్రస్తావించేడు.

"నేనా దడదడ బండి యెక్కుతాను" అన్నాడు. "యీ గుర్రం మంచిది. ప్రిన్సెస్ బాగా తోలుతుంది" అన్నాడు.

"వద్దు, యెవళ్ల బండిలో వాళ్లు వుండండి" అని దగ్గరకి వస్తూ అన్నా అంది. "మేమా బండిలో వెడతాం" అని దాలీ చెయ్యి పట్టుకుని తీసుకుపోయింది.

యెంతో ఘనంగా వున్న ఆ బగ్గీనీ — అంతకు ముందు దాలీ అలాంటి బగ్గీని చూళ్లేదు — భారీ గుర్రాల్నీ, అన్నాని పరివేష్టించి వున్న ఉల్లాసభరిత సుందర వదనాలనీ చూసి దాలీ కళ్లు చెదిరిపోయేయి. కాని అన్నిటికంటే యెక్కువగా తనకి బాగా తెలిసిన ప్రియమైన అన్నాలో

వచ్చిన మార్పుకి ఆమె చకితురాలైంది. అన్నాని అంత బాగా యెరగనటువంటి అంత పరిశీలనగా చూడనటువంటి, ముఖ్యంగా ప్రయాణం చేసే సమయమంతా దాలీ మనసులో వెంరేగిన ఆలోచనల లాంటివి లేనటువంటి మరో మహిళకెవరికైనా అన్నాలో విశేషమైంది యేదీ కనిపించి వుండదు. కాని దాలీకి యిప్పుడు, ప్రేమించిన క్షణాల్లో మహిళల్లో ద్యోతకమయే ఆ క్షణిక సౌందర్యం అన్నాలో కనిపించి చకితురాలైంది. అన్నా వదనంలో కనిపించే ప్రతీదీ – ఆమె బుగ్గలమీద, చుబుకంమీద స్పష్టంగా వున్న సొట్టలు, ఆమె పెదాల వొంపులు, వాటిమీదకి దిగి వచ్చినట్టుగా వున్న మందహాసం, ఆమె కళ్లల్లోని తేజస్సు, ఆమె కదలికల్లోని వడి, సోయగాలు, ఆమె వాక్కులోని పుష్కల్యగమకం, ఆమె గుర్రంమీద యెక్కి ముందు కుడి కాలుతో దౌడు తియ్యడం దానికి నేర్పుతానని వెస్లోవ్స్కీ అడిగినప్పుడు సస్నేహంగానే అయినా తేజులో అతనికి జవాబు చెప్పిన ఆమె తీరూ అన్నీ అద్వీయ మనోహరత్వంతో భాసించేయి. అన్నా స్వయంగా వాటి గురించిన యెరుకతో వుందనీ, వాటిపట్ల సంతోషంతో వుందనీ అనిపిస్తోంది.

యిద్దరు మహిళలూ బండిలో కూర్చున్నాక యిద్దరికీ అప్రయత్నంగానే యిబ్బందిగా వున్నట్టనిపించింది. దాలీ తనకేసి చూస్తూ వున్న ఉద్విగ్న ప్రశ్నార్థక దృక్కులతో అన్నాకి యిబ్బంది కలిగింది. తనతోబాటు అన్నా కూర్చున్న ఆ పాడు పాత బండి కారణంగా దాలీకి యిబ్బంది అనిపించింది – మరీ స్వియాజ్‌స్కీ దడదడ బండి అని అన్నాక. బండి తోలే ఫిలిప్‌కీ, గుమాస్తాకీ కూడా అలానే అనిపించింది. తనకి కలిగిన యిబ్బందిని కప్పి పుచ్చుకోవడానికి గుమాస్తా, ఆ మహిళలు బండిలోకి యెక్కగానే దుమ్ము దులుపుతున్నట్టు హడావుడి చేశాడు. కాని ఫిలిప్ మబ్బు ముఖం పెట్టుకుని యిక ముందు అలాంటి ఘనమైన మర్యాదల ప్రభావానికి లొంగకుండా వుండదలచుకున్నట్టు వాలకం పెట్టేడు. గొప్ప బండికి కట్టిన నల్లని గుర్రంకేసి చూసి యిదో బడాయి, షికారుకి బాగానే వుంటుంది. యిలాంటి యెండలో గట్టిగా నలభై వెర్‌స్తులు లాగలేదు అని మనసులో అనుకుని ఫోఫోస్ గొప్ప అన్నట్టు చిరునవ్వు నవ్వేడు.

చెకడా బండి దగ్గర కూర్చున్న రైతులందరూ లేచి నుంచుని స్వాగతం చెపుతున్నట్టు అతిథులకేసి సంతోషపూరిత కుతూహలంతో చూస్తూ తమ తమ వ్యాఖ్యలు చేస్తూ వున్నారు.

"సంతోషంగా వున్నట్టున్నారు కదా? వొకళ్లనొకళ్లు శాన్నాళ్లు చూసుకుని వుండరు" అని నార పట్టీ తలకి చుట్టుకున్న ఉంగరాల జుట్టు రైతు అన్నాడు.

"గెరాసిమ్ మామా! ఆ నల్ల గుర్రం మన మోపులు మోస్తే భలే వుంటుంది కదా?"

"అరె, లాగు తొడుక్కున్న పిల్లేంటి?" అని వాళ్లల్లో వొకడు ఆడవాళ్ల జీను యెక్కి స్వారీ చేస్తున్న వెస్లోవ్‌స్కీకేసి చూపిస్తూ అన్నాడు. వెస్లోవ్‌స్కీ అన్నా స్వారీ చేసిన గుర్రం యెక్కేడు.

"ఏహె కాదు, మగమనిషి. చూడు యెంత గబగబా తోలేడో!"

''యేం కాస్త కునుకు తియ్యరేంట్రా?''

''యివాళ కునుకూ గినుకూ లేదు'' అని ముసలాడు కళ్లు రెట్టగించి పొద్దు చూసి అన్నాడు. ''పొద్దు దాటింది. కోత కత్తులు తీసుకుని పనిలోకి దిగండి'' అన్నాడు.

## 18

అన్నా తదేకంగా దాలీ ముఖంకేసి చూసింది. దాలీ ముఖం చింతలతో పీక్కుపోయి వుంది. ముఖంమీద ముడతలలో దుమ్ము కొట్టుకుపోయి వుంది. దాలీ చిక్కిపోయింది అని తను అనుకున్న మాట చెప్పుదామనుకుంది అన్నా. కాని ముందటి కంటె తనకి అందం పెరిగిందని గుర్తుకు వచ్చి,—అలా అని దాలీ చూసిన చూపు చెప్పకనే చెప్పింది,—అన్నా వూరికే నిట్టూర్చి తన గురించే చెప్పడం మొదలుపెట్టింది.

''నువ్వు నాకేసి చూసి ప్రస్తుతం నేను వున్న పరిస్థితిలో యెవళ్లేనా సుఖంగా వుండగలరా అని అనుకుంటున్నావు కదూ?'' అని అన్నా మొదలుపెట్టింది. ''చెప్తా. తలుచుకుంటే సిగ్గవుతుంది కాని... నేను క్షంతవ్యం కానంత సంతోషంగా వున్నాను. నాకు జరిగింది యేదో మాయలా వుంటుంది, వ్యథాకులితమైన భయంకరమైన పీడకలనుంచి వొక్కసారి కళ్లు తెరిచి చూసుకుంటే అసలా కల తాలూకు ఛాయలే మిగలనట్టు వుంటుంది. నేను మేల్కొన్నాను. నేనా భయంకర వ్యథాకులిత స్థితిని అనుభవించేను. కొంతకాలంగా, ముఖ్యంగా యిక్కడికి వచ్చినప్పట్నుంచీ చెప్పలేనంత సంతోషంగా వుంది'' అని యేమంటావ్ అన్నట్టు బెరుకుగా చిరునవ్వు నవ్వుతూ దాలీకేసి చూసి అన్నా అంది.

''నాకెంతో సంతోషంగా వుంది!'' అని దాలీ తిరిగి చిరునవ్వు నవ్వుతూ అంది. కాని ఆమె స్వరం ఆమె అనుకున్న దాని కంటే యెక్కువ అనార్ద్రంగా వుంది. ''నువ్వంటే నాకు చాలా సంతోషంగా వుంది. అయినా నువ్వు నాకు ఉత్తరం యెందుకు రాశావు కాదు?'' అని అడిగింది.

''యెందుకు రాయలేదంటావా? ధైర్యం చాలింది కాదు... నువ్వు నా స్థితిని మర్చిపోతున్నట్టుంది.''

''నాకు ఉత్తరం రాసేందుకు ధైర్యం లేకపోయిందా. నీకు తెలుసా నేను యెంత... నాకనిపించింది...''

దాలీ ఆ ఉదయం తన మనసులో రేగిన వూహల గురించి చెప్పుదామనుకుంది. కాని యెందుకనో అది సమయమూ సందర్భమూ కాదనిపించింది.

''సర్లే, తర్వాత మాట్లాడుకుందాం ఆ విషయాల గురించి. ఆ యిళ్లన్నీ యేమిటి?'' అని మాట మార్చేటందుకని అకేషియా, లైలాక్ పొదల వెనకనుంచి కంటికి ఆనుతూ వున్న యిళ్ల యెర్ర కప్పులకేసీ, ఆకుపచ్చ కప్పులకేసీ చూపిస్తూ అడిగింది. ''యేదో బస్తీలా వుంది'' అంది.

కాని అన్నా ఆ ముక్క పట్టించుకోలేదు.

"వుహూఁ, లేదు, లేదు. చెప్పు నా గురించి యేమనుకుంటున్నావ్? నీకేమనిపిస్తోంది? చెప్పు" అని అన్నా అడిగింది.

"యేమనుకుంటున్నాను..." అని దాలీ చెప్పబోయింది. సరిగ్గా ఆ వేళకి వెస్లోవ్‌స్కీ ముందు కుడి కాలితో దౌడు తీయించడం నేర్పిన్న గుర్రంమీద అక్కడికి వచ్చేడు. ఆడవాళ్ల సాంబర్ జీనుమీద కురచ స్వారీ జాకెట్‌తో జోరుగా పైకీ కిందికీ లేస్తూ పడుతూ వున్నాడు.

"సాధిస్తున్నానండీ అన్నాగారూ" అని అరిచేడు.

అన్నా అతనికేసి చూడను కూడా చూడలేదు. కాని బండిలో యీ రామాయణం మొదలెట్టడం ఉచితంగా లేదని మరోసారి దాలీకి అనిపించింది. అందుకని ఆలోచనల్ని క్లుప్తం చేసి చెప్పింది.

"నేనేమీ అనుకోవడం లేదు. నాకెప్పుడూ నువ్వంటే ప్రేమే. మరి నువ్వు యెవళ్ల నేనా ప్రేమిస్తే ఆ మనిషిని యెలా వున్న స్థితిలో అలా ప్రేమిస్తావు గాని నువ్వు కోరుకున్న స్థితిలో వున్నట్టు కాదుగా" అంది.

అన్నా తన నేస్తం ముఖంమీదనుంచి కళ్లని పక్కకి తిప్పుకుని కళ్లని కొంచెం ముడుచుకుని (అదో కొత్త అలవాటు, దాలీ అంతకు ముందెన్నడూ యెరగనిది) తన ఆలోచనల్లో మునిగిపోయింది, యీ మాటల అర్థం యేమిటో బోధ పరుచుకుంటున్నట్టు. తను కోరుకున్నట్టు అర్థం చెప్పుకుని – అలానే కనిపించింది – ఆమె మళ్లీ దాలీకేసి చూసింది.

"నీ దోషా లేమన్నా వున్నా, నువ్విక్కడి వచ్చి నాకు యీ మాటలు చెప్పుకున్నందుకు అవన్నీ మాసిపోతాయి" అంది అన్నా.

అన్నా కళ్లల్లో నీళ్లు తిరగడం దాలీ చూసింది. మాట్లాడకుండా అన్నా చేతిని నొక్కింది.

"కాని ఆ యిళ్లేమిటి?" అని కొంచెం సేపాగి మళ్లీ అడిగింది. "యెన్ని వున్నాయో!" అంది.

"అవి పనివాళ్ల యిళ్లు. గుర్రాల క్షేత్రం, గుర్రం శాలలు" అని చెప్పింది అన్నా. "అక్కణ్ణుంచి పార్కు మొదలవుతుంది. అంతా అయ్యవారి నట్టిల్లులా వుండేది. వ్రాన్‌స్కీ అంతట్నీ చక్క బరిచేడు. అతనికి యీ జాగీరంటే చాలా యిష్టం. వ్యవసాయం పనులంటే యెంతో మక్కువ. నాకాశ్చర్యం అవుతుంది యెంతలా యీ పనిలో మునిగిపోతాడో చూస్తూ వుంటే. అతని స్వభావం అలాంటిది తెలుసా? యే పని పట్టుకోసీ, దాన్ని పొద్దు లేకుండా చెయ్యాల్సిందే. అసలు విసుగనేది అనిపించనే అనిపించదేమో, అంతలా పనిలో లగ్నమైపోతాడు. నాకతను బాగా తెలుసు కదా, లెక్కలు పద్దులూ విషయంలో యెంత గట్టివాడో, వ్యవసాయం పనులకి సంబంధించి పొల్లుపోనివ్వడు, పెద్ద అజమాయిషీదారు అయేడు. ఆ మాట కొస్తే పైసాపైసా కూడా లెక్క చూస్తాడు. కాని వ్యవసాయం పనులకి సంబంధించి మాత్రమే అలా వుంటాడులే. మరి వేలు లక్షలు విషయంలో ఖాతరీయే

వుంచడు'' అని ఆమె, ప్రియుడి సుగుణాలు తను మాత్రమే కనిపెట్టిన ఆడదానికి వుండే లాంటి సంతోషభరిత కుటిల మందహాసంతో, చెప్పింది. "అదుగో అక్కడున్న ఆ పెద్ద మేడ చూశావా? అది కొత్త హాస్పిటల్. ఖాయంగా లక్షకి పైనే అయియుంటుంది. అది యిప్పు డతని dada[1]. యీ మోజు యెలా పుట్టిందనుకుంటున్నావు? రైతులు పచ్చిక బీళ్లని కౌలుకి యిమ్మన్నారు. తక్కువ కిస్తీకే అయి వుంటుంది లే. అతను వల్ల కాదన్నాడు. యేమిటా పిసినారితనం అని అతన్ని తిట్టేను. యేం, అంటే, యీ వొక్క దానివల్లనే కాదనుకో. అన్నీ వచ్చేయి, తను పిసినారిని కాదని చూపించుకోవడానికి యీ హాస్పిటల్ కట్టించడం మొద లెట్టేడు. దీన్ని నీ యిష్టం c'est une petitesse[2] అను కావాలంటే. కాని అందుకనే అతనంటే యెక్కువ యిష్టపడతాను. మా హవేలీ చూస్తావు కదా యిప్పుడు నువ్వు. యిది వాళ్ల తాతగారిది, పై ఆకారం యేమీ మార్చలేదతను.''

"యెంత బాగుంది!'' అని దాలీ అప్రయత్నంగా ఆశ్చర్యం ప్రకటించింది. తోటలోని అనేక హరిత వర్ణ వృద్ధ వృక్షాల వెనకనుంచి ఆనుతూ వున్న స్తంభాల, అందమైన పెద్ద హవేలీని చూసి ఆమె అలా అంది.

"బాగా వుంది కదూ? పై కిటికీ దగ్గర్నుంచి చూస్తే అద్భుతంగా వుంటుంది.''

వాళ్ల బండి గులక రాళ్లు పరిచిన దారి కళకళలాడే పువ్వులు వున్న ఆవరణలోకి వెళ్లింది. అక్కడ యిద్దరు పనివాళ్లు వొక పుష్పశయ్య దగ్గర మడికట్టి బెజ్జాలు వున్న ముతక రాళ్లని పరుస్తున్నారు. బండి వెళ్లి సింహద్వారం దగ్గర పోర్టికోలో ఆగింది.

"వాళ్లూ వచ్చేశారు'' అని ఆన్నా అక్కడనుంచి తోలుకు పోతూ వున్న స్వారీ గుర్రాల్ని చూసి అంది. "నిజంగా అది భేషైన గుర్రం కదూ? అది స్వారీ గుర్రం. నాకిష్టమైన గుర్రం. దాన్నిలా తీసుకు రండి, కొంచెం పంచదార పట్టండి. కౌంట్ యెక్కడ?'' అని పరిగెత్తుకుంటూ యివతలికి వస్తూ వున్న యిద్దరు డవాలా బంట్రోతుల్ని చూసి ఆన్నా అడిగింది. "అదుగో, వచ్చేడు'' అని వెస్లోవ్‌స్కీతో కలిసి తమకేసి వస్తూ వున్న వ్రాన్‌స్కీని చూసి అంది.

"ఆవిడకి యే గది యిద్దామంటారు?'' అని వ్రాన్‌స్కీ ఫ్రెంచిలో ఆన్నాని అడిగేడు. ఆన్నా జవాబు కోసం ఆగకుండా అతను దాలీకి అభివాదం చేశాడు, యీ సారి ఆమె చేతిని ముద్దుపెట్టుకుని అభివాదం చేశాడు. "బాల్కనీ వున్న పెద్ద గది బాగుంటుందేమో'' అన్నాడు.

"వుహుఁ, వద్దు వద్దు. అది చాలా దూరం. మూల వున్న గది చాలా బాగుంటుంది. వొకళ్లకొకళ్లు దగ్గరగా వుంటాం, బాగుంటుంది. వూఁ, పద'' అని ఆన్నా నౌకరు తెచ్చి యిచ్చిన పంచదార తనకిష్టమైన గుర్రానికి పెడుతూ అంది.

---

[1] అన్నింటినీ మించిన మోజు (ఫ్రెంచి).

[2] చిన్న విషయం (ఫ్రెంచి).

"Et vous oubliez votre devoir[1]" అని వ్రాన్‌స్కీతోబాటు పోర్టికోలోకి వచ్చిన వెస్లొవ్‌స్కీతో అంది.

"Pardon, j'en ai tout plein les poches[2]" అని అతను వెస్ట్ జేబులో చేతులు పెట్టుకుంటూ అన్నాడు.

"Mais vous venez trop tard[3]" అని ఆన్నా గుర్రం పంచదార నాకిన చేతిని జేబు రుమాలుతో తుడుచుకుంటూ అంది. "యెక్కువ రోజులు వుంటావు కదూ?" అని దాలీని అడిగింది. "వొక్క రోజు మాత్రమేనా? అలా వీల్లేదు సుమా" అంది.

"నేనలానే మాట యిచ్చి వచ్చేను. పిల్లలు..." అని దాలీ వెళ్లి బండిలోనుంచి తన సంచీ తెచ్చుకుని దుమ్ము కొట్టుకుపోయిన ముఖం తుడుచుకోవాలన్న కోరికతో యిబ్బంది పడుతూ అంది.

"వుహుఁ, వీల్లేదు దాలీ! అలా వీల్లేదు... సర్లే, ఆ సంగతి తర్వాత చూద్దాం. రా, రా లోపలికి" అని ఆన్నా ఆమెని గదిలోకి తీసికెళ్లింది.

అది వ్రాన్‌స్కీ ప్రస్తావించిన ఘనమైన గది కాదు. అంత బాగా లేదు యేమీ అనుకోకు అని ఆన్నా దాలీకి చెప్పిన గది. ఆన్నా అంత బాగా లేదని చిన్న బుచ్చుకున్న యీ గది యెంత దివ్యంగా వుందంటే దాలీకి యెప్పుడూ అలాంటి గదిలో వుండే అదృష్టం కలగలేదు. విదేశాల్లోని అతిఘనమైన హోటెళ్లు ఆమెకి గుర్తు వచ్చేయి.

"నాకెంత సంతోషంగా వుందో, దాలీ" అని ఆన్నా స్వారీ బట్టలతోనే వో క్షణం సేపు దాలీ పక్కన కూర్చుంటూ అంది. "మీ సంసారం యెలా వుందో చెప్పు. మీ ఆయన్ని పెద్దగా కలుసుకోలేదు. కాని పిల్లల గురించి యేమీ చెప్పాడే కాదు. మా ముద్దుల తాన్యా యెలా వుంది? పొడుగయిందేమో, యేం?" అంది.

"ఆఁ, బాగా సాగింది" అని ముక్తసరిగా అంది దాలీ. తన పిల్లల గురించి తను అంత పట్టనట్టుగా మాట్లాడ్డం ఆమెకే ఆశ్చర్యం కలిగించింది. "మేం లేవిన్ల యింట్లో చాలా సుఖంగా గడుపుతున్నాం" అని జోడించింది.

"నేనంటే నీకు తృణీకారం లేదని నాకు తెలిసి వుంటేనా..." అంది ఆన్నా. "మీరందరూ యిక్కడికి వచ్చి వుండచ్చును. యెంతయినా మా తమ్ముడు వ్రాన్‌స్కీకి పూర్వంనుంచీ మంచి స్నేహితుడు కదా" అని వొక్కసారి సిగ్గుతో యెర్రబడింది.

"కాని మేం చాలా బాగా వున్నాం..." అని దాలీ యిబ్బంది పడుతున్నట్టుగా అంది.

"ఆఁ, నేను యెంతో సంతోషంగా వుండబట్టి యేదేదో పిచ్చి వాగుడు వాగుతున్నాను.

---

1 మీరు మీ పని మర్చిపోతున్నారు (ఫ్రెంచి).

2 మన్నించండి, నా జేబులనిండా వుంది (ఫ్రెంచి).

3 కాని మీరు ఆలస్యంగా ముందుకు వస్తారు (ఫ్రెంచి).

వూ, పోన్లే, నువ్వొచ్చేవు నాకు యేనుగెక్కినంత సంతోషంగా వుంది'' అని ఆమెని మళ్లీ ముద్దుపెట్టుకుంటూ అంది ఆన్నా. ''కాని నన్ను గురించి యేమనుకుంటున్నదీ చెప్పావే కాదు. నాకు అది తెలుసుకోవాలని వుంది. కాని నేను వున్నట్టుగా నన్ను చూస్తున్నావు అదే సంతోషంగా వుంది నాకు. నేను దేన్నో రుజువు చేద్దామనుకుంటున్నానని యెవరూ అనుకోకూడదు, అదే నాక్కావాల్సిన ముఖ్య విషయం. నేను దేన్నీ రుజువు చెయ్యాలనుకోవడం లేదు. నేను కేవలం బతకాలనుకుంటున్నాను, నాకు తప్ప యెవళ్లకీ అపకారం చెయ్యాలనుకోవడం లేదు. అలాంటి హక్కు నాకు లేదంటావా? సర్లే, యిదో పెద్ద గొడవ, తర్వాత అన్ని విషయాల గురించీ బాగా మాట్లాడుకుందాంలే. ముందు నే వెళ్లి బట్టలు మార్చుకుంటా, నీకు సాయం చెయ్యడానికి పని మనిషిని పంపుతా'' అంది.

## 19

దాలీ వొక్కత్తి వుండిపోయి గది అంతట్నీ యింటి యజమానురాలు చూసే తీరులో చూసింది. ఆ యింటికి వచ్చేటప్పుడు, యింటి లోపల తిరిగేటప్పుడు ఆమెకి కనిపించినదంతా, యిప్పుడు ఆమెకి గదిలో కనిపించేదంతా ఆమె మనసుమీద గొప్ప ఐశ్వర్యం, సొగసు, నూతన యూరపియన్ వైభోగం స్ఫురణకి తెచ్చే ముద్ర వేసింది. అలాంటి వాటి గురించి ఆమె ఇంగ్లీషు నవలల్లో చదివింది, రష్యాలో యెన్నడూ చూడలేదు — ముఖ్యంగా పల్లె ప్రాంతాల్లో. అక్కడున్న ప్రతీదీ కొత్తదే — గోడలకి అతికించిన ఫ్రెంచి వాల్ పేపర్ దగ్గర్నుంచి, నేలమీద మొత్తం అంతా పరిచిన తివాసీదాకా. మంచంమీద స్ప్రింగు పరుపు వుంది. చిన్న తలగడలకి పట్టు గలేబులు వున్నాయి. చలవరాతి వాష్ స్టేండ్, అలంకరణ మేజా, సోఫా, బల్లలు, చలినెగడుమీద కంచు గడియారం, కిటికీలకి గుమ్మాలకి వున్న తెరలు అన్నీ కొత్తవి, ఖరీదైనవి.

సేవచెయ్యడానికి వచ్చిన షోకిలా పనిమనిషీ అక్కడున్న అన్నిటిలాగా కొత్తది, ఖరీదైంది. ఆమె దాలి వేసుకున్న దానికంటే యెక్కువ నాగరికమైన ఫ్రాకు వేసుకుంది, ఆమె కేశ విన్యాసం కూడా నదురుగా వుంది. ఆమె శుచి శుభ్రతలు, యేం కావాలి యేం చెయ్యాలి అంటూ మర్యాదా ఆత్రుతా చూపించడమూ దాలీకి నచ్చేయి. కాని దాలీకి ఆమె వుండడం యిబ్బంది కలిగించింది. తన మాసికల నైట్ గౌను ఆమె చూస్తుందేమోనని దాలీకి సిగ్గయింది. దాన్ని పొరపాటున సంచీలో పెట్టుకుంది. ఆమెకి యింటి దగ్గర గొప్పగా కనిపించే మాసికలూ, కుట్లూ యిక్కడ తలవంపు కలిగించేటట్టుగా వున్నాయి. యింటి దగ్గర వొక విషయం స్పష్టంగా వుండేది. ఆరు నైట్ గౌన్లకి గజం అరవై అయిదు కోపెక్కుల చొప్పున యిరవై నాలుగ్గజాల నూలు బట్ట అవసరం. అంటే పదిహేను రూబుళ్లకి పైబడి తేలుతుందన్న మాట. యిది కుట్టు ఖర్చు కత్తిరింపు ఖర్చు కాక. యీ పదిహేను రూబుళ్లూ

యింటి ఖర్చులో ఆదా చేసినట్టే కదా. అయినా ఆమె పనిమనిషి ముందు సిగ్గు పడడం మాత్రమే కాక యిబ్బంది పడింది.

చాలా పాత కాలంనాటి పరిచయస్థురాలు అన్నుష్కా రావడంతో దాలీకి తెరిపిన పడ్డట్టనిపించింది. షోకిలా పనిమనిషికి యజమానురాలి దగ్గరికి వెళ్లాల్సిన పని పడిందట. అందుకని అన్నుష్కా దాలీ దగ్గర వుండిపోయింది.

దాలీని చూసి అన్నుష్కా సంతోషపడింది. అడ్డూ ఆపూ లేకుండా మాట్లాడుతూనే వుంది. తన యజమానురాలి స్థితి గురించి చెప్పాలని, ముఖ్యంగా కౌంట్ ఆన్నాని యెంతగా ప్రేమించి ఆరాధిస్తూ వున్నాడో చెప్పాలని, ఆమెకి ఆతృతగా వున్నట్టు దాలీ గ్రహించింది, కాని యెప్పుడు విషయం ఆ స్థాయికి చేరినా ఆమెని అలా చెప్పకుండా నివారించే ప్రయత్నం చేసింది.

"నేను ఆన్నాగారితో పెరిగాను. ఆవిడకంటే నాకు లోకంలో యెక్కువ యిష్టమైంది లేదు. ఆవిడ మంచిదో చెడ్డదో నిర్ణయించడానికి మనం యెవళ్లం? కౌంట్ ఆవిడ్ని యెంతలా ప్రేమిస్తున్నారో..."

"యిబ్బంది లేకపోతే కొంచెం వీటిని ఉతికించి పెట్టు" అని దాలీ తుంచేసింది.

"తమ చిత్తం. మా దగ్గర బట్టలు ఉతకడానికి ప్రత్యేకం యిద్దరు ఆడమనుషులు న్నారు. పక్క బట్టలలాంటివన్నీ ఉతకడానికి మెషీన్లు వున్నాయి. కౌంట్ స్వయంగా అన్నీ చూసుకుంటారు. యెంత మంచి పెనిమిటో..."

ఆ సమయంలో ఆన్నా రావడం దాలీకి సంతోషం కలిగించింది. ఆమె రాకతో అన్నుష్కా వాగ్ధోరణి కట్టుబడింది.

ఆన్నా నిరాడంబరమైన మల్లు ఫ్రాక్ వేసుకుంది. దాలీ ఆ నిరాడంబరమైన ఫ్రాక్‌ని శ్రద్ధగా చూసింది. అలాంటి నిరాడంబరత్వం అర్థం యేమిటో, దానికి ఖర్చు యెంతో ఆమెకి తెలుసు.

"పాత నేస్తం" అని ఆన్నా అన్నుష్కా నుద్దేశించి అంది.

ఆన్నా యిప్పుడు యేమీ యిబ్బంది పడుతున్నట్టుగా లేదు. చాలా శాంతంగా, తన స్థితి గురించిన చింత యేమీ లేకుండా వుంది. తను వచ్చినప్పుడు ఆన్నాలో కనిపించిన వాడి దుడుకు అంతా పోయిందని దాలీ గమనించింది. ఆమె తన మనోభావాల, ఆంతరిక విచారాల ద్వారం తలుపు సురక్షితంగా మూతపడిందన్న బాహ్య, ఉదాసీన ధోరణితో వుంది.

"మీ అమ్మాయి యెలా వుంది?" అని దాలీ అడిగింది.

"ఆన్నీ?" (బిడ్డకి పెట్టిన ముద్దు పేరు అది) "బాగానే వుంది. బొద్దుగా తయారైంది. చూస్తావా? దా, చూపిస్తా. యెప్పుడూ దాదులతో ఆయాలతో యింత యాతన పడలేదు" అంది. "ఓ ఇటాలియన్ ఆమెని దాయిగా పెట్టుకున్నాం. మంచిదే కాని శుద్ధ మొద్దు. బిచాణా యెత్తిం చేద్దామనుకున్నాం గాని పాప ఆమెకి బాగా చేరిక అవడంతో పోన్లెమ్మని వుంచేశాం" అంది.

"వూ॒, అయితే యేం నిర్ణయించారు?" అని మొదలుపెట్టింది డాలీ. పిల్లకి యింటి పేరు యేం పెడతారు అని అడగాలని మనసులో ఉద్దేశ పడింది. కాని అన్నా ముఖంమీద అనుకోకుండానే గోచరమైన ఛాయ చూసి తను అడగదలచుకున్న దాని అర్థం మార్చేసింది. "అయితే యేం నిర్ణయించారు? పాలు మాన్పించెయ్యలనా?" అంది.

కాని అన్నా ఆమె భావం గ్రహించింది.

"నువ్వు అడగదలచుకున్నది అది కాదు కదా? పాప యింటి పేరు గురించి అడగాలనుకున్నావు, కదా? అలెక్సేయ్‌కి యిది బాధగా వుంది. దానికి యింటి పేరు లేదు. అంటే అది కరేనినాయే" అంది అన్నా, కనుపాపలు సగం మూతపడే దాకా పక్ష్మాలు మూసుకుంటూ.

"సర్లే" అంది ఆమె. ఆమె ముఖం వున్నట్టుండి తేట పడింది. "ఆ విషయాలన్నీ తర్వాత మాట్లాడుకుందాంలే. దా, పాపని చూద్దువు గాని. Elle est très gentille.[1] అప్పుడే పాకుతోంది" అంది.

యింట్లో డాలీకి ప్రతి చోటా ఆశ్చర్యకరంగా కనిపించిన వైభోగం చంటి పిల్ల గదిలో అన్నిట్నీ తలదన్నేటంత ఆశ్చర్యకరంగా కనిపించింది. గదినిండా ఇంగ్లండ్‌నుంచి పురమాయించి తెప్పించిన చిన్న చిన్న బొమ్మ బళ్లు, పిల్లకి నడక నేర్పే వస్తువులు, పిల్ల పాకడానికి ప్రత్యేకం మెత్తగా వున్న బిల్లియర్డ్ బల్లలాంటి వుయ్యాలలు, కొత్త రకం స్నానాల తొట్లెలు వున్నాయి. ప్రతీదీ ఇంగ్లీషు తయారీ వస్తువే. దృఢంగా వున్నదే. అనుమానం లేకుండా ఖరీదైందే. ఆ గది పెద్దది. వెలుతురు బాగా వస్తోంది. కప్పు యెత్తుగా వుంది.

చంటి పిల్ల వొంటిమీద చిన్న గౌనుతో వుంది. యెత్తైన కుర్చీమీద కూర్చుని సూప్ తింటోంది. అది పిల్ల ఛాతీ అంతటిమీదా వొలికి పడుతోంది. పిల్ల గదిలో వుండే రష్యన్ పనిమనిషి పిల్లచేత సూపు తినిపిస్తోంది, ఆమెతోబాటు తనూ కొంచెం కొంచెం తింటోంది. దాది గాని, దాయి గాని కనిపించలేదు. వాళ్లు పక్క గదిలో వున్నారు. వాళ్లు చిత్రమైన ఫ్రెంచి భాషలో మాట్లాడుకుంటూ వున్నట్టు వినిపిస్తోంది. వాళ్లు వొకళ్లతో వొకళ్లు మాట్లాడుకోగల భాష అదే.

అన్నా గొంతుక వినిపించగానే ఇంగ్లీషు దాది యివతలికి వచ్చింది. ఆమె పొడుగ్గా వుంది. ఆర్భాటంగా బట్టలు వేసుకుంది. ఆమె ముఖం యింపుగా లేదు. ఆ ముఖంలో కృత్రిమ వాలకం కనిపిస్తోంది. ఆమె బంగారు రంగు ఉంగరాల జుట్టుని యెగరేసుకుంటూ వచ్చింది. వస్తూనే యేవేవో సాకులు చెప్పడం మొదలుపెట్టింది, అన్నా యేమీ అనకపోయినా కూడా. అన్నా నోటినుంచి వచ్చిన ప్రతి మాటకీ గబగబా "yes, my lady"[2] అంటూనే వుంది.

తనని చూడవచ్చిన యీ పరాయి వ్యక్తి యెవరబ్బా అని ఆ చంటి పిల్ల ముఖంలో

---

[1] అది చాలా ముచ్చటగా వుంది (ఫ్రెంచి).

[2] చిత్తం, అమ్మగారూ (ఇంగ్లీషు).

కటువైన చూపు కనిపించినప్పటికీ, నల్లని జుట్టు, నల్లని కనుబొమలు, యెర్రటి బుగ్గలు, చలికి బిరుసెక్కిన యెర్రటి చర్మమూ వున్న ఆ పిల్లని చూడగానే దాలీకి ముచ్చటేసింది. ఆ పిల్ల ఆరోగ్యం దాలీకి యీర్ష్య కలిగించింది. ఆ పిల్ల పాకే తీరు దాలీకి నచ్చింది. తన పిల్లలు యెవరూ అలా పాకలేదు. ఫ్రాక్ వెనక్కి మడిచి తివాసీమీద కూర్చోబెట్టినప్పుడు ఆ పిల్ల దాలీకి అద్భుతంగా కనిపించింది. చిన్న జంతువులాగా ఆ పిల్ల పెద్ద వాళ్లకేసి నల్లని కళ్లతో చూసింది. తనని వాళ్లు పొంగిపోయి చూస్తున్నారన్న భావం ఆ పిల్లకి సంతోషకరంగా వుందన్న విషయం తెలుస్తూనే వుంది. వాళ్లకేసి చూసి చిన్నగా నవ్వుతూ, అటూ యిటూ కాళ్లతో తోసుకుంటూ, బలంగా చేతుల్ని వూపుతూ, ముందుకి సాగుతూ, మళ్లీ చేతుల్ని ముందుకు వేస్తూ వచ్చింది.

కాని దాలీకి ఆ గది వాతావరణం నచ్చలేదు. ముఖ్యంగా ఆమెకి ఆ ఇంగ్లీషావిడ నచ్చలేదు. మనుషుల్ని గురించి అంత బాగా తెలిసిన ఆన్నా, తన బిడ్డకి చెడ్డ ప్రభావం కలిగించే అసహ్యకరమైన ఇంగ్లీషు దాదిని పెట్టుకోవడానికి కారణం, ఆమె ప్రస్తుతం వున్నలాంటి అసహజ కుటుంబ పరిస్థితుల్లో వేరే మంచి దాది యెవళ్లూ పని చెయ్యడానికి యిష్టపడక పోవడమేనని దాలీ వూహించడానికి సిద్ధ పడింది. అంతే కాకుండా ఆన్నా, దాయి, దాది, చంటి పిల్ల సజావుగా కలిసి మెలిసి వుండడం లేదనీ, తల్లి బిడ్డ గదికి వెడుతూ వుండడం కూడా సామాన్యంగా జరగదనీ వాళ్లనుకున్న కొన్ని మాటల్లోనే దాలీ వూహించింది. చంటి బిడ్డకి ఆన్నా యేదో బొమ్మ యిద్దామనుకుంది, కాని అది దొరకలేదు.

కాని అన్నిటికంటే ఆశ్చర్యం కలిగించింది పిల్లకి పాల పళ్లు యెన్ని వచ్చాయని దాలీ అడిగితే ఆన్నా తప్పు చెప్పడం. తన బిడ్డకి రెండు కొత్త పళ్లు వచ్చిన విషయం కూడా ఆన్నాకి తెలీదు.

''నా అవసరం యిక్కడ లేకపోవడం చూసి మధ్యమధ్య నా మనసుకి దిగులుగా వుంటుంది'' అని ఆన్నా ఆ గదిలోనుంచి యివతలికి వస్తూ అంది. అలా వచ్చేటప్పుడు దారిలో అడ్డం వున్న ఆట వస్తువులకి తగుల్తుందని ఆమె జీరాడే ఫ్రాక్‌ని పైకి యెత్తి పట్టుకుంది. ''మొదటి బిడ్డప్పుడు యిలా వుండేది కాదు'' అంది.

''నేను అందుకు విరుద్ధంగా అనుకున్నానే'' అని దాలీ బెరుగ్గా అంది.

''అబ్బే కాదు! నీకు తెలుసు కదా నేను వాణ్ణి, సెర్యోషని చూశేను'' అని ఆన్నా దూరంలో వున్న దేన్నో చూస్తున్నట్టుగా కళ్లు ముడిచి అంది. ''సర్లే, ఆ విషయాల గురించి తర్వాత మాట్లాడుకుందాం. ఆకలితో నకనక లాడిపోయే మనిషి ముందు పంచభక్ష్య పరమాన్నాలూ పెట్టినట్టుంది నాకు, నీకు తెలుసో తెలీదో. యే పదార్థంతో భోజనం మొదలుపెట్టాలో ఆ మనిషికి తెలీదు. పంచభక్ష్య పరమాన్నాలతో వున్న విందు నువ్వు, నీతో నేను మాట్లాడాల్సిన విషయాలూనూ. నేను వేరే యెవళ్లతోనూ ఆ విషయాల గురించి మాట్లాడలేను. యెక్కడ మొదలెట్టాలో నాకు తెలీటం లేదు.

Mais je ne vous ferai grâce de rien.[1] నీకు అన్నీ చెప్పెయ్యాలి. ఆఁ, యిక్కడ వున్న వాళ్ల గురించి నీకు కొంచెం చెప్పాలి కదూ" అంది ఆన్నా. "మొదట ఆడ వాళ్ల గురించి. ప్రిన్సెస్ వర్వారా. నీకు ఆవిడ తెలుసు. నీకూ, మీ ఆయనకీ ఆమె అంటే వున్న అభిప్రాయం నాకు తెలుసు. ఆవిడ జీవిత లక్ష్యం తను ఎకతెరీనా పావ్లొవ్నా పిన్నికంటే మంచి దాన్నని చూపించుకోవడం అని మీ ఆయన అంటాడు. ఆ ముక్క నిజమే కావచ్చు. కాని ఆవిడ మంచి మనస్వి. నేనామెకి రుణపడి వున్నాను. పీటర్స్‌బుర్గ్‌లో నాకు un chaperon[2] చాలా అవసరం అయిన సందర్భం వచ్చింది. ఆవిడ నాకు సాయితా వచ్చింది. నిజంగా ఆవిడ చాలా దయా స్వభావం వున్న మనిషి. నాకు చాలా సునాయాసంగా వుండేం దుకు యెంతో చేసింది. పీటర్స్‌బుర్గ్‌లో నా పరిస్థితి యెంత యమయాతనగా వుందో నువ్వు వూహించలేవు" అంది. "నేను యిక్కడ హాయిగా ప్రశాంతంగా వున్నాను. సరే, ఆ విషయం గురించి తర్వాత మాట్లాడుకుందాం. ముందు మిగిలిన వాళ్ల గురించి చూద్దాం. ప్రిన్సెస్ తర్వాత స్వియాజ్‌స్కీ. అతను గొప్పవాళ్ల మార్షల్. చాలా సహృదయుడు. కాని అలెక్సేయ్ అవసరం యేదో వున్నట్టుంది. నీకు తెలుసు కదా తనకున్న సంపదతో అలెక్సేయ్ యీ వూళ్లో గొప్ప పలుకుబడి వున్న మనిషవుతాడు. తర్వాత తుష్కేవిచ్. నువ్వతన్ని చూశేవు. బెట్సీ దగ్గర వుండేవాడు. ఆమె అతన్ని వదిలేసింది, యిక్కడికి వచ్చేడు. అలెక్సేయ్ చెప్పినట్టు తాము యెలా కనిపిస్తున్నారో అలానే అందరూ భావించుకోవాలి, అప్పుడు చాలా ప్రేమా స్పదులవుతారు అనే కోవలోకి చెందిన వాళ్లలాంటి మనిషి. Et puis, il est comme il faut[3] ప్రిన్సెస్ వర్వారా అన్నట్టు. యిక వెస్లొవ్‌స్కీ – నీకతను తెలుసుగా. ముచ్చ టైన కుర్రాడు" అంది ఆన్నా. ఆమె పెదాలు కుటిల మందహాసంతో ముడుచుకున్నాయి. "లేవిన్‌తో జరిగిన ఆ నవ్వుతాలు గొడవ యేమిటి? వెస్లొవ్‌స్కీ అలెక్సేయ్‌కి చెప్పాడు, కాని మేం నమ్మలేకపోయేం. Il est très gentil et naïf[4]" అందామె అదే చిరునవ్వుతో. "మగాళ్లకి సరదా కావాలి, అలెక్సేయ్‌కి తనకి నచ్చిన మనుషులు కావాలి. అందుకనే వీళ్లం దర్నీ యిక్కడ చేరతీశాను. మా జీవితం తుళ్లుతూ పేలుతూ వుండాలి, అలెక్సేయ్‌కి మరి యేదీ కావాలనిపించకూడదు. తర్వాత మా నిగామానుని చూస్తావు. అతను జర్మన్. చాలా మంచి వాడు, తన పని తెలిసిన వాడు. అలెక్సేయ్‌కి అతనంటే గౌరవం. తర్వాత డాక్టరు వున్నాడు, పడుచు వాడు. పూర్తిగా నిహిలిస్టు కాదనుకో, కాని చాకుతో తింటాడు తెలుసా... కాని చాల మంచి డాక్టరు. యిక వాస్తు శిల్పి వున్నాడు... Une petite cour.[5]"

---

[1] కాని నేను నీమీద జాలి చూపించను (ఫ్రెంచి).

[2] తోడు (ఫ్రెంచి).

[3] పై అతను చాలా మంచి మర్యాద వున్న మనిషి (ఫ్రెంచి).

[4] యితను చాలా ప్రియమైన సరళ హృదయుడైన వ్యక్తి (ఫ్రెంచి).

[5] వో చిన్న కొలువు (ఫ్రెంచి).

"ప్రిన్సెస్, యిదుగో దాలీ, మీరు యెవరెవరని చూడాలనుకుంటున్న వ్యక్తి" అని ఆన్నా దాలీతో కలిసి రాతి వరండా మీదకి వస్తూ అంది. అక్కడ ప్రిన్సెస్ వర్వారా నీడలో నగిషీలు చెక్కిన చట్రం దగ్గర కూర్చుని కౌంట్ వ్రాన్స్కీ పడక కుర్చీకి గలేబు బుటాలు అల్లుతోంది. "సాయంత్రం భోజనాలదాకా యేమీ వద్దంటోంది దాలీ. కానీ మాకు యేదన్నా తినడానికి తెమ్మని పురమాయించండి. నే వెళ్లి వ్రాన్స్కీ యెక్కడున్నాడో చూసి అందర్నీ యిక్కడికి తీసుకు వస్తాను" అంది.

ప్రిన్సెస్ వర్వారా దాలీని సాదరంగా, కొంచెం అనుగ్రహ పూర్వకంగా పలకరించింది. వెంటనే తను ఆన్నాతో యెందుకు వుంటున్నదీ కారణాలు చెప్పడం మొదలుపెట్టింది. ఆన్నాని చేరదీసి పెంచిన సోదరి ఏకతెరీనా పావ్లొవ్నా కంటే ఆన్నాపట్ల తనకి యెక్కువ అభిమానం వుందనీ, ఆన్నానుంచి అందరూ మొఖం చాటు చేసుకుని వెళ్లిపోయే యిప్పుడు, ఆమెకి చాలా కష్ట కాలంగా వుండే యీ సమయంలో, ఆమెకి తోడు వుండడం తన కర్తవ్యంగా భావించిందనీ చెప్పింది.

"ఆన్నా పెనిమిటి విడాకులు యిచ్చేస్తే నేను నా వొంటరి బతుకు గడపడం మొదలెడతాను. కాని నావల్ల ఉపయోగం వున్నంత కాలం నా విధి నేను నెరవేరుస్తాను, అది యెంత కష్టమైనా గానీ. మిగతా వాళ్లల్లాగా వుండలేను. యెంత మంచి దానివి నువ్వు, యిక్కడికి వచ్చి యెంత మంచి పని చేశావు! మంచి దంపతుల్లాగా వుంటున్నారు వీళ్లు. మనం కాదమ్మా మంచి చెడ్డలు యెంచేవాళ్లం, భగవంతుడు. మరి బిర్యుజోవ్స్కీ, అవేన్యెవాని గుర్తు తెచ్చుకో... నికాన్ద్రొవ్, వసీల్యెవ్, మమొనొవాలు, లీజా నెప్తునోవాని గుర్తు తెచ్చుకో. ఆఖరికి యెవళ్లేనా వాళ్ల గురించి పల్లెత్తు ముక్క అన్నారా? చివర కొచ్చేటప్పటికి అందరూ మేం అంటే మేం అని వాళ్లకి అర్ఘ్య పాద్యాదులు యిచ్చారు. అదీ గాక c'est un intérieur si joli, si comme il faut. Tout-à-fait à l'anglaise. On se réunit le matin au breakfast et puis on se sépare.[1] సాయంత్రం భోజనాల దాకా యెవళ్ల పనులు వాళ్లు చేసుకుంటారు. ఏడు గంటలకి సాయంత్రం భోజనాలు. అబ్లొన్స్కీ నిన్ను పంపించి మంచి పని చేశాడు. వీళ్లతో సంబంధాలు తెంచుకోకూడదతను. వ్రాన్స్కీ తల్లిద్వారా, అన్నద్వారా చేయించుకోలేని పని లేదు. అంతేకాక అతను చాలా సత్కార్యాలు చేస్తున్నాడు. హాస్పిటల్ గురించి చెప్పాడా? Ce sera admirable[2] అన్నీ పారిస్‌నుంచి తెచ్చినవే."

---

[1] యింత ముచ్చటైన, పద్ధతిగా వున్న వాతావరణం. అచ్చం ఇంగ్లీషు పద్ధతి. పొద్దుట నాస్తా కోసం అందరూ కలుస్తారు, మళ్లీ యెవళ్ల మట్టుకి వాళ్లు పనులమీద వెళ్లిపోతారు (ఫ్రెంచి).

[2] చాలా ప్రశంసనీయమౌతుంది (ఫ్రెంచి).

ఆన్నా రాకతో ఆమె మాటలకి అడ్డు పడింది. ఆమె బిలియర్డ్ రూమ్‌లో మగవాళ్లని పట్టుకుని తీసుకు వచ్చింది. భోజనాలకి యింకా వేళ వుంది. వాతావరణం బాగా వుంది. దాంతో ఆ మిగిలిన రెండు గంటలూ గడపడానికి రకరకాల సూచనలు వచ్చేయి. వాజ్‌డ్వీజెన్‌స్కాయె గ్రామంలో కాలక్షేపం జరిపించడానికి అనేక పద్ధతులున్నాయి. అన్నీ పొక్రోవ్‌స్కాయెలో కంటే భిన్నంగా వుండేవే.

"Une partie de lawn tennis[1]" అని కమ్మగా చిరునవ్వు నవ్వుతూ అన్నాడు వెస్లోవ్‌స్కీ. "మీరూ నేనూ కలిసి వుంటాం ఆన్నాగారూ" అన్నాడు.

"వద్దు, చాలా వేడిగా వుంది. కొంచెం సేపు షికారు వెళ్లి తర్వాత పడవలో వెళ్లడం బాగుంటుంది. దాలీగారు మన నది వొడ్డు చూస్తారు" అన్నాడు వ్రాన్‌స్కీ.

"నేను దేనికైనా తయారే" అన్నాడు స్వియాజ్‌స్కీ.

"అవును, దాలీకి కొంచెం సేపు షికారు వెళ్లడం బాగా వుంటుంది, యేమంటావ్, దాలీ? తర్వాత పడవలో వెడదాం" అంది ఆన్నా.

అందుకు అందరూ సరేనన్నారు. వెస్లోవ్‌స్కీ, తుష్కేవిచ్‌లు పడవని సిద్ధం చేసి, వీళ్ల కోసం చూస్తూ వుంటామని చెప్పి నది దగ్గరికి వెళ్లేరు.

ఆన్నా, స్వియాజ్‌స్కీ అలాగే దాలీ, వ్రాన్‌స్కీ — జంటలుగా తోటలో వెళ్లారు. దాలీ అపరిచిత వాతావరణంలో పడింది, అది ఆమెకి బెదురునీ, యిబ్బందినీ కలిగించింది. సూత్ర రీత్యా ఆమె ఆన్నా చేసిందాన్ని ఉచితం అని భావించడమే కాక దాన్ని సమర్థించింది కూడా. నైతికంగా సర్వవిధాలా దోషరహితంగా, సచ్ఛీలంగా వుండే మహిళలతో మామూలుగా జరిగే టట్టు — వాళ్లకా నైతిక జీవన వైవిధ్య రాహిత్యంతో విసుగ్గా వుంటుంది — దాలీ కూడా అక్రమ సంబంధాలని కేవలం క్షమించడమే కాదు, ఆన్నా పట్ల ఆమెకి అసూయగా కూడా వుంది. యిది కాకుండా ఆమెకి ఆన్నా అంటే ఆప్యాయత వుంది. కాని యదార్థానికి ఆన్నాకి అన్ని విధాలా పరాయి వాళ్లైన జనం మధ్యలో ఆమెని చూడ్డం, ఉచితానుచితాల పట్ల వాళ్ల దృష్టికోణాలు తనకి కొత్త కావడం దాలీకి కొంచెం అసౌకర్యంగా అనిపించింది. ప్రిన్సెస్ వర్వారా అంటే ఆమెకి ముఖ్యంగా అనిష్టంగా వుంది, ప్రిన్సెస్ వర్వారా యిక్కడ తనకి సుఖంగా కాలక్షేపం జరిపించుకుందుగ్గాను అన్నిట్నీ క్షమించే మొగ్గు చూపిస్తోంది.

సామాన్యంగా, సూత్ర రీత్యా దాలీ ఆన్నా చేసిన పనిని సమర్థించింది. కాని యే వ్యక్తి కోసం అలా చేసిందో ఆ వ్యక్తి దాలీకి అనిష్టంగా వున్నాడు. ఆమెకి వ్రాన్‌స్కీ అంటే యెప్పుడూ యిష్టం లేదు. అతనికి గర్వం అని ఆమె భావన, డబ్బు తప్ప వేరే యేదీ గర్వపడ దగ్గది అతనిలో లేకపోయినా. కాని తన యిచ్ఛకి వ్యతిరేకంగా అతను యిక్కడ, తన యింట్లో, ముందటి కంటే యెక్కువ ప్రభావితం చేస్తున్నాడు. దాలీ అతనితో పాయిలా పాయిలాగా

---

[1] లాన్ టెన్నిస్ వో ఆట ఆడచ్చు (ఫ్రెంచి).

వుండలేకపోతోంది. తన నైట్ గౌను చూసి షోకిలా పనిమనిషి ముందు కలిగినలాంటి భావం అతని ముందు ఆమెకి కలుగుతోంది. పనిమనిషి ముందు మాసికల కారణంగా సిగ్గు కలగడమే కాదు, యిబ్బంది అనిపించింది. అలాగే వ్రాన్స్కీ ముందు ఆమెకి తన పట్ల తెగని సిగ్గు కాదు, యిబ్బంది అనిపిస్తూ వుంది.

దాలీ యిబ్బంది పడుతూ, యెలా మాట మొదలెయ్యాలా వెతుకుతోంది. తన తోట, యిల్లు చాలా బాగా వున్నాయని పొగడ్డం గర్విష్ఠి కావడంవల్ల వ్రాన్స్కీకి నచ్చకపోవచ్చును. కాని చెప్పడానికి యిక అంతకంటే మంచి విషయం యేదీ దొరకక వాళ్ల యిల్లు తనకి బాగా నచ్చిందని ఆమె అతనికి చెప్పింది.

"అవును చక్కని పాత పద్ధతిలో కట్టిన అందమైన యిల్లు" అన్నాడు.

"సింహద్వారం దగ్గరున్న మళ్లు నాకు చాలా నచ్చేయి. అవి ముందునుంచీ అలానే వుండేవా?"

"ఓహ్, లేదు!" అన్నాడతను. అతని ముఖం సంతోషంతో వెలిగింది. "ఆ మళ్లని మీరు యీ వసంతరుతువులో చూసి వుండాల్సింది" అన్నాడు.

ఆ యింటినీ, తోటనీ అందంగా చెయ్యడానికి అనుసరించిన అనేక పద్ధతుల వివరాల పట్ల దాలీ దృష్టిని ఆకర్షించేందుకు మొదట సావధానంగా, తర్వాత ఉత్తేజం పుంజుకుంటూ వర్ణించడం మొదలుపెట్టేడు. తన ఎస్టేట్‌ని మెరుగు పరచడానికీ, శోభాయమానం చెయ్యడానికీ యెంతో కృషి చేసిన దానిమీదట దాన్ని గురించి కొత్త వ్యక్తికి గొప్ప చెప్పుకోవలసిన అవసరం వుందని వ్రాన్స్కీ భావించినట్టు తెలుస్తూనే వుంది. దాలీ పొగడ్త అతనికి సంతోషం కలిగించింది.

"హాస్పిటల్ చూడాలనుకుంటే, మీరు అలిసిపోకుండా వుంటే, దగ్గర్లోనే వుంది. వెడదామా?" అని, తను ఆమెని విసిగించడం లేదని ఖాయ పరచుకోవడానికి ఆమె ముఖంలోకి చూస్తూ, అన్నాడు.

"ఆన్నా, వస్తావా?" అని అడిగేడు.

"అలాగే, వెడదాం, ఆఁ" అని ఆమె స్వియాజ్‌స్కీని అడిగింది. "Mais il ne faut pas laisser le pauvre వెస్లోవ్‌స్కీ et తుష్కేవిచ్ se morfondre là dans le bateau.[1] వాళ్లకి చెప్పేందుకు యెవళ్లనేనా పంపిద్దాం. యిది తన జ్ఞాపకంగా అతనిక్కడ వదిలేసేటటు వంటిది" అని ఆన్నా దాలీకేసి తిరిగి హాస్పిటల్ గురించిన ప్రస్తావన వచ్చినప్పుడు కనిపించినలాంటి చిరునవ్వు పెదాలతో తిరిగి అంది.

"అబ్బ! యెంత పెద్ద పని!" అన్నాడు స్వియాజ్‌స్కీ. వ్రాన్స్కీకి తను అతుక్కు

---

[1] కాని పాపం వెస్లోవ్‌స్కీ తుష్కేవిచ్‌లని బోటు దగ్గర యెదురు చూస్తూ వుండనివ్వడం బాగోదు (ఫ్రెంచి).

పోయినట్టు కనిపించకుండా వుండాలన్నట్టు అప్పటికప్పుడు విమర్శనాత్మక వ్యాఖ్య కూడా జోడించాడు. "కాని వో విషయం నాకు ఆశ్చర్యం కలిగిస్తోంది, కౌంట్. ప్రజల ఆరోగ్యం కోసం యింత చేస్తూ వున్న మీరు పాఠశాలల గురించి యేం పట్టించుకోకపోవడం" అన్నాడు.

"C'est devenu tellement commun les écoles[1]" అన్నాడు వ్రాన్‌స్కీ. "కాని కారణం అది కాదనుకోండి. ప్రస్తుతం నేను యిందులో మునిగిపోయి వున్నాను. హాస్పిటల్‌కి యిటు" అని పక్క దారి చూపిస్తూ దాలీతో అన్నాడు.

ఆడవాళ్లు గొడుగులు విప్పి పక్క దారిలోకి మళ్లేరు. వాళ్లు కొంచెం దూరం నడిచి, వో తోట గేటు గుండా వెళ్లేటప్పటికి దాలీకి యెదర యెత్తైన ప్రదేశంమీద పెద్ద యెర్ర రంగు భవనం కనిపించింది. అది షోగ్గా వుంది. దాదాపు పూర్తయింది. యింకా రంగులు పూర్తిగా వెయ్యని ఇనప కప్పు యెండలో కళ్లు బైర్లు కమ్మేటట్టు ప్రకాశిస్తోంది. దాని పక్కనే మరో భవనం లేస్తోంది. దానికి యింకా పరంజా వుంది. ఆ పరంజామీద ఆప్రన్‌లు వేసుకున్న పనివాళ్లు యిటికలు పెట్టి, సున్నం వేసి తాపీలతో సమతలంగా చేస్తున్నారు.

"యెంత చురుగ్గా పని జరిపిస్తున్నారు!" అన్నాడు స్వియాజ్‌స్కీ. "కితం సారి నేనిక్కడకు వచ్చినప్పుడు యింకా కప్పు పడలేదు" అన్నాడు.

"ఆకురాలు కాలంనాటికి అంతా పూర్తవుతుంది. లోపల అంతా రంగులు వెయ్యడం, అలంకరించడం దాదాపు పూర్తయినట్లే" అంది అన్నా.

"ఆ కొత్త భవనం యేమిటి?"

"అది డాక్టరుగారి యిల్లు, మందుల షాపు" అన్నాడు వ్రాన్‌స్కీ. చిన్న కోటు తొడుక్కున్న వాస్తుశిల్పి వస్తూ వుండడం చూసి ఆడవాళ్లతో మరేం అనుకోవద్దని చెప్పి అతను వాస్తుశిల్పి దగ్గరికి వెళ్లేడు.

అతను సున్నం కలిపిన కళ్లం దగ్గరికి వెళ్లేడు. పనివాళ్లు అక్కణ్ణుంచి సున్నం తీస్తున్నారు. వాస్తుశిల్పి దగ్గరికి వెళ్లి పెద్ద గొంతుకతో యేదో మాట్లాడ్డం మొదలుపెట్టేడు.

యేమిటి విషయం అని అడిగిన అన్నాకి "పై భాగం కిందికే వుంటుంది" అని జవాబుగా అన్నాడు.

"పునాదులు లేపాలని చెప్పనే చెప్పాను" అంది అన్నా.

"అలా చేసి వుంటే బాగా వుండేది అన్నాగారూ, కాని యిప్పుడు మించిపోయింది" అన్నాడు వాస్తుశిల్పి.

"నాకు యిందులో ఆసక్తి వుంది" అని అన్నా, తన వాస్తుశిల్ప పరిజ్ఞానానికి ఆశ్చర్యపోయిన స్వియాజ్‌స్కీతో అంది. "కొత్త భవనం అచ్చం హాస్పిటల్ భవనం లాగా వుండాలి. కాని యీ ఉద్దేశం తర్వాత తట్టింది, ముందేమీ అనుకోకుండానే దీన్ని మొదలెట్టాం" అంది.

---

[1] పాఠశాలలు చాలా సాదా విషయం అయిపోయేయి (ఫ్రెంచి).

వాస్తుశిల్పితో మాట్లాడ్డం అయేక వ్రాన్‌స్కీ తిరిగి ఆడవాళ్ల దగ్గరికి వచ్చి, హాస్పిటల్ లోపలికి తీసికెళ్లాడు.

బయట స్తంభాలమీద నగిషీ పీతాలు చెక్కుతున్నారు. కింది భాగంలో యింకా రంగులు వేస్తున్నారు. కాని పై భాగంలో అంతా పూర్తయింది. విశాలమైన యినప మేడ మెట్లు యెక్కి పెద్ద గదిలోకి వెళ్లారు వాళ్లు. గోడలకి చలవరాతి మాదిరిగా వుండే గిలాబా చేశారు. పెద్ద కిటికీలకి గాజు పలకలు అమర్చేరు. చెక్కపలకల నేల మాత్రం యింకా పూర్తవలేదు. నలుచదరపు గట్టి చెక్క పలకని చిత్రిక పడుతూ వున్న వడ్రంగం వాళ్లు పని ఆపు చేసి, కళ్లమీద పడకుండా జుట్టుకి కట్టుకున్న తాటిని విప్పి, వచ్చిన గొప్ప వాళ్లకి అభివాదం చేశారు.

''యిది కన్సల్టింగ్ రూమ్. యిందులో డెస్కు, టేబిలు, కేబినెట్ వుంటాయంతే'' అన్నాడు వ్రాన్‌స్కీ.

''యిటు రండి, యిటు. కిటికీ దగ్గరకంటూ వెళ్లద్దు'' అని అన్నా, రంగు ఆరిందో లేదో చూడ్డానికి కలపని తాకుతూ అంది. ''అలెక్సేయ్ రంగు ఆరింది'' అని అంది.

కన్సల్టింగ్ రూమ్‌లోనుంచి వసారాలోకి వెళ్లారు. అక్కడ వ్రాన్‌స్కీ గాలి వచ్చే కొత్త పద్ధతుల్ని చూపించేడు. తర్వాత చలవరాతి స్నానాల గదుల్ని, అద్భుతమైన స్ప్రింగులున్న పడకల్ని చూపించేడు. వొక వార్డులోనుంచి యింకో వార్డులోకి తీసికెళ్లేడు. స్టోర్ రూమ్ తెరిచి చూపించేడు. బట్టలు వుంచుకునే గది, కొత్త నమూనా పొయ్యిలు, వసారాలోనుంచి చప్పుడు లేకుండా పదార్థాలని తీసుకెళ్లే బళ్లు, యింకా అనేక యితర విశేషాలు చూపించేడు. ఆధునిక సౌకర్యాలు తెలిసిన మనిషవడం చేత స్వియాజ్‌స్కీ అక్కడున్న దాన్నంతట్నీ మెచ్చుకున్నాడు. ఆ కొత్తదనం అంతా చూసి దాలీ తల మునకలైపోయింది, తెలుసుకోవాలన్న ఆతృతతో ప్రతిదాన్ని గురించీ వివరాలు అడిగింది. వ్రాన్‌స్కీ సంతోషం కనబరుస్తూ అన్ని వివరాలూ చెప్పేడు.

''అన్ని రకాలుగానూ సరిగా తీర్చిదిద్దిన హాస్పిటల్ రష్యాలో యిదేనేమో'' అన్నాడు స్వియాజ్‌స్కీ.

''ప్రసూతి విభాగం లేదా?'' అని అడిగింది దాలీ. ''పల్లెల్లో అది చాలా అవసరం. నేను తరచుగా...''

మామూలుగా మర్యాదపూర్వకంగా వుంటూ వుండే వ్రాన్‌స్కీ దాలీ మాటకి అడ్డం వెళ్లేడు.

''యిది ప్రసూతి భవనం కాదు, హాస్పిటల్. అంటు వ్యాధుల వాళ్లు తప్పిస్తే అన్ని రకాల రోగులకీ యిక్కడ చికిత్స జరుగుతుంది'' అన్నాడు. ''యిదిగో, చూడండి'' అంటూ అతను కోలుకునే రోగుల అవసరార్థం విదేశాలనుంచి తెప్పించిన చక్రాల బండిని దాలీ దగ్గరికి తోసుకు వచ్చేడు. ''చూడండి'' అంటూ అందులో కూర్చుని తొయ్యడం మొదలు

పెట్టేడు. "రోగి నడవలేకపోవచ్చు, యింకా చాలా నీరసంగా వుండచ్చు లేదా కాళ్లు అస్వస్థతగా వుండచ్చు. కాని రోగికి తాజా గాలి కావాలి. దీంట్లో కూచుని తోసుకుంటూ అవతలకి వెళ్లచ్చు" అన్నాడు.

దాలీకి ప్రతిదీ ఆసక్తిగానే వుంది, ప్రతిదీ ఆమెకి సంతోషకరంగానే వుంది. కాని అన్నిటి కంటే యెక్కువగా ఆమెకి వ్రాన్స్కీ, యెంతో సహజంగా, నిష్కపటంగా ఉత్సాహభరితంగా వున్న వ్రాన్స్కీ, మనసుకి హత్తుకున్నాడు. 'ఆఁ, యితను యెంతో మంచి వాడు, ప్రేమాస్పదుడు' అని అతను మాట్లాడుతూ వుంటే, మధ్య మధ్య వినకుండా, అతని ముఖభంగిమల మార్పు గమనిస్తూ, తనని అన్నా స్థానంలో వూహించుకుంటూ తనలో తను అనుకొంది. అంత ఉత్సాహంతో వున్న అతను ఆమెకి చాలా బాగా కనిపించేడు, అన్నా యెలా అతన్ని ప్రేమించిందో ఆమెకి అర్థమైంది.

## 21

"వద్దు, దాలీగారు అలిసిపోయారని నాకనిపిస్తోంది, గుర్రాల పట్ల ఆసక్తి వుండక పోవచ్చు" అన్నాడు వ్రాన్స్కీ. అన్నా గుర్రాల శాలకి వెడదామంది. అక్కడ స్వియాజ్‌స్కీ కొత్త గుర్రాన్ని చూడాలనుకున్నాడు. ఆ మాటమీద వ్రాన్స్కీ అలా జవాబిచ్చేడు. "మీరిద్దరూ వెళ్లండి. నేను ఆవిడ్ని యింటికి తీసుకెడతాను, మేం కబుర్లు చెప్పుకుంటూ వుంటాం. అంటే" అని దాలీకేసి తిరిగి "మీకిష్టం అయితేనే" అన్నాడు.

"నాకు గుర్రాల గురించి యేమీ తెలీదు, మీ కబుర్లే నాకు చాలా సంతోషంగా వుంటాయి" అని దాలీ కొంచెం తబ్బిబ్బయి అంది.

వ్రాన్స్కీ ముఖం చూసి అతను తనకి యేదో చెప్పాలనుకుంటున్నాడని గ్రహించింది. ఆమె పొరపాటు పడలేదు. వాళ్లు గేటు దాటి, మళ్లీ తోటలోకి రాగానే అతను అన్నా వెళ్లిన దిశకేసి చూశేడు. తమ మాటలు వినబడవు, తాము దూరంగా వుండి కనబడరు అని ఖాయపర్చుకున్నాక అతను మొదలుపెట్టేడు.

"నాకు మీతో మాట్లాడాలని వుందన్న విషయం కనిపెట్టారనుకుంటాను?" అని నవ్వే కళ్లతో దాలీకేసి చూస్తూ అన్నాడు. "మీరు అన్నాకి నిజమైన స్నేహితురాలన్న మాట అబద్ధం కాదనుకుంటాను, యేమంటారు?" అని అతను టోపీ తీసేసి, జుట్టు పలచబడుతూ వున్న తలని తుడుచుకున్నాడు.

దాలీ యేం జవాబు చెప్పకుండా ఆగి ఆగి అతనికేసి భయంగా చూసింది. అతనితో వొంటరిగా వుండడంతో హఠాత్తుగా ఆమెలో భయం కలిగింది. అతని నవ్వే కళ్లు, కఠోర ముఖ ముద్ర ఆమెకి భయం కలిగించేయి.

వ్రాన్స్కీ తనతో యేం చెప్పదలచుకున్నాడో వాటి గురించిన రకరకాల వూహలు ఆమె

బుర్రలో తిరిగేయి. 'పిల్లల్ని తీసుకువచ్చి వేసవి కాలం తమతో వుండమంటాడేమో, నేను కాదనాల్సి వస్తుంది. లేకపోతే మాస్కోలో ఆన్నాతో కలిసి మెలిసి తిరిగే వాళ్లని చూడమం టాడేమో... లేకపోతే వెస్లోవ్స్కీతో ఆన్నా సంబంధాల గురించి మాట్లాడతాడేమో? యేమో కిట్టీ గురించీ ప్రస్తావించవచ్చు, ఆమెకి తను అన్యాయం చేశానన్న భావం వుందేమో?' అని దాలీ అన్ని రకాల అప్రియ విషయాల గురించీ వూహించుకుంది గాని వ్రాన్‌స్కీ తనతో యేం చెప్పదలచుకున్నాడో దాన్ని వూహించలేకపోయింది.

"ఆన్నాకి మీరంటే యెంతో గురి, ఆమెకి మీరంటే చాలా యిష్టం అంచేత నాకో సాయం చెయ్యమని అడుగుతున్నాను" అన్నాడు వ్రాన్‌స్కీ.

దాలీ యేమిటన్నట్టు బెరుకుతో వ్రాన్‌స్కీ ఓజపూర్ణ వదనంకేసి చూసింది. వ్రాన్‌స్కీ ముఖం లిండెన్ వృక్షాల ఆకుల మధ్యనుంచి పడ్డ యెండకి వో సారి పూర్తిగానూ, వో సారి పాక్షికంగానూ వెలిగింది. వ్రాన్‌స్కీ యేం చెపుతాడో అని ఆమె యెదురు చూసింది. కాని అతను మాట్లాడకుండా ఆమె పక్కనే, నేలపైన రాళ్లమీద కర్ర తాటిస్తూ, నడిచేడు.

"ఆన్నా పాత నేస్తాల్లో మీరు వొక్కరే — నేను ప్రిన్సెస్ వర్వారాని లెక్క పెట్టడం లేదు — ఆన్నాని చూడ్డానికి వచ్చారంటే నేననుకోవడం మా స్థితిని మామూలుగా వుందని భావించి కాక, ఆమెకి యీ స్థితి యెంత కష్టంగా వుందో తెలిసి కూడా ఆమెని అభిమానిస్తూ ఆమెకి సాయం పడాలనుకోవడమే కారణం. యేమంటారు?" అని ఆమెకేసి చూస్తూ అడిగేడు.

"ఆఁ, అంతే" అని దాలీ గొడుగు మూసేస్తూ అంది. "కాని..."

"ఆగండి" అతనామెకి అడ్డం వెళ్లేడు. దాలీని యిబ్బందికరమైన పరిస్థితిలో పడే స్తున్నానని మరిచిపోయి ఆగేడు. దాలీ కూడా ఆగాల్సి వచ్చింది. "ఆన్నా పరిస్థితిలో వున్న కష్టానికి నాకంటే యెక్కువ తీవ్రంగా బాధపడేవాళ్లు వుండరు. నన్ను హృదయం వున్న వ్యక్తిగా మీరు మన్నించినట్లయితే యీ విషయం మీకు అర్థం అవుతుంది. ఆమె యీ పరి స్థితిలో పడడానికి నాదే బాధ్యత, అందుకనే నేనంత తీవ్రంగా బాధపడుతున్నాను" అన్నాడు.

"నాకిది అర్థమవుతుంది" అంది దాలీ. వ్రాన్‌స్కీ యీ మాటల్ని యెంతో మనస్ఫూ ర్తిగా, దృఢంగా అన్నాడు. అది ఆమె అప్రయత్నంగా మనసుకి హత్తుకుంది. "కాని మీరు దీనికి కారణం కావడంవల్ల దీన్ని గోరంతలు కొండంతలు చేసి చెప్తున్నారేమోనని నాకు భయంగా వుంది. సమాజంలో ఆన్నా పరిస్థితి గడ్డుగా వుంది, ఆ విషయం నాకు తెలుసు" అంది.

"సమాజంలో నరక ప్రాయంగా వుంది" అని అతను ముఖం ముడుచుకుంటూ గబగబా అన్నాడు. "పీటర్స్‌బుర్గ్‌లో ఆమె వున్న రెండు వారాల్లో ఆమె అనుభవించిన ఘోర నరకం కంటే అధ్వాన్న స్థితిని వూహించుకోలేం... నా మాట నమ్ముతారనుకుంటాను."

"కాని యిక్కడ, మీరు ఆన్నా... అంటే నా ఉద్దేశం సమాజం అవసరం వుండదు అని..."

''సమాజం!'' అని వ్రాన్‌స్కీ చీదరింపుగా అన్నాడు. ''నాకు సమాజం అవసరం యేం వుంది...''

''అప్పటిదాకా, అలా యెప్పటికేనా జరగచ్చు, మీరు సంతోషంగా మనశ్శాంతిగా వుండచ్చు. ఆన్నా సంతోషంగా వుంది, నేను చూస్తున్నాను కదా, నిజంగా ఆనందంగా వుంది, నాకా విషయం చెప్పింది'' అని దాలీ చిరునవ్వు నవ్వుతూ అంది. అలా అంటూనే తనకి తెలియకుండానే ఆమె మనసులో నిజంగా ఆన్నా సంతోషంగా వుందా అన్న సందేహం కలిగింది.

కాని వ్రాన్‌స్కీకి ఆ విషయమై యే సందేహమూ లేనట్టే కనిపించింది.

''అవునవును!'' అన్నాడతను. ''ఆ యాతనంతటి తర్వాతా ఆమె కోలుకున్నట్టే వుంది. ఆమె సంతోషంగా వుంది. ప్రస్తుతంలో సంతోషంగా వుంది. కాని నాకు?... మాకు ముందు యేం జరగబోతోందో అన్న భయం వుంది... అయ్యో, మన్నించండి, నడుస్తారా?'' అన్నాడు.

''లేదు, నాకెలాగైనా ఫరవాలేదు.''

''అయితే యిక్కడ కూర్చుందాం.''

దాలీ తోట దారి మలుపులో వో బెంచీమీద కూర్చుంది. అతను ఆమె ముందు నుంచున్నాడు.

''ఆమె చాలా సంతోషంగా వున్నట్టే నాకనిపిస్తోంది'' అని అతను రెట్టించాడు. ఆన్నా నిజంగా సంతోషంగా వుందా లేదా అనే సందేహం దాలీకి ముందటి కంటే యెక్కువ కలిగింది. ''కాని యీ పరిస్థితిని యిలానే వుంచగలగడం సాధ్యమా అని. మేం చేసింది తప్పో వొప్పో అనేది వేరే సంగతి. కాని బరిలోకి దూకేశాం'' అని రష్యన్‌నుంచి ఫ్రెంచిలోకి మారుతూ అన్నాడతను. ''మేం జీవితాంతం బంధితులమయాం. మేం అత్యంత పవిత్రమైన దాంతో బంధితులం అయేం — ప్రేమ బంధంతో. మాకో బిడ్డ వుంది, యింకా పిల్లలు పుట్టచ్చు. కాని చట్టమూ, మా మొత్తం పరిస్థితీ సవాలక్ష చిక్కులకి దారి తీస్తాయి. యిప్పుడు తన పరీక్షలనుంచీ, బాధలనుంచీ బయటపడి మనశ్శాంతిగా వుండడంలో ఆమె ప్రస్తుతంలో వాటిని చూడడం లేదు, చూడదలచుకోలేదు. ఆ విషయం అర్థం చేసుకోవచ్చు. కాని నేను కళ్లు మూసుకోలేను. నా కూతురు చట్ట ప్రకారం నా కూతురు కాదు, కరేనిన్ కూతురు. యిలాంటి అబద్ధాన్ని నేను సహించను'' అని బలంగా లేదు లేదు అనే సూచన చేస్తున్నట్టు కనిపించేడు. తర్వాత మబ్బుగా, ప్రశ్నార్థకంగా దాలీకేసి చూశేడు.

ఆమె యేమీ బదులు చెప్పకుండా అతని వేపు చూసింది. వ్రాన్‌స్కీ చెప్పసాగేడు.

''రేపు కొడుకు పుట్టచ్చు. నా కొడుకు, కాని చట్ట ప్రకారం కరేనిన్ కొడుకవుతాడు. నా పేరుకీ, నా ఆస్తికీ వారసుడు కాడు. మా సంసార జీవితం యెంత ఆనందంగానేనా వుండనీయండి, మాకు యెంతమంది పిల్లలేనా వుండనీయండి వాళ్లకీ నాకూ మధ్య బంధం

వుండదు. వాళ్ళు కరేనిన్‌కి చెందిన వాళ్ళు. యీ పరిస్థితి యెంత గడ్డుగా, ఘోరంగా వుం టుందో మీరు వూహించండి! యీ విషయం గురించి అన్నాతో ప్రస్తావించ చూశేను. ఆమె వూరికే చిరాకు పడుతుందంతే. ఆమె అర్థం చేసుకోదు, ఆమెతో నేను అన్ని విషయాలూ చెప్పలేను. యిప్పుడీ విషయాన్ని మరో వేపునుంచి చూద్దాం. ఆమె ప్రేమ నాకు ఆనందం గానే వుంది, కాని నాకో వ్యావృత్తి వుండాలి కదా. నేను దాన్ని చూసుకున్నాను, నాకు అదంటే గొప్పగానూ వుంది. యిది నా పూర్వం దర్బారు మిత్రుల కంటే, సైన్యం కొలువుకంటే యెక్కువ ఉచితమైన వ్యావృత్తిగానే వుంది నాకు. వాళ్ళు చేసే దానికోసం నేను చేస్తూ వున్న దాన్ని యేమైనా వదులుకోను. నేనిక్కడే వుండి నా పని చేస్తున్నాను, చాలా సంతో షంగా వున్నాను, సంతృప్తిగా వున్నాను. మాకు సంతోషం కలగడానికి యింతకంటే యేమీ అక్కర్లేదు. యీ బాపతు పని నాకు ఆనందంగా వుంది. Cela n'est pas un pis-aller.[1] సంగతి యిందుకు విరుద్ధం..."

అతను విషయం స్పష్ట పరచబోయి కొంచెం గజిబిజి పడిపోయాడని దాలీ గ్రహించింది. తను అతని విషయాంతర ప్రస్తావనని అర్థం చేసుకోలేదు. కాని తన అంతరంగంలో వున్న వూహల్ని, అన్నాకి కూడా అతను చెప్పలేని వూహల్ని, చెప్పడం మొదలు పెట్టినప్పుడు అన్ని విషయాలూ చెప్తున్నాడు, అన్నాతో అతని సంబంధాల సమస్యలాగా వూళ్ళో అతను చేస్తున్న కార్యకలాపాలు అతని ఆంతరంగిక భావాలలో భాగం.

"నేను యింకా చెప్పాల్సి వుంది" అని వ్రాన్‌స్కీ సంబాళించుకుని అన్నాడు. "నేను పని చేస్తూ వుంటే నేను చేసే పని నాతో అంతరించకూడదని నాకు అనిపించాలి. నా తర్వాతి వాళ్ళకి సంక్రమించాలి – కాని నాకు సంబంధించి అలా జరగడం లేదు. తన బిడ్డలు, తను ప్రేమించిన స్త్రీకి పుట్టిన బిడ్డలు తనకి కాకుండా మరో మనిషికి, వాళ్ళని అసహ్యించుకునే మనిషికి వాళ్ళతో యే సంబంధమూ లేదనుకున్న వ్యక్తికి చెందుతారంటే కన్న తండ్రి పరి స్థితి యెలా వుంటుందంటారు? యింతకంటే అఘోరమైంది వుంటుందంటారా?"

అతను చాలా ఉద్వేగ పడి ఆగేడు.

"అవును, యిది స్పష్టంగానే వుంది, నాకీ విషయం అర్థం అవుతుంది. కాని అన్నా యేం చెయ్యగలుగుతుంది?" అని దాలీ అడిగింది.

"మీరలా అడగడమే నా సంభాషణ ఉద్దేశ్యం" అని క్రమాంతరంమీద వడి తగ్గించు కుంటూ అన్నాడతను. "అన్నా చెయ్యగలదు, యిది ఆమెమీదే ఆధారపడి వుంది... దత్తత చేసుకోవడం కోసం జార్‌ని అభ్యర్థించాలన్నా విడాకులు కావాలి. అది అన్నామీదనే ఆధారపడి వుంది. ఆమె భర్త విడాకులకి వొప్పుకున్నాడు. వొకప్పుడు మీ ఆయన అందుకు యేర్పాటు కూడా చేశాడు. యిప్పుడు ఆయన వెనకాడతాడనుకోను. ఆమె వూరికే ఆయనకి

[1] యింతకంటే మంచిదైన రెండోది లేదు కాబట్టి కాదు (ఫ్రెంచి).

రాస్తే చాలు. ఆమె గనక కోరితే తను కాదనననీ ఆయన అప్పుడు చెప్పనే చెప్పాడు. యిదీ క్రూరమైన కోరిక" అని అతను విచారంగా అన్నాడు, "హృదయంలేని కపటులే వ్యక్తం చెయ్యగలరనుకోండి. తన జ్ఞాపకమే ఆమెకి మహా యాతనాకారకం అవుతుందని తెలిసీ, అన్నాని బాగా యెరిగి వుండీ ఆయన ఆమెనుంచి ఉత్తరం కావాలంటున్నాడు. యిది యెంత బాధాకరమో నాకు తెలుసు. కాని ఫలితం యెంత మహత్తరమైందో అంటే passer par-dessus toutes ces finesses de sentiment. Il y va du bonheur et de l'existence d'Anne et de ses enfants.[1] నా విషయం గురించి నే చెప్పడం లేదు, నాకు కష్టంగా వున్నా, చెప్పలేనంత కష్టంగా వున్నా" అని అతను తనకి కష్టం కలిగించేవాళ్లు యెవరైనా వాళ్లని బెదిరిస్తూ వున్నట్టు చూసే చూపుతో "అందుకనే, ప్రిన్సెస్, మీరే దిక్కన్నట్టు మీ చేతిని పట్టుకుంటున్నాను. ఆమె విడాకులు అడుగుతూ ఉత్తరం రాసేటట్టు నాకు సాయం చెయ్యండి" అన్నాడు.

"ప్రయత్నిస్తాను" అని దాలీ ఆలోచనామగ్నంగా అంది. తనూ కరేనిన్ ఆఖరు సారి మాట్లాడుకున్న సందర్భం ఆమె మనసు ముందు ప్రత్యక్షమైంది. "అలాగే, చేస్తాను" అని నిశ్చయంగా అంది, అన్నా గురించి ఆలోచిస్తూ.

"ఆమెకి మీమీద గల గురిని ఉపయోగించండి. ఆమె రాసేటట్టు వొత్తిడి చెయ్యండి. ఆమెతో యీ విషయం గురించి మాట్లాడలేను, అందుకు నాకసలు శక్తి లేదు."

"సరే, ఆమెతో మాట్లాడతాను. కాని యీ విషయాన్ని ఆమె యెందుకు చూడడం లేదు?" అని దాలీ, హఠాత్తుగా అన్నా వింతగా కనిపించేటట్టు కళ్లు ముడిచే తీరు గుర్తు చేసుకుంటూ అంది. అన్నా తన జీవిత అంతరంగ విషయాల గురించి ఆలోచించుకుంటు న్నప్పుడే అలా కళ్లు ముడుస్తుందని ఆమెకి గుర్తు వచ్చింది. 'జీవితాన్ని చూడకుండా తన కళ్లని ముడుచుకుంటోందేమో' అనుకుంది దాలీ. "నేను తప్పకుండా ఆమెతో మాట్లాడతాను. నా కోసం ఆమె కోసం కూడా" అని అతని కృతజ్ఞతా పూర్వకమైన మాటలకి బదులుగా అంది.

వాళ్లు లేచి యింటికేసి వెళ్లారు.

## 22

అన్నా యింటికి తిరిగి వచ్చేక దాలీ తనకంటే ముందే తిరిగి వచ్చిందని తెలుసుకుని వ్రాన్‌స్కీతో యేం మాట్లాడిందో అన్నట్టు గుచ్చిగుచ్చి ఆమె కళ్లల్లోకి చూసింది. కాని మాటల్లో ఆ ప్రశ్నని అడగలేదు.

---

[1] మనోభావాల్లోని యీ సున్నితత్వాలనన్నిటినీ అధిగమించాలి. విషయం అన్నాకీ, ఆమె పిల్లలకీ వుండే సుఖ సౌభాగ్యాలు (ఫ్రెంచి).

"భోజనాల వేళ అయింది" అంది ఆన్నా. "మనం యింకా ఒకర్ని ఒకరు సరీగా చూసుకోనే లేదు. రాత్రి యెప్పుడవుతుందా అని చూస్తున్నాను. బట్టలు మార్చుకుంటాను. నువ్వూ బట్టలు మార్చుకోవూ. ఆ కడుతూ వున్న యిళ్ల దగ్గర మన బట్టలు దుమ్ము కొట్టుకుపోయాయి" అంది.

దాలీ తన గదికి వెళ్లింది. ఆమెకి దాదాపు నవ్వు వచ్చినంత పనైంది. ఆమె దగ్గర మార్చుకోవడానికి యేమీ లేదు. వున్న మంచి గౌను అప్పటికే తొడుక్కుంది. కాని భోజనాల బల్ల దగ్గర కూర్చునేందుకు తయారవుతున్నట్టు చూపించడానికి గౌను శుభ్రం చెయ్యమని పనిమనిషికి చెప్పింది. కొత్త కఫ్స్ వేసుకుని, కొత్త బౌ కట్టుకుని తలకి లేసురుమాలు చుట్టుకుంది.

"యిదే నేను చెయ్యగలిగింది, అంతే" అని దాలీ చిరునవ్వు నవ్వుతూ ఆన్నాతో అంది. ఆన్నా మూడో గౌను వేసుకుంది. యీ సారి కూడా అది చాలా నిరాడంబరంగా వుంది.

"ఆఁ, యిక్కడ చాలా అభిరుచులు చూపిస్తూ వుంటాం" అని తన శోభకి క్షమాపణ అడుగుతున్నట్టు అంది. "నువ్వు రావడం అలెక్సేయ్‌కి చాలా సంతోషాన్ని యిచ్చింది. అతనికీ మధ్య అంతటి సంతోషం యెక్కువగా కలగడం లేదు. ఖాయంగా అతనికి నువ్వంటే యిష్టం లాగే వుంది" అని జత చేసింది. "నువ్వు అలిసిపోలేదు కదా?" అని అడిగింది.

భోజనాలకి ముందు మాట్లాడుకునే వ్యవధి లేకపోయింది. డ్రాయింగు రూమ్‌లోకి వెళ్లేటప్పటికి ప్రిన్సెస్ వర్వారా అక్కడ వుంది. మగాళ్లు నల్ల కోట్లు తొడుకున్నారు. వాస్తుశిల్పి ఫ్రాక్ కోటు తొడుక్కున్నాడు. వ్రాన్‌స్కీ డాక్టరుకి, నిగామానుకి దాలీని పరిచయం చేశాడు. ఆమె వాస్తుశిల్పిని హాస్పిటల్ దగ్గర అంతకు ముందే కలుసుకుంది.

ఓ లావాటి బట్లరు వచ్చాడు. అతని ముఖం గుండ్రంగా వుంది. గడ్డం గీసుకున్నాడు. గంజిపెట్టిన టై కట్టుకున్నాడు. భోజనాలు వడ్డించేరని చెప్పేడు. ఆడవాళ్లు లేచారు. ఆన్నాకి చెయ్యి అందించమని వ్రాన్‌స్కీ స్వియాజ్‌స్కీకి చెప్పి తను దాలీ చెయ్యి పుచ్చుకున్నాడు. తుష్కేవిచ్ ప్రిన్సెస్ వర్వారాని పిలిచే లోపునే వెస్లోవ్‌స్కీ ఆమెని పిలిచేడు. తుష్కేవిచ్, నిగామాను, డాక్టరు భోజనాల గదిలోకి ఒంటరిగా వెళ్లాల్సి వచ్చింది.

భోజనం, భోజనాల గది, పింగాణీ సామాను, నౌకర్లు, వైన్లు, భోజన పదార్థాలు — అన్నీ ఆ యిల్లు వున్నంత నూతన సంపన్న వాతావరణంలో వుండడమే కాదు, అన్నిట్నీ మించిన నవీనతతో, పుష్కలత్వంతో భాసించేయి. తనకి నూతన ఐశ్వర్యంతో శోభిస్తూ వున్న వాటి నన్నిట్నీ దాలీ తదేకంగా చూస్తూనే వుంది. ఇంటి యజమానురాలిలాగా ప్రతీ వివరం మనసులో ముద్రించుకుంటూ వుంది, అక్కడ కనిపించే యే వస్తువునీ తన యింట్లో ప్రవేశ పెట్టే ఆశ లేకపోయినా. యేమంటే యిలాంటి వైభవం ఆమె జీవిత సరళికి మించింది. ఆమె మనసులో యెవళ్లు యెలా వాటిని సమకూర్చారు అనే ప్రశ్న వచ్చింది. వెస్లోవ్‌స్కీ, తన భర్త, స్వియాజ్‌స్కీ యింకా అలాంటి చాలా మంది తనకి తెలిసిన వాళ్లు యెవళ్లూ

యీ విషయం గురించి పట్టించుకోరు. ప్రతి యజమానీ తన యింట్లో వున్న ప్రతీదీ, యెంతో చక్కగా అమిరిన ప్రతీదీ, సునాయాసంగా దానంతట అదే సమకూరినట్టూ తన అతిథులు అలా నమ్మాలని ఆశిస్తున్నట్టు అనుకుంటారు. అయినా దాలీకి తెలుసు పిల్లల నాస్తాలోకి పారిడ్జ్ కూడా దానంతట అదే రాదని. ఆ విధంగానే యింత జటిలమైన, అద్భుతమైన యేర్పాటు అంటే దానిపట్ల యెవళ్లో యెక్కువ దృష్టి పెట్టే వుండాలి. భోజనాల బల్లకేసి వ్రాన్స్కీ చూసిన తీరుని బట్టీ, తల వూపి బట్లర్‌కి సూచన చేసిన తీరుని బట్టీ, బీట్ దుంపల చల్లని సూప్ తీసుకుంటారా, మాంసం సూప్ తీసుకుంటారా అని దాలీని అడిగిన తీరుని బట్టీ యిదంతా వ్రాన్స్కీ ఆలోచనల ఫలితమనీ పర్యవేక్షణా ఫలితమని దాలీ గ్రహించింది. ఆన్నా తన వంతుగా వెస్లోవ్‌స్కీ చేసినంత చేసి వుంటుందని స్పష్టంగా తెలుస్తూనే వుంది. ఆన్నా, స్వియాజ్‌స్కీ, ప్రిన్సెస్ వర్వారా, వెస్లోవ్‌స్కీలందరూ వొక్కలా చుట్టపు చూపుగా వచ్చిన వాళ్లే, యేది తమకి సమకూర్చినా సంతోషంతో గ్రహిస్తూ వుండేవాళ్లే.

సంభాషణ నడిపించడం మేరకే ఆన్నా యింటి యజమానురాలు. రకరకాల జీవిత పంథాల వాళ్లు — నిగామాను, వాస్తుశిల్పిలాంటి వాళ్లు — చేరిన యీ చిన్న బల్ల దగ్గర సంభాషణ నడిపించడం కష్టం. నిగామాను, వాస్తుశిల్పి యీ ఐశ్వర్యం చూసి బెదిరి పోకుండా వుండాలని ప్రయత్నిస్తున్నారు. యెక్కువ సేపు మామూలు సంభాషణలో పాల్గొలేకపోతున్నారు. ఆన్నా తన కర్తవ్యాన్ని స్వభావసిద్ధమైన నేర్పుతో, సహజత్వంతో, సంతోషంతో కూడా నిర్వహిస్తోందని దాలీ గమనించింది.

తుష్కేవిచ్, వెస్లోవ్‌స్కీలు యెలా పడవ నడిపారో అన్న విషయంమీదకి సంభాషణ మళ్లింది. అప్పుడు తుష్కేవిచ్ పీటర్స్‌బుర్గ్‌లో ఆఖరిగా జరిగిన పడవల పందెం గురించి చెప్పేడు. ఆన్నా వాస్తుశిల్పిని సంభాషణలోకి దించే అవకాశం కోసం చూసి అతన్ని పలకరించింది.

''స్వియాజ్‌స్కీగారూ ఆశ్చర్యపోయేరు'' అని ఆన్నా అంది, ''ఆయన కితం సారి వచ్చినప్పటికంటే పని యెంత చురుగ్గా సాగిందో చూసి. నా మట్టుకు నేను రోజూ చూస్తూనే వున్నాను అయినా పని యెంత చకచకా సాగుతోందో చూసి ఆశ్చర్యం అవుతూనే వుంది'' అంది.

''కౌంట్‌గారితో పని చెయ్యడం హాయి'' అని వాస్తుశిల్పి చిరునవ్వు నవ్వుతూ అన్నాడు (అతను తన సత్తా తెలిసిన వాడు, మంచీ మర్యాద తెలిసిన శాంత స్వభావుడు). ''స్థానిక అధికార్లతో పని చెయ్యడం కంటే చాలా తేడాగా వుంటుంది. పిసరు పని జరగాలంటే గుట్టల కొద్దీ కాగితాలు కదలాలి అక్కడ. కౌంట్‌గారికి అయితే నా సూచనలు యివీ అంటాను, వాటి గురించి చర్చించుకుంటాం, పని అయిపోతుంది'' అన్నాడు.

''అమెరికన్ పద్ధతులు'' అని స్వియాజ్‌స్కీ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

''అవును, అమెరికన్లు క్రమ పద్ధతితో కడతారు.''

తర్వాత సంభాషణ అమెరికాలో అధికార దుర్వినియోగం వేపు మళ్లింది. కాని నిగామాను మాట్లాడ్డం లేదని చూసి అన్నా కొత్త విషయాన్ని యెత్తింది.

''నువ్వెప్పుడేనా కోత యంత్రాన్ని చూశావా?'' అని దాలీని అడిగింది. ''నిన్ను కలుసుకునే ముందే వో యంత్రాన్ని చూసి వస్తున్నాం మేము. అలాంటి దాన్ని నేను యిదివరకు చూడలేదు'' అంది.

''యెలా పని చేస్తాయవి?'' అని దాలీ అడిగింది.

''కత్తెరల్లాగా. బోలెడు చిన్న కత్తెరలున్న పలక వుంటుంది. యిలాగా.''

అన్నా ఉంగరాలున్న ముచ్చటైన తెల్లని చేతులతో వో చాకునీ, ఫోర్కునీ తీసుకుని చూపించడం మొదలుపెట్టింది. తను చూపిస్తూ వున్న దానివల్ల యెవళ్లకీ యేమీ బోధపడలేదని తెలుస్తూనే వుంది. కాని తను ముచ్చటగా మాట్లాడుతున్నాననీ, తన చేతులు అందంగా వున్నాయనీ తెలిసే ఆమె ఆ వివరణ సాగించింది.

''కత్తెర్లకంటే యెక్కువగా పెన్‌నైవ్స్‌లా వుంటుందనడం బాగుంటుంది'' అని వెస్లోవ్‌స్కీ చూపు ఆమెమీదనే నిలిపి కొంటెగా చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

అన్నా కనిపించీ కనిపించకుండా వుండే మందహాసం చేసింది, యేమీ మాట్లాడలేదు.

''అవి కత్తెర్లల్లా వుండవూ? యేమంటారు?'' అని నిగామానుని అడిగింది.

"O ja" అని అతను జర్మన్‌లో జవాబు చెప్పేడు. "Es ist ein ganz einfaches Ding[1]" అంటూ ఆ యంత్ర నిర్మాణాన్ని గురించి వివరించడం మొదలుపెట్టేడు.

''అది మోపులు కట్టదు, బాగా లేదు. వియన్నా ప్రదర్శనలో చూశాను తీగతో మోపులు కూడా కడుతుంది. అలాంటిదైతే యింకా లాభం'' అన్నాడు స్వియాజ్‌స్కీ.

"Es kommt drauf an... Der Preis vom Draht muss ausgerechnet werden[2]" అని జర్మన్ కూడా మాట కలుపుతూ వ్రాన్‌స్కీ నుద్దేశించి చెప్పాడు. "Das lässt sich ausrechnen, Erlaucht[3]" అంటూ జర్మన్ జేబులో చెయ్యి పెట్టబోయేడు. జేబులో అతను పెన్సిల్, నోటు పుస్తకం వుంచుకుంటాడు. అందులో మొత్తం లెక్కలన్నీ వుంటాయి. కాని భోజనాల బల్ల దగ్గర కూర్చున్నాం అనీ, వ్రాన్‌స్కీ ఉదాసీనంగా వున్నాడనీ గ్రహించి ఉద్దేశం మార్చుకున్నాడు. "Zu complicirt, macht zu viel Klopot[4]" అని ఆఖర్న అన్నాడు.

---

1 అవునండీ, నిజంగా యిది చాలా సీదా సాదా యంత్రం (జర్మన్).

2 విషయం యేమంటే తీగ ధర లెక్కగట్టుకోవాలి (జర్మన్).

3 దీని లెక్కాచారం కలుపుకోవచ్చు, హుజూర్ (జర్మన్).

4 చాలా గొడవ, జంజాటం (జర్మన్).

"Wünscht man Dochots, so hat man auch Klopots[1]" అని వెస్లోవ్‌స్కీ జర్మన్ నిగామానుని అనుకరిస్తూ అన్నాడు. "J'adore l'allemand[2]" అని అతను ముందటి లాగా చిరునవ్వు నవ్వుతూ ఆన్నాతో అన్నాడు.

"Cessez[3]" అంటూ ఆన్నా కఠినంగా వున్నట్టు వేళాకోళంగా అంది.

"మిమ్మల్ని మైదానంలో కలుసుకుంటా మనుకున్నాము డాక్టరుగారూ" అని డాక్టర్‌తో అంది. ఆయన రోగిష్టి మనిషి. "మీరు అక్కడికి వచ్చేరా?" అని అడిగింది.

"నేనక్కడికి వచ్చేను, కాని గాలిలో యెగిరిపోయేను" అని డాక్టరు పరిహాసపూరితంగా కనిపించినా దిగులు గొంతుకతో అన్నాడు.

"అయితే మీకు మంచి వ్యాయామం అయివుంటుంది."

"మామూలుగానా!"

"ఆ ముసలావిడ వొంట్లో యెలా వుంది? ఆమెకి టైఫాయిడ్ కాదు కదా?"

"కాదు, కాని ఆమె దిగజారిపోయింది."

"అయ్యో పాపం!" అంది ఆన్నా. తమ దగ్గర పని చేసేవాళ్లపట్ల మర్యాదలు చూపించేసింది కాబట్టి తన మిత్రులపట్ల ఆసక్తి చూపించడం మొదలెట్టింది.

"మీరు చెప్పినట్టు యంత్రాన్ని నిర్మించడం కష్టం అనుకుంటా ఆన్నాగారూ" అన్నాడు స్వియాజ్‌స్కీ నవ్వుతూ.

"యెందుకనండోయ్?" అంది ఆన్నా చిరునవ్వుతో. తను యంత్ర నిర్మాణాన్ని వర్ణించిన తీరు స్వియాజ్‌స్కీకి ఆకర్షకంగా కనిపించింది యేదో వున్నట్టుందని ఆ చిరునవ్వు సూచించింది. ఆన్నాలో కన్నె పిల్లలాంటి యీ కొత్త చమక్కు చూసి దాలీకి విస్మయం కలిగింది.

"కాని ఆన్నాగారికి వాస్తుశిల్పం చాలా తెలుసు" అని తుష్కేవిచ్ అన్నాడు.

"అవును ఆవిడ నిన్న స్తంభాల అడుగు భాగాల గురించీ, పునాది పీఠాల గురించీ మాట్లాడేరు, కదా?" అన్నాడు వెస్లోవ్‌స్కీ.

"అదే పనిగా అవే చూస్తూ వుంటే అందులో ఆశ్చర్యం యేముంది? యిళ్లు వేటితో కడతారో కూడా మీకు తెలీదా యేమిటి?" అంది.

వెస్లోవ్‌స్కీ తనతో మాట్లాడేటప్పుడు పెట్టిన పరిహాస స్వరం ఆన్నాకి నచ్చలేదని, కాని తనకి తెలియకుండానే తనూ ఆ ధోరణిలో పడిందనీ దాలీ గమనించింది.

దీనికి సంబంధించి వ్రాన్‌స్కీ వైఖరి లేవిన్ వైఖరికి పూర్తి విరుద్ధంగా వుంటుంది.

---

[1] సంపాదనాపరుడికి జంజాటం వుంటుంది (జర్మన్).

[2] జర్మన్ భాషాభక్తుణ్ణి (ఫ్రెంచి).

[3] చాలు (ఫ్రెంచి).

అతను వెస్లొవ్‌స్కీ చతురోక్తులకి యే ప్రాముఖ్యమూ యివ్వలేదని తెలుస్తూనే వుంది. నిజానికి అతన్ని ప్రోత్సహిస్తూ వున్నట్టు కూడా వుంది.

"అయితే వెస్లొవ్‌స్కీగారూ, రాళ్లని దేంతో కలిపి పట్టుగా వుంచుతారు?"

"సిమెంట్‌తో కదా!"

"బావుంది, సిమెంట్ అంటే యేమిటి?"

"అది వో రకం బంక... కాదు, జిగురు" అని వెస్లొవ్‌స్కీ అందరూ నవ్వేటట్టు అన్నాడు.

డాక్టరు, వాస్తుశిల్పి, నిగామాను ముభావంగా ముడుచుకు కూర్చుని వుండడం తప్పిస్తే సంభాషణ అడ్డూ ఆపూ లేకుండా సాగింది. వొకో సారి సాఫీగా సాగింది, వొకో సారి వ్యక్తిగతం అయి గాయపరుస్తూ సాగింది. దాలీ వో సారి అలా కష్టపెట్టుకుని కుదుళ్లలోకంటా యెర్రబడుతూ కోపపడింది. తర్వాత, తను అనవసరంగా, అనిష్టకరమైన విషయాన్ని యేమన్నా అన్నానేమోనని, భయపడింది. స్వియాజ్‌స్కీ అంతకు ముందే యంత్రాల గురించి లేవిన్‌కి వున్న చిత్రమైన అభిప్రాయాల గురించీ, అవి రష్యా వ్యవసాయానికి అవరోధంగా వుంటాయనడం గురించీ ప్రస్తావించేడు.

"నాకు లేవిన్‌గార్ని కలుసుకునే అదృష్టం కలగలేదు" అని వ్రాన్‌స్కీ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. "కాని ఆయన తను తిట్టిపోసే యంత్రాల్ని యెన్నడూ చూసి వుండడని నా వూహ. వొక వేళ చూసి, వాటిని ఉపయోగ పెట్టుకున్నా అరకొరగానే అయివుండవచ్చు. మంచి రకమైన, విదేశీ యంత్రాలు కాదు, యేవో రష్యన్‌వి అయి వుండచ్చు. అలాంటప్పుడు యీ వైఖరిని యెలా విమర్శించగలడు?" అన్నాడు.

"టర్క్ వైఖరినుంచి అనచ్చు" అని వెస్లొవ్‌స్కీ అన్నాని ఉద్దేశించి చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"అతని వైఖరిని నేను సమర్థించలేను" అని దాలీ ఆవేశంగా అంది. "కాని అతను చాలా చదువుకున్న మనిషి. అతను యిక్కడ వుండి వుంటే మీకు మీ ధోరణిలో జవాబు చెప్పి వుండేవాడు. నాకా శక్తి లేదు" అంది.

"అతను నాకు చాలా యిష్టుడు. మేమిద్దరం మంచి స్నేహితులం" అని స్వియాజ్‌స్కీ హుషారుగా మందహాసం చేస్తూ అన్నాడు. "Mais pardon, il est un petit peu toqué.[1] ఉదాహరణకి జేమ్‌స్త్వొ సంస్థలు, రాజీ కోర్టులు* కూడా అవసరం లేదంటాడు, వాటిలో పాల్గోవడానికి తిరస్కరిస్తాడు" అన్నాడు.

"అది మన రష్యన్ ఉదాసీనత్వం" అని వ్రాన్‌స్కీ మంచు గడ్డలు వేసిన నీటిని సున్నితమైన కాడ వున్న గ్లాసులో పోస్తూ అన్నాడు. "మన హోదా యే కర్తవ్య నిర్వహణని మనకి నిర్దేశిస్తోందో దాన్ని గుర్తించకపోవడం, అందుకని యీ బాధ్యతల్ని తిట్టిపోయడం" అన్నాడు.

---

[1] కాని క్షమించండి, అతనొక విచిత్రమైన వ్యక్తి (ఫ్రెంచి).

"తమ కర్తవ్య నిర్వహణని అంతకంటే బాగా చేసేవాళ్లని నేను యెరగను" అని దాలీ, వ్రాన్‌స్కీ ఆధిక్యతా భావం చిర్రెత్తించి అంది.

"తద్భిన్నంగా నేను" అని వ్రాన్‌స్కీ ఆమె అన్న మాటకి యెందుకనో నొచ్చుకుంటూ అన్నాడు. "తద్భిన్నంగా నేను, న్యాయాధికారిగా యెన్నికయే గౌరవాన్ని నికొలాయ్ ఇవానొవిచ్" (స్వియాజ్‌స్కీని ఉద్దేశించి) "ధర్మమా అని పొందేను, కృతజ్ఞతలు. కచేరీకి హాజరు కావడం రైతులకీ గుర్రాలకీ సంబంధించిన తగూలు వినడం నేను చేసే అన్ని పనులంతటి గొప్ప గానూ భావిస్తున్నాను. జేమ్‌స్త్వొ సంస్థ సభ్యుడిగా యెన్నికవడం గౌరవంగా భావిస్తాను. భూస్వామిగా నేననుభవించే సౌకర్యాలకి కేవలం యీ మాదిరిగానే బదులు తీర్చుకోగలను. ప్రభుత్వంలో భూస్వాములు యెంతటి మహత్తర పాత్ర నిర్వహించగలరో దురదృష్టవశాత్తూ యెవళ్లూ గుర్తించడం లేదు" అన్నాడు.

తన యింట్లో తన భోజనాల బల్ల దగ్గర కూర్చుని తన భావాలు యెంత సహేతుకమైనవో మనో స్థైర్యంతో అతను చర్చించడం దాలీకి చిత్రంగా కనిపించింది. లెవిన్, వీటికి పరస్పర విరుద్ధంగా వుండే భావాల్ని అంతే మనోస్థైర్యంతో తన భోజనాల బల్ల దగ్గర కూర్చుని మాట్లాడతాడు. కాని ఆమెకి లేవిన్ అంటే యిష్టం, అందుకని అతని పక్షం వహించింది.

"అయితే కౌంట్ యీ సారి కచేరీలో మీరు పాల్గొంటారనుకుంటాను" అన్నాడు స్వియాజ్‌స్కీ. "కాని కొంచెం ముందుగా రండి, యెనిమిదో తారీకు నాటికి అక్కడ వుండే టట్టు. ముందు మా దగ్గరికి రండి, ఆ గౌరవం నాకు కలిగించండి" అన్నాడు.

"మీ మరిది అభిప్రాయాలని కొంత మేరకు వొప్పుకుంటాను" అంది అన్నా. "కాని వేరే కారణంగా" అని చిరునవ్వు నవ్వుతూ అంది. "యిక్కడ యీ సాంఘిక కార్యకలాపాలు యీ మధ్య మాకు కొంచెం యెక్కువైనట్టుంది. పూర్వం యెంతో మంది కార్యనిర్వాహకు లుండేవాళ్లు, ప్రతి విభాగానికీ వొకోళ్లు వుండాల్సి వచ్చేది. అలాగే యిప్పుడు ప్రజా ప్రముఖుల గురించీ చెప్పాల్సి వస్తోంది. అలెక్సేయ్ యిక్కడికి వచ్చి ఆరు నెల్లే అయింది. అప్పుడే అయిదారు ప్రజా సంస్థలకి ముడి పడిపోయేడు. ట్రస్టీ బోర్డు మెంబరు, న్యాయాధికారి, జేమ్‌స్త్వొ సంస్థ సభ్యుడు, జ్యూరీ సభ్యుడు, అశ్వసమితి సభ్యుడు అయేడు. Du train que cela va[1] అతని సమయం అంతా దీని కిందే పోతోంది. యిన్ని పనులు నెత్తిన పెట్టుకుంటే వొట్టి మొక్కుబడి అయిపోతుందేమోనని నా భయం. స్వియాజ్‌స్కీ గారూ మీరెన్ని సంస్థల్లో సభ్యులు?" అని అన్నా స్వియాజ్‌స్కీని అడిగింది. "యిరవై, పాతిక సంస్థల్లో సభ్యులేమో?" అంది.

అన్నా పరిహాస ధోరణిలోనే మాట్లాడింది కాని ఆమె గొంతుకలో చిరాకు కనిపించింది. అన్నానీ వ్రాన్‌స్కీనీ పట్టిపట్టి చూస్తూ వున్న దాలీ వెంటనే దాన్ని గమనించింది. ఈ సం

---

[1] యిలాంటి జీవిత విధానంతో (ఫ్రెంచి).

భాషణ ప్రారంభం అప్పుడు వ్రాన్‌స్కీ ముఖంలో గంభీరత, కఠినత్వం ద్యోతకమవడం కూడా ఆమె గమనించింది. యీ చిప్పోలూ, ప్రిన్సెస్ వర్వారా పీటర్స్‌బర్గ్ మిత్రుల గురించి మాట మొదలెట్టి ప్రసంగ విషయం మార్చడమూ గమనించి, తోటలో తనతో మాట్లాడేటప్పుడు వ్రాన్‌స్కీ అకారణంగానే తన కార్యకలాపాల గురించి ప్రస్తావించడమూ గుర్తువచ్చి యీ ప్రజా కార్యకలాపాల విషయమై ఆన్నాకీ వ్రాన్‌స్కీకీ మధ్య రహస్యంగా భేదాభిప్రాయాలున్నట్టు దాలీ అర్థం చేసుకుంది.

భోజనం, వైన్, వెండి పాత్ర సామాను – అన్నీ అద్భుతంగానే వున్నాయి. కాని యిదంతా దాలీ మామూలు విందులప్పుడూ, నాట్యాలప్పుడూ చూసిందే, ఆమెకిప్పుడదంతా అలవాటు తప్పి పోయింది. అదే పద్ధతిలో వుందిది, బిగపట్టినట్టు ఆత్మీయత లోపించినట్టు వుంది. అంచేత మామూలు సందర్భానికి, కొద్ది మందే వున్న యీ సమయంలో యీ అట్టహాసమంతా యేమిటో అని ఆమె మనసుకి యెబ్బెట్టుగా తోచింది.

భోజనాలయేక వాళ్లు చపటామీదకి వెళ్లేరు. టెన్నిస్ ఆడేరు. ఆటగాళ్లు రెండేసి జతలుగా విడిపోయారు. బాగా చదును చేసిన క్రోకెట్ గ్రౌండ్‌మీద మధ్యలో బంగారు మెరుగు పూసిన గుంజలకి నెట్ కట్టేరు. దాలీ ఆడబోయింది కాని కొంచెం సేపటిదాకా ఆమెకి ఆట అర్థం కాలేదు. ఆట అర్థం అయే వేళకి అలిసిపోయి ప్రిన్సెస్ వర్వారా పక్కన కూర్చుని ఆడేవాళ్లని చూస్తూ వుండిపోయింది. ఆమె జత ఆటగాడు తుష్కేవిచ్ కూడా ఆడ్డం మానేశాడు. మిగిలిన వాళ్లు కొంత సేపు ఆడారు. స్వియాజ్‌స్కీ, వ్రాన్‌స్కీలు దృష్టి లగ్నం చేసి బాగానే ఆడేరు. బంతిమీదే దృష్టి పెట్టి హడావుడి పడకుండా చురుగ్గా, అదునులో బంతి గెంతేదాకా చూసి అందుకుని గురిపెట్టి రాకెట్‌తో కొట్టేరు. వెస్లోవ్‌స్కీ అధ్వాన్నంగా ఆడేడు. మరీ ఆతృత పడిపోయేడు, కాని తన ఉత్సాహంతో మిగిలిన వాళ్లకి ప్రోత్సాహం కలిగించేడు. అతని పరిహాసాలకీ, నవ్వుకీ అపు లేకపోయింది. మిగిలిన మగాళ్లలాగే అతనూ ఆడవాళ్ల అనుమతితో కోటు విప్పేశాడు. కోర్టులో అటూ యిటూ కలదిరిగేస్తూ, తెల్లని చొక్కాతో అందంగా, ముఖం యెర్రబడి, చెమటతో మెరుస్తూ భలే కనిపించేడు.

ఆ రాత్రి దాలీ పడకమీద చేరినప్పుడు కోర్టులో కలదిరిగేస్తూ వున్న వెస్లోవ్‌స్కీ రూపమే కళ్లు మూసుకుంటే ఆమెకి ప్రత్యక్షం అయింది.

ఆటప్పుడు దాలీకి సంతోషం కలగలేదు. కోర్టులో ఆన్నా వెస్లోవ్‌స్కీల మధ్య కనిపించిన రంగేళీతనం, పిల్లలెవరూ లేకుండా పిల్లల ఆట ఆడేటప్పుడు పెద్ద వాళ్లకుండే సామాన్య నటన ఆమెకి నచ్చలేదు. కాని తన మనఃస్థితిని యితరులకి చెప్పకోకుండా, కాలక్షేపం చెయ్యడానికి ఆమె కొంచెం విశ్రాంతి తీసుకున్నాక ఆటగాళ్లతో మళ్లీ కలిసి, ఆట యిష్టంగా వున్నట్టు వాలకం పెట్టింది. తను రంగస్థలంమీద వున్నట్టు, యెక్కువ కౌశలం వున్న

నటులతో నటిస్తూ తన చెడ్డ నటనతో అంతట్నీ పాడు చేస్తున్నట్టూ రోజంతా దాలీకి అనిపిస్తూనే వుంది.

బాగా వుంటే రెండు రోజులు వుందామనే దాలీ యిక్కడికి వచ్చింది. కాని ఆ సాయంత్రం టెన్నిస్ ఆట అప్పుడు మర్నాడు వెళ్లిపోవాలని నిర్ణయించుకుంది. ప్రయాణం అప్పుడు యెంతో కలత పెట్టిన ఆలోచనలు, తల్లులకి వుండే యాతనలు చీకులు చింతలు, యిప్పుడామెకి భిన్నంగా గోచరమయేయి. ఆమె వొక రోజు ఆ చింతలు లేకుండా గడిపింది. అవి యిప్పుడు ఆమెని వెనక్కి లాగేయి.

సాయంత్రం టీ తాగేక, రాత్రి పడవలో విహారం చేశాక వొక్కత్తీ తన గదికి వెళ్లడం దాలీకి హాయి అనిపించింది. గదిలో ఆమె ఫ్రాక్ విప్పేసి, తల దువ్వుకోవడానికి కూర్చుంది.

ఆన్నా అప్పుడు తన దగ్గరికి వస్తుందన్న ఆలోచన అనిష్టంగా కనిపించింది. తన ఆలోచనలతో వొక్కత్తీ తన మానాన యేకాంతంగా వుండిపోవాలనుకుంది.

## 23

దాలీ మంచం యెక్కుదామనుకునే వేళకి ఆన్నా నైట్ గౌను తొడుక్కుని వచ్చింది.

ఆ రోజున ఆన్నా ఆమెతో మనసు విప్పి మాట్లాడదామని యెక్కువ సార్లు ప్రయత్నించింది, కాని యేవో కొన్ని మాటలు అని మానేసింది. "తర్వాత, మనిద్దరం వున్నప్పుడు అన్నీ మాట్లాడుకుందాం. నీకు యెన్నో విషయాలు చెప్పాల్సి వుంది నేను" అంటూనే వుంది ఆన్నా.

యిప్పుడు తామిద్దరూ మాత్రమే వున్నారు. కాని యేం చెప్పాలో ఆన్నాకి తెలీలేదు. దాలీని చూస్తూ కిటికీ దగ్గర కూర్చుంది. చెప్పవలసిన ఆంతరంగిక విషయాలు యెన్ని వున్నాయో నెమరు వేసుకుంది గాని చెప్పడానికి వొక్కటీ తట్టలేదు. ఆ సమయంలో అన్నీ అంతకు ముందే చెప్పేసినట్టు ఆమెకి భాసించింది.

"వూఁ, కిట్టీ యెలా వుంది?" అని ఆఖరికి గాఢంగా నిట్టూర్చి దాలీకేసి అపరాధినిలాగా చూస్తూ కదలేసింది. "నిజం చెప్పు దాలీ, ఆమెకి నామీద కోపంగా వుందా?" అని అడిగింది.

"కోపమా? అబ్బే, లేదు" అని దాలీ చిన్నగా నవ్వింది.

"కాని నేనంటే అసహ్యంగా వుండి వుంటుంది. నన్ను యేవగించుకుంటూ వుంటుందా!"

"అబ్బెబ్బే లేదు, కాని నీకు తెలుసు కదా అలాంటి విషయాల్ని క్షమించరు."

"తెలుసు" అని ఆన్నా అటు తిరిగి కిటికీలోనుంచి బయటకి చూస్తూ అంది. "కాని నా తప్పు లేదు. యెవరి తప్పు వుంది? తప్పు అంటే యేమిటి? యిలా కాకుండా మరోలా వుండగలదా? చెప్పు, యేమంటావ్? నువ్వు మా తమ్ముడి భార్య అవకుండా వుండగలిగే దానివా?"

''యేమో నాకు తెలీదు. కాని నాకీ సంగతి చెప్పు...''

''చెప్తా, చెప్తా. కాని కిట్టీ సంగతి పూర్తవనీ. ఆమె సంతోషంగా వుందా? అతను చాలా మంచి వాడని విన్నాను.''

''మంచి వాడు అనేది చిన్న మాట. అంతకంటే మంచి మనిషిని నేనెరగను.''

''చాలా సంతోషంగా వుంది. చాలా. 'మంచివాడు అనేది చిన్న మాట' '' అని ఆమె దాలీ అన్న ముక్కని రెట్టించింది.

దాలీ మందహాసం చేసింది.

''కాని నీ గురించి చెప్పు. నువ్వూ నేనూ బోలెడు విషయాలు మాట్లాడుకోవాల్సి వుంది. మా మధ్య సంభాషణ జరిగింది... నాకు...'' దాలీకి అతన్ని యేమని పిలవాలో తెలీలేదు. కౌంట్ అని గాని, పేరు ఉచ్చరిస్తూ గాని వ్రాన్‌స్కీని గురించి ప్రస్తావించడం ఆమెకి యిబ్బెట్టుగా తోచింది.

''అలెక్సేయ్‌కి'' అని ఆన్నా అందింది. ''అతను నీతో మాట్లాడేడని నాకు తెలుసు. కాని నేనడగ దలచుకున్నది నా గురించి, నా జీవిత విధానం గురించి నువ్వే మనుకుంటున్నా వని'' అంది.

''అంత అర్ధాంతరంగా అడిగితే యేం చెప్పను? నిజం చెప్తున్నా నాకు తెలీదు'' అంది దాలీ.

''వూహుఁ కాదు, కాని యిది చెప్పు నాకు... నువ్వు నా జీవితం చూస్తున్నావు. కాని మేం వేసవి కాలంలో, మేం వొక్కళ్లం లేనప్పుడు వచ్చి చూస్తున్నావన్న విషయం మరిచి పోకు... యిక్కడికి వసంతరుతువు మొదట్లో వచ్చేం, దాదాపు మేమిద్దరమే వున్నాం. మళ్లీ యిద్దరమే వుండిపోతాం, అంతకంటే యెక్కువ నేనేం కోరననుకో. కాని అతను లేకుండా నేనొక్కత్తినీ యిక్కడ వుంటున్నట్టు వూహించుకో. అది యెలా వుంటుందంటే... అన్ని విషయాల్నీ దృష్టిలో వుంచుకుంటే అతను సగం రోజులు యెక్కణ్నో వుండిపోతాడు అలా జరుగుతుంది అని నాకు తోస్తుంది'' ఆమె లేచి దాలీ దగ్గర కూర్చుంటూ అంది.

''అలా జరగదు'' అని ఆన్నా తన మాటకి అడ్డం రాబోతున్న దాలీని అభ్యంతర పెడుతూ అంది. ''నేనతన్ని బలవంతంగా అడ్డు పెట్టడం జరగదు. యిప్పుడు అడ్డు పెట్టడమూ లేదు. త్వరలో గుర్రప్పందేలు జరుగుతాయి. అతని గుర్రాలు పందెంలో వున్నాయి. అతనక్కడికి వెడతాడు. నాకు చాలా సంతోషంగా వుంది. కాని నా గురించి ఆలోచించు, నా స్థితి చూడు... కాని యీ విషయం గురించి చర్చ యెందుకులే'' అని ఆన్నా చిరునవ్వు నవ్వింది. ''వూఁ, అయితే యేం చెప్పాడు నీకు?'' అని అడిగింది.

''నేను నీతో మాట్లాడదా మనుకుంటూ వున్న దాని గురించే మాట్లాడేడు. దీన్ని గురించి అతని తరపున సులభంగా మాట్లాడగలను. మాకిద్దరికీ అనిపించింది యెందుకలా జరగలేదో, జరగకూడదో...'' దాలీ కొంచెం సేపు గుంజాటన పడింది. ''...నువ్వు నీ పరిస్థి

తిని సాఫీ చేసుకో, మెరుగు పరుచుకో... యీ విషయానికి సంబంధించి నా ఉద్దేశం నీకు తెలుసు, అయినా కానీ, సాధ్యమైతే నువ్వు పెళ్లి చేసుకోవాలి'' అంది.

''అంటే విడాకులు తీసుకొమ్మంటావా?'' అంది ఆన్నా. ''నీకు తెలుసా పీటర్స్‌బుర్గ్‌లో నన్ను చూడ్డానికి కేవలం వొక్క మహిళ మాత్రమే, బెట్సీ త్వెర్‌స్కాయా మాత్రమే వచ్చిందని? నువ్వు ఆమెని యెరుగుదువేమో? Au fond c'est la femme la plus dépravée qui existe.[1] మొగుణ్ణి ఘోరంగా మస్కా కొట్టి తుష్కేవిచ్‌తో గ్రంథం నడిపింది. అయినా, అలాంటి మనిషి కూడా నా పరిస్థితి అక్రమంగా వున్నంత కాలం నాకూ తనకీ యే సంబంధమూ వుండదని అంది. నేను నిన్నూ ఆమెనీ వొకే గాట కడుతున్నాననుకోకు... నీ గురించి నాకు బాగా తెలుసు కదా, దాలీ! కాని ఆ విషయం గుర్తు చేసుకోకుండా వుండలేను... అయితే అతనేం చెప్పాడు?'' అని మళ్లీ అడిగింది.

''అతను నీ గురించీ, తన గురించీ బాధపడుతున్నానని అన్నాడు. దాన్ని నువ్వు అతని స్వార్థం అనచ్చు కాని అది సహజమైన న్యాయమైన స్వార్థం. మొదటగా అతను తన కూతురు చట్టబద్ధంగా తన కూతురయేట్టు చేసుకోవాలనుకుంటున్నాడు, నీ భర్త కావాలనుకుంటు న్నాడు, నీమీద హక్కు సాధించాలనుకుంటున్నాడు.''

''యే భార్య, యే బానిస నేను ప్రస్తుత పరిస్థితిలో అతనికి బానిస అయినంతగా అవు తుంది?'' అని ఆన్నా మబ్బుగా అడ్డం వచ్చింది.

''కాని అన్నిటికంటే యెక్కువగా అతను కోరుకునేది... కోరుకునేది నీకీ నరక యాతన తప్పించడం.''

''అది అసంభవం. యింకా యేం కోరుకుంటున్నాడు?''

''యేముంది. చాలా ధర్మ బద్ధమైందే. మీ పిల్లలకి తన యింటి పేరు వుండాలని.''

''యే పిల్లలు?'' అని ఆన్నా దాలీనుంచి చూపు తప్పించుకుంటూ కళ్లు ముడిచి అడిగింది.

''ఆన్యాకీ, యింకా పుట్టబోయే పిల్లలకీ.''

''యింక పిల్లలు పుడతారన్న చింత పెట్టుకోనక్కర్లేదులే అతను.''

''అంత కచ్చితంగా యెలా చెప్పగలవు?''

''పుట్టరు, యేమంటే నాకా కోరిక లేదు కాబట్టి.''

ఆన్నా ఆవేశపడినా దాలీ ముఖంలో కనిపించిన జిజ్ఞాస, భీతి, ఆశ్చర్యం చూసి చిరు నవ్వు నవ్వింది.

''నా జబ్బు తర్వాత డాక్టరు నాకు చెప్పాడు.'' . . . . . . . . .

. . . . . . . . . . . . . . . . . . . .

---

[1]సూక్ష్మంగా చెప్పకోవాలంటే ఆమె చెడు ప్రవర్తన వున్న మనిషి (ఫ్రెంచి).

"అసంభవం!" అని కళ్లు చేటంత చేసుకుని అంది దాలీ. ఆమెకీ అది యెంత తీవ్ర పరిణామాలు సూచనలు వున్న ఆవిష్కరణ అంటే వెంటనే దాని సారం అంతా బుర్రకి యెక్క లేదు, లోతుగా చాలా సేపు ఆలోచించాల్సిన విషయంలాగా అది కనిపించింది.

ఒకో కుటుంబానికి వొకళ్లో యిద్దరో పిల్లలు వుండడం యేమిటో అర్థంకాని పరిస్థితిని యీ ఆవిష్కరణ వెంటనే పటాపంచలు చేసి యెన్నో ఆలోచనలని, పరస్పర విరుద్ధ ఉద్రేకాల్ని రెచ్చగొట్టింది. దాంతో దాలీ మాట్లాడలేక కళ్లప్పగించి ఆన్నాకేసి ఆశ్చర్యంతో చూస్తూ కూర్చుండిపోయింది. అది ఆమె కోరుకున్నటు వంటిదే, యిక్కడికి వచ్చేటప్పుడు దారిలో మధురంగా వూహించుకున్నటు వంటిదే. కాని అలాంటిది తథాస్తుగా జరుగుతుందని తెలిసి భీతిల్లిపోయింది. మహా జటిలమైన సమస్యకి బహు తేలికైన పరిష్కారం అని ఆమెకి అనిపించింది.

"N'est ce pas immoral?[1]" అని మాత్రమే చాలా సేపు మౌనంగా వున్న తర్వాత అనగలిగింది.

"అలా యెందుకవుతుంది? కొంచెం ఆలోచించు, నాకు రెండు దారులే వున్నాయి. కాన్పురావడం అంటే జబ్బు తెచ్చుకోవడం. లేదా నా భర్తకి, అంటే యితను భర్తే కదా — స్నేహితురాలిగా, తోడుగా వుండడం" అని ఆన్నా కావాల్సికి తేలికగా, భేషర్వాగా కనిపించే స్వరంతో అంది.

"అవును, అవును" అని దాలీ ఆమె తర్కం వింటూ, ఆ వాదనలని తనకి అన్వయించుకుని, అంతకుముందు లాగా తన మనసుని అవి పట్టుకోవడం లేదని అనిపించింది.

"యిప్పుడు నీకూ పై వాళ్లకీ" అని ఆన్నా దాలీ మనసులో ఆలోచనల్ని చదువుతున్నట్టు మొదలుపెట్టింది, "దీనికి సంబంధించి అనుమానాలు వుండచ్చు. కాని నేను... అర్థం చేసుకో, నేనతని కట్టుకున్న పెళ్లాన్ని కాను. నాపట్ల ప్రేమ వున్నంత కాలం నన్ను ప్రేమిస్తాడు. దేంతో అతని ప్రేమని బంధించి వుంచగలను? దీంతో?"

ఆన్నా తన తెల్లని చేతుల్ని కడుపుమీద పెట్టుకుని అంది.

మానసిక ఆందోళన కలిగిన సందర్భాల్లో యెప్పుడూ జరిగినట్టు గానే దాలీ మనసులో స్మృతులు, ఆలోచనలు విపరీతమైన వడితో దూసుకుపోయేయి. 'నేను మా ఆయన్ని బంధించే ప్రయత్నం చెయ్యలేదు' అనుకొంది. 'తను నన్నొదిలేసి వేరే ఆడమనుషులతో తిరిగేడు. తన కోసమన్చెప్పి నన్నొదిలి వెళ్లిన అతన్ని పోనీ ఆ మనిషేనా నిలబెట్టుకుందా? ఆమె ముచ్చటగా హుషారుగానే వుందిగా! ఆమెనీ వొదిలేసి యింకొకత్తెని పట్టేడు. ఆన్నా యీ రకంగా కౌంట్ వ్రాన్స్కీని తన ఆకర్షణలో వుంచుకుంటుందా? అతను 'యిలాంటి' ధోరణిలో వుంటే అతనికి యింతకంటే మంచి గౌన్లు తొడుక్కుని టక్కులు పోయే ఆడాళ్లు కో అంటే కోటిమంది

---

[1] యేం యిది నీతిబాహ్యంగా లేదంటావా? (ఫ్రెంచి).

వస్తారు. ఆమె బోసి చేతులు తెల్లగా అందంగానే వున్నాయి, ఆమె పూర్ణ మూర్తి, నల్లని తలకట్టుతో గులాబీ వదనంతో మనోహరంగానే వుంది. కాని అతనికి యింకా అందమైన ఆడవాళ్ళు దొరుకుతారు, దయనీయంగా, యేవగింపుగా, ప్రేమగా వుండే నా భర్తకి దొరికినట్టు."

కాని యీ ఆలోచనల్లో వొక్క దాన్ని కూడా దాలీ అన్నాకి చెప్పలేదు. వూరికే నిట్టూర్చిందంతే. అన్నా ఆ నిట్టూర్పుని అసమ్మతిని వ్యక్తం చెయ్యడంగా భావించుకుని తన మాట సాగించింది. ఆమె దగ్గర చాలా బలమైన వాదనలు వున్నాయి, వాటిని కొట్టి పారెయ్యడం దాదాపు అసంభవం.

"యిది తప్పంటావు? కాని న్యాయంగా ఆలోచించు. నా పరిస్థితి మర్చిపోతున్నావు. నేను పిల్లల్ని కనాలి అని యెలా అనుకోగలను? బాధల సంగతి, వేదనల సంగతి చెప్పడం లేదు నేను, నాకు వాటి భయమూ లేదు. కాని ఆలోచించు. నా పిల్లలు యెవరు? యెవళ్లో పరాయి యింటి పేరు తగిలించుకోవాల్సిన నికృష్టులు. పుట్టిన ఉత్తర క్షణంనుంచీ తమ తల్లినీ తండ్రినీ చూసి, తమ పుట్టుకని చూసి అవమానంతో కుమిలిపోవాల్సిన వాళ్లు" అంది.

"అందుకే మరి విడాకులు తీసుకోవాలనడం."

కాని అన్నా ఆమె అన్న ముక్క వినలేదు. తనని తను యెన్నో సార్లు సమాధాన పరచుకున్న వాదనలని చెప్పాలని అనుకుంది.

"నికృష్టులైన పిల్లల్ని యీ భూమ్మీద పడెయ్యకుండా చెయ్యలేకపోతే నాకు బుర్ర యెందుకు వున్నట్టు?"

ఆమె దాలీకేసి చూసింది. ఆమెనుంచి జవాబు కోసం చూడకుండా తన మాట కొనసాగించింది.

"ఆ దురదృష్టవంతులైన పిల్లల విషయంలో నేను యెప్పుడూ దోషిననే బాధపడుతూ వుంటాను. వాళ్ళు పుట్టకుండా వుంటే కనీసం దౌర్భాగ్యులు కారు. వాళ్లు దౌర్భాగ్యులైనట్టయితే తప్పంతా నాదే అవుతుంది" అంది.

దాలీ తనకి సంబంధించి అనుకున్న వాదనలే యివీనీ. కాని యిప్పుడు వాటిని వింటూ వుంటే అవి ఆమెకి బోధ పడలేదు. 'అసలు పుట్టని వాళ్లకి సంబంధించి దోషులం అని యెలా అనుకోగలరు?' అనుకుంది. హఠాత్తుగా వో ఆలోచన ఆమెకి స్ఫురించింది. తన ముద్దుల బిడ్డడు గ్రీష అసలు యీ భూమ్మీద ప్రత్యక్షం అవకుండా వుండి వుంటే వాడికి బాగా వుండేదా? ఆమెకి యీ ఆలోచన యెంత చిత్రంగా అసంబద్ధంగా తోచిందంటే తన బుర్రలో రేగుతూ వున్న యీ పిచ్చి వూహల్ని తోలేసుకోవడాని కన్నట్టుగా ఆమె తల విదిలించుకుంది.

"వుహూఁ, యేమో నాకు తెలీదు, కాని అది ఖాయంగా తప్పు" అని ముఖం వికారంగా పెట్టి అంది.

"కాని నువ్వు మరిచిపోవద్దు నువ్వెవరో నేనెవరో... అదీ గాక" అని అన్నా సాగించింది.

తన వాదనలు పుష్కలంగా వుండి, దాలీకి వాదనలు లేకపోయినప్పటికీ అది తప్పు అని వొప్పు కుంటున్నట్టే కనిపించి అంది. ''నువ్వో ముఖ్యమైన విషయాన్ని గుర్తుంచుకోవాలి. నీ పరిస్థితికీ నా పరిస్థితికీ సామ్యం లేదు. నీకు సంబంధించి నీకింకా పిల్లలు కావాలా లేదా అనేదే సమస్య. నాకు సంబంధించి పిల్లలుండాలా లేదా అనేది సమస్య. యీ రెండింటికీ హస్తిమశకాంతరం భేదం వుంది. మరి యిప్పుడు నేను వున్న పరిస్థితిలో పిల్లలు వుండాలను కోవడం అసంభవం కదా'' అంది ఆన్నా.

దాలీ ఆ మాటకి యేం అభ్యంతరం చెప్పలేదు. తనకీ ఆన్నాకీ మధ్య యెంతో పెద్ద అగాధం యేర్పడినట్టు, కొన్ని విషయాలకి సంబంధించి తామిద్దరూ యేకాభిప్రాయానికి రాలేనట్టూ యిక ఆ విషయాల గురించి చర్చించకపోవడం మంచి దైనట్టూ ఆమెకి హఠాత్తుగా అనిపించింది.

## 24

''అందుకనే నువ్వు నీ పరిస్థితిని, సాధ్యమైతే, తప్పకుండా మార్చుకోవాలి'' అంది దాలీ.

''సాధ్యమైతే'' అని ఆన్నా మరో భిన్నమైన స్వరంతో, అంటే మెల్లిగా విచారంగా వుండే గొంతుకతో, అంది.

''విడాకులు తీసుకోవడం సాధ్యపడదా? మీ ఆయన అందుకు తయారుగానే వున్నాడని విన్నాను.''

''దాలీ, ఆ విషయం గురించి చర్చించవద్దులే.''

''సరే అయితే'' అని దాలీ ఆన్నా ముఖంలో కనిపించిన బాధ చూసి గబగబా అంది. ''కాని నువ్వు మరీ అంతా చీకటైపోయినట్టు మాట్లాడుతున్నావు'' అంది.

''నేనా? అబ్బే, లేదు. నేను ఉత్సాహంగా సంతృప్తిగా వున్నాను. చూశ్లేదా je fais des passions.[1] వెస్లోవ్‌స్కీ...''

''కాని నిజం చెప్పమంటావా? వెస్లోవ్‌స్కీ నీతో ప్రవర్తించిన తీరు నాకు నచ్చలేదు'' అని దాలీ విషయం మార్చాలని త్వర పడుతూ అంది.

''అబ్బే, అలాంటిదేం లేదు. వూరికే వ్రాన్‌స్కీని యేడిపించడం అంతే. వెస్లోవ్‌స్కీ కుర్రకుంక, నా చేతిలో వున్నాడు. నేనెలా కావాలంటే అలా అతన్ని ఆడించగలను. అతను మీ గ్రీషలాంటి వాడు... దాలీ'' అని హఠాత్తుగా అంది, మళ్లీ ముందటి విషయానికే మళ్లుతూ. ''నేను అంతా మరీ చీకటైపోయినట్టు మాట్లాడుతున్నానని అన్నావు నువ్వు. నువ్వు అర్థం చేసుకోలేవు. యిదంతా మహా భయంకరంగా వుంది. దీనికేసి చూడకుండా కళ్లు మూసేసుకో ప్రయత్నిస్తున్నాను'' అంది.

---

[1]నామీద బొంగరాలు తిరుగుతున్నాయి (ఫ్రెంచి).

"నువ్వు కళ్లు మూసేసుకోకూడదనీ తెరుచుకోవాలనీ నాకు అనిపిస్తోంది. యేది సాధ్యపడితే దాన్ని చెయ్యచ్చు."

"కాని యేది సాధ్యం? యేదీ కాదు. అలెక్సేయ్‌ని పెళ్లి చేసుకొమ్మంటావు, నేనా విషయం గురించి అనుకోవడం లేదంటావు. నేనా విషయం గురించి అనుకోవడం లేదూ!" అని ముఖం యెఱ్రబడుతూ వుంటే రెట్టించింది. ఆమె లేచి నుంచుని, భుజాలు నిటారుగా పెట్టుకుని, గాఢంగా వూపిరి పీల్చి, తేలిగ్గా గబగబా అడుగులు వేస్తూ, మధ్య మధ్య ఆగుతూ అటూ యిటూ పచారు చేసింది. "నేను యీ విషయం గురించి అనుకోవడం లేదూ? ఒక్క రోజు గాని, వొక్క ఘడియ గాని దీన్ని గురించి నేను ఆలోచించకుండా జరగడం లేదు, యెందుకిలాంటి ఆలోచనలు చేస్తున్నానని నన్ను నేను తిట్టుకోకుండా జరగడం లేదు... యేమంటే యీ విషయం గురించి రేగే ఆలోచనలు పిచ్చెక్కించం చెయ్యగలవు. పిచ్చి యెక్కించెయ్యగలవు" అని రెట్టించింది. "ఆ ఆలోచనలు వచ్చినప్పుడు మార్ఫియా లేకుండా నాకు నిద్రపట్టదు. కాని, సరేలే. మరింత నిదానంగా దీన్ని గురించి మాట్లాడుకుందాం. విడాకులు తీసుకో అని నాకు చెపుతున్నారు. మొదటి సంగతి ఆయన నాకు విడాకులివ్వరు. యిప్పుడాయన కౌంటెస్ లిదియా ఇవానొవ్నా గీసిన గీటు దాటడం లేదు."

దాలీ కుర్చీలో నిటారుగా కూర్చుని, ముఖంలో అన్నా పట్ల సానుభూతి పూరిత బాధ కనిపిస్తూ వుండగా, అటూ యిటూ పచారు చేస్తూ వున్న అన్నాకేసి తల అటూ యిటూ తిప్పుతూ చూస్తూనే వుంది.

"కాని ప్రయత్నించాలి కదా" అని దాలీ మెత్తగా అంది.

"సరే ప్రయత్నించానే అనుకో. యేమిటి దానర్థం?" అని తన మనసులో లక్షా తొంభై సార్లు మననం చేసుకుని, హృదయస్థితంగా వున్న ఆలోచనలకి వ్యక్త రూపం యిస్తూ అంది. "అంటే ఆయన్ని అసహ్యించుకుంటూనే అయినా నేను ఆయనపట్ల దోషిగా వుంటూ కూడా ఆయన ఔదార్యం సమ్మానిస్తూ నా అవమానం దిగమింగుకుని ఆయనకి ఉత్తరం రాయాలి. సరే యెలాగో అలాగ ఆయనకి ఉత్తరం రాశానే అనుకుందాం. అప్పుడు ఆయన్నుంచి అవమానకరమైన జవాబేనా వస్తుంది, అంగీకారమేనా వస్తుంది. సరే, అంగీకారం వచ్చిందీ అనుకుందాం..." యీ మాటలు అనే సమయానికి అన్నా గదిలో వో మూలకి వెళ్లి అక్కడ ఆగి కిటికీ తెరని దేన్నో సర్దుతూ వుంది. "ఆయన అంగీకారం వస్తుంది... కాని నా... కొడుకు? వాణ్ణి నాకు అప్పగించరు. వాడు నన్ను యేవగించుకుంటూ నేను వదిలిపెట్టిన తండ్రితో వుంటూ పెరుగుతాడు. అర్థం చేసుకో ప్రయత్నించు, నాకు యిద్దరూ సెర్యోష, వ్రాన్‌స్కీ యిద్దరూ — సమంగా ప్రాణప్రదమైన వాళ్లే. నా ప్రాణంకంటే యెక్కువగా నేను ప్రేమించేవాళ్లే."

అన్నా గది మధ్యలోకి వచ్చి, ఛాతీమీద రెండు చేతులూ అదుముకుంటూ దాలీ ముందు నుంచుంది. తెల్లని నైట్ గౌనులో ఆమె రూపం మరీ పొడగరిగా, హుందాగా వున్నట్టు కనిపిం

చింది. మాసికల గౌను వేసుకుని, రాత్రి టోపీ పెట్టుకుని ఆవేశం చెందిన కారణంగా కంపిస్తూ వున్న దయనీయమైన పల్చని దాలీకేసి ఆమె తల వొంచి, చెమ్మగిల్లిన మెరిసే కళ్లని తిప్పింది.

"నేను ప్రాణప్రదంగా చూసుకుంటూ వున్న వాళ్లు యీ యిద్దరూ మాత్రమే. వాళ్లని వొకళ్లకొకళ్లని కలపలేను. వాళ్లని నేను కలపలేను. నాకు కావాల్సింది అదొక్కటే. నేను అలా చెయ్యలేనప్పుడు యిక యేదన్నా నాకు ఖాతరీ లేదు. యేదన్నా, యేదన్నా ఖాతరీ లేదు. యెలా జరగాలో అలా జరుగుతుంది అందుకని నేనా విషయం గురించి చర్చించలేను, చర్చించడం నాకు యిష్టం వుండదు. అంచేత నన్ను తప్పు పట్టుకోకు, మరి దేనికి గానీ నన్ను ఆడిపోసుకోకు. నువ్వు పిసరు కూడా మచ్చలేని దానివి, అందుకని నన్ను వ్యధ పెట్టే వాటినన్నిట్నీ అర్థం చేసుకోలేవు."

ఆన్నా దాలీ దగ్గరికి వచ్చి కూర్చుంది. అపరాధం చేసిన దానిలా దాలీ చేతిని అందుకుని ఆమె కళ్లల్లోకి చూసింది.

"యేమిటాలోచిస్తున్నావు? నా గురించి యేమనుకుంటున్నావు? నన్ను అసహ్యించుకోకు. నేను అసహ్యించుకోవలసిన దాన్ని కాదు. నిర్భాగ్యురాల్ని – యెవళ్లన్నా యెన్నడన్నా నిర్భాగ్యులుగా వుంటే అది నేనే' అని ఆన్నా గొణిగి ముఖం చాటు చేసుకుని భోరుమంది.

గదిలో ఒక్కత్తీ మిగిలిపోయేక దాలీ దైవ ప్రార్థన చేసుకుని మంచం యెక్కింది. ఆన్నాతో మాట్లాడుతూ వున్నంత సేపూ మనస్ఫూర్తిగా ఆమెకి ఆన్నాపట్ల సానుభూతి కలిగింది. కాని యిప్పుడు ఆన్నా గురించి అనుకోవడమే లేదు. యింటి గురించీ, పిల్లల గురించీ ఆలోచనలు ముసురుకు వచ్చి వొక నూతన విశేష రూపంతో, సౌందర్యభరిత ఆకర్షణతో భాసించి ఆమెని పెన వేసుకున్నాయి. ఆమెకి తన లోకం యెంతో సౌందర్యవంతంగా, ప్రేమాస్పదంగా తోచింది. ఆ లోకం యెడబాటు మరో రోజు భరించేటందుకు సిద్ధంగా లేకపోయింది. తెల్లవారుతూనే వెళ్లిపోవాలని అనుకుంది.

యీ లోపున ఆన్నా తన గదికి తిరిగివెళ్లింది. చిన్న వైన్ గ్లాస్ తీసుకుని యేదో మందు పోసుకుంది. అందులో యెక్కువ మార్ఫియా వుంది. దాన్ని తాగేక కదలకుండా కూర్చుంది. కొంచెం సేపటి తర్వాత ఉద్రేకం తగ్గి స్థిమిత పడింది. మనసుకి తేలికగా అనిపించేక పడక గదిలోకి వెళ్లింది.

ఆమె లోపలికి వెళ్లగానే వ్రాన్స్కీ ఆమెకేసి తదేకంగా చూశేడు. దాలీతో ఆమె చాలా సేపు వుండబట్టి ఆమెతో మాట్లాడుతూ వుండి వుండాలని అతనికి తెలుసు. ఆన్నా ముఖంలో ఆ సంభాషణా చిహ్నాల కోసం యిప్పుడు వ్రాన్స్కీ వెతికేడు. కాని ఆన్నా ఉత్తేజాన్ని అదుపు చేసుకుని, దేన్నో గోప్యంగా వుంచుకోవడంతో ఆమె ముఖ సౌందర్యం తప్ప యేమీ ద్యోతకం కాలేదు. ఆమె సౌందర్యం అతనికి కొత్త కాకపోయినప్పటికీ అతన్ని ఆకర్షిస్తూనే వుంది, తన సౌందర్యం గురించిన ఆమె స్పృహ, ఆ సౌందర్యం తనని వశం చేసుకోవాలన్న ఆమె కోరిక అతనికి గోచరమయేయి. యేం మాట్లాడుకున్నారని అతను అడగ దలచుకోలేదు. కాని ఆమె

తనంత తనే చెపుతుందని ఆశించాడు. కాని ఆమె అన్న ముక్క అల్లా యిది:

"నువ్వు దాలీ అంటే యిష్టపడడం నాకు సంతోషంగా వుంది. యేమంటావ్?"

"ఆమెని చాలా కాలంగా యెరుగుదును. మంచి మనిషి, mais excessivement terre-à-terre[1] అనిపిస్తుంది. అయినా ఆమె వచ్చింది, నాకు చాలా సంతోషంగా వుంది."

అతను అన్నా చేతిని తీసుకుని ఆమె కళ్లల్లోకి గుచ్చి గుచ్చి చూశేడు.

అన్నా అతని చూపుని మరోలా భావించుకుని మందహాసం చేసింది.

మర్నాడు పొద్దుట అన్నా, వ్రాన్స్కీ బలవంతం చేసినా వినకుండా దాలీ ప్రయాణం కట్టింది. లేవిన్ పంపిన బండివాడు పాత కోటు తొడుక్కుని, బండితోలేవాళ్లు పెట్టుకునే టోపీ పెట్టుకున్నాడు. ముఖం ముడుచుకుని జోడీ కుదరని గుర్రాల్ని మరమ్మతు చేసిన బండికి కట్టి గంభీరమైన వాలకంతో ఇసక పరిచిన పోర్టికోలోకి తోలుకు వచ్చేడు.

ప్రిన్సెస్ వర్వారా దగ్గర, మగాళ్ల దగ్గర సెలవు తీసుకోవడం దాలీకి యిష్టంగా లేదు. దాలీ తమ కత్తులో కలిసే రకం కాదనీ, వెళ్లిపోవడమే హాయి అనీ ఆమె అక్కడ గడిపిన వొక్క రోజులోనూ వాళ్లకి తెలిసింది. దాలీ వెళ్లిపోతూ వుంటే బాధపడింది అన్నా వొక్కత్తే. తాము కలుసుకున్నప్పుడు తన హృదయంలో తల యెత్తిన అనుభూతుల్లాంటి వాటిని దాలీ వెళ్లిపోతే మరెవళ్లూ జాగృతం చెయ్యలేరని ఆమెకి తెలుసు. ఆ అనుభూతులు ఆమెకి బాధ కలిగించేయి. కాని అవి తన హృదయంలో ఉత్తమ పార్శ్వానికి చెందినవనీ, తను యిప్పుడు బతుకుతూ వున్న జీవితం ఆ ఉత్తమ పార్శ్వాన్ని గబగబా అణగదొక్కేస్తోందనీ ఆమెకి తెలుసు.

బండి మైదానంమీదకి చేరగానే దాలీకి తెరిపిన పడినట్టు హాయిగా అనిపించింది. వ్రాన్స్కీ యింటి దగ్గర యెలా వుందని బండితోలేవాణ్ణీ, గుమాస్తానీ అడగాలని ఆమెకి అనిపించింది. బండితోలే ఫిలిప్ యింతట్లోకీ తనే ఆ ముక్క అన్నాడు:

"ఉన్న వాళ్లయితే అయివుండొచ్చు. కాని గుర్రాలకి మూడు పళ్ల ఓట్లు దాణా పెట్టేరు. మూడు పళ్లు యే మూలకి? గుర్రాలకి అవి వో దవడ పంటి కిందకి చాలవు. ఓట్లు యీ రోజుల్లో పడి నలభై అయిదు కోపెక్కులు. మన యింటికి వచ్చే వాళ్ల గుర్రాలకి యెంత కావాలంటే అంత ఓట్లు దాణా పెడతాం."

"ఆ అయ్యగారు పిసినారిలా వున్నాడు" అన్నాడు గుమాస్తా.

"కాని వాళ్ల గుర్రాలు నచ్చాయా మీకు?" అని దాలీ అడిగింది.

"ఆ గుర్రాల సంగతి చెప్పక్కర్లేదు! తిండీ భేషుగ్గా వుంది. కాని నాకైతే యేం మజా వున్న చోటులా కనిపించలేదమ్మా. మీకెలా అనిపించిందో గాని" అంటూ హుషారుగా అందంగా వుండే ముఖాన్ని ఆమెకేసి తిప్పేడు.

"నాకూ అలానే అనిపించింది. సరే, సాయంత్రానికి యింటికి చేరతామా?"

---

[1] కాని చాలా నీరసంగా వున్నట్టనిపిస్తుంది (ఫ్రెంచి.)

"చేరాలి మరి."

యింటికి తిరిగివెళ్ళి అంతా సక్రమంగా, సవ్యంగా వున్నట్టు చూసి దాలీ తన ప్రయాణం గురించి మహా ఉత్సాహంతో వర్ణించి చెప్పింది. అక్కడ తనని యెంత ఆదరించిందీ, వ్రాన్‌స్కీ యింట్లో యెంత ఐశ్వర్య వైభవం వున్నదీ, వ్రాన్‌స్కీ కుటుంబ జీవితం, అభిరుచులు యెంత ఘనంగా వున్నదీ, యెన్ని సరదాలు వున్నదీ వర్ణించి చెప్పింది. వ్రాన్‌స్కీకి వ్యతిరేకంగా యెవళ్లనీ వొక్క మాట కూడా అననివ్వలేదు.

"అన్నా, వ్రాన్‌స్కీలు యెంత సరసులో ప్రేమాస్పదులో గ్రహించాలంటే వాళ్ల గురించి బాగా తెలిసి వుండాలి. యిప్పుడు నాకు వ్రాన్‌స్కీ గురించి చాలా బాగా తెలిసింది" అని దాలీ, వాళ్ల యింటి దగ్గర వున్నప్పుడు యెంత అసంతృప్తిగా, యిబ్బందిగా తనకి అనిపించిందో ఆ విషయం మరిచిపోయి, నిజంగా మనస్ఫూర్తిగా యిప్పుడు అంది.

## 25

ఆ మిగిలిన వేసవి అంతానూ, ఆకురాలు కాలంలో కొన్ని రోజులూ వ్రాన్‌స్కీ, అన్నాలు అదే పరిస్థితుల్లో, విడాకులు తీసుకోవడం గురించిన ఆలోచనలేం లేకుండా ఆ పల్లెలో గడిపేరు. యెక్కడికీ వెళ్లద్దని యిద్దరూ అనుకున్నారు. కాని పల్లెలో వొంటరిగా, యెక్కువ రోజులు గడిపే కొద్దీ — ముఖ్యంగా ఆకురాలు కాలంలో చుట్టాలూ పక్కాలూ యెవళ్లూ రాకుండా వున్నప్పుడు — యీ బాపతు బతుకు లాభం లేదనీ, దాన్ని మార్చుకోవాలనీ మరింత స్పష్టపడింది.

తమ బతుకులో కోరుకోవాల్సింది యేదీ లేనట్టే కనిపించింది. సర్వసుఖాలూ వున్నాయి, బాగా వున్నారు, బిడ్డ వుంది, యెవళ్ల వ్యాపృత్తి వాళ్లకి వుంది. యింటికి చుట్టాలూ పక్కాలూ యెవళ్లూ రాకపోయినా అన్నా బాగా ముస్తాబు చేసుకునేది. బాగా పుస్తకాలు చదివేది. నవలలు, అప్పట్లో ఫాషన్‌గా వుండే యితర విషయాలకి సంబంధించిన పుస్తకాలు చదివేది. ఆమె విదేశీ పత్రికలకి, వార్తాపత్రికలకి చందాకట్టి తెప్పించుకునేది. వాటిలో పొగిడిన పుస్తకాల్ని తెప్పించుకునేది. కదువులో చల్ల కదలకుండా గడపగలిగే సందర్భాల్లోనే సాధ్యం అయే సావకాశంతో వాటిని చదివేది. వ్రాన్‌స్కీకి వ్యాపకం కలిగించే విషయాలన్నిటికి సంబంధించీ పుస్తకాలు చదివేది, ప్రత్యేకం ఆయా విషయాల కోసమే కేటాయింపైన పుస్తకాలనీ చదివేది. దాంతో వ్రాన్‌స్కీ యెక్కువగా వ్యవసాయం గురించీ, వాస్తుశిల్పం గురించీ, అడపాదడపా గుర్రాల పెంపకం గురించీ, క్రీడల గురించీ కూడా ఆమెని సంప్రదించేవాడు. ఆమె పరిజ్ఞానం, ధారణా శక్తీ చూసి అతను ఆశ్చర్యపోయేవాడు. యెప్పుడేనా యేదన్నా సమాచారం తప్పో వొప్పో అనే అనుమానం అతనికి తగిలితే ఆమె యే పుస్తకంలో యెక్కడ అది వుందో చూపించి అతనికి కావాల్సిన దాన్ని చెప్పేది.

ఆమె హాస్పిటల్‌కి అవసరం అయిన సామాన్లు సమకూర్చడం లాంటి పనులు కూడా చూసేది. ఆ పన్లకి సాయపడ్డమే కాక ఆమె స్వయంగా ఆలోచించి మంచి యేర్పాట్లు చేసేది. కాని ఆమె ముఖ్య చింత తన గురించే. వ్రాన్‌స్కీకి తనపట్ల యెంత ప్రేమ వున్నదీ, వ్రాన్‌స్కీ తన కోసం త్యాగం చేసిన దానంతట్నీ తను యెలా భర్తీ చెయ్యగలిగిందీ అనేదే ఆమె ముఖ్య చింత. తనని సంతృప్తి పరిచే కోరికమీదనే కాక తన పనులకి చేదోడు వాదోడు కావడానికి క్కూడా అన్నా తన యావజ్జీవితాన్నీ అప్పగించడం వ్రాన్‌స్కీ ఘనంగా మెచ్చుకున్నాడు. కాని తనని ప్రేమపాశంలో బంధించాలని అన్నా పడే ప్రయాస అతనికి కష్టం కలిగించేది. యెంత యెక్కువ సమయం గడిస్తే అంత అధికంగా యీ పాశంలో తను బంధితమైనట్టు అతనికి అనిపించేది. అంత యెక్కువగా అతను దాన్నుంచి బయటపడాలనే తపన పడేవాడు. దాన్నుంచి విముక్తుడు కావాలన్న కోరిక కంటే యెక్కువగా అది తన స్వేఛ్ఛని యే మేరకి నిరోధించిందో తెలుసు కోవాలనే వుండేది. స్వేచ్ఛాయుతుడు కావాలనే యీ యితోధిక కామన తప్పిస్తే, యేదన్నా సమావేశానికో గుర్రప్పందేలకో బస్తీకి వెళ్ల వలసి వచ్చినప్పుడల్లా రేగే రచ్చలు తప్పిస్తే వ్రాన్‌స్కీకి అతని జీవితం పరమ సంతృప్తిగా వుంది. తను యెంచుకున్న సంపన్న భూస్వామి పాత్ర—యీ భూస్వాములే రష్యన్ గొప్ప వంశీకుల కేంద్ర స్థానంలో వుండాలని అతని భావన—అతని అభిరుచులకి తగినట్టే వుంది. ఆరు నెలల పాటు అతను యితోధిక సంతృప్తితో ఆ జీవితం గడిపేడు. అతనికి ఆసక్తికరంగా వుండి, అతన్ని యింకా యింకా యెక్కువ పెనవేసుకుపోతున్న అతని కార్యకలాపాలు దివ్యంగా ముందుకు పోతున్నాయి. హాస్పిటల్‌కి, యంత్రాలకి, స్విట్జర్లండ్‌నుంచి తెప్పించిన మేలు జాతి ఆవులకి విపరీతంగా ధనం వ్యయం అయినా తన సంపద తరగడం లేదనీ పెరుగుతోందనీ అతనికి భరోసా కలిగింది. ఆదాయం విషయానికి సంబంధించి, కలప, ధాన్యం, ఉన్ని అమ్మడం, భూముల్ని కౌలుకి యివ్వడం విషయాలకి సంబంధించి వ్రాన్‌స్కీ యేమీ బెసకని నల్ల రాయి అనే చెప్పాలి. తను కోరుకున్న ధర రాబడతాడు. యీ యెస్టేట్‌నీ, తన యితర యెస్టేట్‌లనీ నిర్వహించడంలో వ్రాన్‌స్కీ ఢోకాలేని సాదా సీదా సూత్రాలకి కట్టుబడి వుండేవాడు. చిన్న చితకా వ్యవహారాల విషయం వచ్చేటప్పటికి గుప్పిడి బిగించేసి కోపెక్కు, కోపెక్కు పద్దు చూశేవాడు. జర్మన్ నిగామాను యుక్తికీ, నేర్పుకీ వ్రాన్‌స్కీ లొంగిపోలేదు. ఆ నిగామాను మొదట్లో యెక్కువ ధరకి, అవసరమైన దాని కంటే యెక్కువ వ్రాన్‌స్కీ చేత కొనిపిద్దామనుకున్నవి కొంచెం నిదానించి చూడడంమీద చవగ్గా కొనవచ్చనీ, వాటివల్ల వెంటనే లాభం వుంటుందని లెక్కపెట్టి చెప్పినా వ్రాన్‌స్కీ అతని మాట ప్రకారం నడిచేవాడు కాదు. అతను నిగామాను చెప్పింది వినేవాడు, తబిసీళ్లు అడిగేవాడు. బయటనుంచి తెప్పించే వస్తువు సరికొత్తదీ, రష్యాలో యెరగనిదీ, జనాలకి ఆశ్చర్యం కలిగించేదీ అయినప్పుడు మాత్రమే నిగామాను చెప్పిందానికి సరేననేవాడు. అంతే కాదు, తన దగ్గర అదనంగా రొఖ్ఖం వున్నప్పుడే పెద్ద ఖర్చుకి తల వూపేవాడు. అలా ఖర్చు చేసే సందర్భాల్లో అన్ని వివరాలనీ తరిచి చూసేవాడు, తను ఖర్చు పెడుతూ వున్న

దానికి సొద్దులేని ఉపయోగం వుండేటట్టు చూసుకునేవాడు. అలాంటి నిర్వహణలో వుంటే సంపద తరగడానికి బదులు యినుమడిస్తుందన్న విషయం స్పష్టమే.

అక్టోబరు నెలలో కాషిన్ గుబేర్నియాలో గొప్ప వంశీకులు ఎన్నికల జరుగుతాయి. యీ గుబేర్నియాలోనే వ్రాన్స్కీకి, స్వియాజ్‌స్కీకి, కోజ్నిషెవ్‌కి, అబ్లాన్‌స్కీకి యెస్టేట్లు వున్నాయి. లేవిన్‌కి కూడా కొంత యెస్టేట్ వుంది.

అనేక కారణాలవల్ల, ఎన్నికల్లో పాల్గొనే ప్రముఖులవల్లా యీ ఎన్నికలు ప్రజల దృష్టిని బాగా ఆకర్షించేయి. యీ విషయం గురించే యెక్కడ చూసినా మాట్లాడుకున్నారు, దీనికి యేర్పాట్లు అలానే జరిగాయి. యీ ఎన్నికలకి మాస్కోనుంచి, పీటర్స్‌బుర్గ్‌నుంచి జనం వచ్చేరు. విదేశాల్లో వుండే రష్యన్లూ వచ్చేరు. వాళ్లు మామూలుగా యిలాంటి ఎన్నికలకి రారు, కాని దీనికి ప్రత్యేకం వచ్చేరు.

తను హాజరవుతానని వ్రాన్స్కీ యెప్పుడో స్వియాజ్‌స్కీకి మాట యిచ్చేడు.

వ్రాన్స్కీ యెస్టేట్‌కి తరచూ వచ్చే స్వియాజ్‌స్కీ ఎన్నికలకి ముందు తనతో కూడా తీసుకెళ్లేందుకని వ్రాన్స్కీ దగ్గరికి వచ్చేడు.

ఆ వెళ్లడానికి ముందు రోజున యీ విషయమై వ్రాన్స్కీకీ, ఆన్నాకీ గొడవ జరిగినంత పనైంది. ఆకురాలు కాలం, పల్లెటూళ్లో పరమ విసుగ్గా, పొద్దుపోకుండా వుండే సమయం అదే. అందుకని ఆన్నాతో గొడవ వస్తుందని సిద్ధపడి అంతకు ముందు యెన్నడూ ప్రవర్తించని రీతిలో జడంగా, కఠినంగా తన ప్రయాణం గురించి ఆన్నాకి చెప్పేడు. ఆన్నా యేమీ కలవరపడకుండా ఆ ముక్క విని, యెప్పుడు తిరిగిరావడం అని అడిగింది. ఆమె నిదానం అతనికి ఆశ్చర్యం కలిగించింది. అతనామెకేసి తదేకంగా చూశేడు ఆమె నిశ్చలత్వం అర్థం కాక. ఆమె దానికి జవాబుగా చిరునవ్వు నవ్వింది. తనలో తను ముడుచుకుపోయే స్వభావం ఆమెకి వుందని అతనికి తెలుసు. తను యేమనుకుంటున్నదీ అతనికి చెప్పకూడదనుకున్న సందర్భాల్లోనే ఆమె అట్లా వుంటుందనీ తెలుసు. అతనికి అలాంటిదంటే భయం. కాని గొడవ యేమీ లేకుండా వుండాలని అతను మహా కోరుకున్నాడు; అందుకని పైకి కనిపించేటట్టు వో మేరకి మనస్ఫూర్తిగాను, తను నమ్మదలచుకున్న దాన్ని, అంటే ఆమె సబబుగానే వుంది అన్న దాన్ని, నమ్మేడు.

"నీకు విసుగ్గా వుండదనుకుంటాను?"

"నేనూ అలానే అనుకుంటున్నాను. నిన్న గొత్యే దగ్గర్నుంచి పెట్టెడు పుస్తకాలు వచ్చేయి. నాకు విసుగ్గా వుండదు" అంది ఆన్నా.

'తను కావాల్సికి యీ ధోరణిలో వుంటే అదే పది వేలు. లేకపోతే యెప్పటిలాంటి కథ జరిగేది' అనుకున్నాడతను.

అంచేత ఆ విషయాన్ని యిక రాపాడించకుండా అతను ఎన్నికలకి వెళ్లిపోయేడు. యెరమరికల్లేకుండా, విషయం యెటూ స్పష్టంగా తేలకుండా అలా అతను వెళ్లడం యిదే మొదటి సారి. యిది వో పక్క అతనికి కలత కలిగించింది, మరో పక్క యిదీ మేలేననిపించింది. 'మొదట్లో

యీ మాదిరిగానే కొంత ముసుగులాట, పైకి తెలని విషయం వుండచ్చు. కాని త్వరలో దీనికి అలవాటు పడిపోతుంది. యేమైనా ఆమెకి నా పురుష స్వాతంత్ర్యం తప్ప దేన్నైనా యిస్తాను' అనుకున్నాడు.

## 26

లేవిన్ సెప్టెంబరు నెలలో కిట్టీ కాన్పుకి మాస్కో వెళ్లేడు. యే పనీ పాటూ లేకుండా నెల్లాళ్ళు గడిపేడు. అప్పుడు కోజ్నిషెవ్ ఎన్నికల్లో చురుగ్గా పాల్గొనేందుకు తన యెస్టేట్ వున్న కాషిన్ గుబేర్నియాకి బయల్దేరాడు. సెలెజ్‌నేవ్ ఉయేజ్డ్‌లో లేవిన్‌కి వోటు వుంది. అందుకని లేవిన్‌ని తనతో రమ్మన్నాడు కోజ్నిషెవ్. వోటు సంగతి అలా వుంచినా లేవిన్‌కి కాషిన్‌లో అక్కగారి యెస్టేటు వ్యవహారం చూడాల్సిన జరూరు పనీ వుంది. అక్కగారు విదేశాల్లో వుంటోంది. ఆ వ్యవహారం అక్కగారి న్యాసానికి, అమ్మకాలయిన భూముల రొఖ్ఖం వసూలు*కీ సంబంధించినటువంటిది.

వెళ్లాలా వద్దా అని లేవిన్ తేల్చుకోలేకపోయేడు. కాని అతనికి మాస్కోలో కాలక్షేపం కావడం లేదని కిట్టీ గమనించి వెళ్లమని ప్రోత్సహించింది. అతనికి తెలియకుండానే గొప్పింటి వాళ్ళు వేసుకునే ఉడుపులు పురమాయించింది. దానికి యెనభై రూబుళ్లు ఖర్చయేయి. లేవిన్ అక్కడికి వెళ్లడానికి యీ యెనభై రూబుళ్ల ఖర్చు ఖరారు కారణం అయింది. అతను కాషిన్‌కి వెళ్లేడు.

లేవిన్ కాషిన్‌కి వెళ్లి ఆర్రోజులైంది. ప్రతిరోజూ సమావేశాలకి హాజరవుతూ వుండడం, అక్కగారి వ్యవహారాల పరిష్కారం చూడ్డం సరిపోయింది. కాని వ్యవహారాలు సంతృప్తిగా వొక కొలిక్కి రాలేదు. గొప్ప వంశీకుల మార్షల్స్ అంతా ఎన్నికల్లో కూరుకుపోవడంతో న్యాసం లాంటి చిన్న పని కూడా జరగలేదు. రొఖ్ఖం వసూలు పనిక్కూడా అలానే అంతరాయాలు కలిగాయి. నానా యాతనా పడ్డాక రొఖ్ఖం చెల్లించేందుకు వున్న ఆటంకాలు తొలిగేయి. రొఖ్ఖం చేతికి వచ్చేదే యిక, నోటరీ పరోపకార పరాయణుడే పాపం, కాగితాలు అందించేవాడే కానైతేం కాగితాలు యివ్వలేకపోయేడు. యేమంటే ఆ కాగితాలమీద అధ్యక్షుడి సంతకాలు అవాలి. అతను తన తరపున పని జరిపించే బాధ్యత యెవళ్లకీ అప్పగించకుండా సమావేశానికి చక్కాపోయేడు. యీ మొత్తం యాతన, వో చోటునుంచి యింకో చోటుకి పరిగెత్తడం, అర్థితుని యిబ్బంది కర పరిస్థితిని అర్థం చేసుకునీ యేం చెయ్యలేని భోళాభోళీ జాలిగుండె మనుషులతో సంభాషించడం, దమ్మిడీ లాభం చేకూర్చని యీ శ్రమ యావత్తూ కూడా లేవిన్‌కి చెప్పలేనంత వేదన కలిగించేయి, అది వో మనిషి శారీరక శక్తిని ఉపయోగ పెట్టాలని నిరర్థకంగా స్వప్నంలో ప్రయత్నించి హతాశాభరిత వివశత్వం అనుభవించే లాంటిది. ఉత్సాహవంతుడైన తన వకీలుతో మాట్లాడే సమయంలో లేవిన్‌కి బహుధా అలానే అనిపించింది. వకీలు తన శక్తి మేరకి అంతా చెయ్యాలని చూస్తున్నట్టే వుంది. లేవిన్‌ని కష్టాల్లోనుంచి వొడ్డున పడెయ్యడానికి

బుద్ధినంతట్నీ కూడగడుతున్నట్టే కనిపించింది. "యిలా చేసి చూడండి" అని చాలా సార్లు వకీలు చెప్పేడు. "ఆయన దగ్గరికి వెళ్లండి... యీయన దగ్గరికి వెళ్లండి" అనీ చెప్పేడు. లేవిన్ ప్రయత్నాలకి అడ్డు తగులుతున్నాయనిపించే ఆటంకాలని తొలగించేందుకు పథకాలు తయారు చేశాడు. "వాళ్లు సైంధవుళ్లల్లా అడ్డుపడచ్చు, అయినా యిలా ప్రయత్నించి చూడండి" అనీ అదే సందర్భంలో హెచ్చరిస్తూ వుండేవాడు. లేవిన్ అలానే ప్రయత్నం చేసేవాడు, ఆయన దగ్గరికి వెళ్లేవాడు, యీయన దగ్గరికీ వెళ్లేవాడు. అందరూ మంచివాళ్లే. సానుభూతి సహకారాలు అందించబోయేవాళ్లే. కాని అడ్డం తొలగించుకోవాలని చూసిన ఆటంకాలు ఆఖరికి తలయెత్తి యెదురుగా సిద్ధమయ్యేవి, దానికి అడ్డం పడి కూర్చునేవి. లేవిన్‌కి అన్నిటి కంటే యెక్కువ మతిపోగొట్టింది యెవళ్లు తనకి వ్యతిరేకంగా వున్నారో, యెవళ్లకి తన పని కాకపోవడం లాభమో అంతుబట్టకపోవడం. ఆ రహస్యం మాత్రం యెవళ్లకీ అంతు బట్టినట్టు లేదు, వకీలుకి కూడా. రైలు టికెట్ కొనుక్కోవడానికి స్టేషన్లోకి వెళ్లినవాడు టికెట్ కౌంటర్ దగ్గర క్యూలో నిలబడాలని తెలుసుకున్నట్టుగా యీ విషయం కూడా తనకి తెలిసి వుంటే లేవిన్‌కి యింత చిరాకూ కలగదు, మంటా పుట్టదు. కాని తన పని జరక్కుండా అడ్డు పడే ఆటంకాలు యెందుకు వున్నాయో యెవళ్లూ అతనికి తెలియ చెప్ప లేకపోయేరు.

యేమైనా పెళ్లయిం తర్వాత లేవిన్ చాలా మారేడు. వోపిక పెరిగింది. యేదన్నా విషయం అలా యెందుకు వుందో అర్థం కాకపోతే, మొత్తం పూర్వాపరాలు అన్నీ బోధపడితేగాని అలా యెందుకు వుందో తేల్చలేమనీ, అందుకు తగ్గ కారణం వుండచ్చనీ తనని తను సమాధాన పరచుకునేవాడు. అంచేత ఓర్మి చంపుకోకుండా వుండేందుకు ప్రయత్నించేడు.

అలాగే తను పాల్గొంటూ వున్న సమావేశాల్లో, ఎన్నికల్లో కూడా తిట్టుకోవడాలు వాదప్రతివాదాలు లేకుండా ఆ సత్సంకల్పంగల వ్యక్తులు, నిజాయితీగా, యెంతో గౌరవప్రదంగా వుండేవాళ్లు యింత ఉత్సాహంతో, శ్రద్ధాసక్తులతో యెందుకు యిందులో నిమగ్నమవుతూ వున్నారో అతను అర్థం చేసుకో ప్రయత్నించేడు. పెళ్లికి ముందు దాకా తను పైపైన మాత్రమే చూస్తూ వుండిన కారణంగా తేలిగ్గా అల్పంగా కనిపించినటువంటిని పెళ్లయిం తర్వాత లేవిన్‌కి నూతనంగా గంభీర పార్శ్వంతో వున్నట్టు కనిపించేయి. యిప్పుడు ఎన్నికలకి సంబంధించి యేదో గట్టి ప్రాముఖ్యమే వుంటుందనిపించింది. అదేమిటో తెలుసు కోవాలని ప్రయత్నించేడు.

యీ ఎన్నికలద్వారా తాము సాధించదలుచుకున్న వ్యవహారం సారం, ప్రాముఖ్యం యేమి టైందీ కోజ్నిషెవ్ వివరించేడు. గొప్ప వంశీకుల మార్షల్ చేతిలో చట్ట ప్రకారం చెప్ప లేనన్ని అధికారాలు వుంటాయి. న్యాసం విషయంలో (ప్రస్తుతంలో లేవిన్‌కి చిక్కులు యెదు రైంది దీనివల్లనే), గొప్ప వంశీకుల ధనరాశుల విషయంలో, బాలబాలికల పాఠశాల విద్య విషయంలో, సైనిక పాఠశాలల విషయంలో, నవీన ప్రణాళికల కనుగుణమైన ప్రజా విద్య

విషయంలో, కడగా జేమ్‌స్త్వో పరిపాలన విషయంలో గుబేర్నియా మార్షల్‌కి విశేష అధికారాలు వుంటాయి. ప్రస్తుతం వున్న మార్షల్ స్నెత్కోవ్. ఆయన పాత కాలం జమీందార్ల బాపతు మనిషి, బాగా సంపద ఖర్చుబెట్టేడు. మంచి వాడు. తన ఫక్కీలో నిజాయితీపరుడు. కాని యీనాటి అవసరాల గురించి ఆవగింజంత అవగాహనలేని మనిషి. ఆయన యెప్పుడూ, ప్రతి విషయంలోనూ గొప్పింటి వాళ్ల పక్షమే వుంటాడు; ప్రజా విద్యా వ్యాప్తిని బహిరంగంగా వ్యతిరేకించేడు. జేమ్‌స్త్వోకి, యెంతో ప్రముఖ పాత్ర వహించాల్సిన దానికి, శుద్ధ వర్గ స్వభావం అంటగట్టేడు. ఆయన స్థానంలో ఆధునిక భావాలు వున్న కొత్త వ్యక్తిని, సమర్థుడైన వాణ్ణి యెన్నుకోవాలి. యీనాటి అవసరాలని ఆకళింపు చేసుకున్నవాణ్ణి ఎన్నుకోవాలి. గొప్ప వంశీకులకి దఖలు పడ్డ అధికారాల్ని అంటే వాళ్లకే అనే కాదు, జేమ్‌స్త్వో పరిషత్‌ల రూపంలోవల్ల వాళ్లకి దఖలు పడిన స్థానిక పాలనా అధికారాల్ని, లాగగలిగినన్ని వాటిని లాగెయ్యాలి. సంపద్వంతమైన యీ కాషిన్ గుబేర్నియా, యెప్పుడూ అగ్రభాగంలో వుండే యీ గుబేర్నియా, యెన్నో అనుకూల్యాలు వున్న యీ గుబేర్నియా సరిగా గనక వాటిని కూడగట్టి కార్యక్రమాలు జరిపిస్తే యితర గుబేర్నియాలకే కాదు మొత్తం రష్యాకే ఆదర్శప్రాయం అవుతుంది. అందుకనే యీ యెన్నికల్ని మహత్తరమైనవిగా భావించాలి. స్నెత్కోవ్ స్థానంలో స్వియాజ్‌స్కీని ఎన్నుకోవాలన్న ప్రతిపాదన వుంది. లేదా యింకా మంచి అభ్యర్థి నెవెదోవ్‌స్కీని ఎన్నుకోవచ్చు. యితను లోగడ ప్రొఫెసరు, గొప్ప తెలివైనవాడు. కోజ్నిషెవ్‌కి సన్నిహిత మిత్రుడు.

గవర్నరు సభని ప్రారంభించేడు. మోహ మాటాలకి లొంగికాక, యోగ్యతలని బట్టీ, దేశ సంక్షేమం కోసం పాటుపడే సామర్థ్యాన్ని బట్టీ ఎన్నుకొమ్మని ఆయన వాళ్లకి విజ్ఞప్తి చేశాడు. కాషిన్ గుబేర్నియా గొప్ప వంశీకులు యింతకు ముందు ఎన్నికల్లో చేసినట్టుగా, ఆ రకంగా చక్రవర్తి వాళ్లపట్ల వుంచిన విశ్వాసానికి తగ్గట్టుగా తమ పవిత్ర కర్తవ్యాన్ని ఉచితంగా నిర్వహిస్తారన్న ఆశని ఆయన వ్యక్తం చేశాడు.

ఉపన్యాసం అయేక గవర్నరు హాలు అవతలకి వెళ్లేడు. గొప్ప వంశీకులు కోలాహలంగా, ఉత్సాహంతో, కొంతమంది అయితే ఉల్లాసంతో, గవర్నరు వెనక్కాలే వెళ్లారు. ఆయన కోటు తొడుక్కుంటూ ఆదరపూర్వకంగా గుబేర్నియా మార్షల్‌ని పలకరిస్తూ వుంటే చుట్టూ మూగేరు. అన్ని విషయాలనీ లోతుగా తరిచి చూడాలనీ, దేన్నీ తెలుసుకోకుండా వదలకూడదనీ ఆతృతగా వున్న లేవిన్, గొప్ప వంశీకులు గుంపుగా నుంచున్న చోట పక్కనే చేరాడు. గవర్నరు మార్షల్‌తో అనే మాటలు విన్నాడు. "దయచేసి మరీయా ఇవానొవ్నాతో చెప్పండి మా ఆవిడ చాలా బాధపడుతున్నప్పటికీ అనాథ శరణాలయాన్ని చూడవలసి వచ్చిందని." గవర్నరు వెళ్లిపోయేక గొప్ప వంశీకులు ఉత్సాహంగా ఫర్ కోట్లు తొడుక్కొని, చర్చికి వెళ్లేరు.

చర్చిలో లేవిన్ మిగిలిన గొప్ప వంశీకులందరిలాగా చెయ్యి యెత్తి ఫాదర్ అంటున్న మాటలని వల్లిస్తూ, గవర్నరుగారు తాము చేస్తామని ఆశ ప్రకటించిన అన్నిట్నీ చేస్తామని

గట్టి శపథం చేశాడు. చర్చి ఆరాధనకి లేవిన్ యెప్పుడూ చలిస్తాడు. "శిలువని చుంబించండి" అని పల్లిస్తూ యీ సమయంలో ప్రార్థన చేసేటప్పుడు అతను చుట్టూ చూశాడు. అక్కడున్న పడుచువాళ్లూ, ముసలివాళ్లూ యివే మాటల్ని రెట్టిస్తూ వున్నారు. దాంతో లేవిన్ గాఢంగా స్పందించేడు.

రెండో రోజునా, మూడో రోజునా ఆర్థిక విషయాలకి సంబంధించీ, ఆడపిల్లల బళ్లకి సంబంధించీ చర్చలు జరిగాయి. యీ చర్చలు అంత ముఖ్యమైనవి కావని కోజ్నిషెవ్ అన్నమీదట లేవిన్ తన వ్యవహారాలు చూసుకోవడంలో మునిగిపోయి యీ సమావేశాలకి హాజరవలేదు. నాలుగో రోజున గుబేర్నియా జమా ఖర్చుల పద్దులు చూడ్డం జరిగింది. యిక్కడ కొత్త పక్షానికీ పాత పక్షానికీ మధ్య మొదటి సంఘర్షణ తలయెత్తింది. జమా ఖర్చులు చూడమని నియోగించిన కమిటీ పద్దులు సవ్యంగా వున్నాయని నివేదిక సమర్పించింది. గుబేర్నియా మార్షల్ లేచి తనపట్ల విశ్వాసం వుంచినందుకు ప్రభువులకి కృతజ్ఞతలు చెప్పి, కంట తడి పెట్టాడు. గొప్ప వంశీకులు ఘనంగా చప్పట్లు కొట్టి ఆయన్ని అభినందించి కరచాలనం చేశారు. యీ సమయంలో కోజ్నిషెవ్ పక్షం మనిషి వొకాయన లేచి పద్దులు చూడమని నియోగించిన కమిటీ జమా ఖర్చులు చూడనట్టూ జమా ఖర్చులు చూడ్డం మార్షల్‌ని అవమానించడం అని భావించిన దానివల్ల అలా చేసినట్టూ తనకి తెలిసిందని అన్నాడు. కమిటీ సభ్యుల్లో వొకరు ఆ ముక్క నిజమేనని అనాలోచితంగా తేలిపోయేడు. అప్పుడు పొట్టిగా, పడుచు వాడిలా కనిపించే వొకతను లేచి మాట్లాడేడు. అతని మాట తేలుకుట్టినట్టు వుంది. మార్షల్ తనకి అప్పగించిన నిధుల జమా ఖర్చులని సభ ముందు వుంచడానికి చాలా సంతోష పడతాడని తెలుస్తూనే వుందనీ, కమిటీ సభ్యులు అధిక నమ్రత ప్రదర్శించి మార్షల్‌కి యీ నైతిక సంతోషం లేకుండా చేశారనీ అన్నాడు. దాంతో కమిటీ సభ్యులు తను నివేదికని ఉప సంహరించుకున్నారు. అప్పుడు కోజ్నిషెవ్ గొప్ప తార్కిక పద్ధతిలో జమా ఖర్చుల పద్దు చూసి నట్టో, చూడనట్టో యేదో వొకటి తేల్చాలని వాదిస్తూ యీ చిక్కుని విస్తారంగా లాగి చర్చ సాగించేడు. అవతలి పక్షంనుంచి వో వాగుడుకాయ మనిషి కోజ్నిషెవ్ వాదనలని కాదు పొమ్మని కొట్టి పారేశాడు. అతని తర్వాత స్వియాజ్‌స్కీ లేచేడు. స్వియాజ్‌స్కీ తర్వాత తేలు కొండి మనిషి లేచేడు. చర్చ తెగబారెడు సాగింది కాని యెటూ తేలలేదు. అంత సేపు అలా వాదించుకోవడం లేవిన్‌కి ఆశ్చర్యం కలిగింది. ముఖ్యంగా, నిధుల్ని దుర్వినియోగం చేసినట్టు తనకి అనిపిస్తోందా అని కోజ్నిషెవ్‌ని అడిగినప్పుడు అతను జవాబుగా

"అబ్బెబ్బే, కాదు, ఆయన నిప్పులాంటి వాడు. కాని పాత పద్ధతి పితృస్వామిక వ్యవ హార ధోరణికి స్వస్తి చెప్పే సమయం వచ్చింది" అన్నాక ఆ వాదన లేవిన్‌కి ఆశ్చర్యం కలిగించింది.

అయిదో రోజున ఉయేజ్డ్ మార్షల్స్‌ని ఎన్నుకున్నారు. కొన్ని ఉయేజ్డ్‌లకి సంబంధించి వ్యవహారం తుఫాన్‌లా సాగింది. సెలెజ్‌నేవ్ ఉయేజ్డ్‌నుంచి స్వియాజ్‌స్కీ ఏకగ్రీవంగా, వోట్లు వేసే అవసరం లేకుండానే, యెన్నికయేడు. ఆ సాయంత్రం యీ సందర్భాన్ని పురస్కరించుకుని గొప్ప విందు చేశాడు.

గుబేర్నియా మార్షల్ ఎన్నిక ఆరవ రోజున జరగాల్సి వుంది. రంగురంగుల యూనిఫాం బట్టలు వేసుకున్న ప్రభువులతో చిన్న హాలూ, పెద్ద హాలూ నిండిపోయేయి. చాలా మంది ఆ రోజు కోసమే వచ్చేరు. చాలా కాలం వొకళ్లనొకళ్లు కలుసుకోని పరిచయస్థులు క్రైమియా నుంచి, పీటర్స్‌బుర్గ్‌నుంచి, విదేశాలనుంచి వచ్చి యీ సభాస్థానంలో కలుసుకున్నారు. గవర్నర్ గారి బల్ల పైన జార్ చిత్రం వేలాడుతూ వుంది. ఆ బల్ల పక్కన వాద ప్రతివాదాలు చెలరేగాయి.

చిన్న హాల్లోనూ పెద్ద హాల్లోనూ ప్రభువులు బృందాలుగా యేర్పడ్డారు. వాళ్ల చూపుల్లో కనిపించే శత్రుత్వ భావ అవిశ్వాసాలని బట్టి, అవతలి పక్షం మనిషి యెవళ్లన్నా తమ వేపు వస్తున్నప్పుడు వాళ్లు మాట్లాడుకోవడం ఆపు చేస్తున్న తీరుని బట్టి వాళ్లు గుసగుసలాడుకునే ధోరణిని బట్టి, వసారా చివరకంటా వెళ్లిపోతూ వుండే ధోరణిని బట్టి వొక పక్షానికి అందకూడని రహస్యాలు మరో పక్షానికి వున్నాయని తెలుస్తూ వుంది. పైకి కనిపించడానికి మాత్రం ప్రభువులు రెండు పక్షాలుగా విడిపోయేరు – ముసలాళ్లు పడుచు వాళ్లు. పాతతరం వాళ్లల్లో చాలా మంది పాతబడిపోయిన గొప్పింటి వాళ్ల యూనిఫాంలు వేసుకుని కత్తులు, టోపీలు ధరించేరు. లేదా పాతకాలపు నౌకాదళ, అశ్విక, పదాతిదళ కొలువు ఉడుపులు వేసుకున్నారు. యీ యూనిఫాంలు పాత పద్ధతుల్లో కుట్టినవి. వాటి భుజాలు కుచ్చెళ్లు కుట్టి వున్నాయి. మరీ చిన్నవిగా, బిగుతుగా, నడుము దగ్గర మరీ పొట్టిగా వుండి వాట్ని వేసుకున్న వాళ్లు వాటిలోనుంచి పైకి యెదిగివచ్చారా అనిపించేటట్టు వున్నాయి. పడుచువాళ్లు ఆధునిక పద్ధతి యూనిఫాంలు వేసుకున్నారు. భుజాల దగ్గర వెడల్పుగా, నడుము దగ్గర విశాలంగా వుండే, తెల్లని వెయిస్ట్ కోటులకి పైన బొత్తాలు పెట్టుకోని యూనిఫాంలు వేసుకున్నారు. కొంతమంది న్యాయ మంత్రిత్వ శాఖ యూనిఫాంలు వేసుకు న్నారు. నల్లని మఖమల్ మెడపట్టీలతో, విశిష్టమైన బుటాలు వున్నటువంటివి. పడుచు ప్రభువులే మధ్యమధ్య జనంలో తళక్ తళక్‌మని మెరిసే దర్బార్ యూనిఫాంలు వేసుకున్నారు.

కాని ముసలి పడుచు అనే విభాగం ఆయా పక్షాలకి అనురూపంగా లేదు. కొంతమంది పడుచువాళ్లు పాత పక్షానికి చెందడం లేవిన్ గమనించేడు. తద్విరుద్ధంగా కొంతమంది ముసలి ప్రభువులు స్వియాజ్‌స్కీతో గుసగుసలాడేరు. వాళ్లు కొత్త పక్షాన్ని గట్టిగా సమర్థిస్తున్నారని తేటతెల్లంగానే వుంది.

లేవిన్ తన వాళ్లతో కలిసి చిన్న హాల్లో నుంచున్నాడు. అక్కడున్న వాళ్లు యేదో తింటూ తాగుతూ చుట్టలు కాలుస్తున్నారు. లేవిన్ వో మిత్ర బృందం దగ్గర చేరేడు. వాళ్ల మాటలు వింటూ వాటి అర్థం గ్రహించడానికి వ్యర్థంగా బుద్ధి కుశలతని శ్రమ పెట్టేడు. ఆ బృందం కేంద్ర స్థానంలో కోజ్నిషెవ్ వున్నాడు. ఆయన స్వియాజ్‌స్కీ, తమ పక్షాన్ని బలపరుస్తూ

వున్న వో ఉయేజ్డ్ మార్షల్ ఖ్లాస్తొవ్ చెప్పేదేదో వింటున్నాడు. స్నెత్కోవ్‌ని అభ్యర్థిగా నిలబడమని చెప్పడానికి ఖ్లాస్తొవ్ అతని ఉయేజ్డ్ వొప్పుకోవడం లేదు. కాని వొప్పించమని స్వియాజ్‌స్కీ వొత్తిడి చేస్తున్నాడు ఖ్లాస్తొవ్‌ని. కోజ్నిషెవ్ యీ ఆలోచనని బలపరుస్తున్నాడు. తాము తొలగించాలనుకుంటున్న మార్షల్‌ని నిలబడమని ప్రతిపక్షం అడగడం యేమిటో లేవిన్‌కి బోధపడలేదు.

అబ్లాన్‌స్కీ కొంచెం తిని తాగి, సుగంధం పూసిన సొగసైన అంచుల చక్కని రుమాలుతో మూతి తుడుచుకుంటూ యీ బృందం దగ్గరికి వచ్చేడు. అతను దర్బారు యూనిఫాం వేసుకున్నాడు.

"సాధించేస్తున్నామంటారా, కోజ్నిషెవ్‌గారూ" అని మీసాలు అదుముకుంటూ అన్నాడు.

సంభాషణని బట్టి విషయం పట్టుకుని స్వియాజ్‌స్కీ వ్యూహాకి వత్తాసు యిచ్చేడు.

"ఒక్క ఉయేజ్డ్ చాలు, ఖాయంగా స్వియాజ్‌స్కీ ప్రతికక్షిగా వుంటాడు" అన్నాడు. లేవిన్‌కి తప్ప అందరికీ ఆ మాటలు అర్థమయేయి.

"వూఁ, నీకూ యిది పసందుగా వుందన్న మాట" అంటూ లేవిన్ చెయ్యి పట్టుకున్నాడు. యీ గొడవంతా యేమిటో బుర్రకెక్కి వుంటే లేవిన్‌కి పసందుగానే వుండి వుండేది, కాని అతనికి యేమీ అర్థం అవడం లేదు. అక్కడ మాట్లాడుకునే వాళ్ల దగ్గర్నుంచి అతను అబ్లాన్‌స్కీని వో వారకి తీసుకెళ్లి ప్రస్తుతం వున్న మార్షల్‌ని నిలబడమనడంలో అర్థం యేమిటని అడిగేడు.

"అయ్యో, sancta simplicitas![1]" అని అబ్లాన్‌స్కీ క్లుప్తంగా, సుబోధకంగా తమ యెత్తుగడలని లేవిన్‌కి వివరించేడు.

గత ఎన్నికల్లో మాదిరిగా అన్ని ఉయేజ్డ్‌లూ మార్షల్‌ని నిలబడమని అడిగితే ఆయన వోట్లూ గీట్లూ లేకుండానే నెగ్గేస్తాడు. అది ప్రతిపక్షానికి యిష్టం లేదు. ప్రస్తుతం యెనిమిది ఉయేజ్డ్‌లు నిలబడమని ఆయన్ని అడిగేయి. రెండు ఉయేజ్డ్‌లు నిలబడమని అడగకపోతే స్నెత్కోవ్ ఉపసంహరించుకోవచ్చు. వాళ్ల పక్షం మరొకళ్లని నిలబెట్టచ్చు యేమంటే వాళ్ల అక్షం ఆయన్ని నమ్మకోలేదు గనక. కాని వొక్క ఉయేజ్డ్, స్వియాజ్‌స్కీ ఉయేజ్డ్, స్నెత్కోవ్‌ని అడగకుండా పోయినా, ఆయన ఉపసంహరించుకోవాల్సిన అవసరం లేదు. ఆయన గెలవవచ్చు. కొంత మంది ఆయన వ్యతిరేకులు కూడా కావాల్సికి ఆయనకి వోటు చేస్తారు. దాంతో వాళ్లకి యే పక్షం వాళ్లు యెంత మంది యెటు వోటు చేసిందీ లెక్క తేలదు. తర్వాత మన పక్షంనుంచి ఉప మార్షల్ అభ్యర్థిని పెడితే స్నెత్కోవ్ పక్షం వాళ్లు కూడా తమ వోట్లు వేస్తారు.

లేవిన్‌కి బోధపడింది, కాని అసాంతం కాదు. అతను యింకా యేదో అడగాలనుకున్నాడు. కాని వున్నట్టుండి అందరూ మాట్లాడుకుంటూ కోలాహలంగా పెద్ద హాల్లోకి వెళ్లేరు.

---

[1] సత్యకాలంవాడివి (లాటిం).

"యేమిటి సంగతి? ఎవరికి?" – "ఆయన బదులు?" – "ఎవరి బదులు? యేమిటి?" – "ఒప్పుకోవడం లేదు?" – "హక్కు లేదూ?" – "ఫ్లెరొవ్‌కి అనుమతీ లేదూ?" – "అతనిమీద అభియోగం వుంటే మాత్రం?" – "అలా అయితే యెవళ్లకీ అనుమతీ వుండదు. యిది నీచం" – "చట్టం!" లేవిన్‌కి అన్ని వేపులనుంచీ యీ వ్యాఖ్యలు వినిపించేయి. గబగబా అడుగులు వేస్తూ, యే మాటలేనా చెవిని బడకుండా పోతాయేమోనన్న భయంతో అతను అందరితోబాటుగా హాలుకేసి వెళ్లాడు. గొప్పింటి వాళ్ల గుంపు ముందుకి గెంటుకుంటూ పోవడంతో వాళ్లతోబాటు గుబేర్నియా మార్షల్ బల్ల దగ్గర తేలాడు. అక్కడ స్వియాజ్‌స్కీ, స్నెత్కోవ్, యితర పెద్దలు వేడివేడిగా వాదించుకుంటున్నారు.

## 28

లేవిన్ కొంత దూరంలో నుంచున్నాడు. ఓ ప్రభువు పక్కనే నుంచుని గట్టిగా శ్వాస పీలుస్తూ వుండడంవల్లా, యెవళ్లవో బూట్లు చేసే కిరకిర చప్పుడువల్లా అతనికి మాటలు సరిగా వినిపించడం లేదు. అతనికి దూరంనుంచి మార్షల్‌గారి మెత్తని స్వరం, తేలుకొండి పెద్దమనిషి కీచు కంఠం, తర్వాత స్వియాజ్‌స్కీ గొంతుక వినిపించేయి. అతనికి అర్థమైన మేరకి వాళ్ల చట్టంలో వొక అంశం గురించీ, "అభియోగంమీద విచారణ జరుగుతూ వున్న వాడంటే యెవరు" అనే అంశం గురించీ వాదించుకుంటున్నారు.

వేదిక దగ్గరికి వెడుతూ వున్న కోజ్నిషెవ్‌కి దారి యివ్వడానికి జనం అటూ యిటూ తప్పుకున్నారు. వేదిక దగ్గరికి వెళ్లి తేలుకొండి పెద్దమనిషి మాట్లాడ్డం పూర్తిచేసే దాకా కోజ్నిషెవ్ ఆగేడు. అప్పుడు యీ విషయానికి సంబంధించి చట్టాన్ని చూడ్డం బాగుంటుందని చెప్పి కార్యదర్శిని ఆ అధికరణం యేమిటో తియ్యమని అడిగేడు. యీ విషయానికి సంబంధించి అభిప్రాయ భేదాలు వస్తే వోటింగ్ జరపాలని అందులో వుంది.

కోజ్నిషెవ్ ఆ అధికరణాన్ని పైకి చదివేడు. దాని భావం వివరించ ప్రయత్నించేడు. కాని వో పొడగరి జమీందారు అతని మాటకి అడ్డం వెళ్లేడు. ఆ జమీందారు లావుగా వున్నాడు. అతని భుజాలు వొంగి వున్నాయి. మీసాలకి రంగు వేసుకున్నాడు. బిగుతైన యూనిఫాం వేసుకున్నాడు. దాని కాలరు మెడ వెనక కూరుకుపోయింది. అతను వేదిక దగ్గరికి వెళ్లి, గట్టిగా ఉంగరంతో బల్లమీద కొట్టి అరుస్తూ అన్నాడు:

"వోటు! మాటలవల్ల కార్యం లేదు. వోటింగ్ పెట్టండి, అంతే, తేలుతుంది."

అప్పుడు యింకా అరుపులు రేగాయి. కాని యీ ఉంగరం పెద్దమనిషి యింకా యింకా రెచ్చిపోయేడు, యింకా యింకా యెక్కువ చించుకున్నాడు. కాని అతనేం చెప్తున్నదీ యెవళ్లకీ అంతుబట్టలేదు.

కోజ్నిషెవ్ చెప్పిన దాన్నే అతనూ చెప్పేడు. కాని స్పష్టమైంది యేమంటే అతనికి కోజ్నిషెవ్ అన్నా, ఆయన పక్షం అన్నా మహా విద్వేషం, అది అతని పక్షం వాళ్లందరికీ అంటుకుంది. ప్రతిపక్షం తరఫునుంచీ అదే ఘృణ భావం వచ్చింది కానైతే కొంచెం మర్యాదగా వచ్చింది. అరుపులూ కేకలూ చెలరేగిపోయాయి. పరిస్థితిని అదుపు చెయ్యడం కోసం మార్షల్ ప్రాధేయ పడాల్సివచ్చింది.

"వోటింగ్! వోటింగ్! ప్రభువంశీకుడైన వాడికి అర్థం అవుతుంది." – "రక్తం చిందిస్తున్నాం..." – "చక్రవర్తికి మనమీద విశ్వాసం వుంది..." – మార్షల్ ఆజ్ఞలు మాకక్కర్లేదు." – "అది వేరే విషయం" – "దయచేసి వోటింగ్ తీసుకోండి! యెలాంటి తుక్కు మాటలు!..." అన్ని వేపులనుంచీ ఆగ్రహపూరితంగా అరుపులు వినిపించేయి. కళ్లూ మొహాలూ గొంతుకలకంటే ఆగ్రహపూరితంగా కనిపించేయి. పరమ ఘృణత్వం వాటిల్లో వెల్లడవుతోంది. లేవిన్‌కి యీ గొడవకి తలా తోకా యేమిటో బోధపడలేదు. ఫ్లేరొవ్ గొడవని తేల్చడానికి వోటింగ్ వుండాలనీ, అక్కర్లేదనీ మహోద్రేకంతో తన్నుకు లాడుకోవడం అతనికి విస్మయంగా వుంది. అతను వో విషయం మరిచిపోతూ వున్నాడు, దాన్ని కోజ్నిషెవ్ తర్వాత విశదంగా చెప్పేడు. సార్వజనిక కల్యాణం కోసం యీ గుబేర్నియా మార్షల్‌ని గద్దె దించాలి, అలా చెయ్యాలంటే యెక్కువ వోట్లు కావాలి. యెక్కువ వోట్లు రావాలీ అంటే ఫ్లేరొవ్‌కి వోటింగ్ హక్కు యివ్వాలి. ఆ హక్కుని యివ్వడం కోసం చట్టం అధికరణాన్ని వివరించాలి.

"వొక్క వోటు తాడో పేడో తేల్చెయ్యచ్చు. ప్రజా శ్రేయస్సు కోసం పని చేసేవాడు ఆషామాషీగా వుండకూడదు, నిలకడగా వుండాలి" అని చెప్పాడు కోజ్నిషెవ్.

కాని లేవిన్ దీన్నంతట్నీ మర్చిపోయేడు. యింత మంది మర్యాదస్థులు, మంచి వాళ్లు అసహ్యకరంగా ఉద్రేకపడి పోవడం చూసి ఖేదపడ్డాడు. మనసుకి కలిగిన యీ ఖేదం తొలగించుకుందుకు అతను చర్చ పూర్తవకుండానే అక్కడినుంచి వెళ్లిపోయేడు. అదే హాల్లో కొద్దిమంది వెయిటర్లు తప్ప యెవళ్లూ లేని కౌంటీన్ దాపులకి వెళ్లేడు. అక్కడ వాళ్లు కప్పుల్ని కడుగుతూ, గ్లాసుల్ని సర్దుతూ వున్నారు. వాళ్ల ముఖాలు నిశ్చింతగా కళకళలాడుతూ వున్నాయి. వాళ్లని చూడగానే ఉక్కపోసే గదిలోనుంచి బయటికి తాజా గాలిలోకి వెళ్లిన వాడికిలాగా హమ్మయ్య అని తెరిపిన పడ్డట్టు అతనికి అనిపించింది. వాళ్లని చూస్తూ అటూ యిటూ పచార్లు చెయ్యడం మొదలుపెట్టాడు. చెంప వెంట్రుకలు తెల్లగా వున్న ముసలి వెయిటరొకణ్ణి చూసి అతనికి ముచ్చటైంది. ఆ ముసలతన్ని పడుచు వాళ్లు ఉడికిస్తున్నారు. అయినా అతను పట్టించుకోకుండా కుర్రకుంకలన్నట్టు వాళ్లకేసి చూస్తూ రుమాలుని యెలా మడత పెట్టాలో చూపిస్తున్నాడు. లేవిన్ అతనితో మాట్లాడదామనుకున్నాడు. సరిగ్గా అప్పుడు ప్రభువంశీకుల న్యాయ సంఘటన వృద్ధ కార్యదర్శి వచ్చేడు. గుబేర్నియాలోని ప్రభువంశీకుల పేర్లూ, యింటి పేర్లూ తెలుసుకోవడం అతని పని. లేవిన్ దృష్టిని తన వేపు తిప్పుకునేటట్టు అన్నాడు:

"లేవిన్‌గారూ, మీ అన్నగారు తమ కోసం చూస్తున్నారు. వోటింగ్ జరుగుతుంది యీ విషయం తేల్చడానికి."

లేవిన్ హాల్లోకి వెళ్లేడు. అతనికి వో తెల్ల బంతిని యిచ్చేరు. అన్నగారి వెనక్కాలే లేవిన్ బల్ల దగ్గరికి వెళ్లేడు. బల్ల పక్కనే స్వియాజ్‌స్కీ నుంచున్నాడు. అతని ముఖంమీద అర్ధ వతుగా, వ్యంగ్యపూరితంగా వుండే భావం కనిపిస్తోంది. అతను గుప్పిడితో గడ్డం పట్టుకుని వానన చూస్తున్నాడు. కోజ్నిషెవ్ పెట్టెలోకి చెయ్యి పెట్టి తన బంతిని యేలాగో పడేసి లేవిన్‌కి దారి యిస్తూ పక్కకి తప్పుకున్నాడు. లేవిన్ ముందుకు వెళ్లేడు కాని యేం చెయ్యాలో మరిచిపోయి, యిబ్బంది పడుతూ అన్నగారికేసి తిరిగేడు. "దీన్ని యెక్కడ వెయ్యాలి?" అని అడిగేడు. పక్కన నుంచుని మాట్లాడుకుంటూ వున్న వాళ్ల చెవిన బడకుండా వుండా లనుకుని అతను మెల్లిగానే అడిగేడు. కాని ఆ మాట్లాడుకుంటూ వున్న వాళ్లు మాటలు ఆపు చేసి అతనడగకూడనిదాన్ని అడగడం విన్నారు.

"యెవళ్ల అంతరాత్మ యెలా చెపితే అలా చెయ్యాలి" అని కటువుగా జవాబు చెప్పేడు కోజ్నిషెవ్.

కొంతమంది ముసిముసి నవ్వులు నవ్వేరు. లేవిన్ జేవురించుకుని హడావుడిగా చేతిని పెట్టె ఫెల్ట్ మూత కిందకి పెట్టి బంతిని కుడి పేపు తోశాడు. బంతి కుడి చేతిలో వుండబట్టి అలా తోశేడు. కాని యెడం చేతిని పెట్టాలని వెంటనే గుర్తు వచ్చి, అలానే చేశాడు కాని ఆలస్యం అయిపోయిందప్పటికే. దాంతో అతను యింకా యెక్కువ తత్తర పడిపోయి గబగబా హాలు వెనక్కి వెళ్లిపోయేడు.

"నూట యిరవై ఆరు అనుకూలంగా, తొంభై ఎనిమిది వ్యతిరేకంగా" అని కార్యదర్శి ప్రకటించేడు. అతని మాట ముద్దమాట. అతను ప్రకటించగానే జనం నవ్వేరు: పెట్టెలో వో బొత్తం, రెండు అక్రోటు గింజలు దొరికేయి. ఫ్లేరొవ్‌కి వోటు హక్కు వచ్చింది, కొత్త పక్షం నెగ్గింది.

అయినా పాత పక్షం వోటమిని అంగీకరించలేదు. స్నెత్కోవ్‌ని నిలబడమని అడగడం లేవిన్ విన్నాడు. కొంతమంది ప్రభువులు స్నెత్కోవ్ చుట్టూ మూగి ఆయన చెప్తూ దాన్ని వినడం లేవిన్ చూశేడు. లేవిన్ యింకా దగ్గరకి వెళ్లేడు. గొప్ప వంశీకులు తనమీద వుంచిన నమ్మకానికి, తనపట్ల చూపుతూ వున్న ఆదరానికి, అందుకు తగ్గ అర్హత యేదీ తనకి లేదు అని స్నెత్కోవ్ కృతజ్ఞత చెప్తున్నాడు. అతని ప్రకారం గొప్పింటి వాళ్లకి తను విధేయంగా వుండడం, వాళ్ల సేవలో తన జీవితంలో యిరవై యేళ్లు గడపడం మాత్రమే అతనికి వున్న యోగ్యతలు. "నా శక్తి మేరకి, విశ్వాసం కొద్దీ, చిత్తశుద్ధి మేరకి, కృతజ్ఞుణ్ణి, రుణపడి వున్నాను" అనే మాటలని రెటిస్తూనే వున్నాడు. వున్నట్టుండి మార్షల్‌గారి కంఠం రుద్ధమైపోయింది. అలా కంఠం రుద్ధం కావడం తనకి అన్యాయం జరిగిందన్న భావంవల్ల వచ్చిందో, గొప్పింటి వాళ్లపట్ల వున్న అభిమానం కొద్దీ వచ్చిందో, లేకపోతే ఆ పరిస్థితి,

అంటే శత్రువులు చుట్టిముట్టి వుండే పరిస్థితి, ప్రేరేపించిన మానసిక వొత్తిడివల్ల వచ్చిందో చెప్పడం కష్టం. సరే కారణం యేదయితేనేం చాలా మంది ప్రభువులు చలించి పోయారు, లేవిన్‌కి ఆయనపట్ల సానుభూతి పెల్లుబికి వచ్చింది.

గుమ్మం దాటి వెళ్లేటప్పుడు మార్షల్‌గారు లేవిన్‌ని ఢీకొన్నారు.

"క్షమించాలి దయచేసి యేం అనుకోకండి" అని పరాయి వాడికి చెప్పినట్టు చెప్పేరు. కాని లేవిన్‌ని గుర్తుపట్టగానే బెరుగ్గా మందహాసం చేశారు. ఆయన తనతో యేదో చెప్పాలను కుంటున్నాడని లేవిన్ వూహించుకున్నాడు. కాని చాలా ఖేద పడి వుండడంవల్ల చెప్పలేకపోతు న్నాడనీ అనుకున్నాడు. మార్షల్‌గారి ముఖంలో కనిపించిన భావం బట్టీ, యూనిఫాంకి తగిలించిన అలంకారాలతో జటాలంకృతమైన తెల్ల లాగుతో గబగబ వెళ్లిపోయే ఆ హడావుడి వాలకం బట్టీ చూస్తే లేవిన్‌కి యిక తన పని ముగిసినట్టేనని గ్రహించిన వేట జంతువు గుర్తు వచ్చింది. ఆయన ముఖంలో కనిపించిన భావం లేవిన్‌ని అధికంగా ఆకట్టుకుంది. యేమంటే అంతకు ముందు రోజునే తన వ్యవహారంమీద ఆయన్ని వాళ్ల యింటి దగ్గర కలు సుకున్నాడు. అప్పుడు ఆయన దయాళువుగా, సద్గృహస్థు రూపంలో తన యావత్ వైభవంతోనూ కనిపించేడు. ఆయన యిల్లు పెద్దది. తాతల నాటినుంచి సంక్రమించిన కుర్చీలు, మేజాలు వగైరా సామాను వుంది. పాత కాలం నౌకర్లు, వాళ్ల వేషధారణ మరీ నాజుగ్గా గాని, అమిత శుభ్రతతో గాని లేదు. కాని వాళ్లకి యజమాని పట్ల భక్తి ప్రపత్తులు వున్నాయి. వాళ్లు పూర్వం భూస్వామ్య దాసులై వుంటారు, యిప్పుడు విధేయంగా కొలువులో వుండి వుంటారు. ఆయన భార్య లావుగా, సరదాగా వుంది. ఆవిడ అల్లిక టోపీ పెట్టుకుని, టర్కీ శాలువా కప్పుకుని, కూతురి బిడ్డ అయిన మనవరాలిని లాలిస్తోంది. ఆరో తరగతి చదివే పుత్రకిశోరం తండ్రి వెడల్పాటి చేతిని ముద్దు పెట్టుకుని ఆయనకి వందనం చేశాడు. తండ్రి మృదువుగా, స్నేహపూర్వకంగా మాట్లాడేడు. యివన్నీ కూడా అంతకు ముందు రోజున లేవిన్‌కి ఆయన పట్ల భక్తి ప్రపత్తులనీ, సానుభూతినీ కలిగించేయి. యిప్పుడు ఆ ముసలాయని లేవిన్‌కి దయనీయంగా, జాలి గొలిపేటట్టు కనిపించేడు. దాంతో ఆయనకి సంతోషం కలిగించే ముక్కలు రెండు చెపుదామని లేవిన్‌కి అనిపించింది.

"మీరే తిరిగి మార్షల్‌గా వుంటారని పిస్తోంది" అన్నాడు.

"యేమో!" అని మార్షల్‌గారు ఆ ముక్క యెవళ్ల చెవినేనా పడుతుందేమోనని పక్కకి చూశారు. "నేను అలిసిపోయాను, పెద్దవాణ్ణయి పోయేను. నాకంటే పడుచువాళ్లు, మంచివాళ్లు వున్నారు, వాళ్లు రావాలి యీ పనులకి" అన్నాడు.

అని పక్కనున్న గదిలోకి వెళ్లిపోయేడు.

అసలు ఘడియ రానే వచ్చింది. ఎన్నికలు మొదలవాలి. ఉభయ పక్షాల నాయకులు తమకి యెన్ని వోట్లు పడేదీ లెక్కలు వేసుకుంటున్నారు.

ఫ్లేరొవ్ రగడ కొత్త పక్షం వాళ్లకి అదనంగా వొక వోటుని యివ్వడమే కాక వ్యవధిని కూడా

యిచ్చింది. కొత్త పక్షం యీ వ్యవధిలో, పాత పక్షం వాళ్ల కుతంత్రంవల్ల ఎన్నికల్లో పాల్గొ లేకుండా పోయిన తమ వత్తాసుదార్లు ముగ్గురికి కబుర్లు పెట్టగలిగింది. వాళ్లల్లో యిద్దరికి బుడ్డీమీద ప్రేమ యెక్కువ, దాంతో స్నెత్కోవ్ వాళ్లని ధారాళంగా తాగించేసి పడుకో బెట్టేం చేశాడు. మూడో అతనికి యూనిఫాం లేకుండా కాజేయించేడు.

యీ విషయం తెలుసుకుని, ఫ్లేరొవ్ గొడవ సమయంలో, కొత్త పక్షం వాళ్లు తమ మనుషుల్ని అద్దె బండిలో పంపేరు. యూనిఫాం లేని మనిషికి యూనిఫాం యిప్పించి తీసుకు రమ్మనీ, మందు కొట్టేసి పడుకున్న వాళ్లల్లో వొక్కణ్ణేనా తీసుకు రమ్మనీ పంపేరు.

"వొకాయన్ని తీసుకువచ్చేం, నిండా నీళ్లు పోశేం" అని అతని కోసం వెళ్లిన జమీందారు స్వియాజ్‌స్కీకి చెప్పేడు. "ఆయన ఫర్లేదు" అన్నాడు.

"మరీ తూలిపోవడం లేదు కదా? కాళ్లమీద నిలబడ గలడా?" అని స్వియాజ్‌స్కీ దుఃఖంతో తల వూపుతూ అడిగేడు.

"అబ్బెబ్బె! బాగానే వున్నాడు. మళ్లీ యిక్కడెవళ్లూ బుడ్డి పెట్టకుండా వుండాలి... కౌంటీన్‌లో వాళ్లకి చెప్పాను యెట్టి పరిస్థితుల్లోనూ వొక్క చుక్క కూడా యివ్వడానికి వీల్లేదు."

## 29

సిగరెట్లు కాల్చుకోవడానికీ, టిఫిన్లు కాఫీ టీలూ సేవించడానికీ వో చిన్న హాలు వుంది. దాని నిండా ప్రభువులు కిటకిటలాడిపోతూ వున్నారు. అందరి ముఖాల్లోనూ ఉత్తేజం అధికం అవుతూ కనిపిస్తోంది, ఆందోళన కనిపిస్తోంది. బంతులు యెలా పడిందీ తెలిసి వుండడంతో నాయకులు మరీ ముఖ్యంగా ఆవేశంగా వున్నారు. వాళ్లు రాబోవు యుద్ధానికి సేనాధిపతులు; మిగిలిన వాళ్లు సాదా సైనికులు యుద్ధం కోసం తయారుగా వున్నా అది ఆరంభం అయే ముందు కొంచెం యేమార్పు వాళ్లకి అవసరమైంది. కొంతమంది నుంచుని, కొంతమంది బల్లల దగ్గర కూర్చుని యేవో తింటూ తాగుతూ వున్నారు. కొంతమంది ధూమ పానం చేస్తూ అటూ యిటూ పచారు చేస్తున్నారు. చాలా కాలం కలుసుకోకుండా వున్న పరిచయస్థుల్ని పలకరిస్తున్నారు.

లేవిన్‌కి తినాలనీ లేదు, చుట్ట అలవాటూ లేదు. కోజ్నిషెవ్, అబ్లొన్‌స్కీ, స్వియాజ్‌స్కీ యింకా యితర మిత్రులతో కలవాలనీ లేదు. యేమంటే వాళ్లంతా వ్రాన్‌స్కీతో మాటల్లో మునిగిపోయి వున్నారు. వ్రాన్‌స్కీ అశ్వశాలాధ్యక్షుని ఉడుపులు వేసుకున్నాడు. అంతకు ముందు రోజు ఎన్నికలప్పుడు లేవిన్ అతన్ని చూశేడు. కావాల్సికి అతన్ని తప్పించుకు తిరిగేడు. లేవిన్ యిప్పుడు కిటికీ వార చేరి కూర్చుని గుంపులు గుంపులుగా వున్న ఆ జనాన్ని చూస్తూ వాళ్లు అనుకునే మాటలు వింటూ వున్నాడు. లేవిన్‌కి ఆ జనం అంతా ఆతృతగా, ఆందోళనగా వ్యస్తంగా వుండడం, తను నిర్వ్యాపారంగా వుండడం విచారంగా వుంది. తను వొక్కడు, నౌకాదళ

యూనిఫాం వేసుకున్న మరో ముసలాయనతో కలిసి కూర్చున్నాడు. ఆయన పళ్లులేని చిగుళ్లతో యేదో చప్పుడు చేస్తూ కూర్చున్నాడు.

"యెంత బద్మాష్! నేను చెప్పాను, కాని వింటేగా అతను! వుహుఁ, వినడు! మూడేళ్లకి కూడా వసూలు చేసుకోలేదు" అని పొట్టిగా దిగు భుజాలతో వున్న వొక జమీందారు అన్నాడు. అతను జుట్టుకి చమురు రాసుకున్నాడు. అది బుటాలు కుట్టిన మెడ పట్టీమీద పడుతోంది. అతను బూట్లు టకటకలాడిస్తూ వచ్చేడు. ఆ బూట్లని ఎన్నికల కోసమే కొన్నట్టు వుంది. లేవిన్ని చూసి అతను ముఖం చిట్లించుకుని, టక్కుని పక్కకి మళ్లేడు.

"యేం చెప్పండి, యిది దరిద్రపు గొట్టు వ్యవహారం" అని పొట్టిగా వున్న వో జమీందారు కీచు కంఠంతో అన్నాడు.

ఆ తర్వాత వో జమీందార్ల బృందం లావాటి వో జనరల్‌గారి చుట్టూ మూగి వచ్చింది. వాళ్లు గబగబ లేవిన్ వేపు వచ్చేరు. తాము మాట్లాడుకునే మాటలు యెవళ్లూ వినకుండా వుండే చోటు కోసం వాళ్లూ వెతుకుతున్నట్టుగానే వుంది.

"యెన్ని గుండెలు చూడండి, నేను తన లాగులు కొట్టెయ్యమని చెప్పానట! తనే అమ్మేసుకుని సారా తాగేసి వుంటాడు. వీడెంత, వీడి జమీ యెంత? అలా వాగకుండా నోరు కట్టిపెట్టుకోవాలి!"

"ఆఁ, వాళ్లు చట్టం ప్రకారం మాట్లాడుతున్నారు" అని మరో బృందం వాళ్లు అనుకుంటున్నారు. "ఆయన భార్యని ప్రభువుల హోదాలో చేర్చాలి."

"చట్టం సిగ్గో సిరి! నాకే మనిపిస్తోందో దాన్ని చెపుతున్నా, గొప్పింటి వాడిలాగా, జమీందరూ. మాటంటే మాటే."

"హుజూర్, రండి, fine champagne.[1]"

చించుకుంటూ అరుస్తూ వెళ్లే యెవరో జమీందారు వెనక్కాలే మరో బృందం వచ్చింది. ఆ మనిషే చిత్తుగా తాగుడు పోయించిన మనిషి.

"మరీయా సెమ్యోనొవ్నాకి యెప్పుడూ చెపుతూనే వున్నా నీ భూములు కౌలుకి యియ్యవమ్మా అని. తను లాభం సంపాదించేటట్టు చేసుకోలేదు" అని తెల్లని మీసాల జమీందారు, మాజీ జనరల్ స్టాఫ్ దగ్గర కర్నల్ యూనిఫాం వేసుకుని చక్కని గొంతుకతో అన్నాడు. స్వియాజ్‌స్కీ యింటి దగ్గర లేవిన్ కలుసుకున్న జమీందారు ఆయనే. అతను వెంటనే ఆయన్ని గుర్తు పట్టేడు. ఆ జమీందారు లేవిన్‌కేసి మరోసారి చూసి అతని దగ్గరికి వెళ్లి నమస్కారం చేశాడు.

"చాలా సంతోషం మిమ్మల్ని చూసినందుకు. ఆఁ, గుర్తు వున్నారు. కిందటేడాది స్వియాజ్‌స్కీగారి యింటి దగ్గర కలుసుకున్నాం."

---

1 భేషైన షాంపేన్ (ఫ్రెంచి).

"యెలా వుంది మీ వ్యవసాయం?"

"యెప్పటిలాగానే వుంది నష్టాలతో" అని అది అంతేలే అన్నట్టు ఆ జమీందారు మందహాసం చేస్తూ అన్నాడు. "మీరేమిటి మా గుబేర్నియాకి వచ్చేరు? మా coup d'état[1]లో పాల్గొవడానికి వచ్చేరేమిటి?" అని ఆ ఫ్రెంచి మాటల్ని గట్టిగా అపసవ్యంగా ఉచ్చరిస్తూ అన్నాడు. "రష్యా అంతా యిక్కడే వున్నట్టుంది. రాజదర్బారు వాళ్లనుంచి దాదాపు మంత్రులదాకా" అని రాజదర్బారు యూనిఫాం, తెల్లని లాగు వేసుకున్న అబ్లాన్స్కీని ఉద్దేశిస్తూ అన్నాడు. అబ్లాన్స్కీ వో జనరల్ పక్కన నడిచి వెడుతూ వున్నాడు.

"ప్రభువుల ఎన్నికల ప్రాముఖ్యం నాకు అంతగా తెలియడం లేదు అనే చెప్పాలి" అన్నాడు లేవిన్.

ఆ జమీందారు లేవిన్‌కేసి వో సారి చూశేడు.

"తెలియడానికేముంది? యే ప్రాముఖ్యమూ లేదు. జడత్వంతో వూరికే సాగే పాత కాలపు నీరస సంస్థ. యీ యూనిఫాంలని చూడండి. రాజీ కోర్టు జడ్జీ, జేమ్‌స్త్వొ సంస్థ సభ్యులు ఆ బాపతు వాళ్లు తప్ప జమీందార్లు వున్న సభ కాదు అని తెలిసిపోతుంది."

"మరైతే మీరు యెందుకు వచ్చేరు?" అని లేవిన్ అడిగేడు.

"మొదటగా యేదో అలవాటువల్ల. తర్వాత సంగతి వున్న సంబంధాలు తెంపుకోవడం యెందుకులే అని. వో మేరకి నైతిక బాధ్యతా వుంది. వున్న మాట చెప్పాలీ అంటే నాకు సొంత కారణం వుంది. మా అల్లుడు జేమ్‌స్త్వొ సంస్థ సభ్యుడుగా యెన్నిక అవాలనుకుంటు న్నాడు. అతను అంత వున్న వాడు కాదు, అంచేత అతనికిది ముఖ్యం. అతనికి సాయపడాలి నేను. కాని అలాంటి వాళ్లు యెందుకు రావడం?" అని గవర్నరుగారి వేదిక దగ్గర మాట్లాడిన తేలుకొండి మనిషికేసి తల వూపి చూపిస్తూ అన్నాడు.

"వాళ్లు జమీందార్లలో కొత్త తరం వాళ్లు."

"కొత్త వాళ్లే సందేహం లేదు. కాని జమీందార్లు కాదు. వాళ్లు భూస్వాములు, మనం జమీందార్లం. వాళ్లు గొప్పింటి వాళ్లల్లా వచ్చి తమని తామే అంతం చేసుకుంటున్నారు."

"కాని యిది పాతగిలిన వ్యవస్థ అని మీరిప్పుడేగా నాతో అన్నారు."

"పాతగిల్లిందే, సందేహం లేదు, కాని అలా అయినా కొంత గౌరవం చూపించాల్సి వుంది కదా. స్నెత్కొవ్‌నే తీసుకోండి... మంచో చెడ్డో వెయ్యేళ్లుగా మన వికాసం జరిగింది. మాటకి మీరు మీ యింటి ముందర వో తోట పెంచాలనుకుంటారు. అదే చోట్లో వంద యేళ్ల నాటి చెట్టు వొకటి వుంటుంది... అది ముసలి చెట్టే, వొంగిపోయిన చెట్టే. అయినా మళ్లు కట్టుకోవడానికీ, పాదులు తవ్వుకోవడానికీ అడ్డం అని దాన్ని కొట్టెయ్యరు కదా. చెట్టుని ఉపయోగ పెట్టుకుంటూనే మీ పాదుల్నీ, మళ్లని చూసుకుంటారు. వొక్క యేడాదిలో

---

[1]తిరుగుబాటు (ఫ్రెంచి).

అంత చెట్టుని పెంచలేరు కదా..." అని ఆయన సావధానంగా అన్నాడు. వెంటనే ప్రసంగ విషయాన్ని మార్చేశాడు. "ప్చ్, సరే, మీ వ్యవసాయం యెలా సాగుతోంది?" అన్నాడు.

"అంత బాగా లేదు. అయిదు శాతంకంటే ఆదాయం రావడం లేదు."

"అదీ మీ శ్రమని లెక్క పెట్టుకోకుండా. దానికీ కొంత మూల్యం వుంది కదా? నా సంగతి చూడండి. వ్యవసాయంలోకి దిగక ముందు సైన్యం కొలువులో మూడు వేలు వచ్చేది. యిప్పుడు సైన్యం కొలువుతో చూసుకుంటే చాకిరీ యెక్కువ చేస్తున్నాను, మీకులాగే అయిదు శాతమే ఆదాయం వస్తోంది. యెక్కడి కక్కడికే దేవుని దయ అనుకుంటున్నాను. నా చాకిరీ మళ్లీ జీతం బత్తెం లేకుండానే సాగుతోంది" అన్నాడు.

"అంత అవదం వ్యవహారంగా వుంటే యెందుకు చేస్తున్నారు?"

"మరింకేం చెయ్యగలం? అలవాటు అయిపోయింది. అలానే చెయ్యాలని తేలిపోయింది. అంతే కాదు యింకా చెపుతా వినండి" అంటూ ఆయన కిటికీ తీనెమీదకి ఆనుకుంటూ, ప్రసక్తం అయిన విషయంలో మునిగిపోతూ చెప్పసాగేడు. "మా అబ్బాయికి వ్యవసాయం అంటే యేమీ ఆసక్తి లేదు. యే సైంటిస్టో అవుతాడేమో. అంచేత దీన్ని నడిపించడానికీ యెవళ్లూ లేరు. అయినా అంటి పెట్టుకునే వున్నాను. యీ యేడాది పళ్ల తోట వేశాను" అన్నాడు.

"ఆఁ, ఆఁ" అన్నాడు లేవిన్. "మీరన్న ముక్క నిజమే. వ్యవసాయం వల్ల లాభం లేదని నాకు బాగానే తెలుసు. అయినా చేస్తూనే వున్నాను... భూమిపట్ల యేదో జవాబుదారీ వున్నట్టుంది" అన్నాడు.

"యీ ముక్క వినండి" అని ఆ జమీందారు సాగించేడు. "నా పొరుగాయన వొకాయన వ్యాపారస్థుడు. నేనతనికి మా వ్యవసాయం చూపించేను. తోట చూపించేను. అంతా చూశాక 'అంతా పద్ధతిగా వుందండీ, కాని తోటని సరిగ్గా చూడడం లేదు' అన్నాడు. సంగతేమిటంటే తోట చాలా బాగా వుంది. 'మీ స్థానంలో నేను వుండి వుంటే యీ లైమ్ చెట్లని కొట్టేసి వుండేవాణ్ణి. చెట్టు బెరడు సరిగా వుండగానే వాటిని కొట్టించెయ్యాలి. వెయ్యి చెట్లు వున్నాయి. వొకో దానినుంచీ చక్కని బెరడు వస్తుంది. యిప్పుడు ధర బాగా వుంది దీనికి. నేను యీ చెట్లనన్నిటినీ తీసేసుకుంటాను' అన్నాడు అతను."

"ఆ డబ్బుతో అతను పశువుల్ని కొంటాడు, లేదా చవగ్గా భూమిని కొనేసి రైతులకి కౌలుకి యిచ్చేస్తాడు" అని లేవిన్ చిరునవ్వు నవ్వుతూ మాట పూర్తి చేశాడు. యీ బాపతు వ్యవహారం యెలా తేలుతుందో అతనికి ముందే తెలిసి వుండడంవల్ల అలా మాట ముగించాడని తెలుస్తూనే వుంది. "దానివల్ల సంపద కూడబెడతాడు. మరి మనం, మీరూ నేనూ దేవుడు చల్లగా చూస్తే యీ వున్న దాన్ని వుంచుకుని పిల్లలకి యిస్తే అదే గొప్ప మాట" అన్నాడు.

"మీరు పెళ్లి చేసుకున్నారని విన్నాను" అన్నాడు జమీందారు.

"ఆఁ" అని లేవిన్ గొప్పగా, తృప్తిగా అన్నాడు. "నిజానికి యిది చిత్రంగా వుంది

కదూ?'' అని చెప్పసాగేడు. "మీరూ నేనూ రేపటి సంగతేమిటా అని ఆలోచనా పాలోచనా లేకుండా బతుకుతాం, పాత కాలం వేస్తా దేవత పవిత్ర కన్యలకి పవిత్రాగ్ని రక్షణ బాధ్యత వున్నట్టు*'' అన్నాడు.

జమీందారుగారి తెల్లని మీసాల కింద పళ్లు మెరుస్తూ బయటికి కనిపించేయి.

"మనలోనే కొంతమంది వున్నారు, మన మిత్రుడు స్వియాజ్‌స్కీలాంటి వాళ్లు, కౌంట్ వ్రాన్‌స్కీలాంటి వాళ్లు. అతను యిక్కడికి వచ్చేడు. వీళ్లు పారిశ్రామిక క్షేత్రాల్ని నడిపించాలని చూస్తున్నారు, యింత వరకూ పెట్టుబడి ఆవడం వదిలింది తప్ప యేమీ లాభం కనిపించలేదు'' అన్నాడు జమీందారు.

"కాని మనం వ్యాపారస్థుల మాదిరీ యెందుకు చెయ్యకూడదు? బెరడు కోసం చెట్లని యెందుకు కొట్టకూడదు?'' అని లేవిన్ తనకి ఆశ్చర్యంగా కనిపించిన సమస్యని తిరిగి యెత్తుకుంటూ అన్నాడు.

"మీరన్నట్టు పవిత్రాగ్ని రక్షణ చేస్తూ వున్నాం. ఆ పని మన గొప్పింటి వాళ్లకి సంబంధించింది కాదు. గొప్పింటి వాళ్ల పని యిక్కడ కాదు, ఎన్నికలలో కాదు, తమ యిళ్ల దగ్గరా వాకిళ్ల దగ్గరా జరుగుతోంది. మనం యేం చెయ్యాలీ యేం చెయ్యకూడదూ అనే నైసర్గిక ప్రవృత్తి వుంటుంది. రైతులకీ అది వుంటుంది. మంచి రైతు అయితే గనక వీలైనంత భూమిని అంకించుకుంటాడు. భూమి మంచిది కాకపోవచ్చు, అయినా దున్నుతూనే వుంటాడు. లాభం గీభం కూడా చూసుకోడు. నష్టంతోనే అయినా వ్యవసాయం చేస్తూనే వుంటాడు.''

"మనకిలాగా'' అన్నాడు లేవిన్. "మళ్లీ మిమ్మల్ని కలుసుకోవడం సంతోషంగా వుంది'' అని స్వియాజ్‌స్కీ తమ వేపు వస్తూ వుండడం చూసి అన్నాడు.

"మీ యింటి దగ్గర కలుసుకున్నాక మా యిద్దరికీ భేటీ మొదటి సారి యిక్కడే అయింది'' అని జమీందారు స్వియాజ్‌స్కీతో అన్నాడు. "మా చర్చ కొనసాగించేం'' అన్నాడు.

"కొత్త పద్ధతుల్ని తూట్లు పొడిచేసి వుంటారు కదా'' అని స్వియాజ్‌స్కీ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"ఆఁ, అలానే చేశాం.''

"మనసులు తేలిక పరుచుకున్నాం.''

## 30

స్వియాజ్‌స్కీ లేవిన్‌ని చెయ్యి పట్టుకుని తన మిత్రుల దగ్గరికి తీసుకుపోయేడు.

యిక వ్రాన్‌స్కీని తప్పించుకోవడం అతనికి కుదరలేదు. అబ్లాన్‌స్కీ, కోజ్నిషెవ్‌ల పక్కన నుంచుని వ్రాన్‌స్కీ తన దగ్గరకు వస్తూ వున్న లేవిన్‌కేసి చూస్తూ వున్నాడు.

"చాలా సంతోషంగా వుంది. మిమ్మల్ని ప్రిన్సెస్ ష్చెర్‌బాత్‌స్కీ వాళ్ల యింటి దగ్గర కలుసుకున్న అదృష్టం కలిగింది'' అని లేవిన్‌కేసి చెయ్యి చాస్తూ అన్నాడు వ్రాన్‌స్కీ.

"నాకు చాలా గుర్తుంది మిమ్మల్ని కలుసుకోవడం" అన్నాడు లేవిన్. తన ముఖం యెర్రబడుతోందని అతనికి తోచి, అన్నగారితో మాట్లాడేందుకు అటు తిరిగేడు.

వ్రాన్‌స్కీ కొంచెం మందహాసం చేసి లేవిన్‌తో మాట్లాడ్డం యిష్టం లేనట్టుగా కనిపిస్తూ స్వియాజ్‌స్కీతో మాట్లాడ్డం సాగించేడు. కాని లేవిన్ అన్నగారితో మాట్లాడుతూనే వో కన్ను వ్రాన్‌స్కీమీద వేసి వుంచేడు. తను పెడసరంగా ప్రవర్తించేడు, ఆ దురభి ప్రాయం తొలగించేందుకు యేం చెప్పాలా అని ఆలోచించేడు.

"యిప్పుడు యిక తరవాయి యేమిటి?" అని స్వియాజ్‌స్కీకేసీ వ్రాన్‌స్కీకేసీ చూస్తూ అడిగేడు.

"స్నెత్కోవ్ జవాబే. అతను వూఁ అనడమో, వూహుఁ అనడమో" అన్నాడు స్వియాజ్‌స్కీ.

"వూఁ అన్నాడా లేదా?"

"అదే కదా గోలంతా. యెటూ తేల్చి చెప్పందే" అన్నాడు వ్రాన్‌స్కీ.

"ఆయన కాదంటే యెవళ్లు నిలబడతారు?" అని లేవిన్ వ్రాన్‌స్కీకేసి చూస్తూ అడిగేడు.

"యెవళ్లు కావాలనుకుంటే వాళ్లు" అన్నాడు స్వియాజ్‌స్కీ.

"మీరు నిలబడతారా?" అని లేవిన్ అడిగేడు.

"అయ్యో! నేనా! చాలు!" అని స్వియాజ్‌స్కీ తత్తరపడి, కోజ్నిషెవ్ పక్కన నుంచున్న తేలుకొండి మనిషికేసి చూపు విసురుతూ అన్నాడు.

"అయితే యెవరు నిలబడతారు? నెవెదోవ్‌స్కీ?" అని లేవిన్, తను గడబిడలో చిక్కుకు పోయానని తెలిసీ, అన్నాడు.

దాంతో పరిస్థితి మరీ అధ్వాన్నం అయింది. నెవెదోవ్‌స్కీ, స్వియాజ్‌స్కీలు పోటీదార్లు.

"నేనా యెట్టి పరిస్థితుల్లోనూ!" అన్నాడా తేలుకొండి మనిషి.

అతనే నెవెదోవ్‌స్కీ అట. స్వియాజ్‌స్కీ అతన్ని లేవిన్‌కి పరిచయం చేశాడు.

"వూఁ, అయితే నీకూ ఎన్నికల జ్వరం అందుకుందన్న మాట?" అని అబ్లాన్‌స్కీ కళ్లతో సైగచేస్తూ వ్రాన్‌స్కీతో అన్నాడు. "యిది గుర్రప్పందేల లాంటిది. పందేలు కూడా కాసుకోవచ్చు" అన్నాడు.

"ఆఁ, యిది జ్వరం కిందే లెక్క" అన్నాడు వ్రాన్‌స్కీ. "వొకసారి యిరుక్కుంటే అంతు చూసేదాకా నిద్రపట్టదు. సంఘర్షణ మరి" అని అతను మొహం చిట్లించు కుంటూ, గట్టి దవడలని బిగపడుతూ అన్నాడు.

"స్వియాజ్‌స్కీ భలే కార్యదక్షుడు! ప్రతి విషయాన్ని విశదంగా చూస్తాడు."

"అవునవును" అని వ్రాన్‌స్కీ యేదో పరధ్యానంగా అన్నాడు.

యెవళ్లూ మాట్లాడలేదు. ఆ సమయంలో వ్రాన్‌స్కీ యెవళ్లకేసో వొకళ్లకేసి చూడక తప్పదు కాబట్టి లేవిన్‌కేసి చూశేడు. లేవిన్ కాళ్లకేసీ, యూనిఫాంకేసీ, ముఖంకేసీ చూశేడు.

దిగాలుగా, కొంచెం కొరకొరలాడుతూ చూస్తూ వున్న లేవిన్ నేత్రాలు తన మీదే లగ్నం అయి వుండడం చూసి, యిక యేమనడానికీ మాటలు తోచక —

"మీరు పల్లెలోనే వుండిపోతూ రాజీ కోర్టులో జడ్జి కాకపోవడం యేమిటి? రాజీ కోర్టులో జడ్జి యూనిఫాం వేసుకోవడం లేదేం?" అన్నాడు.

"రాజీ కోర్టుల వ్యవస్థ పనికి మాలిందని నేను అనుకోబట్టి" అన్నాడు లేవిన్ దిగాలుగా. తను యింతకు ముందు పెడసరంగా వున్నానే అని బాధపడుతూ వున్నాడు. దానికి సర్దుబాటు చేసుకుందుకు వ్రాన్‌స్కీతో మాట యెలా కదలెయ్యాలా అని యింత సేపూ లోపల్లోపల గుణించుకుంటూనే వున్నాడు. అయినా యిలా అనేశాడు.

"ఆ ముక్క నే వొప్పుకోను. అందుకు భిన్నంగా..." అని వ్రాన్‌స్కీ కలవరపాటు లేకుండా ఆశ్చర్యపోతూ మొదలుపెట్టాడు.

"యిది వో ఆట, వేడుక" అని లేవిన్ అతని మాటకి అడ్డం వెళ్లేడు. "మనకి రాజీ కోర్టుల జడ్జీలు అవసరం లేదు. యెనిమిదేళ్లుగా మా దగ్గరకి వొక్క తగూ కూడా రాలేదు. ఆ వచ్చిన వొక్కటీ అపసవ్యంగా పరిష్కారం అయింది. రాజీ కోర్టు జడ్జీ మా వూరికి నలభై వెర్‌స్తుల దూరంలో వున్నాడు. రెండు రూబుళ్ల తగూకి పదిహేను రూబుళ్లు తగలేసి వకాలతు పంపాలి" అన్నాడు.

లేవిన్ వో తగూ గురించి చెప్పేడు. ఓ రైతు యేదో మిల్లు వాడి దగ్గర్నుంచి గోధుమ పిండి కొట్టేశాడుట. ఆ మిల్లు వాడు ఆ సంగతి అతనితో అన్నాట్ట. దాంతో ఆ రైతు తనని అపఖ్యాతి పాలు చెయ్యాలని ప్రయత్నించినట్టు అతనిమీద వ్యాజ్యం వేశాడుట. యీ కథ మొత్తం అప్రస్తుతమూ, అసందర్భమూ అనే విషయం లేవిన్ తనే గ్రహించేడు, చెపుతూ వుండగా.

"అబ్బో, మావాడో పెద్ద తిక్కశంకరయ్య!" అని అబ్లాన్‌స్కీ స్నిగ్ధ మందహాసం చేస్తూ అన్నాడు. "సర్లే, పదండి పోదాం. వోటింగ్ మొదలైనట్టుంది" అన్నాడు.

వాళ్లు వెళ్లిపోయేరు.

"నాకు అర్థం కావడం లేదు" అని తమ్ముడి అప్రస్తుత ప్రసంగం విన్న కోజ్నిషెవ్ అన్నాడు. "నాకు అర్థం కవడం లేదు. యింత అధ్వాన్నంగా, రాజకీయ పరిజ్ఞానం లేకుండా వుండడం. మన రష్యన్లకి, యిది బొత్తిగా లేదు. గుబేర్నియా మార్షల్ మనకి ప్రతి కక్షి. నువ్వతనితో ami cochon,[1] పైగా అతన్ని ఎన్నికల్లో పాల్గొమంటున్నావు. కౌంట్ వ్రాన్‌స్కీకి సంబంధించి కూడా... అతన్ని నా స్నేహితుడిగా నేను భావించడం లేదు. సాయంత్రం భోజనానికి రమ్మన్నాడు, నే రానని చెప్పాను. కాని అతను మన పక్షంలో వున్నాడు. అతన్ని దూరం చేసుకోవడం యెందుకు? నువ్వేమో నెవెదోవ్‌స్కీని నిలబడతావా అని అడుగుతున్నావు! అలాంటివి జరగవు, తెలుసా?" అన్నాడు.

---

[1] సాయిలా పాయిలాగా వుంటున్నావు (ఫ్రెంచి).

"అబ్బ, నాకేమీ తెలీదు. యిదంతా సాదా విషయమే" అని లేవిన్ దిగాలుగా అన్నాడు.

"సాదా విషయం అని నువ్వంటున్నావు. అయినా యిందులో దూరేవు, అంతా గందర గోళం చేస్తున్నావు."

లేవిన్ యేమీ జవాబు చెప్పలేదు. అందరూ హాల్లోకి వెళ్లేరు.

గుబేర్నియా మార్షలు స్నెత్కోవ్ నిలబడ్డానికి వొప్పుకున్నాడు. ఆయన నుంచోవాలన్న ప్రతిపాదన యేకగ్రీవంగా రాకపోయినా, తనకి వ్యతిరేకంగా పెద్ద వ్యూహ రచన జరుగుతోందన్న దాని వాసన సోకుతూ వున్నా కూడా నుంచున్నాడు. గుబేర్నియా ప్రభువుల మార్షల్‌గా మిఖయీల్ స్తెపానొవిచ్ స్నెత్కోవ్ నుంచున్నట్టూ, వోటింగ్ జరగబోతున్నట్టూ కార్యదర్శి గట్టిగా ప్రకటించేడు. హాల్లో చీమ చిటుక్కు మనడం లేదు.

ఉయేజ్ద్ మార్షల్స్ చిన్నచిన్న పళ్లేల్లాంటి వాటిని తమ బల్లల దగ్గర్నుంచి తీసుకుని గవర్నరుగారి బల్ల దగ్గరికి వెళ్లేరు. ఆ పళ్లేల్లో బంతులు వున్నాయి. ఎన్నిక మొదలైంది.

"కుడి వేపు వెయ్యి!" అని అబ్లాన్‌స్కీ లేవిన్ చెవిలో చెప్పేడు. లేవిన్, కోజ్నిషెవ్ వాళ్ల ఉయేజ్ద్ మార్షల్ వెనక్కాలే వెళ్లారు. వాళ్లు తనకి వివరించి చెప్పిన సంగతుల్ని ఆ పాటికి లేవిన్ మరిచిపోయేడు. 'కుడి వేపు' అని చెప్పి అబ్లాన్‌స్కీ పొరపాటు పడ్డాడేమోనని భయం కూడా కలిగింది. యేమైనా స్నెత్కోవ్ విరోధి కదా. లేవిన్ బంతిని కుడి చేత్తో పట్టుకున్నాడు. కాని పొరపాటు జగుతుందేమోనని బెదిరి దాన్ని యెడం చేతిలోకి మార్చుకున్నాడు, పెట్టె దగ్గరికి వెళ్లి యెడం వేపు విసిరాడు. పెట్టె దగ్గర నుంచో బెట్టిన పెద్దమనిషి సూక్ష్మగ్రాహి. మోచెయ్యి కదలికని బట్టే బంతిని యెటు విసిరారో పట్టేస్తాడు. ప్రస్తుతంలో తన సూక్ష్మగ్రాహ్యతని ఉపయోగించే అవసరం కూడా అతనికి లేకపోయింది. తమరు యేం సరిగా చెయ్యలేదు అన్నట్టు అతను లేవిన్‌ని చూసి ముఖం ముడుచుకున్నాడు.

మళ్లీ చీమ చిటుక్కుమంటే వినిపించేటంత నిశ్శబ్దంగా అయింది. బంతులు లెక్క పెడుతున్నారు. కొంచెం సేపటి తర్వాత వొక వ్యక్తి పోటీలో వున్న వ్యక్తికి అనుకూలంగా యెన్ని వొచ్చిందీ, ప్రతికూలంగా యెన్ని వొచ్చిందీ ప్రకటించేడు.

మార్షల్ సుమారైన ఆధిక్యతతోనే గెలిచాడు. అన్ని వేపులనుంచీ హుషారుగా మాటలు వినవచ్చేయి. అందరూ గుమ్మం వేపు వెళ్లేరు. స్నెత్కోవ్ వచ్చేడు. వెంటనే జనం అతన్ని చుట్టు ముట్టేశారు. అభినందనలు చెప్పేరు.

"అయితే అంతా అయిపోయినట్టేనా?" అని లేవిన్ కోజ్నిషెవ్‌ని అడిగేడు.

"యిప్పుడే మొదలవుతోంది" అని స్వియాజ్‌స్కీ చిరునవ్వు నవ్వుతూ కోజ్నిషెవ్ బదులు జవాబు చెప్పేడు. "మార్షల్‌కంటే డిప్యూటీ మార్షల్‌కి యెక్కువ వోట్లు రావచ్చు"* అన్నాడు.

లేవిన్ దీనంతటి గురించి మరిచేపోయేడు. దీంట్లో యేదో లొసుగు వుందనే గుర్తు వుంది.

కాని ఆదేమిటో తెలుసుకో ప్రయత్నించడం తల నొప్పి వ్యవహారంగా వుంది. ఆతనికి మళ్లీ విచారం కలిగింది, బయటికి వెళ్లిపోవాలని అనిపించింది.

యెవళ్లూ తన గురించి పట్టించుకోకపోవడంవల్లా తన అవసరం యెవళ్లకీ వున్నట్టు కనిపించకపోవడంవల్లా లేవిన్ చడీ చప్పుడులేకుండా జనం టిఫిన్లు కాఫీలూ తీసుకునే చోటుకి వెళ్లిపోయేడు. అక్కడ మరోసారి వెయిటర్లని చూడగానే అతనికి హమ్మయ్య అనిపించింది. వృద్ధ వెయిటర్ యేదన్నా తినమని లేవిన్‌ని అడిగేడు. లేవిన్ సరేనని అన్నాడు. ఓ కట్లెట్‌నీ, చిక్కుడు కాయల్నీ తిన్నాడు. అంతకు ముందు అతను పనిచేసిన యజమానుల గురించి వెయిటర్‌తో మాట్లాడేక లేవిన్ తనకి విసుగ్గా వున్న హాల్లోకి తిరిగి వెళ్లకుండా గేలరీ వేపు వెళ్లేడు.

గేలరీ నిండా మంచి షోగ్గా బట్టలు వేసుకున్న ఆడవాళ్లు వున్నారు. కింద మాట్లాడుకుంటూ వున్న మాటలు వొక్కటి కూడా తప్పి పోకుండా వుండేందుగ్గాను వాళ్లు కమ్మీలమీద కంటూ వాలి వింటున్నారు. ఆడవాళ్ల దగ్గర మంచి మంచి బట్టలు వేసుకున్న ఆఫీసర్లు, వకీళ్లు, కళ్లద్దాలు పెట్టుకున్న స్కూలు టీచర్లు కొంత మంది కూర్చున్నారు, కొంత మంది నుంచున్నారు. ప్రతివాళ్లూ ఎన్నికల గురించే మాట్లాడుకుంటున్నారు. మార్షల్ యెంత అలిసిపోయినట్టు కనిపిస్తున్నాడోననీ, ఉపన్యాసాలు యెంత బాగా వున్నాయోననీ మాట్లాడు కుంటున్నారు. ఓ బృందం తన అన్నగారిని మెచ్చుకుంటూ వుండడం లేవిన్ చెవిన బడింది. వో మహిళ యెవరో వకీలుతో అంటోంది –

"కోజ్నిషెవ్‌గారి ఉపన్యాసం వినే అదృష్టం కలగడం యెంత సంతోషంగా వుంది! ఆయన ఉపన్యాసం కోసం భోజనం మానేసేనా వుండాలి. అద్భుతం! యెంత స్పష్టంగా, చక్కగా వుంది! మీ కోర్టుల్లో అలాంటివి వుండవు. ఒక్క మాయిదెల్ తప్ప, అయినా ఆయనా యింత బాగా మాట్లాడలేడు."

లేవిన్ కమ్మీల దగ్గర చోటు సంపాదించేడు. యేం జరుగుతోందో చూసి, వినడం కోసమని వంగేడు.

తమ తమ ఉయేజ్డ్‌ల కోసం నిర్దేశించిన స్థలాల్లో ప్రభువులు కూర్చున్నారు. యూనిఫాం తొడుక్కున్న వొకాయన హాలు మధ్యలో నుంచుని అరుస్తున్నాడు:

"గుబేర్నియా డిప్యూటీ మార్షల్ అభ్యర్థిగా కేప్టెన్ యెవ్‌గేనీ ఇవానోవిచ్ అపూఖ్‌తిన్ పేరు ప్రతిపాదిస్తున్నారు."

చీమ చిటుక్కుమంటే వినిపించేటంత నిశ్శబ్దం ఆవహించింది. అప్పుడు వో నీరస వృద్ధ కంఠం వినవచ్చింది:

"ప్రతిపాదనని తిరస్కరిస్తున్నాం."

"గుబేర్నియా డిప్యూటీ మార్షల్ అభ్యర్థిగా దర్బారు సలహాదారు ప్యోత్ర్ పెత్రోవిచ్ బాల్ పేరు ప్రతిపాదిస్తున్నారు."

"ప్రతిపాదనని తిరస్కారించడం జరుగుతోంది" అని వో పడుచు కంఠం కీచుమంది.

మళ్లీ మరో ప్రతిపాదన, మళ్లీ నిరాకరణ. అలా వో గంట సేపు సాగింది. లేవిన్ కమ్మీల దగ్గర నుంచున్నాడు. వింటున్నాడు, చూస్తున్నాడు. యిదంతా యేమిటోనని మొదట గందరగోళపడ్డాడు, అర్థం చేసుకోవాలనుకున్నాడు. యిక తనకి అర్థం కాదు అని తేలిపోయేక విసుగనిపించింది. కొంచెం సేపటి తర్వాత అందరి ముఖాలమీద కనిపించిన క్రోధావేశాలు గుర్తు వచ్చి అతనికి విచారం కలిగింది, వెళ్లిపోదామనుకున్నాడు. అతను కింది వేపు వెళ్లేడు. గేలరీ దారి దాటుతూ వుంటే అతనికి వో బడి కుర్రాడు కనిపించేడు. అతని కళ్లు కాయలు కాచి వున్నాయి. విచారంగా వున్నాడు. అటూ యిటూ తిరుగుతున్నాడు. లేవిన్‌కి మెట్లమీద యెత్తు మడమల చెప్పులు తొడుక్కున్న ఆడమనిషి కనిపించింది. ఆమె గబగబ పరిగెడుతోంది. ఆమె వెనకాల చురుగ్గా అడుగులు వేసే అసిస్టెంట్ ప్రాసెక్యూటర్ వెడుతున్నాడు.

"నే చెప్పా తమకి, మనం ఆలస్యం అవలేదని" అంటూ లేవిన్ తప్పుకుని దారి యిస్తే ముందుకు వెడుతూ వుండగా ఆ ప్రాసెక్యూటర్ ఆమెతో అన్నాడు.

లేవిన్ వెళ్లిపోయేందుకు హాలులో ఫర్‌కోటు తీసుకునే చోట టోకెన్ కోసం జేబులో చెయ్యి పెట్టి వెతుకుతూ వుంటే సెక్రటరీ అతన్ని పట్టుకున్నాడు. "లేవిన్‌గారూ! వోట్లు వెయ్యడం మొదలైంది" అన్నాడు.

వోటింగ్ నెవెదోవ్‌స్కీ కోసం జరుగుతోంది. అతను ఆరు నూరైనా నూరూ ఆరైనా అభ్యర్థిగా వుండను అన్న మనిషి.

లేవిన్ హాలు గుమ్మం దగ్గరికి వెళ్లేడు. అది లోపల్నుంచి మూసేసి వుంది. సెక్రటరీ తలుపు తట్టేడు. తలుపు తెరుచుకుంది. యిద్దరు జమీందార్లు యివతలికి దూసుకు వచ్చేరు. యిద్దరూ ముఖాలు జేవురించుకున్నారు.

"ఉఫ్, యిలా నావల్ల కాదు" అని వో జేవురించుకున్న జమీందారు అన్నాడు.

వాళ్ల వెనకనుంచి గుబేర్నియా మార్షల్‌గారి ముఖం గుమ్మంలో కనిపించింది. ఆయన ముఖం అలసటవల్లా, భయంవల్లా పీక్కుపోయింది.

"యెవళ్లనీ అవతలకి వెళ్లనివ్వద్దని చెప్పాను నీకు!" అని ఆయన గుమ్మం కాపలా వాడిమీద అరిచేడు.

"నేనీయన్ని లోనికి రానిచ్చాను, హుజూర్."

"హాయ్, భగవన్!" అని మార్షల్‌గారు గాఢంగా నిట్టూర్చి, తల వాలేసుకుని, తెల్లని లాగు తొడుక్కున్న కాళ్లని యీడ్చుకుంటూ హాలు మధ్యలో వున్న పెద్ద మేజా దగ్గరికి వెళ్లేడు.

కొత్త పక్షం వూహించినట్లే, అవతలి పక్షంనుంచి నెవెదోవ్‌స్కీకి ఉపమార్షల్‌గా యెక్కువ వోట్లు వచ్చేయి. దాంతో అతనికి మార్షల్ కంటే యెక్కువ వోట్లు వచ్చేయి. అంచేత అతను ప్రభువంశీకుల కొత్త మార్షల్ అయేడు. చాలా మంది సంతోషించేరు, తృప్తి పడ్డారు. యింకా చాలా మంది పరవశించిపోయేరు. మరీ చాలామంది యేడుపు ముఖా లేసుకుని జావ

గారిపోయేరు. పాత మార్షల్ స్నెత్కోవ్ తన యేడుపు దాచుకోలేకపోయేడు. నెవెదోవ్‌స్కీ హాలు బయటికి రాగానే చాలా మంది అభిమానులు అతన్ని చుట్టు ముట్టేశారు, పారవశ్యంతో అతన్ని అనుసరించేరు. ఎన్నికలకి ప్రారంభోత్సవం జరిపిన మొదటి రోజున గవర్నరుగారిని అనుసరించినట్టే యితన్నీ అనుసరించేరు. స్నెత్కోవ్ ఎన్నికైనప్పుడు ఆయన్ని చుట్టు ముట్టినట్టే యితన్నీ చుట్టు ముట్టేరు.

## 31

ఎన్నికల్లో నెగ్గిన కొత్త మార్షల్‌కీ, విజయ లక్ష్మి వరించిన కొత్త పక్షం ప్రముఖులు చాలా మందికీ వ్రాన్‌స్కీ విందు యేర్పాటు చేశాడు.

పల్లెటూళ్లో విసుగ్గా వుండడం వల్లా, అన్నా ముందర తన స్వతంత్రతా హక్కుని చూపించా లనుకోవడంవల్లా వ్రాన్‌స్కీ ఎన్నికలకి వచ్చేడు. తనని జేమ్‌స్త్వో సంస్థకి ఎన్నిక చేయించడంలో స్వియాజ్‌స్కీ పడ్డ శ్రమకి కృతజ్ఞతగా అతన్ని యిప్పుడు బలపరచడం కోసం వ్రాన్‌స్కీ ఎన్నికలకి వచ్చేడు. ప్రభువంశీకుడిగా, జమీందారుగా తను యెంచుకున్న ఆ భూమిక బాధ్యతల్ని నిర్వర్తించేందుకు మరీ ముఖ్యంగా వ్రాన్‌స్కీ ఎన్నికలకి వచ్చేడు. కాని ఎన్నికలకి సంబంధించి తనకి యింత ఆసక్తి పుడుతుందనీ, తను యీ తతంగంలో కంఠ దఘ్నంగా మునిగిపోతాడనీ, యీ కార్యక్రమాన్ని యింత ఘనంగా జరిపించగల ప్రతిభా విశేషాలు తనకి వున్నాయనీ అతను అసలు యే మాత్రం అనుకోలేదు. యీ గొప్పింటి వాళ్ల బృందానికి అతను శుద్ధ పరాయివాడు. కాని, వాళ్లు తనని ఆదరంగా ఆలింగనం చేసుకుని మరీ స్వాగతం చెప్పేరు. ప్రభువంశీకులలో తనకి స్థానం యేర్పాటు అయిపోయిందన్న వూహ అతనికి వచ్చిందంటే అందులో యేమీ తప్పు లేదు. అందుకు కారణం అతని హోదా, ఐశ్వర్యం; కాషిన్‌లో ప్రవర్ధమానమవుతూ వున్న వొక బేంక్ స్థాపకుడూ, వడ్డీవ్యాపారీ, పాత మిత్రుడూ షిర్కోవ్ తన బసకిగాను చేతిలో తాళాలు వుంచిన సొగసైన భవంతి; పల్లె నుంచి తను కూడా తీసుకువచ్చిన అద్భుతమైన వంటవాడు; తన సహపాఠి, తన ఆదర పాత్రుడు అయిన గవర్నరుతో స్నేహం; కాని యీ కారణాలన్నిటినీ మించిపోయిన కారణం అందరితోనూ సాయిలా పాయిలాగా కలిసిపోయి అతను మెలగడం. యిలా మెలగడంవల్ల తను తల బిరుసు మనిషి అని గొప్పింటి వాళ్లకి చాలా మందికి వున్న దురభిప్రాయం పటా పంచలై పోయింది. తనకి పరిచయం అయిన ప్రభువులందరూ ఉత్తరక్షణంలో తనకి మిత్రులై పోయిన విషయాన్ని వ్రాన్‌స్కీ స్వయంగా గమనించాడు – ఒక్కరు తప్ప. ఆ వొక్కడు కిట్టీ ష్చేర్‌బాత్‌స్కీని పెళ్లి చేసుకున్న తిక్క పెద్దమనిషి. అతను à propos de bottes[1] విద్వేషంగా పొగలు కక్కి సెగలు చిమ్మేడు. నెవెదోవ్‌స్కీ నెగ్గడంటే అందుకు

[1] అకారణంగా (ఫ్రెంచి).

తన మద్దతే కారణం అని తనకీ తెలుసు, మిగిలిన వాళ్లకీ తెలుసు. యిప్పుడు మార్షల్‌గా నెవెదోవ్‌స్కీ విజయాన్ని ఘనంగా జరుపుకుందుకు యేర్పాటైన యీ విందులో అగ్ర స్థానంలో కూర్చుని అతను తన అభ్యర్థి నెగ్గాడన్న సంతోషంతో పులకిస్తున్నాడు. ఎన్నికల రుచి తనకి స్వయంగా అందుతోంది. అసలు రాబోయే మూడేళ్లల్లో వివాహం జరిగిపోతే గనక తనే యీ పదవికి పోటీ చెయ్యొచ్చు కూడా. యీ కోరిక పందెంలో జాకీ స్వారీ కింద సొంత గుర్రం బహుమతీ సంపాదించేక, యజమాని తనే స్వయంగా పందెంలో గుర్రాన్ని దౌడు తీయించాలనుకున్నట్టు వుంది.

యిప్పుడు జాకీ విజయాన్ని సంతోషంగా జరుపుకుంటున్నారు. వ్రాన్‌స్కీ మేజా అగ్ర స్థానంలో కూర్చున్నాడు. అతని కుడి వేపున పడుచు గవర్నరు కూర్చున్నాడు, చక్రవర్తి అనుగామి దళంలో అతను జనరల్. అక్కడి వాళ్లందరికీ గవర్నరు గుబేర్నియా అధిపతి, యధావిధిగా ఉపన్యాసం చేసి ఎన్నికలని ప్రారంభించే వ్యక్తి. భక్తి ప్రపత్తులు ఉద్దీప్తం చేసే వ్యక్తి. వంగివంగి అందరూ సలాములు చేసే వ్యక్తి. కాని వ్రాన్‌స్కీకి మాత్రం యీ గవర్నరు చనువైన "మాస్లొవ్ కాత్కా" — అలా అని పేజ్ కోర్‌లో అతన్ని పిలిచేవాళ్లు, — వ్రాన్‌స్కీ సముఖంలో కుదురుగా వుండలేక యిబ్బంది పడే వ్యక్తి. అతన్ని mettre à son aise[1] వ్రాన్‌స్కీ ప్రయాసపడ్డాడు. వ్రాన్‌స్కీ యెడమ వేపున నెవెదోవ్‌స్కీ కూర్చున్నాడు. అతని ముఖం పడుచుదనంతో, కఠోర భావంతో వుంది. తేలుకొండి స్వభావంతో వుంది. వ్రాన్‌స్కీ అతన్ని ఆదరపూర్వకంగా, సరళంగా చూశాడు.

స్వియాజ్‌స్కీ తన వోటమిని సరదాగా తీసుకున్నాడు. అసలు దాన్ని వోటమి అనలేం. అలా అని నెవెదోవ్‌స్కీ గౌరవార్థం చషకం యెత్తి అతన్ని సంబోధిస్తూ అన్నాడు స్వియాజ్‌స్కీ. యేమంటే ప్రభువంశీకులు అనుసరించవలసిన నూతన మార్గానికి నెవెదోవ్‌స్కీ కంటే మంచి ప్రతినిధి దొరకడు. ఆ కారణంగా నిజాయితీపరులందరూ ఆ విజయోత్సవ సందర్భాన్ని ఘనంగా జరుపుకుంటున్నారు అన్నాడు స్వియాజ్‌స్కీ.

హాయిగా మజాగా గడిచినందుకూ, అందరికీ సంతృప్తి కలిగినందుకూ అబ్లాన్‌స్కీ సంతోషపడ్డాడు. విందు భోజనాల మేజా దగ్గర వోటింగ్ సంఘటనల ప్రస్తావన వచ్చింది. పాత మార్షల్‌గారు రుద్ధ కంఠంతో చేసిన ఉపన్యాసాన్ని స్వియాజ్‌స్కీ అనుకరిస్తూ వర్ణించి చెప్పేడు. ఆ దొడ్డ ప్రభువులు 'తమరు కన్నీళ్ల కార్చడంకంటే జటిలమైన పద్ధతిని జమా ఖర్చు పద్దు విషయంలో ప్రవేశ పెట్టాలని' ఆశిస్తున్నట్టు నెవెదోవ్‌స్కీని చూస్తూ అన్నాడు. హాస్యచతురుడైన మరో జమీందారు యింకో విషయం చెప్పేడు. పాత మార్షలుగారు తన విజయోత్సవాన్ని జరుపుకునే ఉద్దేశ్యంతో నాట్యానికి లాంఛన చిహ్నాల బట్టలు వేసుకున్న మార్చలం సమాకూర్చుకున్నాట్ట. యిప్పుడు కొత్త మార్షల్‌కి అలాంటి హంగులతో నాట్యం యేర్పాటు చేసే ఉద్దేశం లేకపోతే ఆ మార్చలాన్ని సాగనంపెయ్యాల్సి వస్తుందట.

---

[1] ఉత్సాహ పరచడానికి (ఫ్రెంచి).

విందు ఆరగించేటంత సేపూ జమీందార్లు నెవెదోవ్‌స్కీని "మా మార్షల్‌గారు" అని, "హుజూర్" అనీ సంబోధిస్తూనే వున్నారు.

యీ పిలుపులు, "మదాం..." అనో "శ్రీమతి..." అనో కొత్తగా పెళ్లయిన ఆమెని పిలిచినప్పుడు ఆమెకి కలిగే ఉత్సాహంలాంటి ఉత్సాహాన్ని కలిగించేయి. యీ నూతన బిరుదుని తను యేం పట్టించుకోనట్టూ, యింకా చెప్తే తిరస్కారపూరితంగా దాన్ని చూస్తూ వున్నట్టూ కూడా నెవెదోవ్‌స్కీ కనిపించ ప్రయత్నించేడు. కాని అతని హృదయం సంతోషంతో పొంగుతూ వున్నట్టు, అయినా ఆ అనుభూతుల్ని యీ నూతన ఉదార వాతావరణంలో శోభస్కరంగా కనిపించవని వాటిని అదుపులో వుంచుకుందుకు శ్రమపడ్డట్టు అందరికీ తెలుస్తూనే వుంది.

విందు జరిగేటప్పుడే ఎన్నికల ఫలితాలు యేమిటో తెలుసుకోవాలని కుతూహలం వుండే వాళ్లకి టెలిగ్రామ్‌లు పంపేరు. మంచి పొంగులో వున్న అబ్లాన్‌స్కీ కూడా భార్యకి టెలిగ్రామ్ పంపేడు. "నెవెదోవ్‌స్కీ పన్నెండు వోట్లతో నెగ్గేడు. అభినందనలు. అందరికీ యీ శుభవార్త చెప్పు" అని అంటూ అతను టెలిగ్రామ్‌లో మాటలకి తోడుగా పైకి "వాళ్లని కూడా ఆనందించ నియ్యాలి" అనే ముక్కని జత చేశాడు. టెలిగ్రామ్ అందుకుని, రూబుల్ క్షవరం అయింది అని దాలీ నిట్టూర్చి, భోజనాలు పూర్తయే ముందు దాన్ని పంపి వుంటాడని అనుకుంది. విందు పూర్తయేక "faire jouer le télégraphe[1]" అబ్లాన్‌స్కీ బలహీనత ఆమెకి తెలుసు.

మంచి వంటకాలు, రష్యన్ మద్య విక్రేతలనుంచి గాక యెకాయెకీ విదేశాలనుంచి తెప్పించిన వైన్‌లూ పుష్కలంగా వున్న వ్రాన్‌స్కీ విందు యే రకంగా చూసినా చాలా హుషారుగా, సరదాగా, చక్కని మర్యాదగా అభిరుచితో వుంది. కొత్త తరహా ఉదారవాదుల్లోనుంచి మంచి హుషారుగా, సరదాగా వుండే యిరవై మందిని స్వియాజ్‌స్కీ యెంపిక చేశాడు. వాళ్లు హుషారుగా వేళాకోళాలాడుతూ కొత్త మార్షల్ కోసం, గవర్నరు కోసం, బేంక్ డైరెక్టరు కోసం, "మన ఘనమైన ఆతిథేయుని కోసం" టోస్టులు ప్రతిపాదించేరు.

వ్రాన్‌స్కీకి సంతృప్తి కలిగింది. ప్రాంతీయ నగరంలో యింత పసందైన వాతావరణం వుంటుందని అతను అనుకోలేదు.

విందు ముగిసే వేళకి ఆనందోత్సాహాలు యింకా అతిశయించేయి. "'సెర్బీ సోదరుల" సహాయార్థం తన శ్రీమతి యేర్పాటు చేసిన ఆయోజిత కచేరీకి రమ్మని గవర్నరు వ్రాన్‌స్కీని పిలిచేడు. వ్రాన్‌స్కీ పరిచయ భాగ్యం కలిగించుకోవాలని గవర్నరుగారి శ్రీమతికి కోరికగా వుందట.

"అక్కడ బాల్ కూడా వుంటుంది. మా ప్రాంతం సౌందర్య రాశిని కూడా నువ్వు చూడచ్చు. నిజంగా ఆమె రంభ అనుకో."

"Not in my line"[2] అని వ్రాన్‌స్కీ ఇంగ్లీషులో అన్నాడు. ఆ పదబంధం

---

1 టెలిగ్రామ్ దురుపయోగ పరిచే (ఫ్రెంచి).

2 మనకి యిష్టం అయినది కాదు (ఇంగ్లీషు).

అతనికి యిష్టం. కాని మందహాసం చేసి వస్తానని మాట యిచ్చేడు.

భోజనాల బల్ల దగ్గర్నుంచి లేచే ముందు, అందరూ సిగరెట్లు ముట్టించుకున్నాక, వ్రాన్‌స్కీ నౌకరు ట్రేలో పెట్టి వో ఉత్తరం పట్టుకు వచ్చేడు.

"వాజ్‌దీజెన్‌స్కాయెనుంచి ప్రత్యేక హర్కారా పట్టుకొచ్చేడు దీన్ని" అని అర్థ వతుగా చూస్తూ చెప్పేడు.

"అరె, అచ్చం ప్రాసెక్యూటర్ స్వెంతిత్‌స్కీలా వున్నాడు కదూ?" అని నౌకర్ని చూసి వొకాయన ఫ్రెంచిలో వ్యాఖ్య చేశాడు. ఆ సమయంలో వ్రాన్‌స్కీ ముఖం ముడుచుకుని ఉత్తరం చదువుకుంటున్నాడు.

ఉత్తరం అన్నానుంచి. చదవక ముందే అందులో యేం వుందో అతను వూహించేడు. ఎన్నికలు అయిదు రోజులుంటాయనే ఉద్దేశంతో అతను శుక్రవారం తిరిగి వస్తానని చెప్పేడు. ఆ వేళ శనివారం. ఉత్తరంలో అందుగ్గాను శాపనార్థాలు వుంటాయని అతను వూహించేడు. తను ముందు రోజు సాయంత్రం పంపించిన ఉత్తరం ఆమెకి యింకా చేరలేదన్న మాట.

ఉత్తరంలో విషయం వ్రాన్‌స్కీ వూహించినట్టే వుంది. కాని ధోరణి మాత్రం వూహించినట్టు లేదు, ముఖ్యంగా కష్టం కలిగించింది. 'అన్యాకి చాలా జబ్బుగా వుంది. న్యూమోనియా కావచ్చని డాక్టరు అన్నాడు. వొక్కత్తినీ అవడంతో యేం చెయ్యడానికీ నాకు తోచడం లేదు. ప్రిన్సెస్ వర్వారా సాయం చెయ్యడం సరేసరి బాధ కలిగిస్తోంది. నువ్వు వస్తావని మొన్న, నిన్న యెదురు చూశాను. నువ్వెక్కడున్నదీ, యేం చేస్తున్నదీ తెలుసుకు రమ్మని మనిషిని పంపుతున్నాను. నేనే స్వయంగా వద్దామని అనుకున్నాను కాని యెందుకు లెమ్మని మానేశాను, నీకు నేను రావడం యిష్టం వుండదని తెలిసి. యేదో కబురు వెంటనే పంపించు. యేం చెయ్యాల్సిందీ నాకు అర్థమవుతుంది.'

బిడ్డకి వొంట్లో బాగా లేదు వో పక్కన, తనేమో యిక్కడకి ప్రయాణమవుదామనుకుందీ! పాపకి వొంట్లో బాగా లేదాయిరి, తను యిలా అక్కసుగా రాస్తుంది!

ఎన్నికల నిర్మలిన మనోల్లాసానికీ, భారమైన విచారకరమైన ప్రేమకీ — తను ఆ ప్రేమ దగ్గరికిప్పుడు తిరిగి వెడుతున్నాడు — మధ్య వున్న పరస్పర విరుద్ధత వ్రాన్‌స్కీని ఆశ్చర్య చకితుణ్ణి చేసింది. కాని వెళ్లక తప్పదు. అంచేత అతను సాయంత్రం అందిన మొదటి రైలుకి ప్రయాణం అయి యింటికి వెళ్లిపోయేడు.

## 32

వ్రాన్‌స్కీ యిదివరలో యెక్కడికేనా వెళ్లవలసి వచ్చినప్పుడు తమ మధ్య రేగిన జగడాలని, అతను ఎన్నికలకి వెళ్లడానికి ముందు అన్నా మనసులో నెమరు వేసుకుంది. అలాంటి

వాటివల్ల అతన్ని ఆపుచేసి తన వశంలో వుంచుకోడం కుదరదనీ, వాటివల్ల అతన్ని యింకా దూరం చేసుకోవడం అవుతుందనీ తెలుసు. అందుకని అతని యెడబాటుని నిబ్బరంగా భరించాలనే యీ సారి అనుకొంది. కాని వ్రాన్‌స్కీ తను వెడుతున్నానని చెప్పేటప్పుడు అన్నాకేసి చూసిన జడ దృక్కు ఆమెని తీవ్రంగా గాయపరిచింది. దాంతో అతను వెళ్లక ముందే ఆమె నిబ్బరం సడిలిపోయింది.

ఆ చూపు అతనికి వున్న స్వేచ్ఛాధికారాన్ని చాటింది అని తర్వాత వొంటరిగా వున్నప్పుడు దాన్ని గురించి అనుకుంది. దాంతో యెప్పటిలాగానే తన అవమాన భరిత స్థితి ఆమెకి గుర్తు కొచ్చింది. 'తనకిష్టం వచ్చిన చోటికి, యిష్టం వచ్చినప్పుడు వెళ్లే హక్కు వుంది. వెళ్లడమే కాదు, నన్ను వొదిలిపెట్టే హక్కూ వుంది. తనకి అన్ని హక్కులూ వున్నాయి. నాకు యేమీ లేవు. ఆ విషయం తెలిసీ అతను అలా చేసి వుండకూడదు.' 'కాని తను యేం చేశాడు?.. నాకేసి కఠినంగా జడంగా చూశేడు. సరే ఆ చూపు ఫలానా అని చెప్పలేం, వివరించలేం, కాని యింతకు ముందు యెన్నడు అలా లేదు. యీ సారి చూసిన చూపులో యేదో అంతరార్థం వుంది' అనుకొంది. 'నాపట్ల తన ప్రేమ వన్నె తగ్గుతోందని ఆ చూపు అర్థం' అనుకొంది.

తనమీద అతనికి ప్రేమ తగ్గుతోంది అని ఆమెకి నమ్మకం కలిగినా దాన్ని గురించి చెయ్యగలిగింది యేమీ లేకపోయింది. అతనితో తన సంబంధాలని మార్చుకొనేందుకూ మార్గం లేకపోయింది. యిప్పుడు అంతకు ముందులాగానే తన ప్రేమపాశంతో, సౌందర్యంతో మాత్రమే అతన్ని బంధించి వుంచగలదు. యిప్పుడూ అంతకు ముందు లాగానే పగలు యేదో వ్యాపకం కలిగించుకునీ, రాత్రిళ్లు మార్ఫియా తీసుకునీ ఆ భయంకరమైన ఆలోచనని – తనపట్ల అతని ప్రేమ పోతే యేమవుతుంది అన్న ఆలోచనని – మనసునుంచి దూరం చేసుకుంటూ వుంది. అవును, మరో ఉపాయమూ వుంది – అతన్ని తన వశంలో వుంచుకోవడం కాదు, అందుకు ప్రేమ తప్ప వేరే సాధనం లేదు, – కాని తనకి అంటి పెట్టుకుని వుండేటట్టు, తనని వదిలిపెట్టి అతను వెళ్లిపోకుండా వుండే పరిస్థితి కల్పించుకునేటట్టు చెయ్యడం. ఆ ఉపాయం విడాకులు, వివాహం. అన్నా మనసులో దాన్ని గాఢంగా కోరుకో ప్రారంభించింది. అబ్లాన్‌స్కీ గాని వ్రాన్‌స్కీ గాని ఆ ముక్క ప్రస్తావిస్తే వెంటనే అందుకు వొప్పేసుకుందామని నిర్ణయించుకుంది.

అలాంటి వూహలతో ఆమె ఆ అయిదు రోజులు, అతను లేని అయిదు రోజులూ గడిపింది.

ప్రిన్సెస్ వర్వారాతో మాట్లాడ్డం, షికార్లు వెళ్లడం, హాస్పిటల్‌ని చూసి రావడం, యింకా ముఖ్యంగా చదువుకోవడం, వొక దాని తర్వాత వొకటిగా పుస్తకాలు చదవడం ఆమెకి వ్యాపకం కలిగించేయి, కాలక్షేపం అయింది. కాని ఆరో రోజున బండివాడు ఖాళీగా వ్రాన్‌స్కీ లేకుండా స్టేషన్‌నుంచి తిరిగి రావడంతో వ్రాన్‌స్కీ గురించీ, అతనేం చేస్తున్నాడో అన్న

విషయం గురించీ మనసుకి ఆలోచనలు రాకుండా చేసుకోలేకపోయింది. సరిగ్గా అప్పుడే బిడ్డకి వొంట్లో నలత చేసింది. తనే స్వయంగా బిడ్డ పరిస్థితి చూడడం మొదలెట్టింది అన్నా. కాని ఆ పనీ ఆమెకి యేమార్పు కలిగించలేకపోయింది, ముఖ్యంగా బిడ్డ నలత అంత ఆందో ళనకరమైంది కాకపోవడంవల్ల. తను యెంత కొట్టుకులాడినా యీ బిడ్డని ప్రేమించలేక పోయింది, ప్రేమ వున్నట్టు నటించే శక్తి ఆమెకి లేదు. ఆ సాయంత్రం వేళకి వొంటరిగా వుండి పోయింది. దాంతో అన్నాకి వ్రాన్స్కీ గురించిన భయం పుట్టేసింది. బయల్దేరి పట్ట ణానికి వెడదామనుకొంది. కాని మళ్ళీ ఆలోచన చేసి యీ తలాతోకా అందని ఉత్తరం రాసి దాన్ని రెండో సారి చదవను కూడా చదవలేకుండా పంపించింది. దాన్నే వ్రాన్స్కీ చదివేడు. ఆ మర్నాడే ఆమెకి వ్రాన్స్కీ రాసిన ఉత్తరం అందింది. తను ఉత్తరం రాసి పంపినందుకు నొచ్చుకుంది. అతను మళ్ళీ తనకేసి జడంగా చూస్తాడేమోనని, ముఖ్యంగా బిడ్డకి అంత పెద్ద నలత కాదు అని తెలిశాక, అలా చూస్తాడేమోనని ఆమె అతని జడ దృక్కుని గుర్తు చేసుకుని వొణికింది. అయినా ఉత్తరం పంపించినందుకు ఆమెకి సంతోషమూ కలిగింది. తను వ్రాన్స్కీకి బరువు అవుతున్నానన్న విషయాన్ని తన దగ్గరికి తిరిగి రావడానికి అతను విచారంగా తన స్వేచ్ఛని వదులుకుంటాడు అన్న విషయాన్ని అన్నా యిప్పుడు మనసులో వొప్పుకుంది. అయినా గానీ సంతోషపడింది అతను తిరిగి వస్తున్నాడు అని. తనని అతను గుది బండ అనుకుంటే యేంగాక అతను తన దగ్గర వుంటాడు, తను అతన్ని చూస్తుంది, అతని ప్రతి కదలికనీ గమనిస్తుంది.

ఆమె డ్రాయింగ్ రూమ్‌లో దీపం దగ్గర టైయిన్* రాసిన కొత్త పుస్తకం పుచ్చుకుని కూర్చుంది. చదువుకుంటూ, యే క్షణంలోనేనా బండి వస్తుందని యెదురు చూస్తూ, గాలి సవ్వడి వింటూ వుంది. బండి చక్రాల చప్పుడు వినిపించినట్టు చాలా సార్లు అనిపించింది. కాని ఆమె పొరపడింది. ఆఖరికి చక్రాల చప్పుడే కాక బండివాడి అరుపులూ, సింహద్వారం దగ్గర ఛాదితమైన పోర్టికోలో మందంగా చప్పుడు వినిపించేయి. పేషెన్స్ పేకాటలో మునిగిపోయిన ప్రిన్సెస్ వర్వారా కూడా ఆ చప్పుళ్ళు వింది. అన్నా బుగ్గలు కెంపెక్కి నుంచుంది. అప్పటికి రెండు సార్లు మెట్లు దిగి వెళ్ళింది. యీ సారి అలా వెళ్ళకుండా అక్కణ్ణే నుంచుండి పోయింది. తన జిత్తుల మారితనం గుర్తువచ్చి హఠాత్తుగా ఆమెకి సిగ్గయింది. కాని వ్రాన్స్కీ అందుకు యెలా ప్రవర్తిస్తాడోనని యింకా యెక్కువ భయం కలిగింది. మనసులో రేగిన అసూయ తగ్గింది, యిప్పుడు కేవలం అతనికి కోపం వస్తుందేమోననే భయంగా వుంది. పాపకి తగ్గిపోయి హాయిగా వుందన్న విషయం గుర్తు వొచ్చింది. తను వ్రాన్స్కీకి ఉత్తరం రాయగానే నలత తగ్గిపోయి కిలకిల ఆడుకున్నందుకు పిల్లమీద అన్నాకి కోపం కూడా వచ్చింది. ఆ సమయంలోనే ఆమెకి వ్రాన్స్కీ అక్కడ వున్నట్టు, అతని చేతులు, అతని కళ్ళు అతని మొత్తం మూర్తి యెదురుగా వున్నట్టు స్ఫురణకి వచ్చింది. అతని గొంతుక ఆమెకి వినిపించింది. సర్వమూ మరిచిపోయి ఆమె అతన్ని కలుసుకుందుకు సంతోషం పొంగి వస్తూ వుండగా కిందికి పరిగెత్తింది.

''పాపకి యెలా వుంది?'' అని అతను మెట్ల మీదనుంచి అన్నా తన వేపే పరిగెత్తు కుంటూ రావడం చూసి బెరుగ్గా అడిగేడు.

అతను కుర్చీలో కూర్చున్నాడు. ఒక నౌకరు అతని బూట్లు విప్పుతున్నాడు.

''యిప్పుడు బాగా వుంది.''

''నువ్వెలా వున్నావు?'' అని వ్రాన్‌స్కీ బట్టలమీద మంచు దులుపుకుంటూ అడిగేడు.

ఆమె అతని చేతిని తన రెండు చేతులతోనూ పట్టుకుని, అతనికేసే కళ్లప్పగించి చూస్తూ, తన నడుము చుట్టూ వేసుకుంది.

''నాకు యిప్పుడు హాయిగా వుంది'' అని ఆమె కేశబంధాన్నీ, గౌనునీ – తన కోసమే ఆ గౌను ఆమె వేసుకుందని అతనికి తెలుసు – తదేకంగా చూస్తూ వ్రాన్‌స్కీ అన్నాడు.

యిదంతా వ్రాన్‌స్కీకి సంతోషకరంగానే వుంది. కాని యెన్ని సార్లు సంతోషం కలిగించ లేదు! అతని ముఖంమీద, ఆమె యెంతో భయపడిన, శిలాసదృశ కఠోర దృక్కు కనిపించింది.

''నాకు చాలా సంతోషంగా వుంది. నువ్వు బాగానే వున్నావు కదా?'' అని చేతి రుమాలుతో తడి గడ్డాన్ని తుడుచుకుంటూ ఆమె చేతిని ముద్దుపెట్టుకుంటూ అడిగేడు.

'అయినా ఫరవాలేదు. అతను యిక్కడ వుంటే చాలు. తను యిక్కడ వుంటే నన్ను ప్రేమించకుండా వుండలేడు, అంతటి ధైర్యం చెయ్యలేడు' అనుకుంది అన్నా.

ఆ సాయంత్రం హుషారుగా నవ్వుతూ తుళ్లుతూ గడిచిపోయింది. ప్రిన్సెస్ వర్వారా కూడా వాళ్లతోనే వుంది. వ్రాన్‌స్కీ లేనప్పుడు అన్నా మార్ఫియా తీసుకుందని ఆమె అతనితో పితూరీ చేసింది.

''నన్నేం చెయ్యమంటావు? నిద్రపట్టి చావలేదు. వొకటే ఆలోచనలు. నువ్విక్కడ వుంటే మార్ఫియా యెప్పుడూ తీసుకోను. దాదాపు యెప్పుడు తీసుకోను'' అంది అన్నా.

వ్రాన్‌స్కీ ఎన్నికల గురించి చెప్పేడు. అన్నా అదీ యిదీ అడుగుతూ అతను అలా చెప్పే టట్టు చేసింది. అది అతనికి అన్నిటికంటే యెక్కువ సంతోషం కలిగిస్తుంది, యేమంటే అది అతని విజయమే. తర్వాత యింటి దగ్గర విషయాల్లో అతనికి ఆసక్తి కలిగించే వాటి గురించి చెప్పింది. ఆమె చెప్పిన వార్తలన్నీ హుషారు కలిగించే వార్తలే.

కాని రాత్రి పొద్దుపోయేక యిద్దరూ యేకాంతంగా వున్నప్పుడు, అతను మళ్లీ సంపూర్తిగా తన వశంలో వున్నాడని అన్నా చూసి, తన ఉత్తరంవల్ల యేర్పడ్డ దురభిప్రాయాన్ని తొలగించాలనుకుంది.

''నిజం చెప్పు నా ఉత్తరం చూసి నీకు చిరాకు అనిపించింది, నామీద నమ్మకం పోయింది నీకు, కదూ?'' అంది అన్నా.

ఆ మాటలు అంటూనే, తనపట్ల అతని ప్రేమ యెంతటిదైనా తను ఉత్తరం రాసినందుకు అతను క్షమించడు అని ఆమెకి అనిపించింది.

"ఆఁ! అది గూఢంగా వుంది. పాపకి వొంట్లో బాగా లేదు, నువ్వేమో స్వయంగా అక్కడికి వద్దామనుకున్నావు" అన్నాడతను.

"అదంతా నిజమే."

"కాదని నాకు అనుమానం వుందంటావా?"

"అవును, వుంది. నీకు కోపం వచ్చింది, కనిపిస్తూనే వుంది."

"యేం కాదు. నాకు కోపం వచ్చిందీ అంటే వొకటి, నువ్వు వొప్పుకోవు నాకు కొన్ని బాధ్యతలున్నాయని..."

"కచేరీలకి వెళ్లే బాధ్యతలు..."

"పోన్లే యీ గొడవని యింతటితో వదిలేద్దాం" అన్నాడతను.

"యెందుకు వదిలెయ్యాలి?" అందామె.

"నేను వొక్కటే చెప్పదల్చుకున్నాను, కొన్ని అత్యవసరమైన పనులు తగులుతూ వుంటాయి. మాటకి యింటి వ్యవహారం గురించి నేను మాస్కో వెళ్లి తీరాలి కదా... అబ్బ, నువ్వు యెందుకింత చిరచిరలాడే మనిషి వయ్యేవు, అన్నా? నీకు తెలీదా నువ్వు లేకుండా నేను వుండలేనని?"

"అలా అయితే" అని అన్నా హఠాత్తుగా గొంతుక మారిపోతూ వుండగా అంది, "నీకు యీ పద్ధతి జీవితం బరువైందని తేలుతోంది... వొక్క పూటకి వస్తావు, మళ్లీ చక్కాపోతావు, యెలా అంటే..."

"అన్నా, యిది అన్యాయం! నా ప్రాణం అర్పించడానికి తయారుగా వున్నాను—"

కాని అన్నా అతను చెప్పేదాన్ని వినిపించుకోవడం లేదు.

"నువ్వు మాస్కో వెడితే నేనూ వస్తాను. నేనొకత్తినీ యిక్కడ వుండను. మనం విడిపోనేనా విడిపోవాలి, వుంటే కలిసే వుండాలి."

"నీకు తెలుసు అదొక్కటే నా కోరిక అని అందుగ్గాను..."

"నేను విడాకులు తీసుకోవాలి అంతేనా? నేను ఆయనకి ఉత్తరం రాస్తాను... చూస్తూనే వున్నాను యిలా వుండలేను. కాని నీతో మాస్కో వస్తాను.'"

"నువ్వు అలా బెదిరిస్తూ వున్నట్టు మాట్లాడుతున్నావు. సర్వదా నీతోనే వుంటాను, అంతకంటే నే కోరుకునేది యేం లేదు" అన్నాడు వ్రాన్స్కీ, చిరునవ్వు నవ్వుతూ.

కాని వ్రాన్స్కీ యీ మృదువైన మాటలు అంటూ వున్నా అతను చూసిన చూపు జడంగా మాత్రమేకాక సంతప్త, ఘోర పీడిత మానవుని చూపులాగా కూడా భాసించింది.

అన్నా ఆ చూపుని గ్రహించి దాని అర్థం నిజంగా వూహించింది.

'అలా అయితే సరే, చెడ్డ రోజులు వచ్చేయనుకో' అని అతని చూపు చెప్తున్నట్టు కనిపించింది. అది క్షణికమైన ఛాయ మాత్రమే, కాని ఆమె దాన్ని మనసులోనుంచి యెప్పటికీ తుడిచేసుకోలేకపోయింది.

అన్నా భర్తకి ఉత్తరం రాసి విడాకులు యిమ్మని అభ్యర్థించింది. నవంబరు ఆఖర్లో ప్రిన్సెస్ వర్వారాని పీటర్స్బుర్గ్ పంపేసి ఆమె, వ్రాన్స్కీ కలిసి మాస్కో వెళ్లిపోయారు. యిప్పుడు కరేనిన్‌నుంచి జవాబు యే రోజునేనా రావచ్చని విడాకులు తీసుకోవచ్చనీ యెదురు చూస్తూ వుండడంవల్ల వాళ్లు భార్యా భర్తల్లాగానే కలిసి కాపరం చెయ్యడం మొదలుపెట్టేరు.

# యేడవ భాగం

## 1

లేవిన్ దంపతులు మాస్కో వచ్చి మూడు నెల్లు అయింది. కిట్టీకి పురుడు రావాల్సి వుండిందని అలాంటి విషయాల లెక్కల్లో తలపండిన వాళ్లంతా అనుకున్నారు. అయినా కిట్టీకి కాన్పు అవలేదు. కాన్పు వొచ్చే సూచనలు రెండు నెలల నాడు వున్నప్పటి కంటే, దగ్గర పడినట్టూ కనిపించలేదు. డాక్టరు, మంత్రసాని, దాలీ, తల్లి, ముఖ్యంగా లేవిన్ — ఆసన్న సంఘటన గురించి వొణుకు రాకుండా వూహించుకో లేకుండా వున్నాడతను — అందరూ ఆందోళన పడుతున్నారు, కాలు కాలిన పిల్లుల్లా వున్నారు. వొక్క కిట్టీ మాత్రమే చీకూ చింతా లేకుండా మనశ్శాంతిగా హాయిగా వుంది.

ఆమెకి పుట్టబోయే బిడ్డపట్ల, దాదాపు ఆమెకి సంబంధించి విద్యమానంగా వున్న బిడ్డపట్ల, ఆమె అంతరంగంలో ఉత్పన్నమవుతూ వున్న నూతన ప్రేమ భావన యిప్పుడు స్పష్టంగా అనుభూతం అవుతోంది, ఆమె సహర్షంగా యీ అనుభూతికి పులకరిస్తోంది. బిడ్డ యిప్పుడు యెంత మాత్రమూ తనలో అంగంగా భాగం కాదు. వో మేరకి బిడ్డకి సొంత జీవితం, తన ప్రమేయం లేనటు వంటిది, వచ్చేసింది. కిట్టీకి యిది యెక్కువ సార్లు బాధ కలిగించింది. కాని దీంతోబాటు యేదో తెలియని నూతన ఆనందంతో నవ్వాలనిపించే కోరికా పుట్టేది.

కిట్టీకి ఆత్మీయులైన వాళ్లంతా దగ్గరే వున్నారు. అందరూ ఆమెపట్ల యెంతో ఆదరంగా వున్నారు. చెయ్యి కదిపితే యెక్కడ కందిపోతుందో అన్నట్టు చూస్తున్నారు. ఆమెకి సంతోషం కలిగించాలని చూస్తున్నారు. యిదంతా త్వరలో ముగుస్తుందీ అని ఆమెకి అనిపించి, తెలిసి వుండకపోతే ఆమె యింతకంటే యెక్కువ సుఖప్రదమైన దాన్ని కోరుకుని వుండదు. యింతటి మాధుర్య జీవితానికి వొక్కటే సొద్దుగా వుంది. అది పల్లెలో ఆమె ప్రేమిస్తున్న రీతిలో భర్త యిక్కడ లేకపోవడం.

పల్లెటూళ్లో అతను స్థిమితంగా, మార్దవంగా, ఆతిధ్యపూరితంగా వుండేవాడు. అలా వుండడం ఆమెకి యిష్టం. పట్టణంలో అతను యెప్పుడూ వ్యాకులపాటుగా, యెలా వుంటే యేమవుతుందో అని తనకి, యింకా యిదిగా యెవరన్నా కిట్టీ మనసు కష్ట పెడతారేమోనన్న బెదురుతో హెచ్చరిక పాటుగా వున్నాడు. పల్లెటూళ్లో స్పష్టంగా అది తన స్వస్థానం అని ధీమా వుండడంతో అతను యెక్కడకీ ఫలానా పని అని లేకుండా వూరికే వెళ్లేవాడు

కాదు. పట్టణంలో అలా కాకుండా అయ్యో అది చెయ్యి జారిపోతుందేమోనన్నట్టు యెప్పుడూ హడావుడిగానే వుండేవాడు. యింతా చేసి యే పనీ వుండేది కాదు. కిట్టీకి లేవిన్‌పట్ల జాలి కలిగింది. పై వాళ్లకి అతను అలా కనిపించడం లేదని ఆమెకి తెలుసు. దయనీయంగా కనిపించక పోవడమే కాక అందుకు భిన్నంగా వుండేవాడు. నలుగురిలోనూ వున్నప్పుడు అతను పై వాళ్లకి యెలా కనిపిస్తాడోనని కిట్టీ నిష్పాక్షిక దృష్టితో అతన్ని చూసేది. ఆమెకి అలా అతన్ని చూసి నప్పుడు కొంచెం అసూయ కూడా కలిగేది. అతను నలుగురిలోనూ దయనీయంగా కనిపించక పోవడం సరేసరి, తన ఔచిత్యంవల్ల మహిళపట్ల చూపించే లజ్జాన్విత ప్రాచీన ధోరణి మన్నన వల్ల, తన దృఢగాత్రంవల్ల, అన్నిటినీ మించి ఆమెకి తోచినట్టు అతని అభివ్యక్తిపూర్వక వదనంవల్లా యెంతో ఆకర్షణీయంగా వుండేవాడు. కాని అతన్ని ఆమె పరాయి వ్యక్తి దృష్టి నుంచి కాక ఆంతరంగిక దృష్టి కోణంనుంచి చూసినప్పుడు అతను అతనిలా వున్నట్టు కనిపించేవాడు కాదు. అతని స్థితిని ఆమె యింతకంటే వేరే విధంగా వర్ణించలేకపోయింది. పట్టణంలో అతను యిమడలేకపోతున్నందుకు హృదంతరాళంలో అతనిమీద చిరాకు కలిగేది. మళ్లీ మధ్యమధ్య అంతే, అతనికి బస్తీ బతుకు సరిపడదు, సంతృప్తి చెందలేడు అని సమాధాన పడేది.

అయినా నిజానికి అతనిక్కడ చెయ్యడానికి యేం వుంది? అతనికి పేకాట యిష్టం లేదు. క్లబ్బులకి వెళ్లనూ వెళ్లడు. అబ్లాన్‌స్కీలాంటి మజా షోకిలాలతో చెట్టా పట్టా లేసుకు తిరగడం అంటే యేమిటో ఆమెకి యీ పాటికి తెలిసొచ్చింది... పూటుగా తాగడం, తర్వాత యెక్కడికో పోవడం. అలాంటి సందర్భాల్లో మగాళ్లు యెక్కడికి వెడతారో అనే స్ఫురణకే కిట్టీ వొణికి పోయింది. అతను నాగరిక సమాజంతో కలవాల్నా? కాని కిట్టీకి తెలుసు, అలా కలవడానికి పడుచు పిల్లల్తో సంతోషంగా సల్లాపాలాడాలి, మరి అలాంటిది ఆమెకి యిష్టం లేదు. పోనీ అతను తనతో, తల్లితో, తన అక్కల్తో యింటి దగ్గర కూర్చో వాలా? కాని తమ అక్కచెల్లెళ్లు రోజా చెప్పుకునే కబుర్లు — తండ్రి తమ పోచికోలు కబుర్ల గురించి చెప్పినట్టు "అమ్మలక్కల వూసులు" — హుషారుగా సరదాగా అనిపించినా, అతనికి విసుగెత్తిస్తాయి. యిక మరి యేం చెయ్యాలి? తను రాస్తూ వున్న పుస్తకం రాసుకుంటూ వుండాలా? అతనా పనీ ప్రయత్నించేడు. లైబ్రరీకి వెళ్లి ఆ విషయమ్మై పుస్తకాలు చదివి, నోట్సు రాసుకున్నాడు కూడా. కాని అతను కిట్టీకి చెప్పినట్టు యెంత యెక్కువ సేపు యేం చెయ్యకుండా వూరికే వుంటాడో అంత తక్కువ తీరిక ఆ పనికి వుంటోంది. పైగా ఆమెతో తన పుస్తకం గురించి యిక్కడ మరీ యెక్కువ ప్రస్తావన చేశాడు, తత్ఫలితంగా అతని ఆలోచనలు గజిబిజి అయిపోయి, అతనికి దానిమీద ఆసక్తి పోయింది.

బస్తీలో వుండడంవల్ల లాభం వొక్కటే కనిపించింది. వాళ్ల మధ్య దెబ్బలాటలు లేవు. వాతావరణం మారిం దానివల్ల నైతేనేం, యీ విషయానికి సంబంధించి యిద్దరూ అర్థం చేసుకుని హెచ్చరికగా వుండడంవల్ల నైతేనేం మాస్కోకి మకాం మార్చే ముందు వాళ్లిద్దరూ

భయపడినట్టుగా అనుమానం, అసూయల సాకుతో వాళ్లిద్దరి మధ్యా జగడాలు జరగలేదు.

దీనికి సంబంధించి యిద్దరికీ మహత్తర ప్రాముఖ్యం వుండే సంఘటన వొకటి జరిగింది — కిట్టీకీ వ్రాన్స్కీకీ మధ్య భేటీ.

మరీయా బొరీసావ్నా అని వృద్ధ ప్రిన్సెస్ వుంది. ఆవిడ కిట్టీకి ధర్మమాత. కిట్టీ అంటే ఆవిడకి ప్రాణం. కిట్టీ మాస్కో వస్తే చూడాలని వుంది అని ఆవిడ అందట. నెలలు నిండి కాన్పు అయే స్థితిలో కిట్టీ యెక్కడికీ వెళ్లదలచు కోకపోయినా ఆమెపట్ల గౌరవం కొద్దీ తండ్రితో కలిసి ఆవిడ్ని చూడ్డానికి వెళ్లింది. అక్కడ వ్రాన్స్కీ కనిపించేడు.

యీ భేటీ జరిగిన క్రమంలో కిట్టీ దేన్ని గురించేనా తనని తను నిందించుకుని వుంటే, అది కేవలం యీ కారణం వల్లనే — యూనిఫాంలేని ఆ సుపరిచిత విగ్రహాన్ని గుర్తు పట్టగానే కొంచెం సేపు ఆమె శ్వాస ఆగినంత పనయింది, రక్తం జర్న తల్లోకి దూసుకు వచ్చింది, ముఖం యెర్రబడిపోయినట్టు ఆమెకి అనిపించింది. కాని కేవలం ఆ స్థితి కొన్ని క్షణాల సేపే వుంది. తండ్రి వ్రాన్స్కీతో కావాల్సికి పెద్ద గొంతుక పెట్టి మాట్లాడ్డం ముగించే లోపునే ఆమె అతనికేసి చూడగలిగి, ప్రిన్సెస్ మరీయా బొరీసావ్నా మాట్లాడే మాదిరి మాట్లాడ్డానికీ తయారుగానే వుంది. అన్నిటికంటే చెప్పకోవలసింది వ్రాన్స్కీతో మాట్లాడ్డానికి ఆమె యెలా తయారయి వుందంటే ఆమె ప్రతి మందహాసం, ప్రతి గమకం, ఆ సమయంలో తన ముందు అదృశ్యంగా వున్నాడని ఆమె భావించుకుంటూ వున్న భర్త ఆమోదిస్తాడు.

వ్రాన్స్కీతో యేవో కాసిని మాటలు కిట్టీ మాట్లాడింది. ఎన్నికల గురించి అతను వేళాకోళంగా "మన పార్లమెంట్" అని ప్రస్తావించినప్పుడు మందహాసం చేసింది. (అతని వ్యంగ్యం పట్టుకున్నట్టు సూచించడానికి చిరునవ్వు నవ్వడం అవసరం.) కాని అప్పుడే ప్రిన్సెస్ మరీయా బొరీసావ్నాకేసి ముఖం తిప్పి ఆ తర్వాత వొక్క సారి కూడా, అతను సెలవు తీసుకునేందుకు లేచేదాకా, అతనికేసి తిరగలేదు. అప్పుడేనా అతనికేసి తిరగడానికి హేతువు విశదమే: సెలవు తీసుకునేందుకు వొంగి వందనం చేసేటప్పుడు ఆ మనిషికేసి చూడకపోవడం మర్యాద కాదు.

వ్రాన్స్కీతో జరిగిన యీ భేటీ గురించి తండ్రి వొక్క మాట అనకుండా వున్నందుకు మనసులో ఆయనకి దణ్ణం పెట్టింది. కాని యింటికి తిరిగివచ్చేక రోజూ మాదిరిగా షికారు వెళ్లినప్పుడు ఆయన చూపించిన ప్రత్యేక ఆదరాన్ని బట్టి ఆయనకి తృప్తి కలిగినట్టే వుందని ఆమె గ్రహించింది. తనపట్ల తనకీ తృప్తి కలిగింది. వ్రాన్స్కీపట్ల తన పూర్వాను భూతుల నన్నిట్నీ హృదంతరాళంలో అణిచి పెట్టుకోగల శక్తి తనకి వుంటుందనీ, పైకి కనిపించడం మాత్రమే గాక నిజంగానే యదార్థానికి అతనిపట్ల ఉదాసీనంగా వుండగలదనీ, అతన్ని పట్టించుకోకుండా వుండగలదనీ ఆమె వూహించలేదు.

ప్రిన్సెస్ మరీయా బొరీసావ్నా యింటి దగ్గర తను వ్రాన్స్కీని చూశానని కిట్టీ లేవిన్‌తో చెప్పినప్పుడు అతను కిట్టీకంటే యెక్కువగా సిగ్గుతో యెర్రబడి పోయేడు.

అతనికి ఆ విషయం చెప్పడం ఆమెకి కష్టం అయింది, ఆ భేటీ వివరాలు చెప్పడం ఆమెకి యింకా కష్టం అయింది. యేమంటే అతనా వివరాలు అడగలేదు. వూరికే ముఖం ముడతలు పడేసుకుని ఆమెకేసి చూస్తూ వుండి పోయేడంతే.

"నువ్వు అక్కడ లేకపోవడం నాకు యాతనైంది" అందామె. "అంటే నా ఉద్దేశం అది కాదు అదే గదిలో... నువ్వుండి వుంటే యింత యిదిగా అనిపించేది కాదు నాకు... నాకిప్పుడు యెక్కువ, చాలా యెక్కువ సిగ్గుగా వుంది" అని ఆమె కుదుళ్లల్లోకంటా యెర్రబడిపోతూ అంది. "...కాని నువ్వు యే సందులో నుంచేనా చూసి వుండాల్సింది" అంది.

తను చేసిన పని ఆమెకి తృప్తి కలిగించినట్టు ఆమె నిజాయితీపూర్వక నేత్రాలు లేవిన్‌కి చెప్పాయి. ఆమె సిగ్గుతో యెర్రబడుతూ వున్నప్పటికీ అతనికి స్థిమితం కలిగింది. ఆమెని అవీ యివీ అడగడం మొదలుపెట్టేడు. ఆమె కోరుకున్నదీ అదే. ఆమెనుంచి అన్ని వివరాలూ తెలుసుకున్నాక, కేవలం మొదటి క్షణంలోనే ఆమె సిగ్గుతో బెదిరింది కాని తర్వాత వ్రాన్‌స్కీతో శుద్ధ పరాయి మనిషితో వున్నట్టు మామూలుగా, సాదాగా వుందని తెలుసుకున్నాక లేవిన్‌కి పూర్తిగా ఉత్సాహం కలిగింది. తను యిక పైన ఎన్నికలప్పుడు ప్రవర్తించినట్టు తెలివితక్కువ తనంతో వ్రాన్‌స్కీతో ప్రవర్తించనని, వీలైనంత స్నేహపూర్వకంగా వుంటాననీ చెప్పాడు.

"వో వ్యక్తి దాదాపు నీకు శత్రువు, అతన్ని కలుసుకోవడంగా వుంటుంది ప్రాణసంకటమే అనేది చాలా బాధగా వుంటుంది" అంటూ "నాకు చాలా చాలా సంతోషంగా వుంది" అన్నాడు లేవిన్.

## 2

"నీకు పుణ్యం వుంటుంది, బాల్ దంపతుల్ని చూడు వెళ్లి" అని కిట్టీ భర్తతో అంది. ఉదయం పదకొండు గంటలప్పుడు యింట్లోనుంచి బయటకి వెడుతూ అతను ఆమె దగ్గరికి వచ్చేడు. "సాయంత్రం క్లబ్బులో భోజనం చేస్తావని* నాకు తెలుసు. నాన్న నీ పేరు రాయించారట. కాని అప్పటిదాకా యేం చేస్తావు?" అంది.

"వూరికే కతవాసొవ్ దగ్గరికి వెడతా" అని లేవిన్ అన్నాడు.

"యింత పెందరాళేనా?"

"నన్ను మేత్రొవ్‌కి పరిచయం చేస్తానని ఆయన అన్నాడు. మేత్రొవ్‌తో నా పుస్తకం గురించి మాట్లాడతాను. ఆయన పీటర్స్‌బుర్గ్‌లో పేరున్న మేధావి" అన్నాడు లేవిన్.

"ఆయన వ్యాసాన్నేనా నువ్వు అంతలా పొగిడేవు? వూ, తర్వాత యేం చేస్తావు?"

"మా అక్క వ్యవహారాలు యే దిశకి వచ్చాయో కోర్టుకి వెళ్లి కనుక్కుంటా."

"మరి సంగీత కచేరీయో?"

"నే వొఖ్ఖణ్ణే అక్కడేం చెయ్యను?"

"వుహూఁ, తప్పకుండా వెళ్ళు, కొత్త వాటిని వినిపిస్తారట... నీకు సరదాగా వుండేవాటిని. నేనైతే తప్పకుండా వెళ్ళేదాన్ని."

"యేమైనా సాయంత్రం భోజనాలకి ముందు వచ్చేస్తాను యింటికి" అని గడియారంకేసి చూసుకుంటూ అన్నాడు.

"ఫ్రాక్ కోటు తొడుక్కుని వెళ్ళు. తిన్నగా కౌంటెస్ బాల్ వాళ్ల యింటికి వెళ్ల డానికి."

"అక్కడికి వెళ్లక తప్పదా?"

"తప్పదు. వాళ్లు మనింటికి వచ్చి చూశేరు. యేమంత యిబ్బంది నీకు? వెడతావు, అయిదు నిముషాలు కూర్చుంటావు వాతావరణం చలిగా వుందనో, మరోలా వుందనో మాట్లాడ తావు. తర్వాత లేచి చక్కా పోతావు."

"నువ్వు నమ్మవు నాకిది యెంత అలవాటులేని పనో యెంత సిగ్గుగా కనిపిస్తుందో. యిదెలా బాగుంటుంది? యెవళ్లో ముక్కూ మొహం తెలియని వాళ్ల యింటికి వెళ్లడం, కూర్చో వడం, పనీ గినీ లేకుండా బైఠాయించడం, వాళ్ల పని పాడు చెయ్యడం, వాళ్లని విసిగించడం, బుర్ర పాడు చేసుకోవడం చక్కా పోవడం?"

కిట్టీ నవ్వింది.

"కాని పెళ్లవక ముందు వాళ్లింటికీ వీళ్లింటికీ వెడుతూ వుండే వాడివి కదా?" అంది.

"వెళ్లేవాణ్ణి. కాని యెప్పుడూ సిగ్గుగా వుండేది. యిప్పుడు ఆ అలవాటూ తప్పిపోయింది. నిజం చెప్తున్నా. రెండు రోజులు భోజనం లేకుండా వుండగలను అక్కడికి వెళ్లడంకంటే, వొట్టు! నాకెంత సిగ్గుగా వుంటుందో. నా కనిపిస్తూంది వాళ్లు 'యేం పనీ గినీ లేకుండా యెందుకు తమరిక్కడికి దయచేసినట్టు' అనుకుంటారేమోనని."

"అబ్బె, యేం అనుకోరు, నే చెప్తున్నాగా, ఒట్టు" అని కిట్టీ అతని ముఖంలోకి చూస్తూ నవ్వుతూ అంది. ఆమె అతని చెయ్యి అందుకుంది. "సరే, మరి, వెళ్లిరా... నీకు పుణ్యం వుంటుంది వాళ్ల యింటికి మాత్రం వెళ్లడం మర్చిపోకేం" అంది.

అతను ఆమె చెయ్యి ముద్దు పెట్టుకుని వెళ్లిపోబోతూ వుంటే కిట్టీ అతన్ని ఆపింది.

"చూడు, నా దగ్గర వొక యాభై రూబుళ్లు మాత్రమే మిగిలాయి."

"అలాగా. నేను దారిలో బేంక్‌కి వెళ్లి తెస్తాలే. యెంత కావాలి?" అని అడిగాడు. అతని ముఖంలో అసంతృప్తి కనిపించింది. అది ఆమెకి బాగా తెలుసు.

"వుండు, కొంచెం సేపు ఆగు" అంది అతని చెయ్యి పట్టుకుంటూ. "యీ విషయం గురించి కొంచెం మాట్లాడుకుందాం. నాకు యీ విషయం యిబ్బందిగా వుంది. నేనేం అనవసరంగా వొక్క కోపెక్కు ఖర్చు పెట్టడం లేదు, అయినా డబ్బు హారతి కర్పూరంలా యిగిరిపోతోంది. లొసుగు యెక్కడుందో తెలీటం లేదు" అంది.

"అబ్బే, అదేం కాదు" అని అతను గొంతుక సవరించుకుని కనుబొమలు ముడుచుకుని ఆమెకేసి చూస్తూ అన్నాడు.

అతను గొంతుక అలా సవరించుకోవడం అంటే యేమిటో ఆమెకి తెలుసు. అతనికి బాగా అసంతృప్తిగా వుందని దాని అర్థం. ఆమె పట్ల కాదు, తన పట్లనే ఆ అసంతృప్తి. అతనికి నిజంగానే అసంతృప్తిగా వుంది. డబ్బు హరించుకు పోతోందన్న దానివల్ల కాదు, యేదో పొరపాటు జరిగిపోతోంది అని అతనికి గుర్తు వచ్చిందానివల్ల. ఆ విషయాన్ని అతను మర్చిపోదా మనుకుంటున్నాడు.

"గోధుమ అమ్మేసి సొమ్ము వసూలు చెయ్యమని సొకొలోవ్‌తో చెప్పాను. డబ్బుకేం బెంగలేదు, భయపడకు" అన్నాడు.

"అది కాదు, నా భయం యెక్కువ ఖర్చవుతోందేమో..."

"అబ్బె, అదేం కాదు" అని లేవిన్ తన మాటల్ని రెట్టించాడు. "సరే వెళ్లొస్తా" అన్నాడు.

"కాదు, నాకు అప్పుడప్పుడు అయ్యో అనిపిస్తూ వుంటుంది అమ్మ మాట విని యిక్కడికొచ్చామే అని. పల్లెలో యెంత బాగుండేది! యిక్కడ అందరికీ యిబ్బంది కలిగిస్తున్నాను. బోలెడు డబ్బు ఖర్చు అవుతోంది..."

"అబ్బె, అదేం కాదు, అదేం కాదు! మన పెళ్లి రోజునుంచీ వొక్క సారి కూడా యింత కంటే బాగా వుండగలమా అని అనుకోలేదు..."

"నిజంగా?" అని ఆమె లేవిన్ కళ్లల్లోకి చూస్తూ అంది.

అతనా మాటని అనుకోకుండానే ఆమెకి సంతుష్టి కలిగించడానికి అన్నాడు. కాని తన కళ్లల్లోకి గుచ్చిగుచ్చి నిజమా అన్నట్టు చూస్తూ వున్న ఆమె అనురాగపూరిత నిశ్చల నేత్రాలని చూడగానే మనస్ఫూర్తిగా అదే మాటలని రెట్టించాడు. 'నేను యీమె సంగతి యేమిటో మర్చేపోతూ వుంటా' అని జరగబోయే దాన్ని గురించి గుర్తు చేసుకుని అనుకున్నాడు.

"త్వరలో రావచ్చుంటావా? నీకెలా వుంది వొంట్లో?" అని ఆమె రెండు చేతులూ పట్టుకుని అడిగేడు.

"నాకు తెలిసిపోయిందని యెన్ని సార్లో అనుకున్నాను, యిక యిప్పుడు అనుకోవడం మానేశాను: నాకు యేం తెలీదు."

"నీకేం భయంగా లేదు కదా?"

ఆ మాటని ఆమె కొట్టి పారేస్తున్నట్టు చిన్నగా నవ్వింది.

"పిసరు కూడా భయం లేదు."

"నా అవసరం పడితే కతవాసొవ్‌ల యింటికి కబురు చెయ్యి."

"యేం అవసరం వుండదు, నువ్వు దాన్ని గురించి యేమీ అనుకోను కూడా అనుకోవద్దు. నాన్నా నేనూ కలిసి చెట్లున్న రోడ్డుమీద షికారు వెడతాం. దాలీని చూస్తాం. సాయంత్రం భోజనాల వేళ నీ కోసం చూస్తూ వుంటాను. అయ్యో, ఉఫ్! తెలుసా దాలీ పరిస్థితి బొత్తిగా

తీసికట్టుగా వుంటోంది. తల మునకలుగా అప్పులు. చేతిలో చిల్లిగవ్వలేదు. నిన్న నేనూ అమ్మా అర్సేనియ్ బావతో (అక్కగారు నతాలీ భర్త అర్సేనియ్ ల్వోవ్‌ని అలా పిలుస్తారు) మాట్లాడేం. నిన్నూ బావనీ అబ్లాన్‌స్కీ దగ్గరికి పంపుదామనుకున్నాం, అతనికి చెపుతారని. పరిస్థితి అధ్వాన్నంగా వుంది. నాన్నతో యీ విషయం చెప్పలేం... కాని మీరిద్దరూ కలిసి..."

"కాని మేమేం చెయ్యగలం?" అని లేవిన్ అడిగాడు.

"యేముంది, నువ్వు అర్సేనియ్ బావ దగ్గరికి వెడతావు, అతను మాట్లాడతాడు. మేం యేం నిర్ణయం చేశామో అతను చెప్తాడు."

"అర్సేనియ్ యేం చెప్పినా ముందే వూఁ అనేస్తాను. అతని దగ్గరికీ వెడతాను. ఆఁ, సరే, నేను గనక సంగీత కచేరీకి వెడితే నతాలీతో కలిసి వెడతా, మరి, వుంటా."

అతనికి గుమ్మంలో తన బ్రహ్మచారి రోజుల నాటి పాత నౌకరు కుజ్మా యెదురయేడు. అప్పట్లో బస్తీలో యింటిని చూస్తూ వుండేవాడు.

"బ్యూటీ..." (బండికి యెడం వేపు కట్టే గుర్రం, వూరినుంచి దాన్ని తీసుకొచ్చేరు) "మళ్లీ నాడాలు వేయించారు, కాని అది యింకా కుంటుతూనే వుంది. యేం చెయ్యమని హుకుం?" అని అడిగేడు.

మాస్కో వచ్చిన కొత్తలో లేవిన్ వూరినుంచి తీసుకువచ్చిన గుర్రాలని శ్రద్ధగా చూసేవాడు, వుంచేవాడు. యెంత వీలైతే అంత బాగా, చవగ్గా గుర్రబ్బండి సమస్య లేకుండా చేసుకోవాలని అనుకున్నాడు. కాని నిదానంమీద తేలిందేమిటంటే సొంత గుర్రాల్ని వుంచుకోవడం కంటే అద్దె బండి గుర్రాలని తెచ్చుకోవడం చవక అని. దాంతో సొంత గుర్రాలు వున్నా అద్దె గుర్రాల్ని తెచ్చుకునేవాళ్లు.

"పశువుల డాక్టర్ని పిలిపించండి. ఆనెలు వాచాయేమో."

"కాని అమ్మగారికి బండి లేకుండా యెలా జరుగుతుందండి?" అని కుజ్మా అడిగేడు.

మాస్కో వచ్చిన కొత్తలో మాదిరీ లేవిన్ యీ ముక్క విని అదిరిపోలేదు. వాజ్‌ద్విజెన్‌క వీధినుంచి సీవ్‌త్సెవ్ వ్రాజెక్ వీధిదాకా సుమారు వో కాలు వెర్‌స్త దూరం మంచులో వెళ్లేందుకు గాను భారీబగ్గీకి రెండు దిట్టమైన గుర్రాల్ని కట్టాల్సివచ్చేది. అక్కడ ఆ గుర్రాలు నాలుగు గంటలు వుండడానికి పట్టుకి అయిదు రూబుళ్లు ఖర్చయేవి. యిప్పుడు యిది మామూలైపోయింది.

"మన బగ్గీకి రెండు అద్దె గుర్రాల్ని కట్టించమని చెప్పు."

"చిత్తం, అయ్యా."

పల్లెటూళ్లో తలకాయ నొప్పి తెప్పించే యీ సమస్యని బస్తీ జీవితం ధర్మమా అని యింత సునాయాసంగా తేల్చేసి లేవిన్ బయటకి వెళ్లేడు. అద్దె బండిని పిలిచి యెక్కి నికీత్స్కయా వీధికి పొమ్మని చెప్పేడు. దారిలో అతను డబ్బు గురించి ఆలోచించలేదు. పీటర్స్

బుర్గ్ సామాజికశాస్త్రవేత్తని కలుసుకోవడం గురించే అనుకున్నాడు. తన పుస్తకం గురించి అతనితో చర్చించే విషయాల గురించే అనుకున్నాడు.

మాస్కోకి మకాం మారి వచ్చిన కొత్తలో లాభం యే మాత్రమూ లేకపోయినా తప్పని సరిగా చెయ్యాల్సివచ్చిన ఖర్చులు చూసి ఆశ్చర్యపోయేడు. పల్లెటూరి వాడికి యేమీ అర్థం కాని ఆ ఖర్చులు యెటు వేపు తల తిప్పితే అటు వేపునుంచి తగిలేవి. అతను యిప్పటికి వాటికి అలవాటు పడ్డాడు. తాగుబోతుల విషయంలో జరుగుతూ వుంటుందనే లాంటిదే అతనికీ జరిగింది: మొదటి దరాం గొంతుక్కి అడ్డం పడుతుందట, రెండోది సీపి గుల్లలా జారుతుందిట, మూడోదాని తర్వాత చిన్న చిన్న పిట్టలు యెగిరినట్లుగా గొంతుకలో జారిపోతుందిట. లేవిన్ దర్వాన్‌లకి డవాలు కొండానికి వంద రూబుళ్ల నోటు మార్చినప్పుడు యెందుకీ దండుగ మారిన డవాలు బట్టలు అని అనుకోకుండా వుండలేకపోయేడు (వాటికి వో దణ్ణం పెట్టెయ్యొచ్చు, కాని వాటిని వదిలించేసుకుందాం అని లేవిన్ చూచాయగా అన్నప్పుడు అత్తగారు అమ్మ బాబోయ్ కొంప మునిగిపోతుందన్నట్టు చూసిన చూపుని బట్టి అవి యెంత తప్పనిసరో దృష్టిలో వుంచుకున్నాడు). ఆ డవాలు బట్టల ఖరీదు వేసవిలో పనికి పెట్టుకున్న యిద్దరు వ్యవసాయ కార్మికుల కూలీ అంత వుంది. అంటే ఆ ఖర్చు యించుమించు ప్రతిరోజూ ఉదయంనుంచి సాయంత్రందాకా వొంచిన నడుం యెత్తకుండా పనివాళ్లు శ్రమించే మూడు వందల పని రోజుల కూలీకి సమానం అన్నమాట. అందుకని ఆ వంద రూబుళ్ల నోటు ఖర్చు చెయ్యడం అతని గొంతుక్కి అడ్డం పడినట్లైంది. తర్వాత వంద రూబుళ్ల నోటు, యెవళ్లో బంధువుల భోజనాల నిమిత్తం ఖర్చు చేసినటువంటిది, అంత అడ్డం పడలేదు; అయ్యో యీ ఖర్చు మూడు పూడ్ల ఓట్ ధాన్యం కోతకి, కట్టి వేతకి, నూర్పిడికి తూర్పారబట్టడానికి, జల్లించడానికి, గాదెల్లో పొయ్యడానికి సరిపోతుందే అని మనసుకి అనిపించినా. యిప్పుడు యీ బాపతు నోట్లు పిట్టల్లా యెగిరిపోతున్నాయి, అతని మనసులో యెలాంటి ఆలోచనలూ రేగడం లేదు. ఆ సొమ్ము సంపాదించడానికి పడ్డ శ్రమ ఆ సొమ్ము ఖర్చు పెడితే వచ్చే సుఖానికి తూగుతోందా లేదా అనే మాట యెప్పుడో సడ్డయి పోయింది. ఫలానా ధర పలికితేనే గాని ధాన్యం అమ్మకూడదు అన్న తన నియమాన్ని అతను మరిచిపోయేడు. తను అనుకున్న ధర పలుకుతుందని రై ధాన్యం అమ్మకుండా జాప్యం చేసి నెల ముందు అమ్మగలిగిన దానికంటే పూడు యాభై కోపెక్కులు తక్కువకి అమ్మించేడు. యీ ధోరణిలో సొమ్ము ఖర్చు చేసేస్తే ఖాయంగా యేడాది తిరిగే లోపున అప్పుల్లో పడిపోతానన్న చింత కూడా నిష్ప్రయోజనం అయిపోయింది. యిప్పుడు వున్నదల్లా వొక్క సంగతే, యెక్కణ్నుంచేనా రానీ సొమ్మంటూ బేంకులో వుంటే చాలు, రేపు మాంసం కొనుక్కోవడానికి ఫరవాలేదు వుంది అనే దిలాసా. యిప్పటిదాకా అతనికి బేంక్‌లో జమ వుంది. యిప్పుడది యిగుర్చుకుపోయింది. దాన్ని యెలా భర్తీ చెయ్యాలో అతనికి తెలీలేదు. డబ్బు గురించి కిట్టీ ప్రస్తావించినప్పుడు అతనికి కలత కలిగించింది ఆ విషయమే. కాని యిప్పుడా విషయం గురించి ఆలోచించే వ్యవధి

లేదు. బండిలో వెడుతూ వుండగా అతను కతవాసొవ్ గురించీ, మే(త్రొవ్‌ని కలుసుకోవడం గురించీ అనుకున్నాడు.

3

లేవిన్ యీ సారి మాస్కో వచ్చిం తర్వాత అతనికి ప్రొఫెసర్ కతవాసొవ్‌తో సన్నిహితంగా కలిసి తిరిగే అవకాశం వచ్చింది. కతవాసొవ్ చదువుకునే రోజుల్లో యూనివర్సిటీలో మిత్రుడు. లేవిన్ అతన్ని తన పెళ్లయిం దగ్గర్నుంచీ కలవలేదు. కతవాసొవ్ జీవిత దృష్టికోణం స్పష్టంగా సరళంగా వుంటుంది. అందుకని లేవిన్‌కి అతనంటే యిష్టం. కతవాసొవ్‌కా స్పష్టమైన దృష్టికోణం అతని మానసిక పరిమితులవల్ల వచ్చిందని లేవిన్ అభిప్రాయం. లేవిన్ ఆలోచనల్లో తార్కిక సంగత లేకపోవడానికి అతనికి మానసిక క్రమశిక్షణ లేకపోవడం కారణం అని కతవాసొవ్ అభిప్రాయం. కాని కతవాసొవ్ స్పష్టత లేవిన్‌కి యిష్టం, లేవిన్ తార్కిక అసంగత కతవాసొవ్‌కి యిష్టం. అంచేత యిద్దరికీ వొకళ్లనొకళ్లు కలుసుకోవడం వాదించుకోవడం సరదాగా వుండేది.

లేవిన్ తను రాస్తూ వున్న పుస్తకంలో కొన్ని భాగాలు కతవాసొవ్‌కి చదివి వినిపించేడు. కతవాసొవ్‌కి అవి నచ్చేయి. అంతకు ముందు రోజు సాయంత్రం వో బహిరంగ సభ దగ్గర కలుసుకున్నప్పుడు కతవాసొవ్ సుప్రసిద్ధ మే(త్రొవ్ వచ్చేడని లేవిన్‌తో చెప్పేడు. మే(త్రొవ్ రాసిన వ్యాసం వొకటి లేవిన్‌కి బాగా నచ్చింది. లేవిన్ రాస్తున్న పుస్తకంపట్ల మే(త్రొవ్ ఆసక్తి కనబరిచేడట: మే(త్రొవ్ మర్నాడు పొద్దున్న పదకొండు గంటలకి తమ యింటికి వస్తాడనీ, లేవిన్‌ని కలుసుకోవడం అతనికి చాలా సంతోషంగా వుంటుందనీ కతవాసొవ్ అన్నాడు.

"చాలా బాగుంది, నువ్వు నీ పద్ధతులు మార్చుకున్నావు" అని చిన్న డ్రాయింగ్ రూమ్‌లో లేవిన్‌ని పలకరిస్తూ కతవాసొవ్ అన్నాడు. "గంట మోగడం వినిపించింది, కాని, తను అన్న వేళకి రాడే నిజంగా అనుకున్నాను... ఊఁ, అయితే చెర్నోగోరియా వాసుల గురించి యేమంటావ్*? జన్మతః యుద్ధ వీరులంటావ్?" అన్నాడు.

"యేం? యేమైంది?" అని లేవిన్ అడిగేడు.

కతవాసొవ్ క్లుప్తంగా కాసిని మాటల్లో అతనికి యుద్ధానికి సంబంధించిన తాజా సమాచారం చెప్పి చదువుకునే గదిలోకి తీసికెళ్లేడు. ఆ గదిలో లేవిన్‌కి సామాన్యమైన యెత్తు వున్న దిట్టమైన వ్యక్తిని పరిచయం చేశాడు. ఆ వ్యక్తి చూడ్డానికి ఆహ్లాదకరంగా వున్నాడు. అతనే మే(త్రొవ్. వాళ్లు రాజకీయాల గురించి కాసేపు మాట్లాడుకున్నారు. తాజావార్తల గురించి పీటర్స్‌బుర్గ్ ఉన్నత వర్గాలలో యేమనుకుంటున్నదీ ప్రస్తావించుకున్నారు. దీనికి సంబంధించి చక్రవర్తి, వొక మంత్రీ అన్నట్టుగా వొక విశ్వసనీయమైన శ్రోత చెప్పిన మాటల్ని ఉల్లేఖించేడు. చక్రవర్తి అచ్చం వేరే మాటలు అన్నట్టు కతవాసొవ్ కూడా అంతే విశ్వసనీయ వర్గాలద్వారా విన్నాడు. లేవిన్ యీ రెండు రకాల మాటలూ అనగలిగి వుండిన పరిస్థితి

గురించి వూహించుకున్నాడు. దాంతో ఆ విషయానికి సంబంధించిన చర్చ ముగిసింది.

"వూఁ, సరే. మా లేవిన్ భూమికి సంబంధించి వ్యవసాయ కార్మికుల సహజ పరిస్థితుల గురించి పుస్తకం రాస్తున్నాడు" అని కతవాసొవ్ చెప్పేడు. "నేనీ విషయంలో చెయ్యి తిరిగిన వాణ్ణి కాదు. కాని ప్రకృతి శాస్త్రాలని అధ్యయనం చేసేవాణ్ణి కాబట్టి యితను మనుషుల్ని జీవశాస్త్ర నియమాలకి బయట పడెయ్యకుండా తద్భిన్నంగా వాళ్ళు వాతావరణంమీద ఆధార పడినట్టు చూడ్డమూ, వాళ్ల వికాస నియమాలని యీ ఆధారపడడంతో ముడిపెట్టి చూడ్డమూ నాకు సంతోష కారకంగా వుంది" అన్నాడు.

"చాలా ఆసక్తిగా వుంది" అన్నాడు మేత్రొవ్.

"అసలైతే నేను వ్యవసాయంమీద పుస్తకం రాద్దామని మొదలుపెట్టేను. కాని వ్యావసాయిక ఉత్పత్తిలో ప్రధానం అయిన వ్యవసాయ కూలీ గురించి అధ్యయనం చెయ్యడంతో అనుకోని సూత్రీకరణల దగ్గర చేరాను" అని లేవిన్ బెదురుతో యెర్రబడుతూ అన్నాడు.

లేవిన్ తన అభిప్రాయాలు వివరించడానికి దారి వెతుక్కుంటున్నట్టుగా నిదానంగానే మొదలుపెట్టేడు. మామూలుగా చలామణీలో వున్న అర్థశాస్త్ర బోధనలకి వ్యతిరేకంగా మేత్రొవ్ వ్యాసాన్ని రాశాడని అతనికి తెలుసు. కాని తన నూతన ఆలోచనా ధోరణిపట్ల మేత్రొవ్ సానుభూతి యే మేరకి సంపాదించగలడు అనే విషయాన్ని ఆ విద్వాంసుడి శాంత, విజ్ఞతా ప్రకాశమానమైన ముఖాన్ని చూసి గ్రహించలేకపోయేడు, వూహించనూ లేకపోయేడు.

"కాని రష్యన్ వ్యవసాయ కూలీ ప్రత్యేక లక్షణాలు యే విషయంలో మీ దృష్టికి వచ్చేయి? ఒక ప్రాణిగా అతని గుణాల్లోనా లేక అతను వున్న పరిస్థితులలోనా?" అన్నాడు మేత్రొవ్.

ఆ అడిగిన ప్రశ్నలోనే తను అంగీకరించని వైఖరి వొకటి వున్నట్టు లేవిన్ గమనించేడు. కాని తన అభిప్రాయాన్ని విపులీకరించేడు. అదేమిటంటే భూమిపట్ల రష్యన్ వ్యవసాయ కులీ వైఖరి యితర దేశాల్లోని వ్యవసాయ కూలీల వైఖరి కంటే భిన్నంగా వుంటుంది అని. తన అభిప్రాయాన్ని బలపరచుకుందుకు మరో విషయాన్ని అతను గబగబా జత చేశాడు. అదేమిటంటే విస్తారమైన ప్రాచ్య బీడు భూముల్ని లాయకీ చేసుకోవడం తను విధి అనే చింతననుంచి రష్యన్ ప్రజల వైఖరి ఉత్పన్నం అయిందని తన అభిప్రాయంగా చెప్పాడు.

"ప్రజల విధి గురించి సూత్రీకరణలు చేస్తే సులభంగా పొరపాటుపడే అవకాశం వుంది" అని మేత్రొవ్ అడ్డం వెళ్లేడు. "వ్యవసాయ కూలీ స్థితి యెప్పుడూ భూమి, పెట్టుబడి విషయంలో అతని సంబంధంమీద ఆధారపడి వుంటుంది" అన్నాడు.

లేవిన్ తన ఆలోచనని పూరా చెప్పే అవకాశం యివ్వకుండానే మేత్రొవ్ తన ఆలోచనకి సంబంధించిన ప్రత్యేక విషయాన్ని వివరించడం మొదలుపెట్టేడు.

మేత్రొవ్ చెప్పిందాంట్లో ప్రత్యేకం అయింది యేమిటో లేవిన్‌కి బోధపడలేదు. యేమంటే అతను అర్థం చేసుకునే ప్రయత్నం చెయ్యలేదు. ప్రాచుర్యంలో వున్న ఆర్థిక ధోరణులకి మేత్రొవ్ తన వ్యాసంలో తిలోదకాలు యిచ్చినా అతను కూడా మిగిలిన వాళ్లల్లాగా రష్యన్ వ్యవసాయ

కూలీ స్థితిని పెట్టుబడి, కూలీ, శిస్తు అనే వేపునుంచే చూస్తున్నాడని లేవిన్‌కి అర్థమైంది. కాని మేత్రొవ్‌కి తెలిసి వుండాలి యేమంటే ప్రాచ్యభాగంలో, యెక్కువగా రష్యా భూములు వున్న చోట శిస్తు అనేలాంటిదే లేదు; రష్యా ఎనిమిది కోట్ల జనాభాలో పదింట తొమ్మిది మందికి కూలీ అంటే పొట్ట నింపుకోవడమే; ఆదిమ ఉత్పత్తి సాధనాలకంటే వేరే పెట్టుబడి లేదు. అయినా మేత్రొవ్ ప్రతి వ్యవసాయ కూలీనీ యీ దృష్టినుంచే చూస్తున్నాడు. ఆర్థిక వేత్తలకీ తనకీ అభిప్రాయభేదాలు వున్నా, కూలీకి సంబంధించి తను కొత్త సిద్ధాంతం చేసినా — దాన్ని అతను లేవిన్‌కి వివరిస్తున్నాడు — అతని వైఖరి అలానే వుంది.

లేవిన్ అయిష్టంగా విన్నాడు. మొదట అతనితో వాదించాలనుకున్నాడు. మేత్రొవ్ మాటకి అడ్డం వెళ్లి తన సిద్ధాంత వివరణ పూర్తి చెయ్యాలనుకున్నాడు. అలా చేస్తే యిక పైన వాదన వుండదు. కాని తామిద్దరూ అంత భిన్న భిన్న కోణాలనుంచి చూస్తున్నామని తెలిపోయేక, ఒకళ్లనొకళ్లు అర్థం చేసుకోవడం పడదు అని నమ్మకం యేర్పడిపోయేక లేవిన్ అతన్ని వ్యతిరేకించడం మానేసి వూరికే అతను చెప్పేదాన్ని విన్నాడు. మేత్రొవ్ చెప్పేది అంత ఆసక్తిదాయకంగా లేకపోయినప్పటికీ వింటూ వుంటే అతనికి కొంత సంతోషం కలిగిస్తూ వున్నట్టే అనిపించింది. మేత్రొవ్ అంతటి పండితుడు యెంతో ఉత్సాహంతో, శ్రద్ధతో, చర్చనీయాంశానికి సంబంధించి లేవిన్‌కి వున్న పరిజ్ఞానంమీద యెంతో విశ్వాసంతో, మధ్యమధ్య అవతలి మనిషి గ్రహించగలడు అని, మొత్తం సమస్యని సూచనప్రాయంగా తెలియచేస్తూ తన ఆలోచనలని వివరించడం లేవిన్ అహానికి తృప్తి కలిగించింది. లేవిన్ తనపట్ల అతనికా విశ్వాసం వుండడానికి యోగ్యత వుందని భావించుకున్నాడు. కాని మేత్రొవ్ తన సన్నిహిత మిత్రులతో యీ విషయం గురించి చర్చ ఆమూలాగ్రం చూడం కానిచ్చేసాడు. యిక యే కొత్త మనిషి కనిపించినా, మరీ ముఖ్యంగా తనకే యింకా స్పష్టమైన రూపు తీసుకుని యేర్పడకుండా మసక మసకగా వున్న విషయాన్ని శ్రోత దొరికితే తనివితీరా చెప్పేసుకోవాలని మహా కండూతిగా వున్నాడని లేవిన్‌కి తెలీదు.

''కాని ఆలస్యం అవుతోందేమో మనకి'' అని కతవాసొవ్ గడియారం చూసుకుంటూ మేత్రొవ్ తన వాగ్ధోరణిని ఆపగానే అన్నాడు.

''యివాళ స్విన్తిచ్ యాభైయ్యవ వర్ధంతిని* మా ఔత్సాహికుల సమాజం జరుపుతోంది'' అని లేవిన్ అడిగిన దానికి జవాబుగా కతవాసొవ్ చెప్పేడు. ''మేత్రొవ్, నేనూ అక్కడికి వెడుతున్నాం. స్విన్తిచ్ జంతుశాస్త్రంలో చేసిన పరిశోధనలమీద వో పత్రం సమర్పిస్తానని అన్నాడు. రా, సరదాగా వుంటుంది'' అన్నాడు.

''ఆఁ, ఆఁ, వెళ్లే వేళ అయింది'' అన్నాడు మేత్రొవ్. ''మాతో రండి. తర్వాత మా యింటికి వద్దురు గాని బుద్ధి పుడితే. మీ పుస్తకంలో కొన్ని భాగాలు వినిపిద్దురు గాని'' అన్నాడు.

''అబ్బే లేదు లెండి. యింకా పూర్తవలేదు. కాని మీతో మీటింగుకి వస్తాను.''

"యిదిగో తెలిసునా? భేదాభిప్రాయం పంపేశారు?" అని కతవాసొవ్ ఫ్రాక్ కోటు తొడుక్కుంటూ లోపల్నుంచి కేకవేశాడు.

ఈ విధంగా వాళ్ళు విశ్వవిద్యాలయ సమస్య గురించి చర్చించుకోవడం మొదలుపెట్టారు.

ఆ శీతకట్టులో విశ్వవిద్యాలయ సమస్య గురించే యెక్కడ చూసినా మాస్కోలో చర్చ జరిగింది. పడుచు ప్రొఫెసరు ప్రతిపాదించిన వో తీర్మానాన్ని పెద్ద ప్రొఫెసర్లు ముగ్గురు అకడమిక్ కౌన్సిల్‌లో తోసిపుచ్చారు. దాంతో పడుచు ప్రొఫెసర్లు తమ భిన్న అభిప్రాయాన్ని ప్రకటించేరు. కొంతమంది దృష్టిలో పడుచు ప్రొఫెసర్ల యీ అభిప్రాయం దుష్టమైంది. కొంతమంది దృష్టిలో అది సబబుగా సహజంగా వుందని. దాంతో ప్రొఫెసర్లు రెండు పక్షాలుగా విడిపోయేరు.

కతవాసొవ్‌తో సహా కొంతమంది, తమ ప్రత్యర్థుల్ని ద్రోహులుగా, కపటులుగా చూశేరు. రెండో పక్షం వాళ్ళు వీళ్ళని తుదా మొదలూ తెలీని కుర్రకారుగా, పెద్దవాళ్ళని నిరాదరించే వాళ్ళుగా భావించేరు. లేవిన్‌కి విశ్వవిద్యాలయంతో యిప్పుడు సంబంధాలు లేకపోయినా మాస్కోలో వుండగా యీ విషయం గురించి విని, చాలా సార్లు చర్చించేడు. యీ సమస్యకి సంబంధించి తనదంటూ వొక అభిప్రాయం కూడా అతనికి వుంది. అంచేత యిప్పుడు వాళ్ళతో కలిసి విశ్వవిద్యాలయ పాత భవనం దగ్గరికి వెడుతూ అతనూ చర్చలో చురుగ్గా పాల్గొన్నాడు.

సభ మొదలైంది. వూలు టేబిల్ క్లాత్ కప్పిన మేజా దగ్గర కతవాసొవ్, మేత్రొవ్‌లు కూర్చున్నారు. అక్కడ్నే మరో ఆరుగురు వ్యక్తులు కూర్చున్నారు. వాళ్ళల్లో వొకతను వంగిపోయి తను రాసిన దాన్ని చదువుతున్నాడు. లేవిన్ మేజా దగ్గర ఖాళీగా వున్న కుర్చీలో కూర్చున్నాడు. లేవిన్ తన పక్కన కూర్చున్న విద్యార్థిని ఆ చదువుతూ వున్నదేమిటని అడిగాడు. ఆ విద్యార్థి చిరాగ్గా లేవిన్‌కేసి చూసి అన్నాడు:

"జీవిత చరిత్ర."

లేవిన్‌కి శాస్త్రవేత్త స్విన్తిచ్ జీవిత విశేషాల గురించి తెలుసుకోవాలని యేమీ ఆసక్తి లేదు. కాని వినక చేసేదీ లేదు. అతనికి ఆ ప్రఖ్యాత శాస్త్రవేత్త గురించి అనేక కొత్త, కుతూహల కరమైన విశేషాలు తెలిశాయి.

చదవడం అయేక అధ్యక్షుడు చదివిన అతనికి కృతజ్ఞతలు చెప్పేడు. ఆ వర్ధంతికి గాను కవి మీంత్ ప్రత్యేకంగా రాసిన కొన్ని పద్యాలు చదివేడు. తర్వాత కవికి కృతజ్ఞతలు చెప్పేడు. అదయేక కతవాసొవ్ ఆ ప్రముఖ శాస్త్రవేత్త విజ్ఞాన శాస్త్రానికి చేసిన దోహదం గురించి తను రాసిన వ్యాసం కీచుగొంతుకతో బిగ్గరగా చదివేడు.

కతవాసొవ్ వ్యాసం చదవడం పూర్తిచేశాక లేవిన్ గడియారం చూసుకున్నాడు. వొంటి గంట దాటింది. కచేరీకి ముందుగా మేత్రొవ్‌కి తన పుస్తకంలోని భాగాల్ని చదివి వినిపించడం కుదరదని గ్రహించేడు. నిజానికి చదివి వినిపించే కుతూహలం యిప్పుడతనికి పోయింది. అక్కడ వాళ్ళు వ్యాసాలు చదువుతూ వుంటే అతను బుర్రలో మేత్రొవ్‌తో మాట్లాడిన విషయాల

గురించి ఆలోచించేడు. మేత్రొవ్ అభిప్రాయాలు గొప్పవే అనుకుంటూనే తన అభిప్రాయాలూ గొప్పవే అనీ, యిద్దరి అభిప్రాయాల్నీ స్పష్టంగా విపులీకరించి వొక సూత్రీకరణకి రావచ్చనీ, యెవళ్ల మట్టుకి వాళ్లు తన దారిలో కృషి చేసుకుంటూ పోతే అలా జరగచ్చనీ అతనికి విశదం అయింది. ప్రస్తుతంలో తమ తమ అభిప్రాయాల్ని మార్పిడి చేసుకోవడంవల్ల యేం వొరగదు అని విశదం అయింది. సభ ముగిసిన తర్వాత మేత్రొవ్ దగ్గరికి వెళ్లి తను రాలేనని లేవిన్ చెప్పేడు. మేత్రొవ్ అతన్ని అధ్యక్షుడికి పరిచయం చేశాడు. అధ్యక్షుడితో మేత్రొవ్ అప్పుడు తాజా రాజకీయ విషయాల గురించి చర్చిస్తున్నాడు. మేత్రొవ్ సరిగ్గా అంతకు ముందు లేవిన్‌తో చెప్పిన విషయాన్నే అధ్యక్షుడితో చెపుతున్నాడు. లేవిన్ సరిగ్గా తను అప్పుడు చేసిన వ్యాఖ్యనే యిప్పుడూ చేశాడు. కొంచెం తేడా కనిపించడం కోసం అప్పుడే తనకి తట్టిన మరో వూహని జోడించేడు. తర్వాత విశ్వవిద్యాలయ వ్యవహారాల గురించి చర్చ మొదలైంది. లేవిన్ ఆ గొడవ అంతట్నీ విని వుండడంవల్ల, గబగబా మేత్రొవ్‌తో తను రాలేకపోతున్నందుకు యేమీ అనుకోవద్దని చెప్పి, అందరి దగ్గరా సెలవు తీసుకుని, ల్వోవ్‌ల యింటికి వెళ్లిపోయేడు.

## 4

కిట్టీ అక్క నతాలీ భర్త అర్సేనియ్ ల్వోవ్ జీవితమంతా పీటర్స్‌బుర్గ్‌లోనూ, మాస్కో లోనూ, విదేశాల్లోనూ గడిచింది. అతను అక్కడే చదువుకున్నాడు, రాజనీతిజ్ఞుడుగా కొలువు చేశాడు.

అంతకు ముందుటేడే అతను దౌత్య ఉద్యోగానికి రాజీనామా చేశాడు. రాజీనామా చెయ్యడానికి కారణం కష్టాలు కాదు (ల్వోవ్‌కి యెప్పుడూ యెవరితోనూ యే కష్టాలూ రాలేదు), తన యిద్దరు కొడుకులకీ మంచి విద్యా బుద్ధులు అబ్బేట్టు చెయ్యాలని అనుకోవడమే కారణం. అందుకని అతను రాజప్రాసాద పాలనా శాఖలో వో ఉద్యోగంలో చేరి మాస్కోలో స్థిరపడ్డాడు.

ల్వోవ్‌కీ లేవిన్‌కీ అభిప్రాయాలకి సంబంధించి అయితేనేం, అలవాట్లకి సంబంధించి అయితేనేం, వయసుకి సంబంధించి అయితేనేం చాలా తేడా వుంది. ల్వోవ్ వయసులో లేవిన్ కంటే చాలా పెద్ద. అయినా యీ శీతకట్టులో యిద్దరికీ మంచి స్నేహం కలిసింది, వొకళ్ల పట్ల వొకళ్లకి బాగా యిష్టం కలిగింది.

లేవిన్ వెళ్లేటప్పటికి ల్వోవ్ యింట్లో వున్నాడు. లేవిన్ తను వచ్చినట్టు కబురు పంపించకుండానే ల్వోవ్ గదిలోకి వెళ్లేడు.

ల్వోవ్ నడుం దగ్గర పటకా బిగించిన కురతా తొడుక్కుని, ఆకు చెప్పులు వేసుకుని నీలం అద్దాల pince-nez[1] పెట్టుకున్నాడు. చేతుల కుర్చీలో కూర్చుని యెదురుగా

---

[1]చెవి కాడలు లేకుండా ముక్కుమీద ఆని వుండే కళ్ల జోడు.

స్టేండుమీద పెట్టిన పుస్తకాన్ని చదువుతున్నాడు. చేతిని దూరంగా చాచి అందంగా కోసు తేలిన వేళ్ల మధ్య చుట్ట పట్టుకున్నాడు. చుట్ట సగం కాలి నుసి యేర్పడింది.

అతని ముఖం చక్కని కను ముక్కు తీరుతో అందంగా పదునుతనంతో వున్నట్టు కనిపిస్తుంది. ఉంగరాలు తిరిగిన వెండి జుట్టు అతని ఆకృతిని మరింత రాజసం ఉట్టి పడేటట్టు చేస్తోంది. లేవిన్‌ని చూడగానే ఆ అందమైన ముఖం వికసించింది.

''అరె! ఆశ్చర్యంగా వుందే! యిప్పుడే అనుకుంటున్నా యెవళ్లనేనా మీ కోసం పంపు దామని! కిట్టీ యెలా వుంది? యిక్కడ కూర్చోండి... బాగుంటుంది...'' అని అతను లేచి వుయ్యాలాలా వూగే కుర్చీని లేవిన్‌కేసి తోశేడు. "Journal de St.-Pêtersbourg*లో కొత్తగా వచ్చిన సర్క్యులర్ చదివారా? నాకు చాలా బాగా నచ్చింది'' అని కొంచెం ఫ్రెంచి యాసతో అన్నాడు.

పీటర్స్‌బుర్గ్‌లో యేమనుకుంటున్నదీ తాను కతవాసొవ్ చెప్పగా విన్నానని లేవిన్ అతనితో అన్నాడు. రాజకీయాలు మాట్లాడుకున్నాక అతను మెత్రొవ్‌తో తన పరిచయం గురించీ, తను వెళ్లిన సభ గురించీ అతనితో చెప్పేడు. ల్వోవ్‌కి అతను చెప్పిన విషయాలన్నీ బాగా ఆసక్తికరంగా కనిపించేయి.

''మీరు యీ పండిత ప్రపంచంలో కలిసి వెళ్ల గలుగుతున్నందుకు నాకు మిమ్మల్ని చూస్తే అసూయగా వుంది'' అన్నాడు ల్వోవ్. అలా అని అతను ఫ్రెంచిలో మాట్లాడ్డం మొదలుపెట్టేడు, అదే అతనికి సునాయాసంగా వుంటుంది. ''నాకు తీరిక లేదనుకోండి, నిజమే, నా చనీ పిల్లల చదువూ తీరికే వుండదు. నాకు ఆ అవకాశం వుండకుండా పోతోంది. కాని అసలు విషయం, యీ ముక్క చెప్పడానికి నాకు సంకోచం లేదనుకోండి, నాకే అంత విద్య లేదు'' అన్నాడు.

''భలేవారే! మీకు విద్య లేకపోవడం యేమిటి?'' అని లేవిన్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. యెప్పటిలాగానే ల్వోవ్ తన గురించి తక్కువ చేసి చెప్పుకోవడం లేవిన్‌ని కదిలించింది. ల్వోవ్ అలా చెప్పుకోవడం పైకి కనిపించాలనీ కాదు; నమ్రతవల్లా కాదు. నిజంగానే దాపరికం లేకుండానే అతను అలా అంటాడు.

''నిజమే! నాకా చదువులేదు. నా చదువులో లోపాలు యిదివరలోకంటే నాకు యిప్పుడు బాగా కనిపిస్తున్నాయి. పిల్లలకి చెపుతున్నాగా, అందుగ్గాను నా ధారణకి పదును పెట్టాల్సి వస్తోంది. యెన్నో కొత్త అంశాలు నేర్చుకోవాల్సివస్తోంది. పిల్లలకి ట్యూటర్లని పెట్టడమే చాలదు, వాళ్లని పైనుంచి చూసుకోవడమూ కావాలి, మీ వ్యవసాయంలో పనివాళ్లతోబాటుగా పైన అజమాయిషీ చేసేవాడు వున్నట్టు. చూస్తున్నారుగా, నేనేం చదువుతున్నానో'' అని స్టాండ్‌మీద వున్న బుస్లాయెవ్ రాసిన వ్యాకరణం పుస్తకం* చూపించేడు. ''మీష దీన్ని చదవాల్సి వుంది. యిది యెంత కష్టంగా వుంది... యిదిగో యిదేమిటో చెప్పండి. యిక్కడే ముందంటే...''

అలాంటి వాటిని వివరించడం కష్టం అనీ, వాటిని అలానే కంఠస్థం చెయ్యాలనీ లేవిన్ అతనికి బోధ పరచాలనుకున్నాడు. కాని ల్వోవ్ దాన్ని వొప్పుకోలేదు.

"మీకిదంతా తమాషాగా కనిపిస్తోంది."

"అబ్బేబ్బే, యేం కాదు. మీరు ఆశ్చర్యపోతారు వింటే, నా భవిష్యత్ కర్తవ్యం యేమిటైందీ, అంటే పిల్లలకి విద్యా బుద్ధులు నేర్పడం మీనుంచి నేను యెప్పుడూ నేర్చుకుంటున్నాను."

"చాల్లెండి, నానుంచి నేర్చుకునేది యేముంటుంది మీకు!" అన్నాడు ల్వోవ్.

"నాకు వొకటి మాత్రం తెలుసు. మీ పిల్లలకంటే చక్కని శిక్షణతో పెంచుతూ వున్న పిల్లల్ని నేను చూడలేదు. యిలాంటి పిల్లలు వుండాలనే నా కోరిక" అన్నాడు లేవిన్.

ఆ మాటలు కలిగించిన సంతోషం దాచుకోవడం ల్వోవ్‌కి కష్టం అయిందని తెలుస్తూనే వుంది, కాని అతని ముఖం మందహాసంతో మెరవనే మెరిసింది.

"వాళ్లు నాకంటే బాగా వుండాలనేదే నా కోరిక. అంతకంటే నాకు కావాల్సిందేమీ లేదు. మీకు తెలీదు మా పిల్లల్లాంటి వాళ్లు పడేలాంటి కష్టాలు యేమిటో, దేశం కాని దేశాల్లో వుండడంతో వాళ్ల చదువు గుండు కొట్టుకుపోయింది" అన్నాడతను.

"ఆ లోటు భర్తీ అవుతుంది లెండి, మీ పిల్లలు గట్టి వాళ్లు. ముఖ్యంగా కావాల్సింది నైతిక శిక్షణ. మీ పిల్లల్ని చూసి అదే నేను నేర్చుకుంటున్నాను" అన్నాడు లేవిన్.

"మీరు నైతిక శిక్షణ గురించి చెప్తున్నారు. అది యెంత కష్టమైందీ మీరు వూహించలేరు. వో దుర్లక్షణం అణిచామూ అనుకోగానే మరోటి తల యెత్తుతుంది. మళ్లీ పోరు మొదలు. మతం వెనక దన్ను లేకపోయినట్లయితే—గుర్తుంది కదా, ఆ విషయమై మనిద్దరం మాట్లాడుకున్నాం—యే తండ్రీ తన పిల్లల్ని సరైన మార్గంలో పెంచిన పిల్లలుగా చెయ్యలేడు."

లేవిన్‌కి యెప్పుడూ సరదాగా కనిపించే యీ విషయం గురించిన చర్చకి ల్వోవ్ భార్య నతాలీ రావడంతో అడ్డం పడింది. ఆమె అందగత్తె. యెక్కడికో వెళ్లడానికి ముస్తాబై వచ్చింది.

"అయ్యో! మీరొచ్చిన సంగతి నాకు తెలవనే తెలవదే!" అందామె. తను యెన్నో సార్లు విని విని విసుగొచ్చిన భర్త సంభాషణకి అడ్డం వచ్చినందుకు నొచ్చుకోవడం సంగతి సరే సరి, ఆమెకి సంతోషంగా కూడా వుందనేది తెలుస్తూనే వుంది. "కిట్టీ యెలా వుంది? యివాళ భోజనానికి అక్కడికి వస్తున్నాను. వూ" అని భర్తకేసి తిరిగి అంది. "నువ్వు బగ్గీ తీసుకు రా..."

ఆ రోజు యెలా పొద్దు పుచ్చాలా అనే విషయమై భార్యాభర్తల మధ్య చర్చ జరిగింది. ల్వోవ్ యెవళ్లకో స్వాగతం చెప్పడానికి అధికారికంగా వెళ్లాల్సి వుండడంవల్లా, భార్య కచేరీకి, అలాగే ఆగ్నేయ ప్రాంత వ్యవహారాల కమిటీ మీటింగుకీ వెళ్లాల్సి వుండడంవల్లా వాళ్లు చాలా విషయాల గురించి ఆలోచించి నిర్ణయం చెయ్యాల్సి వుంది. లేవిన్ కూడా యింట్లో మనిషే కాబట్టి యీ విషయాల్లో అతనూ తన అభిప్రాయం చెప్పాల్సివచ్చింది. మొత్తంమీద

లేవిన్ కచేరీకీ, మీటింగుకీ నతాలీతో వెళ్ళేటట్టూ, అక్కడ్నుంచి వాళ్ళ బగ్గీని ల్వోవ్ కోసం ఆఫీసుకి పంపితే అతను తర్వాత అక్కడికి వెళ్ళి ఆమెని తీసుకుని కిట్టీ దగ్గరికి వెళ్ళేటట్టూ నిర్ణయం చేశారు. ఒక వేళ అప్పటికి అతని పని అవకపోతే బగ్గీని తిప్పి పంపేస్తాడు, లేవిన్ ఆమెని తీసుకు వెడతాడు.

"యీయన నన్ను పొగడ్తలతో చెడగొడుతున్నాడు" అని ల్వోవ్ పెళ్ళాంతో అన్నాడు. "మన పిల్లలు దీటులేని వాళ్ళట, యీయన అంటున్నాడు. వాళ్ళ సత్తా యెలాంటిదైందీ నాకు తెలిసి వుండగా" అన్నాడు.

"యీయనకి యెప్పుడూ అన్ని విషయాలకీ పారం చూడాలని" అంటూ ఆమె భర్త గురించి చెప్పింది. "ప్రతీదీ సొద్దు లేకుండా వొకటో రకంగా వుండాలంటే యెప్పటికీ సంతృప్తి కలగదు. మా పెంపకం మరో దిక్కులో అతిగా సాగిందని నాన్న అనే మాట నిజమే. అప్పట్లో తల్లిదండ్రులు పిల్లల్ని మిద్దెమీద వుంచి తాము కింద మంచి భాగంలో వుండేవాళ్ళు, యిప్పుడు శుద్ధ తల్లకిందులు వ్యవహారం జరుగుతోంది. తల్లిదండ్రులు మిద్దెమీద వుంటూ వుంటే పిల్లలు మంచి భాగంలో వుంటున్నారు. యీ రోజుల్లో తల్లిదండ్రులకి వాళ్ళ బతుకంటూ యేమీ లేదు, అంతా పిల్లల కోసమే" అంది.

"కాని యిది మనసుకి బాగా తోస్తే యిందులో చెడు యేముంది?" అని ల్వోవ్ మనోహరమైన మందహాసం చేస్తూ ఆమె చెయ్యి పట్టుకుని అన్నాడు. "నిన్ను యెరగని వాళ్ళు నువ్వు కన్న తల్లివి కాదనీ సవతి తల్లివి అనీ అనుకుంటారు" అన్నాడు.

"అతి యెక్కడా కూడదు" అని నతాలీ, భర్త కాగితాలు కోసుకునే చాకుని యథాస్థానంలో పెడుతూ అంది.

"ఒరేయ్, మెరికల్లాంటి పిల్లలూ యిటు రండి రా" అని ల్వోవ్ గుమ్మం దగ్గరికి వచ్చిన తన ముచ్చటైన పిల్లల్ని కేక వేశాడు. వాళ్ళు లేవిన్‌కి నమస్కారం పెట్టి యేదో అడిగేందుకు తండ్రి దగ్గరకి వెళ్ళారు.

వాళ్ళ మాటలు, తండ్రికి యేం చెప్తున్నారో అదీ విందాం అని లేవిన్ అనుకున్నాడు. కాని మొదట నతాలీ అతనితో మాటలు మొదలుపెట్టింది, తర్వాత దర్బారు బట్టలు వేసుకున్న ల్వోవ్ సహోద్యోగి మఖోతిన్ వచ్చాడు. అతనూ ల్వోవ్‌తో కలిసి యెవళ్ళనో కలుసుకుందుకు వెళ్ళాలి. అంతే, యిక ధారా ప్రవాహంలాగా హెర్‌జెగొవీనా గురించి*, ప్రిన్సెస్ కోర్జిన్స్కయా గురించి, నగర దూమ* గురించి, మదాం అప్రాక్సినా అకాల మృత్యువు గురించి మాటలు దొర్లిపోయేయి.

లేవిన్ తను వచ్చిన పనేమిటో మర్చేపోయేడు. హాల్లోకి వచ్చేకనే అతనికది గుర్తు వచ్చింది.

"ఆఁ, మరిచిపోయేను. అబ్లాన్‌స్కీ గురించి కిట్టీ నన్ను మీతో మాట్లాడమని చెప్పింది" అని ల్వోవ్‌తో అన్నాడు. అతను తన భార్య, లేవిన్ కలిసి వెడుతూ వుంటే సాగనంపడానికి వచ్చి మెట్లమీద ఆగేడు.

"అవును, maman మన les beaux-frères,[1] అతనిమీద దాడి చెయ్యమంది" అని ల్వోవ్ చిరునవ్వు నవ్వుతూ యెర్రబడుతూ అన్నాడు. "కాని నన్నెందుకు యిరికిస్తారు యీ గొడవలో?" అన్నాడు.

"సరే అయితే నే దాడి చేస్తాను" అని నతాలీ చిరునవ్వు నవ్వుతూ అంది. ఆమె తెల్లని బొచ్చు కోటు వేసుకుంది. మాట్లాడ్డం ఆగడం కోసం చూసింది. "రండి, వెడదాం" అంది అప్పుడు.

## 5

మాట్నీ కన్సర్ట్‌లో రెండు మంచి కృతుల కచేరీ జరిగింది.

ఒకటి "పచ్చిక బీట్లో కింగ్ లియర్"* సంగీత రచన, రెండవది బాఖ్* స్మత్యర్థం కూర్చిన క్వార్టెట్. రెండూ కొత్తవే. కొత్త శైలిలో వున్నవే. వాటి గురించి లేవిన్ తన అభిప్రాయం యేర్పాటు చేసుకోవాలనుకున్నాడు. వదినగార్ని ఆవిడ చోట్లో కూర్చోబెట్టి అతను వో స్తంభం పక్కన నుంచున్నాడు. శ్రద్ధగా, యథా శక్తి జాగ్రత్తగా వాటిని వినాలని అనుకున్నాడు. దృష్టి మళ్లకుండా వుండేటట్టు ప్రయత్నించేడు. తెల్లటై కట్టుకుని చేతులు వూపి దర్శకత్వం చేస్తూ వున్న సంగీత దర్శకుడి చేష్టలవల్ల సంగీత శ్రావ్యత ఆస్వాదించే స్థాయి తగ్గకుండా వుండాలని ప్రయత్నించేడు. సంగీత దర్శకుడు అలా చేతులు వూపడం యెప్పుడూ దృష్టి మళ్లించేస్తూ వుంటుంది. అలాగే కచేరీ కోసమన్చెప్పి మహా ప్రయాసపడి చెవుల మీదకి రిబ్బన్లు కట్టుకుని టోపీలు పెట్టుకున్న ఆడవాళ్లవల్లా తన దృష్టి మళ్లకుండా వుండాలని ప్రయత్నించేడు. అలాగే వృత్తి కాయుత మస్తిష్కులయి, సంగతం వదిలేసి మిగిలిన అన్ని విషయాల్లోనూ ఆసక్తి వున్నట్టు కనిపించే మనుషులకేసీ అతను చూడలేదు; దృష్టి మళ్లకుండా వుండాలని, పక్కన నుంచుని వదురుతూ వుండే వాళ్లనీ సంగీత ప్రియుల్నీ తప్పించుకున్నాడు. స్తంభం అనుకుని నుంచుని కిందికి చూస్తూ సంగీతం వింటూ వున్నాడు.

"కింగ్ లియర్" సంగీత కృతిని వింటూ వున్న కొద్దీ అతనికి నిర్దిష్టమైన అభిప్రాయం యేర్పడ్డం కష్టమైంది. సంగీతం వొక రసాన్ని ప్రోది చేస్తూ ఆరోహణలో వుందనుకుంటూ వుండే వేళకి, సంగీతంలో కొత్త భావాలు అభివ్యక్తమవుతూ రసభంగం జరిగేది. వొకో అప్పుడు అసంబద్ధ, శుద్ధ జటిల ధ్వనుల రూపంలో స్వరకర్త తిక్క తప్ప యేదీ వ్యక్తమయేది కాదు. కాని యీ సంగీత రసాభివ్యక్తి ఖండాలు కూడా, వొకో అప్పుడు దివ్యంగా భాసిస్తూ, వొకో అప్పుడు కఠోరంగా అనిపిస్తూ వున్నాయి. యేమంటే యే మాత్రం వూహించని రీతిలో పడి, భూమికని తయారు చెయ్యలేకపోయేయి. సంతోషం, విచారం, హతాశ, ప్రేమ,

---

[1] తోడల్లుళ్లమైన వాళ్లం (ఫ్రెంచి).

అలాగే విజయోల్లాసం – అన్నీ యే తారతమ్య విచక్షణ లేకుండా ఉన్మాది ఉద్రేకానుభూతు ల్లాగా వెల్లడయేయి, ఉన్మాదికిలాగానే అవి రెప్పపాటులో లుప్తం అయేయి.

సంగీత ప్రస్తుతీకరణ జరిగేటంత సేపూ లేవిన్ నాట్యం చేస్తూ వున్న వాళ్లని చూసే బధిరుడి మాదిరిగా వున్నాడు. అది పూర్తయే వేళకి అతను నిశ్చేష్టుడైపోయేడు. యే ప్రతి ఫలమూ లేని ధ్యాన మగ్నతవల్లా, ఏకాగ్రతవల్లా బాగా అలసట వచ్చినట్లు కూడా అనిపించింది. నాలుగు వేపులనుంచీ అభినందన పూర్వకంగా దీర్ఘ కరతాళ ధ్వనులు రేగేయి. ప్రతి వొక్కళ్లూ లేచి నుంచున్నారు. నడుస్తూ మాట్లాడుకోవడం మొదలుపెట్టారు. యితరులకి కలిగిన అభిప్రాయాలు తన నివ్వెరపాటుని తొలగిస్తాయని భావించి లేవిన్ సంగీత ప్రియుల కోసం చూశేడు. సంగీతం శాస్త్రజ్ఞానం బాగా వున్న ఓ పెద్ద మనిషి కనిపించడంతో సంబరపడ్డాడు. ఆయన తన మిత్రుడు పెస్త్సోవ్‌తో మాట్లాడుతున్నాడు.

"అద్భుతం!" అని పెస్త్సోవ్ ఉచ్చ స్వరంతో అంటున్నాడు. "లేవిన్‌గారా! బాగున్నారా? ముఖ్యంగా ఆ భాగం, కార్డీలియా* వస్తున్నదనిపించే భాగం, ఆడది das ewig Weibliche[1] విధితో పోరాటం చేసే సందర్భం విశేషం అలంకార శోభితంగా, మూర్తిమయంగా అనిదంపూర్వమైన స్వర శోభితంగా వుంది. యేమంటారు?" అన్నాడు.

"ఉమ్... మ్... యింతకీ కార్డీలియా యెక్కణ్ణుంచి వూడి పడింది?" అని లేవిన్ బెరుకు బెరుగ్గా అడిగేడు, యీ సంగీత కృతి "కింగ్ లియర్"దని పూర్తిగా మర్చిపోయి.

"కార్డీలియా రాకపోవడమేమిటి? యిదుగో చూడండి" అంటూ పెస్త్సోవ్ నున్నటి కార్యక్రమ పత్రం లేవిన్‌కి అందించేడు.

అప్పుడు మాత్రమే లేవిన్‌కి యీ సంగీత కృతి పేరు గుర్తువచ్చింది. ఆ కాగితం వెనకాల అచ్చయిన షేక్‌స్పియర్ పద్యభాగాల రష్యన్ అనువాదాన్ని గబగబా చదవడం మొదలుపెట్టేడు.

"యిది లేకుండా సంగీతాన్ని అందుకోలేరు" అని పెస్త్సోవ్ తన సంగీతాభిమాని మిత్రుడు వెళ్లిపోవడంతో తనకి మాట్లాడ్డానికి యెవళ్లూ లేక లేవిన్‌కేసి తిరిగి అన్నాడు.

విరామ సమయంలో పెస్త్సోవ్‌కీ లేవిన్‌కీ సంగీతంలో వాగ్నర్* ధోరణిమీద వాదం జరిగింది. వాగ్నర్, ఆయన అనుయాయులూ యితర కళల స్థానాన్ని సంగీతం ఆక్రమించే టట్టు చేస్తారు. అదే వాళ్ల తప్పు అని లేవిన్ వాదించేడు. ముఖ లక్షణాలని వర్ణించేటప్పుడు కవిత్వమూ యిదే తప్పు చేస్తుంది, యీ పని చిత్ర లేఖనంది అన్నాడు. యీ దోషానికి ఉదాహరణగా అతను వో శిల్పిని చూపించేడు. ఆ శిల్పి వో కవిగారి విగ్రహం పాలరాతి పాదపీఠంమీద కవి కృత కావ్య బింబ మూర్తుల ఛాయిల్ని పోగరించేడు. "యీ ఛాయలు ఛాయల్లా లేవు, అవి ఆ విగ్రహం మెట్లని అనుకున్నాయి" అన్నాడు లేవిన్. అతనికి యీ పదబంధం నచ్చింది. కాని

---

[1] శాశ్వత అబలత్వం (జర్మన్).

యింతకుముందే తను యీ మాటని యిదే పెస్త్సోవ్‌తో వాడేడేమో ననిపించింది. యీ శంక అతన్ని మహా యిబ్బంది పడేట్టు చేసింది.

అటు వేపు పెస్త్సోవ్ కళ సమీచీనంగా ఏకమనీ అన్ని కళా రూపాలూ మేళన పొందినప్పుడు కళ అభివ్యక్తీకరణలో మహోన్నత స్థితికి చేరుతుందనీ వాదిస్తున్నాడు.

కచేరీలో రెండవ భాగాన్ని లేవిన్ వినలేకపోయేడు. అతన్ని తగులుకున్న పెస్త్సోవ్ విసుగూ విరామం లేకుండా ఆ ఖండికని గురించి మాట్లాడుతూనే వున్నాడు. అవసరం అయిందాని కంటే అతిగా వుందనీ, చవకబారు సరళత అనీ విమర్శించి యీ సాదాతనాన్ని రాఫేల్ పూర్వ శైలి వైఖరి* చిత్ర లేఖనంతో పోల్చేడు. తర్వాత బయటికి వెడుతూ వుంటే లేవిన్‌కి చాలా మంది పరిచయస్థులు తగిలేరు. వాళ్లతో లేవిన్ రాజకీయాల గురించీ, సంగీతం గురించీ, తమ ఉభయులకీ తెలిసిన పరిచయస్థుల గురించీ మాట్లాడేడు. లేవిన్‌కి అక్కడ కౌంట్ బాల్ కూడా కనిపించేడు. తను వాళ్ల యింటికి వెళ్లాలనే విషయం లేవిన్ పూర్తిగా మరిచే పోయేడు.

''మీరు వెళ్లండి'' అని నతాలీ అంది లేవిన్ యీ విషయం చెప్పగానే. ''బాల్ దంపతుల్ని కలవడం కుదరకపోతే నా కోసం సభ దగ్గరికి రండి. మీకు వ్యవధి వుంటుంది'' అంది.

## 6

''బహుశా యిప్పుడు వాళ్లు యెవళ్లనీ కలుసుకోరేమో?'' అని కౌంట్ బాల్ యింటి సింహద్వారం దాటి లోపలికి వెడుతూ అడిగాడు లేవిన్.

''లేదయ్యా, కలుసుకుంటారు, రండి'' అని దర్వాన్ లేవిన్ ఫర్ కోటు అందుకుంటూ కచ్చితంగా కలుసుకుంటారన్నట్టు అన్నాడు.

'అబ్బ! యేం అవస్థ వచ్చి పడింది!' అని లేవిన్ ఉస్సురంటూ వొక గ్లవ్‌ని తీసేస్తూ, టోపీ సర్దుకుంటూ అనుకున్నాడు. 'పైకెందుకు వెళ్లాలి నేను వాళ్ల దగ్గరికి? యేం మాట్లాడాలో యేమిటో?' అనుకున్నాడు.

ముందున్న డ్రాయింగ్ రూమ్ దాటి లోపలికి వెడుతూ వుంటే గుమ్మంలో కౌంటెస్ బాల్ కనిపించింది. ఆమె నౌకర్లకి యేవో పురమాయింపులు చేస్తూ, ఆందోళనగా వుంది. లేవిన్‌ని చూసి ఆమె చిరునవ్వు నవ్వి పక్కనే వున్న చిన్న డ్రాయింగ్ రూమ్‌లోకి రమ్మని పిలిచింది. అక్కడినుంచి యెవళ్లవో గొంతుకలు వినిపిస్తున్నాయి. అక్కడ లేవిన్‌కి కౌంటెస్ యిద్దరు కూతుళ్లు, తనకి పరిచయం వున్న వో మాస్కో నగర కర్నల్ కనిపించేరు. వాళ్లు చేతుల కుర్చీల్లో కూర్చున్నారు. లేవిన్ వాళ్లని పలకరించి, టోపీ వొళ్లో పెట్టుకుని సోఫా దగ్గర కుర్చీలో కూర్చున్నాడు.

"మీ ఆవిడ యెలా వున్నారు? మీరు కచేరీకి వెళ్లారా? మేం రాలేకపోయేం. అమ్మ ఉత్తర క్రియలకి వెళ్లాల్సి వచ్చింది."

"ఆఁ, విన్నా... పాపం, అనుకోకుండా సంభవించిన మృతి" అన్నాడు లేవిన్.

కౌంటెస్ లోపలికి వచ్చి సోఫామీద కూర్చుంది. ఆమె కూడా లేవిన్‌ని అతని భార్య గురించీ, కచేరీ గురించీ అడిగింది.

లేవిన్ జవాబు చెప్పి అప్రాక్సినా మరణం గురించి అదే ముక్క మళ్లీ అన్నాడు.

"యేమిటో, ఆవిడ ఆరోగ్యం యెప్పుడూ అంతంత మాత్రంగానే వుండేది."

"నిన్న మీరు ఒపేరాకి వెళ్లేరా?"

"ఆఁ, వెళ్లేను."

"లుక్కా యేం పాడింది!"

"అవును, అద్భుతంగా పాడింది" అన్నాడు. వాళ్లు తన గురించి యేమనుకున్నా తనకి ఫరవాలేదు కాబట్టి ఆ ప్రఖ్యాత గాయని శ్రావ్య కంఠం గురించి తను వంద సార్లు విని వున్న మాటలనే రెట్టించేడు. కౌంటెస్ బాల్ వింటున్నట్టు నటించింది. అతను సుమారుగా మాట్లాడే ననుకున్నాక మానేసి వూరకే వుండిపోయేడు. అప్పటిదాకా యేమీ నోరు విప్పని కర్నల్‌గారు అప్పుడు అందుకున్నాడు. ఒపేరా గురించీ, స్టేజీ లైటింగ్ గురించీ చెప్పేడు. ఆఖర్న త్యూరిన్ యింటి దగ్గర folle journée[1]* గడిపే ప్రస్తావన చేసి, కర్నల్ నవ్వి, లేచి వెళ్లివస్తానన్నాడు. లేవిన్ కూడా లేచాడు. కాని కౌంటెస్ చూసిన చూపుని బట్టి తను అంత తొందరపడి వెళ్లనవసరం లేదని అర్థమైంది. యింకో రెండు మూడు క్షణాలు వుండచ్చు తను. అతను మళ్లీ కూర్చున్నాడు.

యిది యెంత తెలివిమాలినతనం అని లేవిన్ అనుకుంటూ వుండడంవల్ల యేం మాట్లాడాలో దాన్ని గురించి ఆలోచించలేదు. అంచేత నోరు విప్పలేదు.

"మీరు బహిరంగ సభకి వెళ్తారా? చాలా బాగా వుండే సభ అని విన్నాను" అని కౌంటెస్ మాట కదలేసింది.

"లేదు. నేను belle-soeur[2]కి చెప్పాను ఆమె కోసం వస్తానని" అన్నాడు లేవిన్.

మళ్లీ నిశ్శబ్దం. మళ్లీ తల్లీ కూతుళ్లూ వొకళ్లకేసి వొకళ్లు చూసుకున్నారు.

'యిక వెళ్లే వేళ అయినట్టే వుంది' అనుకున్నాడు లేవిన్. అతను లేచి నుంచున్నాడు. ఆడవాళ్లు అతనితో కరచాలనం చేసి అతని భార్యని అడిగినట్టు చెప్పమనీ mille choses[3] అందచెయ్యమని చెప్పేరు.

---

[1] పిచ్చి రోజు (ఫ్రెంచి).

[2] వదిన (ఫ్రెంచి).

[3] వెయ్యి ప్రణామాలు (ఫ్రెంచి).

కోటు తొడుక్కొనేందుకు లేవిన్‌కి సాయం చేస్తూ దర్వాన్

''తమరు యెక్కడ వుంటారండీ?'' అని అడిగి గబగబా అతని చిరునామాని అందంగా బైండు చేసిన పెద్ద పుస్తకంలో రాసుకున్నాడు.

'యేమైతే నాకేం గాని, మొత్తంమీద అంతా సిగ్గుచేటుగా, పరమ శుంఠాయమానంగా వుంది' అని లేవిన్ అనుకున్నాడు. అందరూ చేసే పనే తనూ చేశాడు అని వూరడించుకున్నాడు. అక్కడినుంచి అతను యెకాయెకీ సభ దగ్గరికి వెళ్లేడు, వదినగారు యెక్కడుందో పట్టుకుని యింటికి తీసుకుపోవడానికి.

బహిరంగ సభ దగ్గర చాలా మంది వున్నారు. దాదాపు గొప్పింటి వాళ్లంతా వున్నారు. లేవిన్ వెళ్లేటప్పటికి నివేదిక యింకా సాగుతోంది. అందరూ అన్నట్టు అది సరదాగా వుంది. అది అయిపోగానే జనం వొకళ్లనొకళ్లు కలుసుకుంటూ పలకరింతలు మొదలుపెట్టారు. లేవిన్‌కి స్వియాజ్‌స్కీ తగిలేడు. లేవిన్‌ని ఆ సాయంత్రం వ్యవసాయిక సంఘం సమావేశానికి రమ్మనీ, వో గొప్పాయన మాట్లాడతాడనీ స్వియాజ్‌స్కీ చెప్పేడు. లేవిన్‌కి అబ్లాన్‌స్కీ కూడా కనిపించేడు. అబ్లాన్‌స్కీ అంతకు ముందే గుర్రప్పందేల దగ్గర్నుంచి వచ్చేడు. యింకా చాలా మంది మిత్రులు, పరిచయస్థులు లేవిన్‌కి కనిపించేరు. లేవిన్ సభ గురించీ, కొత్త నాటకం గురించీ, అప్పట్లో జరుగుతూ వున్న వో న్యాయ విచారణ గురించీ తను అనుకుంటూ వున్న దాన్ని చెప్పి వాళ్లు చెప్పేది విన్నాడు. బహుశా బుర్ర అలిసిపోయిన దానివల్లనో యేమో న్యాయ విచారణ గురించిన ప్రస్తావనలో అతనో పెద్ద తప్పు చేశాడు. తర్వాత ఆ తప్పు గుర్తు వచ్చినప్పుడల్లా చాలా బాధ కలిగేది. ఆ ప్రస్తావన రష్యాలో నేర విచారణ జరుగుతూ వున్న వొక విదేశీయుడికి విధించవలసివచ్చిన దండన గురించి.* దేశంనుంచి బహిష్కరించడం అనే దండన అతనికి విధించడం తప్పు అని చాలా మంది అభిప్రాయం. తనకు తెలిసిన వో వ్యక్తి అంతకు ముందు రోజు సాయంత్రం అన్న మాటలని లేవిన్ యీ సందర్భంలో పునరుద్ఘాటించేడు.

''దేశ బహిష్కార దండన విధించడం అనేది చేపని నీళ్లల్లో పడేసి దండించడం లాంటిది'' అన్నాడు లేవిన్. తన మాటలుగా లేవిన్ అన్న ఆ మిత్రుడి మాటలు క్రిలోవ్* నీతి కథలో చేపకి సంబంధించినవి అనీ, తన మిత్రుడు వాటిని యేదో పత్రికలో పడ్డ వ్యాసంనుంచి తీసుకున్నాడనీ లేవిన్‌కి తర్వాత గుర్తుకొచ్చింది.

వదినగారిని తీసుకుని యింటికి వెళ్లేక, కిట్టీ బాగా హుషారుగా వుండడం చూశేక సంతోష పడి లేవిన్ క్లబ్బుకి వెళ్లేడు.

## 7

లేవిన్ క్లబ్బుకి సరిగ్గా వేళకి వెళ్లేడు. క్లబ్బు సభ్యులు, వాళ్ల అతిథులు అప్పుడే పోగవుతున్నారు. లేవిన్ క్లబ్బుకి వెళ్లి యేనాడైందో. యూనివర్సిటీ చదువు పూర్తి చేసిన తర్వాత

మాస్కోలో నాగరిక సమాజంలో కలిసి మెలిసి తిరిగే నాటినుంచీ మళ్లీ క్లబ్బుకి వెళ్లలేదు. అతనికి క్లబ్బు పరిసరాలు స్థూలంగా గుర్తువున్నాయి. కాని అప్పట్లో క్లబ్బువల్ల తనమీద పడిన ముద్ర యేమిటైందీ పూరా మరిచిపోయేడు. అద్దె బండి అర్ధవృత్తాకారంగా వున్న ముంగిట్లోకి వెళ్లేక, అతను బండి దిగి గుమ్మంలోకి అడుగు పెట్టగానే డవాలా కావలివాడు చప్పుడు చెయ్యకుండా తలుపు తెరిచి వొంగి వందనం చేసి అతన్ని లోపలికి వెళ్లనివ్వగానే, కావలివాడి దగ్గర గుట్టగా వున్న శీతాకాలం కోట్లూ, బూట్లూ కనిపించగానే – వాటిని పైన వున్న వార్డ్‌రోబ్ దగ్గర కంటే యిక్కడ వొదలడమే వాళ్లకి సౌకర్యంగా కనిపించింది – తను వచ్చినట్టు తెలియ చేసే నిగూఢ ఘంటికా నాదం విని తివాసీ కప్పిన మెట్లు యెక్కి మెట్ల వరసపైన వున్న బొమ్మనీ తనకి బాగా పరిచితమైన బాగా వయసు పైబడినట్టు కనిపిస్తూ వున్న డవాలా కావలివాణ్ణి చూడగానే – ఆ కావలివాడు తనని పట్టిపట్టి చూసి వెంటనే, కాని తొందర లేకుండా, తలుపు తెరిచి లోపలికి వెళ్లనిచ్చేడు – యిదంతా చూడగానే లేవిన్‌కి క్లబ్ పాత పరిచిత వాతావరణం వొక్క ఉదుట్న గుర్తువచ్చింది. వొక ఆనందానుభూతి, హాయి అనిపించే భావన, సభ్య వాతావరణం అతన్ని ముంచెత్తాయి.

"అయ్యా, తమరి టోపీ" అని కావలివాడు లేవిన్‌కి గుర్తు చేశాడు. టోపీలని గుమ్మం దగ్గరే వదలిపెట్టాలనే క్లబ్బు నియమాన్ని లేవిన్ మరిచిపోయేడు. "తమర్ని చూసి శానా రోజులైందండయ్యా. ప్రిన్స్ నిన్న తమరి పేరు రాయించారండి. ప్రిన్స్ అబ్లాన్‌స్కీ గారు యింకా వేంచేయ లేదండి" అన్నాడు.

కావలివాడు లేవిన్‌ని మాత్రమే గాక అతని బంధువర్గం యావన్మందినీ, అతనికి బాగా సన్నిహితులైన వాళ్లందర్నీ యెరుగును. యిప్పుడు లేవిన్‌తో వాళ్ల గురించిన ప్రస్తావన చేశాడు.

లేవిన్ లోపలికి వెళ్లేడు. అక్కడ కొయ్య చట్రపు తెరలతో కానాలుగా వేర్పాటై వుంది. కుడి వేపున పళ్లు అమ్మేవాళ్ల గది వుంది. లేవిన్ ముందుకు వెళ్లేడు. మెల్లిగా అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తూ వున్న వో ముసలాయన్ని దాటి భోజనశాలలోకి వెళ్లేడు. అక్కడంతా జనం వున్నారు. అందరూ మాట్లాడుకుంటూ వున్నారు.

లేవిన్ అక్కడ వున్న వాళ్లకేసి పట్టిపట్టి చూస్తూ బల్లల దగ్గర తిరిగేడు. బల్లల దగ్గర యెక్కడా దాదాపు ఖాళీ లేదు. అతనికి అటూ యిటూ అన్ని వేపులా ముసలాళ్లు, పడుచువాళ్లు, వొట్టి ముఖ పరిచయం మాత్రమే వున్నవాళ్లు, బాగా సన్నిహితులైన మిత్రులు కనిపించేరు. ఒక్కళ్లు కూడా ఆందోళనగా చిరాగ్గా వున్నట్టు కనిపించలేదు. తమ టోపీలతో బాటుగా తమ బెంగలన్నిట్నీ వాకిలి కావలి వాడి దగ్గర దిగవిడిచి వచ్చేసినట్టుగా కనిపించేరు వాళ్లు, జీవిత భౌతిక సుఖాల్ని నిదానంగా అనుభవించడానికి వచ్చినట్టుగా కనిపించేరు వాళ్లు. అక్కడ అతనికి స్వియాజ్‌స్కీ, పడుచు ష్చేర్‌బాత్‌స్కీ, నెవెదోవ్‌స్కీ, మావగారు వృద్ధ ప్రిన్స్, వ్రాన్‌స్కీ, కోజ్నిషెవ్‌లూ కూడా కనిపించేరు.

"అరె! యేం యింత ఆలస్యం చేశావ్?" అని వృద్ధ ప్రిన్స్ చిరునవ్వు నవ్వుతూ

లేవిన్ వేపు చెయ్యి చాచేడు. "కిట్టీకి యెలా వుంది?" అని వేస్ట్ కోటు కాజాలోకి దూరిన చేతి రుమాలు సరి చేసుకుంటూ అడిగేడు.

"బాగానే వుంది. వాళ్లు ముగ్గురూ యింటి దగ్గర భోజనం చేస్తున్నారు."

"గొన్లు, రిబ్బన్లు ముచ్చట్లు! యీ బల్ల దగ్గర ఖాళీ లేదు. అదుగో ఆ బల్ల దగ్గరికి గబగబా వెళ్లి చోటు చూడు" అని వృద్ధ ప్రిన్స్, పక్కకి తిరిగి వెయిటర్ చేతిలోనుంచి జాగ్రత్తగా టర్బోట్ చేప ప్లేటు అందుకుంటూ అన్నాడు.

"లేవిన్, యిటు రా" అని కొంచెం దూరంనుంచి ఉల్లాసంగా యెవరో పిలుస్తూ వున్న గొంతుక వినిపించింది. అతను తూరొవ్‌స్తిన్. అతను వో పడుచు ఆఫీసరు పక్కన కూర్చు న్నాడు. వాళ్ల బల్ల దగ్గర రెండు కుర్చీలని తిప్పి పెట్టేరు. లేవిన్ సంతోషంగా వాళ్ల దగ్గరికి వెళ్లేడు. ఉల్లాసంగా వుండే తూరొవ్‌స్తిన్ అంటే అతనికి యెప్పుడూ యిష్టమే. అతని జ్ఞాపకంలో తూరొవ్‌స్తిన్‌కీ, కిట్టీకి తను వివాహ ప్రస్తావన చెయ్యడానికీ యేదో సంబంధం కలిసిపోయింది. యివాళ బుర్రకి వేడెక్కించే చర్చల అలసట తర్వాత తూరొవ్‌స్తిన్ ఉల్లాసపూరిత ముఖం చూడ్డం యెంతో యిష్టంగా వుంది.

"యీ కుర్చీలు నీ కోసమూ, అబ్లాన్‌స్కీ కోసమూ. అతను యిప్పుడొస్తాడు."

పడుచు ఆఫీసరు పేరు గాగిన్. అతని వెన్నుపట్టు నిటారుగా వుంది. అతని కళ్లు యెప్పుడూ నవ్వుతూ వున్నట్టే కనిపిస్తాయి. అతను పీటర్స్‌బుర్గ్‌నుంచి వచ్చేడు. తూరొవ్‌స్తిన్ అతన్ని లేవిన్‌కి పరిచయం చేశాడు.

"అబ్లాన్‌స్కీ యెప్పుడూ ఆలస్యంగానే వస్తాడు."

"అడుగో, రానే వచ్చాడు."

"నువ్విప్పుడే వచ్చేవా?" అని అబ్లాన్‌స్కీ గబగబా బల్ల దగ్గరికి వస్తూ అడిగేడు. "నమస్తే. వోద్కా పుచ్చుకున్నావా? అయితే, రా, మరి వెడదాం" అన్నాడు.

లేవిన్ లేచి అతనితో కలిసి బారుగా వున్న బల్ల దగ్గరికి వెళ్లేడు. దానిమీద రకరకాల వోద్కాలు, నంజుళ్లు వున్నాయి. అక్కడ వున్న యిరవై, పాతిక రకాల తిను బండారాల్లో నుంచి యెవళ్లకిష్టమైన వాటిని వాళ్లు తీసుకోవచ్చు. కాని అబ్లాన్‌స్కీ అక్కడలేని ప్రత్యేకమైన దాన్ని దేన్నో తెమ్మని అడిగేడు. దాన్ని తెచ్చి పెట్టేరు. యిద్దరూ చెరో బుల్లి గ్లాసూ వోద్కా తీసుకుని మళ్లీ బల్ల దగ్గరికి వెళ్లేరు.

బల్ల దగ్గరున్న వాళ్లు టర్బోట్ సూపు తింటూ వున్నారు. తింటూ వుండగానే గాగిన్ వో షాంపేన్ బుడ్డి తెప్పించి నాలుగు గ్లాసుల్లో పోయించేడు. లేవిన్ వద్దనలేదు. తనే స్వయంగా మరో బుడ్డి తెప్పించేడు. అతనికి బాగా ఆకలిగా వుందేమో తృప్తిగా తింటూ తాగుతూ యింకా సంతోషంగా వాళ్ల హుషారైన సాదా సంభాషణలో మాట కలుపుతూ వున్నాడు. గాగిన్ గొంతు తగ్గించి పీటర్స్‌బుర్గ్‌లో చెప్పుకుంటూ వున్న సరికొత్త జోక్‌ని చెప్పేడు.

అది చవకబారుగా, అశ్లీలంగా వున్నా నవ్వు తెప్పించేది గానే వుంది. లేవిన్ పగలబడి నవ్వేడు. ఆ నవ్వుకి పక్క బల్లల దగ్గర కూచున్న వాళ్లు యిటు వేపు తిరిగేరు.

''నువ్వు చెప్పిన జోకు 'నేను దీన్ని తట్టుకోలేను' అన్న దానిలా వుంది. తెలుసా అది?'' అని అబ్లాన్స్కీ అడిగేడు. ''భలే వుందిలే! మరో సీసా తే'' అని వెయిటర్‌కి పురమాయించి జోకు మొదలుపెట్టేడు.

''ప్యోత్ర్ ఇల్యీచ్ వినోవ్‌స్కీగారు అభ్యర్థిస్తున్నారు'' అని వొక ముసలి వెయిటర్ బుసబుస బుడగలు చిమ్మే షాంపేన్ రెండు పెద్ద గ్లాసుల్లో పోసి ట్రేలో పెట్టి తీసుకువచ్చి అబ్లాన్స్కీనీ, లేవిన్‌నీ సంబోధిస్తూ అన్నాడు. అబ్లాన్స్కీ గ్లాసు అందుకుని గది చివర వున్న వో బట్టతల యెర్ర మీసాల ఆయనకేసి తిరిగి చిన్నగా నవ్వి తల వూపేడు.

''యెవరాయన?'' అని లేవిన్ అడిగేడు.

''ఓ సారి మా యింటి దగ్గర చూశేవు. గుర్తుందా? భలే వాడు.''

లేవిన్ తన వంతు గ్లాసు అందుకుని అబ్లాన్స్కీలాగే చిన్నగా నవ్వి తల వూపేడు.

అబ్లాన్స్కీ చెప్పిన జోకు కూడా పసందుగానే వుంది. లేవిన్ కూడా వో జోక్ చెప్పేడు, అదీ పసందుగానే వుంది. తర్వాత గుర్రాల గురించీ, ఆ యేటి పందేల గురించీ, వ్రాన్స్కీ గుర్రం అత్లాస్‌నీ యెంత సునాయాసంగా పందెం గెలిచిందో దాన్ని గురించీ మాట్లాడుకున్నారు. భోజనాలు యెంత తొందరగా అయిపోయిందీ లేవిన్‌కి తెలియనే లేదు.

''ఆఁ, అదీ! వచ్చేరు!'' అని అబ్లాన్స్కీ, భోజనాలై పోతూ వుండగా కుర్చీ వెనక్కి తిరిగి, గార్డ్స్ దళంలో వుండే వో పొడుగాటి కర్నల్‌తో కలిసి వస్తూ వున్న వ్రాన్స్కీని చూసి అతనికేసి చెయ్యి చాపుతూ అన్నాడు. క్లబ్బులో మెరుస్తూ వున్న హుషారైన వాతావరణం వ్రాన్స్కీ ముఖంలో ప్రతిఫలిస్తోంది. అతను సరసంగా మోచేతిని అబ్లాన్స్కీ భుజం మీద వేసి చెవిలో యేదో గుసగుస లాడేడు. తర్వాత ప్రఫుల్ల మందహాసంతో లేవిన్‌కేసి చెయ్యి చాపేడు.

''మిమ్మల్ని యిక్కడ కలుసుకోవడం సంతోషంగా వుంది. ఎన్నికలైం తర్వాత మీ కోసం చూశేను, కాని మీరు వెళ్లిపోయేరని చెప్పేరు'' అన్నాడు.

''అవును. ఆ రోజే వెళ్లిపోయేను. యిప్పుడే మీ గుర్రం గురించి మాట్లాడుకున్నాం. చాలా సంతోషం నెగ్గినందుకు. మీ గుర్రం మాంచి పందెం గుర్రం అయివుండాలి'' అన్నాడు.

''మీ దగ్గరా అలాంటి గుర్రాలున్నాయని విన్నాను.''

''వుహుఁ, మా నాన్నగారి దగ్గర వుండేవి. నాకవి గుర్తు వున్నాయి, కొద్దిగా వాటి గురించి తెలుసు.''

''నువ్వెక్కడ కూర్చున్నావు?'' అని అబ్లాన్స్కీ వ్రాన్స్కీని అడిగేడు.

''రెండో బల్ల దగ్గర, స్తంభాల వెనక.''

''కొంచెం విజయోత్సవం జరుపుకున్నాం లెండి'' అన్నాడు పొడగరి కర్నల్. ''రెండో

సారి చక్రవర్తి బహుమతీ గెలిచాడు కదా. యితనికి గుర్రాలతో అదృష్టం కలిసొచ్చినట్టుగా నాకు పేకాటలో వస్తే బాగుణ్ణు. సరే బంగారంలాంటి సమయాన్ని పాడు చేసుకోవడం యెందుకు? అధోలోక కక్ష్యలోకి వెళ్లిపోతాను'' అంటూ కర్నల్ వెళ్లిపోయేడు.

''యాష్విన్'' అని వ్రాన్స్కీ అక్కడ ఖాళీ అయిన కుర్చీలో కూర్చుంటూ తూరోవ్ స్తిన్ అడిగిన దానికి జవాబుగా అన్నాడు. తనకి అందించిన షాంపేన్ తాగేడు. మరో సీసా తెమ్మని పురమాయించేడు. క్లబ్బులో మెరుస్తూ వున్న వాతావరణంవల్ల నైతేనేం, తాగిన వైన్ ప్రభావంవల్ల నైతేనేం లేవిన్ తన పశువుల మేలు వంగడం గురించి వ్రాన్స్కీతో సాయిలాపాయిలాగా మాట్లాడగలిగేడు. అతనిపట్ల తనకి యేమీ ద్వేషభావం అనిపించలేదు. అతన్ని ప్రిన్సెస్ మరీయా బొరీసొవ్నా యింటి దగ్గర కలుసుకున్నానని తన భార్య చెప్పిందని కూడా చెప్పేడు.

''ఓ! ప్రిన్సెస్ మరీయా బొరీసొవ్నా! భలే ఆవిడ!'' అని అబ్లొన్స్కీ మాట కలిపేడు. ఆమెని గురించిన విశేషం చెప్పడం మొదలుపెట్టేడు. అది విని అందరికీ నవ్వు వచ్చింది. వ్రాన్స్కీ ముఖ్యంగా ఉల్లాసంగా నవ్వేడు. దాంతో లేవిన్‌కి అతనిపట్ల మనసులో భేదభావం అణుమాత్రం కూడా లేకుండా తొలగిపోయింది.

''వూఁ మరి లేవండి, పోదాం'' అని అబ్లొన్స్కీ లేస్తూ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

## 8

బల్ల దగ్గర్నుంచి లేచి ముందుకు నడిచినప్పుడు తన చేతులు మహా తేలిగ్గా సవ్యంగా వూగుతున్నాయని లేవిన్‌కి అనిపించింది. అతను గాగిన్‌తో కలిసి కప్పు యెత్తుగా వున్న గదులు దాటుకుంటూ బిల్లియర్డ్ గదిలోకి వెళ్లాడు. పెద్ద హాల్లో అతనికి మామగారు కనిపించేడు.

''వూఁ, అయితే మా సోమరిపోతుల మందిరం యెలా వుంది?'' అని వృద్ధ ప్రిన్స్ అతని చెయ్యి పట్టుకుంటూ అడిగేడు. ''రా, అలా నడుద్దాం'' అన్నాడు.

''నేనూ అలా నడిచి వెళ్లి చూడాలనే అనుకుంటున్నాను. చాలా సరదాగా వుంది.''

''నీకు సరదాగానే వుందన్న మాట. కాని నాకు సరదాగా వుండేది యింకోటుంది. ఆ ముసలాయన్ని చూశేవా?'' అంటూ వొక ముసలి తొక్కు సభ్యుడికేసి చూపించేడు. అతను మనిషి వింటి బద్దలా వొంగిపోయేడు. అతని కింది పెదవి వాలిపోయి వుంది. మెత్తని బూట్లు తొడుక్కుని గట్టిగా అడుగులు వెయ్యి లేకపోతూ వీళ్ల వేపే వస్తూ వున్నాడు. ''వాళ్లు యిలా 'గొణుగుడు అణుగుడు' గానే పుట్టారనుకుంటావు కదూ?'' అన్నాడు.

''గొణుగుడు అణుగుడు? అదేం అవస్థ?''

''యెప్పుడూ వినలేదూ? వాళ్లని క్లబ్బు పరిభాషలో అలా అనే పిలుస్తాం. బాగా ఉడికిన గుడ్లని దొర్లించే ఆట తెలుసా నీకు? వాటిని బాగా దొర్లిస్తే గనక అవి అణిగిపోతాయి.

మా ముసలాళ్లతోటే అంతే. క్లబ్బుకి వస్తూపోతూ, పోతూ వస్తూ వుంటాం. అణిగిపోతాం. అదుగో నవ్వుతున్నావు. కాని నా వయసు వాళ్లం మేం కూడా యెప్పుడు ఆ లెక్కలో పడ తామా అనుకుంటూ వుంటాం. ప్రిన్స్ చెచేన్‌స్కీని యెరుగుదువు కదూ?" అని ప్రిన్స్ అడిగేడు. ఆయన కళ్లల్లో కనిపించిన చమక్‌ని బట్టి యేదో తమాషా సంగతి చెపుతాడని లేవిన్ గ్రహించేడు.

"వుహుఁ, యెరగను."

"యెరక్కపోవడమేమిటి? చాలా పేరున్న ప్రిన్స్ చెచేన్‌స్కీ. సర్లే, ఆ విషయం అలా వుంచు. సంగతేమిటంటే ఆయన గొప్ప బిలియర్డ్స్ ఆటగాడు. మూడేళ్లనాడు ఆ మనిషి యింకా గొణుగుడు అణుగుడు కాదు. అలా కానందుకు గొప్పలు పోతూ వుండేవాడు. మిగిలిన వాళ్లని గొణుగుడు అణుగుడు అని పిలిచేవాడు. కాని వో రోజున క్లబ్బుకి వచ్చేడు. మా కావలివాడు... తెలుసు కదా, వసీలియ్? ఆ లావాటి మనిషి. వాడు భలే కొంటెగాడు. యేం, ప్రిన్స్ చెచేన్‌స్కీ వాణ్ణి అడిగేడు 'యేం, వసీలియ్, యెవళ్లెవళ్లు వచ్చేరు? యెవరేనా గొణుగుడు అణుగుడు గాళ్లు వొచ్చేరా?' అని. చూడు వసీలియ్ జవాబు 'తమరు మూడో వారండి' అని. అదీ సంగతి నాయనా!" అన్నాడు.

లేవిన్ మామగారితో యిలా మాట్లాడుతూ తెలిసిన వాళ్లు దారిలో తగిల్తే పలకరిస్తూ అన్ని గదులూ తిరిగేడు. వాళ్లిద్దరూ పెద్ద గదిలోకి కూడా వెళ్లేరు. అక్కడ పేకాట మేజాలు యేర్పాటై వున్నాయి. వొకళ్లతో వొకళ్లు జోడీగా పేకాట ఆడుకునేవాళ్లు చిన్న చిన్న మేజాలకి ఆడుకుంటున్నారు. సోఫాల గదిలోకి వెళ్లేరు. అక్కడ చదరంగం ఆటలు సాగుతున్నాయి. అక్కడ కోజ్నిషెవ్ యెవరితోనో మాట్లాడుతున్నాడు. ఆ మనిషెవరో లేవిన్ యెరగడు. బిలియర్డ్స్ గదిలోకి వెళ్లేరు. ఆ గదిలో వో మూల గాగిన్‌తో సహా కొంతమంది షాంపేన్ తాగుతూ వున్నారు. జోరుగా మజా సాగుతోంది. మామా అల్లుళ్లు "అధోలోక కక్ష్య"లోకి వెళ్లేరు. అక్కడ యాష్విన్ అప్పటికే వో బల్ల దగ్గర చేరి జూదంలో వున్నాడు. పందేలు కాసేవాళ్ల గుంపు వొకటి బల్ల దగ్గర పోగయింది. యే మాత్రం చడీచప్పుడూ చెయ్యకుండా వాళ్లు రీడింగ్ రూమ్‌లోకి వెళ్లేరు. అక్కడ షేడ్ వున్న దీపాల కింద ముఖం చిరచిరలాడుతూ వున్న యువకుడొకడు పత్రిక తర్వాత పత్రిక తిరగేస్తూ వున్నాడు, బట్ట తల జనరల్‌గారొకడు దీక్షగా పుస్తక పఠనంలో నిమగ్నం అయిపోయేడు. తర్వాత వాళ్లు "వివేక వంతుల గది" అని వృద్ధ ప్రిన్స్ పేరు పెట్టిన గదిలోకి వెళ్లేరు. అక్కడ వాళ్లకి ముగ్గురు పెద్ద మనుషులు తాజా రాజకీయ సమాచారం గురించి వేడివేడిగా వాదించుకుంటూ కని పించేరు.

"ప్రిన్స్, అంతా సిద్ధంగా వుంది రండి" అని ఆయన కోసం వెతుక్కుంటూ వచ్చిన పేకాట జోడీ వొకతను పిలిచేడు. ఆయన వెళ్లేడు. లేవిన్ అక్కడ కూర్చుని కొంచెం సేపు ఆ పెద్ద మనుషుల వాదన విన్నాడు. కాని పొద్దున్న జరిగిన సంభాషణ అంతా గుర్తువచ్చి

అతనికి తెలియకుండానే మహా విసుగనిపించింది. గబగబా లేచి అబ్లాన్‌స్కీ, తూరొవ్‌స్తిన్ యెక్కడున్నారో వెతుక్కుంటూ వెళ్లేడు. వాళ్లంటే అతనికి హుషారు వస్తుంది.

తూరొవ్‌స్తిన్ యెత్తైన సోఫామీద కూర్చుని బీరు తాగుతున్నాడు. అబ్లాన్‌స్కీ గది ఆ చివర గుమ్మం దగ్గర నుంచుని వ్రాన్‌స్కీతో యేదో మాట్లాడుతూ వున్నాడు.

"ఆమె నిరుత్సాహ పడి పోతోందని కాదు, కాని ఆమె అనిశ్చిత పరిస్థితి, వూగిసలాట..." అనే మాటలు వాళ్ల దగ్గరికి వెళ్లేటప్పటికి లేవిన్‌కి వినిపించాయి. అక్కణ్ణుంచి వెంటనే వెనక్కి తిరిగి వెళ్లిపోవాలని అనుకున్నాడు, కాని అబ్లాన్‌స్కీ అతన్ని పిలిచేడు.

"లేవిన్!" అని అబ్లాన్‌స్కీ అతన్ని పిలిచేడు. లేవిన్ అతనికేసి చూశేడు. అతని కళ్లల్లో కనిపించేది కన్నీరు కాదనీ, అతను తాగినప్పుడు, గాఢంగా చలించినప్పుడూ అతనికి వుండే చెమ్మగిల్లడం అనీ గ్రహించేడు. ప్రస్తుతంలో రెండూ వున్నాయి. "లేవిన్, వెళ్లద్దు" అని లేవిన్ మోచేతిని గట్టిగా పట్టుకున్నాడు, యెలాగైనా అతన్ని ఆపు చెయ్యాలనుకున్నట్టు.

"యితను నా అసలైన మిత్రుడు. వో రకంగా నా ఉత్తమ మిత్రుడు" అని లేవిన్ గురించి వ్రాన్‌స్కీతో చెప్పేడు. "నువ్వు నాకు దగ్గరి వాడివే, యిష్టుడివేననుకో. మీరిద్దరూ స్నేహంగా వుండాలని నా కోరిక. మీరు స్నేహితులుగా వుండి తీరాలి, సన్నిహితులుగా వుండాలి. యేమంటే మీరిద్దరూ అసలైన మంచి మనుషులు."

"యిక యేమీ తరవాయి లేదు మా యిద్దరి మధ్యా, వొకళ్లనొకళ్లు కాగలించుకోవడం తప్ప" అని వ్రాన్‌స్కీ నవ్వుతూ సరదాగా చేతిని చాస్తూ అన్నాడు.

లేవిన్ తన వేపు చాచుకున్న ఆ చేతిని ఆబగా అందుకుని గట్టిగా అదిమేడు.

"నాకు చాలా చాలా సంతోషంగా వుంది" అన్నాడు లేవిన్.

"వెయిటర్, షాంపేన్" అని అబ్లాన్‌స్కీ కేక వేశాడు.

"నాకూ చాలా సంతోషంగా వుంది" అన్నాడు వ్రాన్‌స్కీ.

అబ్లాన్‌స్కీకీ, వాళ్లిద్దరికీ మాట్లాడుకోవాలన్న కోరిక వున్నాగానీ వొకళ్లకొకళ్లు చెప్పుకునేది యేమీ లేకపోయింది. అలా అని యిద్దరికీ అనిపించింది.

"తెలుసా నీకు, లేవిన్ యెప్పుడూ అన్నాని చూడలేదు?" అని అబ్లాన్‌స్కీ వ్రాన్‌స్కీతో అన్నాడు. "యితన్ని తీసికెళ్లి అన్నాకి చూపించాలని నాకు వుంది. వస్తావు కదూ, లేవిన్?" అన్నాడు.

"యేమిటి? నిజంగా యెరగరా?" అన్నాడు వ్రాన్‌స్కీ. "అన్నా చాలా సంతోషపడుతుంది. నేనిప్పుడే యింటికి వెడుతున్నా" అని "కాని యాష్విన్ గురించే నాకు బెంగగా వుంది. అతను ఆట ఆపేదాకా వుండాలిక్కడ" అని జత చేశాడు.

"యేం? పరిస్థితి బాగా లేదా?"

"పోగొట్టుకుంటున్నాడు. నే వొక్కణ్ణే అతన్ని ఆట మాన్పించగలవాణ్ణి."

"వో ఆట బిలియర్డ్స్ ఆడదామా? ఆడతావా, లేవిన్? మంచిది" అన్నాడు అబ్లాన్‌స్కీ.

"బంతులు వ్రటా" అని బిలియర్డ్స్ ఆటలో లెక్కలు వేసే అతనికి చెప్పేడు.

"చాలా సేపటిగా అన్నీ తయారుగా వున్నాయండి" అన్నాడతను. బంతుల్ని త్రికోణా కారంగా యేర్పాటు చేసి పెట్టాడు. ఎర్ర బంతిని తోస్తూ తన వినోదంలో తను వున్నాడు.

"వూఁ, కానీ మొదలెడదాం."

ఆట పూర్తయేక వ్రాన్‌స్కీ, లేవిన్‌లు గాగిన్ బల్ల దగ్గర చేరారు. అబ్లాన్‌స్కీ సూచన మీద లేవిన్ ఆసుమీద పందెం కట్టేడు. వ్రాన్‌స్కీ తన దగ్గరికి వచ్చే పరిచయస్థులని పలకరిస్తూ "అధోలోకం" గది దగ్గరికి వస్తూపోతూ వున్నాడు, యాష్విన్ యెలా ఆడుతు న్నదీ చూసుకుంటూ వున్నాడు. ఆ ఉదయం బుర్ర అలిసిపోయి వుండడంతో లేవిన్‌కి యిప్పుడు హాయిగా ప్రశాంతంగా వుంది. తనకీ వ్రాన్‌స్కీకీ మధ్య యే విద్వేషమూ లేకుండా సమసి పోయినందుకు అతనికి సంతోషంగా వుంది. క్లబ్బు వాతావరణంతోబాటుగా అతనికి శాంతిగా ఆహ్లాదకరంగా, మధురానుభూతి పూర్వకంగా వుంది.

ఆట అయిపోగానే అబ్లాన్‌స్కీ లేవిన్ చెయ్యి పట్టుకున్నాడు.

"పద వెడదాం అన్నాని చూడడానికి. యిప్పుడే వెడదాం యేం? ఆమె యింటి దగ్గర వుంది. నిన్ను తీసుకొస్తానని యెన్నడనగానో చెప్పాను. యీ పూట యేముంది నీకు పని?" అన్నాడు.

"ప్రత్యేకం యేమీ లేదు. వ్యవసాయ సమావేశానికి వస్తానని స్వియాజ్‌స్కీకి చెప్పాను. కాని నీతో వస్తాలే" అన్నాడు లేవిన్.

"భేష్, బాగుంది. పద. మా బండి వచ్చిందేమో చూడు" అంటూ వో నౌకరుకి పురమాయించేడు.

లేవిన్ బల్ల దగ్గరికి వెళ్ళి పందెం కట్టి వోడిపోయిన నలభై రూబుళ్ళు యిచ్చేడు. క్లబ్బు బిల్లు కట్టేడు, గుమ్మం దగ్గర నుంచున్న నౌకరు యేదో నిగూఢమైన పద్ధతిలో లెక్కగట్టి చెప్పేడు ఆ మొత్తం యెంతో. తర్వాత లేవిన్ గదులగుండా చేతులు కులాసాగా వూపుకుంటూ నడిచి బయటికి వెళ్ళేడు.

## 9

"అబ్లాన్‌స్కీగారి బండి" అని వాకిలి కావలివాడు గట్టిగా అరిచేడు. బండి గుమ్మం దగ్గరికి వచ్చింది. యిద్దరూ బండి యెక్కేరు. బండి పెరడు దాటిన కొన్ని క్షణాలదాకా లేవిన్ క్లబ్బు వాతావరణంనుంచి, ఆ శాంతి, ఆహ్లాదం, మధురానుభూతిపూర్వక స్థితినుంచి బయట పడలేదు. కాని బండి యివతలకి వచ్చి రాళ్ళు పరిచిన బాటమీదకి చేరినట్టు తెలియగానే, బళ్ళ వాళ్ళ కోపిష్టి అరుపులు వినగానే, దుకాణాలకీ కల్లు అంగడికీ వున్న ఎర్ర దీపం కాంతి చూడగానే యీ క్లబ్బు వాతావరణం తొలగిపోయింది. తను చేస్తున్న పని గురించిన ఆలోచన వచ్చింది. తను అన్నాని చూడ్డానికి వెళ్ళాలా అని మనసులో అను

కున్నాడు. కిట్టీ యేమంటుందో! కాని అబ్లాన్స్కీ అతన్ని ఆలోచించుకో నివ్వలేదు. తన మనసులో వున్న శంకల్ని పసిగట్టినట్టు వాటిని తోసి పారేస్తూ అతను మాట్లాడేడు.

''నాకు యెంత సంతోషంగా వుందో, నువ్వు అన్నాని చూస్తున్నావు. కొంత కాలంగా దాలీ కోరిక యిదే. ల్వోవ్ వెళ్లి ఆమెని చూశేడు. వెళ్లి ఆమెని చూస్తూనే వున్నాడు. ఆమె నాకు అక్కగారే కావచ్చు, అయినా ఆమె మామూలు మహిళ కాదని చెప్పగలను. నువ్వే చూస్తావుగా. ఆమె పరిస్థితి బాగా లేదు, యిప్పుడు మరీనీ'' అన్నాడు.

''యిప్పుడు మరీనా? యెందుకని?''

''విడాకుల గురించి బావగారితో మాటలు జరుపుతున్నాం. ఆయనా వూఁ అన్నాడు. కాని కొడుకు పోషణ బాధ్యతల చిక్కు వచ్చింది. దాంతో యెప్పుడనగానో తేలిపోవాల్సిన విషయం మూణ్నెల్లుగా యీడ్చుకుంటూ సాగుతోంది. విడాకులు రాగానే వ్రాన్స్కీని పెళ్లి చేసుకుంటుంది. పెళ్లికి సంబంధించి యీ పాత తంతులు యెంత బోలు విషయాలో చూడు. యెవళ్లూ వాటిని నమ్మనూ నమ్మరు, కాని జనాలు హాయిగా బతకడానికి లేకుండా తగలేస్తాయి అవి'' అన్నాడతను. ''అప్పుడు వాళ్ల పరిస్థితి నలుగురికీ సమ్మతం అవుతుంది, నీ పరిస్థితిలాగా నా పరిస్థితిలాగా'' అన్నాడు.

''చిక్కు యెక్కడ వుంది?'' అని లేవిన్ అడిగేడు.

''అబ్బో, అదో కొండవీటి చేంతాడంత కథ. మన దగ్గరుండే, యేదీ కచ్చితంగా వుండదు. అంతా అస్పష్టంగా వుంటుంది. కాని ఆమె మూడు నెల్లుగా మాస్కోలో విడాకుల కోసం చూస్తూ వుందన్న విషయం నిజం. ఆమె యెక్కడికీ వెళ్లదు. యే ఆడమనిషీ ఆమెని చూడ్డానికి వెళ్లదు, దాలీ తప్ప. యెందుకో తెలుసా, తనమీద సానుభూతి చూపిస్తూ యెవళ్లూ తన దగ్గరికి రావడం ఆమెకి యిష్టం వుండదు. ఆ ముసలి నక్క ప్రిన్సెస్ వర్వారా చూడు — ఆమె కూడా వెళ్లిపోయింది, తనకి పరువు తక్కువ అట! యింత దారుణ పరిస్థితిలో మరే ఆడదన్నా అంత నిబ్బరంగా వుండగలదా అని నా కనిపిస్తూ వుంటుంది. కాని అన్నా — నువ్వు చూస్తున్నావుగా కొంచెం సేపట్లో, యెలా తన బతుకుని యెంత చక్కగా యేర్పాటు చేసుకుందో. యెంత నిదానంగా, గౌరవంగా యేర్పాటు చేసుకుందో. యెడం వేపు, సందు యెగువకి, చర్చి యెదురుగా ఆపు'' అని బండి కిటికీలోనుంచి యివతలికి వొంగుతూ అబ్లాన్స్కీ అరిచేడు. ''అబ్బ! యెంత ఉక్కగా వుంది!'' అని అంటూ బొత్తాలు పెట్టుకోకుండా వున్న కోటుని విప్పేడు. కాని మైనస్ పన్నెండు డిగ్రీలు వుంది బయట.

''కాని ఆమెకి బిడ్డ వుంది కదా? పాపతో పొద్దు పోతుందిలే'' అన్నాడు లేవిన్.

''ప్రతి మహిళా వొట్టినే ఆడజీవి అనే అనుకుంటావు నువ్వు. Une conveuse[1]'' అన్నాడు అబ్లాన్స్కీ. ''ఆడమనిషికి పొద్దుపోతూ వుందీ అంటే పిల్లలతోనే అని. కానే కాదు.

---

[1] గుడ్లు పెట్టే కోడి (ఫ్రెంచి).

అన్నా తన బిడ్డని చక్కగా పెంచుతుందనడంలో నాకు సందేహం లేదు. కాని ఆ విషయం గురించి యేమీ వినిపించలేదు. ఆమెకి మొదటగా పొద్దు గడపడం రాత పనిలో. నువ్వు యెతికుతంగా నవ్వుతున్నావు, కాని నువ్వు పొరపాటు పడుతున్నావు. ఆమె పిల్లల కోసం పుస్తకం రాస్తోంది, దాన్ని గురించి యెవళ్లకీ చెప్పడం లేదు. కాని నాకు చదివి వినిపించింది. ఆ రాత ప్రతిని వర్క్యాయెవ్‌కి — నీకు తెలుసు కదా ప్రచురణ కర్త... యిచ్చేను. అతనూ సొంతంగా రాస్తాడట. యేమైనా ఆ విషయాలన్నీ అతనికి తెలుసు. యీ పుస్తకం బాగుందని అన్నాడు. అన్నా మీ అణాకానీ రచయిత్రుల బాపతు అనుకున్నావా యేమిటి? యేం కాదు. నువ్వే చూస్తావుగా, మొదటగా హృదయం వున్న ఆడమనిషి ఆమె. యిప్పుడు వాళ్ల యింటి దగ్గర వో యింగ్లీషు అమ్మాయి, ఆమె మొత్తం కుటుంబం వుంటున్నారు. అన్నా ప్రస్తుతం వాళ్లని గురించి శ్రద్ధ పడుతోంది."

"దయాదాన కార్యక్రమమా యేమిటి?"

"అదే నీతో గొడవ, ప్రతీ దాన్నీ వంకరగా చూస్తావు! దయా కాదు, గియా కాదు, హృదయ ప్రేరణ. వాళ్లకి, అంటే వ్రాన్స్కీకి, వో ఇంగ్లీషు అశ్వ శిక్షకుడు వుండేవాడు. పనిలో గట్టివాడు కాని మనిషి మజ్జు. తెగ తాగి delirium tremens[1] పాలబడ్డాడు. పెళ్లాం బిడ్డల్ని వాళ్ల ఖర్మానికి వదిలేశాడు. అన్నా ఆ పరిస్థితి చూసి, వాళ్లకి సాయం చెయ్యడం మొదలుపెట్టింది. యిప్పుడు వాళ్ల బాధ్యత నెత్తిన వేసుకుంది. అంటే వూరికే డబ్బూ దస్కం యిచ్చి సంరక్షణ చూడ్డం అనుకునేవు. తనే సొంతంగా అబ్బాయిలకి రష్యన్ నేర్పుతోంది. వాళ్లు హైస్కూల్లో చేరేందుకు వీలుగా. వాళ్ల పిల్లని తన దగ్గరే వుంచుకుంది. ఆ అమ్మాయిని చూస్తావుగా నువ్వే" అన్నాడు.

బండి ముంగిట్లోకి వెళ్లింది. అబ్లాన్స్కీ గుమ్మం దగ్గర గట్టిగా గంట కొట్టేడు. ఆ గుమ్మం దగ్గర వో స్లెడ్జి బండి వుంది.

నౌకరు తలుపు తెరిచేడు. అమ్మగారు వున్నారా లేదా అని అడగా పెట్టాకుండా అబ్లాన్స్కీ లోపలికి వెళ్లేడు. లేవిన్ అతని వెనక్కాలే వెళ్లేడు, తను చేస్తున్న పని సబబా కాదా అని అతనికి సందేహాలు పెరిగాయి.

అద్దంలో చూసుకుంటే అతనికి తన ముఖం యెర్రబడ్డట్టు కనిపించింది. కాని మత్తుగా లేదని ఖాయంగా అతనికి తెలుసు. అబ్లాన్స్కీ వెనక్కాలే దృఢంగా అడుగులు వేస్తూ తివాసీ పరిచిన మెట్లపైకి యెక్కేడు. అక్కడ అబ్లాన్స్కీని నౌకర్లు బాగా యెరుగుదురు. కాబట్టి నౌకరు వొంగి వందనం చేశాడు. అన్నా వొంటరిగా వుందా అని అడిగేడు అబ్లాన్స్కీ. వర్క్యాయెవ్ ఆమెతో వున్నాడని అతను చెప్పేడు.

"యెక్కడున్నారు వాళ్లు?"

---

[1] మానసిక అస్థిరత్వం (లాటిన్).

"చదువుకునే గదిలో."

వాళ్ళు వో మాదిరి చిన్నగా వున్న భోజనాల గది గుండా వెళ్ళేరు. ఆ గది గోడలకి నల్ల కొయ్య పలకలు వున్నాయి. నేలమీద తివాసీలు వున్నాయి. ఆ గది దాటి చదువుకునే గదిలోకి వెళ్ళేరు. ఆ గదిలో మసక వెలుతురుగా వుంది. దీపానికి నల్లని షేడ్ వుంది. మరో దీపం వుంది. దానికి రిఫ్లెక్టర్ వుంది. దాని కాంతి వో చిత్రంమీద ప్రసరించేటట్టు అమర్చేరు. తక్షణం ఆ చిత్రం లేవిన్ దృష్టిని ఆకట్టుకుంది. ఇటలీలో మిహైలోవ్ గీసిన అన్నా చిత్రం అది. అబ్లాన్‌స్కీ అడ్డ పలకలు పెట్టిన కానా వెనక్కి వెళ్ళేడు. తక్కువ వో మగ కంఠం మాట్లాడ్డం ఆపింది. లేవిన్ అన్నా చిత్రం ముందు నుంచుండి పోయేడు. ధగధగ మెరిసే కాంతి నేపధ్యంలో చట్రంలోనుంచి ఆమె యివతలకి అడుగు వేసి వస్తున్నట్టుగా కనిపిస్తోంది. అతను చిత్రంమీదనుంచి దృష్టి మళ్ళించుకో లేకపోయేడు. తనెక్కడ వున్నదీ మర్చిపోయేడు. యేమి మాటలు సాగుతున్నదీ అతని చెవిన పడడం లేదు. అద్భుతమైన ఆ చిత్రంమీదనే దృష్టి లగ్నం చేసి నుంచుండి పోయేడు. అది బొమ్మ కాదు. నల్లని ఉంగరాల జుట్టు, బోసి చేతులు, బోసి భుజాలు, మధుర కోమల అధరాలమీద లాస్యం చేసే అర్ధ స్వాప్నిక దరహాసం వున్న జీవ జాగృత సమ్మోహకర సుందరనారి అక్కడ వుంది. ఆమె అతనికేసే కోమల విజయోల్లాసపూర్వక దృక్కులతో చూస్తోంది. ఆ చూపు అతన్ని వివశుణ్ణి చేసింది. ఆమె జీవంతో తొణికిసలాడుతున్నట్టున్న బొమ్మ, యేమంటే సజీవ వనితలెవ్వరూ బహుశా అంత సౌందర్య సమన్వితంగా భాసించరు.

"చాలా సంతోషంగా వుంది నాకు" అని యెవరో పక్కనే అనడం వినిపించింది. తను మంత్ర ముగ్ధుడై చూస్తూ వున్న ఆ చిత్రంలోని మనిషి గొంతుకే అది. అన్నా కానా వెనక నుంచి అతన్ని పలకరించడానికి వచ్చింది. ఆ చదువుకునే గది మసక వెలుతురులో లేవిన్‌కి ఆ చిత్రంలోని వనిత కనిపించింది. ఆమె ముదురు నీలం సిల్కు గౌను వేసుకుంది. ఆమె చిత్రంలో వున్న రూపంకంటే వేరు భంగిమలో వుంది. ఆమె ముఖంలో కవళిక వేరుగా వుంది. కాని కళాకారుడు ప్రదర్శించిన అనుపమ సౌందర్య సమన్వితంగా ఆమె భాసించింది. యదార్ధ రూపంలో ఆమె తక్కువ చకితంగా వుంది. కాని బొమ్మలో లేని నూతన, ఆకర్షక అంశం సజీవ రూపంలో వుంది.

## 10

అన్నా అతన్ని పలకరిద్దామని లేచి వచ్చింది. అతన్ని చూశాక కలిగిన తన సంతోషాన్ని దాచుకోలేకపోయింది. ఆమె తొణుకూ బెణుకూ లేకుండా చిన్న దృఢమైన చేతిని చాచింది. వర్కూయెవ్‌ని పరిచయం చేసింది, యేదో వ్యాపకంలో వున్న ముచ్చటైన యెర్ర జుట్టు అమ్మాయిని చూపించి తన పోషణలో వున్న పిల్ల అని చెప్పింది. యీ పనులన్నీ

ఆమె చేసిన తీరులో లేవిన్‌కి ఉన్నత సమాజ మహిళల్లో సర్వదా కనిపించే శాంత, స్వాభావిక లక్షణం అనుభూతం అయింది. అది లేవిన్‌కి పరిచితమైందే, హృద్యంగమమైందే.

"చాలా సంతోషంగా వుంది, చాలా సంతోషంగా వుంది" అని ఆమె రెట్టించింది. మరి యెందుకవో తెలియకుండానే ఆమె నోటినుంచి వచ్చే ఆ సాదా మాటలే వొక ప్రత్యేక అర్థాన్ని సంతరించుకున్నట్టు తోచేయి. "మిమ్మల్ని చాలా కాలంగా యెరుగుదును. మా తమ్ముడికీ మీకూ వున్న స్నేహంవల్లా మీ భార్యని బట్టీ... ఆమెతో నా పరిచయం బాగా తక్కువే అనుకోండి. కాని ఆమె అందమైన పువ్వులాగా, అవును, పువ్వులాగా నా హృదయానికి హత్తుకు పోయింది. ఆమెకి కాన్పు అయే రోజులని విన్నాను!" అంది.

ఆన్నా యే తొట్రుపాటూ లేకుండా, నిదానంగా మాట్లాడింది. లేవిన్‌మీదనుంచి కళ్లు మధ్యమధ్య తమ్ముడికేసి తిప్పి చూస్తూ అంది. తనపట్ల ఆమెకి సదభిప్రాయం కలిగిందనే లేవిన్‌కి అనిపించింది. వెంటనే వొక రకమైన భోళాభోళీతనంతో నిష్కపటంగా వుండే రీతిలో, వొకళ్లనొకళ్లు చిన్నప్పట్నుంచీ యెరిగున్న వాళ్ల మాదిరిగా కలిసిపోయేడు.

"వర్యూకయెవ్ నేనూ యిప్పుడే సిగరెట్ కాల్చుకుందుకే వ్రాన్‌స్కీ చదువుకునే గదిలోకి వచ్చేం" అని సిగరెట్ కాల్చుకోవచ్చా అని అబ్లాన్‌స్కీ అడిగిన దానికి జవాబుగా ఆమె చెప్పింది. లేవిన్‌కేసి చూసి, అతను సిగరెట్ కాలుస్తాడా అని అడగకుండానే తాబేటి చిప్ప పెట్టె అందుకుని వో సిగరెట్ తీసింది.

"యెలా వుంది వీకివాళ?" అని అబ్లాన్‌స్కీ ఆమెని అడిగేడు.

"ఫరవాలేదు. నరాలు మామూలుగా యెప్పటిలాగానే వున్నాయి."

"అద్వితీయంగా వుంది కదా?" అని లేవిన్ బొమ్మకేసి చూడ్డం గమనించి అబ్లాన్‌స్కీ అన్నాడు.

"యింతకంటే మంచి బొమ్మని నేను చూడలేదు."

"అచ్చం ముమ్మూర్తులా మనిషి రూపంలాగే వుంది కదా?" అని వర్యూకయెవ్ అన్నాడు.

లేవిన్ బొమ్మనుంచి చూపు మళ్లించుకుని బొమ్మకి ఆధారం అయిన ఆమెకేసి చూశేడు. తనమీద అతని చూపు పడింది అని అనిపించగానే ఆన్నా ముఖంలో వో ప్రత్యేక కాంతి విరిసింది. లేవిన్ సిగ్గుతో యెర్రబడ్డాడు. తనకి కలిగిన ఆ యిబ్బందిని కప్పుకుందుకు తను యిటీవల దాలీని చూసిందా అని ఆన్నాని అడగబోయేడు కాని ఆన్నాయే మొదట మాట్లాడింది.

"వర్యూకయెవ్, నేనూ వాస్చెంకొవ్ యిటీవల గీసిన బొమ్మల గురించి మాట్లాడుకుంటున్నాం. మీరు చూశారా వాటిని?"

"ఆఁ" అన్నాడు లేవిన్.

"మరేం అనుకోకండి, మీరు యేదో చెప్పబోయేరు" అంది.

తను యీ మధ్యలో దాలీని చూసిందా అని లేవిన్ అడిగేడు.

"నిన్ననే యిక్కడికి వచ్చింది. గ్రీషు లాటిన్ టీచరు పిల్లవాణ్ణి సరిగా చూడలేదని కోప్పడింది."

"అవును, నేనతని చిత్రాలు చూశేను. నాకు అంత ప్రత్యేకంగా నచ్చలేదు" అని లేవిన్ అంతకు ముందు ప్రసక్తమైన విషయంకేసి మళ్ళుతూ అన్నాడు.

లేవిన్ యిప్పుడు కళ గురించి పొద్దున్న మాట్లాడిన మాదిరిగా రంజుగా మాట్లాడలేదు. అన్నాతో మాట్లాడుతూ వుంటే ప్రతి మాట ప్రత్యేక ప్రాముఖ్యం సంతరించుకున్నట్టుగా కనిపించింది. ఆమెతో మాట్లాడ్డమే ఆహ్లాదంగా వుంది, ఆమె మాట్లాడుతూ వుండగా వినడం యింకా ఆహ్లాదంగా వుంది.

అన్నా నిష్కపటంగా, తెలివి ఉట్టి పడేటట్టు మాట్లాడ్డమే కాదు, తెలివి ఉట్టి పడేటట్టు అప్రయత్న పూర్వకంగా తను చెప్పేదానికి విశేషత్వం అంటగట్టకుండా యితరులు చెప్పేదాన్ని ఘనంగా భావిస్తూ మాట్లాడింది.

సంభాషణ కళలో నూతన రీతులమీదకి మళ్ళింది. వో ఫ్రెంచి కళాకారుడు బైబిల్‌కి గీసిన కొత్త బొమ్మలమీదకి మళ్ళింది. ఆ కళాకారుడు వాస్తవికతని మరీ అతికి తీసుకు పోయేడని వర్కూయెవ్ వ్యాఖ్య చేశాడు. కళలో వాస్తవికతనుంచి పక్కకు మళ్లడంలో ఫ్రెంచి వాళ్ళు అందర్నీ మించి పోయేరని, అందుకనే వాస్తవికత వేపు తిరిగి రావడాన్ని వో మహత్తర సంఘటనగా వాళ్లు భావిస్తున్నారనీ లేవిన్ అన్నాడు. వాళ్ళు యివ్వాళ మోసం చెయ్యడం లేదు, అలా చెయ్యలేకపోవడమే కవిత్వం అంటున్నారు.

లేవిన్ యింతకు ముందు యెన్నడూ కూడా తను చెప్పిన తెలివైన మాటలకి యింతలా సంతృప్తి పడలేదు. లేవిన్ చెప్పిన మాటలని బాగా మెచ్చుకుంటూ అన్నా ముఖం వెలిగింది, ఆమె కిలకిలా నవ్వింది.

"యెంతో దగ్గరి పోలిక వున్న బొమ్మని చూసి నవ్వినట్టు నవ్వేను నేను" అందామె. "మీరన్న ముక్క యివాల్టి ఫ్రెంచి కళని, చిత్ర కళని సాహిత్యాన్ని కూడా... జోలా, దొదే*... పూర్తిగా ప్రతిబింబిస్తుంది. కాని బహుశా యెప్పుడూ అలానే వుంటుందేమో లెండి. కళాకారుడి కల్పిత, అనుమానిత ఆకృతుల్లోనుంచి తన conceptions[1] యేర్పడతాయి. అన్ని విధాల combinaisons[2] చేశాక కల్పిత ఆకృతులవల్ల విసుగెత్తిపోయి, చాలా సహజమైన వాస్తవిక రూపాల్ని చిత్రిస్తారు" అంది.

"చాలా బాగా చెప్పారు" అన్నాడు వర్కూయెవ్.

"అయితే మీరు క్లబ్బుకి వెళ్లారన్న మాట" అని అన్నా తమ్ముణ్ణి అడిగింది.

'ఆహా! యీమే మహిళ అంటే' అని లేవిన్ ఆమె అందమైన సజీవ వదనం చూస్తూ

---

[1] వ్యూహాలు (ఫ్రెంచి).

[2] సంయోజనలు (ఫ్రెంచి).

అనుకున్నాడు. ఆమె ముఖంలో హఠాత్తుగా మార్పు వచ్చింది. ఆమె తమ్ముడిమీదకంటా వాలుతూ యేమి మాటలు అందో లేవిన్ వినలేదు. కాని ఆమె ముఖంలో కనిపించిన మార్పు చూసి ఆశ్చర్యపోయేడు. వో క్షణం కితం సాధు శాంతంగా వున్న ఆ వదనంలో అహం, ఆగ్రహం, వో వింత ఉత్కంఠ వచ్చేయి. కాని అలా అని ఆ మార్పు యెక్కువ సేపు వుండలేదు. మరుక్షణం ఆమె కళ్లు ముడుచుకుంది, దేన్నో గుర్తు చేసుకున్నట్టు

"అవునవును, కాని అది యెవళ్లకీ పసందుగా వుండదు" అని అంటూ అన్నా ఇంగ్లీషు అమ్మాయికేసి తిరిగి "Please order the tea in the drawing-room[1]" అంది.

ఆ అమ్మాయి లేచి వెళ్లింది.

"అయితే, యీమె పరీక్షలో నెగ్గిందా?" అని అబ్లాన్‌స్కీ అడిగేడు.

"భేషుగ్గా. పనికొచ్చే పిల్ల. స్వభావం కూడా మంచిది."

"ఆఖరికి నీ కూతురుమీదకంటే యీ పిల్లమీదే యెక్కువ అభిమానం పెంచుకుంటావు."

"అలాంటి మాటలు మగవాడే అనగలడు. ప్రేమకి హెచ్చు, తగ్గు వుండవు. నా కూతుర్ని వో రకంగా ప్రేమిస్తాను, యీమెని మరో రకంగా" అంది.

"తను యీ ఇంగ్లీషు పిల్లపట్ల చూపించే దాంటో పదో వంతు శ్రద్ధ రష్యన్ పిల్లల చదువుపట్ల చూపిస్తే యింతకంటే మంచి, విలువైన కృషి జరిగేదని నేను అన్నాగారితో చెపుతున్నా" అన్నాడు వర్క్యాయెవ్.

"ఆఁ, మీరు యెన్ని చెప్పండి నేను అలా చెయ్యలేకుండా వున్నా. కౌంట్ వ్రాన్‌స్కీ" (వ్రాన్‌స్కీ పేరు అలా ప్రస్తావిస్తూ ఆమె తన అనురోధపూర్వక భీరు దృష్టితో లేవిన్‌కేసి చూసింది, లేవిన్ ఆదరపూర్వకంగా అమోదిస్తున్నట్టు చూపు చూసి బదులు చెప్పేడు) "నన్ను వూళ్లో వున్న బడిపట్ల ఆసక్తి చూపించేటట్టు చాలా ప్రయత్నం చేశాడు. నేను కొన్ని సార్లు బడికి వెళ్లేను. అక్కడ పిల్లలు ముద్దొచ్చేవాళ్లే, అయినా ఆ పనిలో మనసు కుదిరింది కాదు. మీరు శక్తి గురించి యేదో అంటారు. శక్తి ప్రేమవల్ల వస్తుంది. నాకు ప్రేమ యెక్కణ్నుంచి వస్తుంది? కడుపులో లేనిది కాగలించుకుంటే వస్తుందా? కాని యీ పిల్ల పట్ల అభిమానం పెరిగింది. యెందుకనో నాకే తెలీదు" అంది.

మరోసారి ఆమె లేవిన్‌కేసి చూసింది. ఆమె చిరునవ్వు, ఆమె చూసిన చూపు తను లేవిన్‌తోనే మాట్లాడుతూ వున్నట్టు, అతని అభిప్రాయాన్నే పరిగణనలోకి తీసుకుంటున్నట్టు, వొకళ్లనొకళ్లు బాగా అర్థం చేసుకుంటున్నామన్న సంగతి ముందటినుంచీ తెలిసినట్టు చెప్పాయి.

"నాకు మీరు చెప్పింది అర్థమైంది. వో బడికి గాని, యితర సంస్థలకి మనిషి హృదయ

---

[1] దయచేసి డ్రాయింగ్ రూమ్‌లోకి టీ పట్టుకురమ్మని చెప్పు (ఇంగ్లీషు).

పూర్వకంగా అర్పితమై పని చెయ్యలేదు. అందుకనే పరోపకార సంస్థల ప్రయోజనం అంత తక్కువగా వుంటోంది'' అన్నాడు లేవిన్.

ఆమె వో క్షణం యేం మాట్లాడలేదు. తర్వాత చిరునవ్వు నవ్వింది.

''అవును. అంతే మరి'' అని వొప్పుకుంది. ''నా మట్టుకి నేను అలా చెయ్యలేను. Je n'ai pas le coeur assez large[1] పిల్లలందర్నీ వొళ్లో కూచో పెట్టుకుని అనాథ శరణాలయం ప్రేమించడానికి. Cela ne m'a jamais réussi.[2] చాలా మంది ఆడవాళ్లు వున్నారు. వాళ్లు దాన్ని తమ position sociale[3] చేసుకున్నారు. యివాళ రోజుల్లో మరీని'' అని ఆమె విచారంగా, తన రహస్యాన్ని పంచుకునేటట్టు చేసే భావం కనబరుస్తూ పైకి తమ్ముడితో మాట్లాడుతూ వున్నట్టున్నా స్పష్టంగా లేవిన్ని ఉద్దేశించే అంది. ''యిప్పుడు కూడా, యేదో పనితో వ్యాపకం కల్పించుకోవాల్సిన అవసరం నాకు వున్నాగానీ నేనలా చెయ్యలేను'' అంది. ఆమె కనుబొమలు ముడుచుకుని (తన గురించిన చర్చ చెయ్యవలసి రావడంవల్ల ఆమె అసంతృప్తి పడి కనుబొమలు ముడుచుకుందని లేవిన్ గ్రహించేడు), వెంటనే ప్రసంగ విషయం మార్చేసింది. ''మీ గురించి నాకు తెలుసు'' అని లేవిన్తో అంది, ''మీరు ప్రజాహిత కార్యాలంటే యిష్టపడరని. మిమ్మల్ని గట్టిగా సమర్థిం చేను'' అంది.

''నన్ను యెలా సమర్థించేరు?''

''ఆ వచ్చిన దాడులనిబట్టి అనేక రకాలుగా. కాని రండి, టీ తీసుకుందాం'' అని అన్నా లేచింది. మొరాకో తోలు బైండింగ్ చేసిన పుస్తకాన్ని చేత్తో తీసుకుంది.

''దాన్ని నాకివ్వండి అన్నాగారూ!'' అని పుస్తకం వేపు చూపిస్తూ వర్క్యాయెవ్ అన్నాడు. ''అచ్చుకి తగింది'' అన్నాడు.

''అబ్బెబ్బె, యింకా చెయ్యాల్సిన పని వుంది దీనితో.''

''నేనితనికి దాన్ని గురించి చెప్పాను'' అని లేవిన్ వేపు తల వూపి చూపిస్తూ అబ్లాన్స్కీ ఆమెతో అన్నాడు.

''అయ్యో, యెందుకు చెప్పావు. నే రాసింది జైలు ఖైదీలు అల్లిన తడిక బుట్టల బాపతు సరుకు, లీజా మెర్చాలొవా నాకు అప్పుడప్పుడు అమ్మేలాంటిది. ఆమె యేదో ప్రజాహిత సంస్థ తరఫున ఖైదీ విభాగం అధ్యక్షురాలు'' అని ఆమె లేవిన్కి వివరించింది. ''ఆ దురదృష్టవంతులు వోర్పుతో అద్భుతాలు చేస్తారు'' అంది.

---

[1] నా మనసు అంత దొడ్డ మనసు కాదు (ఫ్రెంచి).

[2] నాతో అలా యెన్నటికీ జరగదు (ఫ్రెంచి).

[3] సమాజంలో స్థాయి (ఫ్రెంచి).

అద్వితీయ ఆకర్షణలో భాసించే యీ నారీమణిలో లేవిన్‌కి మరో నూతన లక్షణం దీనివల్ల వెల్లడైంది. ఆమె తెలివైంది, మనోహరమైంది, అందమైంది. అంతే కాదు నిజాయితీ ఆమెలో ఉట్టి పడుతోంది. తన పరిస్థితిలో వున్న గడ్డు సమస్యల్ని లేవిన్‌నుంచి దాచి పెట్టే ప్రయత్నం చెయ్యడం లేదు. ఆ ముక్క అంటూ ఆమె నిట్టూర్చింది. ఆమె ముఖం మీద కఠిన భావం వెంటనే కమ్ముకుంది, శిలాసదృశం అయినట్టు. ముఖంమీద ఆ భావంతో ఆమె యింకా అందంగా వుంది. కాని అది నూతన భావం. చిత్రకారుడు గ్రహించి ఆమె చిత్రంలో గీసి వెల్లడి చేసినటువంటి భావానికి పరాయిది. సంతోషంతో మెరుస్తూ యితరులకి సంతోషం కలిగిస్తూ వుండే భావాలకి పరాయిది. లేవిన్ మళ్లీ చిత్రంకేసి చూశేడు. తర్వాత తమ్ముడి చెయ్యి పట్టుకుని యెత్తైన గుమ్మం దగ్గరికి వెడుతూ వున్న అన్నాకేసి చూశేడు. ఆమెపట్ల అతనికి సంవేదన, దయ కలిగేయి. అవి అతనికే ఆశ్చర్యం కలిగించేయి.

ఆమె లేవిన్‌నీ, వర్క్యూయెవ్‌నీ డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్లమని చెప్పి తను వో క్షణం అబ్లాన్‌స్కీతో మాట్లాడేందుకు ఆగింది. 'విడాకుల గురించా? వ్రాన్‌స్కీ గురించా? క్లబ్బులో అతను యెందుకు దిగడి పోయిందీ అడగడానికా? లేకపోతే నా గురించా?' అనే విషయ తర్కంలో గాఢంగా మునిగిపోయి అన్నా పిల్లల కోసం రాసిన నవలా విశేషాలు వర్క్యూయెవ్ చెపుతూ వుంటే లేవిన్ వినసే లేదు.

టీ తాగేటప్పుడు కూడా అదే ఆహ్లాదకరమైన వసందైన సంభాషణ సాగింది. మాట్లాడ్డానికి విషయాలు వుండవేమోననే సంగతి సరేసరి తను చెప్పదలచుకున్నది చెప్పే అవకాశం వస్తుందో లేదోననే ప్రతివాళ్లకీ భయం కలిగింది. అయినా గాని ప్రతివాళ్లూ అవతలివాళ్లు చెప్పేదాన్ని వినడం కోసం తమంత తాముగా మాట్లాడకుండా గమ్మున వుండి పోయారు. అన్నా స్వయంగా చెప్పిందే కాకుండా, వర్క్యూయెవ్, అబ్లాన్‌స్కీలు చెప్పేది కూడా అన్నా చూపించిన శ్రద్ధవల్లా చేసిన వ్యాఖ్యలవల్లా ప్రత్యేక ప్రాముఖ్యం సంతరించుకుందని లేవిన్‌కి అనిపించింది.

సంభాషణ వింటూ అన్నా సౌందర్యాన్ని, వివేకాన్ని వీటితోబాటుగా ఆమె సహృదయతని, నిష్కపటత్వాన్ని చూసి లేవిన్ ముగ్ధుడవుతూనే వున్నాడు. అతను వింటూ వున్నాడు, తనూ యేదో చెపుతూ వున్నాడు. అప్పుడే అన్నా గురించి, ఆమె ఆంతరంగిక జీవితం గురించి ఆలోచిస్తూ ఆమె భావాల్ని అర్థం చేసుకో ప్రయత్నిస్తూ వున్నాడు. అంతకు ముందు ఆమె గురించి నిర్దాక్షిణ్యంగా అనుకున్న తను యిప్పుడు యే నిగూఢ హేతువువల్లనో ఆమె నడివడికని సమర్థించేడు, ఆమెపట్ల జాలిపడ్డాడు, వ్రాన్‌స్కీ ఆమెని ఆమూలచూడం అర్థం చేసుకోలేదని శంక పడ్డాడు. అబ్లాన్‌స్కీ వెళ్లేందుకు లేచేటప్పటికి రాత్రి పది అయింది (వర్క్యూయెవ్ ముందే వెళ్లిపోయేడు). కాని లేవిన్‌కి అప్పుడే అక్కడికి వచ్చినట్టుగా వుంది. భార హృదయంతో అతనూ వెళ్లడానికి లేచాడు.

"సెలవు" అని లేవిన్ చేతిని పట్టుకుంటూ, అతని చూపు తనమీద నిలిచేటట్టు

చేస్తూ అందామె. "నాకు చాలా సంతోషంగా వుంది que la glace est rompue[1]" అంది.

అతని చేతిని వదిలేసి కళ్లు ముడిచింది.

"తనంటే యెప్పటిలాగా నాకు యిష్టం వుందని మీ ఆవిడతో చెప్పండి. నా పరిస్థితికి ఆమె నన్ను క్షమించలేకపోతే ఆమె యెప్పటికీ నన్ను క్షమించక్కర్లేదని నా కోరిక. క్షమించడానికి నేను అనుభవించిన దాన్ని అనుభవించగలిగి వుండాలి. భగవంతుడు దాన్ని ఆమెకి తప్పించాలని నా కోరిక" అంది.

"తప్పకుండా చెప్తాను" అని లేవిన్ సిగ్గుతో యెర్రబడుతూ అన్నాడు.

## 11

'యెంత అద్భుతమైన, మనోహరమైన, దురదృష్ట జాతకురాలైన మహిళ' అని అబ్లాన్స్కీతోబాటుగా చలి గాలిలోకి బయటికి వస్తూ అనుకున్నాడు లేవిన్.

"యేం, నే చెప్పలేదూ నీకు?" అని అబ్లాన్స్కీ పరవశించిన లేవిన్ని చూసి అన్నాడు.

"అవును" అని సాలోచనగా అన్నాడు లేవిన్. "యిలాంటి ఆమెని నేను చూడలేదు. ఆమె వివేకవంతురాలే కాదు, గొప్ప సహృదయురాలు కూడా. ఆమెని చూస్తే నాకు చాలా జాలిగా వుంది" అన్నాడు.

"దేవుడు చల్లగా చూస్తే అన్నీ సద్దుకుంటాయి. నే చెప్పేదేమంటే యికపైన మనుషుల్ని గురించి తొందరగా అభిప్రాయాలు యేర్పరచుకోవద్దు" అని అబ్లాన్స్కీ బండి తలుపు తెరుస్తూ అన్నాడు. "మరి వుంటా, మనిద్దరి దార్లూ వేరు" అన్నాడు.

దారి పొడుగూతా లేవిన్ ఆన్నా గురించీ, సాఫీగా సాగిన తమ సంభాషణ గురించీ అనుకుంటూనే వున్నాడు. ఆమె ముఖంలో కనిపించిన ప్రతి మార్పునీ గుర్తు చేసుకున్నాడు. ఆమెపట్ల మరింత సానుభూతి, జాలీ కలిగేయి. అలా అనుకుంటూనే లేవిన్ యింటికి చేరాడు.

ఇంటికి చేరగానే కిట్టీ బాగానే వుందనీ, ఆమె అక్కగార్లు అప్పుడే తిరిగి వెళ్లిపోయారనీ కుజ్మా చెప్పి, అతనికి రెండు ఉత్తరాలు అందించేడు. తర్వాత మళ్లీ దృష్టి మళ్లడం యెందుకని చెప్పి లేవిన్ వాటిని అక్కడనే చదివేడు. ఒకటి నిగామాను సొకొలోవ్నుంచి. గోధుమ అమ్మలేకపోయినట్టూ యేమంటే పూడ్కి అయిదున్నర రుబుళ్లే యిస్తామన్నట్టూ, వేరే రకంగా సొమ్ము సమకూడనట్టూ రాశాడు. రెండో ఉత్తరం అక్కగారినుంచి. తన వ్యవహారాల విషయంలో అంత జాప్యం చేస్తున్నందుకు ఆమె నిష్ఠూరంగా రాశింది.

---

[1] యేమంటే మంచు కరిగిపోయింది (ఫ్రెంచి).

'అయిదున్నర రూబుల్లకే అయితే అలానే అమ్మేస్తే వదిలిపోతుంది కదా' అని లేవిన్ గతంలో యెంతో తర్జన భర్జనకి కారణం అయే సమస్యని తేలిగ్గా పరిష్కరించేస్తూ అను కున్నాడు. 'నిజంగా భలే ఆశ్చర్యంగా వుంది యిక్కడ యేదో వ్యాపకంగా వుంటూనే వుంది' అనుకున్నాడు రెండో ఉత్తరం గురించి. అక్కగారు చెయ్యమని చెప్పిన పని యింకా చెయ్య నందుకు అతనికి సిగ్గనిపించింది. 'యివాళ కూడా రెవెన్యూ కార్యాలయానికి వెళ్లలేదు, కాని నిజంగా తీరిగ్గా యెక్కడున్నాను?' అనుకున్నాడు. మర్నాడు తప్పకుండా వెళ్లాలని మనసులో గట్టిగా అనుకుని భార్య దగ్గరికి వెడుతూ ఆ రోజు యేమేం జరిగిందీ మనసులో గబగబా గుర్తు చేసుకున్నాడు. ఆ రోజంతా సంభాషణలే సరిపోయేయి, విన్నవీ, పాల్గొ న్నవీ. ఆ వేళ సంభాషించుకున్న విషయాల్లో దేన్ని గురించీ తను పల్లెటూళ్లో వుండి వుంటే అనుకోను కూడా అనుకుని వుండేవాడు కాదు. యిక్కడ అవన్నీ ఆసక్తికరంగా వున్నాయి. రెండు విషయాలు మాత్రం అతనికి కష్టం తోచేయి. ఒకటి చేపని దండించడం విషయంలో తనన్న మాటా, రెండవది అన్నాపట్ల తనకి కలిగిన జాలి – యిందులో సమంజసమైంది లేదని అతనికి అనిపించింది.

లేవిన్‌కి భార్య విచారంగా, విసుగ్గా వున్నట్టుగా కనిపించింది. అక్కగార్లతో భోజనాలు చెయ్యడం అదీ హుషారుగానే గడిచింది. కాని తర్వాత వాళ్లు అతని కోసం చూసీ చూసీ చాలా సేపు చూశారు. వాళ్లకి సాలొచ్చింది. వెళ్లిపోయేరు. తను వొక్కత్తీ వుండిపోయింది.

"యేం చేశావు?" అని లేవిన్ కళ్లల్లోకి చూసి అడిగింది. అతని కళ్లల్లో అనుమాన కారకమైన మెరుపు యేదో ఆమెకి కనిపించింది. అన్నీ వివరంగా అతను చెప్పకుండా అడ్డం వెడుతున్నానేమోనని భయపడుతూ ఆమె తన ఆందోళనని కమ్ముకో ప్రయత్నించింది. చిరునవ్వు నవ్వుతూ అతను యెలా ఆ పూట గడిపిందీ చెపుతూ వుంటే వింది.

"వ్రాన్‌స్కీని కలుసుకున్నందుకు చాలా సంతోషంగా వుంది. అతనితో సాయిలా పాయిలాగా, కొత్త లేకుండా కలిసిపోయేను. ముందు ముందు అతన్ని కలుసుకోకుండా వుండేం దుకే ప్రయత్నం చేస్తాననుకో. కాని మొత్తంమీద నాకు సంతోషంగా వుంది, మా మధ్య పొరపొచ్చేలు అంతమయేయి" అన్నాడు. 'ముందు ముందు అతన్ని చూడకుండా వుండే ప్రయత్నం చేస్తాన'న్న తను తిన్నగా అతని యింటికే అన్నాని చూసేందుకు వెళ్లేడని గుర్తు వచ్చింది, అతని బుగ్గలు యెరుపెక్కాయి. "రైతులు తాగుతారంటాం మనం, రైతులే తాగుతారో గొప్పింటి వాళ్లు తాగుతారో, యెవరెక్కువ తాగుతారో నాకు తెలీదు. వాళ్లు కనీసం పండగలప్పుడు పబ్బాలప్పుడూ తాగుతారు, మనం..."

కాని కిట్టీకి రైతులు యెప్పుడు తాగుతారో అందులో ఆసక్తి లేదు. అతని బుగ్గలు యెరుపెక్కడం ఆమె చూసింది, యెందుకు అనేది తెలుసుకోవాలని వుంది ఆమెకి.

"తర్వాత యెక్కడికెళ్లేవు?"

"అన్నాగారిని చూద్దాం పదమని అబ్లాన్‌స్కీ బలవంతం చేశాడు."

ఆ ముక్క అంటూ లేవిన్ యింకా యెక్కువ యెర్రబడ్డాడు. తను అన్నాని చూడ్డానికి వెళ్లడం వొప్పొ తప్పొ అనే శంక తీరింది. తను వెళ్లి వుండకూడదు అని యిప్పుడు తెలిసింది.

అన్నా పేరు వినగానే కిట్టీ కళ్లు చేటంత అయేయి, మెరిశాయి. కాని ఆమె తన మనో భావాల్ని అణుచుకో గలిగింది, అతన్ని నమ్మించగలిగింది.

"అలాగా" అని మాత్రం అంది.

"నేనక్కడికి వెళ్లినందుకు నువ్వు తప్పుగా అనుకోవన్న నమ్మకం నాకుంది. అబ్లా న్స్కీ బలవంతం చేశాడు, దాలీక్కూడా అలా అలా అనిపించిందట" అన్నాడు లేవిన్.

"యేం లేదు" అంది కిట్టీ. కాని ఆమె మనోభావాలని మహా ప్రయత్నంమీద అణుచు కుంటోందని, దానివల్ల తనకి మంచి పరిణామం కలగదని అతను ఆమె కళ్లు చూసి గ్రహిం చేడు.

"ఆమె చాలా ప్రేమాస్పదురాలు, మంచిది, పాపం చెప్పలేనంత దురదృష్టవంతు రాలు" అన్నాడు. అన్నా వ్యాపకాల గురించీ, కిట్టీతో ఆమె చెప్పమన్న మాటల గురించీ యావత్తూ చెప్పేడు.

"ఆమె దురదృష్టవంతురాలు అనేది వేరే చెప్పకోనక్కర్లేదు" అని అతను ముగించ గానే కిట్టీ అంది. "ఉత్తరాలు యెక్కణ్ణుంచి?" అంది.

ఉత్తరాలు యెక్కడినుంచో చెప్పి, ఆమె గొంతుకని బట్టి శాంతించిందని అనుకుని బట్టలు మార్చుకోవడానికి వెళ్లేడు.

తిరిగి వచ్చేటప్పటికి కిట్టీ యింకా ఆ కుర్చీలోనే కూర్చుంది. ఆమె దగ్గరికి అతను వెళ్లగానే వొక్క సారి భోరుమంది.

"యేమిటిది? యేమైంది?" అని లేవిన్, యెందుకనో తనకి తెలిసినా అడిగేడు.

"ఆ ఘోరమైన ఆడమనిషంటే నీకు యిష్టంగా వుంది. ఆమె మాయలో పడిపోయేవు. నీ కళ్లల్లోనే నాకు అది కనిపిస్తోంది. అయ్యో! ఆ! యిది యెక్కడకి దారి తీస్తుందో! క్లబ్బుకి వెళ్లేవు, తాగేవు. తాగి జూదం ఆడేవు, తర్వాత యెవరి దగ్గరికి... యెవరి దగ్గరికి వెళ్లేవు? ఆమె దగ్గరికి! వద్దు, వెళ్లిపోదాం యిక్కణ్ణుంచి... నేను రేపే వెళ్లిపోతున్నా."

ఆమెని శాంతింప చెయ్యడానికి లేవిన్‌కి తాతలు దిగి వచ్చేరు. ఆఖరికి శాంతింప చెయ్యగలిగేడు. అన్నాపట్ల తనకి కలిగిన జాలి తాగుడు మైకంతో కలిసి తనని తప్పుడు దారిలో పడేసిందనీ, తను అన్నా కపట నాటకాలకి లొంగిపోయేడనీ యిక పైన హద్దు మీరననీ చెప్పి శాంతింప చెయ్యగలిగేడు. ఒక విషయం అతను మనస్ఫూర్తిగా చెప్పేడు, మాస్కోలో అంత కాలం వొట్టి కబుర్లతో, తిండి తీర్థాలతో గడపడంతో తన బుర్ర చెడి పోయిందని. యిద్దరూ తెల్లవారకట్ల మూడింటిదాకా కబుర్లు చెప్పకుంటూ కూర్చుండి పోయేరు. అప్పుడు మాత్రమే యిద్దరి మధ్యా రాజీ కుదిరి నిద్ర పోగలిగేరు.

అన్నా వాళ్లని సాగనంపేక కూర్చోలేదు. గదిలో అటూ యిటూ పచార్లు చెయ్యడం మొదలుపెట్టింది. తనకి తెలియకుండానే (యీ మధ్య కొంత కాలంగా ఆమె యువకులతో ప్రవర్తిస్తూ వున్నట్టుగా) ఆ సాయంత్రం అంతా లేవిన్‌కి తనపట్ల యిష్టం కలిగేటట్టు ప్రయత్నం చేసింది. అతను చంచలుడుకాదు, వివాహితుడు అన్న విషయాన్ని దృష్టిలో వుంచుకుని ఆ పరిమితి మేరకి వొక్క పూటలో సాఫల్యం పొందిందనే తెలిసినప్పటికీ అన్నిట్నీ మించి అతను ఆమెకి బాగా యిష్టం కలిగించినప్పటికీ (మగాళ్ల దృష్టినుంచి వ్రాన్‌స్కీకీ లేవిన్‌కీ వుండే భేదం కొట్టవచ్చినట్టు వున్నా తను, ఆడదిగా, వాళ్లిద్దరిలోనూ కిట్టీ ప్రేమని ఆకట్టుకోగలిగిన సామాన్య లక్షణాన్ని వాళ్లలో పసిగట్టగలిగింది) అతను గది దాటి బయటికి వెళ్లగానే ఆమె అతన్ని గురించి పూర్తిగా మరిచిపోయింది.

అనేక రూపాలలో వొకే వొక ఆలోచన అదే పనిగా ఆమె బుర్రలో తిరుగుతూ వుంది. 'పై వాళ్లని యింతలా సమ్మోహితం చేస్తున్నాను కదా — మాటకి పెళ్లయి పెళ్లాం మొహం తప్ప పై వాళ్లని కన్నెత్తి చూడని యీ మనిషిని కూడా — మరి అతను నాపట్ల యెందుకంత ఉదాసీనంగా వున్నాడు?... అంటే ఉదాసీనంగా వున్నాడని కాదు, నన్ను ప్రేమిస్తూనే వున్నాడు, నాకు తెలుసు. కాని యేదో కొత్తది మా యిద్దరినీ వొకళ్లనుంచి వొకళ్లని దూరం చేస్తోంది. యీ సాయంత్రం పూట అసలు యింటి పట్టున లేదు యెందుకని? యాష్విన్‌ని వదిలేసి రాలేనని, పేకాటప్పుడు అతన్ని వో కంట కనిపెట్టి వుండాలని అబ్లాన్‌స్కీ చేత కబురు పెట్టాడు. యాష్విన్ యేమన్నా బుల్లారికూచా? సరే అదీ నిజమే ననుకుందాం. అతనెప్పుడూ అబద్ధం ఆడడు. కాని యీ నిజంలో వేరే యేదో కూడా వుంది. తనకి వేరే పనులూ వుంటాయని యీ అవకాశం తీసుకుని నాకు చూపించి సంతోష పడుతున్నాడు. నాకూ ఆ విషయం తెలుసు, నేనూ వొప్పుకుంటాను. మరి దీనికి దాఖలా చూపించా లనుకోవడం యెందుకు? నేనంటే తనకి వున్న ప్రేమవల్ల తన స్వేచ్ఛకి భంగం కలగకూడదను కుంటున్నాడు. కాని నాకు రుజావులు దాఖలాలూ అక్కర్లేదు. ప్రేమ కావాలి. యిక్కడ, మాస్కోలో నా మొత్తం బతుకులో వున్న దుస్థితి అతనికి అర్థం కావాలి. యేమిటో, నేను బతుకుతున్నానా? లేదు, బతకడం లేదు. తను వొచ్చినట్టు యెప్పుడు గంట మోగుతుందా అని వాళ్లంతా చెవులు చేసుకుని యెదురు చూస్తున్నాను, యింతవరకూ జవాబూ జాడా లేదు. ఆయన దగ్గరికి వెళ్లి మాట్లాడలేనంటాడు అబ్లాన్‌స్కీ. నాకుగా మళ్లీ నేను ఆయనకి రాయలేను. నేనేం చెయ్యడానికీ సమర్థురాల్ని కాదు, దేన్నీ మొదలుపెట్టలేను, దేన్నీ మార్చలేను. నిగ్రహంతో వుండగలనంతే, యెదురు చూస్తూ వుండగలనంతే, యేదో రకంగా దృష్టి మళ్లించుకో చూసుకోగలనంతే... ఇంగ్లీషతని కుటుంబం... రాసుకోవడం... చదువుకోవడం... కాని యిదంతా ఆత్మ వంచన. మరో రకం మత్తు మందు. అతను నన్ను చూసి జాలి పడాలి'

ఖని, తన కళ్లల్లో తనపట్ల సానుభూతి పూరిత కన్నీళ్లు ఉబుకుతూ వుండగా అనుకొంది ఆమె.

వ్రాన్‌స్కీ గట్టిగా గంట మోగిస్తూ వుండడం వినిపించింది. గబగబా కన్నీళ్లు తుడి చేసుకుంది. తుడిచేసుకోవడమే కాదు దీపం పక్కన కూర్చుని, తనేం కలవర పడినట్టు కాకుండా నిబ్బరంగా వున్నట్టు అనిపింప చేస్తూ పుస్తకం అందుకుంది. అతను వస్తానని మాట యిచ్చి రాకపోవడం తనకి నచ్చలేదని, నచ్చలేదని మాత్రమే వ్రాన్‌స్కీకి తెలియ చెప్పడం అవసరం, అంతే. యెట్టి పరిస్థితుల్లోనూ అతనికి తన దుఃఖాన్ని, ముఖ్యంగా తన పట్ల తనకి పుట్టిన జాలిని కనిపింప చెయ్యకూడదు. తనపట్ల తనకి జాలి పుట్టచ్చు, కాని అతను జాలి చూపించకూడదు. ఆన్నా సంఘర్షణ కావాలనుకోలేదు. అతను సంఘర్షణ కోరుతు న్నాడని అతన్ని తిట్టేంది, కాని తనకి తెలియకుండానే అలాంటి పరిస్థితిని తను రేకెత్తించేది.

"నువ్వు వొక్కత్తివీ లేవు కదా?" అని అతను హుషారుగా కిలకిలలాడుతూ ఆన్నా దగ్గరికి వచ్చి అడిగేడు. "జూదం వుండే మహా కండూతి అనుకో" అన్నాడు.

"వొక్కత్తినీ లేను. అలా వుండకూడదని చాలా కాలం కితమే తెలుసుకున్నాను. అబ్లా న్‌స్కీ వచ్చేడు, లేవిన్ కూడా."

"అవును, వాళ్లు వద్దామనుకున్నారని నాకు తెలుసు. వూఁ, లేవిన్‌ని చూసి నీకు యేం అనిపించింది?" అని ఆమె పక్కన కూర్చుంటూ అడిగేడు.

"చాలా మంచివాడు అనిపించింది. వాళ్లు యింత కితమే వెళ్లారు. యాష్విన్‌కి బాగా వుందా?"

"మొదట్లో చాలా బాగుంది. పదిహేడు వేలు నెగ్గేడు. వచ్చెయ్యమన్నాను. వచ్చేసేదు కూడా, కాని మళ్లీ వెనక్కి వెళ్లేడు, పోగొట్టుకుంటున్నాడు."

"మరి అక్కడెందుకు దిగడ్డావు?" అని వొక్క సారి కళ్లని వ్రాన్‌స్కీమీదకి యెత్తుతూ అడిగింది. ఆమె ముఖం కఠినంగా విద్వేషంతో వున్నట్టు కనిపించింది. "యాష్విన్‌ని అక్క డ్నుంచి తీసుకు వచ్చేందుకుగాను అక్కడ దిగడిపోయావని అబ్లాన్‌స్కీతో చెప్పావు. కాని అతన్ని అక్కడే వొదిలేసి వచ్చేవు" అంది.

వ్రాన్‌స్కీ ముఖంలో కూడా సంఘర్షణకి తయారై వున్నట్టు కఠిన భావం కనిపించింది.

"మొదటి సంగతి, నీకు యేమీ చెప్పమని అబ్లాన్‌స్కీతో నేను చెప్పలేదు. రెండవ సంగతి, నేను యెప్పుడూ అబద్ధం ఆడలేదు. అసలు విషయం వుండాలనుకున్నాను, వున్నాను" అని ముఖం ముడుచుకుంటూ అన్నాడు. "ఆన్నా, యెందుకిది? యెందుకు?" అని వో క్షణం ఆగిం తర్వాత, ఆమెమీదకి వాలుతూ, తన చేతిమీద ఆమె చేతిని వేస్తుందని ఆశిస్తూ చెయ్యి చాచేడు.

ప్రేమని సఖ్యతని ఉద్దేశిస్తూ అతను అలా చెయ్యి చాచడం ఆన్నాకి సంతోషంగానే వుంది. కాని యేదో తెలియని దుష్ట శక్తి ఆమెని ఆ ప్రేరణకి లొంగనివ్వలేదు, సంఘర్షణ నియమాలు దానికి అనుకూలించనట్టు.

"నువ్వు దిగడిపోవాలనుకుని దిగడిపోయినట్టు చెప్పక్కర్లేకుండానే తెలుస్తోంది. "నీ యిష్టం వొచ్చినట్టు చేస్తున్నావు. కాని ఆ సంగతి నాతో యెందుకు చెప్పడం? యెందుకు?" అని కోపం రేగుతూ అందామె. "నీ హక్కుని యెవరన్నా కాదన్నారా? కాని నువ్వు అంతా సక్రమంగా వుంటున్నట్టు అనుకుంటావు, వుండు" అంది.

అతను చేతిని ముడుచుకున్నాడు. అతని ముఖం ముందటికంటే మొండితనంగా మారింది.

"నీకు సంబంధించి యిది నీ మొండితనం" అంది అతనికేసి తదేకంగా చూస్తూ. తనకి కోపం కలిగించిన అతని ముఖ భంగిమకి తగిన శబ్దాన్ని అనుకోకుండా అందుకుంటూ అంది. "అవును, అవును. మొండితనమే. నీకు మట్టుకి యిదంతా నామీద విజయం సాధించానా లేదా అనే. కాని నాకు మట్టుకి..." ఆమెకి మళ్లీ తనమీద తనకే జాలి కలిగింది. ఆమె కష్టంమీద కన్నీళ్లు ఆపుకుంది. "నీకు తెలిసి వుంటేనా నాకు సంబంధించి గొప్పది యేదో! నాకు అనుభూతం అవుతూ వున్నప్పుడు, యిప్పుడు అనుభూతం అవుతూ వున్నట్టుగా, నువ్వు నాపట్ల విద్వేషభావంతో వున్నావని, అవును, అవును, శత్రుభావంతో, – అబ్బ! నీకు తెలుసా నాకు సంబంధించి దాని అర్థం యేమిటో! అలాంటి క్షణాల్లో నేను వినాశనానికి యెంత చేరువగా వుంటానో, యెంత భయపడతానో, నాపట్ల నాకు యెంత భయం కలుగుతుందో!" అంటూ ఆమె కన్నీళ్లని కప్పిపుచ్చుకోవడానికి ముఖం అటు తిప్పుకుంది.

"అయ్యో! యేమిటి మనం చేస్తున్న పని?" అని ఆమె దుఃఖం చూసి గాబరా పడి, ఆమెమీదకి వాలుతూ మళ్లీ ఆమె చెయ్యి తీసుకుని ముద్దుపెట్టుకుంటూ అన్నాడు. "యెందుకని? నేను యిల్లు వదిలిపెట్టి వెళ్లడం యేమార్పు కోసం అంటావా? పరాయి ఆడవాళ్లనెవళ్లనీ కన్నెత్తి చూడకుండా వుండడం లేదూ నేనూ?" అన్నాడు.

"వున్నావనే నా ఆశ!" అంది అన్నా.

"నీ మనశ్శాంతి కోసం యేం చెయ్యమంటావో చెప్పు. నీ సంతోషం కోసం యేదన్నా చేస్తా" అని ఆమె విచారం చూసి చలించిపోయి అన్నాడతను. "యిలాంటి వేదన నీకు లేకుండా వుండేందుకు నేను యే పని చెయ్యడానికి తయారుగా లేనో చెప్పు, అన్నా" అన్నాడు.

"యేం ఫరవాలేదు, యేం ఫరవాలేదు" అని ఆమె జవాబు చెప్పింది. "నాకే కారణం యేమిటో తెలీదు... ఒంటరితనం... నరాలు వశంలో వుండడం లేదేమో... సరే, ఆ గొడవ వదిలెయ్యి. గుర్రం పందేలు యెలా వున్నాయి? వాటి గురించి చెప్పు" అని అన్నా ఆఖరికి తను విజయం సాధించానన్న సంతోషాన్ని దాచుకో ప్రయత్నిస్తూ అడిగింది.

వ్రాన్‌స్కీ రాత్రి భోజనం తెమ్మని చెప్పి పందేల గురించి యావత్తూ ఆమెకి చెప్పడం మొదలుపెట్టేడు. కాని అతని స్వరాన్ని బట్టి, అంతకంతకు నిరాదరం అవుతూ వున్న చూపుని బట్టి తను సాధించిన విజయాన్ని అతను క్షమించడం లేదనీ, తను దేనితో అయితే పోరాడుతూ వుందో ఆ మొండితనం మళ్లీ అతన్ని ఆవహిస్తోందనీ ఆమె గ్రహించింది. అతను ఆమెపట్ల ముందటికంటే యెక్కువ ఉదాసీనంగా వున్నట్టు కనిపించేడు, తన

కౌంగుబాటుకి విచారిస్తున్నట్టు. ఆమె తనకి విజయం సమకూర్చి పెట్టిన, మాటల్ని' 'నేను వినాశనానికి యెంత చేరువగా వుంటానో, యెంత భయపడతానో' అనే వాటిని, గుర్తు చేసుకుని అవి ప్రమాదకరమైన మాటలు అనీ, మరోసారి వాటిని ప్రయోగించకూడదు అనీ గమనించింది. తామిద్దరూ ప్రేమ పాశంతో బంధితులై వుండీ కూడా తమిద్దరి మధ్యా సంఘర్షణా దుర్భావన చోటు చేసుకుంది, దాన్ని అతని మనసులోనుంచి బహిష్కరించలేదు, తన మనసులోనుంచి బహిష్కరించుకోవడమూ యింకా కష్టం అనీ ఆమెకి అనిపించింది.

## 13

మనిషి అలవాటు పడలేని పరిస్థితులు అంటూ వుండవు, ముఖ్యంగా తన చుట్టూ వున్న మనుషులు అలాంటి పరిస్థితుల్లో వుంటున్నారని చూసినప్పుడు. తను ఆ సాయంత్రం వున్న లాంటి పరిస్థితిలో గుండెమీద చెయ్యి వేసుకుని నిద్రపోగలను అని లేవిన్ మూడు నెలల నాడు నమ్మి వుండేవాడు కాదు. నిష్ప్రయోజనంగా, అర్థం పర్థం లేకుండా తన స్థితికి మించి, సారాయి మత్తులో చరించిన తర్వాత (క్లబ్బులో జరిగిన దాన్ని మరో రకంగా వ్యక్తం చెయ్యలేకపోయేడు), వొకప్పుడు తన భార్య ప్రేమించిన వాడితో అసంబద్ధమైన స్నేహం కుదుర్చుకున్నాక, అంతకంటే అసంబద్ధంగా, చెడిపోయిన ఆడది అని మాత్రమే పిలవగలిగిన ఆమెని వాళ్ళింటికి వెళ్ళి చూశేక, అలాంటి ఆడమనిషి వగలకి లొంగి కట్టుకున్న పెళ్ళానికి వ్యథ కలిగించేక — యింత జరిగేక గుండెమీద చెయ్యి వేసుకుని నిద్రపోగలిగి వుండే వాణ్ణని మూడు నెలల నాడు అతను అనుకుని వుండేవాడు కాదు. అయినా అతనికి అలసటవల్లా, పొద్దు పోవడంవల్లా, తాగిన దాని మత్తువల్లా నిద్ర ముంచుకు వచ్చింది, అదీ గాఢంగా.

తెల్లవారకట్ల అయిదు గంటలకి తలుపు కిర్రుమని చప్పుడయి అతనికి మెలుకువ వచ్చింది. అతనికి మెలుకువ వచ్చి లేచి కూర్చున్నాడు. కిట్టీ పక్కన మంచంమీద లేదు. కానా అవతల వొక దీపం కదిలి వెడుతూ వుంది, ఆమె అడుగుల చప్పుడు అతనికి వినిపించింది.

"యేం... యేమిటి?" అని నిద్రమగతలో గొణిగేడు. "కిట్టీ! యేమిటి?" అని అడిగేడు.

"యేమీ లేదు" అని ఆమె చేత్తో కొవ్వొత్తి పట్టుకుని యివతలికి వస్తూ అంది. "నాకు యేమిటో బాగా లేదు" అని ప్రత్యేక పద్ధతిలో కమ్మగా అర్థవతుగా మందహాసం చేస్తూ అంది.

"యేమిటి? నొప్పులు వస్తున్నాయా?" అని భయపడుతూ అడిగేడు. "అయితే యెవళ్ళనేనా పంపాలి..." అంటూ వొక్క ఉదుట్న లేచి గబగబా బట్టలు వేసుకోవడం మొదలుపెట్టేడు.

"అబ్బెబ్బె, యేం లేదు" అని యింకా చిన్నగా నవ్వుతూ, అతని చేతిమీద చెయ్యి వేస్తూ అంది. "బహుశా అదేం కాదు. కొంచెం బాగా లేదంతే. అయినా తగ్గిపోయిందప్పుడే" అంది.

మంచం దగ్గరికి వెడుతూ ఆమె కొవ్వొత్తిని ఆర్పేసి, మంచంమీద వాలి యేమీ మెదల కుండా వుండిపోయింది. ఆమె మెదలకుండా అలా వుండడమూ, ఆమె శ్వాస ఆడే తీరూ, ముఖ్యంగా ఆమె "అబ్బె యేమీ లేదు" అని మార్దవంగా, ఉత్తేజంగా అన్న వైఖరీ యేదో వున్నట్టేనని అతనికి చెప్పాయి. అయినా గానీ అతను బాగా అలిసిపోయి వుండడంతో వెంటనే మళ్లీ నిద్రపోయేడు. తర్వాతనే ఆమె శ్వాస మెల్లిగా పీల్చడం గుర్తు వచ్చి, ఆమె యేమీ కదులూ మెదులూ లేకుండా అతని పక్కనే వాలి స్త్రీ జీవితంలో మహత్తరంగా వుండే ఆ సంఘటన కోసం యెదురు చూస్తూ వున్న దాన్నీ, ఆమె ప్రేమాస్పదమైన హృదయంలో యేం జరుగుతోందో దాన్నీ అతను అర్థం చేసుకున్నాడు. ఏడు గంటలకి ఆమె చెయ్యి అతని భుజంమీద తగలడంవల్లా, ఆమె చిన్నగా గుసగుసలాడడంవల్లా అతనికి మెలుకువ వచ్చింది. అతన్ని లేపడం యెందుకులే పాపం అని వో పక్క, కాని మాట్లాడాల్సిన అవసరం వుందని మరో పక్క ఆమె గుంజాటన పడుతున్నట్టు కనిపించింది.

"మరేం కంగారు పడకు. అంత యిదేం కాదు. కాని... లిజవేత పెత్రోవ్నా కోసం కబురు పెడితే బాగుంటుందేమో."

కొవ్వొత్తిని మళ్లీ వెలిగించారు. ఆమె మంచం వార కూర్చుంది. అల్లిక పని చేసుకుంటూ వుంది. గత కొద్ది రోజులుగా ఆమె ఆ వ్యాపకంతో గడుపుతోంది.

"నువ్వేం గాబరా పడకు నీకు పుణ్యం వుంటుంది. యేం లేదు. నాకైతే పిసరు కూడా భయం లేదు" అని విపరీతంగా భయ పడిపోతూ వున్న అతని ముఖం చూసి అంది. అతని చేతిని తీసుకుని తన ఛాతీమీద, పెదాలమీద అదుముకుంది.

లేవిన్ తనని తనే మర్చిపోయి తకామని లేచి కిట్టీ కేసే కళ్లప్పగించి చూస్తూ డ్రెస్సింగ్ గౌను తొడుక్కున్నాడు. ఆమె కేసే చూస్తూ అలానే మేకులా నుంచుండిపోయేడు. అతను వొక్క ఉదుట్న పరిగెత్తి వెళ్లి వుండాల్సింది. కాని కిట్టీ ముఖంమీదనుంచి దృష్టి మళ్లిం చుకోలేకుండా వున్నాడు. అతనెంతగానో ప్రేమించిన కిట్టీ ముఖాన్ని, చూపుని ప్రతి కవళికని అతనికంటే యెవళ్లూ బాగా యెరగరు. అయినా ఆమెని అతను అంతకు ముందెప్పుడూ యిలా చూసి యెరగడు. ఆమెని ఆ రూపంలో చూస్తూ వుండగా ముందు రోజు రాత్రి యెలా మనసుకి కష్టం కలిగించిందీ గుర్తువచ్చి లేవిన్‌కి తనమీద తనకే కోపం వచ్చింది, అసహ్యం కలిగింది. కిట్టీ రాత్రిళ్లు పెట్టుకునే టోపీ పెట్టుకుంది. దాని కిందనుంచి యివతలికి పడుతున్న మెత్తని ఉంగరాల ముంగురుల ప్రభాపరివేషంలో ఆమె కెంపు వదనం ప్రసన్నతతో, పట్టుదలతో మెరుస్తూ వుంది.

కిట్టీ వస్తుతః యెంత నిష్కల్మషంగా, నిసర్గంగా వున్నా అన్ని ముసుగులూ తొలగిపోయి ఆమె

ఆత్మ సారం ఆమె కళ్లల్లో సమ్ముఖాన చమక్‌మని భాసించగా లేవిన్ నిశ్చేష్టుడైపోయేడు. యీ నిసర్గతత్వంతో, ఆత్మావిష్కరణతో అతను యెంతో ప్రేమించే యీ కిట్టీ అనిదం పూర్వమైన స్పష్ట రూపంతో అతనికి కనిపించింది. ఆమె అతనికేసి చూసి దరహాసం చేసింది. అంతలోనే వున్నట్టుండి ఆమె కనుబొమలు కంపించేయి. ఆమె తల వెనక్కి వాలేసుకుంది. గబుక్కున అతని చెయ్యి అందుకుంది, వేడి ఊర్పుతో కాలిపోతూ వున్నట్టు అతనికి హత్తుకుంది. ఆమె యాతన పడుతోంది. తన యాతన గురించి అతనికి ఫిర్యాదు చేస్తున్నట్టుగా వుంది. అతనికి అలవాటు ప్రకారం మొదటి క్షణంలో తనే అందుకు దోషినని అనిపించింది. కాని ఆమె తన యాతనకి అతన్ని నిందించడం లేదనీ, అందుగ్గాను అతన్ని ప్రేమిస్తూ వుంది కూడాననీ సాధు స్వభావంతో తొణికిసలాడుతూ వున్న ఆమె కళ్లు తెలియ చెప్పాయి. 'యిందుకు తప్పు నాది కాకపోతే యెవరిది?' అని అతను దోషి యెవరని వెతుకుతూ అనుకోకుండా వుండలేకపోయేడు. అందుకు దోషికి దండన పడాలి, అనుకున్నాడు. కాని దోషి దొరక లేదు. ఆమె యాతన పడుతోంది. యాతన పడుతున్నానని ఫిర్యాదు చేస్తోంది. కాని అందుకు ఆమె పొంగిపోతోంది, పరవశించి పోతోంది, దాన్నే కోరుకుంటోంది. ఆమె మనసులో అద్భుతమైనదేదో జరుగుతోందని లేవిన్ చూస్తున్నాడు, కాని అదేమిటైందీ అతనికి బోధ పడడం లేదు. అతని గ్రహణకి బాహిరంగా వుంది అది.

"నేను అమ్మని పిలవమని కబురు చేశాను. నువ్వు గబగబా లిజవేత పెత్రోవ్నా కోసం వెళ్లు.... అబ్బెబ్బె, యిదేం కాదు, యేం బాధగా లేదు" అంది.

ఆమె వెళ్లి గంట మోగించింది.

"మరి నువ్వు వెళ్లు. పాషా వస్తోంది. నాకు బాగానే వుంది."

ఆమె మళ్లీ అల్లిక పని అందుకోవడం లేవిన్ ఆశ్చర్యపోతూ చూశేడు.

లేవిన్ బయటికి వెడుతూ వుండగా మరో గుమ్మంలోనుంచి పనిపిల్ల లోపలికి వస్తూ వుండడం చప్పుడు వినిపించింది. అతను ఆగేడు. యేమేం చెయ్యాలో వివరంగా కిట్టీ ఆమెకి సూచనలు యివ్వడం విన్నాడు. మంచం సర్దడానికి కిట్టీ స్వయంగా ఆమెకి సాయం చేసింది.

లేవిన్ బట్టలు వేసుకున్నాడు. గుర్రాన్ని కడుతూ వుండగా (అద్దెబళ్లు అంత పెందరాళే దొరకవు కాబట్టి) అతను మళ్లీ పడక గది దగ్గరికి పరిగెత్తి వెళ్లేడు. ఆ వెళ్లడం మునిగాళ్లమీద కాదు, అతను వూహించుకున్నట్టుగా రెక్కలమీద యెగురుతూ. ఆందోళనగా కనిపిస్తూ వున్న యిద్దరు పని అమ్మాయిలు అక్కడ అవీ యివీ సవరిస్తున్నారు. కిట్టీ అల్లిక పని చేస్తూనే అటూ యిటూ పచార్లు చేస్తోంది. ఆ పిల్లలకి పురమాయింపులు యిస్తూ అల్లికని గబగబా మెలికలు తిప్పుతోంది.

"నేను డాక్టరు కోసం వెడుతున్నా. లిజవేత పెత్రోవ్నా కోసం కబురు వెళ్లింది. అయినా నేనే వెళ్లి కనుక్కుంటా. నీకు యింకా యేమన్నా కావాలా? దాలీని కూడా పిలుచుకు రమ్మంటావా?"

లేవిన్ అంటున్నదేమిటో విననట్టు కిట్టీ అతనికేసి చూసింది.

"వూఁ, వూఁ, వెళ్లు, వెళ్లు" అని కిట్టీ ముఖం చిట్లించుకుంటూ, చేత్తో వూపి వెళ్లమని సైగచేస్తూ గబగబా అంది.

అతను డ్రాయింగు రూమ్‌లోకి వెడుతూ వుండగా అతనికి పడక గదిలోనుంచి వొక్కసారి వేదనాభరితమైన మూలుగు, కాని అంతట్లోనే సంబాళించుకున్న మూలుగు, వినిపించింది. అతను ఆగిపోయేడు. కొంచెం సేపటిదాకా యేమీ అర్థం చేసుకోలేకపోయేడు.

'ఆఁ, ఆ మూలుగు కిట్టీది' అనుకుంటూ చేత్తో తల పట్టుకుని కిందికి పరిగెత్తి వెళ్లేడు.

"ప్రభూ! కరుణించు, క్షమించు, రక్షించు" అనే మాటల్ని అతనికి తెలియకుండానే అతని పెదాలు పలికేయి. అతను, దేవుడంటే నమ్మకం లేని వాడు, వొట్టినే పెదాలని కదలిస్తూ మాత్రమే కాక ఆ మాటలని రెట్టించేడు. యీ క్లిష్ట సమయంలో అతనికి బాగా తెలిసినట్టుగా తన సంశయాలు మాత్రమే కాక, విశ్వాస సూత్రాలని అంగీకరించే తన బుద్ధి అసమర్ధత కూడా భగవంతుని వేడుకుందుకు బాధాకరం కాలేదు. ఆదంతా అతని మనసులోనుంచి బూడిదలా చెదిరిపోయింది. యెవరి హస్తాలలో తనని, తన ఆత్మని, తన ప్రేమని అనుభూతం చెందుతున్నాడో ఆయనకి కాకపోతే మరెవరికి తను విన్నవించుకుంటాడు?

గుర్రం యింకా సిద్ధం కాలేదు. అంచేత అంతర్గతంగా శారీరక శక్తికి గల విశేష బిగువుతో తను చెయ్యవలసి వున్న పనులమీదనే ధ్యానం లగ్నం చేస్తూ, వొక్క క్షణం కూడా వృధా చెయ్యడం అన్యాయమన్న భావంతో బండి సిద్ధం కాకపోయినా ఆగకుండా అతను కాలినడకన బయల్దేరాడు. బండి కట్టేక గబగబా వచ్చి తనని అందుకొమ్మని కుజ్మాకి పురమాయించేడు.

మలుపులో రాత్రి బండి యేదో వేగంగా వస్తూ కనిపించింది. అందులో లిజవేత పెత్రోవ్నా వుంది. ఆమె మఖమల్ కోటు తొడుక్కుని, తలమీద శాలువా కప్పుకుంది. ఆమెని గుర్తుపట్టగానే "దేముడిదయవల్ల హమ్మయ్య!" అని సంతోషంగా గొణుక్కున్నాడు. ఆమె ముఖం అందమైన జుట్టుతో, గంభీరంగా, యింకా చెప్తే కఠినంగా కూడా కనిపించింది. బండి తోలేవాణ్ణి ఆపమని కేక వెయ్యకుండానే అతను వెనక్కి తిరిగి బండి పక్కనే పరిగెత్తేడు.

"రెండు గంటలేనా అవుతే? యెక్కువ కాదూ?" అని ఆమె అడిగింది. "డాక్టరు ప్యోత్ద్మీత్రియెవిచ్‌ని తీసుకు రండి. ఆయన్ని తొందర పెట్టకండి. మందుల కొట్లోకి వెళ్లి కొంచెం నల్లమందు తెండి" అంది.

"అంతా సవ్యంగా జరుగుతుందంటారా? భగవంతుడా, దయ చూపించు, కాపాడు!" అన్నాడు లేవిన్. అతని బండి గేటులోనుంచి బయటకి వస్తూ కనిపించింది. బండిలోకి దూకి కుజ్మా పక్కన కూర్చుని డాక్టరు దగ్గరికి తోలుకు పొమ్మన్నాడు.

## 14

డాక్టరు యింకా లేవలేదు. ఆయన "ఆలస్యంగా పడుకున్నారు, లేపద్దని చెప్పారు కాని కొంచెం సేపట్లో లేస్తారు" అని నౌకరు చెప్పాడు. నౌకరు దీపం చిమ్నీలు తుడుస్తున్నాడు. సర్వ శక్తులూ కూడగట్టుకుని ఆ పనిలోనే మునిగిపోయినట్లు కనిపించేడు. దీపం చిమ్నీల పనిలోనే అతను మునిగిపోవడం, తన యింట్లో జరుగుతూ వున్న దాన్ని గురించి యేమీ పట్టించుకోకపోవడం చూసి లేవిన్ మొదట నిశ్చేష్టుడైపోయేడు. కాని తన బాధ యెవళ్లూ అర్థం చేసుకోలేదనీ, అర్థం చేసుకోవాల్సిన అవసరమూ లేదనీ తనకి తను అనుకున్నాడు. అంచేత యీ ఉదాసీనతా కుడ్యాన్ని కూలగొట్టి తన లక్ష్యాన్ని సాధించ దలచుకుంటే తను మరింత శాంతంగా, దృఢంగా ముందు వెనకలు బాగా ఆలోచించి పని చెయ్యాల్సి వుందను కున్నాడు. అతను "తొందరపాటు వద్దు, దేన్నీ మర్చిపోవద్దు" అనే నియమం పెట్టుకు న్నాడు. తన శారీరక శక్తి, తన యెదర వున్న పనులపట్ల ధ్యానం మరింతగా పెరుగుతూ వున్నాయన్న యెరుక అతనికి కలిగేయి.

డాక్టరు యింకా లేవలేదు అని విన్నాక, లేవిన్ తన బుర్రలో తోచిన అనేక ఉపాయాల్లో నుంచి యేంచుకుని యిలా అమలు చెయ్యాలనుకున్నాడు. యింకో డాక్టరుకి చీటీ రాసి యిచ్చి కుజ్మాని పంపాలి; తను మందుల దుకాణానికి వెళ్లి నల్లమందు కొనాలి; తను తిరిగి వెనక్కి వచ్చేటప్పటికి డాక్టరు యింకా లేవకపోతే నౌకరు చెయ్యి తడిచేసి డాక్టరుని లేపమనాలి; దానివల్లా పని కాకపోతే తనే డాక్టరుని నయాన్నో భయాన్నో లేపాలి.

యిక్కడ నౌకరు లేవిన్‌ని గురించి పట్టించుకోకుండా యెలా దీపం చిమ్నీలు తుడవ డంలో కూరుకుపోయేడో, అదే రకంగా మందుల దుకాణంలో సన్నగా బక్కపల్చగా వున్న మనిషీ లేవిన్ గురించి పట్టించుకోకుండా, అక్కడ యెదురు చూస్తూ నుంచున్న బండివాడికి యేవో చూర్ణాలు పొట్లాలు కట్టి యిస్తున్నాడు. లేవిన్‌కి నల్లమందు యివ్వనని చెప్పేడు. తొందర పడకుండా, కోపం తెచ్చుకోకుండా వుండాలని ప్రయత్నిస్తూ లేవిన్ డాక్టరు పేరూ, మంత్రసాని పేరూ చెప్పేడు. నల్లమందు అవసరం యెందు కొచ్చిందో చెప్పేడు. యిమ్మని బతిమలాడేడు. అతను జర్మన్ భాషలో లోపలున్న యెవరినో యీయనకి నల్లమందు యిమ్మం టారా వద్దా అని అడిగేడు. యిమ్మని జవాబు వచ్చేక వో చిన్న మందు సీసానీ, గరాటానీ తీసి, వో పెద్ద సీసాలోనుంచి నల్లమందుని చిన్న సీసాలోకి పోసి దానిమీద పట్టీ తగిలించి లేవిన్ వద్దువద్దు అంటూ వున్నా వినిపించుకోకుండా దానికి మూత బిగించేడు. దాన్ని పొట్లం కట్టేవాడేమో కూడా. కాని అప్పటికి లేవిన్‌కి ఓపిక చచ్చిపోయింది. ఆ మనిషి చేతిలో నుంచి సీసా తకామని లాక్కుని అద్దాల తలుపుల గుండా వురికి యివతల పడ్డాడు. డాక్టరు యింకా లేవలేదు. నేలమీద తివాసీలు పరుస్తూ వున్న నౌకరు ఆయన్ని లేపనన్నాడు. యేం మాటా పలుకూ లేకుండా లేవిన్ తన యాదాస్తు పుస్తకంలోనుంచి వో పది రూబుళ

నోటు తీసి, నౌకరుకేసి చాచి, మెల్లిగానే కాని సమయం వృథా కాకుండా, డాక్టరుగారు యే వేళప్పుడేనా (ఆహా! యింతకు ముందటిదాకా తనకి యెందుకూ పనికి రాకుండా వున్న యీ డాక్టరు యిప్పుడు యెంత ఘనమైన, విశిష్టమైన వ్యక్తి అయేడు!) రాత్రిపూటగాని పగటి పూటగాని వస్తానని మాట యిచ్చేడనీ, అంచేత ఆయన కోపగించుకునే అవకాశం లేదనీ, కాబట్టి కొంచెం యేమీ అనుకోకుండా లేపమనీ అన్నాడు.

నౌకరు సరేనని మెట్లెక్కి పైకి వెళ్లేడు. లేవిన్‌ని వెయిటింగ్ రూమ్‌లోకి వెళ్లి వుండమని చెప్పేడు.

వెయిటింగ్ రూమ్ అవతలి వేపునుంచి డాక్టరు దగ్గడం, అటూ యిటూ నడుస్తూ వుండడం, ముఖం కడుక్కోవడం, తనలో తను గొణుక్కుంటూ వుండడం లేవిన్‌కి వినిపించేయి. అప్పటికి మూడు నిముషాలే గడిచేయి; కాని లేవిన్ ప్రాణానికి గంటలా కనిపించింది. యిక యెదురు చూడ్డం అసాధ్యం అనిపించింది అతనికి.

"డాక్టరుగారూ! డాక్టరుగారూ!" అని వోరగా తెరుచుకున్న తలుపు సందులోనుంచి కేక వేశాడు. "మరేం అనుకోవద్దు, మన్నించండి. ఫరవాలేదు యెలా వున్న వాళ్లు అలానే రండి. అప్పుడే రెండు గంటలు దాటి పోయింది" అని ప్రాధేయపడ్డాడు.

"అయిపోయింది, వొక్క నిముషం" అన్నాడు డాక్టరు. అలా అంటూ డాక్టరు చిరునవ్వు నవ్వేడని లేవిన్‌కి అనిపించి ఆశ్చర్యం కలిగింది.

"ఒక్క క్షణం..."

"వచ్చేస్తున్నా."

మరో రెండు నిముషాలు గడిచేయి. డాక్టరు బూట్లు వేసుకున్నాడు. బట్టలు వేసుకుని తల దువ్వుకోవడంలో మరో రెండు నిముషాలు గడిచిపోయేయి.

"డాక్టరుగారూ" అంటూ లేవిన్ బాధ కనిపించే గొంతుకతో మళ్లీ మొదలెట్టబోయేడు. సరిగ్గా అప్పుడు డాక్టరు తల దువ్వుకుని తయారై వచ్చేడు. 'యీ డాక్టర్లకి హృదయం లేదు' అనుకున్నాడు లేవిన్. 'వో పక్క మనుషుల ప్రాణాలు పోతూ వుంటే తల దువ్వుకుంటూ ముస్తాబవుతారు' అనుకున్నాడు.

"నమస్తే" అని డాక్టరు లేవిన్‌కేసి చేతిని చాస్తూ, అన్నాడు. ఆయన ఆవగింజంత ఆదుర్దా పడడం లేదు. డాక్టరు అలా వుండడం అతని ముఖంమీద చరుస్తూ వున్నట్టు వుంది. "యేమిటి తొందర? చెప్పండి" అన్నాడు.

లేవిన్ పెళ్లాం పరిస్థితి గురించి సొంతం చెప్పాలనే ప్రయత్నంలో అనవసరమైన వివరాలని చెప్పడం మొదలెట్టేడు. మధ్య మధ్య గబగబా రండి, వెడదాం అని బతిమలాడుకుంటూ చెప్పేడు.

"మీరు తొందర పడకండి. అయినా మీకు అలాంటి వాటి గురించి తెలీదు లెండి. అక్కడ నా అవసరం వున్నట్టు కనిపించడం లేదు. అయినా వస్తానని అన్నాను కదా, వస్తాను.

కానీ అంత హడావుడి పడక్కర్లేదు. అయ్యో, కూర్చోండి. కాఫీ తాగుతారా?"

యేమిటి మీరు నన్ను ఆట పట్టిస్తున్నారా అని అడుగుతున్నట్టు లేవిన్ డాక్టరుకేసి చూశాడు. కాని డాక్టరు ముఖంలో అసలలాంటి ఛాయలే లేవు.

"నాకు తెలుసండీ, నాకు తెలుసు" అని డాక్టరు చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. "నేనూ పిల్లలున్న వాణ్ణే. కాని యిలాంటి క్షణాల్లో మన మగాళ్ల కంటే అనవసరం అయిన వాళ్లుండరు. మా పేషెంట్ వొకావిడ వుంది. యిలాంటి సందర్భాల్లో ఆవిడ మొగుడు గుర్రాల శాలలో దాంకుంటాడు పోయి" అన్నాడు.

"కాని మీరే మనుకుంటున్నారు డాక్టరుగారూ? యిప్పుడు అంతా సవ్యంగా గడుస్తుందనే అనుకుంటున్నారా?"

"అన్నీ సలక్షణంగా జరుగుతాయనే సూచనలనిబట్టి తెలుస్తోంది."

"మరి నాతో రారూ?" అని ఆ క్షణంలో కాఫీ పట్టుకు వచ్చిన నౌకరుకేసి చిరచిర చూస్తూ అడిగాడు.

"ఓ గంటలో."

"గంట సేపే? మీకు పుణ్యం వుంటుంది అంత ఆలస్యం చెయ్యకండి."

"కొంచెం శాంతంగా కాఫీ తాగనివ్వండి."

డాక్టరు కాఫీ తాగడం మొదలుపెట్టేడు. యిద్దరూ మాట్లాడకుండా మౌనంగా వుండిపోయేరు.

"టర్కులకి బాగా మర్దనా జరుగుతోంది. తాజా వార్త చదివారా?" అని బన్ ముక్క కొరుక్కుంటూ డాక్టరు అడిగేడు.

"అబ్బ, యిది దుర్భరంగా వుంది" అని లేవిన్ అరిచి లేచాడు. "పదిహేను నిముషాల్లో బయల్దేరతారా?" అన్నాడు.

"అరగంటలో."

"ఒట్టే?"

యింటికి వెళ్లగానే లేవిన్‌కి అత్తగారు కనిపించింది. యిద్దరూ కలిసి పడక గది గుమ్మం దగ్గరికి వెళ్లేరు. పెద్దావిడ కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి. ఆవిడ చేతులు వొణుకుతున్నాయి. ఆవిడ లేవిన్ మెడ చుట్టూ చేతులు వేసి యేడ్చింది.

"యేమమ్మా, యెలా వుంది?" అని ఆవిడ లిజవేత పెత్రోవ్నా బయటకి వచ్చినప్పుడు అడిగింది. లిజవేత పెత్రోవ్నా ముఖం ఆదుర్దాగా వుంది కాని మెరుస్తూ వుంది.

"అన్నీ సవ్యంగా వున్నాయి. ఆమెని పడుకొమ్మని నచ్చ చెప్పండి. అప్పుడు తేలిక అవుతుంది" అని చెప్పిందామె.

కళ్లు తెరిచి పరిస్థితిని అర్థం చేసుకున్న క్షణంనుంచీ లేవిన్ యీ అగ్ని పరీక్షకి దృఢంగా నిలబడాలనే సిద్ధపడ్డాడు. దాన్ని గురించి యే రకమైన ఆలోచనలూ రానివ్వకుండా, యేం

జరగబోతోందో దాన్ని గురించిన అనుమానాలు యేమీ లేకుండా అన్ని ఆలోచనలనీ, భయాందోళనలనీ తనలో అణుచుకుంటూ పెళ్లాన్ని యే రకంగానూ కంగారు పెట్టకుండా, పైపెచ్చు ఆమెకి ధైర్యం చెపుతూ వూరడిస్తూ తను పైకి దిటవుగా కనిపిస్తూ అలా చెయ్యాలని అనుకున్నాడు. జరగబోయేది యేమిటో, అది యెలా ముగుస్తుందో అనే దానిమీదకి మనసు మళ్లకుండా, యీ కథ యెంత సేపు జరుగుతుందో మామూలుగానని పై వాళ్ల ద్వారా తెలుసుకుని, లేవిన్ మనసులో అయిదు గంటల సేపు వోపిక పట్టి గుండె చిక్క బట్టుకుందుకు తయారయే వున్నాడు. అలా వుండడం సంభవమనీ అనుకున్నాడు. కాని డాక్టరు దగ్గర్నుంచి తిరిగివచ్చి కిట్టీ పడుతూ వున్న వేదన చూశేక నిట్టూర్పు విడుస్తూ, తల పైకెత్తి మరిన్ని సార్లు "ప్రభూ, కరుణించు, మన్నించు, కాపాడు" అని రెట్టించుకున్నాడు. తను యీ అగ్ని పరీక్షని భరించలేననీ, భోరుమని విలపిస్తాననీ లేదా యెక్కడికేనా పారిపోతాననీ అతనికి భయం కలిగింది. అతని యాతన అంత దారుణంగా వుంది. యింతా చేసి గడిచింది వొక గంట మాత్రమే.

తర్వాత మరో గంట గడిచింది. రెండు, మూడు, ఐదు గంటలు గడిచేయి. అతను పెట్టుకున్న గడువు అయింది. కాని పరిస్థితి యథా ప్రకారంగానే వుంది. అతను భరిస్తూనే వున్నాడు, భరించక చేసేదీ యేమీ లేదు. ప్రతి క్షణం తన సహిష్ణుత హద్దు సమీపిస్తోందనీ, ఆమెతోబాటు బాధపడుతూ తన గుండె ముక్కలు ముక్కలైపోతుందనీ విహ్వలుడైపోతూనే వున్నాడు.



కాని నిముషాలు, గంటలు యీడ్చుకుంటూ గడుస్తూనే వున్నాయి. వాటితోబాటు అతని భయమూ, వేదనా కూడా తీవ్రం అవుతూనే వున్నాయి.

యేవి లేకుండా జీవితం వుండదో ఆ సామాన్య పరిస్థితులు లేవిన్‌కి సంబంధించి అస్తిత్వం కోల్పోయేయి. అతనికి యావత్తు కాల స్పృహ పోయింది. ఆ క్షణాలు – కిట్టీ అతన్ని తన దగ్గరికి పిలుచుకుని, అతను ఆమె చెమట చేతిని పట్టుకుని, ఆమె ఆ చేతిని వో సారి అసాధారణ శక్తితో అదిమి మరో సారి దూరం తోసేసిన ఆ క్షణాలు – యుగాల్లా గడిచేయి. యిప్పుడా యుగాలు క్షణాలుగా కనిపించేయి. కానా వెనక కొవ్వొత్తి వెలిగించమని లిజవేత పెత్రోవ్నా అతనితో చెప్పినప్పుడు అతను ఆశ్చర్యపోయేడు. సాయంత్రం అయిదు గంటలు అయిందని తెలిసింది. ఒకవేళ వాళ్లు అప్పుడు ఉదయం పది గంటలు అయిందని చెప్పినా అతను అంతే ఆశ్చర్యపోయి వుండేవాడు. కాల స్పృహ యెంత వుందో, అలాగే తను యెక్కడ వున్నాడో అనే ఆ స్థల స్పృహ అతనికి అంతే వుంది. కొంచెం సేపు వేదనా భరితంగా, కొంచెం సేపు నిశ్చేష్టితంగా కొంచెం సేపు అతనికి ధైర్యం చెపుతున్నట్టు దరహాస భరితంగా వున్న కిట్టీ అరుణ వదనం మాత్రమే అతనికి కనిపిస్తూ వుంది. అతను పెద్ద ప్రిన్సెస్‌కేసి చూశేడు. ఆవిడ ముఖం యెర్రబడి ఉద్విగ్నంగా వుంది. ఆవిడ నెరిసిన ఉంగరాల జుట్టు చెదిరిపోయింది. ఆవిడ పెదవి కొరుక్కుంటూ ఉబికి వచ్చే కన్నీళ్లని ఆపుకుంటోంది. అతను దాలీనీ, డాక్టరునీ

చూశేడు. డాక్టరు బొండు చుట్ట తర్వాత బొండు చుట్టని కాలుస్తూనే వున్నాడు. లిజవేత పెత్రోవ్నాని చూశేడు. ఆమె ముఖం దృఢంగా, నిబ్బరంగా, ఉత్తేజకంగా వుంది. పెద్ద ప్రిన్స్ కనుబొమలు ముడుచుకుని హాల్లో అటూ యిటూ తిరుగుతూ వున్నాడు. కాని వాళ్లు యెలా వస్తూ వున్నారో యెలా వెడుతూ వున్నారో అతనికి తెలియలేదు. ప్రిన్సెస్ ఓ క్షణం పడకగదిలో డాక్టరుతో వుండేది, మరుక్షణంలో చదువుకునే గదిలో వుండేది. అక్కడ వో బల్ల వేశారు. ఆ గదిలో వొకో సారి దాలీ వుండేది, ప్రిన్సెస్ కాదు. తర్వాత తనని యెక్కడికో దేని కోసమో పంపినట్టు లేవిన్‌కి గుర్తు వచ్చింది. వో సారి బల్లనీ సోఫానీ తేవడానికి అతన్ని సాయం పిలిచేరు. అతను ఆతృతగా వాటిని తెచ్చేడు అవి ఆమెకి అవసరమేమోనని. తర్వాత తెలిసింది ఆ రెండూ తను పడుకోవడం కోసమేనని. అతను డాక్టర్ని యేదో అడిగేందుకు చదువుకునే గదిలోకి వెళ్లేడు. డాక్టరు అతను అడిగిందానికి జవాబు చెప్పి, నగర దూమాలో జరిగిన గొడవ గురించి చెప్పడం మొదలుపెట్టేడు. తర్వాత అతన్ని బంగారు మలామా చేసిన వెండి చట్రం దేవతా చిత్రాన్ని తీసుకురమ్మని ప్రిన్సెస్ గదిలోకి పంపేరు. ప్రిన్సెస్ వృద్ధ పరిచారికా, అతనూ దాన్ని దింపడానికి బట్టల బీరువామీదకి యెక్కేరు. అలా దించ డంలో దాని ముందు వేలాడుతూ వున్న దీపాన్ని విరగ్గొట్టేరు. ఆ పరిచారిక కిట్టీ సలక్ష ణంగా వుంటుందనీ, దీపం గురించి జెంగ పడద్దనీ అతనికి ధైర్యం చెప్పింది. అతను చిత్రాన్ని తెచ్చి కిట్టీ మంచం దగ్గర తలదిశగా దాన్ని జాగ్రత్తగా తలగడల కింద దూర్చిపెట్టేడు. కాని యీ పనులన్నింటినీ యెప్పుడు యెలా చేశాడో అతనికి యెరుకలేదు. అలాగే ప్రిన్సెస్ యెందుకు తన చేతుల్ని పట్టుకుని సానుభూతిపూర్వకంగా కళ్లల్లోకి చూస్తూ ఆందోళనా ఆదుర్దా పడద్దని చెప్పిందో, దాలీ యేదన్నా యింత తినమని బతిమాలి తనని గదిలోనుంచి అవతలికి యెందుకు తీసుకుపోయిందో, డాక్టరు సానుభూతిపూర్వకంగా చూసి యెందుకు మందు చుక్కలు కాసిని యిస్తానన్నాడో కూడా అతనికి యెరుక లేదు.

లేవిన్‌కి యెరుకలో వున్నదల్లా ప్రస్తుతం యిక్కడ జరుగుతూ వున్నది, గుబేర్నియా ముఖ్య పట్టణం హోటెల్‌లో ముందుటేడు తన అన్నగారు నికొలాయ్ మృత్యుశయ్యమీద వున్న దానికి తుల్యంగా వుందనే. కాని అది శోకం, యిది సంతోషం. కాని ఆ శోకం, యీ సంతోషం రెండూ సమానంగానే సాదా జీవిత పరిస్థితులని మించి అతీతంగా వుంటాయి. అంటే అవి యీ సామాన్య జీవితంలో చిన్న గవాక్షం లాంటివి, దాని గుండా యేదో మహత్తరమైన దాని మెరుపు లీలగా దృశ్యమానమవుతుంది. యీ రెండు ఘటనలూ సమానంగానే వేదనా భరితమైనవి, కఠినమైనవి. అలాగే యీ రెండు స్థితుల్లోనూ యీ అతీత మహత్తరమైన దాన్ని గురించి చింతన చేసే మనిషి ఆత్మ పైకి అసంభవంగా కనిపించి, బుద్ధికి దురవగా హంగా తోచినటువంటి మహోన్నత శిఖరాల్ని అధిరోహిస్తుంది.

"ప్రభూ కరుణించు, మన్నించు, కాపాడు" అని లేవిన్ మనసు లోపల్లోపల పునశ్చరణ చేసుకుంటూనే వున్నాడు. దీర్ఘ కాలంగా, అతను భావించుకున్నట్టు, పూర్తిగా ధార్మిక

విశ్వాసాలని యెన్నడనగానో త్యజించేసినప్పటికీ అతను బాల్యంలో, యౌవన ప్రాదుర్భావ దశలో చేస్తూ వుండినట్టుగా అంతే సారళ్యంతో, ఆస్థతో భగవన్నామ స్మరణ చేస్తూనే వున్నాడు.

యింత సేపూ అతని మనఃస్థితి ద్వైధీభావభరితంగా వుంది. ఒకటి అతనామెతో గాక, వొక దానిమీద వొకటిగా బొండు చుట్ట కాలుస్తూ, పీకలు పోగు పడిన యాష్ట్రేమీద వాటిని నలిపి ఆర్పేస్తూ వున్న డాక్టరుతో వున్నప్పటిది. లేదా దాలీతో ప్రిన్స్‌తో వున్నప్పటిది. వాళ్లు భోజనం గురించీ, రాజకీయాల గురించీ, మరీయా పెత్రోవ్నా జబ్బు గురించీ మాట్లాడుతూ వున్నారు. యీ సందర్భాల్లో లేవిన్ ప్రకృతంలో జరుగుతూ వున్న దాని గురించి పూర్తిగా మర్చిపోయి హఠాత్తుగా నిద్రనుంచి మేల్కొన్న వాడిలా వుండేవాడు. రెండో మనఃస్థితి ఆమె సముఖంలో వచ్చేటటు వంటిది. ఆమె మంచం తలాపి వేపున నుంచున్నప్పటిది. అక్కడ అతని హృదయం సానుభూతితో వ్రయ్యలైపోయే స్థితికి చేరేది, అయినా ఛిన్నం కాకుండా వుండేది. అక్కడ అవిరామంగా భగవన్నామ స్మరణ చేస్తూనే వుండేవాడు. పడక గదినుంచి కిట్టీ మూలుగు వినిపించిన ప్రతిసారీ అతను విస్మృతినుంచి బయట పడేవాడు. అప్పుడు అతను అంతకు ముందు క్షణంలో తనని కమ్మిన నిగూఢ భ్రమకి లొంగి పోయేవాడు. ఆమె మూలుగు వినిపించిన ప్రతి సారీ వొక్క ఉదుట్న లేచి తన దోషం యేమిటో చెప్పడానికి ఆమె గది వేపు పరిగెత్తేవాడు. తర్వాతనే అతని స్ఫురణకి వచ్చేది అది తన దోషం కాదని. ఆమెని రక్షించడం, ఆమెకి సహాయం చెయ్యడం మాత్రమే తను కోరుకున్నాడు. కాని ఆమెకేసి చూసినప్పుడు తను ఆమెకి సాయం చెయ్యలేనని తెలిసేది. అది అతన్ని భయ విహ్వలితుణ్ణి చేసేది. "ప్రభూ కరుణించు, మన్నించు రక్షించు" అంటూనే వుండేవాడు. కాలం అలా యీడ్చుకుంటూ సాగే కొద్దీ అతని ద్వైధీ మనఃస్థితీ అంతలా అధికం అయింది. ఆమె సముఖంలో లేనప్పుడు ఆమె సంగతి మరిచిపోయి మరింత ప్రశాంత చిత్తుడయేవాడు. ఆమె బాధ తెలుసుకునీ దాన్ని తను తగ్గించలేనని తెలుసుకునీ మరింత వ్యధాకులితుడయ్యేవాడు. పారిపోదామనే కోరికతో టక్కున లేచేవాడు, కాని ఆమె దగ్గరికే పరిగెత్తి వెళ్లేవాడు. తనని తడవ తడవకీ పిలుస్తూ వున్నందుకు ఆమెపట్ల కోపం వచ్చేది. కాని ఆమెని చూడగానే, అణకువగా దరహాసం చేసే ఆమె వదనాన్ని చూడగానే, ఆమె 'నిన్ను యమయాతన పెడుతున్నాను' అని గొణగడం వినగానే దేవుడిమీద కోపం వచ్చేది. కాని దేవుడు స్ఫురణకి రాగానే క్షమనీ, దయనీ చూపించమనే వేడుకోలువచ్చేది.

## 15

వ్యవధి యెంత గడిచిందో అతనికి తెలీదు. కొవ్వొత్తులు కాలిపోతూ వున్నాయి. దాలీ కొంచెం సేపటి కితమే చదువుకునే గదిలోకి వచ్చి డాక్టరుని కాసేపు పడుకొమ్మని చెప్పింది. డాక్టరు యెవళ్లో దొంగ ఇంద్రజాలికుడి గురించి చెపుతూ వుంటే వింటూ,

ఆయన చుట్ట చివర నుసి పేరుకుంటూ వుండడం చూస్తూ చేతుల కుర్చీలో కూర్చున్నాడు లేవిన్. అది విశ్రాంతి, విస్మరణలో అంతరాయ సమయం. యేం జరుగుతూ వుందో దాన్ని గురించి అతను సంపూర్తిగా మరిచిపోయేడు. తను డాక్టరు చెప్పేదాన్ని వినగలుగుతున్నాడు. ఆయన చెప్పేదాన్ని అర్థం చేసుకుంటున్నాడు. హఠాత్తుగా వో కేక వినిపించింది. లేవిన్ తకామని లేచి నుంచోను కూడా నుంచోలేనంత భీకరంగా వుంది ఆ కేక. వూపిరి ఆగిపోయింది. భీతిల్లిన ప్రశ్నార్థక దృక్కులతో డాక్టరుకేసి చూశాడు. డాక్టరు చెవి పెట్టి వింటూ వొక వేపు తల వొరగేసి, ఆఁ అదీ అలానే జరగాలి అంటునట్టు చిరునవ్వు నవ్వేడు. ప్రతీదీ యెంతో అసాధారణంగా వుండడంతో యిప్పుడు లేవిన్‌ని యేదీ భయపెట్ట లేకుండా వుంది. 'యిది అలానే వుండాలేమో' అనుకుని వున్న చోటనే కూర్చుండి పోయేడు. కాని యెవరిదా కేక? అతను వొక్క ఉదుట్న లేచి నుంచున్నాడు. మునిగాళ్లమీద పడక గదిలోకి వెళ్లేడు. లిజవేత పెత్రోవ్నాకి ప్రిన్సెస్‌కి వెనక్కి వెళ్లి తలాపి వేపున నుంచున్నాడు. కేక ఆగిపోయింది. కాని యేదో మార్పు వచ్చింది. ఆ మార్పు యేమిటైందీ అతను చూడలేదు, గ్రహించలేదు. చూడాలనీ, గ్రహించాలనీ అనుకోనూ లేదు. లిజవేత పెత్రోవ్నా ముఖం చూసి మార్పు వచ్చిందని గమనించేడు. ఆమె ముఖం కాంతి విహీనంగా కటువుగా, ముందటి మాదిరీ నిశ్చితంగా వుంది. కాని యిప్పుడు ఆమె దవడ వొణుకుతోంది, ఆమె కళ్లు కిట్టీమీదనే లగ్నం అయివున్నాయి. కిట్టీ ముఖం యెర్రగా వుంది, పీక్కుపోయి వుంది. చెమ్మగిలిన ముంగురులు ముఖంమీద అంటుకుపోయేయి. అతని కళ్లని వెతుకుతూ ఆమె ముఖం తిప్పింది. చేతులెత్తి అతని చేతుల కోసం తడుముకుంది. వెచ్చగా, చెమ్మగా వున్న ఆమె చేతులతో చల్లగా వున్న అతని చేతులని తీసుకుని ముఖంమీద అద్దుకుంది.

"నువ్వు వెళ్లదు, వెళ్లిపోవద్దు. నాకు భయం యేం లేదు, భయం యేం లేదు" అని గబగబా అంది. "అమ్మా, నా దుద్దులు తీసెయ్యి నొప్పి పెడుతున్నాయి. నువ్వేం భయపడడం లేదు కదా? త్వరగా, త్వరగా, లిజవేత పెత్రోవ్నా..."

ఆమె గబగబా మాట్లాడింది, చిరునవ్వు నవ్వబోయింది. కాని హఠాత్తుగా ఆమె ముఖం వంకర తిరిగిపోయింది, ఆమె అతన్ని దూరం తోసేసింది.

"అబ్బా, యిది దుర్భరం. నే బతకను, బతకను! వెళ్లిపో వెళ్లిపో!" అని అరుస్తూనే వుంది. మరో సారి ముందటి మాదిరీ భయంకరమైన కేక వేసింది.

లేవిన్ తల చేత్తో పట్టుకుని గదిలోనుంచి బయటికి పరిగెత్తేడు.

"యేం ఫరవాలేదు, ఫరవాలేదు, అంతా సవ్యంగా వుంది" అని దాలీ వెనకనుంచి అతనికి చెప్పింది.

వాళ్లేం చెప్పినా, లేవిన్‌కి యిప్పుడు తెలిసింది ఆఖరి ఘడియ వచ్చిందని. అతను పక్క గదిలో తలుపు చట్రానికి తల ఆన్చి నుంచున్నాడు. అంతకు ముందు యెన్నడూ విని యెరగని కేకలు, మూలుగులు వింటూ నుంచున్నాడు. అలా అరిచేదీ, మూలిగేదీ ఆమే, వొకప్పుడు

కిట్టీగా వున్న ఆమే, అని అతనికి తెలుసు. బిడ్డ కావాలీ అనే కోరిక అతనికి అంతకు ముందే యెప్పుడో పోయింది. బిడ్డ తలపే అతనికి వెగటు పుట్టిస్తోంది. కిట్టీ బతకాలని కూడా అతను కోరుకోవడం లేదు, యీ దుర్భర వేదన అంతం కావాలనే అతను కోరుకున్నాడు.

"డాక్టర్! యేమిటిది? యేమిటీ అంట? భగవంతుడా!" అని అతను లోపలికి వస్తూ వున్న డాక్టరు చేతిని పట్టుకుంటూ అడిగేడు.

"అయిపోయింది, దాదాపు" అన్నాడు డాక్టరు. ఆ మాటలు అంటూ వుంటే డాక్టరు ముఖం గంభీరంగా కనిపించింది. 'అయిపోయింది' అంటే అర్థం కిట్టీ జీవితం ముగిసి పోతోంది అని లేవిన్ అనుకున్నాడు.

తనేం చేస్తున్నాడో అనే దాని స్ఫురణ లేకుండా అతను మళ్లీ పడక గదిలోకి పరిగెత్తేడు. అతనికి మొదటగా కనిపించింది లిజవేత పెత్రోవ్నా ముఖం. అంతకు ముందున్న దానికంటే ఆమె కటువుగా వుంది, ఆమె కనుబొమలు యింకా యెక్కువ ముడుచుకుపోయి వున్నాయి. కిట్టీ ముఖం గుర్తు పట్టలేనట్టుగా వుంది. వొత్తిడివల్లా, ఆమెనుంచి వెలువడే అరుపులవల్లా యేదో భయంకరమైంది ఆమె ముఖం వుండాల్సిన స్థానంలో వచ్చింది. లేవిన్ తన గుండె ముక్కలైపోతోందని అనుకున్నాడు. యెత్తైన కొయ్య మంచంమీద తల వాలేసుకున్నాడు. ఆ భయంకరమైన అరుపులు యింకా భయంకరం అయేయి. భయంకరత్వపు చివరి అంచు చేరి యిక అవతలకి సాగలేక తక్కున ఆగిపోయేయి. లేవిన్ తన చెవుల్ని తనే నమ్మలేకపోయేడు. కాని నమ్మకుండా వుండకపోవడమూ అసంభవంగానే వుంది. అరుపులు ఆగిపోయేయి. యేమీ వినిపించడం లేదు, యేదో సవసవ, చప్పుడులేని కదలికలు, వేగంగా శ్వాస పీల్చే శబ్దం, కిట్టీ సజీవ కోమల సంతోషభరిత శాంత చిన్న స్వరం "అయిపోయింది" అనడం వినిపించేయి.

లేవిన్ తల పైకి యెత్తేడు. దుప్పటిమీద శక్తి హీనమైన చేతుల్ని చాచుకుని, అవర్ణ్యనీయ ప్రశాంతత, సౌందర్యం కనిపించే కిట్టీ, చప్పుడు లేకుండా లేవిన్‌కేసి చూస్తూ వుంది, మందహాసం చెయ్యబోయింది కాని చెయ్యలేకపోయింది.

లేవిన్ గత యిరవై రెండు గంటలుగా వున్న ఆ నిగూఢ, భయానక మరో ప్రపంచం నుంచి పరిచితమైన పాత ప్రపంచంలోకి హఠాత్తుగా వొక్క క్షణంలో వూడి పడ్డాడు. యీ ప్రపంచం యిప్పుడు యెంత ధగద్ధగాయమాన నూతన సంతోషంతో విరాజిల్లుతూ వుందంటే అతను దాన్ని తట్టుకోలేకపోయేడు. మరీ బిగిసిన తీగలు పుటుక్కుమని తెగి పోయేయి. సంతోషభరిత అశ్రువులు, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఉద్వేగభరితమై అతని యావత్ శరీరమూ కంపించి అతనికి నోట మాట రాలేదు.

అతను మంచం పక్కన మోకాళ్లమీద వాలేడు. భార్య చేతుల్ని పెదాల దగ్గరికి తీసుకున్నాడు. ఆమె చేతిమీద ముద్దులు కురిపించేడు. ఆ ముద్దులకి జవాబుగా ఆమె వేళ్లతో మెల్లిమెల్లిగా తడిమింది. అప్పుడే మంచం కోడు దగ్గర లిజవేత పెత్రోవ్నా నేర్పయిన

హస్తాల్లో వో మానవ ప్రాణి, వత్తి చివర దీప శిఖలా, చలిస్తోంది. ఆ ప్రాణి ప్రాగభావంగా వున్నటువంటిది. యిప్పుడు అస్తిత్వం వచ్చిన యీ ప్రాణి యితరుల మాదిరి అదే అధికారంతో మహత్వంతో జీవితం సాగించి, తనలాంటి వాళ్లని పునరుత్పత్తి చేస్తుంది.

"ప్రాణం వుంది! ప్రాణం వుంది! మగపిల్లాడు! యిక యే బెంగా లేదు" అని లిజవేత పెత్రోవ్నా కంపించే చేత్తో శిశువు వీపుమీద తపతప మనిపిస్తూ అనడం లేవిన్‌కి వినిపించింది.

"అమ్మా! నిజమా?" అని కిట్టీ అడిగింది.

ప్రిన్సెస్ వాగరుస్తూ తీసిన శ్వాసే ఆమెకి జవాబుగా వచ్చింది.

కాని ఆ నిశ్శబ్ద మధ్యంలో, కిట్టీ అడిగిన ప్రశ్నలోని సకల సందేహాలనీ దూరీకృతం చేస్తున్నట్టుగా ఆ గదిలో వున్న మంద్రస్వరాలకి భిన్నమైన వొక అన్యస్వరం వినిపించింది. యెక్కడినుంచి వచ్చిందో యెవరికీ తెలియని ఆ నూతన ప్రాణి, యెవరినీ లక్ష్య పెట్టనన్న ధిక్కారంతో, సాహసపూరితంగా నిర్భయంగా తన రాకని ప్రకటిస్తూ చేసిన రోదనా స్వరం అది.

కొంచెం సేపటి కితం కిట్టీ చనిపోయిందనీ, తనూ ఆమెతోబాటు చనిపోయేడనీ, తమ బిడ్డ దేవత అనీ, భగవంతుడు తమ ముందు వున్నాడనీ చెప్పి వుండినా లేవిన్ దేన్ని గురించీ ఆశ్చర్య పడి వుండేవాడు కాదు. కాని యిప్పుడు వాస్తవిక ప్రపంచంలోకి తిరిగి వచ్చేక, ఆమె బతికే వుందనీ బాగానే వుందనీ, ఆ రోదించే ప్రాణి తన పుత్రుడనీ బోధ పరుచుకోవడానికి బుర్ర గట్టిగా ప్రయత్నం చెయ్యాల్సి వచ్చింది. కిట్టీ బతికే వుంది, ఆమె వేదనలు మాయమైపోయేయి. అతని ఆనందానికి అవధి లేకపోయింది. అది అతనికి బోధ పడింది. అతనికి కావాల్సింది అంతా అదే. కాని ఆ శిశువు? యెక్కణ్ణుంచి వచ్చినట్టు? యెందుకు వచ్చినట్టు? యెవరైనట్టు? అతను యే రకంగానూ అర్థం చేసుకోలేకపోయేడు, యీ ఆలోచనకి అలవాటు పడలేకపోయేడు. యిది వొక భారం, అవసరానికి మించినటువంటిది అని తోస్తోంది. చాలా సేపటిదాకా అతను దానికి అలవాటు పడలేకపోయేడు.

## 16

ఉదయం తొమ్మిది గంటల ప్రాంతంలో వృద్ధ ప్రిన్స్, కోజ్నిషెవ్, అబ్లాన్‌స్కీ లేవిన్ డ్రాయింగు రూమ్‌లో కూర్చున్నారు. ప్రసవించిన ఆమె గురించిన చర్చ యీవత్తూ అయిపోయింది. దాంతో వేరే విషయాలమీదకి సంభాషణ మళ్లింది. లేవిన్ యీ సంభాషణ వింటూ వున్నాడు. అనుకోకుండానే అతనికి ఆ ఉదయానికి ముందు జరిగిందీ, తను యెలా వున్న వాడైందీ గుర్తు వచ్చేయి. అప్పట్నుంచి వంద యేళ్లు గడిచినట్టుగా వుంది. తను అలంఘనీయ అలంగం పైకి వెళ్లినట్టు అక్కణ్ణుంచి తను మాట్లాడుతూ వున్న వాళ్లకి కష్టం

కలగకుండా బహు సావధానంగా కిందికి దిగినట్టూ వుంది. లేవిన్ అక్కడి కబుర్లలో కల్పించుకుని మాట్లాడుతూనే వున్నాడు. కాని వో పక్క భార్య గురించి, ఆమె ప్రస్తుత పరిస్థితి గురించి, బిడ్డడి గురించి — తను వాడి అస్తిత్వం విషయానికి యింకా అలవాటు పడాల్సి వుంది — ఆలోచించుకుంటూనే వున్నాడు. తన వివాహం ఆయిం తర్వాత వొక నూతన, అపరిచిత మహత్వం ప్రాప్తింప చేసిన సకల నారీ జగత్తు యిప్పుడతనికి యెంత మహోన్నతంగా భాసిస్తూ వుందంటే అతని వూహ కూడా దాన్ని అందుకోలేకుండా వుంది. ముందు రోజు క్లబ్బులో జరిగిన భోజనాల గురించిన చర్చ వింటూ అతను అనుకున్నాడు — 'యిప్పుడు తను యేం చేస్తోందో, నిద్రపోయి వుంటుందా? ఆమెకి యెలా వుందో? యేం ఆలోచిస్తోందో? పిల్లవాడు దీమ్రితియ్ యేడుస్తున్నాడేమో?' సంభాషణ మధ్యలో, మాట పూర్తి కాకుండానే అతను లేచి గదిలోనుంచి వెళ్లిపోయేడు.

"నేను కిట్టీ దగ్గరికి వెళ్లచ్చో లేదో చెప్పేందుకు యెవళ్లనేనా యిక్కడికి పంపించు" అని వృద్ధ ప్రిన్స్ అతనితో అన్నాడు.

"అలాగే, యిప్పుడే పంపిస్తా" అని లేవిన్ జవాబు చెప్పేడు. ఆగకుండానే ఆమె దగ్గరికి వెళ్లిపోయేడు.

ఆమె మెలుకువగానే వుంది. తల్లితో మెల్లిగా మాట్లాడుతోంది. పిల్లవాడి నామ కరణం గురించి ఆలోచన చేస్తోంది.

ఆమె ముఖం కడుక్కుని, తల దువ్వుకుని యేదో నీలం రంగుది తగిలించిన షోకైన టోపీ పెట్టుకుని చేతులు దుప్పటి పైన పెట్టి వెనక్కి వాలి పడుకుంది. అతని చూపు ఆమె చూపు కలిశాయి. తన దగ్గరికి రమ్మని అతన్ని ఆమె చూపు పిలిచింది. సర్వదా తేజో వంతంగా వుండే ఆమె నేత్రాలు దగ్గరికి వస్తూ అతను వేసే ప్రతి అడుగుకీ మరింత ప్రకాశమానం అయేయి. ఆమె ముఖంలో యీ లోకంనుంచి ఆ పరలోక పరివర్తన, మర ణించే వాళ్ల ముఖంమీద కనిపించేలాంటిది, వచ్చింది. కాని తేడా అల్లా ఆ సందర్భంలో వీడ్కోలు వుంటుంది, యిక్కడ యీామె ముఖంమీద ఆమంత్రణం వుంది. ఆమె కాన్పు అయేటప్పుడు కలిగినలాంటి విహ్వలత అతని హృదయంలో కలిగింది. ఆమె అతని చెయ్యి అందుకుని నిద్ర పోయావా లేదా అని అడిగింది. అతను జవాబు చెప్పలేదు, తన దుర్బలత్వం స్ఫురించి ముఖం అటు వేపు మళ్లించుకున్నాడు.

"నేను కొంచెం సేపు నిద్రపోయేను. యిప్పుడు నాకు హాయిగా వుంది" అని చెప్పింది.

అతని ముఖంకేసి చూడగానే హఠాత్తుగా ఆమె ముఖంలోని భావం మారిపోయింది.

"వాణ్ణి యిలా యియ్యండి" అని పిల్లవాడు కుంయ్ మనడం విని అంది. "వాణ్ణి నాకు యివ్వండి లిజవేత పెత్రోవ్నా. మా ఆయన చూస్తారు" అంది.

"అవును మరి, తండ్రి చూడద్దూ" అని లిజవేత పెత్రోవ్నా యేదో వింతగా, యెర్రగా కదలాడుతూ వున్న దాన్ని యెత్తుతూ అంది. "కాని ఆగండి, బిడ్డకి సంరక్షణ చెయ్యాలి

ముందు'' అంది. ఆ కదలాడే యెర్ర వస్తువుని మంచంమీద పడుకోబెట్టి, పొత్తిళ్ళ విప్ప దీయడం మొదలుపెట్టింది. తర్వాత వేరే బట్టలు కప్పడం మొదలెట్టింది. అప్పుడు యెత్తి వో వేలితో తిప్పి బిడ్డమీద యేదో చల్లింది.

ఆ దయనీయ సూక్ష్మ ప్రాణికేసి చూస్తూ లేవిన్ తన మనసులో పితృ భావన లక్షణాలు అగుపడతాయేమోనని వృథా ప్రయత్నం చేశాడు. కాని అతనికి ఘృణత్వం మాత్రమే కలిగింది. కాని ఆ ప్రాణికి కప్పిన పొత్తిళ్ళ విప్పదీసి నగ్నం చెయ్యగానే వేళ్ళ, కాలి వేళ్ళ మాత్రమే కాకుండా బొటన వేళ్ళ కాలి బొటన వేళ్ళ కనిపించాయి. స్పష్టంగా వున్న గోధుమ రంగు చిన్ని చేతులు, కాళ్ళ కనిపించాయి. లిజవేత పెత్రోవ్నా ఆ ప్రాణి చాచిన చేతుల్ని మెత్తని చిన్న చిన్న స్ప్రింగుల మాదిరీ నొక్కింది. ఆ చేతుల చుట్టూతా మెత్తని గుడ్డలు చుట్టింది. యిదంతా చూడగానే అతని హృదయంలో ఆ ప్రాణిపట్ల జాలి, ఆమె వాణ్ణి గాయ పరుస్తుందేమోనని భయమూ యెంత కలిగాయంటే అతను ఆమె చేతిని పట్టుకుని ఆపేడు.

లిజవేత పెత్రోవ్నా ఫక్కున నవ్వింది.

''అయ్యో, బెంగ పడిపోకండి, బిడ్డనేం చెయ్యను'' అంది.

పిల్లవాణ్ణి ముస్తాబు చేసి, పట్టు పురుగు తన చుట్టూ అల్లుకునే కాయలాగా చేశాక, తను చేసిన పనిని చూసి గర్వ పడుతున్నట్టుగా లిజవేత పెత్రోవ్నా పిల్లవాణ్ణి వూపుతూ పైకి యెత్తింది. లేవిన్ తన పుత్రుణ్ణి షోడశ కళలతో విరాజిల్లుతున్న వాడిలా బాగా చూస్తాడని పైకి యెత్తింది.

కిట్టీ దీన్నంతట్నీ క్రీగంటితో చూస్తూనే వుంది.

''యిలా యివ్వండి వాణ్ణి, యిలా యివ్వండి వాణ్ణి'' అని కిట్టీ లేచి కూర్చునే ప్రయత్నం చేస్తూ అంది.

''యేమిటా పని కిట్టీగారూ! మీరలా లేవకూడదు! కొంచెం ఆగండి, యిప్పుడే యిస్తా. కొంచెం వాళ్ళ నాన్నకి కూడా చూపించ నియ్యండి తన కొడుకు యెంతటి గడుగ్గాయో!'' అంది.

లిజవేత పెత్రోవ్నా యీ వింత ప్రాణిని, పొత్తిళ్లలో కదులుతూ తల దాచుకుంటూ వున్న యీ యెర్రని ప్రాణిని వొక చేత్తో పట్టుకుని (రెండో చేతి వేళ్లతో వాలిపోతూ వున్న శిరసుకి ఆను యిస్తూ) లేవిన్‌కి అందించింది. కాని యీ బుజ్జి ముఖానికి ముక్కు కూడా వుంది, ధిక్కారంగా చూసే కళ్ళ వున్నాయి, చప్పరించే పెదాలు వున్నాయి.

''చక్కని బిడ్డ'' అంది లిజవేత పెత్రోవ్నా.

లేవిన్ భారమైన మనసుతో గాఢంగా శ్వాస పీల్చేడు. యీ చక్కని బిడ్డ అతని మనసులో కేవలం ఘృణత్వాన్ని, దయాభావాన్ని కలిగించేడు. తను ఆశించిన దాన్ని దేన్నీ కలిగించలేదు.

పిల్లవాడికి తల్లి స్తనం అందుకోవడం నేర్పగానే లేవిన్ తల పక్కకి తిప్పుకున్నాడు.

వున్నట్టుండి వొక నవ్వు వినిపించింది. అతను అటు వేపు తిరిగేడు. కిట్టీ నవ్వింది. పిల్లవాడు స్తనం పట్టుకున్నాడు.

''వూఁ చాలు, చాలు'' అని లిజవేత పెత్రోవ్నా అంటోంది. కాని కిట్టీ బిడ్డడిని తిరిగి వెనక్కి యివ్వడం లేదు. వాడు ఆమె చేతుల్లోనే నిద్రపోయేడు.

''యిప్పుడు చూడు'' అని కిట్టీ వాణ్ణి లేవిన్‌కి చూపించేందుకు అటు తిప్పింది. ఆ చిన్న ముఖంమీద వృద్ధుడి ముఖంమీదలాంటి ముడతలు హఠాత్తుగా కనిపించేయి, పిల్లవాడు తుమ్మేడు.

చిరునవ్వు నవ్వుతూ, ఆర్ద్రతతో ద్రవించిపోయిన కారణంగా కళ్లల్లో తిరిగిన నీళ్లని ప్రయాసమీద ఆపుకుంటూ లేవిన్ భార్యని ముద్దుపెట్టుకుని చీకటి కమ్మిన ఆ గదిలో నుంచి అవతలికి వెళ్లిపోయేడు.

యీ చిన్న ప్రాణిపట్ల అతనికి కలిగిన అనుభూతి అతను వూహించింది యెంత మాత్రం కాదు. యీ అనుభూతిలో సంతోషం కలిగించేది కాని, ఆనందదాయకమైంది కానీ యేమీ లేదు. తద్భిన్నంగా అతనికి కొత్త భయాలు పీడించేయి. మనసుని విహ్వలం చేసే కొత్త యెల్లలు తెరుచుకున్నాయి అన్న చేతన వచ్చింది. ఆదిలో యీ చేతన యెంత పీడాకరంగా వుందంటే, యీ నిస్సహాయ బుజ్జి పిల్లడికి యేదన్నా హాని జరుగుతుందేమోనన్న భయం యెంత తీవ్రంగా కనిపించిదంటే పిల్లవాడు తుమ్మినప్పుడు అతనికి అనుభూతం అయిన అర్థంలేని సంతోషం, నిగూఢ గర్వభావం లుప్తం అయిపోయేయి.

## 17

అబ్లాన్‌స్కీ వ్యవహారాలు యేమీ బాగా లేవు.

అడివిలోని కలప అమ్మగా వచ్చే సొమ్ములో మూడింట రెండు వంతులు ఖర్చు చేసేశాడు. ఆ మిగిలిన మూడో భాగంలో పది శాతం తప్ప మిగిలిన అంతటినీ వ్యాపారి దగ్గర్నుంచి ముందే తీసేసుకున్నాడు. వ్యాపారి యింక సొమ్ము యివ్వనన్నాడు. యేమంటే దాలీ మొట్ట మొదటి సారిగా యీ ఆస్తిమీద తన హక్కు స్థాపించుకుంటూ ఆఖరి చెల్లింపు రసీదుమీద సంతకం చెయ్యనని చెప్పింది. అబ్లాన్‌స్కీ జీతం మొత్తం యింటి ఖర్చులకి, చిన్నా చితకా చేబదుళ్లకీ సరిపోయేది. దాంతో అతని చేతిలో బొత్తిగా పైసలు మిగలడం లేదు.

యిది బాగా లేదు, యిబ్బందికరంగా వుంది. అబ్లాన్‌స్కీ దృష్టిలో యీ పరిస్థితికి స్వస్తి చెప్పాలి. అతని ప్రకారం దీనికి కారణం తనకి చాలా తక్కువ జీతం రావడమే. అయిదేళ్ల కితం అతని ఉద్యోగం మంచిదే, కాని యిప్పుడు కాదు. బేంకు డైరెక్టరు పెత్రోవ్‌కి పన్నెండు వేలు వస్తున్నాయి. వో కంపెనీ డైరెక్టరు స్వెంతిత్‌స్కీకి పదిహేడు వేలు వస్తున్నాయి. బేంక్ వ్యవస్థాపకుడు మీతిన్‌కి యాభై వేలు వస్తున్నాయి. 'తెలుస్తూనే వుంది, నేను

కళ్లు మూసుకుపోయి వున్నాను, దాంతో నన్ను దాటి పోయేరు' అని అబ్లాన్స్కీ మనసు లోపల్లోపల అనుకున్నాడు. అందుకని అతను కళ్లు తెరుచుకుని, చెవులు సావధానంగా పెట్టి అప్రమత్తంగా వున్నాడు. దాంతో శీతకట్టు ఆఖరికి అతనికి తగిన ఉద్యోగం కనిపించింది. దానిమీద మొదట మాస్కోలో, పినతండ్రులు పినతల్లులు మేనమామలు మేనత్తలు స్నేహితులు మిత్రులు చేతులు అందివ్వగా దాడి ఆరంభించేడు. పరిస్థితులు వొక కొలిక్కి వస్తున్నట్టు కనిపించగానే పీటర్స్‌బుర్గ్‌కి వసంతరుతువులో స్వయంగా ప్రయాణం కట్టేడు. ఆ ఉద్యోగం సాలుకి వెయ్యినుంచి యాభై వేలదాకా జీతం తెచ్చి పెట్టే వాటిల్లో వొకటి. లంచాలు, పై ముడుపులు ముట్టే ముందటి ఉద్యోగాలతో పోలిస్తే యిప్పుడు యెక్కువగా వున్నటు వంటిది. అది దక్షిణ రైల్వే, బేంకుల పరస్పర రుణకోశ సంయుక్త యేజన్సీ బోర్డులో వొక సభ్యుడి ఉద్యోగం. అలాంటి ఉద్యోగాలన్నిటిలాగానే యీ పదవికీ యెంతో విషయ పరిజ్ఞానం, కార్యనిర్వాహక సామర్థ్యం అవసరం అయినటు వంటిది, యే వొక్క వ్యక్తీ యిన్ని గుణాలు కలిగి వుండడం అసంభవం. యిన్ని సుగుణాలు కలిసిన మనిషి వొక్కడు దొరకడం అసాధ్యం కాబట్టి ఆ పదవిని యెవడో అవినీతిపరుడికి కట్టబెట్టడం కంటే నిజాయితీపరుడికి కట్టబెట్టడం మెరుగు. అబ్లాన్స్కీ వొట్టి నిజాయితీపరుడు మాత్రమే కాదు (సామాన్యార్థంలో) గట్టి అర్థంలో గట్టిగా నిజాయితీపరుడైన మనిషి. మాస్కోలో 'నిజాయితీపరుడైన అధికారి, నిజాయితీపరుడైన రచయిత, నిజాయితీగల పత్రిక, నిజాయితీగల సంస్థ, నిజాయితీగల ధోరణి' అని యే అర్థంలో వాడుకలో వుంటాయో, అంటే ఆ బాపతు వ్యక్తిగాని సంస్థగాని నిజాయితీ ప్రదర్శించడమేగాక సందర్భం వచ్చినప్పుడు ప్రభుత్వంతో తలపడగల వైఖరితో కూడా వుండడం అనే అర్థంలో నన్నమాట. మాస్కోలో యీ అర్థంలో యీ పదాన్ని వాడే బృందాల్లో అబ్లాన్స్కీ తిరిగేడు. అతన్ని నిజాయితీపరుడుగా అక్కడ చూసేవాళ్లు, అంచేత పై వాళ్లతో పోలిస్తే అతను ఆ పదవికి యెక్కువ తగిన వాడు.

యీ ఉద్యోగానికి సాలుసరి జీతం యేడునుంచి పది వేలదాకా వుంటుంది. అబ్లాన్స్కీ ప్రస్తుతం వున్న మంత్రిత్వ శాఖ ఉద్యోగాన్ని వదులుకో నక్కర్లేకుండానే దీన్ని చెయ్యవచ్చు. యీ నియామకం రెండు మంత్రిత్వశాఖలమీదా, వొక మహిళమీదా, యిద్దరు యూదులమీదా ఆధారపడి వుంది. దీనికి సంబంధించి పట్టవలసిన వాళ్లందర్నీ పట్టుకున్నాక, వీళ్లని స్వయంగా వెళ్లి పీటర్స్‌బుర్గ్‌లో దర్శించడం అబ్లాన్స్కీ ధర్మం అయింది. ఆదీగాక విడాకుల విషయంలో కరేనిన్‌ని కచ్చితంగా తేల్చి చెప్పమని అడిగి జవాబు తీసుకువస్తానని ఆన్నాకి అతను మాట యిచ్చేడు. అంచేత దాలీని బతిమాలి యాభై రూబుళ్లు వదుక్కుని అతను పీటర్స్‌బుర్గ్‌కి బయలుదేరాడు.

కరేనిన్ చదువుకునే గదిలో కూర్చుని, రష్యా విత్త విధానాల కారణాల గురించి అతను చెపుతూ వుంటే అబ్లాన్స్కీ వింటూ, తను తన వ్యవహారం గురించీ ఆన్నా వ్యవహారం గురించీ మాట్లాడ్డం కోసం ఆయన యెప్పుడు అపుతాడా అని యెదురు చూస్తూ కూర్చున్నాడు.

''అవును, ముమ్మాటికీ నిజం'' అని అతను, కరేనిన్ కళ్లజోడు తీసి — యిప్పుడు కళ్లజోడు లేకుండా కరేనిన్ చదవలేకపోతున్నాడు — తన బావమరిదికేసి ప్రశ్నార్థకంగా చూడ గానే అన్నాడు. ''ప్రతి అంశం వివరంగా చూస్తే అది ముమ్మాటికీ నిజమే. కాని మన యుగ సిద్ధాంతం స్వాతంత్ర్యం'' అన్నాడు.

''అవును కాని స్వాతంత్ర్య సిద్ధాంతాన్ని కలుపుకొచ్చే మరో సిద్ధాంతాన్నీ ప్రతిపాది స్తున్నాను'' అని కరేనిన్ 'కలుపుకొచ్చే' అనే మాటమీద ప్రత్యేక వూనిక పెడుతూ, ఆ విషయం యెక్కడ ప్రసక్తమయిందో చదివి చెప్పేందుకుగాను మళ్లీ కళ్లజోడు పెట్టు కుంటూ అన్నాడు.

కరేనిన్ రాత ప్రతి తీసుకుని చదివేడు. ముత్యాలకోవ లాంటి దస్తూరీలో వుంది అది. మార్జిన్లు బాగా వెడల్పుగా వదిలి చక్కగా వుంది. చర్చనీయాంశానికి బలం యిచ్చే సంద ర్భం వెతుకుతూ దాన్ని తన శ్రోతకి అతను చదివి వినిపించేడు.

''నేను సొంత ప్రయోజనాల కోసం కాక నిమ్న, ఉచ్చవర్గాల కోసం, సామాన్య సంక్షే మం నిమిత్తం వ్యాపార రక్షా ప్రణాళికని వ్యతిరేకిస్తున్నాను'' అని అబ్లాన్స్కీ కేసి కళ్ల జోడు పైనుంచి చూస్తూ అన్నాడు. ''కాని 'వాళ్లు' యీ విషయాన్ని అర్థం చేసుకోలే కుండా వున్నారు. సొంత సంక్షేమం పట్లనే వాళ్ల ఆసక్తి, యేవో పదబంధాలు కనిపెట్టడంలో తృప్తి పడుతూ వుంటారు'' అన్నాడు.

కరేనిన్ 'వాళ్లు' యేమనుకున్నదీ చేసిందీ చెప్పడం మొదలుపెట్టగానే, తన ప్రణాళి కల్ని అంగీకరించ నిష్టంలేని వాళ్ల గురించి, రష్యా చెడుగులకి కారణభూతులైన వాళ్ల గురించీ చెప్పడం మొదలుపెట్టగానే తన ఉపన్యాసం ముగింపు దశకి వస్తున్నాడని అబ్లా న్స్కీ అర్థం చేసుకున్నాడు. అంచేత యిష్టాపత్తిగా స్వతంత్రతా సిద్ధాంతాన్ని వదిలిపెట్టి, కరేనిన్‌తో యేకీభవించేడు. కరేనిన్ మాట్లాడ్డం పూర్తి చేసి సాలోచనగా రాత ప్రతి పేజీ లని అటూ యిటూ కదలేస్తూ కూర్చున్నాడు.

''అరె, ఆఁ'' అని అబ్లాన్స్కీ అన్నాడు. ''నిన్ను వొకటి అడగా లనుకున్నాను. నువ్వు పొమోర్స్కీని కలిస్తే దక్షిణ రైల్వే, బేంక్‌ల పరస్పర రుణకోశ సంయుక్త యేజన్సీ బోర్డు సభ్యుడి పదవి కాళీ వుంది. దానికి నా తరఫున వొక ముక్క ఆయనకి చెప్పాలి'' అన్నాడు.

తను యెంతగానో కోరుతూ వున్న యీ పదవి పేరు నోట్లో యెంతో నానుతూ వుండ డంవల్ల యే పొరపాటూ లేకుండా సునాయాసంగా పల్లించేశాడు.

యీ కమీషన్ కార్యకలాపాలు యేమిటని కరేనిన్ అడిగేడు. అవేమిటో విని మళ్లీ ఆలోచనలో పడ్డాడు. యీ కార్యకలాపాలు తన ప్రణాళికకి ప్రతికూలంగా వుండచ్చు కదా అని అనుకున్నాడు. కాని యీ కమీషన్ కార్యకలాపాలు చాలా జటిలంగా వుండడంతో, దాని ప్రణాళిక విస్తృత పరిధిని ఆవరించుకుని వుండడంతో వెంటనే అప్పుడే ఆ సమస్యని తేల్చుకోలేకపోయేడు. దాంతో కళ్లజోడు తీసేస్తూ అన్నాడు:

''చెప్పడానికేం తప్పకుండా చెపుతాను. కాని నీకు ఆ ఉద్యోగం యెందుకు కావాలని పించింది?''

''యెందుకంటే జీతం బాగుంది కాబట్టి. తొమ్మిది వేలు, నా పరిస్థితులు...''

''తొమ్మిది వేలా!'' అని కరేనిన్ రెట్టించేడు. ముఖం చిట్లించుకున్నాడు. కనీసం ఆ హెచ్చు జీతం దృష్ట్యా అబ్లాన్‌స్కీ తీసుకోదలుస్తున్న చర్యలు, పొదుపు చెయ్యాలని ఉద్దే శించిన తన ప్రణాళికలకి వస్తుతః విరుద్ధంగా వున్నాయని, అతనికి అనిపించింది.

''దీనికి సంబంధించి నేను వొక నోట్ ప్రస్తావించేను, యింతంత లేసి జీతాలు మన ప్రభుత్వ తప్పుడు ఆర్థిక assiette[1]కి కొట్టవచ్చినట్టు కనిపించే ఉదాహరణ'' అన్నాడు.

''అయితే నీకు యేం కావాలి?'' అని అబ్లాన్‌స్కీ తెలుసుకోగోరేడు. ''తెలుసా, బేంక్ డైరెక్టరుకి పది వేలు వస్తాయి, అందుకు అతనికా యోగ్యత వుంది. యింజనీర్‌కి యిరవై వేలు వస్తాయి. నువ్వేమన్నా చెప్పు వాళ్ల పని కులాసా పని కాదు'' అన్నాడు.

''నా దృష్టిలో జీతాలు వస్తువుకి మూల్యం. అంచేత వాటికి సప్లయి, డిమాండ్ సూత్రం వర్తించాలి. జీతాల నియమం యీ సూత్రానికి బాధకంగా వుంటే, మాటకి యిద్దరు యింజనీర్లు వొకే చోట చదువుకున్నారు, యిద్దరికీ సమానమైన పరిజ్ఞానం సామ ర్థ్యం వున్నాయి; వొకడికి నలభై వేలు యిచ్చి రెండో వాడికి రెండు వేలిచ్చి సరిపెట్టు కోమన్నారు; అలాగే వొక బేంక్ డైరెక్టరుగా ప్రత్యేక శిక్షణ యేమీ లేకుండానే వో వకీ లునో లేదా అశ్విక దళం అధికారినో పెద్ద పెద్ద జీతాలు పోసి నియమించుకున్నారు. అప్పుడు జీతాలు సప్లయి డిమాండ్‌కి తూగకుండా యెవళ్లకో సంతృప్తి కలిగించడం కోసం యిస్తు న్నట్టు నేను నిర్ధారించాల్సి వస్తుంది. యిది దానికదే మహా ఘోరం, దురుపయోగం, ప్రభుత్వ సేవలమీద కూడా దీని దుష్ప్రభావం పడుతుంది. నా అభిప్రాయం యేమంటే...''

అబ్లాన్‌స్కీ గబగబా కరేనిన్ మాటకి అడ్డం వెళ్లేడు.

'కానీ నువ్వీ విషయం వొప్పుకోకుండా వుండలేవు, వొక కొత్త, యెంతో లాభదాయకమైన సంస్థ పుడుతోంది. నువ్వేం చెప్పు, గొప్ప విషయం! అంచేతే అన్నిటికంటే ముఖ్యంగా నిజా యితీపరుల చేతుల్లో దీన్ని ఉంచాలనుకుంటున్నారు'' అని అబ్లాన్‌స్కీ నిజాయితీపరులన్న మాటని వొత్తి పలుకుతూ చెప్పేడు.

కాని కరేనిన్ 'నిజాయితీపరుల'నే మాటని మాస్కో వాళ్ల అర్థంలో గ్రహించలేదు.

''నిజాయితీ అనేది కేవలం నకారాత్మక గుణం'' అన్నాడు.

''అయినాగానీ నువ్వు నాకు గొప్ప సాయం చేస్తున్నట్టు, పొమొర్‌స్కీ చెవిలో వొక మాట వేస్తే, వూరికే మాటల సందర్భంలో, అంతే'' అన్నాడు అబ్లాన్‌స్కీ.

''కాని యిది యెక్కువ బొల్గారినొవ్ చేతిలో వుందనుకుంటా'' అన్నాడు కరేనిన్.

---

[1] విధానాల (ఫ్రెంచి).

"బొల్గారినొవ్ అందుకు వూఁ అనేశాడు" అని అబ్లాన్‌స్కీ ముఖం య్రెరబడుతూ వుండగా అన్నాడు.

బొల్గారినొవ్ పేరు వినగానే అబ్లాన్‌స్కీ య్రెరబడ్డాడు, యేమంటే ఆ ఉదయమే అతను యీాదు బొల్గారినొవ్‌ని కలుసుకుందుకు వెళ్లేడు. ఆ కలయిక అతనికి చెడ్డ చేదు జ్ఞాపకంగా మిగిలింది. అబ్లాన్‌స్కీకి తను అపేక్షిస్తున్న యీ పదవి నూతనమైంది, ఘనమైంది, నిజాయితీపరులైన వాళ్లు చేపట్టాల్సింది అనేదాంటో ఆవగింజంత అనుమానం లేదు. అయినా బొల్గారినొవ్ ఆ వేళ పొద్దున్న అతన్ని మిగతా అభ్యర్థితులతోబాటుగా రెండు గంటల సేపు వెయిటింగ్ రూమ్‌లో కూర్చో బెట్టేశాడు. కావాల్సికే అలా చేశాడు. అబ్లాన్‌స్కీకి అది చాలా కష్టం కలిగించింది.

అతనికి కష్టం యెందుకు కలిగిందో చెప్పడం మహా కష్టం. తను, రష్యన్ రాజ్య స్థాపకుడైన రూరిక్ వంశం* వాడైన ప్రిన్స్ అబ్లాన్‌స్కీ వొక యీాదు వెయిటింగ్ రూమ్‌లో రెండు గంటలు యెదురు చూస్తూ కూర్చోవలసి వచ్చినందుకా, లేదా, జీవితంలో మొదటి సారిగా రాజ్య సేవాతత్పరులైన తన తాత ముత్తాతల వొరవడిని అనుసరించకుండా కొత్త క్షేత్రంలో ప్రవేశించాలని చూస్తున్నందుకా అనేది చెప్పడం కష్టం. యేది యేమైనా అతను మహా యిబ్బంది పడిపోయేడు. కాని అతను బొల్గారినొవ్ వెయిటింగ్ రూమ్‌లో నిరీక్షిస్తూ వున్న ఆ రెండు గంటల సేపూ అటూ యిటూ పచారు చేస్తూ, మీసాలు దువ్వుకుంటూ, అక్కడున్న అభ్యర్థితులతో మాట కదలేస్తూ, తను యీ యీాదు గదిలో నిరీక్షించిడం గురించి మిత్రులకి చెప్పడానికి శ్లేషపదం వూహించుకుంటూ వున్నాడు. ప్రయాసపడి యిబ్బంది భావాన్ని పక్క వాళ్లకి తెలియకుండా తనకీ తెలియకుండా కమ్ముకున్నాడు.

అయినా అంతసేపూ యెందుకనో కారణం చెప్పలేకుండానే అతను యిబ్బంది పడ్డాడు, చిరాకు పడ్డాడు. బహుశా తను కూర్చుకున్న శ్లేషపదం బాగా లేకపోవడంవల్లనో, మరిదేని వల్లనో తెలీదు. ఆఖరికి బొల్గారినొవ్ అతన్ని అతిమర్యాదతో పిలవగానే, తనని పరాభవించినందుకు లోపల్లోపల పొంగిపోతూ వున్నాడని తేటతెల్లంగా వెల్లడైంది. అతను సాయం చెయ్యడానికి దాదాపు తిరస్కరించేడు. అప్పుడు అబ్లాన్‌స్కీ ఆ విషయాన్ని వెంటనే మర్చిపోవడానికి తొందరపడ్డాడు. అందుకనే కరేనిన్ ఆ పేరు చెప్పగానే అబ్లాన్‌స్కీ సిగ్గుతో య్రెరబడ్డాడు.

## 18

"యిప్పుడు నీతో మరో విషయం మాట్లాడాలను కుంటున్నాను. నీకు తెలుసు యేమిటైందీ. అన్నా గురించి" అని అబ్లాన్‌స్కీ కొంచెం సేపు ఆగి అన్నాడు. యీ కాస్సేపట్లో ఆ యీాదు దగ్గర నిరీక్షించిన కటువైన జ్ఞాపకాన్ని మరిచిపోయేడు.

అబ్లాన్‌స్కీ అన్నా పేరు ప్రస్తావించగానే కరేనిన్ ముఖం పూర్తిగా మారిపోయింది.

ముందున్న ఉల్లాసం బదులు అలసత్వపూరిత నిరుత్సాహం వచ్చింది.

"మీరు నన్నేం చెయ్యమంటారు?" అని కరేనిన్ చేతుల కుర్చీలో కదులుతూ, కళ్ల జోడు సవరించుకుంటూ అడిగాడు.

"నిర్ణయం, యేదో నిర్ణయం, కరేనిన్. యిప్పుడు నీతో యీ విషయం" ('అవమాని తుడైన పతిగా కాకుండా' అని అబ్లాన్స్కీ అనబోయేడు, కాని వెంటనే తన లక్ష్యం గంగలో కలుస్తుందని గ్రహించి నాలిక కరుచుకుని మార్చేశాడు) "ఒక ప్రముఖ వ్యక్తిగా కాకుండా" (యిదీ అంత బాగా తగులడలేదు) "ఒక మనిషిగా, దయాపూర్ణుడైన మనిషిగా, క్రైస్త వుడివిగా చెప్పాలనుకుంటున్నాను. నువ్వు ఆమె పట్ల జాలి చూపించాలి" అన్నాడు.

"మీ ఉద్దేశ్యం యేమిటో మరి" అని కరేనిన్ మెల్లిగా అన్నాడు.

"ఆఁ, ఆమెపట్ల జాలి చూపించాలి. నువ్వు ఆమెని నా తరఫునుంచి చూస్తే, —యీ శీతకట్టు అంతా ఆమెతో గడిపేను నేను, — నీకు అయ్యో పాపం అనిపిస్తుంది. ఆమె పరిస్థితి దారుణంగా వుంది, అవును దారుణంగా వుంది" అన్నాడు.

"నాకు అనిపించింది, స్వయంగా తను కోరుకున్నవన్నీ ఆమెకి ప్రాప్తించేయి అని" అన్నాడు కరేనిన్, అతని గొంతుక దాదాపు కీచుమంది.

"అయ్యో! కరేనిన్! పుణ్యం వుంటుంది, ఆ దెప్పళ్లు వద్దు. ఆ మంచి చెడ్డల జోలికి మనం వెళ్లద్దు. జరిగిందేదో జరిగింది. యిప్పుడామె యేం కోరుతోందో, దేని కోసం యెదురు చూస్తోందో నీకు తెలుసు — ఆమె విడాకులు కోరుతోంది."

"కాని నా ఉద్దేశం ప్రకారం నేను పిల్లవాణ్ణి నా దగ్గరే వుంచుకుంటానని పట్టు బడితే ఆవిడ విడాకులు అఖ్ఖర్లేదంటుంది. ఆ ఉద్దేశంతోనే నేను జవాబు యిచ్చేను, ఆ వ్యవ హారం అంతటితో ముగిసిపోయిందనుకున్నాను. ముగిసిపోయినట్టే నేను భావిస్తూ వున్నాను" అని కరేనిన్ కీచుమంటూ చెప్పాడు.

"బాబ్బాబు, కోప్పడద్దు" అని అబ్లాన్స్కీ బావగారి మోకాలిమీద చెయ్యి వేస్తూ అన్నాడు. "వ్యవహారం ముగిసిపోలేదు. నన్ను విషయం యావత్తూ చెప్పనియ్యి, మళ్లీ పరి స్థితి యిలా వుంది: మీరిద్దరూ విడిపోయినప్పుడు నువ్వు యెంతో మహత్వాన్నీ ఔదార్యాన్నీ చూపించేవు. ఆమెకి సర్వమూ యిచ్చేవు — స్వేచ్ఛనీ, విడాకుల్నీ కూడా. ఆమె కూడా దాన్ని ఘనంగా భావించింది. నిజం చెపుతున్నాను, నువ్వు నమ్మవు, నా మనసులో మాట. ఆమె చాలా ఘనంగా భావించింది. మొదట్లో తను నీకు చేసిన ద్రోహం తెలిసి ఆ హద్దుదాకా ఆమె యేమీ ఆలోచనా పాలోచనా చెయ్యలేకపోయింది. అన్నిట్నీ కాదంది. కాని జీవిత యదార్థ పరిస్థితి, కాలం ఆమెకి తన స్థితిని తెలియచేశాయి. అది మహా యాతనగా దుర్భరంగా వుంది" అన్నాడు.

"ఆవిడ జీవితం గురించి నాకు యే రకమైన ఆసక్తీ లేదు" అని కరేనిన్ కనుబొమలు పైకి యెత్తి అన్నాడు.

"మరేం అనుకోవద్దు, యీ ముక్క అంటున్నందుకు, నేనా విషయాన్ని ఒప్పుకుం

దుకు తయారుగా లేను'' అని అబ్లొన్‌స్కీ మర్యాదగానే అభ్యంతరం చెప్పేడు. ''ఆమె పరిస్థితి ఆమెకి బాధాకరంగా వుంది, దానివల్ల యితరులకి లాభమూ లేదు. ఆమెకి అదే లాయకీగా వుందని నువ్వు అంటున్నావు. అది ఆమెకి తెలుసు, అందుకని నిన్ను యేమీ అడగదు. ఆమె దాచుకోకుండా పైకే చెప్తోంది నిన్ను యేదీ అడిగే ధైర్యం లేదని. కాని నేనూ, మిగతా బంధువులం, ఆమె అంటే అభిమానం వున్న వాళ్లందరం నిన్నీ విషయం గురించి అడుగుతున్నాం, అర్థిస్తున్నాం. ఆమె యెందు కంతలా యాతన పడాలి? దీనివల్ల యెవళ్లకి లాభం?''

''చూడండి, నా దోషం యేదో వున్నట్టు మీరు భావిస్తున్నారు'' అన్నాడు కరేనిన్.

''అబ్బెబ్బె, లేదు, లేదు. కాని నా ఉద్దేశం అర్థం చేసుకో'' అని మళ్లీ అబ్లొన్‌స్కీ కరేనిన్‌ని చేత్తో తాకుతూ అన్నాడు, అలా తాకడంద్వారా అతన్ని సానునయ పరచగలిగినట్టు. ''నేను వొక్కటే చెపుతున్నాను. ఆమె పరిస్థితి దారుణంగా వుంది. నీకు యే రకమైన హానీ లేకుండా ఆమె పరిస్థితిని మెరుగు పరచగలవాడివి నువ్వే. నేను విషయం యావత్తూ నడిపిస్తాను, నీకు పిసరు యిబ్బంది కూడా లేకుండా. నువ్వే యింతకీ వాగ్దానం చేశావు కదా?'' అన్నాడు అబ్లొన్‌స్కీ.

''లోగడ వాగ్దానం చేశాను. నా పిల్లవాడి సంరక్షణ బాధ్యత పరిష్కారమైనాక సమస్య వుండదని నా అభిప్రాయం. అదీ కాకుండా ఆవిడ ఉదారత్వం చూపిస్తుందని నేను ఆశించి...'' అంటూ కరేనిన్ పాలిపోయేడు, వణికే పెదాలతో మాటల్ని సరిగ్గా అనలేకపోయేడు.

''ఆమె నీ ఔదార్యంమీద ఆధారపడింది. ఆమె వొక్క విషయాన్ని మాత్రమే అర్థిస్తోంది, ప్రార్థిస్తోంది. యిప్పుడు తను వున్న దుర్భర పరిస్థితినుంచి బయట పడెయ్యమని వేడుకుంటోంది. ఆమె కొడుకు నిమ్మని కూడా అడగడం లేదిప్పుడు. కరేనిన్, నువ్వు దయార్ద్ర హృదయుడివి. ఓ క్షణం సేపు నువ్వే ఆమె అయినట్టు వూహించుకో. ఆమె వున్న పరిస్థితిలో ఆమెకి విడాకులు జీవన్మరణ సమస్య. యిదివరలో నువ్వామెకి మాట యిచ్చి వుండకపోయినట్లయితే ఆమె తన రాత యింతేనని సమాధాన పడిపోయి, పల్లెలోనే వుండిపోయేది. కాని నువ్వు మాట యిచ్చేవు. ఆమె నీకు రాసింది, మాస్కో వచ్చింది. మరి మాస్కోలో, ప్రతి భేటీ గుండెకి కశాఘాతంలా తగిలే చోట నీ నిర్ణయం కోసం ప్రతి రోజూ చూస్తూ ఆమె ఆర్నెల్లుగా బతుకుతోంది. యిది మరణ శిక్ష విధించిన వాణ్ణి మెడకి ఉరితాడు బిగించి కొంచెం సేపు ఉరి తీస్తామనీ, కొంచెం సేపు క్షమిస్తామనీ చెపుతూ నెలల తరబడి వుంచడం లాంటిది. ఆమెమీద దయ తలచు, పైగా నేను అంతా యేర్పాటు చేసే పూచీ మీద వేసుకుంటాను... Vos scrupules...[1]''

''నేనా... నేనా విషయం గురించి మాట్లాడ్డం లేదు'' అని కరేనిన్ కీచు గొంతు

[1] నీ సున్నిత భావన... (ఫ్రెంచి).

కతో అడ్డం వచ్చేడు. "కాని వాగ్దానం చేసే అధికారం నాకు లేదు, నాకు లేని దాన్ని నేను వాగ్దానం చేసి వుండవచ్చు" అన్నాడు.

"అయితే ఆడిన మాటని తప్పుతున్నావా?"

"సాధ్యం అని నేననుకున్న దాన్ని యెన్నడూ కాదని నేనసను. కాని యీ వాగ్దానాన్ని నెరవేర్చడం సాధ్యమా కాదా అని ఆలోచించుకునే వ్యవధి నాకు కావాలి."

"అయ్యో! అలా అనకు కరేనిన్" అని అబ్లాన్‌స్కీ వొక్క ఉదుటున లేస్తూ అన్నాడు. "నేనా మాటని నమ్మదలచుకోలేదు. యే ఆడదీ ఆమె అంత దౌర్భాగ్య స్థితిలో లేదు, అయినా నువ్వు కాదంటున్నావు ఆమెకి..."

"యిచ్చిన మాటని యే మేరకి పరిపూర్తి చేయడం సాధ్యమా అని. Vous professez d'être un libre penseur.[1] కాని నేను ఆస్తికుణ్ణి. క్రైస్తవ ధర్మాన్ని అతిక్రమించే పనిని దేన్నీ చెయ్యలేను, ముఖ్యంగా యిలాంటి వ్యవహారంలో" అన్నాడు.

"నాకు తెలిసిన మేరకి క్రైస్తవ మతానుయాయులు అన్ని చోట్లా, యిక్కడ కూడా, విడాకులు అనుమతిస్తున్నారు" అన్నాడు అబ్లాన్‌స్కీ. "మన చర్చి విడాకుల్ని వొప్పుకుంది. మనకి కనిపిస్తోంది కదా..."

"అనుమతిస్తున్నారు. కాని ఆ అర్థంలో కాదు."

"కరేనిన్, నేను నిన్ను అర్థం చేసుకోలేకుండా వున్నాను" అని కొంచెం సేపు ఆగేక అబ్లాన్‌స్కీ అన్నాడు. "అన్నిట్నీ క్షమించింది నువ్వు కాదూ? (మేం దాన్ని యెంతో ఘనమైన ఉదార చర్యగా భావించలేదూ?) క్రైస్తవ ధర్మ బోధ అనుసారంగా అన్నిటినీ త్యాగం చెయ్యడానికి సిద్ధ పడింది నువ్వు కాదూ? 'యెవరైనను నీ ఉత్తరీయము తీసుకున్నచో నీ అంగీ కూడ యిమ్ము' అని చెప్పింది నువ్వు కాదూ, మరి యిప్పుడు..."

"నేను వేడుకుంటున్నాను" అని కరేనిన్, ముఖం పాలిపోయి దవడ కంపిస్తూ వుండగా, ఠక్కుని లేచి నుంచుంటూ కీచుగా అరిచేడు. "మిమ్మల్ని వేడుకుంటున్నాను... యీ మాటలు కట్టి పెట్టండి, కట్టి పెట్టండి."

"అబ్బా! లేదు... సరే, సరే, నీ మనసుకి కష్టం కలిగిస్తే క్షమించు, క్షమించు" అని అతనికేసి చేతిని చాస్తూ వ్యాకులంగా తెచ్చి పెట్టుకున్న చిరునవ్వు నవ్వుతూ అన్నాడు అబ్లాన్‌స్కీ. "యింతా చేసి నేను వచ్చింది రాయబారానికి. నన్ను చెప్పమన్న మాటలు చెప్పి నా పని పూర్తి చేశాను" అన్నాడు.

కరేనిన్ అతనికి చెయ్యి అందించి, వో నిముషం ఆలోచించేడు.

"నేనీ విషయం గురించి ఆలోచించి, సలహాలు తీసుకోవాలి. రేపుగాక యెల్లుండి మీకు యే విషయమూ తేల్చి చెపుతాను" అని యెదో హఠాత్తుగా గుర్తువచ్చినట్టు అన్నాడు.

---

[1] నువ్వు ఉదార మనస్కుడివని అంటారు (ఫ్రెంచి).

# 19

అబ్లాన్‌స్కీ వెళ్ళిపోవడానికి తయారవుతూ వుండగా నౌకరు కర్నేయ్ సెర్గేయ్ అలెక్సే యిచ్ వచ్చేడని చెప్పేడు.

యీ సెర్గేయ్ అలెక్సేయిచ్ యెవరు అని అబ్లాన్‌స్కీ అడగబోయేడు, అంతట్లోకీ అతనికి గుర్తు వచ్చింది.

''ఆఁ, సెర్యోష!'' అన్నాడు. ''సెర్గేయ్ అలెక్సేయిచ్ అంటే యెవరో డిపార్టుమెంట్ డైరెక్టరేనా కనీసం అయివుంటాడనుకున్నాను.'' తన కొడుకుని చూసిరమ్మని అన్నా చెప్పిన సంగతి అతనికి గుర్తు వచ్చింది.

అబ్లాన్‌స్కీని వెళ్లిరమ్మని చెప్పేటప్పుడు అన్నా బేలగా, బెంగగా ముఖం పెట్టి చెప్పింది — ''వాడు నీకు కనిపిస్తాడులే. వాడు యెక్కడ వుంటున్నాడో, యెవరు వాడి ఆలనా పాలనా చూస్తున్నారో కనుక్కో. అబ్బ తమ్ముడూ... అది గనక సాధ్యమైతేనా! సాధ్యమవు తుందంటావా?'' అంది. 'అది గనక సాధ్యమైతేనా' అనేది యేదో అబ్లాన్‌స్కీకి అర్థమైంది. సాధ్యమైతే గనక విడాకుల్నీ కొడుకు తనకి దక్కేటట్టు యేర్పాటు చెయ్యాలి... అలాంటి ఆలోచన చెయ్యడానికి కూడా యిప్పుడవకాశం లేదని అబ్లాన్‌స్కీకి కనిపిస్తూ వుంది. కానీ మేనల్లుణ్ణి చూసినందుకు సంతోషించేడు.

కుర్రాడి ముందు యెవరూ తల్లి గురించిన ప్రస్తావన చెయ్యరనీ, అంచేత వాడికి తల్లిని గుర్తుకు తెచ్చే మాట వొక్కటి కూడా అనద్దనీ కరేనిన్ బావమరిదికి గుర్తు చేశాడు.

''తల్లిని అప్పుడు చూశాక వాడు చాలా జబ్బు పడ్డాడు. వాడు తల్లిని చూస్తాడని అలా ముందు మేం వూహించలేదు'' అని కరేనిన్ చెప్పేడు. ''బతుకుతాడా లేదా అని భయ పడ్డాం. మంచి వైద్యంవల్లా వేసవికాలంలో సముద్ర స్నానాలవల్లా గండం గడిచేం. యిప్పుడు డాక్టరు సలహామీద బళ్లో వేశాం. తోటి వయసు వాళ్లతో కలిసి మెలిసి తిరగడంతో గుణం కనిపించింది. యిప్పుడు వాడు ఆరోగ్యంగా వున్నాడు, చదువులో కూడా బాగా వున్నాడు'' అన్నాడు కరేనిన్.

''అరె, వాహ్, యెంత మెరికలాంటి వాడు! సెర్యోష గాడు కాదింక, సెర్గేయ్ అలె క్సేయిచ్!'' అని అబ్లాన్‌స్కీ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. వెడల్పాటి భుజాల అందమైన కుర్రాడొకడు నీలం చొక్కా, పొడుగు లాగు తొడుక్కుని చురుగ్గా, యే నదురూ బెదురూ లేకుండా లోపలికి వస్తూనే వాణ్ణి చూసి అబ్లాన్‌స్కీ అలా అన్నాడు. ఆ కుర్రాడు ఆరోగ్యంగా, సంతోషంగా కనిపించేడు. యేదో పరాయి వాడికి మాదిరిగా మేనమామకి వొంగి వందనం చేశాడు. కాని అతన్ని గుర్తు పట్టగానే సిగ్గుతో యెర్రబడి, వెంటనే ముఖం అవతలి వేపు తిప్పేసుకున్నాడు, యేదో కారణంగా తనకి కష్టమూ కోపమూ కలిగినట్టు. తండ్రి దగ్గరికి వెళ్లి బళ్లో యిచ్చిన మార్కుల పత్రం అందించేడు.

"బాగుంది. నువ్వు వెళ్లచ్చు" అన్నాడు కరేనిన్.

"పొడుగు యెదిగేడు, నన్నబడ్డాడు. పెద్ద వాడయాడు. చిన్న పిల్లవాడు కాదింక. నాకు తృప్తిగా వుంది" అన్నాడు అబ్లాన్స్కీ. "యేరా, నే గుర్తున్నానా?" అని అడిగేడు.

కుర్రాడు వెంటనే తండ్రి వేపు చూశేడు.

"గుర్తు లేకేం, mon oncle[1] అని మేనమామకేసి చూసి, కళ్లు దించుకుంటూ అన్నాడు.

మేనమామ అతన్ని దగ్గరికి రమ్మని పిలిచి చెయ్యి అందుకున్నాడు.

"వూఁ, యేమిటి సంగతులు?" అని అడిగేడు. కుర్రాడితో మాట్లాడాలని వుంది అతనికి, కాని యేం మాట్లాడాలో తెలీలేదు.

కుర్రవాడు సిగ్గుపడ్డాడు. జవాబు చెప్పలేదు, మెల్లిగా చేతిని వెనక్కి లాక్కున్నాడు. అబ్లాన్స్కీ అతని చేతిని వదలగానే తండ్రికేసి యేమిటన్నట్టు చూసి, తర్వాత గబగబా పంజరంలోనుంచి వదిలి పెట్టిన పిట్టలాగా గదిలోనుంచి వెళ్లిపోయేడు.

సెర్యోష తల్లిని చూసి యేడాది అయింది. అప్పట్నుంచి ఆమె గురించి వొక్క ముక్క కూడా వినలేదు. యీ యేడాదే అతన్ని బళ్లో వేశారు. తోటి పిల్లలతో పరిచయాలు యేర్పడి చేరిక అయింది. తల్లిని ఆఖరి సారి కలుసుకున్న తర్వాత ఆ స్వప్నాలవల్లా, స్మృతులవల్లా అతనికి జబ్బు చేసింది. యిప్పుడా కలలూ, జ్ఞాపకాలూ అతన్ని చింత పెట్టడం లేదు. అవి గుర్తుకు వస్తే అతను సిగ్గు పడిపోయి అలాంటిది మగపిల్లలకి తగినది కాదనీ, ఆడపిల్లలకే తగినదనీ అనుకుంటూ వాటిని మనసులోనుంచి దూరం తరిమెయ్యడానికి యావచ్ఛక్తితో ప్రయత్నం చేసేవాడు. తండ్రికీ తల్లికీ మధ్య దెబ్బలాట జరిగిందనీ, అందువల్ల వాళ్లు విడిపోయేరనీ అతనికి తెలుసు. తను తండ్రిలోనే వుండిపోవాలనీ అతనికి తెలుసు. అంచేత యీ పరిస్థితికి సమాధాన పడిపోవడం కోసం శక్తి మేరకి ప్రయత్నించేడు.

ముఖ కవళికల్లో తల్లి పోలికలు గుర్తుకు తెచ్చే మేనమామని చూడడం అతనికి యిష్టం లేకపోయింది. యేమంటే దానినుంచి తను లజ్జాజనకంగా భావించే స్మృతులు పైకి ఉబికి వచ్చేయి. తను గది లోపలికి వెడుతూ గుమ్మం దగ్గర నుంచున్నప్పుడు చెవిన పడిన మాటల వల్లా, అలానే లోపలికి వెళ్లేక తండ్రికీ మేనమామకీ తల్లి గురించి చర్చ జరిగిందని వాళ్ల ముఖాలని చూసి గ్రహించడంవల్లా అతనికి మరీ ముఖ్యంగా అయిష్టం కలిగింది. తను తండ్రితో వుంటున్నాడు, ఆయనమీద ఆధారపడ్డాడు అంచేత ఆయన్ని తప్పు పట్టలేడు. ఆ కారణంవల్లా, ముఖ్యంగా తనకి లజ్జాకారకంగా కనిపించిన అనుభూతులకి లొంగిపో కూడదని అనుకోవడంవల్లా అతను మామకేసి, తన మనశ్శాంతిని భగ్నం చేయవచ్చిన ఆ

---

[1] మా మేనమామ (ఫ్రెంచి).

వ్యక్తికేసి చూడకుండా వుండ ప్రయత్నించేడు. మేనమామ కలకబరిచే స్మృతుల్ని రేగకుండా వుంచుకోవాలనుకున్నాడు.

అయినా అబ్లాన్‌స్కీ అతని వెనక్కాలే యివతలికి వచ్చేడు. అతన్ని మెట్లమీద చూసి తన దగ్గరికి రమ్మని పిలిచేడు. బళ్లో కాళీ సమయంలో యెలా కాలక్షేపం చేస్తారని అడిగేడు. అప్పుడు, తండ్రి సముఖంలో వున్నప్పటిలా కాక, మేనమామతో మాట్లాడ్డం అతనికి అయిష్టం అనిపించలేదు.

"యీ మధ్య కాలంలో మేం రైలు బండి ఆట ఆడుకుంటున్నాం. యెలా ఆడతామంటే యిద్దరు పిల్లలు బల్లమీద కూర్చుంటారు. వాళ్లు ప్రయాణీకులు అన్నమాట. వొకడు బల్లమీద నుంచుంటాడు. మిగతా అందరూ ఆ బల్లని లాగుతారు. చేతో పట్టుకునీ లాగచ్చు, నడుముకి కట్టుకునీ లాగచ్చు. అలా అన్ని గదుల్లోనుంచీ లాక్కెడతాం. ముందుగా గదుల తలుపులు తెరిచేస్తాం. యీ ఆటలో కండక్టరు పని వుంటుంది బాబూ, భలే కష్టం. ఆఁ" అని చెప్పాడు.

"అంటే ఆ నుంచున్న వాడే గదా కండక్టరు అంటే?" అని అబ్లాన్‌స్కీ చిరునవ్వు నవ్వుతూ అడిగేడు.

"వూఁ, వాడే. వాడికి గుండె ధైర్యం, చురుకు వుండాలి తెలుసా. ముఖ్యంగా బండిని హఠాత్తుగా యెవరన్నా ఆపినప్పుడు, లేపోతే యెవరేనా పడి పోయినప్పుడు."

"అవునవును, యిది నవ్వులాట పనేం కాదు" అని అబ్లాన్‌స్కీ విచారంగా సెర్యోష కళ్లని చూస్తూ అన్నాడు. ఆ కళ్లు వాడి తల్లి కళ్లలాగానే వున్నాయి. జీవంతో తొణికిస లాడుతున్నాయి. అవి పిల్లల మాదిరిగా, కల్లా కపటం యెరగని కళ్లు కాదు యిప్పుడు. కుర్రవాడి దగ్గర అన్నా పేరు ప్రస్తావించనని కరేనిన్‌తో చెప్పినప్పటికీ యిప్పుడు ప్రస్తావించ కుండా వుండలేకపోయేడు అబ్లాన్‌స్కీ.

"యేరా, నీకు మీ అమ్మ గుర్తుందిరా?" అని అడిగేడు.

"వుహుఁ, గుర్తు లేదు" అని సెర్యోష టక్కున జవాబు చెప్పేడు. వెంటనే అతని ముఖం యెర్రబడింది. కళ్లు కిందకి వాల్చేడు. తర్వాత మేనమామ అతన్నుంచి వొక్క ముక్క కూడా రాబట్టలేకపోయేడు.

అరగంట తర్వాత స్లావ్ భాష ట్యూటర్ వచ్చి తన శిష్యుడు మెట్లమీద కూర్చుని వుండడం చూశేడు. తన శిష్యుడు కోపంగా వున్నాడా యేడుస్తూ వున్నాడా అనేది చాలా సేపటి దాకా ఆ ట్యూటర్‌కి అర్థం కాలేదు.

"మీరు కింద పడి దెబ్బ తగిలించుకున్నట్టుగా వుంది" అన్నాడు ట్యూటరు. "నే చెప్పాను మంచి ఆట కాదని. బళ్లో హెడ్మాస్టరుకి చెప్పాల్సి వస్తుంది" అన్నాడు.

"దెబ్బ తగిలి వుంటే యెవళ్లకీ పిసరు ఆచూకీ తెలీదు. ఆ సంగతి తెలుసుకోండి."

"అయితే యేమిటి సంగతి మరి?"

"నన్ను విసిగించకండి. గుర్తుందిరా! లేదా?... అతనికేం పని? గుర్తుంచుకునే అవసరం నాకేం వుంది? నన్ను విసిగించకండి" అని అతను ట్యూటర్‌కి గాక సకల ప్రపంచానికే చెపుతూ వున్నట్టు అన్నాడు.

## 20

అబ్లాన్‌స్కీ యెప్పటిలాగానే పీటర్స్‌బుర్గ్‌లో వ్యర్థంగా పొద్దు పుచ్చలేదు. అక్కగారి విడాకుల విషయం చూడడం, తన ఉద్యోగం ప్రయత్నాలు చూడడం మాత్రమే కాకుండా అతను పీటర్స్‌బుర్గ్‌లో యెప్పటిలాగా, అతనన్నట్టు మాస్కో ఉక్కని తగ్గించుకుని ఉల్లాస భరితం చేసుకోవాల్సివచ్చింది.

Cafés chantants,[1] బస్సులు వున్నప్పటికీ మాస్కో నిలవనీటి కుంటలా వుంటుంది. అబ్లాన్‌స్కీకి యెప్పుడూ అలానే అనిపించేది. మాస్కోలో ముఖ్యంగా కుటుంబం దగ్గర అతనికి ఉత్సాహం చలాకీతనం జావగారి పోయినట్టు వుండేది. వేరే చోటికి యెక్కడికీ మధ్యలో మకాం వెయ్యకుండా మాస్కోలోనే చాలా కాలం వుంటే, భార్య రుసరుసలు, దెప్పుళ్ళు, పిల్లల ఆరోగ్యం, పెంపకం, ఆఫీసులో వుండే చిన్నా చితకా గొడవలు, అప్పులు కూడా చిరాకెత్తించేస్తాయి. పీటర్స్‌బుర్గ్ వెళ్ళి తను యెప్పుడూ కలిసి మెలిసి వుండే వాళ్ళతో, మాస్కోలో మాదిరీ యేదో బతుకు వెళ్ళ బార్చేవాళ్ళు కాక అసలు సిసలుగా జీవించేవాళ్ళతో, చేరగానే అతని చీకూచింతా అన్నీ వేడికి మంచు కరిగినట్టుగా కరిగిపోతాయి.

పెళ్ళాం?... ఆ రోజే అతను ప్రిన్స్ చెచేన్‌స్కీతో మాట్లాడేడు. ప్రిన్స్ చెచేన్‌స్కీకి పెళ్ళాం బిడ్డలు వున్నారు. ఎదిగిన పిల్లలు, సైనిక స్కూళ్ళో చదువుకునే వాళ్ళున్నారు. అతనికి వేరే యింకో కాపరం కూడా వుంది. అక్కడా పిల్లలు వున్నారు. మొదటి కాపరం దివ్యంగా వున్నప్పటికీ చెచేన్‌స్కీ రెండో కాపరంలో యెక్కువ ఆనందంగా వున్నాడు. అతను పెద్ద కొడుకుని తన రెండో కాపరం దగ్గరికి తీసుకెళ్ళేడు. అలా చెయ్యడం ఆ కుర్రాడికి మంచిదనీ, వాడి దృష్టి విశాలమవుతుందనీ అబ్లాన్‌స్కీకి చెప్పేడు. కాని యిలా చేస్తే మాస్కోలో వొప్పుతారా?

పిల్లలు? పీటర్స్‌బుర్గ్‌లో పిల్లలు తల్లిదండ్రుల్ని బాధించరు. పిల్లలకి బళ్ళో చదువూ సంధ్యా వుంటాయి. మాస్కోలో మాదిరీ దురంతమైన వూహలు యిక్కడ లేవు. పిల్లలు జీవితం సుఖంగా గడపాలనీ, తల్లిదండ్రులు చాకీరీ చేస్తూ చింత పడాలనీ ల్వోవ్‌లాగా యెవళ్ళూ యిక్కడ అనుకోరు. యిక్కడ యెవడి బతుకు వాడు బతకాలనీ మంచి సంస్కారులైన వాళ్ళలాగా బతకాలనీ అభిప్రాయ పడతారు.

ప్రభుత్వ కొలువు? యిక్కడ కొలువు కూడా మాస్కోలో మాదిరీ యెప్పుడూ మెడ

---

[1] వినోద ప్రదర్శనలు వుండే కేఫ్ (ఫ్రెంచి).

మీద భారంగా, నిరాశాపూరితంగా తొక్కే బండి కాడి కాదు. యిక్కడ దానికి కొంత మజా వుంది. ఆ రకం మనుషులతో కలయికలు, యెవళ్లకేనా అనుగ్రహం చూపించినట్టు పనులు చేసి పెట్టడం, సరిగ్గా గురి చూసి వదిలిన పదబంధాలు, పరిహాసంగా కబుర్లు చెప్పేటప్పుడు వొక రకమైన అనుకరణ, నేర్పరితనం — అన్నిట్నీ మించి, చూస్తూ చూస్తూ వుండగానే యిక్కడి మనిషి యెక్కడికో యెగబాకి పోవడం వున్నాయి. ఆ బ్రియాన్త్సేవ్‌కి యేం జరిగిందో చూస్తే చాలు. ఓ రోజు ముందే అబ్లాన్స్కీ అతన్ని కలుసుకున్నాడు. యివాళ అతను పైన యెక్కడ్నో పెద్ద హోదాలో వున్నాడు. అలాంటి కొలువు అయితే మజాగా వుంటుంది.

అన్నిట్నీ మించి అబ్లాన్స్కీకి హాయి అనిపించేది డబ్బు విషయంలో పీటర్స్‌బుర్గ్ వాళ్ల దృష్టి. తన train[1]కి తగ్గట్టుగా సాలుకి పచ్చు యాభై వేలు ఖర్చు పెట్టే బర్త్‌న్యాన్‌స్కీ అంతకు ముందు రోజు అక్షర లక్షలు చేసే మాటలు చెప్పేడు.

సాయంత్రం భోజనాల ముందు మాటల సందర్భంలో అబ్లాన్స్కీ అతనితో అన్నాడు.

"నేననుకోవడం నీకూ మొర్ద్‌వీన్‌స్కీకి మంచి దోస్తీ వుందని. నా తరఫున ఆయనతో రెండు ముక్కలు చెపితే బాగుంటుంది. నాకు చాలా సాయం చేసినట్టవుతుంది. వో ఉద్యోగం వుంది. దాని కోసం ప్రయత్నం చేస్తున్నాను. బోర్డు సభ్యత్వ..."

"ఆఁ వద్దులే నువ్వు చెప్పినా నాకు గుర్తుండి చావదు. అయినా రైల్వేలతో, యూదులతో వ్యవహారాలు చేసి సాధించేదేమిటి?... రోత అంటాను నన్నడిగితే" అన్నాడతను.

అది ఘనమైన పదవి అని అబ్లాన్స్కీ అతనికి చెప్పలేదు. చెప్పినా బర్త్‌న్యాన్‌స్కీకి అర్థం అవదు.

"సొమ్ము కావాలి, బతకాలి కదా."

"అయినా బతుకుతూనే వున్నావు కదా."

"అప్పులు చేసి."

"అలాగా. చాలా అప్పుల్లో వున్నావా?" అని బర్త్‌న్యాన్‌స్కీ సానుభూతి చూపిస్తూ అడిగేడు.

"కాస్తాకూస్తావా! వో యిరవై వేలుంటాయి."

బర్త్‌న్యాన్‌స్కీ వొక్క పెట్టున నవ్వేడు.

"అంతేనా! భలే వాడివే! మనకయితే పదిహేను లక్షలదాకా వుంటాయి. వెనకాల కోపెక్కు లేదు, అయినా చూస్తున్నావు కాదా, బతికేస్తున్నాం" అన్నాడు.

వొట్టినే మాటల్లోనే గాక యదార్థానికి జీవితంలో కూడా యీ సంగతి అబ్లాన్స్కీకి కనిపిస్తూనే వుంది. జివాహోవ్‌కి మూడు లక్షలదాకా అప్పులు వున్నాయి, తనదంటూ యేగాణీ ఆస్తి లేదు, అయినా బతుకుతూనే వున్నాడు, అందులోనూ దర్జాగా కూడా. యిక కౌంట్

---

[1] జీవిత విధానం (ఫ్రెంచి).

క్రివ్‌త్సోవ్ వున్నాడు, లోకుల దృష్టిలో యెప్పుడనగానో కుదేలు అయిపోయేడు, అయినా యిద్దరు ప్రియురాళ్లని చేరదీశాడు. పెత్రోవ్‌స్కీ యాభై లక్షలదాకా కూరుకుపోయేడు కాని ముందటి పద్ధతి మారలేదు, ఆర్థిక శాఖలో పెద్ద హోదాలో వున్నాడు, సాలుకి యిరవై వేలు జీతం తీసుకుంటున్నాడు. వీటికి తోడు శారీరక దృష్టి కోణంనుంచి కూడా పీటర్స్ బుర్గ్ అబ్లాన్‌స్కీమీద మంచి ప్రభావం కలిగిస్తుంది. అక్కడ అతనికి పడుచు వాడైనట్టు అనిపిస్తుంది. మాస్కోలో అప్పుడప్పుడు నెరుస్తూ వున్న వెంట్రుకలకేసి దృష్టి మళ్లుతుంది, రాత్రి భోజనాలయాక నిద్ర ముంచుకొస్తుంది, కాళ్లూ చేతులూ చాచుకుంటూ వుంటాడు, మెట్లు యెక్కేటప్పుడు వొగుర్పు వస్తుంది, మెల్లిగా యెక్కుతాడు, పడుచు అమ్మాయిల దగ్గర యేదో నిరాసక్తత వుంటోంది, బాల్ డాన్సుల్లో నాట్యం చెయ్యడం లేదు. కాని పీటర్స్ బుర్గ్‌లో అయితే వయస్సు పదేళ్లు తగ్గినట్టు అయిపోతుంది.

అంతకు ముందు రోజు అతని పెత్తండ్రి కొడుకు, అరవై యేళ్ల ప్రిన్స్ ప్యోత్ర్, చెప్పి నట్టు వుంటుంది పీటర్స్‌బుర్గ్‌లో అతనికి. ఆ ప్రిన్స్ యీ మధ్యే విదేశాలు తిరిగి వచ్చేడు.

"ఒరె, అబ్బాయ్, యిక్కడ మనకి యెలా బతకాలో తెలీదురా! చెపితే నమ్మవు — యీ వేసవికాలం బాడెన్‌లో గడిపేను. బాప్‌రే! కుర్రాణ్ణి అయిపోయినట్టు అనిపించిందనుకో నాకు. నదురైన పడుచు పిల్ల కనిపిస్తే చాలు నా బుర్ర తిరిగిపోయేదనుకో... ఎహ్... సుష్టుగా తినడం, మందు కొట్టడం, నరాలకి పట్టు వస్తుంది. మనసుకి హాయిగా వుంటుంది. రష్యాకి తిరిగివచ్చేను, మాస్కో! పెళ్లాం దగ్గరికి వెళ్లేను, అంతా పల్లెలో వున్నారు. నువ్వు నమ్మవు, రెండు వారాలు తిరిగాయో లేదో నా డ్రెస్సింగ్ గౌనూ నేనూ తయారు. భోజనాలకి బట్టలు మార్చుకోవడం కూడా పోయింది. పడుచు పిల్లల గురించిన ఆలోచన లెక్కడ్నుంచి వస్తాయ్? నాకే ముసలాణ్ణాయి పోయినట్టు అనిపిస్తూ వుంటే? యేమీ మిగల్లేదు, పాప ప్రాయ శ్చిత్తం గురించీ, మోక్షం గురించీ ఆలోచనలు తప్ప. అప్పుడు పారిస్ వెళ్లేను — మళ్లీ కాయ కల్ప చికిత్స జరిగినట్టయింది నాకు" అని ప్రిన్స్ ప్యోత్ర్ చెప్పేడు.

అచ్చం పెత్తండ్రి కొడుక్కి అనిపించినట్టే అబ్లాన్‌స్కీకీ అనిపించింది. మాస్కోలో అతనికి యెలా అనిపించేదంటే, యెక్కడికీ వెళ్లకుండా యేకటాకీన అక్కణ్ణే యెక్కువ రోజులు వుండినట్లయితే పాప ప్రాయశ్చిత్తాలు, ఆత్మ మోక్షం దశకి చేరేస్తాడు. కాని పీటర్స్‌బుర్గ్ పొలిమేరకి వచ్చేడో మళ్లీ ఫక్తు మనిషి అయిపోయినట్టనిపిస్తుంది అతనికి.

ప్రిన్సెస్ బెట్సీ త్వెర్‌స్కాయాకీ, అబ్లాన్‌స్కీకీ మధ్య యెంతో కాలంగా, వొక ప్రత్యేక రకమైన సంబంధాలు సాగుతూ వున్నాయి. అబ్లాన్‌స్కీ పరాచికంగా ఆమెపట్ల వ్యామోహం వెల్లడించేవాడు. అంతే పరాచికంగా అసభ్యంగా కనిపించే వ్యాఖ్యలు చేసేవాడు, యేసుంటే ఆమెకి అవి పసందుగా వుంటాయని అతనికి తెలుసు. కరేనిన్‌ని కలుసుకున్న మర్నాడు అబ్లాన్‌స్కీ ఆమె దగ్గరికి వెళ్లేడు. తను చాలా పడుచు వాడైనట్టు భావించుకుంటూ యీ వ్యామోహ ప్రదర్శనలో పరాచికంలో చాలా దూరం వెళ్లేడు. అలా వెళ్లివెళ్లి అనుకో

కుండానే యిరుకులో పడి యెలా యివతలకి రావాలో తెలుసుకోలేకపోయేడు. యేమంటే ఆమె అంటే అతనికి యిష్టం వుండడం మాట సరేసరి, అసహ్యం కూడానూ. కాని ఆమెకి అతనంటే చచ్చే వ్యామోహం. అసలు ఆ యిద్దరి మధ్యా సంబంధాలు యేర్పడ్డానికి కారణం అదే. ఆ పరిస్థితిలో ప్రిన్సెస్ మ్యాకయా దైవాత్తూ వచ్చి యీ యేకాంతాన్ని భగ్నం చెయ్యడంతో అబ్లాన్‌స్కీ తెరిపిన పడ్డాడు.

"అరె, మీరూ యిక్కడున్నారా!" అని అతన్ని చూడగానే అందామె. "పాపం మీ అక్క యెలా వుంది? మీరు నాకేసి అలా చూడకండి" అని జత చేసింది. "ఆమెకంటే లక్షరెట్లు చెడిపోయిన వాళ్లు ఆమెని దుమ్మెత్తి పోసినప్పట్నుంచీ నాకనిపించింది ఆమె చక్కని పని చేసిందని. ఆమె పీటర్స్‌బుర్గ్ వచ్చినట్టు నాకు వ్రాన్‌స్కీ చెప్పేడు కాదు, అందుకతన్ని యీ సారి కనిపిస్తే యేం చేస్తానో చూడండి. తెలిసుంటే వెళ్లి చూసి వుండేదాన్ని. ఆమెతో కలిసి అన్ని చోట్లకీ వెళ్లేదాన్ని, ఆమెని అడిగానని చెప్పండి. ఆఁ యింతకీ ఆమె యెలా వుంది యేమిటీ అంతా చెప్పండి" అని ప్రిన్సెస్ మ్యాకయా అంది.

"ఆమె పరిస్థితి చిక్కుగానే వుందనుకోండి" అని అబ్లాన్‌స్కీ మొదలుపెట్టేడు. ప్రిన్సెస్ 'యెలా వుందీ యేమిటీ అంతా' చెప్పమని మనస్ఫూర్తిగానే అడిగిందని అమాయికంగా అనుకునే అతను నిజంగా చెప్పడం మొదలుపెట్టేడు. కాని తన అలవాటు ప్రకారం ప్రిన్సెస్ మ్యాకయా అతని మాటలకి అడ్డం వెళ్లి తనే మాట్లాడ్డం మొదలెట్టింది.

"ఆమె అదే పని చేసింది, నేను తప్ప యెవరేనా అలానే చేస్తారు. వాళ్లు గుట్టుగా చేస్తారు, ఆమె కపటం లేకుండా పైకి చేసింది, అంతే. ఆమె మంచి పని చేసింది. ఆమె చాలా మంచి పని చేసింది, ఆ మీ నంగిరి పింగిరి బావగార్ని వదిలేసి. అలా అంటున్నందుకు యేమనుకోకండి. ఆయన యింత తెలివైన వాడు, అంత తెలివైన వాడు అని ప్రతివాళ్లూ అనేవాళ్లే. ఆయన వొట్టి బుద్ధావతారం అని అన్న దాన్ని నేనొక్కత్తినే. ఆయన లిదియా ఇవానొవ్నా, Landauలతో చేరడంతో యిప్పుడు ప్రతివాళ్లూ అంటూ వున్నారు ఆయన బుద్ధావతారం అని. అందరూ చెప్పేదాన్ని కాదు పొమ్మని సంతోషంగా కొట్టి పారేసి వుండేదాన్నే గాని యీ సందర్భంలో అలా చెయ్యడం అసాధ్యం" అంది.

"మీకు తెలిసుంటే యిదేమిటో కొంచెం నాకు బోధ పరుద్దురూ" అన్నాడు అబ్లాన్‌స్కీ. "నిన్న మా అక్క తరఫున మాట్లాడదామని కరేనిన్ దగ్గరికి వెళ్లాను. యేదో తేల్చి చెప్పమని వేడుకున్నాను. ఆయన యేం తేల్చి చెప్పలేదు, ఆలోచించుకోవాలన్నాడు. ఆయన నుంచి అమీతుమీ తేల్చే మాట యేదీ రాలేదు సరికదా యీ సాయంత్రం వెళ్లి నేను లిదియా ఇవానొవ్నాని కలుసుకోవాలని యివాళ పొద్దున కబురు చేశాడు. యేమంటారు దీన్ని?" అన్నాడు.

"చూశారా, అదీ సంగతి!" అని ప్రిన్సెస్ మ్యాకయా సంతోషంగా అందుకుంది. "వాళ్లు Landauని అడుగుతారు యేం చెయ్యాలని" అంది.

''Landauనా? యీ Landau యెవరు?''

''యేమిటి? మీరు Jules Landauని యెరగరూ, le fameux Jules Landau, le clairvoyant?[1] అతనో శుంఠ, కాని మీ అక్క రాత ఆయన చేతిలో వుంది. మారు మూల వుంటే జరిగేది అదే, మీకు యేం తెలీదు. యీ Landau పారిస్ దుకాణంలో commis[2]గా వుండేవాడు. వో రోజున డాక్టరు దగ్గరికి వెళ్లేడుట. డాక్టరుగారి వెయిటింగ్ రూమ్‌లో కూర్చుని అలానే నిద్రపోయేట్ట. నిద్రలోనే పక్క రోగులకి సలహాలు యివ్వడం మొదలుపెట్టేట్ట. దివ్యమైన సలహాలు. యూరీ మెలెదీన్‌స్కీ — ఆయన జబ్బు మనిషి, తెలుసా? — భార్య Landau గురించి విని భర్త దగ్గరికి తీసుకువచ్చిందట. అతనింకా రోగికి చికిత్స చేస్తున్నాడు. నేననుకోవడం రోగికి యేమీ మెరుగుదల కనిపించలేదు, ముందటిలాగానే నీరసంగా వున్నాడు. కాని వాళ్లు అతన్ని నమ్మేరు. యెక్కడికెళ్లినా కూడా తీసుకెడుతూ వుంటారు. తమతోబాటు రష్యాకి తీసుకు వచ్చేరు. యిక్కడ ప్రతివాళ్లూ అతని కాళ్లమీద సాష్టాంగ పడిపోతున్నారు. అతను అందరినీ బాగు చేస్తున్నాడు. కౌంటెస్ బెజ్జుబొవాకి నయం చేశాడు. ఆమెకి అతనంటే యెంత అభిమానం అంటే దత్తు తీసేసుకుంది.''

''దత్తు తీసుకోవడమా?''

''ఆఁ, దత్తత. యిప్పుడతను Landau కాదు, కౌంట్ బెజ్జుబొవ్. సరే సంగతి అది కాదులెండి. లిదియాకి — ఆవిడంటే నాకు చాలా యిష్టం లెండి కాని ఆవిడ బుర్రలో యేదో పురుగు పట్టింది — అతనంటే మోజు పుట్టింది. అంచేత యిప్పుడు ఆవిడక్కాని, కరేనిన్‌కిగాని Landauని సంప్రదించకుండా యే వ్యవహారమూ సాగదు. అందుకనే మీ అక్క రాత Landau అనగా కౌంట్ బెజ్జుబొవ్ చేతిలో వుంది'' అని ముగించింది.

## 21

ఆ సాయంత్రం బర్త్న్యాన్‌స్కీ యింటి దగ్గర చక్కగా సుష్టుగా భోజనం చేసి తగు మాత్రంగా బ్రాందీ సేవించేక అబ్లాన్‌స్కీ అనుకున్న దానికంటే కొంచెం ఆలస్యంగా కౌంటెస్ లిదియా ఇవానొవ్నా యింటికి వెళ్లేడు.

''కౌంటెస్‌తో కూడా యింకా యెవరున్నారు? ఫ్రెంచి అతనా?'' అని అబ్లాన్‌స్కీ అడిగేడు, అక్కడ కరేనిన్ ఓవర్‌కోటుని గుర్తుపట్టేడు. పక్కనే మరో ఓవర్‌కోటు కనిపించింది.

---

[1] జ్యూల్ లందో, సుప్రసిద్ధ జ్యూల్ లందో అతీంద్రియశక్తులు, దివ్యదృష్టి వున్న ఆయన? (ఫ్రెంచి).

[2] ఉద్యోగి (ఫ్రెంచి).

అది చిన్న పిల్లఅదిలా, వింతగా క్లిష్టంగా క్లిష్టతలతో వుంది. దాన్ని చూసి యింకెవరున్నారని నౌకర్ని అడిగేడు.

''కరేనిన్‌గారు, కౌంట్ బెజ్జుబొవ్'' అని నౌకరు గంభీరంగా జవాబు చెప్పేడు.

'ప్రిన్సెస్ మ్యాకయా చెప్పింది నిజమే' అని అబ్లాన్‌స్కీ మెట్లు యెక్కుతూ అనుకున్నాడు. 'చాలా చిత్రంగా వుంది. అయినా లిదియా ఇవానొవ్నా దృష్టికి బాగా ఆనేట్టు ప్రయత్నించాలి. ఆమెకి చాలా పలుకుబడి వున్నట్టుంది. ఆమె పామొర్‌స్కీతో వొక్క ముక్క చెపితే ఆ ఉద్యోగం నా చేతిలో పడుతుంది' అనుకున్నాడు.

బయట యింకా వెలుతురుగానే వుంది. కాని లోపల దీపాలు పెట్టేరు. కౌంటెస్ లిదియా ఇవానొవ్నా డ్రాయింగ్ రూమ్ కిటికీలకి పరదాలు లాగేరు.

కౌంటెస్ లిదియా ఇవానొవ్నా, కరేనిన్ దీపం కింద వో గుండ్రటి బల్ల దగ్గర కూర్చుని మెల్లిగా మాట్లాడుకుంటున్నారు. వో మాదిరి బక్కపల్చగా వున్న చిన్న మనిషి గోడమీద బొమ్మలు చూస్తూ గదిలో ఆ మూల నుంచున్నాడు. అతని చట్టలు ఆడవాళ్ల చట్టల్లా వున్నాయి. కాళ్లు దొడ్డికాళ్లు. నదురైన వర్చస్సు లేదు కాని ముఖం అందంగా వుంది. అతని కళ్లు తేజస్సుతో మెరుస్తున్నాయి. పొడుగాటి జుటు ఫ్రాక్ కోటు మెడమీద పడుతోంది. అబ్లాన్‌స్కీ యింటావిడకీ, కరేనిన్‌కీ నమస్తే చెప్పేటప్పుడు ఆ వ్యక్తికేసి దృష్టి మళ్లించకుండా వుండలేకపోయేడు.

''Monsieur Landau!'' అని కౌంటెస్ చెప్పింది. మెల్లిగా, హెచ్చరికగా వుంది ఆమె కంఠం. అది అబ్లాన్‌స్కీకి ఆశ్చర్యం కలిగించింది. ఆమె యిద్దర్నీ వొకళ్లకొకళ్లకి పరిచయం చేసింది.

Landau చక్కన తిరిగి, దగ్గరికి వచ్చి, చిరునవ్వు నవ్వి, కదలకుండా నుంచుని చెమటకి తడిసిపోయిన చేతిని నిశ్చలంగా అలానే పెట్టి కరచాలనం చేశాడు. వెంటనే మళ్లీ వెనక్కి వెళ్లిపోయి బొమ్మలు చూడ్డం మొదలుపెట్టేడు. కౌంటెస్, కరేనిన్ వొకళ్లకేసి వొకళ్లు అర్థవతుగా చూసుకున్నారు.

''మిమ్మల్ని కలుసుకోవడం చాలా సంతోషంగా వుంది, ముఖ్యంగా యివాళ'' అని కౌంటెస్ లిదియా ఇవానొవ్నా కరేనిన్ పక్కన వున్న కుర్చీలో కూర్చోమని అబ్లాన్‌స్కీకి సైగ చేస్తూ అంది.

''అతన్ని Landau అని మీకు పరిచయం చేశాను'' అని ఆమె ఆ ఫ్రెంచతనికేసీ, తర్వాత కరేనిన్‌కేసీ వెంటనే చూసి మెల్లిగా అంది. ''కాని నిజానికి అతను కౌంట్ బెజ్జుబొవ్, మీరు బహుశా వినే వుంటారు అలా అని. కాని అతనికి ఆ బిరుదు యిష్టం వుండదు'' అంది.

''ఆఁ, విన్నాను. కౌంటెస్ బెజ్జుబొవ్‌కి పూర్తిగా నయం చేశాడని చెప్పారు'' అన్నాడు అబ్లాన్‌స్కీ.

"ఆమె యివాళ యిక్కడకి వచ్చింది" అని కరేనిన్‌కేసి తిరుగుతూ అంది లిదియా ఇవానొవ్నా. "యీ యెడబాటు ఆమెకి చాలా దారుణంగా వుంది. పెద్ద దెబ్బ" అంది.

"అయితే అతను ఖాయంగా వెళ్ళిపోతున్నాడా?" అని కరేనిన్ అడిగేడు.

"ఆఁ, పారిస్‌కి. నిన్న అతను వాణి విన్నాడు" అని లిదియా ఇవానొవ్నా యీ సారి అబ్లాన్‌స్కీకేసి తిరిగి అంది.

"ఆ, వాణి" అని అబ్లాన్‌స్కీ, యేదో ముఖ్యమైంది జరుగుతోందనీ లేదా జరగబోతోందనీ, అది అర్థం చేసుకునే తాళం తన చేతికి అందడం లేదనీ గ్రహించి వాళ్ళ మధ్య సాధ్యమైనంత జాగ్రత్తగా వుండాలని ప్రయత్నిస్తూ అన్నాడు.

ఓ క్షణం సేపు యెవళ్ళూ మాట్లాడలేదు. తర్వాత కౌంటెస్ లిదియా ఇవానొవ్నా అసలు విషయాన్ని ప్రస్తావనకి తెస్తున్నట్టు అబ్లాన్‌స్కీకేసి అలవోకగా మందహాసం చేసి చూసింది.

"మిమ్మల్ని చాలా కాలంగా యెరుగుదును. యింకా బాగా దగ్గరగా పరిచయం కావడం చాలా సంతోషంగా వుంది. 'Les amis de nos amis sont nos amis.'[1] కాని మిత్రులు కావడం కోసం మనం మిత్రుడి మనఃస్థితిని చూడాలి. మీరు కరేనిన్‌కి సంబంధించి యీ విషయం ఉపేక్షించారని నా భయం. నా ఉద్దేశం మీకు అర్థమవుతూ వుందనే అనుకుంటాను" అని మత్తుగా అందంగా వున్న కళ్ళని అబ్లాన్‌స్కీ వేపు యెత్తుతూ అంది.

"కౌంటెస్, వో మేరవరకూ నాకు కరేనిన్ పరిస్థితి తెలుసు..." అని అబ్లాన్‌స్కీ ఆమె యేం ఉద్దేశించిందో అర్థం కాకపోవడంవల్ల అస్పష్టంగా వుండ ప్రయత్నిస్తూ అన్నాడు.

"అంటే బయటికి కనిపించే స్థితికి సంబంధించిన పరివర్తన కాదు" అని కౌంటెస్ లిదియా ఇవానొవ్నా గంభీరంగా అంది. కాని అప్పుడే Landau దగ్గరికి వెళ్ళిన కరేనిన్ కేసి ఆదరపూర్వకంగా చూసింది. "అతని హృదయం పరివర్తన చెందింది. అతనికి కొత్త హృదయం వచ్చింది. అతని ఆంతరంగిక పరివర్తనని మీరు ఆసాంతం అర్థం చేసుకోలేరని నా అనుమానం" అంది.

"యీ పరివర్తనని స్థూలంగా గ్రహించగలిగే ననుకుంటున్నాను. అతనూ నేనూ యెప్పుడూ మిత్రులమే, యిప్పుడు..." అని అబ్లాన్‌స్కీ కౌంటెస్ ఆదరపూర్వకంగా చూసిన దానికి ఆదరపూర్వకంగానే చూస్తూ అన్నాడు. ఆమె ఆ యిద్దరు మంత్రుల్లోనూ యే మంత్రికి సన్నిహితం అయివుంటుందా, తన తరపున యెవరితో వో మాట చెప్పించవచ్చా అని ఆలోచించుకుంటూ అన్నాడు.

"అతనిలో వచ్చిన పరివర్తనవల్ల ప్రజలపట్ల అతని ప్రేమ తగ్గలేదు. తద్భిన్నంగా అతనిలో వచ్చిన మార్పు అతని ప్రేమని అధికం చెయ్యాలి. కాని మీకు నే చెప్పేది బోధపడ్డం

---

[1]మన మిత్రుల మిత్రులు మన మిత్రులే (ఫ్రెంచి).

లేదని నాకు భయంగా వుంది. కొంచెం టీ తాగుతారా?'' అని ట్రేలో టీ అందిస్తూ వున్న నౌకరుకేసి కళ్ళు తిప్పి అంది.

''పొంతం అర్థం కావడం లేదనుకోండి, కౌంటెస్. చెప్పక్కర్లేకుండానే తెలుస్తోందనుకోండి అతని దురదృష్టకర...''

''ఆ దురదృష్టమే అతనికి పెద్ద అదృష్టంగా మారింది. అతనికి నూతన హృదయం వచ్చింది, పరమేశ్వరుడు నిండుగా వున్న హృదయం'' అని ప్రేమతో పొంగి పొర్లే కళ్లతో అబ్లాన్స్కీకేసి చూస్తూ అంది.

అబ్లాన్స్కీ లోపల 'నేననుకోవడం యిద్దరికీ యీవిడచేత చెప్పించచ్చు' అని అనుకున్నాడు.

పైకి మాత్రం ''ఆ, అవును కౌంటెస్. కాని అలాంటి పరివర్తన వ్యక్తిగతంగా యెంత గాఢమైందంటే, యెవళ్లకీ, ప్రాణ మిత్రుడికి కూడా దాన్ని గురించి ప్రస్తావించే ధైర్యం చాలదు'' అన్నాడు.

''అదే తప్పు, అలాంటి వాటి గురించి మాట్లాడుకోవాలి, వొకళ్లకొకళ్లు సాయం చేసుకోవాలి.''

''అయ్యో, అనుమానం లేకుండా. కాని మనుషులంతా వొక్కలా వుండరు కదా, విశ్వాసాల్లో అంతరం వుంటుంది. అదీ గాక...'' అని అబ్లాన్స్కీ మృదువుగా మందహాసం చేస్తూ అన్నాడు.

''పవిత్ర సత్యం విషయంలో అంతరాలు వుండేందుకు వీల్లేదు.''

''ఆఁ, అవునవును కాని...'' అంటూ అబ్లాన్స్కీ గాబరా పడి యేం మాట్లాడకుండా వుండిపోయేడు. మతం గురించిన చర్చ సాగుతోందని అతనికి అర్థమైంది.

''అతను యిప్పుడు నిద్రపోతాడేమో, నాకనిపిస్తోంది అలా'' అని కరేనిన్ అర్థవంతంగా గుసగుసలాడుతూ కౌంటెస్ లిదియా ఇవానొవ్నా దగ్గరికి వచ్చి చెప్పేడు.

అబ్లాన్స్కీ అటు తిరిగి చూశేడు. Landau చేతుల కుర్చీ చేతికీ, వెనక్కీ ఆనుకుని తల వాల్చుకుని కిటికీ దగ్గర కూర్చున్నాడు. వాళ్లు తనకేసి చూస్తున్నారని గ్రహించి అతను తల పైకెత్తి నిష్కపటంగా, చిన్న పిల్లలు చేసే మందహాసంలాంటి మందహాసం చేశాడు.

''అతన్ని గురించి పట్టించుకోకండి'' అని లిదియా ఇవానొవ్నా అంటూ, కరేనిన్ కూర్చుందుకు కుర్చీ ముందుకు లాగింది. ''నేను యీ విషయం గమనించేను...'' అంటూ చెప్పడం మొదలెట్టింది. కాని అప్పుడే వో నౌకరు యేదో ఉత్తరం పట్టుకుని గదిలోకి వచ్చేడు. ఆమె గబగబా దాన్ని చూసి, మరేం అనుకోకండని వాళ్లకి చెప్పి, దడదడ జవాబు రాసేసి నౌకరుకి యిచ్చి పంపేసి మళ్లీ మేజా దగ్గరికి వచ్చింది. ''నేను గమనించేను'' అని మళ్లీ అందుకుంది. ''మాస్కో వాళ్లంతగా, ముఖ్యంగా మాస్కో మగాళ్లంతగా, యెవళ్లూ మతం గురించి పట్టించుకోకుండా వుండరు'' అంది.

''కాదు, కాదు, కౌంటెస్. మాస్కో వాళ్లు మహా భక్తి శ్రద్ధలు వున్న వాళ్లని పేరు పొందేరు'' అని అబ్లాన్‌స్కీ అన్నాడు.

''కాని, నాకర్థమైనంత వరకూ, దురదృష్టవశాత్తూ మీరు ఉదాసీనంగా వున్నారు'' అని కరేనిన్ అలసంగా చిరునవ్వు నవ్వుతూ అబ్లాన్‌స్కీ నుద్దేశించి అన్నాడు.

''యెవళ్లేనా ఉదాసీనంగా యెలా వుండగలరు?'' అంది లిదియా ఇవానొవ్నా.

''నేను యీ విషయంలో ఉదాసీనంగా వున్నానని కాదు, ప్రతీక్ష స్థితిలో వున్నాను'' అని అబ్లాన్‌స్కీ యెంతో మార్దవంగా మందహాసం చేస్తూ అన్నాడు. ''యిలాంటి ప్రశ్నలకి సంబంధించిన సమయం యింకా నాకు రాలేదని అనుకుంటున్నాను''' అన్నాడు.

కరేనిన్, లిదియా ఇవానొవ్నా వొకళ్లకేసి వొకళ్లు చూసుకున్నారు.

''సమయం వచ్చిందో లేదో మనం యెప్పటికీ చెప్పలేం'' అని కరేనిన్ కటువుగా అన్నాడు. ''మనం తయారుగా వున్నామా లేదా అని నిర్ణయించుకోవాల్సింది మనమే కాదు. భగవత్కృప మానవ మాత్రుల యిష్టానిష్టాలమీద ఆధారపడి లేదు. అందు కోసం తపస్సు చేసేవాళ్లకి అది వొకో అప్పుడు అందకపోవచ్చు, అందు కోసం తయారుగా లేని వాళ్లకి అది ప్రాప్తించ వచ్చు, సౌల్‌కి మాదిరిగా'' అన్నాడు.

''లేదు, యింకా వచ్చే సూచనలు లేవు'' అని లిదియా ఇవానొవ్నా మధ్యలో ఆ ఫ్రెంచి అతని కదలికలు చూస్తూ అంది.

Landau లేచి వాళ్ల దగ్గరికి వచ్చేడు.

''నేనూ మీ కబుర్లు వినచ్చా?'' అని అడిగేడు.

''యెంత మాట, తప్పకుండా. యెందుకులే మీ ధ్యానం భగ్నం చెయ్యడం అనుకున్నా'' అని అతనికేసి మృదువుగా చూస్తూ లిదియా ఇవానొవ్నా అంది. ''రండి, యిటు వచ్చి కూర్చోండి'' అంది.

''కాని తేజస్సు గోచరమవుతూ వుంటే కళ్లు మూసుకోకూడదు యెవళ్లేనా'' అని కరేనిన్ అంటూనే వున్నాడు.

''అబ్బ, మన మనస్సులో పరమేశ్వరుడి అస్తిత్వం గురించిన చేతన మనకి వుంటే యెంత ఆనంద పులకాంకితులం అవుతామో మీకు తెలిస్తేనా'' అని పారవశ్యపూరిత మందహాసంతో అంది లిదియా ఇవానొవ్నా.

''కాని అంతటి శిఖరాలకి యెగరలేనుని వొకో అప్పుడు యెవళ్లకేనా అనిపించవచ్చు'' అని అబ్లాన్‌స్కీ అన్నాడు. మతం శిఖర ప్రాయమైంది అని వొప్పుకోవడం వంచన అని తెలిసినా, పొమోర్‌స్కీతో తన పని అయిపోయేటందుకు యీ మహిళ వొక మాట చెపితే చాలు కాబట్టి ఆమె దగ్గర తను స్వతంత్ర ఆలోచనాశీలినని ప్రకటించుకోవడం యిష్టం లేక అలా అన్నాడు.

''అంటే అలాంటి వాడికి పాపాలు బాధాకరం అవులాయంటారా?'' అంది లిదియా ఇవా

నొవ్నా. "కాని అది తప్పు అభిప్రాయం. ఆస్తికులకి పాపాలు లేవు. అలాంటి వాళ్లకి పాపాల ప్రాయశ్చిత్తం జరిగిపోయింది. Pardon" అని నౌకరు రెండో ఉత్తరం తీసుకుని మళ్లీ లోపలికి రావడం చూసి అంది. యీ సారి దానికి నోటి మాటగా జవాబు చెప్పింది. "అతనికి చెప్పండి రేపు గ్రాండ్ డచెస్ దగ్గర అని – ఆఁ, యేం, ఆస్తికులకి పాపం లేదు" అని కొనసాగించింది.

"కాని కర్మరహితమైన విశ్వాసం మృతమైంది" అని అబ్లాన్‌స్కీ ప్రశ్నోత్తర రూప సంభాషణలో చదివిన యీ పదబంధాన్ని గుర్తు చేసుకుంటూ తన స్వాతంత్ర్యాన్ని చిరునవ్వుతో కాపాడుకుంటూ అన్నాడు.

"అడుగో చూశారా, సెయింట్ జేమ్స్‌నుంచి దీన్ని ఉల్లేఖిస్తున్నారు" అని కరేనిన్ లిదియా ఇవానొవ్నాని తప్పు పడుతున్నట్టుగా అన్నాడు. అంతకు ముందే తనూ, లిదియా ఇవానొవ్నా చర్చించిన విషయం గుర్తుకు తెచ్చుకుని అలా అన్నాడు. "దీన్ని తప్పు వ్యాఖ్య చేస్తే యెంత ప్రమాదం జరుగుతుందో చూడండి! దీని తప్పుడు వ్యాఖ్యలా ప్రజల్ని యేదీ విశ్వాసం నుంచి దూరం చెయ్యదు. 'నాకు కర్మ లేదు. కాబట్టి నమ్మకం లేదు' అని తెలుతుంది. కాని అసలు చెప్పింది అలాంటిదేమీ కాదు. నిజానికి దానికి విరుద్ధమైంది" అన్నాడు.

"భగవంతుడి కోసం కర్మ చెయ్యాలి. కర్మద్వారా, ఉపవాసంద్వారా మోక్ష సాధనకి" అంది లిదియా ఇవానొవ్నా, యేవగింపుతో. "అది మన సర్వసంగ పరిత్యాగుల కల్పితం... అలా చెయ్యమని యెక్కడా లేదు. ప్రతీదీ మరింత సరళంగా, తేలిగ్గా వుంది" అందామె. చిరునవ్వు నవ్వుతూ అబ్లాన్‌స్కీకేసి చూసింది. రాజ దర్బారు కొత్త వాతావరణంలో మహా రాణిని చూసి బెదిరిపోయిన యువ పరిచారికలకేసి చూసి భయం లేదన్నట్టు చెప్పేలాంటి చిరునవ్వు అది.

"క్రీస్తు మన కోసం బలిదానం చేసుకుని మనల్ని రక్షించేడు. విశ్వాసంవల్ల మనం రక్షితులమవుతాం" అని కరేనిన్, ఆమె చెప్పేదాన్ని తను ఆమోదిస్తున్నట్టు తెలియ చేసేందుకు కౌంటెస్‌కేసి తిరిగి అన్నాడు.

"Vous comprenez l'anglais?"[1]? అని లిదియా ఇవానొవ్నా అడిగింది. అబ్లాన్‌స్కీ వూఁ అనగానే ఆమె లేచి యేదో పుస్తకం కోసం షెల్ఫ్ దగ్గరకి వెళ్లి వెతికింది.

"మీకు 'Safe and Happy'[2] అనేదాన్నుంచి గాని 'Under the Wing'[3] అనేదాన్నుంచి గాని కొన్ని భాగాలు చదివి వినిపిస్తున్నాను" అని కరేనిన్‌కేసి యేమంటారు అన్నట్టు చూస్తూ అంది. ఆ పుస్తకం వెతికి పట్టుకుని బల్ల దగ్గరికి

---

[1] మీకు ఇంగ్లీషు తెలుసు కదా? (ఫ్రెంచి).

[2] "సురక్షితంగా, సుఖంగా" (ఇంగ్లీషు).

[3] "రెక్క కింద" (ఇంగ్లీషు).

తిరిగి వచ్చింది. ''చిన్న అంశం మాత్రమే. లౌకికమైన అన్నిటినీ అధిగమించి ఆత్మిక సౌఖ్యం ప్రాప్తింప చేసే విశ్వాసం పొందే మార్గం గురించి చెప్పే భాగం. నమ్మిన వాడు దుఃఖితుడు గాడు, యేమంటే అతను వొంటరిగా లేడు. మీరే స్వయంగా చూస్తారు'' అంటూ ఆమె చదవ బోయింది కాని మళ్ళీ నౌకరు లోపలికి వచ్చేడు. ''బొరొజ్దినా? రేపు రెండు గంటలకి అని చెప్పండి'' అని పుస్తకంలో ఆ భాగం వేళ్ళ మధ్య పెట్టుకుని, గాఢంగా శ్వాస పీల్చి తన అందమైన, స్వాప్నిక నేత్రాలతో యెదరికి యేటో చూస్తూ అంది. ''యేం, సత్యపూరితమైన విశ్వాస ప్రభావం అది. మరీయా సానినా తెలుసా మీకు? ఆవిడ ఘోర దుఃఖం గురించి కూడా తెలుసనుకుంటాను? పాపం ఆవిడ వొక్కగా నొక్క బిడ్డ దక్కలేదు. చాలా దురన్యాయం. కానైతేనేం, ఆఖరికి యేమైందనుకున్నారు? ఆమెకి యీ నేస్తం దొరికాడు, యిప్పుడామె తన బిడ్డ మృతికి భగవంతునికి రుణపడి వుంది. సత్యపూరిత విశ్వాసంవల్ల కలిగే ఆనందం అలాంటిది'' అని చెప్పింది.

''అవునవును, అది చాలా...'' అని అబ్లాన్స్కీ, ఆమె పుస్తకం చదివేటంత సేపూ తను సంబాళించుకుంటూ వుండవచ్చని సంతోష పడుతూ అన్నాడు. 'యివాళ యీమెని యేమీ నేను అడక్కుండా వుండడం మేలేమో' అని మనసులో అనుకున్నాడు. 'యిక్కడ్నుంచి కంపుగాకుండా మర్యాదగా బయట పడితే అదే పదివేలు' అనుకున్నాడు.

''మీకు ఇంగ్లీషు తెలియక పోవడంవల్ల యిది విసుగనిపించవచ్చు, కాని చాలా చిన్నది'' అని కౌంటెస్ Landauకేసి తిరిగి అంది.

''ఫర్లేదండీ, అర్థమవుతుంది నాకు'' అని Landau అదే చిరునవ్వు నవ్వుతూ అన్నాడు, అని కళ్ళు మూసుకున్నాడు.

కరేనిన్, లిదియా ఇవానొవ్నా వొకళ్లకేసి వొకళ్లు భావగర్భిత దృక్కులతో చూసుకున్నారు. పఠనం మొదలైంది.

## 22

అబ్లాన్స్కీ తనకి కొత్తగా, నిగూఢంగా కనిపించే ఆ మాటలు విని మొత్తం నిర్ఘాంత పోయేడు. పీటర్స్‌బర్గ్ జీవిత సంక్లిష్టత మొత్తంమీద అతన్ని మాస్కో స్తబ్ధతనుంచి బయటికి లాగి యెప్పుడూ ఉత్తేజితం చేస్తూ వుంటుంది. కాని తనకి పరిచితం అయి తన హృదయానికి సమీపంగా వుండే బృందాల్లో అలాంటి సంక్లిష్టత అతనికి బాగా హృద్యంగా వుంటుంది. కాని యీ పరాయి వాతావరణం అతన్ని ఆశ్చర్య చకితం చేసింది. అతను నిశ్చేష్టుడైపోయేడు, అతనికి మతిపోయింది. యీ గొడవనుంచి యెలా బయట పడాలిరా నాయనా అనుకున్నాడు. కౌంటెస్ లిదియా ఇవానొవ్నా మాటలు వింటూ, Landau అందమైన కళ్లు — అవి అమాయకమైనవో కపటమైనవో, యేమిటైందీ తేల్చుకోలేక — ఆ కళ్లు తనమీద లగ్నం అయేయని గ్రహించేడు, అతని తల యినప గుండులా భారమైపోయింది.

అతని బుర్రలో నానా రకాల ఆలోచనలూ రేగాయి. 'మరీయా సానినా బిడ్డ చనిపోయి నందుకు సంతోషంగా వుంది... యిప్పుడు సిగరెట్ కాలిస్తే బాగుంటుంది... మోక్షం కావాలంటే విశ్వాసం వుంటే చాలు, సాధు పుంగవులకి యీ విషయం తెలీదు గాని లిదియా ఇవానొవ్నాకి తెలుసు... నా తల యేమిటింత భారంగా వుంది? బ్రాందీవల్లా లేకపోతే యిదంతా నిగూఢంగా వుండడంవల్లా? యిప్పటిదాకా యిక్కడ అనుచితమైన పని యేమీ నేను చెయ్య లేదు. కాని దేన్ని గురించీ నేను అడగకూడదు. వాళ్ళు మనుషులచేత బలవంతంగా ప్రార్థ నలు చేయిస్తారని అంటారు. నాచేత అలా చేయించే యత్నం చెయ్యరనే అనుకుంటాను. అలా అయితే చాలా బేకారు పని అవుతుంది. యేమిటా చెత్తంతా చదువుతోంది? కాని ఆమె ఇంగ్లీషు ఉచ్చారణ బాగుంది. Landau — బెజ్జూబొవ్. యెందుకని యితను బెజ్జూబొవ్ అయేడు?' అబ్లాన్స్కీకి వున్నట్టుండి కింది దవడ ఆవలింతకి తెరుచుకుంటుం దనిపించింది. అతను ఆవలింతని ఆపుకుందుకు, చెంపల్ని నిమురుకుని తనని తను వొకసారి కుదుపు కున్నాడు. కాని మరు క్షణంలోనే నిద్ర ముంచుకొస్తున్నట్టు గుర్రుకొట్టబోతున్నట్టు అనిపిం చింది. "అతను నిద్రపోతున్నాడు" అని కౌంటెస్ లిదియా ఇవానొవ్నా అన్న మాటలకి అతని కళ్ళు తెరుచుకున్నాయి.

అబ్లాన్స్కీ తప్పు చేసి దొరికిపోయిన వాడిలా బాధ పడుతూ గాబరా పడి నిటారుగా కూర్చున్నాడు. కాని వెంటనే "అతను నిద్రపోతున్నాడు" అనే మాటలు తనని ఉద్దేశించి అన్నవి కాదనీ, Landauని ఉద్దేశించి అన్నవనీ తెలిసి హమ్మయ్య అనుకున్నాడు. ఆ ఫ్రెంచి అతనికీ అబ్లాన్స్కీ మాదిరీ నిద్రవస్తోంది. తను నిద్రపోతే వాళ్ళకి కష్టం కలుగుతుందనీ (అక్కడ అన్నీ నిగూఢంగా వుండడంతో యిది కూడా అతనికి యిదమిత్థంగా తేలలేదు) ఆ ఫ్రెంచి అతను నిద్రపోతే సంతోషంగా వుందనీ, ముఖ్యంగా లిదియా ఇవానొవ్నాకి Landau నిద్రపోవడం అలా వుందనీ అనిపించింది.

"Mon ami[1]" అంది లిదియా ఇవానొవ్నా, చప్పుడు అవకూడదని చెప్పి తన గౌను కుచ్చిళ్ళని బహు జాగ్రత్తగా చేత్తో మడిచి పెట్టుకుని, ఆ ఉత్తేజంలో కరేనిన్‌ని పేరు పెట్టి పిలవకుండా 'mon ami' అని సంబోధిస్తూ "donnez lui la main. Vous voyez?[2]" అంది. మళ్ళీ గదిలోకి వస్తూ వున్న నౌకరుకేసి తిరిగి హుష్ చప్పుడు చెయ్యద్దన్నట్టు సైగ చేసింది. "నేనిప్పుడు యెవళ్ళనీ కలుసుకోనని చెప్పు" అంది.

ఆ ఫ్రెంచి అతను కుర్చీ వీపుమీదకి తల ఆన్చి నిద్రపోతున్నాడు, లేదా నిద్రపోయినట్టు నటిస్తున్నాడు. మోకాలిమీద ఆనుకున్న చెమ్మగిలిన చేత్తో దేన్నో పట్టుకో ప్రయత్నిస్తున్నట్టు మెల్లిమెల్లిగా కదలికలు చేశాడు. కరేనిన్ లేచాడు. బహు జాగ్రత్తగా అతని దగ్గరికి వెడదామను

[1] నా మిత్రమా (ఫ్రెంచి).

[2] అతనికి చెయ్యి అందివ్వండి, చూస్తున్నారు కదా? (ఫ్రెంచి).

కునీ మేజా కోడుకి కాలు కొట్టుకుని దెబ్బ తగిలించుకున్నాడు. అలా లేచి ఫ్రెంచి అతని దగ్గరికి వెళ్లి తన చేతిని అతని చేతిలో వుంచేడు. అబ్లాన్‌స్కీ కూడా లేచి నుంచున్నాడు. అతను కళ్లు బాగా విప్పారించుకున్నాడు, తను నిద్రపోవడం లేదని రుజువు చేసుకోవడానికి. అప్పుడు మొదట వొకళ్లకేసీ, తర్వాత రెండో వాళ్లకేసీ చూశాడు. తను నిద్రపోవడం లేదు. తల యింకా యింకా బరువెక్కి పోతున్నట్టు అతనికి అనిపించింది.

"Que la personne qui est arrivée la dernière, celle qui demande, qu'elle sorte! Qu'elle sorte![1]" అని ఆ ఫ్రెంచి అతను కళ్లు తెరవకుండానే గొణిగేడు.

"Vous m'excuserez, mais vous voyez... Revenez vers dix heures, encore mieux demain.[2]"

"Qu'elle sorte!"[3] అని ఫ్రెంచి అతను చిరాగ్గా రెట్టించేడు.

"C'est moi, n'est ce pas?"[4]

అవును అని జవాబు వచ్చేక అబ్లాన్‌స్కీ, తను లిదియా ఇవానొవ్నాని సిఫార్సు అడగవచ్చేనన్న విషయం, తన అక్కగారి వ్యవహారంమీద వచ్చేనన్న విషయం యావత్తూ మరిచిపోయి ఆ యింట్లోనుంచి, కలరా సోకిన యింట్లోనుంచి మాదిరీ, తక్షణం పారిపోవాలన్న యేకైక ప్రేరణతో, మునిగాళ్లమీద గుమ్మందాకా చకచక వెళ్లి వెంటనే వీధిలోకి పరిగెత్తివెళ్లి పడ్డాడు. బగ్గీలో పడ్డాక త్వరగా మామూలు మనిషిగా హుషారుగా అవాలని బగ్గీ తోలేవాడితో మాట కదలేసి హాస్యాలాడుతూ, గడిపేడు.

ఆఖరి అంకం వేళకి అందుకున్న ఫ్రెంచి నాటకశాలలోనూ, తర్వాత పెద్ద రెస్టారెంట్‌లో షాంపేన్ సేవించీ తనకి అలవాటైన వాతావరణంలో అబ్లాన్‌స్కీ హమ్మయ్య అని వూపిరి పీల్చుకున్నాడు. యింత అయినా కూడా అసలు మనిషి కాలేకపోయేడు.

తను పీటర్స్‌బుర్గ్‌లో నిడిది చేసిన పెత్తండ్రి కొడుకు ప్యోత్ర్ యింటికి వెళ్లేడు. అక్కడ ప్రిన్సెస్ బెట్సీ తన కోసం పంపిన చీటీ వుంది. తాము మాట్లాడుకుంటూ వున్న విషయం గురించి పొంతం మాట్లాడాలని తనకి కుతూహలంగా వుందనీ, మర్నాడు తన దగ్గరికి రమ్మనీ ఆమె రాసింది. అతను ఆ చీటీ చదివి ముఖం చిట్లించుకున్నాడు. యింతలోకీ కిందనుంచి మనుషుల భారమైన అడుగుల చప్పుడు వినిపించింది, దేన్నో భారంగా మోసుకు వస్తున్నట్టు.

---

[1] అందరికంటే ఆఖర్న, అడగడానికి వచ్చిన, అతను బయటికి వెళ్లిపోవాలి, బయటికి వెళ్లిపోవాలి (ఫ్రెంచి).

[2] మన్నించండి, కాని మీరు చూస్తున్నారుగా... పది గంటలకి రండి, రేపొస్తే యింకా మేలు (ఫ్రెంచి).

[3] బయటికి వెళ్లిపోవాలి (ఫ్రెంచి).

[4] ఆయన అన్నది నన్ను ఉద్దేశించి, కదా? (ఫ్రెంచి).

అదేమిటో చూద్దామని అబ్లాన్‌స్కీ వెళ్ళాడు. యువకుడై పోతూ వున్న ప్రిన్స్ ప్యోత్ ఆ మనిషి. అతను చిత్తుగా తాగేసి మెట్లు యెక్క లేకుండా వున్నాడు. అబ్లాన్‌స్కీని చూడ గానే అతను తనని సరిగా నుంచో పెట్టించమని చెప్పేడు. తనే అబ్లాన్‌స్కీ మెడమీద వాలి అతని సాయంతో గదిలోకి వెళ్ళాడు. గదిలోకి వెళ్ళేక ఆ పూట తను యెలా గడిపిందీ చెప్పడం మొదలుపెట్టి పూర్తి చెయ్యకుండా అలానే నిద్రపోయేడు.

అబ్లాన్‌స్కీ మనసు జావగారి పోయింది. అలా అతనికి యెప్పుడోగాని జరగదు. నిద్ర పట్టలేదు. అతను జ్ఞాపకం చేసుకునేవన్నీ వెలపరంగానే వున్నాయి. అన్నిటికంటే వెలపరంగా కనిపించింది లిదియా ఇవానొవ్నా యింటి దగ్గర గడిపిన ఆ సాయంత్రం. అది అవమాన కరంగా కనిపించింది.

ఆ మర్నాడు అతనికి విడాకులు యివ్వను అనే ఖండితమైన జవాబు కరేనిన్‌నుంచి వచ్చింది. ఆ ఫ్రెంచి అతను అసలైనదో, అబద్ధమైనదో తెలీని ఆ సమాధినుంచి పలికిన మాటలమీద ఆ నిర్ణయం ఆధారపడిందని అబ్లాన్‌స్కీకి అర్థమైంది.

## 23

సంసారంలో యేదన్నా నిర్ణయం తీసుకోవాల్సి వచ్చినప్పుడు భార్యా భర్తల మధ్య యే మాత్రం పొసగని భేదాలైనా వుండాలి, పూర్తి అనుకూల ప్రేమపూర్వక సహకారమైనా వుండాలి. యిద్దరి మధ్యా సంబంధాలు అటూ గాక, యిటూ గాక దెబ్బలాటా అంటే దెబ్బ లాటా కాదు, ప్రేమా అంటే ప్రేమా కాదు అనే సందిగ్ధ స్థితిలో వుంటే యే ముఖ్యమైన పనీ జరగదు.

దంపతులిద్దరూ యేకాభిప్రాయం లేక విసుగ్గా వున్నా అదే చోట గడిపే స్థితిలో అనేక కుటుంబాలు యేళ్ల తరబడి సాగుతూ వుంటాయి. యేమంటే యిద్దరి మధ్యా యెరమరిక లేని అన్యోన్యతగాని, పచ్చ గడ్డి వేస్తే భగ్గుమనే విభేదం కాని వుండకపోవడమే కారణం.

వ్రాన్‌స్కీ, ఆన్నాలిద్దరికీ మాస్కో వేడీ, ధూళీ భరింప శక్యంగాకుండా వున్నాయి. వసంతరుతువులో వుండే ఆహ్లాదకరమైన యెండ పోయింది, వేసవి తాపం వచ్చింది. చౌకుల్లో చెట్లకి నిండుగా ఆకులు విచ్చుకున్నాయి. ఆకులు దుమ్ము కొట్టుకుపోయి వున్నాయి. అయినా ముందు అనుకున్నట్టుగా వాళ్లు పల్లెకి వెళ్లలేదు. అనుకోకపోయినప్పటికీ దరిద్రపు గొట్టు మాస్కోలోనే వుండిపోయేరు. యేమంటే వాళ్లిద్దరి మధ్యా సయోధ్య యిక లేకపోయింది.

ఆ యిద్దరి మధ్యా దూరం కలిగించే క్లేశానికి పైకి యే గట్టి కారణమూ లేదు. విషయం యేమిటో తేల్చి వేసే ప్రతి ప్రయత్నమూ దాన్ని తప్పించడానికి బదులు దానికి ఆజ్యం పోసింది. అది లోతుగా పాతుకున్న క్లేశం. తనమీద అతనికి ప్రేమ తగ్గుతోంది అని ఆమె అనుకోవడంనుంచి వచ్చింది. వ్రాన్‌స్కీకి అయితే ఆన్నా కోసం తను కటువైన పరిస్థితిలో పడ్డాననీ, ఆమె దాన్ని తగ్గించడానికి బదులు యింకా కటువు చేస్తోందనీ విచారం. ఆమె

గాని, ఆతను గాని తమ క్లేశ కారణం గురించి చర్చించుకోలేదు. కాని అవతలి వాళ్ళు తప్పు అని యెవళ్ల మట్టుకి వాళ్లు అనుకున్నారు, వొకళ్లకొకళ్లు దాన్ని రుజువు చెయ్యడానికి ప్రయత్నించేరు.

ఆన్నాకి సంబంధించి వ్రాన్‌స్కీ — అతని ఆలోచనలు, అలవాట్లు, కోరికలు, మానసిక శారీరక విశిష్టతలన్నిటితో సహా అతని వ్యక్తిత్వం అంతా వొక్క దాన్నే స్ఫురింప చేశాడు — ఆడవాళ్లకి ప్రేమికుడు. అతని ఆ ప్రేమ సర్వస్వం, తనకి మాత్రమే దక్కాల్సిన ప్రేమ, తగ్గిపోతోంది. ఆన్నా తర్కం ప్రకారం అతను కొంత ప్రేమని పరాయి మహిళలకి లేదా మహిళకి యిస్తున్నాడు. ఆ కారణంగా ఆమె యీర్ష్యాగ్రస్తురాలైంది. ప్రత్యేకం ఫలానా ఆడమనిషివల్ల కాక, అతని ప్రేమ తగ్గిపోతోందన్న దానివల్ల ఆమె యీర్ష్యాగ్రస్తురాలైంది. ఈర్ష్యా కారకమైన వస్తువు యెదర లేకపోవడంతో ఆమె అలాంటి దాన్ని కనిపెట్టబోయింది. వొట్టినే పిసరు అనుమానం తగిలితే చాలు ఆమె వొక దాని బదులు మరొక దానిమీద యీర్ష్య కలిగించుకునేది. వొకో అప్పుడు ఆమెకి బజారు ఆడమనుషులవల్ల యీర్ష్య కలిగేది. అతని అవివాహిత జీవితంలో వాళ్లతో అతనికి సంబంధాలు వుండే వుంటాయి. మరో అప్పుడు అతనికి సమాజంలో సంబంధం వున్న మహిళలపట్ల ఆమెకి యీర్ష్య కలిగేది. యింకో అప్పుడు యే కల్పిత యువతిపట్లనో యీర్ష్య కలిగేది, తనతో సంబంధాలు తెగిపోయేక అతను ఆ యువతిని పెళ్లాడతాడు అనుకునేది. యీ కడపటి యీర్ష్య ఆమెని అన్నిటికంటే యెక్కువగా క్షోభ పెట్టింది. యేమంటే మనసు విప్పి మాట్లాడుకునే వో సందర్భంలో అతను ఆమెతో వో ముక్క జారేడు. తన తల్లి తనని యెంత మాత్రమూ సరిగా అర్థం చేసుకోలేదనీ, తను ప్రిన్సెస్ సొరోకినాని పెళ్లి చేసుకోవాలని వొప్పించ ప్రయత్నించిందనీ చెప్పేడు.

వ్రాన్‌స్కీవల్ల యీ రకమైన యీర్ష్య పెంచుకున్న కారణంగా ఆమెకి అతనిపట్ల కోపం వచ్చేది, ప్రతి దానిమీదా కోప కారణాన్ని వెతకబోయేది. తన పరిస్థితిలోని ప్రతి యిబ్బందికీ అతన్నే దోషిగా చూసేది. తప్పంతా అతనిదే: మాస్కోలో తనని వుంచిన వ్యధాకులితమైన ఆశా నిరాశల అనిశ్చిత పరిస్థితి, కరేనిన్ తాత్సారం చెయ్యడం, వూగిసలాడడం, తన జీవితంలోని వొంటరితనం. అతను గనక తనని మనస్ఫూర్తిగా ప్రేమించి వుంటే తన పరిస్థితి యెంత గడ్డుగా వుందో చూసేవాడు, దానికి పరిష్కారం చూసేవాడు. పల్లెలో కాకుండా మాస్కోలో వుండడం అతని దోషమే. ఆమె కోరుకున్నట్టు పల్లెలో కూరుకుపోయే జీవితం గడపడానికి అతను తయారుగా లేడు, అతనికి ఉన్నత సమాజం అవసరం. అందుకని తనని ఘోరమైన స్థితిలో పడేసి, దానివల్ల తనకి యెంత అవస్థగా వుందో చూడ నిష్టపడడం లేదు. తన కొడుకు శాశ్వతంగా యెడబాటు అయిపోవడానికి కూడా అతన్దే దోషం.

మధ్యమధ్య వచ్చే ప్రేమతో నిండి మధుర క్షణాలు కూడా ఆన్నాకి సాంత్వనం యివ్వలేక పోయేయి. యిప్పుడు అతని ప్రేమలో ఆమెకి యిదివరలోలేని శాంతి, ఆత్మ విశ్వాసాల ఛాయ అతనిలో గోచరమయ్యేది, అది ఆమెకి చిరాకు కలిగించింది.

సాయం సంధ్య అయింది. ఆన్నా అటూ యిటూ పచారుచేస్తూ వ్రాన్‌స్కీ గదిలో (వీధి చప్పుళ్లు యేమీ వినబడని గది అది) వుంది. వ్రాన్‌స్కీ బ్రహ్మచారుల విందుకి వెళ్లేడు. ఆన్నా అతని రాక కోసం చూస్తూ వుంది. అలా గదిలో పచారుచేస్తూ ముందు రోజు తమ మధ్య జరిగిన దెబ్బలాట గురించి ఆలోచించుకుంటూ వుంది. ఆ దెబ్బలాటలో రేగిన చెడ్డ మాటలు వొక దాని తర్వాత వొకటి యెలా వచ్చేయో వితర్కించుకుంటూ దెబ్బలాట మొదలులో కంటా వెళ్లింది. ఆ దెబ్బలాట అంత సాదా విషయం గురించి, యిద్దరికీ యే రకంగానూ ప్రముఖం కాని విషయం గురించి రేగిందని ఆమె నమ్మలేకపోయింది. కాని అది జరిగింది. వ్రాన్‌స్కీ ఆడపిల్లలకి ఉన్నత పాఠశాలా విద్య అనవసరం అని చెప్పి దాన్ని గురించి వేళాకోళం చేశాడు. తను దాన్ని సమర్థించింది. అక్కడ మొదలైంది దెబ్బలాట. అతనికి మొత్తంమీద ఆడపిల్లల చదువుపట్ల ఆదరం లేదు, ఆన్నా చేరదీసిన ఇంగ్లీషు అమ్మాయి హాన్నాకి భౌతికశాస్త్ర పరిజ్ఞానం అవసరం లేదని అన్నాడు.

దాంతో ఆమెకి చిర్రెత్తింది. వ్రాన్‌స్కీ అలా అనడంద్వారా తనకి యిష్టమైన విషయాలపట్ల తిరస్కారం చూపించేడని ఆమెకి అనిపించింది. దాంతో తనకి అతను కలిగించిన నొప్పికి బదులు అంటించేందుకు యేదో అనాలనిపించింది.

"వొక వ్యక్తిని ప్రేమించిన వ్యక్తి తప్పక కనబరిచేలాంటి దృష్టిని నాపట్ల నా భావనల పట్ల మీరు వుంచుతారని నేను ఆశించలేదు కాని కనీస మర్యాద చూపిస్తారని మాత్రం ఆశించేను" అంది.

దాంతో నిజానికి అతను కోపంతో జేవురించుకున్నాడు, కష్టం కలిగించే మాటని దేన్నో అతను అన్నాడు. జవాబుగా తనేం అన్నదీ ఆమెకి గుర్తు లేదు కాని బహుశా ఆమె మనసుకి కష్టం కలిగించడానికి అన్నాడు:

"యిది నిజం, యీ అమ్మాయిపట్ల మీ ఆరాధన నాకు నచ్చలేదు, యేమంటే అది అసహజంగా కనిపిస్తోంది నాకు."

తన భారమైన జీవితాన్ని వోర్పుతో భరించేందుకు తను యెంతో కష్టపడి నిర్మించుకున్న ప్రపంచాన్ని అతను ఖండఖండాలు చేసేసిన ఆ క్రూరత్వం, తనమీద వంచన అసహజత్వాల దోషారోపణ చేసిన ఆ అన్యాయపూరిత విధానం ఆన్నాని దహించేశాయి.

"చాలా విచారకరమైన విషయం మీకు ముతక ఐహిక విషయాలే సహజంగా కనిపించి, అర్థం కావడం" అని అనేసి గదిలోనుంచి బయటికి వెళ్లిపోయింది.

ఆ సాయంత్రం వ్రాన్‌స్కీ ఆమె దగ్గరికి వెళ్లినప్పుడు యీ దెబ్బలాట విషయం మళ్లీ యెత్తుకోలేదు, దాన్ని వూరికే దాటవెయ్యడం జరిగింది, కాని ముగిసిపోలేదని యిద్దరికీ అనిపించింది.

వ్రాన్‌స్కీ యీ వేళ రోజంతా యింట్లో లేడు. దెబ్బలాట జ్ఞాపకం వొచ్చి ఆమె యింట్లో వొంటరిగా వుండిపోయింది. మనసంతా యెంతో భారమైపోయింది. దాన్నంతట్నీ మరిచి

పోవాలనీ, క్షమపొందాలనీ, అతనితో రాజీ చేసుకోవాలనీ, దోషమంతా తనమీదే వేసుకోవాలనీ, అతను నిర్దోషి అని చెప్పాలనీ పరితపించి పోయింది.

'తప్పంతా నాదే. నాకు ముక్కుమీద వుంది కోపం, చెప్పలేనంత యీర్ష్యగా వున్నాను. అతనితో రాజీ పడిపోయి పల్లెకి వెడతాను. అక్కడ యెక్కువ మనశ్శాంతిగా వుంటుంది' అనుకొంది.

'అసహజం!' అన్న మాట హఠాత్తుగా ఆమెకి గుర్తు వచ్చింది. అది ఆమె మనసుకి చాలా కష్టం కలిగించింది. యేమంటే తనకి కష్టం కలిగించేందుకే అతనా మాట అన్నాడు.

'అతనేం ఉద్దేశించేడో నాకు తెలుసు. నీ బిడ్డని నువ్వు ప్రేమించడం లేదు గాని పరాయి పిల్లని ప్రేమిస్తున్నావు అది అసహజం అని. పిల్లలపట్ల ప్రేమ అంటే అతనికి యేం తెలుసు? సెర్యోషపట్ల నా ప్రేమ యేమిటో అతనికి తెలుసా? దాన్ని తన కోసం త్యాగం చేశానే. నన్ను గాయ పరచడానికే అతనా ముక్క అన్నాడు. ఆఁ, అతను ఖాయంగా వేరే ఆమెని ప్రేమిస్తున్నాడు. యిక వేరే కారణం లేదు.'

మనశ్శాంతి సాధించే ఉద్దేశంతో తను మళ్లీ అదే దారిలో, యింతకు ముందు అనేక సార్లు దాటి వచ్చిన దారిలో గుడుగుడు కుంచం గుండారామం అని చక్కర్లు కొడుతున్నానని వెంటనే ఆమెకి భీతి కలిగింది. 'యేమిటి, అలా చెయ్యలేనా? దోషం అంతా నా నెత్తిమీద వేసుకోలేనా?' అని ఆమె తనలో తను అనుకొంది. మళ్లీ ఆదినుంచీ యీ విషయం గురించి ఆలోచించింది. 'అతను నిజాయితీపరుడు, సత్యవాది, నన్ను ప్రేమిస్తున్నాడు. నేనూ అతన్ని ప్రేమిస్తున్నాను. యిక కొన్ని రోజుల్లో విడాకులు వస్తాయి. యిక నాకు కావాల్సింది యేముంది? నేను శాంతంగా, భరోసాగా వుండాలి. తప్పంతా నా నెత్తినే వేసుకుంటాను. అవును, అతనింటికి రాగానే చెప్తాను తప్పంతా నాదేనని, నిజంగా నా తప్పు లేకపోయినా. వూరికి వెళ్లిపోతాం.'

యిక మళ్లీ దాన్ని గురించి తడుముకోకుండా వుండేందుకూ, విద్వేషం కలగకుండా వుండేందుకూ ఆమె గంట మోగించి, వూరికి వెళ్లేందుకు పెట్టెలు సర్దమని పనిపిల్లకి చెప్పింది.

రాత్రి పది గంటలకి వ్రాన్‌స్కీ యింటికి వచ్చేడు.

## 24

“ఊఁ, బాగా మజాగా జరిగిందా?” అని అతన్ని పలకరిస్తూ అడిగింది. ఆమె ముఖంలో నమ్రత, తను దోషి అన్న భావం కనిపించేయి.

“మామూలే” అని అతను బదులు చెప్పాడు. ఆమె ముఖం చూశేడు. ఆమె చిర్రుబుర్రు లాడకుండా సౌమ్యంగా వుందని గ్రహించేడు. వ్రాన్‌స్కీ ఆమె మనఃస్థితుల్లో వచ్చే మార్పులకి యీ పాటికి అలవాటు పడ్డాడు. యివాళ ఆమెలో కనిపించే మార్పు అతనికి సంతోషంగా వుంది, యేమంటే తనే మాంచి హుషారుగా వున్నాడు.

"యేమిటి నాకు కనిపిస్తున్నవి! చాలా సంతోషంగా వుంది నాకు" అని వ్రాన్స్కీ హాలులో వున్న పెట్టెలకేసి చూసి అన్నాడు.

"అవును, మనం వెళ్ళాలి. యివాళ బండిలో షికారు వెళ్ళాను, బయట యెంత బాగుందో, పల్లెకి వెడదామనిపించింది. నువ్విక్కడ వుండే పనేం లేదు కదా?" అంది.

"నాక్కావాల్సిందీ అదే. నేనిప్పుడే బట్టలు మార్చుకుని వస్తాను మాట్లాడుకుందాం. టీ యిక్కడికి తెమ్మని కబురు చెయ్యి."

అలా అని అతను తిన్నగా చదువుకునే గదిలోకి వెళ్ళేడు.

వ్రాన్స్కీ 'చాలా సంతోషంగా వుంది నాకు' అన్న తీరులో కష్టం కలిగించేది యేదో తోచింది. ముఖం మాడ్చుకుని చిరచిర లాడుతూ వున్న పిల్లలెవరేనా ఆ మూతి విరుపులు తగ్గించుకుని మామూలుగా అయినప్పుడు వాళ్ళతో మాట్లాడే ధోరణిలో వుంది. తను దోషినన్న భావం, అతని ఆత్మ విశ్వాసపూరిత భావం పోటీపడి యింకా కష్టం కలిగించేటట్టు వున్నాయి. స్పర్ధించాలన్న కోరిక క్షణకాలం పాటు ఆమెలో ఉబికింది. కాని ఆమె చాలా ప్రయాసపడి దాన్ని అణుచుకుని, ముందటి మాదిరీ హుషారుగా వ్రాన్స్కీని పలకరించింది.

అతను తిరిగివచ్చేక తను ఆ రోజంతా యెలా గడిపిందీ పల్లెకి వెళ్ళాలన్న ఆలోచన చేసిందీ, తను అంతకు ముందే వూహించుకున్న మాటలని వల్లిస్తూ చెప్పింది.

"చెప్పనా నీకు, యేదో ఆంతరంగిక ప్రేరిత భావం కలిగినట్లైంది నాకు" అంది. "యిక్కడ వుండి విడాకుల కోసం యెందుకు యెదురు చూడ్డం? ఆ పనేదో పల్లెటూళ్ళోనే చెయ్యొచ్చుగా! యిక నేను యెదురు చూస్తూ కూర్చోలేను. నేను ఆశ పెట్టుకో దలచుకోలేదు, విడాకుల గురించి వినదలచుకోలేదు. యిక నా జీవితంమీద అది యెలాంటి ప్రభావమూ కలిగించదు అని తేల్చుకున్నాను, యేమంటావ్?" అంది.

"ఆఁ, ఆఁ" అని ఆన్నా ఉత్తేజిత వదనాన్ని ఆందోళనగా చూస్తూ అన్నాడు.

"వూఁ, అయితే అక్కడ యెలా గడిచింది? విందుకి యెవళ్ళెవళ్ళు వచ్చేరు?" అని కొంచెం సేపు ఆగి ఆన్నా అడిగింది.

వ్రాన్స్కీ అక్కడికి వచ్చిన వాళ్ళ పేర్లు కొన్ని చెప్పేడు. "విందు పసందుగా వుంది. పడవల పందేలు జరిగేయి. ప్రతీదీ భేషుగ్గా వుంది. కాని మాస్కోలో యేదో వొక ridicule[1] జరక్కుండా యేదీ సాగదు. వొకావిడ వచ్చింది, స్వీడిష్ మహారాణికి యీత నేర్పే ఆవిడట. ఆవిడ తన విద్య ప్రదర్శించింది."

"యేమిటి? ఆమె యీదిందా?" అని ఆన్నా ముఖం ముడతలు పడేసుకుని అడిగింది.

"ఎర్ర రంగు costume de natation[2] వేసుకుని చాలా వెలపరం పుట్టించే ముసల్ది. వూఁ, అయితే యెప్పుడు వెడుతున్నాం మనం?"

[1] హాస్యాస్పదం (ఫ్రెంచి).

[2] యీతబట్టలు (ఫ్రెంచి).

"యెంత వింత! ఆమె యేమిటి, యేదన్నా విశేషమైన పద్ధతిలో యీదిందా?" అని అన్నా వ్రాన్‌స్కీ అడిగిన దానికి జవాబు చెప్పకుండా అడిగింది.

"ప్రత్యేకత యేమీ లేదు. చాలా వెలపరంగా వుందని చెప్పాను కదా. యింతకీ మనం యెప్పుడు వెడుతున్నాం?"

అన్నా యేదో అనిష్టకరమైన వూహని తొలగించుకో చూస్తున్నట్టుగా తల విదిలించు కుంది.

"యెప్పుడు వెడుతున్నాం? యెంత త్వరగా వీలైతే అంత త్వరగా. రేపటికి అవదు. ఎల్లుండి."

"ఆఁ... కాని, ఆగు. ఎల్లుండి ఆదివారం, నేను maman దగ్గరికి వెళ్ళాలి" అని వ్రాన్‌స్కీ యిబ్బందిగా అన్నాడు, యేమంటే అతను అమ్మ అనే మాట ఉచ్చరించగానే ఆమె చురుక్కున చూసింది. అతని యిబ్బంది ఆమె అనుమానాల్ని రుజువు చేసింది. ఆమె ముఖం యెర్రబడింది, ఆమె అతనికి దూరంగా వెళ్ళిపోయింది. యిప్పుడు ఆమె మనో నేత్రం ముందు స్వీడిష్ మహారాణికి యీత నేర్పే ఆవిడ గాక అతని తల్లితో మాస్కో దగ్గిరి వూళ్ళో వుంటూ వున్న ప్రిన్సెస్ సొరోకినా కనిపించింది.

"రేపు వెళ్ళచ్చుగా ఆమె దగ్గరికి?"

"అలా కుదరదని నీకు చెప్పాను. నేనావిడ దగ్గరికి వెళ్ళే పని, అత్యవసరమైన కాగితం, డబ్బూ తీసుకోవడం. రేపటికి అవి తయారవవు" అని జవాబు చెప్పేడు.

"అలా అయితే అసలు వెళ్ళనే వద్దు."

"యెందుకని?"

"ఆలస్యం అయితే నే రాను. వెడితే సోమవారం వెళ్ళడం లేకపోతే లేదంతే.*"

"యేమన్నా అర్థముందా? అలా యెందుకని?" అని వ్రాన్‌స్కీ ఆశ్చర్యపోతూ అడిగేడు.

"నీకిందులో అర్థం పర్థం కనిపించకపోవచ్చు, యేమంటే నువ్వేమన్నా నా గురించి పట్టించుకుంటే కదా? నా జీవితం యేమిటో అర్థం చేసుకోవాలని నీకు లేదు. యిక్కడ నాకు పొద్దు పోతున్నదల్లా హాన్నాతో. నీకేమో అది నటనలాగా కనిపిస్తోంది. నా కూతురిపట్ల నాకు ప్రేమ లేదనీ, యీ యింగ్లీషు పిల్ల పట్ల ప్రేమ నటిస్తున్నాననీ అది అసహజంగా వుందనీ నిన్న నువ్వు అనలేదూ? యిక్కడ నాకు యెలాంటి జీవితం సహజంగా వుంటుందో తెలుసుకోవాలని వుంది నాకు."

ఓ క్షణం సేపు ఆమె సంబాళించుకుంది. తను యేం చెయ్యకూడదని తీర్మానించు కుందో సరిగ్గా దాన్నే చేస్తున్నందుకు ఆమె కంపించింది. తనకి తనే చేటు తెచ్చుకుంటున్నానని ఆమెకి తెలిసినా ఆమె సంబాళించుకోలేకపోయింది, తప్పు అతనిదే అని అతనికి చూపించ కుండా వుండలేకపోయింది, అతని ముందు తల వంచలేకపోయింది.

''నేనలా అనలేదే! హఠాత్తుగా నువ్వు పెంచుకున్న యీ బంధంపట్ల నాకు సానుభూతి లేదు అన్నాను.''

''సత్యవాదినని డబ్బా వాయించుకునే నువ్వు నిజం చెప్పవెందుకని?''

''నేనెప్పుడూ డబ్బా వాయించుకోను, అబద్ధమూ చెప్పను'' అని అతను లోపల రేగుతూ వున్న కోపాన్ని అణచుకుంటూ మెల్లిగా అన్నాడు. ''చాలా విచారకరమైన విషయం నువ్వు గౌరవించకుండా వున్నట్లయితే...''

''ప్రేమ వుండాల్సిన చోట ఆ ఖాళీ జాగాని కప్పుకోవడానికి వాడే మాట గౌరవించడం అనేది. నామీద నీకు యిక ప్రేమ లేకపోతే ఆ ముక్కని నాన్చుడు లేకుండా చెప్పడం ధర్మంగా వుంటుంది.''

''అబ్బబ్బ! దీన్ని భరించడం కష్టం!'' అని కుర్చీలోనుంచి లేచి నుంచుంటూ అరిచాడు వ్రాన్‌స్కీ. ఆన్నా ముందు నుంచుని, మెల్లిగా ''యెందుకిలా నా వోర్పు పరీక్షకి పెడతావు?'' అని అన్నాడు. తను యింకా యెక్కువ అనే వాడే కాని తనని తను అదుపు చేసుకున్నాడు అని తోచేటట్టు అన్నాడు. ''దానికి కూడా హద్దులు వుంటాయి'' అన్నాడు.

''అంటే మీరు యేం చెప్పదలచుకున్నారు?'' అని ఆన్నా చించుకుంది. వ్రాన్‌స్కీ ముఖంలో, ముఖ్యంగా అతని క్రూరమైన, భీతికారక నేత్రాలలో ఘృణత్వం స్పష్టంగా కనిపించి భయ భ్రాంతురాలైపోయింది.

''నేనేం చెప్పాలనుకున్నానంటే...'' అని మొదలుపెట్టేడు, కాని మధ్యలోనే ఆగిపోయేడు. ''నే నడగ దలుచుకున్నాను, నానుంచి మీరు కోరేది యేమిటి అని?''

''నేనేం కోరగలను? నే కోరేదల్లా వొక్కటే మీరు నన్ను వదిలిపెట్టి వెళ్లద్దు, మీరను కుంటున్నట్టు'' అని అతను చెప్పకుండా వదిలిపెట్టిన దాన్ని యావత్తూ గ్రహించి ఆమె అంది. ''వుహుఁ, కాదు, కాని నే కోరేది అది కాదు, అది గౌణం. నాక్కావాల్సింది ప్రేమ, అది లేదు. అంటే సర్వం సమాప్తం అయిందని అర్థం'' అంది.

ఆన్నా గుమ్మం వేపు వెళ్లింది.

''ఆగు! కొంచెం... ఆగు!'' అని వ్రాన్‌స్కీ యింకా ముఖం ముడుచుకునే వున్నాగానీ, ఆమె చేతిని పట్టుకుని అన్నాడు. ''యేమిటీ రాద్ధాంతం? ప్రయాణం మూడ్రోజులు వాయిదా వేద్దామని అన్నాను. అంత మాత్రానికే నువ్వు నన్ను అబద్ధాలకోరునని, నిజాయితీ లేని వాణ్ణనీ అన్నావు.''

''ఆఁ, యిప్పుడు మళ్లీ రెట్టించి అంటాను, నా కోసం తన సర్వస్వమూ త్యజించే నని నన్ను నిందించే మనిషి'' అని ఆమె అంతకు ముందెప్పుడో జరిగిన పోట్లాటలోని మాటలు గుర్తు చేసుకుని అంది, ''అవినీతిపరుడికంటే అధ్వాన్నం, అతనికి హృదయం లేదు.''

''అబ్బబ్బ, ఓర్మికి హద్దు వుంటుంది'' అని అతను ఆమె చేతిని వదిలేస్తూ అరిచేడు.

'అతను నన్ను యేవగించుకుంటున్నాడు, తెలుస్తూనే వుంది' అనుకొంది. యేమీ మాట్లా

డకుండా, వెనక్కి తిరిగి చూడకుండా తడబడే అడుగులతో ఆమె గదిలోనుంచి బయటికి వెళ్ళిపోయింది.

'తను వేరే యెవత్తెనో ప్రేమిస్తున్నాడు, అదింకా స్పష్టంగా తెలుస్తూనే వుంది' అని తన గదిలోకి వెడుతూ అనుకొంది. 'నేను ప్రేమ కోసం పరితపిస్తున్నాను. కాని ప్రేమ లేదు. అంటే సర్వం సమాప్తమై పోయింది' అని ఆ మాటలని మళ్ళీ అనుకొంది. 'దీనంతటినీ సమాప్తం చెయ్యాలి' అనుకొంది.

'కాని యెలా?' అనుకుంటూ అద్దం ముందు చేతుల కుర్చీలో కూర్చుంది.

యిప్పుడు తను యెక్కడికి వెళ్ళగలదు? తనని పెంచి పెద్ద చేసిన పినతల్లి దగ్గరికా? దాలీ దగ్గరికా? లేకపోతే తనొక్కత్తీ విదేశాలకి వెళ్ళగలదా? 'తను' వొక్కడూ తన గదిలో యేం చేస్తున్నాడు? యీ పోట్లాట అటో యిటో తేలేదేనా లేక సర్దుబాటు అయేదా? పీటర్స్‌బుర్గ్‌లో వున్న పాత పరిచయస్థులు యిప్పుడు యేమంటారు? కరేనిన్ యేమనుకుంటాడు? తాము విడిపోతే యేమవుతుందీ అనేది తట్టి ఆమె మనసులో రకరకాల ఆలోచనలు రేగాయి. కాని ఆమె మనసు పూర్తిగా ఆ ఆలోచనల్లో మునిగిపోలేదు. ఆమె అంతరంగంలో మరో అస్పష్టమైన ఆలోచనా కలిగింది. అది ఆమెని ఆకట్టుకుంది. కాని నిశ్చిత రూపం తీసుకోవడం లేదు. కరేనిన్ గుర్తుకి రాగానే ఆమెకి పురుడు వచ్చేక జబ్బు చెయ్యడం గుర్తు వచ్చింది. అప్పుడు కలిగిన మనోభావాలు గుర్తు వచ్చేయి. 'యెందుకు చనిపోలేదు?' అని అప్పట్లో తన మాటలు, మనోభావాలు గుర్తు వచ్చేయి. హఠాత్తుగా ఆ అస్పష్టమైన, గాఢ ఆలోచన యేమిటైందీ తట్టింది. అవును యిదే ఆలోచన, అన్ని సమస్యలకీ సమాధానం అవుతుంది. 'అవును, మృత్యువు!..'

'కరేనిన్ అపఖ్యాతి, నాకూ సెర్యోషకీ కలిగిన ఘోర అవమానం దీంతో తుడిచి పెట్టుకుపోతాయి. నేను చచ్చిపోతే అతను పశ్చాత్తాపపడతాడు, నామీద దయ, ప్రేమ కలుగుతాయి.' తనమీద తనకే జాలి పుట్టించే చిరునవ్వు పెదాలమీద దోగాడింది. ఆమె చేతుల కుర్చీలో కూర్చుని యెడమ చేతి వేళ్ళ ఉంగరాలు తీస్తూ, మళ్ళీ పెట్టుకుంటూ తను చనిపోయిం తర్వాత వ్రాన్‌స్కీ భావనలు యెలా వుండేదీ వివిధ కోణాలనుంచీ స్పష్టంగా వూహించుకుంటూ వుంది.

దగ్గరవుతున్న అడుగుల చప్పుడు, అతని అడుగుల చప్పుడు, ఆమె ఆలోచనలని భగ్నం చేసింది. ఉంగరాలని పెట్టుకోవడంలో యెంతో మునిగిపోయినట్టు నటిస్తూ ఆమె అతనికేసి చూడలేదు.

అతను ఆమె దగ్గరికి వచ్చి, చేతిని అందుకుని, మెల్లిగా అన్నాడు:

''ఆన్నా, నువ్వు కావాలంటే యెల్లుండి వెళ్ళిపోదాం. అన్నీ నాకు సమ్మతమే.''

ఆమె యేమీ మాట్లాడలేదు.

''యేమంటావు?'' అని అడిగేడు.

''నీకే అన్నీ తెలుసు'' అంది. ఆ క్షణంలో యిక ఆపుకోలేక భోరున యేడ్చింది.

''నన్ను వొదిలి పెట్టెయ్యి, యెప్పటికీ!'' అని వెక్కుతూ అంది. ''నేను రేపే వెళ్ళి పోతాను... యింకా యెక్కువే చేస్తాను. నేను యెవత్తిని? పతితని. నీ మెడకి గుది బండని. నిన్ను చిత్రహింసలు పెట్టను, వుహుం, పెట్టను. నీ స్వేచ్ఛ నీకు యిస్తాను. నువ్వు నన్ను ప్రేమించడం లేదు, యెవళ్లనో ప్రేమిస్తున్నావు.''

ఆమెని శాంతంగా వుండమని వ్రాన్‌స్కీ వేడుకున్నాడు. తన యీర్ష్యకి, శంకకి పిసరు ఆధారం లేదని చెప్పేడు. ఆమెపట్ల తనకి గల ప్రేమ పోలేదనీ, ముందటిలాగానే తను యిప్పుడూ ఆమెని ప్రేమిస్తున్నాననీ చెప్పేడు.

''అన్నా, యెందుకిలా నువ్వు చిత్రహింసలు పడి నన్ను చిత్రహింసలు పెడుతున్నావు?'' అని ఆమె రెండు చేతుల్నీ ముద్దుపెట్టుకుంటూ అన్నాడతను. అతని ముఖం ప్రేమతో మిలమిల మెరుస్తోంది. అతని కంఠంలో అశ్రువుల ధ్వని, తన చేతులమీద వాటి తడీ ఆమెకి అనుభూతం అయేయి. ఆమె మహా తీవ్రమైన యీర్ష్యా భావం తీవ్ర ప్రేమ ప్రవాహంగా మారింది. ఆమె అతన్ని కౌగిలించుకుని, అతని ముఖాన్ని, కంఠాన్ని, చేతుల్ని ముద్దులతో ముంచెత్తింది.

## 25

తమ యిద్దరి మధ్యా సంపూర్తి సఖ్యత యేర్పడిందన్న భావంతో అన్నా ఉదయంనుంచీ ప్రయాణానికి చాలా ఉత్సాహంగా యేర్పాట్లు చేసుకోవడం మొదలుపెట్టింది. ముందు రోజు రాత్రి వొకళ్ల మాట వొకళ్లు మన్నించేందుకు తయారై వుండబట్టి ప్రయాణం సోమవారం నాడా, మంగళవారం నాడా అనేది తేలకపోయినా ఆమె జాగ్రత్తగా పెట్టె బేడా సర్దింది. వో రోజు ముందు వెనకల్లో యేమిటిలే ఫరవాలేదన్నట్టుగా సర్దింది. ఆమె తన గదిలో పెట్టె తెరిచి అవసరం లేని పనికి రాని వస్తువుల్ని యేరుతూ వుంటే అతను మామూలుగా వచ్చే దానికంటే ముందే, బాగా ముస్తాబై వచ్చేడు.

''నేనిప్పుడే maman దగ్గరికి వెళ్ళివస్తాను. ఆమె యెగోరొవ్‌ద్వారా సొమ్ము పంపించే యేర్పాట్లు చేసి వస్తాను. రేపు వెళ్లిపోవడానికి నేను సిద్ధంగా వున్నాను'' అన్నాడు.

అన్నా మనఃస్థితి చెప్పలేనంత ఆనందంగా వున్నా, పల్లెటూరి యింటికి వెళ్లి తల్లిని చూసి వస్తానని అతనడంతో గుండెలో ముల్లు గుచ్చినట్టు అయింది.

''అయ్యో, నేనే యింకా పూరా తయారవలేదు'' అంది. అప్పుడే కాసేపు ఆలోచించింది, 'నేను కోరుకున్నట్టే చేసే వీలు వుంది అన్నమాట.' ''అబ్బే, వద్దు, నువ్వన్నట్టే చెయ్యి. వెళ్లి టిఫిన్ తింటూ వుండు. అనవసరమైన వస్తువుల్ని యేరి పారేసి నేను వస్తాను'' అని ఆమె దేన్నో అన్నుష్కా చేతులతో పట్టుకున్న మూటమీదకి గిరవాటేసింది.

ఆమె భోజనాల గదిలోకి వెళ్లేటప్పటికి వ్రాన్‌స్కీ నాస్తా చేస్తున్నాడు.

''చెపితే నమ్మవు యీ గదులు నాకు యెంత వెలపరంగా కనిపిస్తున్నాయో'' అని

కాఫీ తాగడానికి అతని దగ్గర కూర్చుంటూ అంది. "యీ chambres garnies[1] కంటే ఘోరమైనవి వుండవు. వీటికో ప్రత్యేకతా వుండదు, ఆప్యాయనకరమైందీ వుండదు. యీ గడియారాలు, తెరలు, యిక ఆ వాల్ పేపరు — అబ్బ, చెప్పకు, రోత! వొజ్ద్వీజెన్స్కొయె అంటే నాకు స్వర్గమే అనిపిస్తుంది. నువ్వు గుర్రాల్ని యింకా పంపలేదా?"

"లేదు, మనం వెళ్ళాక వస్తాయి. యేం యెక్కడికేనా వెళ్ళాలా నువ్వు?"

"వెళ్ళి విల్సన్ని చూసి వద్దామనుకుంటున్నా. నా గౌన్లు కొన్ని యివ్వాలి. అయితే రేపు వెళ్ళిపోవడం ఖాయమేనా?" అని ఆమె ఉత్సాహంగా అడిగింది. కాని ఆమె ముఖం హఠాత్తుగా మారిపోయింది.

అప్పుడు వ్రాన్స్కీ నౌకరు పీటర్స్బుర్గ్నుంచి వచ్చిన తంతి విషయమై అడగడానికి వొచ్చేడు. వ్రాన్స్కీకి తంతి రావడంలో వింతా విశేషమూ యేమీ లేదు. కాని అది తను చదువుకునే గదిలో వుందని చెప్పడంలో, తనతో మాట్లాడ్డానికి త్వరపడి ప్రసంగ విషయం మార్చడంలో యేదో దాచాలన్న సూచన అతని గొంతుకలో అన్నాకి కనిపించింది.

"తప్పకుండా అన్ని పనులనీ రేపు పూర్తి చేస్తా."

"టెలిగ్రామ్ యెవరిచ్చారేమిటి?" అని ఆమె అతని మాటని పట్టించుకోకుండా అడిగింది.

"అబ్లాన్స్కీనుంచి" అని అతను అయిష్టంగా బదులు చెప్పేడు.

"నాకెందుకు చూపించలేదు? నాకూ, వాడికీ మధ్య యేం రహస్యాలున్నాయని?"

వ్రాన్స్కీ నౌకరుని వెనక్కి పిలిచి టెలిగ్రామ్ తీసుకురమ్మని చెప్పేడు.

"నీతో యెందుకు చెప్పలేదంటే యేముంది, యే విశేషమూ లేకుండా టెలిగ్రామ్లు యిచ్చే పిచ్చి అబ్లాన్స్కీది. యే విషయమూ తేలని దానికి టెలిగ్రామ్ యెందుకు చెప్పు."

"విడాకుల విషయమేనా?"

"ఆఁ. యింకా యే జవాబూ రాలేదని అంటాడు. కచ్చితంగా యే విషయమూ కొన్ని రోజుల్లో తేలుతుందంటాడు. యిదిగో, చూడు."

అన్నా వణికే చేతులతో దాన్ని అందుకుంది. వ్రాన్స్కీ చెప్పిందే అందులో వుంది. ఆఖర్న కొసరు చేర్చి వుంది: "పని జరుగుతుందన్న నమ్మకం లేదు. కాని ప్రయత్నాలు చేస్తాను."

"విడాకులు వచ్చినా రాకపోయినా నాకు వొకటే అని నిన్న రాత్రి అన్నాను" అందామె సిగ్గుతో యెర్రబడుతూ. "దీన్ని దాచి పెట్టే అవసరం లేదు" అంది. 'యీ రకంగానే తను ఆ ఆడమనిషి ఉత్తరాల్నీ నాకు చూపించకుండా దాచి వుంటాడు' అనుకొంది.

"యాష్విన్ యీ పొద్దుట వోయ్తొవ్తో కలిసి యిక్కడికి వద్దామనుకుంటూ వున్నాడు.

---

[1] అద్దె యిళ్ళు (ఫ్రెంచి).

యాష్విన్ మొత్తం అంతా పెవ్‌ట్సోవ్ దగ్గర్నుంచి, అతను యివ్వగలిగిన దాన్నంతా గెలుచుకున్నట్టే వుంది. దగ్గర దగ్గర అరవై వేలు'' అని వ్రాన్‌స్కీ అన్నాడు.

''యేమిటి, నాకు చెప్పకుండా దాచి పెట్టాలన్నంత ముఖ్యమైన విషయం యెందుకు అనుకున్నావు?'' అని అన్నా అతను మాట మార్చాలని చూడడంతో తనకి చిరాకెత్తుతోందని చూపించడాని కన్నట్టు చెప్పింది. ''నే చెప్పనే చెప్పాను దీన్ని గురించి నేను ఆలోచించడం లేదనీ, నువ్వు కూడా దీని విషయంలో నాకు మళ్ళీనే అంత పట్టించుకోకుండా వుండాలనీ'' అంది.

''నాకు చీకట్లో వుండకుండా విషయాలు స్పష్టం కావాలి, అందుకని నాకు పట్టింపు వుంది'' అన్నాడు.

''బాహ్య రూపంవల్ల కాదు, ప్రేమవల్ల అసలు స్పష్టత వస్తుంది'' అంది. అతని మాటలకంటే కూడా అతను నిదానంగా ఆ మాటలని అన్న తీరుతో ఆమెకి కోపం యెక్కువ వచ్చింది. ''అది నీకు యేం పట్టింది?'' అంది.

'హరి భగవంతుడా, మళ్ళీ ప్రేమ గురించి చర్చిస్తోంది' అనుకున్నాడతను, ముఖం ముడతలు చేసుకుని.

''నీకు తెలుసా విడాకుల గురించి నేను యెందుకు పట్టించుకుంటున్నానో. నీ కోసం, యింకా పుట్టబోయే నీ పిల్లల కోసం'' అన్నాడు.

''పిల్లలు యింక పుట్టరు.''

''చాలా విచారకరమైన విషయం'' అన్నాడు వ్రాన్‌స్కీ.

''పిల్లల కోసం అంటున్నావు నువ్వు. కాని నా గురించి యేమీ ఆలోచించడం లేదు'' అని ఆమె అతను 'నీ కోసం, పిల్లల కోసం' అన్న మాటలని పూర్తిగా మరిచిపోయేనా లేదా వాటి గురించి పట్టించుకోకుండానేనా అంది.

పిల్లలు పుట్టడం విషయం వాళ్ళిద్దరి మధ్యా చాలా కాలంగా వివాదకారణంగా వుంది. అది అన్నాకి మంట రేకెస్తుంది. పిల్లలు కావాలి అన్న అతని కోరిక అర్థం తన అందం గురించి అతను పట్టించుకోవడం లేదు అన్నమాట అని ఆమెకి అనిపించింది.

''అబ్బా! నీ కోసం అని అన్నాను నేను. అన్నిటికంటే యెక్కువగా నీ కోసం'' అని అతను యేదో నొప్పి పెట్టినట్టుగా ముఖం ముడతలు చేసుకుని ఆ మాటలు రెట్టించాడు. ''యేమంటే నీకు చిరాకులూ పరాకులూ యెక్కువ అవడానికి కారణం నీ పరిస్థితి అసందిగ్ధంగా వుండడమేనని నాకు తెలుసు'' అన్నాడు.

'అవును, యిప్పుడు నటన మానేశాడు, నాపట్ల తన కఠోరమైన యేవగింపుని స్పష్టంగా చూపిస్తున్నాడు' అని మనసులో అనుకొంది. అతని మాటలని వినకుండా, తనని నిష్ఠూరంగా కఠోర క్రూర ప్రాడ్వివాకుని కళ్ళతో చూస్తూ వున్న అతనికేసి భయాతుర అయి చూసి అనుకొంది.

''అది కాదు కారణం. నా చిరాకు అని నువ్వు అనే దాని కారణం నేను పూర్తిగా నీ వశంలో వుండడం యెలా అవుతుందో నాకు అర్థం కావడం లేదు. అందులో యేమన్నా అసందిగ్ధత వుందా? అందుకు విరుద్ధం'' అంది ఆన్నా.

''నువ్వు అర్థం చేసుకో దలచుకోవడం లేదు, నా రాత, యేం చెయ్యను'' అని తను చెప్ప దలచుకున్న దాన్ని పూర్తిగా చెప్పాలనే పట్టుదలతో ఆమె మాటకి అడ్డం వెడుతూ అన్నాడు అతను. ''నేను స్వతంత్రంగా వున్నానని నువ్వు వూహించుకోవడంలో అసందిగ్ధత వుంది అంటున్నాను'' అన్నాడు.

''ఆ విషయానికి సంబంధించి నువ్వు నిశ్చింతగా వుండచ్చు'' అని ఆమె ముఖం అటు తిప్పుకుని కాఫీ తాగడం మొదలుపెట్టింది.

ఆమె చిటికెన వేలుని చాచి కప్పుని యెత్తి నోటి దగ్గర పెట్టుకుంది. రెండు మూడు గుక్కలు తాగిం తర్వత వ్రాన్స్కీకేసి చూసింది. అతని ముఖ కవళికని బట్టి తన చెయ్యి, తన హావ భావాలు, పెదాలతో చేసే చప్పుడు సర్వం అతనికి యేవగింపు కలిగిస్తున్నాయని ఆమెకి అనిపించింది.

''మీ అమ్మ యేమనుకుంటూ వున్నా, యెలా నీకు పెళ్లి చెయ్యాలని అనుకుంటూ వున్నా నాకేం ఫరవాలేదు'' అని వొణికే చేత్తో కప్పు కింద పెడుతూ అంది.

''కాని మనం ఆ విషయాల గురించి మాట్లాడుకోవడం లేదు.''

''లేకేం, ఆ విషయం గురించే మాట్లాడుకుంటున్నాం. కాని వో విషయం చెప్తున్నా గుర్తుంచుకో, నాకు హృదయంలేని ఆడదంటే, ఆమె ముసల్ది కాని పడుచుదిగాని నీ తల్లి గానీ మరొకరు కాని నాకు యే ఆసక్తి లేదు. అలాంటి మనిషితో నాకు యే సంబంధమూ లేదు'' అంది.

''ఆన్నా, మా అమ్మ గురించి చులకనగా మాట్లాడవద్దని నిన్ను కోరుతున్నాను.''

''తన కొడుకు సుఖ సన్మానాలు యెందులో వున్నాయో తన హృదయంతో గ్రహించలేని ఆడమనిషికి హృదయం లేదు.''

''యిదుగో మళ్లీ కోరుతున్నాను నేను గౌరవించే మా అమ్మ గురించి చులకనగా మాట్లాడద్దు'' అని అతను గొంతు పెంచి, ఆమెకేసి చురచుర చూస్తూ అన్నాడు.

ఆమె యేమీ బదులు చెప్పలేదు. అతన్ని, అతని ముఖాన్ని చేతుల్ని తదేకంగా చూస్తూ ముందు రోజు తమ యిద్దరికీ మధ్య కుదిరిన సయోధ్యనీ అతను ఉద్రేకపూరితంగా లాలించడాన్నీ చిన్న చిన్న వివరాలతో సహా గుర్తు చేసుకుంది. 'సరిగ్గా యిదే రకంగా వేరే ఆడవాళ్లపట్లా లాలన చూపించి వుంటాడు, చూపించాలని అనుకుని వుంటాడు చూపిస్తాడు కూడా' అనుకొంది.

''మీ అమ్మ అంటే నీకు ప్రేమా గీమా యేం లేదు. వొట్టి మాటలు, మాటలు, మాటలు'' అని అతనికేసి ద్వేషంతో చూస్తూ అంది.

''అలా అయితే మనం...''

''విషయం ఆషీతుమీ తేల్చేసుకోవాలి. నేను తేల్చేసుకున్నాను'' అంది ఆమె. అని వెళ్లిపోబోయింది. ఆ సమయంలో యాష్విన్ గదిలోకి వచ్చేడు. ఆమె అతన్ని పలకరించి ఆగిపోయింది.

తన మనసులో సంవర్త ఝుంఝు రేగుతూ వున్న ఆ క్షణంలో, దారుణ పరిణామాలు సంభవించే జీవిత పర్వత సానువులో తను నుంచున్న ఆ క్షణంలో వొక పరాయి వ్యక్తి యెదుట, కొంచెం హెచ్చు తగ్గుల్లో యివాళ కాకపోతే రేపేనా సర్వం తెలుసుకునే ఆ వ్యక్తి యెదుట యెందుకు బేడిజం పోయిందో అది ఆమెకి తెలీదు. కాని ఆ క్షణంలో తన హృదయాంతర్గత సంవర్త ఝుంఝుని అణుచుకుని, కూర్చుండి పోయి అతనితో మాట్లాడ్డం మొదలుపెట్టింది.

''ఆఁ, యేమిటి విశేషాలు? రావాల్సింది రాబట్టేసేట్టేనా?'' అని యాష్విన్‌ని అడిగింది.

''విశేషాలు మామూలే. సొమ్మంతా చేతికి రాలేదు, బుధవారం నేను వెళ్లిపోవాలి. మీరెప్పుడు వెడుతున్నారు?'' అని యాష్విన్ కళ్ళు ముడిచి వ్రాన్‌స్కీకేసి చూస్తూ, వాళ్లిద్దరికీ మధ్య పోట్లాట జరిగిందని గ్రహించినట్టు అడిగేడు.

''ఎల్లుండి అనుకుంటున్నాం'' అన్నాడు వ్రాన్‌స్కీ.

''మీరు వెళ్లిపోవాలని చాలా రోజులుగా అనుకుంటున్నారుగా.''

''కాని యిప్పుడు ఖాయం అయింది'' అని ఆన్నా తిన్నగా వ్రాన్‌స్కీకేసి చూస్తూ అంది. యిక సయోధ్య జరిగే అవకాశం కలలో కూడా లేదన్నట్టు వుంది ఆ చూపు.

''పాపం ఆ పెవ్‌త్సోవ్‌ని చూస్తే మీకు జాలిగా లేదూ?'' అని యాష్విన్‌తో మాట సాగించింది.

''జాలి పుడుతుందా లేదా అని నేనెప్పుడూ ప్రశ్నించుకో లేదండీ, మన సంపదంతా యిక్కడుంది'' అని అతను పక్క జేబు తట్టి చూపిస్తూ అన్నాడు. ''యిప్పుడు నేను సంపన్నుణ్ణి. కాని యివాళ క్లబ్బుకి వెళితే అక్కణ్ణుంచి బికారిగా తిరిగి రావచ్చు. నాతో ఆడిన ప్రతి వాడికీ నా చొక్కా విప్పించెయ్యాలనే, మరి నేనూ అలానే చెయ్యాలనుకుంటూ వుంటా. అంచేత యిలా సాగుతూనే వుంటుంది, యిదే మజా'' అన్నాడు.

''కాని మీరు పెళ్లయిన వాళ్లయితే మీ ఆవిడ యేమను కుంటుందంటారు?'' అని అడిగింది ఆన్నా.

యాష్విన్ నవ్వేడు.

''అందుకనే మనం పెళ్లి చేసుకోలేదండీ, యిక చేసుకునే ఉద్దేశ్యమూ లేదు.''

''కాని ఆ హెల్సింగ్‌ఫర్స్?'' అని వ్రాన్‌స్కీ మాట కలుపుతూ ఆన్నాకేసి చూసి అన్నాడు. ఆమె చిరునవ్వు నవ్వుతోంది.

ఆన్నా అతని చూపు పసికట్టింది. వెంటనే ఆమె ముఖం జడంగా కటువుగా అయింది.

'యేమీ మరుగున పడలేదు, అన్నీ అలానే వున్నాయి' అని చెపుతున్నట్టుంది ఆమె ముఖం.

"నిజంగా మీరెప్పుడేనా ప్రేమించారా?" అని ఆమె యాష్విన్‌ని అడిగింది.

"అయ్యో రామా! వొకసారా! కాని సంగతి యేమిటంటే యెవళ్లేనా జూదం దగ్గర కూర్చున్నా rendez-vous[1] సమయం కాగానే సర్వదా అక్కణ్ణుంచి లేచి వెళ్లిపోగలుగుతారు. కాని మనం సాయంత్రం జూదం వేళ దాకానే ప్రేమ కలాపం సాగిస్తాం. మన వ్యవహారాల్ని అలా యేర్పాటు చేసుకుంటాం."

"నేనలాంటి వాటి గురించి మాట్లాడ్డం లేదు లెండి, కాని అసలైన ప్రేమ గురించి మాట్లాడుతున్నా" అంది. ఆమె హెల్సింగ్‌ఫర్స్ పేరు ప్రస్తావించాలనుకుంది, కాని వ్రాన్‌స్కీ వాడిన పదాన్ని రెట్టించడం యిష్టం లేకపోయింది.

అప్పుడు వోయ్‌తొవ్ వచ్చేడు. అతను వ్రాన్‌స్కీ దగ్గర గుర్రం కొంటున్నాడు. అన్నా లేచి గదిలోనుంచి బయటికి వెళ్లిపోయింది.

యింటినుంచి వెళ్లే ముందు వ్రాన్‌స్కీ ఆమె దగ్గరికి వెళ్లేడు. తను బల్లమీద యేదో వెతుకుతూ వున్నట్టు కనిపించాలనుకుంది. కాని తన నటనకి సిగ్గు పడి ఆమె జడంగా అతనికేసి వేరుగా చూసింది.

"యేం కావాలి?" అని ఫ్రెంచిలో అడిగింది.

"గాంబేతా వంశవృక్ష కాగితం, నేను అతనికా గుర్రాన్ని అమ్మేను" అని అతను అన్నాడు. 'నాకు సంజాయిషీలు యిచ్చుకునే వ్యవధి లేదు, అయినా వాటివల్ల ప్రయోజనమూ లేదు' అని మాటల్లోకంటే యెక్కువ స్పష్టంగా చెప్తున్నట్టు వుంది అతని స్వరం.

'నా దోషం అవగింజంత లేదు' అని వ్రాన్‌స్కీ అనుకుంటూ వున్నాడు. 'ఒక వేళ తనని తను శిక్షించుకో దలచుకుంటే సరే tant pis pour elle[2]' అనుకున్నాడు. కాని గదిలోనుంచి బయటికి వెళ్లిపోబోయేటప్పుడు అన్నా యేదో అందని అతనికి అనిపించింది. ఆమెపట్ల అతని హృదయంలో వొక్క సారి సానుభూతి ఉబికింది.

"యేదో చెపుతున్నావు, అన్నా?" అని అడిగేడు.

"యేమీ లేదు" అని ఆమె ముందటిలాగానే నిదానంగా జడంగా అంది.

'యేమీ లేదూ సరే tant pis' అని మళ్లీ కటువుగా మారిపోతూ అనుకుని, తిరిగి వెళ్లిపోయేడు. వెళ్లిపోతూ వుండగా అతనికి అద్దంలో పాలిపోయిన అన్నా ముఖమూ, కంపించే పెదాలూ యీషణ్మాత్రంగా కనిపించేయి. ఆగి వూరట కలిగించే మాట యేదన్నా చెప్పాలన్న ప్రేరణ అతనికి కలిగింది, కాని యేం చెప్పాల్సిందీ ఆలోచించుకొనే లోపలే అతని కాళ్లు బయటికి దారి తీశేయి. రోజంతా అతను యింటికి రాకుండా యెక్కడో వుండిపోయేడు. రాత్రి

---

[1] ప్రియురాల్ని కలుసుకునే (ఫ్రెంచి).

[2] అది ఆమెకే చెడ్డది (ఫ్రెంచి).

పొద్దుపోయేక తిరిగి యింటికి వచ్చేడు. ఆన్నాకి తల నొప్పిగా వుందనీ, అతన్ని తన దగ్గరికి రావద్దని చెప్పమందనీ పని మనిషి వ్రాన్స్కీకి చెప్పింది.

## 26

యింతకు ముందెన్నడూ యిలా పోట్లాట తర్వాత సర్దుబాటు అవకుండా వొక్క సారి కూడా రోజంతా గడవలేదు. యిదే మొదటి సారి. యిది పోట్లాట కాదు. అతని ప్రేమ పూర్తిగా చల్లబడినదన్న స్పష్టమైన స్వీకారం. లేకపోతే గుర్రం వంశవృక్షం కాగితం కోసం గదిలోకి వచ్చినప్పుడు తన వేపు అలా చూడడం ధర్మమేనా? తన వేపు చూశేడు; తన హృదయం ముక్కలు ముక్కలైపోతోందని గమనించేడు; తన పక్కనుంచి యేం పట్టనట్టుగా, కసాయి వదనంలో మాటాపలుకూ లేకుండా బయటికి వెళ్లిపోతాడా? అతని ప్రేమ చల్లబడడమే కాదు, తనని యేవగించుకుంటున్నాడు యేమంటే వేరే యెవత్తెనో ప్రేమిస్తున్నాడు — అది స్పష్టం.

అతను అన్న పరుష వాక్యాలన్నిట్నీ గుర్తు చేసుకుంటూ అతను తప్పకుండా అనాలనుకుని వుంటాడన్న పదాలని ఆన్నా వూహించుకుంది. అలా వూహించుకోవడంతో మరింతగా కోపం పెరిగిపోయింది.

'నేను మిమ్మల్ని ఆపడం లేదు' అని వుండేవాడు. 'మీరు మీ యిష్టం వొచ్చిన చోటికి పోవచ్చు. మీరు భర్త దగ్గర్నుంచి విడాకులు కోరకపోవడానికి బహుశా కారణం ఆయన దగ్గరికి తిరిగి వెళ్లవచ్చునని కావచ్చు. మంచిది వెనక్కి తిరిగి వెళ్లండి. వొకవేళ మీకు డబ్బు అవసరం వుంటే యిస్తాను. యెన్ని రూబుళ్లు కావాలి మీకు?'

అతను అంటాడని ఆమె కల్పించుకున్న మాటలలో గుండెలేని బండ రాతి మనిషి మాట్లాడగలిగిన మాటలు అతను మాట్లాడేడు. అందుగ్గాను అతన్ని ఆమె క్షమించలేకపోయింది, అతను ఆ మాటలన్నీ నిజంగానే అన్నట్టు.

'కాని నిన్న అనగా నిన్న కదూ సత్య సంధుడు, నిజాయితీపరుడు అయిన యీ మనిషి వొట్టు పెట్టుకుని నన్ను ప్రేమిస్తున్నానని చెప్పింది? యేం, యింతకు ముందు అనేక సార్లు నేను నిష్కారణంగా భగ్న హృదయురాల్ని అవలేదూ?' అని కొన్ని క్షణాల తర్వాత ఆమె తనకి తను అనుకొంది.

శ్రీమతి విల్సన్‌ని చూసి వచ్చిన రెండు గంటలు తప్పిస్తే ఆ రోజంతా ఆన్నా యిదే వూహలతో గడిపింది: సర్వం సమాప్తం అయినట్టేనా లేదా యింకా రాజీ కుదిరే ఆశ వుందా? తను వెంటనే వెళ్లిపోవాలా లేదా మరో సారి అతన్ని చూడాలా? రోజంతా అతని కోసం యెదురు చూసింది. సాయంత్రం తన గదికి వెళ్లిపోతూ అతనితో తనకి తల నొప్పిగా వుందని

చెప్పమని పని మనిషితో అని మరో ఆలోచన చేసింది. 'పని మనిషి చెప్పినా అతను నా దగ్గరికి వొస్తే అతను నన్ను ప్రేమిస్తూ వున్నట్టు. లేని పక్షంలో అంతా ముగిసిపోయినట్టు, అప్పుడు తీర్మానించుకుంటాను యేం చెయ్యవలసిందీ...'

రాత్రి వ్రాన్స్కీ బగ్గీ గుమ్మం దగ్గరికి రావడం వింది. అతను గుమ్మం దగ్గరి గంట మోగించడం వింది. అతని అడుగుల చప్పుడు, అతను పని మనిషితో మాట్లాడడం వింది. అతను పని మనిషి చెప్పిన మాటలు నమ్మి, మరింక యేమీ తెలుసుకో ప్రయత్నించకుండా తన గదికి వెళ్లిపోయేడు. అంటే అంతా ముగిసిపోయిందన్న మాట.

వ్రాన్స్కీ మనసులో తనపట్ల ప్రేమని తిరిగి ఉద్దీపన చెయ్యడానికి, అతన్ని దండించ డానికి, తన హృదయంలో తిష్ట వేసిన క్రోధపిశాచం వ్రాన్స్కీకి విరుద్ధంగా చేసే ఆ సంఘర్ష ణలో విజయం పొందడానికి యేక మాత్రసాధనా రూపంలో మృత్యువుని ఆమె స్పష్టంగా, తీక్ష్ణంగా కల్పన చేసుకొంది.

తాము వాజ్దవీజెన్స్కాయె గ్రామానికి వెళ్లినా వెళ్లకపోయినా యిప్పుడు వొకటే, తనకి విడాకులు వచ్చినా రాకపోయినా వొకటే, యే ప్రమేయమూ లేదు తనకి. ప్రమేయం వున్నదల్లా వొక్కటే — తను పగ తీర్చుకోవాలి.

ఆమె మామూలుగా వేసుకునే మోతాదులో నల్లమందు తీసుకోబోతూ చనిపోవడానికి మొత్తం సీసా అంతా వేసేసుకోవడం చాలనుకొంది. అది చాలా తేలికగా సునాయాసంగా కనిపించి ఆమె మళ్లీ అతను యెలా యాతన పడేదీ, పశ్చాత్తాప్పడేదీ, అంతా మించిపోయేక తన స్మృతిని ఆరాధించేదీ సంతుష్టిగా వూహించుకుంది. ఆమె మంచంమీద కళ్లు తెరుచుకుని వెల్లకిలా పడుకుంది. దాదాపు పూర్తిగా కాలిపోయిన కొవ్వొత్తి వెలుతురులో కప్పుమీద గచ్చు చేసిన నగిషీ పీఠంకేసీ సరంబీమీద పడే కొయ్య తెర నీడకేసీ చూస్తూ వుంది. తను లేకపోయాక, అతనికి తను వొక స్మృతిగా మిగిలేక అతని హృదయావేదనలు యెలా వుండేదీ కట్టెదుట కనిపించేటట్టు కల్పన చేసుకుంది. 'అలాంటి కసాయి మాటలు నేను యెలా అన్నాను' అను కుంటాడతను. 'ఆమెతో యే మాటా పలుకూ అనకుండా గదిలోనుంచి యెలా వెళ్లిపో గలిగేను? యిప్పుడు ఆమె లేదు. శాశ్వతంగా నన్ను వదిలి వెళ్లిపోయింది. ఆమె 'అక్కడ' వుంది...' వున్నట్టుండి కొయ్య తెర నీడ సరంబీమీద కదిలింది, మొత్తం నగిషీ పీఠం అంతా కమ్మింది, అన్ని వేపులనుంచీ నీడలు లేచి కమ్ముకుంటూ వచ్చేయి. క్షణ మాత్రం సేపు అవి వెనక్కి తగ్గేయి, వెనక్కి పరిగెత్తేయి, కాని మళ్లీ ఆ నీడలు నూతన స్ఫూర్తితో వొక దానిమీదకి వొకటి పాకేయి, కంపించేయి, వొక దానితో వొకటి కలిశాయి. అంటే, మొత్తం అంతా ఛాయావృతమై అంధకార బంధురమైపోయింది. 'మృత్యువు!' అనుకొంది ఆన్నా. ఆమెని యెంతటి ఘోరమైన భీతి ఆవహించిందంటే చాలా సేపటిదాకా తను యెక్కడ వున్నదీ ఆమెకి అర్థం కాలేదు. కాలి పోయిన కొవ్వొత్తి బదులు కొత్త దాన్ని వెలిగించాలనుకుంది. వొణికే చేతులతో చాలా సేపటిదాకా అగ్గి పెట్టె కోసం వెతకలేకపోయింది. 'వుహుఁ, కాదు,

బతికే వుండాలి! నేను అతన్ని ప్రేమిస్తున్నాను. తనూ నన్ను ప్రేమిస్తున్నాడు! యిలాంటి మాట పట్టింపులు యింతకు ముందూ వొచ్చేయి, అవే పోతాయి' అనుకొంది ఆమె. జీవితం కేసి మళ్ళీ తిరిగివచ్చిన సంతోషంతో ఆనందాశ్రువులు చెక్కిళ్ళమీద జారడం ఆమెకి అనుభూతం అయింది. తన భయాలనుంచి తన్ను రక్షించుకోవడం కోసం ఆమె గబగబా వ్రాన్స్కీ గదిలోకి వెళ్ళింది.

వ్రాన్స్కీ గాఢంగా నిద్రపోతున్నాడు. ఆమె అతని దగ్గరికి వెళ్ళి కొవ్వొత్తి కాంతిలో అతని ముఖంకేసి చాలా సేపు చూస్తూ వుండిపోయింది. అతన్ని అక్కడ అలా పడుకుని వుండడం చూడగానే అతనిపట్ల ఆమె హృదయంలో యెంత ప్రేమ పొంగిందంటే, అతన్ని చూస్తూ వుండగానే ఆమె ప్రేమాశ్రువుల్ని నిభాయించుకో లేకపోయింది. కాని అతను గనక కళ్ళు తెరిస్తే తనే వొప్పు అన్న ఆ జడ దృక్కుతో ఆమెని చూస్తాడు అని ఆమెకి తెలుసు. ఆమె తన ప్రేమ గురించి మాట్లాడక ముందే అతను తప్పు అని ఆమె రుజువు చెయ్యాలి. అందుకని అతన్ని లేపకుండానే ఆమె తన గదిలోకి వెళ్ళిపోయింది. మరో మోతాదు నల్లమందు తీసుకున్నాక తెల్లవారకట్ల వేళకి అర్ధ సుషుప్తిలోకి జారింది, కాని ఆమె తెలివిడి మాత్రం పూర్తిగా పోలేదు.

తెల్లవారే ముందు ఆమెకి ఆ భయంకరమైన పీడకల, వ్రాన్స్కీతో సంబంధం యేర్పడక ముందు కొన్ని సార్లు వచ్చిన ఆ భయంకరమైన పీడకల వచ్చింది. ఆమెకి మెలుకువా వచ్చింది. జీబురు గడ్డం వున్న వో ముసలి రైతు యేదో యినప దానిమీద వొంగి, ఫ్రెంచిలో అర్థం పర్థం లేకుండా యేదో గొణుక్కుంటూ యేమిటేమిటో చేస్తున్నాడు. యీ భయంకర పీడకలలో యెప్పుడు జరిగేటట్టుగానే (యిదే యీ పీడకలని భయంకరం చేసేది) ఆ చిన్న రైతు ఆమె గురించి పిసరు కూడా పట్టించుకోకుండానే యినప ముక్కతో ఆమెమీద ఆ భయంకరమైన దాన్ని చేస్తున్నాడు. భయంతో ఆమెకి చెమటలు పట్టేశాయి. తక్కున లేచింది.

మెలుకువ రాగానే పొగమంచులోనుంచి వచ్చినట్టుగా ముందటి రోజు జ్ఞాపకాలు ఆమెకి స్ఫురించేయి.

'వూఁ, అవును, పోట్లాట జరిగింది. అంతకు ముందు కొన్ని సార్లు జరిగిన లాంటిది జరిగింది. నాకు తల నొప్పిగా వుందని అన్నాను, అతను నా గదికి రాలేదు. రేపు మేం వెళ్ళిపోతున్నాం. అతని దగ్గరికి వెళ్ళి ప్రయాణానికి తయారవమనాలి' అని తనలో తను అనుకొంది. అతను తన గదిలో వున్నాడని తెలిసి అతని దగ్గరికి వెళ్ళింది. డ్రాయింగ్ రూమ్‌లో నుంచి వెడుతూ వుంటే ఆమెకి గుమ్మం దగ్గర బండి ఆగిన చప్పుడు వినిపించింది. ఆమె కిటికీలోనుంచి బయటికి చూసింది. బండి కనిపించింది. వూదారంగు టోపీ పెట్టుకున్న వో పడుచు అమ్మాయి తల యివతలికి పెట్టి, గుమ్మం దగ్గర గంట మోగించే నౌకరుతో యేదో చెప్తోంది. హాల్లో యేవో మాటలు మాట్లాడుకున్నాక, యెవళ్ళో మెట్లు యెక్కి పైకి వెళ్ళారు. అప్పుడు అన్నాకి డ్రాయింగ్ రూమ్ దగ్గర్లో వ్రాన్స్కీ అడుగుల చప్పుడు విని

పించింది. అతను చురుగ్గా మెట్లు దిగి వెళ్లేడు. అన్నా మళ్లీ కిటికీ దగ్గరికి వెళ్లింది. అతను తలకి టోపీ లేకుండా మెట్లు దిగుతూ బండి దగ్గరికి వెడుతున్నాడు. వూదారంగు టోపీ పెట్టుకున్న పడుచామె అతనికి వో పేకెట్ అందించింది. వ్రాన్‌స్కీ చిరునవ్వుతో ఆమెకి యేదో చెప్పాడు. బండి వెళ్లిపోయింది. వ్రాన్‌స్కీ చురుగ్గా అడుగులు వేస్తూ మెట్లు యెక్కి తిరిగి వచ్చేడు.

అన్నా మనసుని కమ్మిన పొగమంచు హఠాత్తుగా విడిపోయింది. ముందటి రోజు స్మృతులు ఆమె వ్యథిత హృదయాన్ని మరింతగా పిండేయి. అంత జరిగేక అదే యింట్లో రోజంతా గడిపేటంతగా తనని తను యెలా నీచ పరుచుకుందో ఆమె వూహకి అందలేదు. తన నిర్ణ యాన్ని చెప్పేందుకు ఆమె అతని గదిలోకి వెళ్లింది.

"ఆ వచ్చిన వాళ్లు ప్రిన్సెస్ సొరోకినా, ఆమె కూతురు. Maman పంపించిన సొమ్ము, కాగితాలు యివ్వడానికి వచ్చేరు. నిన్న అవి నాకు అందలేదు. నీ తల నొప్పి యెలా వుంది? తగ్గిందా?'' అని అతను తొణక్కుండా మామూలుగానే అడిగేడు. ఆమె ముఖంమీద కని పించే మునురునీ, ముటముటనీ గమనించకుండా, అర్థం చేసుకోకుండా వుండాలనే కోరిక తోనే అలా చెప్పేడు.

ఆమె యేమీ మాట్లాడకుండా, తదేకంగా అతనికేసే చూస్తూ గది మధ్యలో నుంచుంది. అతను ఆమెకేసి చూసి, లిప్త కాలం పాటు కనుబొమలు ముడుచుకుని ఉత్తరం చదువుకుంటూ వుండిపోయేడు. ఆమె గిరుక్కున వెనక్కి తిరిగి మెల్లిగా గదిలోనుంచి బయటికి వెళ్లిపోయింది. అతనామెని అప్పుడేనా వెనక్కి పిలిచి వుండేవాడే, కాని ఆమె గుమ్మం దగ్గరికి వెళ్లేదాకా యేమీ మాట్లాడకుండా వుండిపోయేడు. అతను కాగితాలు తిప్పే చప్పుడు తప్ప యేమీ విని పించలేదు.

"ఆఁ, చూడు'' అని వ్రాన్‌స్కీ ఆమె గడప దాటి వెళ్లిపోయే సమయంలో అన్నాడు. "మనం రేపు వెళ్లిపోవడం ఖాయమే కదా?''

"మీరు వెళ్లిపోతున్నారు, నేను కాదు'' అని అతని వేపు తిరుగుతూ అంది ఆమె.

"అన్నా, యిలా బతకడం అసాధ్యం...''

"మీరు వెళ్లిపోతున్నారు నేను కాదు'' అని ఆమె రెట్టించింది.

"యిది భరించ శక్యం కాకుండా పోతోంది.''

"మీరు... మీరు యిందుగ్గాను పశ్చాత్తాప పడతారు'' అని, ఆమె గదిలోనుంచి బయటికి వెళ్లిపోయింది.

ఆమె యీ మాటలు అన్న నిరాశాపూరిత ధోరణి చూసి భయపడి వ్రాన్‌స్కీ వొక్క ఉదుట్న లేచేడు. ఆమె వెనక్కాల పరిగెత్తి వెళ్లి వుండేవాడే, కాని వో క్షణం సేపు పస్తాయించి పళ్లు పటపట కొరుకుతూ, ముఖం ముడుచుకుని కూర్చుండిపోయేడు. అన్నా బెదిరింపు అతన్ని రెచ్చ గొట్టింది. ఆమె బెదిరింపు చాలా నీచంగా కనిపించింది. 'నేను అన్ని ప్రయత్నాలూ

చేసి చూశాను. యిక మిగిలిందల్లా యేం పట్టించుకోకుండా వదిలెయ్యడం' అనుకున్నాడు. తర్వాత అతను వూళ్ళోకి వెళ్ళడానికీ, కాగితాలమీద సంతకాలు చేయించుకుందుకు తల్లి దగ్గరికీ వెళ్ళడానికీ తయారవడం మొదలెట్టేడు.

చదువుకునే గదిలోనూ, భోజనాల గదిలోనూ అతని అడుగుల చప్పుడు అన్నా వింది. అతను డ్రాయింగు రూమ్ బయట ఆగేడు కాని ఆమె వున్న గదిలోకి వెళ్ళలేదు. తను లేక పోయినా వోయ్‌తొవ్ వస్తే గుర్రం తోలుకుపోనిమ్మని పురమాయింపు చేశాడు. తర్వాత బండిని తోలుకు రావడం, తలుపు తెరవడం, వ్రాన్‌స్కీ బయటికి వెళ్ళిపోవడం అన్నాకి వినిపించేయి. కాని మళ్లీ అంతట్లోనే అతను హాల్లోకి వచ్చేడు. యెవళ్లో పరిగెత్తుకుంటూ మెట్లెక్కి పైకి వెళ్లేరు. ఆ మనిషి అతని నౌకరు. అతను గ్లవ్స్ మరిచిపోయేడు, అతని నౌకరు వెళ్లి వాటిని తీసుకొచ్చేడు. ఆమె కిటికీ దగ్గరికి వెళ్లింది. అతను కళ్లు పైకి యెత్తకుండా గ్లవ్స్ తీసుకుని, బండి తోలేవాణ్ణి వీపుమీద తట్టి యేదో చెపుతూ వుండడం కనిపించింది. తర్వాత కిటికీకేసి కన్నెత్తి చూడకుండా కాలుమీద కాలు వేసుకు తన మామూలు ధోరణిలో కూర్చున్నాడు. గ్లవ్స్ తొడుక్కుంటూ వుంటే బండి మలుపు తిరిగి వెళ్లిపోయింది.

## 27

'వెళ్లిపోయేడు. సర్వం సమాప్తం' అని కిటికీ దగ్గర నుంచుని అన్నా అనుకొంది. వెంటనే, కొవ్వొత్తి ఆరిపోయినప్పుడు చీకట్లో ఆమెని పెన వేసుకున్న భయాలు, ఆ భయంకర స్వప్న విపన్నత వొకదానితో వొకటి మిళితం అయిపోయేయి. గజగజ వొణికించే ఘోర భీతి ఆమె హృదయాన్ని అదిమి పట్టుకుంది.

''వీల్లేదు, వీల్లేదు, అలా జరగడానికి వీల్లేదు'' అని ఉచ్చైస్స్వరంతో అరిచి, గదిలోనుంచి బయటికి ఉరుకుతూ గట్టిగా గంట మోగించింది. వివిక్తంగా వుండడం మహత్తర భీతి కారకం అయి, నౌకరు వచ్చేలోపునే ఆమె అతనికేసి బయటికి పరిగెత్తింది.

''కౌంట్ యెక్కడికి వెళ్లారో తెలుసుకోండి'' అని నౌకరుతో చెప్పింది.

వ్రాన్‌స్కీ అశ్వశాలకి వెళ్లేడని నౌకరు చెప్పేడు.

''తమరు గనక యెక్కడికేనా వెళ్లాలనుకుంటే బండిని యిప్పుడే తిరిగి వెనక్కి పంపిస్తారని తమతో చెప్పమని నాకు పురమాయించేరు.''

''బాగుంది, కాని ఆగండి. యిప్పుడే వో చీటీ రాసిస్తాను, చీటీ తీసుకుని మిహాయీల్‌ని వెంటనే అక్కడికి పంపండి. వెంటనే'' అని అన్నా కూర్చుని చీటీ రాసింది:

''తప్పు నాదే. యింటికి రా. మనం వివరాలు మాట్లాడుకుని తేల్చుకోవాలి. దేవుడిమీద వొట్టు రా, నాకు మహా భీతిగా వుంది.''

అన్నా దాన్ని మూసి నౌకరుకి యిచ్చి పంపింది.

ఒంటరిగా వుండడానికి భయం వేసి అతని వెనక్కాలే నడుస్తూ చంటి పిల్లల గది దగ్గరికి వెళ్ళింది.

'అరె, యేమైంది, వాడు కాదే, వాడు కాదు. వాడి నీలం కళ్ళు, కమ్మని బెరుకైన చిరునవ్వు యేవి?' అని అన్నా మనసుకి మొదట అనిపించింది. చక్కని బుగ్గలు, యెర్రటి చెక్కిళ్ళు నల్లని ఉంగరాల జుట్టు వున్న కూతుర్ని చూసి అలా అనుకొంది. ఆమె మనసంతా గానటబీసటగా వుండడంతో పిల్లల గదిలో సెర్యోష కనిపిస్తాడని అనుకొంది. వాడి బదులు ఆ పిల్ల కనిపించింది. ఆ పిల్ల బల్ల దగ్గర కూర్చుని ఆగకుండా, నీళ్ల సీసా మూతతో జోరుగా కొడుతూ ఆడుకుంటూ వుంది. తల పైకి యెత్తి నల్లని ద్రాక్షపళ్లలాంటి కళ్లతో తల్లికేసి శూన్యంగా చూసింది. అన్నా తనకి ఒంట్లో శుభ్రంగా వుందనీ, మర్నాడు వూరికి వెళ్లిపోతున్నామనీ ఇంగ్లీషు గవర్నెస్ అడిగిన దానికి జవాబు చెప్పి పాప పక్కన కూర్చుంది. సీసా మూతని ఆమె ముందు తిప్పడం మొదలెట్టింది. కాని పాప జోరుగా గంట మోగించి నట్టుగా నవ్వడం, కనుబొమలు పైకి యెత్తడం అన్నాకి వ్రాన్స్కీని గుర్తు చేశాయి. దాంతో అన్నా గబగబా లేచి, ఉబికి వచ్చే వెక్కిళ్లని ఆపుకుంటూ బయటికి వెళ్లిపోయింది. 'నిజంగా అంతా సమాప్తం అయిపోయినట్టేనా? వుహుఁ, అలా జరగదు' అనుకొంది. 'వెనక్కి తిరిగి వస్తాడు. కాని ఆ చిరునవ్వుకీ సొరోకినాతో మాట్లాడిన తర్వాత కలిగిన ఉత్సాహానికీ యేం జవాబు చెప్తాడు? పోనీలే, యేం చెప్పకపోయినా ఫరవాలేదు, అతన్ని నమ్ముతా, నమ్మకపోతే మిగిలిందల్లా ఒక్కటే నాకు — అయినా నేను దాన్ని కోరను' అనుకుంది.

గడియారం చూసింది. పన్నెండు నిముషాలు గడిచేయి. 'నా చీటీ అంది వుంటుంది, వెనక్కి వస్తూ వుంటాడు. యెక్కువ సేపు పట్టదు, పది నిముషాలు... ఒక వేళ అతను రాకపోతే? అబ్బెబ్బె, అలా జరగదు. కాని నేను యేడుస్తూ వున్నట్టు అతనికి తెలియకూడదు నా కళ్లని బట్టి. వెళ్లి కడుక్కుంటాను. అరె, తల దువ్వుకోలేదా?' అనుకొంది. ఆమెకి గుర్తు రాలేదు. చేత్తో తల తడిమి చూసుకుంది. 'ఆఁ, తల దువ్వుకున్నాను. కాని యెప్పుడు దువ్వుకున్నానో గుర్తే రావడం లేదు.' చేత్తో తడుముకున్నా నమ్మకం కలగకపోవడంతో అద్దం దగ్గరికి వెళ్లి నిజంగా తల దువ్వుకున్నదీ లేనిదీ చూసుకుంది. తల దువ్వే వుంది. అయినా యెప్పుడు దువ్వుకున్నదీ ఆమెకి గుర్తు రాలేదు. 'యెవరది?' అని వింతగా మిలమిల మెరిసే కళ్లతో భయ భ్రాంతంగా అద్దంలో ప్రతిబింబిస్తూ వున్న వదనంకేసి తేరిచూసి అనుకొంది. 'నేనే!' అని వెంటనే ఆమెకి తట్టింది. ఆపాదమస్తకం తన ప్రతిబింబం చూసుకోగానే హఠాత్తుగా తన శరీరంమీద అతని చుంబనాలు ఆమెకి స్పర్శనీయం అయి ఒక అనిర్వచనీయ పులకరింత నాడుల్లో దూసుకుపోయింది. ఆమె భుజాలు పైకి యెత్తి, చేతిని పెదాల దగ్గర అదుముకుని ముద్దు పెట్టుకుంది.

'యేమిటెది? నాకు మతి భ్రమిస్తోందా?' అనుకొని పడుకునే గదిలోకి వెళ్ళింది. అన్నుష్కా ఆ గదిని తుడుస్తోంది.

''అన్నుష్కా'' అని ఆమె ముందు నిలబడి, ఆమెకేసి చూస్తూ అంది. కాని తర్వాత యేం చెప్పాలో బోధ పడింది కాదు.

''మీరు దాలీగారి దగ్గరికి వెళ్ళాలనుకున్నారు'' అని అన్నుష్కా ఆమె మనసులో మాట గ్రహించినట్టు అంది.

''దాలీగారి దగ్గరకా? అవును, వెడతాను.''

'గుర్రాల శాల దగ్గరికి వెళ్ళడానికి పదిహేను నిముషాలు, రావడానికి పదిహేను నిముషాలు పడుతుంది. అతను తిరిగి వస్తూ వుంటాడు. యే క్షణంలోనేనా రావచ్చు' అనుకొంది. గడియారం తీసి చూసింది. 'కాని నన్నిలా వదిలేసి తనెలా వెళ్ళగలిగేడు? సర్దుబాటు అవ కుండా యెలా మనశ్శాంతిగా వుండగలడు?' అని ఆమె కిటికీ దగ్గరికి వెళ్ళి రోడ్డుమీదకి చూస్తూ అనుకొంది. యీ పాటికి అతను వెనక్కి తిరిగి వచ్చేయాలి. తను పొరపాటుగా గుణించుకుందేమో అనుకుని మళ్ళీ వ్రాన్స్కీ యెప్పుడు వెళ్ళిందీ గుర్తు చేసుకుని నిము షాలు లెక్క పెట్టడం మొదలుపెట్టింది.

తన గడియారం సరిగా వుందో లేదో చూసుకుందుకు పెద్ద గడియారం దగ్గరికి వెళ్ళబోతూ కిటికీ దగ్గర్నుంచి తిరగ్గానే ఆమెకి బయట బండి చప్పుడు వినిపించింది. బండి వచ్చి ఆగింది. అతని బండి. కాని యెవళ్ళూ మెట్లు యెక్కి వస్తూ వున్న జాడ తెలియలేదు. కిందనుంచి ఆమెకి మాటలు వినిపించేయి. చీటీ యిచ్చి తను పంపిన మనిషి అతను. ఆ బండిలో తిరిగి వచ్చేడు. ఆమె అతని దగ్గరికి వెళ్ళింది.

''కౌంట్‌గారు దొరకలేదండి. ఆయన నిజెగొరోద్స్కయా స్టేషన్‌కేసి వెళ్ళిపోయేరు.''

''యేం కావాలి నీకు, యేం కావాలి?'' అని ఉత్సాహంగా కనిపించే యెర్ర ముఖం మిహాయిల్‌ని అడిగింది, అతను ఆమె రాసిన చీటీని తిరిగి యిస్తున్నప్పుడు.

'చీటీ అతనికి అందనే లేదు!' అని ఆమెకి గుర్తు వచ్చింది.

''యిదే చీటీ తీసుకువెళ్ళి ఆయన తల్లిగారి యింటికి వెళ్ళి అంద చెయ్యి. తెలుసు కదా యిల్లు? వెంటనే యే కబురూ నాకు పట్టావాలి'' అని అతనితో అంది.

'మరి నేనేం చెయ్యాలి?' అనుకొంది. 'ఆఁ, నిజమే, దాలీ దగ్గరికి వెళతాను. లేకపోతే బుర్రకి పిచ్చెక్కి పోతుంది. యీ చీటీతోబాటుగా టెలెగ్రామ్ కూడా యిస్తాను'' అనుకొని యీ తంతి వార్త రాసింది:

''మీతో అత్యవసరంగా మాట్లాడాలి, వెంటనే రండి.''

తంతి పంపేక ఆమె బట్టలు మార్చుకుందుకు లోపలికి వెళ్ళింది. ఆమె బట్టలు వేసుకుని, టోపీ కూడా పెట్టుకున్నాక లావుగా, నిదానంగా వున్న అన్నుష్కా కళ్ళల్లోకి

చూసింధి. అన్నుష్కా దయార్ద్రపూరిత వెలిబూదిరంగు చిన్న కళ్లల్లో సహానుభూతి మిణుకుమనడం స్పష్టంగా కనిపించింది.

"అన్నుష్కా బుజ్జీ! యేం చెయ్యను నేను?" అని ఆమె వెక్కుతూ నిస్సహాయంగా కుర్చీలో కూలబడుతూ అంది.

"యెందుకమ్మా అంత కళవిళ పడిపోతారు? మధ్యమధ్య అలా జరుగుతూ వుంటుంది. వొక్క సారి అలా తిరిగివస్తే అంతా సర్దుకుంటుంది" అని అన్నుష్కా అంది.

"అవును, వెడతాను" అని ఆన్నా సంబాళించుకుని లేస్తూ అంది. "నేను లేనప్పుడు యేదన్నా టెలెగ్రామ్ వొస్తే దాలీగారింటి దగ్గరికి పంపించు... వుహుం, వద్దులే, నేనే తిరిగి వచ్చేస్తాను" అంది.

'అవును, నేనేమీ ఆలోచించకూడదు. యేదో వొకటి చెయ్యాలి నేను. అలా వెళ్లాలి, అన్నిటికంటే ముఖ్యం యీ యిల్లు వొదిలి వెళ్లాలి' అని గుండె దడదడ కొట్టుకునే చప్పుడు వింటూ అనుకొంది. గబగబా బయటికి వెళ్లిపోయి బండి యెక్కింది.

"యెక్కడికి తోలుకెళ్లమంటారమ్మా?" అని బండి యెక్కే ముందు బండి తోలే ప్యోత్ర్ అడిగాడు.

"అబ్లాన్స్కీల యింటికి, జ్నామెంకా వీధికి."



## 28

వాతావరణం బాగుంది. పొద్దుట పూట అంతా వాన కురుస్తూనే వుంది. అంతకు ముందే ఆకాశం తేట పడింది. యిళ్ల కప్పులు, కాలిబాటమీద పరిచిన పెంకులు, రాస్తామీద పరిచిన యిటికలు, బండి చక్రాలు, తోలు, రాగి, యిత్తడి పూతలు అన్నీ మే నెల యెండలో మెరుస్తున్నాయి. మధ్యాహ్నం మూడయింది. రాస్తా మంచి రద్దీగా వుండే సమయం అది.

ఆన్నా సౌకర్యంగా వున్న బండిలో వో మూల కూర్చుంది. బూడిదరంగు గుర్రాలు చకచక లాగుతూ వుంటే బండి కమానుమీద అలసంగా వూగుతూ సాగుతోంది. బళ్ల చక్రాల తిడిమి ఆడ్డూ ఆపూ లేకుండా చెవిన పడుతూనే వుంది. ఆరు బయట క్షణక్షణమూ మారిపోతూ వున్న ఆ దృశ్య నేపథ్యంలో అన్నా మళ్లీ వొక సారి గడిచిన రోజుల ఘటనలమీదకి దృష్టి తిప్పింది. ఆమెకి తన స్థితి యింటి దగ్గర వున్న దానితో చూసుకుంటే భిన్నంగా కనిపించింది. యిప్పుడు మృత్యు ఆలోచనలు అంత భయంకరంగా, స్పష్టంగా రావడం లేదు. నిజానికి తన మృతి తప్పదు అన్న వూహే రావడం లేదు. అంత అవమానకరమైన పరిస్థితిలో పడినందుకు తనని తను తిట్టుకుంది. 'నన్ను క్షమించమని అతన్ని వేడుకుంటున్నాను. అతని ముందు లొంగిపోయేను. తప్పు నాదే అని చెప్పి వొప్పేసుకున్నాను. యెందుకని? అతను

లేకపోతే బతకలేనా?' అనుకుంది. కాని యీ ప్రశ్నకి జవాబు చెప్పుకోకుండానే వీధిలో వున్న సైన్ బోర్డులని చదవడం మొదలుపెట్టింది. 'ఆఫీసు, గోడౌన్. దంత వైద్యుడు. ఆఁ, దాలీకి యావత్తూ చెప్పేస్తాను. ఆమెకి వ్రాన్‌స్కీ అంటే యిష్టం లేదు. నాకు సిగ్గు రావచ్చు బాధ కలగచ్చు, అయినా కూడా ఆమెకి మొత్తం చెప్పేస్తాను. ఆమెకి నేనంటే యిష్టం. ఆమె సలహా అడుగుతాను. అతనికి పాదాక్రాంతం గాను. నేనేం చెయ్యాలో చెందాలో అతను నాకేం చెప్పక్కర్లేదు. ఫిలీపావ్ రొట్టెల దుకాణం. వీళ్లు తమ పిండిని పీటర్స్‌బుర్గ్ పంపుతారట. మాస్కో నీళ్లు యెంత మంచివి. మితీష్చి నూతులు,* అట్లు కూడా.' చాలా చాలా యేళ్ల కితం ఆమెకి పదిహేడేళ్ల వయసప్పుడు తన పిన్నితో కలిసి త్రోయిత్సా మఠానికి* వెళ్లిన సందర్భం గుర్తు వచ్చింది. 'గుర్రం బగ్గీలోనే. నేనేనా ఆ పిల్లని! యెర్ర చేతుల దాన్ని? అప్పట్లో అందని అందాలుగా, మురిపించేవిగా కనిపించినవి యెన్ని యిప్పుడు పనికిమాలిన అయిపోలేదు! అప్పట్లో వున్న యెన్నో శాశ్వతంతా చెయ్యి జారిపోలేదు? యింత నీచంగా అవమానం భరించాల్సి వస్తుందని అప్పట్లో నమ్మి వుండేదాన్నా? నా చీటీ అందితే అతను యెంత గర్వంగా తృప్తిగా మీసం మెలి వేసుకుంటాడు! కాని అదేమిటో చూపిస్తాను... అబ్బ, ఆ రంగు యెంత వాసనగా వుంది! యెందుకనో యెప్పుడూ యిళ్లు కడుతూనే వుంటారు, రంగులు పూస్తూనే వుంటారు? టోపీలు గౌన్లు' అని చదివింది. వొకాయన తలవంచి ఆమెకి వందనం చేశాడు. అతను అన్నుష్కా మొగుడు. 'మనమీద పడి తినే పరాన్న భుక్కులు' అని వ్రాన్‌స్కీ అన్న మాటలు అన్నాకి గుర్తు వచ్చేయి. 'మనమీద? 'మన' యెందుకు? భయంకరమైన విషయం యేమంటే గతాన్ని సమూలం పెకలించెయ్యలేం. సమూలం పెకలించెయ్యలేం, కాని ఆ జ్ఞాపకాల్ని మరుగు పరచగలం. నేను మరుగు పరుస్తాను.' అప్పుడామెకి కరేనిన్‌తో గడిపిన జీవితం, దాన్ని తను యెలా స్మృతి పథంనుంచి మరుగున పడేసిందీ గుర్తు వచ్చింది. 'నేను రెండో భర్తని కూడా వదిలిపెట్టేస్తున్నాననీ, అంచేత నేను సబబైన పని చెయ్యడం లేదనీ దాలీ అనుకుంటుంది. నేను సబబు అని చూపించాలను కుంటునట్టు అక్కడికి! నేనలా చెయ్యలేను' అని గొణుక్కుంది. ఆమెకి యేడవా లనిపించింది. మరుక్షణంలోనే ఆమె ఆ ఆడపిల్లలు దేన్ని చూసి ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నారో అనుకొంది. 'ప్రేమ గురించేమో? పాపం, వాళ్లకి తెలీదు యిందులో యెంత పీడ, అవమానం వున్నదీనీ... వృక్ష పథం... పిల్లలు. ముగ్గురు పిల్లలు గుర్రం ఆట ఆడుకుంటూ పరిగెత్తుతున్నారు. సెర్యోష! నేను సర్వం పోగొట్టుకుంటున్నాను, అతన్ని వెనక్కి తెచ్చుకోను. అవును, అతను వెనక్కి రాకపోతే సర్వం పోగొట్టుకుంటాను. బహుశా అతనికి రైలు అందలేదేమో, యీ పాటికి వచ్చే వుంటాడు. అదిగో మళ్లీ అవమానం కోరుకుంటున్నాను' అని తనలో తను అనుకొంది. 'దాలీ దగ్గరికి వెళ్లి యావత్తూ చెప్పేస్తాను. నేను నిర్భాగ్యురాల్ని అనీ, నాకలా జరగాల్సిందేననీ, తప్పంతా నాదేననీ అయినా నిర్భాగ్యురాల్ననీ నన్ను ఆదుకొమ్మనీ చెప్పేస్తాను. యీ గుర్రాలు, యీ బగ్గీ — అబ్బ, యీ బగ్గీలో నామీద నాకు యెంత అసహ్యంగా

వుంది. ప్రతీదీ అతనిదే. కాని యిదే ఆఖరి సారి, యిక మళ్లీ వీటి మొహం చూడను.'

దాలీకి యేం చెప్పాల్సిందీ వాటి గురించే ఆలోచించుకుంటూ, లోపల్లోపల యింకా యింకా కసి పెంచుకుంటూ అన్నా మెట్లు యెక్కింది.

''చుట్టాలెవరన్నా వున్నారా?'' అని హాల్లో నౌకర్ని అడిగింది.

''లేవిన్‌గారి భార్య కిట్టీగారు వచ్చేరు'' అని నౌకరు చెప్పేడు.

'కిట్టీ! వ్రాన్‌స్కీ ప్రేమించిన ఆ కిట్టీ!' అనుకొంది అన్నా. 'ఆమె, అతను ప్రేమగా గుర్తు తెచ్చుకునే ఆమే! ఆమెని పెళ్లి చేసుకోలేకపోయానే అని విచారిస్తూ వుంటాడు. కాని నన్ను యేవగింపుతో స్మరించుకుంటాడు, నాతో సంబంధం పెట్టుకున్నందుకు బాధ పడుతూ వున్నాడు.'

అన్నా అక్కడికి వెళ్లేటప్పటికి అక్కచెల్లెళ్లిద్దరూ చంటి బిడ్డకి పాలు పట్టించడం గురించి మాట్లాడుకుంటున్నారు. తమ మాటలకి అంతరాయం కలిగించిన అన్నాని పలకరించడానికి దాలీ వొక్కత్తీ యివతలికి వచ్చింది.

''అయితే యింకా వెళ్లలేదన్న మాట! నేనే నీ దగ్గరకి వద్దామనుకున్నా. మీ తమ్ముడి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది.''

''మాకూ వచ్చింది టెలెగ్రామ్'' అని కిట్టీ కనిపిస్తుందేమోనని చుట్టూతా చూస్తూ అంది అన్నా.

''కరేనిన్‌కి కావాల్సిందేమిటో తనకి అర్థం అవడం లేదనీ, కాని సమాధానం పంపకుండా రాననీ రాశారు.''

''యెవరో చుట్టాలొచ్చే రనుకున్నాను మీ యింటికి. యేదీ ఆ ఉత్తరం నేను చదవచ్చా?''

''కిట్టీ వచ్చింది'' అని దాలీ యిబ్బంది పడుతూ అంది. ''చంటి పిల్లల గదిలో వుంది. ఆమెకి వొంట్లో యేం బాగా లేదు'' అంది.

''విన్నానా ముక్క. యేదీ ఆ ఉత్తరం?''

''తెస్తా. కరేనిన్ విడాకులు యివ్వనన్నాడనుకోకు. అదేం కాదు. మీ తమ్ముడికి విడాకులు సాధిస్తానన్న ఆశ వుంది'' అని దాలీ గుమ్మం దగ్గర ఆగి అంది.

''నాకా ఆశ యేం లేదు. కోరికా లేదు'' అంది అన్నా.

'యేమిటిది? నన్ను చూడ్డం తనకి నామర్దా అనుకుంటోందా కిట్టీ?' అని వొక్కత్తీ వున్నప్పుడు అన్నా అనుకొంది. 'బహుశా ఆమె అలా అనుకోవడం సబబేనేమో. కాని తను, వ్రాన్‌స్కీని ప్రేమించిన తను, అందుకు నన్నిలా అవమానించడం తగదు వొకవేళ సబబే అయినా. నా ప్రస్తుత పరిస్థితుల్లో పరువు మర్యాదలున్న యే ఆడదీ నన్ను పలకరించదని నాకు తెలుసు. ఓం ప్రథమంనుంచీ నాకు తెలుసు, నేనతని కోసం సర్వం కాలదన్నేను. మరి దాని ప్రతిఫలం యిదీ, అబ్బ, అతనంటే యెంత అసహ్యం పుడుతోంది! యింతకీ నేనిక్కడికి యెందుకొచ్చినట్టు? నా బుర్ర యింకా చెడిపోయింది, మరింత అవమాన భారం నెత్తిమీద

పడింది.' ఆమెకి పక్క గదిలోనుంచి అక్క చెల్లెళ్ల మాటలు వినవచ్చేయి. 'యిప్పుడు దాలీకి యేం చెప్పను? నేను నిర్భాగ్యురాలిననీ, తన దయా, సానుభూతి కావాలి అనీ కిట్టీకి తెలియ పరిచి ఆమెకా సంతోషం కలిగించనా? వుహూఁ, వద్దు, దాలీ కూడా అర్థం చేసు కోలేదు. ఆమెకి చెప్పడానికీ నాకు యేం లేదు. అవును, కిట్టీని కలుసుకుని నేను అందర్నీ, అన్నింటినీ అసహ్యించుకుంటున్నానని, నాకిప్పుడు యేదేనా గానీ కాలిగోటితో సమానమనీ చూపించడం నాకు తృప్తిగా వుంటుంది.'

దాలీ ఉత్తరం తీసుకు వచ్చింది. ఆన్నా దాన్ని చదివి యేం మాట్లాడకుండా తిరిగి యిచ్చేసింది.

''నాకు తెలుసు అదంతా. నాకేం ఆశ లేదిందులో'' అంది.

''అదేమిటి? అందుకు ప్రతిగా నాకు మాత్రం ఆశగానే వుంది'' అని దాలీ ఆన్నాకేసి కుతూహలంగా చూస్తూ అంది. అంతకు ముందెన్నడూ ఆమె అంత చిరాగ్గా వుండగా దాలీ చూళ్లేదు. ''యెప్పుడు వెడుతున్నావు?'' అని దాలీ అడిగింది.

ఆన్నా కళ్లు ముడుచుకుని యే జవాబూ చెప్పకుండా శూన్యంలోకి చూస్తూ వుంది.

''కిట్టీ రాదేం? నాక్కనిపించకుండా దాంకుంటోందా యేం?'' అని గుమ్మం వేపు చూస్తూ సిగ్గుపడుతూ ఆన్నా అడిగింది.

''ఛ, ఛ, యేమిటా ముక్క! పిల్లాడికి పాలిస్తోంది. సరిగా లేకపోతే చెప్పివచ్చేను... చాలా సంబర పడింది, వో క్షణంలో వచ్చేస్తుంది'' అని దాలీ అబద్ధాలు చెప్పే నేర్పు లేక పోవడంవల్ల యిబ్బంది పడుతూ అంది. ''అదుగో, రానే వచ్చింది'' అంది.

ఆన్నా వచ్చిందని తెలిసినా కిట్టీకి ఆమెని చూడడం యిష్టం లేకపోయింది. కాని దాలీ అది తప్పని చెప్పి వొప్పించింది. మొత్తంమీద మనసు గట్టి చేసుకుని కిట్టీ యివతలకి వూడి పడింది. సిగ్గుతో యెర్రబడుతూ ఆన్నా దగ్గరికి వెళ్లి చేతిని చాచింది.

''చాలా సంతోషం'' అని కంపించే కంఠంతో అంది.

యీ పాపిష్టి ఆడదానిపట్ల విద్వేషానికీ, ఆమెపట్ల జాలి చూపించాలన్న కోరికకీ మధ్య నలిగిపోతున్నట్టు కనిపించింది కిట్టీ. కాని ఆన్నా అందమైన, ప్రేమాస్పదమైన వదనం చూడగానే ఆమె విద్వేషం అంతా మటు మాయమైపోయింది.

''నన్ను కలుసుకోవడం మీకిష్టం వుండకపోయినా నాకు యేమీ ఆశ్చర్యం కలిగేది కాదు. నేను అన్నిటికీ అలవాటు పడిపోయేను. మీకు వొంట్లో బాగా లేదట? అవును, మీలో మార్పు వచ్చింది'' అంది ఆన్నా.

ఆన్నా తనకేసి శత్రుత్వంతో చూస్తోందని కిట్టీకి అనిపించింది. దీనికి కారణం, వొకప్పుడు తనని లాలనగా చూసిన ఆన్నా యిప్పుడు అనుభవిస్తూ వున్న ఆటుపోటు పరిస్థితి అని కిట్టీకి అనిపించింది. ఆన్నాపట్ల ఆమెకి జాలి కలిగింది.

కిట్టీ ఆరోగ్యం గురించీ, చంటి పిల్లాడి గురించీ, అబ్లాన్స్కీ గురించీ వాళ్లు మాట్లా

డుకున్నారు. కాని అన్నాకి యే విషయంమీదా ఆసక్తిగా లేదని స్పష్టంగా తెలుస్తూనే వుంది.

"మీ దగ్గర సెలవు తీసుకు పోదామని వచ్చేను" అని అన్నా లేస్తూ అంది.

"యెప్పుడు వెడుతున్నారు?"

కాని అన్నా యీ సారి కూడా జవాబు చెప్పలేదు. ఆమె కిట్టీకేసి తిరిగింది.

"మిమ్మల్ని చూసినందుకు చాలా సంతోషంగా వుంది" అని కిట్టీతో చిరునవ్వు నవ్వుతూ అంది అన్నా. "చాలా మంది మీ గురించి చెప్పగా విన్నాను, మీ భర్త చెప్పగా కూడా. అతను నన్ను చూడ్డానికి వచ్చేడు. చాలా మంచివాడు" అని దుర్భావనతోనే జత చేసింది. "అతనేడీ?" అంది.

"వూరికి వెళ్లిపోయేరు" అంది కిట్టీ మళ్లీ సిగ్గుతో యెర్రబడుతూ.

"అడిగానని చెప్పండి, మర్చిపోవద్దు."

"మర్చిపోను" అని కిట్టీ అమాయకంగా రెట్టించిది, జాలిగా అన్నా కళ్లల్లోకి చూస్తూ.

"వూఁ, మరి సెలవు దాలీ" అని దాలీని ముద్దుపెట్టుకుంటూ కిట్టీకి చెయ్యి అందిస్తూ చెప్పి అన్నా గబగబ అడుగులు వేస్తూ వెళ్లిపోయింది.

"ఆమె యేం మారలేదు, అందం యేం తగ్గలేదు. యెంత ముచ్చటగా వుందో!" అని కిట్టీ అక్క తనూ వున్నప్పుడు అక్కతో అంది. "కాని యేదో దయనీయంగా వుంది, చాలా దయనీయంగా" అంది.

"యివాళ తను మామూలుగా లేదు, హాల్లో ఆమెని సాగనంపేటప్పుడు చూస్తే భోరుమని యేడుస్తుందేమో ననిపించింది" అంది దాలీ.

## 29

అన్నా యింటినుంచి బయల్దేరినప్పుడు యెంత హృదయ భారంతో వుందో అంతకంటే యెక్కువ హృదయ భారంతో వచ్చి బండి యెక్కింది. అంతకు ముందున్న హృదయ భారానికి కిట్టీ తనని బహిష్కృతురాలిగా చూసి తిరస్కారంగా ప్రవర్తించిందన్నది తోడై మరింత వ్యథ కలిగింది.

"యెక్కడికి వెడదామమ్మా? యింటికి?" అని ప్యోత్ అడిగాడు.

"ఆఁ, యింటికే" అని తనెక్కడికి వెడుతుందో దాన్ని గురించి పట్టించుకోకుండా జవాబు చెప్పింది.

'వాళ్లు నన్నెలా చూశారు — యెవళ్లో భయంకరమైన, నిగూఢ, వింత వ్యక్తికేసి చూసినట్టు. వూఁ, అతను అవతలివాడితో అంత ఉత్సాహంగా యేం చెప్తున్నాడో?' అనుకొంది దారిలో నడిచి వెడుతూ వున్న యిద్దరికేసి చూసి. 'వొకళ్లు మనోభావాన్ని వొకళ్లకి చెప్పడం

సాధ్యమైనట్టు? నేను దాలీతో మనసులో మాట చెప్పుదామనుకున్నాను, మంచిదైంది చెప్పక పోవడం. నా మనస్తాపం ఆమెకి యెంత పండగ చేసేదో! అలా అని పైకి తేలి వుండేది గాదు, కాని ముఖ్యంగా, తను అసూయ పడే ఆ మోజులకీ, మజాలకీ నాకు దండన పడిందని లోపల మహా సంతోషపడి వుండేది. కిట్టీ యింకా యెక్కువ పొంగిపోయేది. నేనామె మనసులో యేం వుందో కనిపెట్టాను. తన భర్తపట్ల మామూలుగా వుండే దానికంటే యెక్కువ అనుగ్రహ పూర్వకంగా వున్నానని ఆమెకి తెలుసు. మరి ఆమె నేనంటే అసూయ పడుతోంది, నన్ను అసహ్యించుకుంటోంది. పైగా నన్ను తిరస్కారంగా చూస్తోంది. తన దృష్టిలో నేనో నీతీ న్యాయంలేని మనిషిని. నేను నీతిగీతీలేని దాన్నయితే తన మొగుణ్ణి నా ప్రేమ వలలో పడేసుకుని వుండేదాన్ని... నేనలా తలుచుకుని వుంటే. ఆఁ, నేను తలుచుకున్నాను కూడా. చూడు, ఆ పెద్ద మనిషి యెంత తలకొవ్వి వున్నాడో' అని ఆమె పక్కనుంచే బండిలో వెళ్లిన లావాటి యెర్రని బుగ్గల మనిషిని చూసి అనుకొంది. అతను ఆన్నా తనకి తెలుసనుకుని తళతళ మెరిసే టోపీ యెత్తి తళతళ మెరిసే బోడి బుర్ర కనిపించేటట్టు అభివాదం చేసి, వెంటనే తప్పయి పోయిందని నాలిక్కరుచుకున్నాడు. 'నన్ను యెరుగుదునని అతను అనుకున్నాడు. పాపం, యీ లోకంలో యెవళ్లేనా నన్నెంత యెరుగుదురో తనూ అంతే యెరుగును. నా మట్టుకు నేనే నన్నెరగను. ఫ్రెంచి వాళ్ళు చెప్పినట్టు నా క్షుత్తు నాకు తెలుసు. చూడటు, ఆ పిల్లలకి ఆ పాడు ఐస్‌క్రీం తినాలనిపిస్తోంది, ఆ విషయం వాళ్లకి కచ్చితంగా తెలుసు' అని ఆన్నా ఐస్‌క్రీం అమ్మేవాడిని పిల్లలు ఆపడం చూసి అనుకొంది. అతను ఐస్‌క్రీం డబ్బా నెత్తిమీద నుంచి యెత్తి తువ్వాలుతో ముఖంమీద చెమట తుడుచుకున్నాడు. 'అందరం మిఠాయిలు, రుచిగా వుండే పదార్థాలు కావాలనుకుంటాం. చాకొలెట్లు కాకపోతే ఆ పాడు ఐస్‌క్రీం. కిట్టీ కూడా అంతే — వ్రాన్‌స్కీ కాకపోతే లేవిన్. మరి తను నన్ను చూసి యీర్ష్య పడుతోంది. నన్ను అసహ్యించుకుంటోంది. మనందరం వొకళ్లనొకళ్లు అసహ్యించుకుంటాం. నేను కిట్టీని అసహ్యించుకుంటాను, కిట్టీ నన్ను అసహ్యించుకుంటుంది. అదీ వున్న నిజం. త్యూత్కిన్ coiffeur. Je me fais coiffer par త్యూత్కిన్...[1] అతను యింటికి రాగానే యీ విషయం చెప్పాలి' అనుకొంది చిరునవ్వు నవ్వుతూ. మరుక్షణంలోనే పరిహాసాలాడు కుందుకు తనకి యెవళ్లూ లేరు అని ఆమెకి గుర్తు వచ్చింది. 'నిజానికి వేళాకోళాలు, కులాసా కబుర్లు చెప్పుకునే యిదీ లేదు. ప్రతీదీ వెలపరంగానే వుంది. సాయంకాలం ప్రార్థనకి గంటలు మోగుతున్నాయి. ఆ వర్తకుడు యేం శ్రద్ధగా శిలువ గీసుకుంటున్నాడు! — యేదో తన చేతిలోనుంచి జారిపోతుందని భయపడుతున్నట్టు. ఈ చర్చిలు, ఈ చర్చి గంటలు, యీ నటనలు అన్నీ యెందుకు? వొకళ్లకి వున్న అసహ్యాన్ని, అదుగో వొకళ్లనొకళ్లు కుత్సితంగా

[1] త్యూత్కిన్, క్షురకారుడు. నేను త్యూత్కిన్ దగ్గర కేశవిన్యాసం చేయించుకుంటా (ఫ్రెంచి).

తిట్టుకుంటూ వున్న బండి వాళ్లకి మాదిరీ వున్న అసహ్యాన్ని, కమ్ముకుందుకు. తనతో జూదం ఆడేవాడి చొక్కా విప్పించెయ్యాలని తనూ, తన చొక్కా విప్పించెయ్యాలని అవతలివాడూ చూస్తూ వుంటామని యాష్విన్ చెప్పాడు. అసలు నిగ్గు అదీ!'

అన్నా తన పరిస్థితిని గురించి మరిచిపోయేటంతగా యిలా ఆలోచనల్లో మునిగిపోయింది. బండి యింటి గుమ్మం దగ్గరకి వచ్చి ఆగింది. నౌకరు బండి దగ్గరికి వచ్చేక గాని, తను వ్రాన్‌స్కీకి చీటీనీ తంతినీ పంపిన సంగతి ఆమెకి గుర్తు రాలేదు.

''యేమన్నా జవాబొచ్చిందా?'' అని అడిగింది.

''చూస్తా నుండండమ్మా'' అని నౌకరు చెప్పి, హాల్లో వున్న బల్ల దగ్గరికి వెళ్లేడు. అక్కడ చిన్న నలుచదరం లిఫాఫా వుంది. అది టెలెగ్రామ్ కవర్. దాన్ని ఆమెకి అందించేడు. ''రాత్రి పది లోపున రాలేను, వ్రాన్‌స్కీ'' అని అన్నా చదువుకుంది.

''చీటీ పట్టుకెళ్లిన మనిషి వొచ్చేడా?''

''రాలేదండమ్మా'' అని నౌకరు జవాబు చెప్పేడు.

'వూఁ, సంగతి యిదే అయితే, నేనేం చెయ్యాల్సి వుందో అది నాకు తెలుసు' అనుకొంది ఆమె. లోపల్లోపల కోపం, కసీ పెరుగుతూ వుండగా ఆమె మేడ పైకి పరిగెత్తి వెళ్లింది. 'నేనే అతని దగ్గరికి వెడతాను. యిక తెగ తెంపులు చేసుకొనే ముందు అన్నీ చెప్పేస్తాను. యీ మనిషిని అసహ్యించుకుంటున్నంతగా యెవళ్లనీ యెన్నడూ అసహ్యించుకోలేదు' అనుకొంది. చిలక్కొయ్యమీద అతని టోపీ కనిపించింది. ఆమె ఘృణత్వంతో వొణికిపోయింది. యీ టెలెగ్రామ్ తన టెలెగ్రామ్‌కి జవాబని, తన చీటీ అతనికి యింకా అందలేదనీ ఆమె గమనించలేదు. అతను తల్లితోనూ, ప్రిన్సెస్ సొరోకినాతోనూ తాయితీగా మాట్లాడుతూ వున్నట్టు, తన వ్యథావేదనలకి సంతోషపడుతూ వున్నట్టూ మనో నేత్రం ముందు కల్పించు కుంది. 'అవును, నేను గబగబా వెళ్లాలి' అనుకొంది. యెక్కడికీ, యెందుకు వెళ్లాలీ అనే విషయం తెలియకుండానే. యీ భయంకరమైన యింట్లో తను అనుభవించిన వ్యథలనుంచి పారిపోవాలనే ఆమెకి తెలుసు. యీ నౌకర్లు, యీ గోడలు, యీ కుర్చీలు బల్లలు మేజాలు — సర్వం ఆమెలో కోపాన్ని, యేవగింపుని రెచ్చ గొడుతూ వుండగా ఆమె వాటి భారం కింద నలిగిపోతోంది.

'రైల్వే స్టేషన్‌కి వెళ్లాలి, అతను గనక స్టేషన్లో తటస్థ పడకపోతే అక్కడికే వెళ్లి కన్నం దొంగని కన్నంలోనే పట్టాలి' అనుకొంది. అన్నా పేపరు తీసుకుని రైళ్ల వేళ యేమిటో చూసింది. రాత్రి యెనిమిదీ రెండు నిముషాలకి వో రైలు వుంది. 'యింకా వ్యవధి వుంది.' బండి గుర్రాలు మార్చమని పురమాయించి, కొన్ని రోజులకి సరిపడా బట్టలు ప్రయాణం సంచీలో సర్దుకుంది. తను మళ్లీ యీ యింటికి తిరిగి రాదని ఆమెకి తెలుసు. రైల్వే స్టేషన్లో గాని కొంటెన్ యింటి దగ్గర గాని యేం జరిగినా ఆ తర్వాత తను నిజెగొరోద్‌స్కయా రైల్వే

దారిలో తగిలే మొదటి పెద్ద బస్తీకి వెళ్లి అక్కడ ఆగుతుంది అనుకొంది. మనసుకి తట్టిన అనేక అస్పష్ట ఆలోచనల్లో యిదీ వొకటి, దాన్ని ఆమె ఖాయ పర్చుకుంది.

సాయంత్రం భోజనం వడ్డించారు. ఆమె బల్ల దగ్గరికి వెళ్లి రొట్టెనీ, జున్నునీ వాసన చూసింది. భక్ష్య చోష్యాలన్నీ వెలపరం పుట్టిస్తున్నాయని తేలిపోయేక బండిని గుమ్మం దగ్గరికి తీసుకురమ్మని పురమాయించి బయటికి వెళ్లిపోయింది. యింటి నీడ వీధి మొత్తం అడ్డంగా పడుతోందప్పటికే. సాయంత్రం తేటగా, వెచ్చగా వుంది. ఆమె వస్తువులు యివతలికి మోసుకు వచ్చిన అన్నుష్కా, వాటిని బండిలో పెట్టిన ప్యోత్ర్, ముటముట లాడుతూ వున్న బండి తోలే వాడు — అందరూ ఆన్నాకి అసహ్యంగా కనిపిస్తున్నారు. వాళ్లు అనే ప్రతి మాటా వాళ్ల ప్రతి కదలికా ఆమెకి చిర్రెత్తిస్తున్నాయి.

''ప్యోత్ర్ నీ అవసరం లేదులే నాకు.''

''టికెట్ యెవరు కొనిపెడతారమ్మా?''

''సరే, నీ యిష్టం, నాకెలాగైనా వొకటే'' అని తుంచేస్తున్నట్టు అంది.

ప్యోత్ర్ బండిమీదకి గెంతేడు. చేతులు కట్టుకుని, తోలేవాడితో రైల్వే స్టేషన్‌కి తోలుకు పొమ్మని చెప్పేడు.

## 30

'అదీ విషయం, మళ్లీ అదే వచ్చింది. మళ్లీ నాకు అన్నీ బోధపడుతున్నాయి' అని బండి అగలుబగలు వూగుతూ రాస్తామీద పరిచిన రాళ్లపైన తిడిమి చేస్తూ పోతూ వుంటే ఆన్నా అనుకొంది. ఆమె మనసులో వొకదాని తర్వాత వొకటిగా వూహలు ముసురుకుంటూ వచ్చేయి.

'ఆఁ, అన్నిటికంటే యెక్కువ బాగా కనిపించిన ఆఖరి వూహ యేమిటబ్బా?' అని గుర్తు చేసుకో ప్రయత్నించింది. 'త్యూత్కిన్ coiffeur? వుహుఁ, కాదు, అది కాదు. ఆఁ, అదీ యాష్విన్ అన్న ముక్క — అస్తిత్వం కోసం సంఘర్షణ, ఘృణత్వం — యివే మనుషుల్ని బంధించి వుంచే విషయాలు. అయ్యో, వెళ్లి యేం లాభం నాయనలారా' అని పల్లెటూరికి సరదాగా గడపడానికి నాలుగు గుర్రాల బండిలో వెడుతూ వున్నట్టు కనిపిస్తూ వున్న మనుషుల్ని చూసి వాళ్లని మనసులో సంబోధిస్తూ అనుకొంది. 'మీతో కూడా తీసుకు పోతూ వున్న కుక్కవల్ల కూడా యేం వొరగదు. మీరు మీనుంచి దూరం పారిపోలేరు.' ప్యోత్ర్ తల తిప్పిన వేపు ఆమె చూపు మళ్లించింది. చిత్తుగా తాగి తల వేలాడిపోతూ వున్న కార్మికుడొకడ్ని వో పోలీసు లాక్కుపోతున్నాడు. 'బహుశా వాడే చాలా బాగా వున్నట్టున్నాడు' అనుకొంది అన్నా. 'కౌంట్ వ్రాన్‌స్కీకీ నాకూ ఆనంద యోగం లేకపోయింది మేం

యెన్నో యెన్నో ఆశలు పెట్టుకున్నప్పటికీ.' అతనితో తన సంబంధాలమీద అన్ని కోణాల నుంచీ వెలుతురు ప్రసరింప చేస్తూ మొదటి సారిగా ఆన్నా తలపోసింది. యింతవరకూ తను వూహల్లో అంతా విశదం అయేట్టు వెలుతురు ప్రసరింప చెయ్యకుండా తప్పించుకున్న సంబంధాలని అలా వెలుతురు ప్రసరింపచేసి చూసింది. 'నాలో యేం కాంక్షించేడతను? తన అహంభావ తృప్తి అయినంతగా ప్రేమని కాదు.' అతనితో సంబంధం యేర్పడిన కొత్తలో అతనన్న మాటలని గుర్తు చేసుకుంది. అతని ముఖంలో కనిపించిన భావాల్ని గుర్తు చేసుకుంది. తోక ఆడిస్తూ వెంటబడే కుక్కని గుర్తుకి తెచ్చే ముఖం అది. యిప్పుడు ప్రతీదీ దానికి రుజువుగా వుంది. 'అవును, అహంభావ తృప్తి అతనికి అన్నిటికంటే గొప్ప కలిగిస్తుంది. ప్రేమ లేక పోలేదు, కాని అన్నిటికంటే గొప్ప తను నెగ్గేనన్న గర్వంవల్ల వచ్చింది. నన్ను చూపించి తను బోర విరుచుకునేవాడు. సరే, యిప్పుడంతా సమాప్తం అయిపోయింది. యిక గర్వపడాల్సిందేమీ లేదు. గర్వపడాల్సిన విషయం కాదు, సిగ్గుతో తల వాల్చుకోవాల్సిన విషయం. నా దగ్గర్నుంచి తీసుకోగల అంతట్నీ తీసేసుకున్నాడు యిక నా అవసరం తీరిపోయింది. నేనంటే మొహం మొత్తింది. నన్ను మోసం చెయ్యకుండా వుండాలని ప్రయత్నిస్తున్నాడు. ఆ ముక్క నిన్న తేలనే తేలాడు కూడా — నాకు విడాకులు వస్తే, నన్ను పెళ్లి చేసేసుకుని తెప్ప తగలేసుకుంటాడు. తనకి నేనంటే ప్రేమ వుంది — కాని యెలాంటి ప్రేమ? The zest is gone.[1] ఆ మనిషి అందరికీ ఆశ్చర్యం కలిగించాలను కుంటున్నాడు, మనసులో మహా తృప్తిగా వున్నాడు' అని అద్దె గుర్రంమీద స్వారీ చేసుకుపోతూ వున్న యెర్రబుగ్గల షాప్ అసిస్టెంట్‌ని చూసి అనుకొంది. 'లేదు, అతనికి నాలో యిప్పుడు సరదా కనిపించడం లేదు. నేనతన్ని వదిలి పెట్టి వెళ్లిపోతే లోపల్లోపల సంతోషిస్తాడు' అనుకొంది.

యిది వొట్టి శంక మాత్రంగానే లేదు. జీవిత పరమార్థాన్నీ, మానవ సంబంధాలనీ విశద పరిచే ఆ తీక్ష్ణ కాంతిలో యీ విషయాన్ని ఆన్నా సర్వ స్పష్టంగా చూసింది.

'నా ప్రేమ మరింత ప్రబలం అవుతోంది, ప్రతి దాన్ని అపేక్షించేదిగా అవుతోంది. అతని ప్రేమ అంతకంతకీ తగ్గుతోంది. అదే మమ్మల్ని వొకళ్లనుంచి వొకళ్లని దూరం చేస్తోంది' అనుకొంది. 'యీ విషయానికి సంబంధించి చెయ్యగలిగిందీ యేమీ లేదు. నాకు అతనే సర్వస్వం. తను మరింతగా నాకు అర్పితం అవాలని నా కోరిక. మరి తనేమో మరింతగా దూరం అయిపోవాలను కుంటున్నాడు. యిద్దరం కలిసేదాకా వొకళ్ల దగ్గరికి వొకళ్లు వచ్చేం. కలిసిం దగ్గర్నుంచీ ఆగకుండా దూరం దూరంగా పోతూ వున్నాం. యీ స్థితిని మార్చడం సంభవం కాదు. నేను పిచ్చి అసూయగా వుంటున్నానని అతనంటాడు, నేనే అంటున్నాగా నేను పిచ్చి అసూయగా వున్నానని, కాని అది నిజం కాదు. నేను అసూయగా లేను, అసంతృప్తిగా వున్నాను. కాని...' ఆమె మనసుకి అనుకోకుండా తట్టిన ఆలోచనతో ఆమె ఆందోళన పడిపోయింది,

1 వేడి చల్లారిపోయింది (ఇంగ్లీషు).

నోరు తెరిచి వూపిరి పీల్చుకుంది. బండిలో చోటు మార్చుకుంది. 'అతని ప్రేయసిని కాక, అతని లాలింపుల కోసం గాఢంగా తపించి పోయే దాన్ని గాక, మరేదన్నా అయి వుంటే! కాని నేను మరొకలా వుండలేను, వుండాలని కోరుకోనూలేను. నా తపన అతనికి ఘృణకారకంగా వుంది, నాకు కోపకారకంగా వుంది. యిలా కాక మరోలా వుండలేదు. నాకు తెలీదా అతను నన్ను మోసం చెయ్యడని, ప్రిన్సెస్ సొరోకినామీద కన్ను వెయ్యలేదనీ, కిట్టీపట్ల ప్రేమ లేదనీ, నాపట్ల అన్యాయంగా వుండడనీ? నాకు తెలుసు, కాని దానివల్ల నాకు యేమీ మనశ్శాంతిగా వుండడం లేదు. తను నన్ను ప్రేమించకుండా, యేదో తప్పదు కాబట్టి నాపట్ల దయగా స్నేహ పూరితంగా వుంటే, నేను దేని కోసం పరితపిస్తున్నానో దాన్ని యివ్వకపోతే – అది యీ కోపం కంటే వెయ్యి రెట్లు అధ్వాన్నం! అది నరకం! వాస్తవానికి యిప్పుడున్నది అదే. యెంత కాలంగానో అతను నన్ను ప్రేమించడం లేదు. ప్రేమ లుప్తం అయినప్పుడు ద్వేషం పుడుతుంది. యీ వీధులేమిటో నేనసలు గుర్తుపట్టనే లేను. యీ మిట్టలు, యీ యిళ్లు... యిళ్లల్లో జనం... యెంత మంది వున్నారో అంతే లేదు, మళ్లీ అందరూ వొకళ్ల నొకళ్లు అసహ్యించుకుంటున్నారు. సరే, ఆనందంగా వుండడానికి యేం కావాలో నాకు, దాన్ని గురించి చూస్తాను. అంటే? విడాకులు వచ్చేయీ అనుకుందాం, ఆయన సెర్యోష నాతో వుండేందుకు వొప్పుకుంటారు, నేను వ్రాన్స్కీని పెళ్లి చేసుకుంటాను.' కరేనిన్ గుర్తు రాగానే అసాధారణమైన సజీవత్వంతో వాస్తవానికి కరేనిన్ నీరస, నిర్జీవ, నిస్తేజ నేత్రాలతో, తెల్లని చేతులమీద పొంగరించిన నీలి రక్త నాళాలతో, కీచు కంఠంతో, కణుపులు విరుచుకుంటూ ఆమె ముందు ప్రత్యక్షం అయేడు. తమ యిద్దరి మధ్యా వుండిన అనుభూతిని, దేనికి కూడా ప్రేమ అనే సంజ్ఞని యివ్వడం వుందో దాన్ని, గుర్తు చేసుకోగానే ఆమెకి వొంటిమీద తేళ్లూ జెర్రులూ పాకినట్టు కంపరం కలిగింది. 'సరే విడాకులు వొచ్చి వ్రాన్స్కీ యిల్లాల్ని అవుతాననుకొందాం. కిట్టీ యిక పైన నన్ను యివాళ చూసినట్టు చూడదా? అబ్బే, ఆమె అలానే చూస్తుంది. మరి సెర్యోష నా యిద్దరు భర్తల గురించి అడగడూ? అనుకోడూ? వ్రాన్స్కీకీ నాకూ మధ్య యే నూతన భావనని కల్పించగలను? ఆనందం రాకపోయినా, యాతనలు అంతం కావడమేనా సాధ్యమేనా? లేదు, లేదు ముమ్మాటికీ లేదు!' అని ఆమె యీషణ్మాత్రం కూడా అనుమానం లేకుండా తనలో అనుకొంది. 'అసంభవం! జీవితమే మమ్మల్ని చెరో వేపూ తరిమేస్తోంది. అతన్ని నిర్భాగ్యుణ్ణి చేస్తోంది, నన్ను నిర్భాగ్యురాల్ని చేస్తోంది. అతను గాని నేను గాని మారడం అసాధ్యం. అన్ని ప్రయత్నాలూ జరిగేయి, కీలు సడిలిపోయింది. ఆఁ, బిడ్డతో ముష్టి మనిషి. తనపట్ల జాలి చూపిస్తాం అనుకుంటూ వుంది. వొకళ్లనొకళ్లం అసహ్యించుకోవడానికి కాదూ వొకళ్లకొకళ్లు యాతన కలిగించుకోవడానికి కాదూ విసిరి పడేసింది యీ లోకంలోకి మన అందర్నీ. స్కూలు పిల్లలు కామోసు నవ్వుకుంటూ వస్తున్నారు. సెర్యోష?' ఆమెకి కొడుకు గుర్తు వచ్చేడు. 'వాడంటే నాకు ప్రేమ అని అనుకుంటూ వుండేదాన్ని, వాడిపట్ల ప్రేమతో ద్రవించి పోయేదాన్ని. కాని వాడు లేకుండానే బతికాను. వాడి ప్రేమని యీ ప్రేమకి తాకట్టు

పెట్టాను. కాని యీ కొత్త ప్రేమ తృప్తిని కలిగించినంత కాలం ఆ మార్పుని గురించి అయ్యో అని అనుకోను కూడా అనుకోలేదు.' ఆమె మళ్లీ 'యీ ప్రేమ'ని గురించి యేవగింపుగా గుర్తు చేసుకొంది. తన జీవితాన్నీ, యితరుల జీవితాన్నీ యే స్పష్టతతో చూడగలుగుతోందో దాంతో ఆమెకి సంతోషం కలిగింది. 'అంతే, నాకు, ప్యోత్ర్‌కి, బండి తోలే ఫ్యోదొర్‌కి, ఆ వ్యాపారికి, వోల్గా తీరంమీద బతికే జనాలందరికీ — వోల్గా తీరానికి వచ్చి స్థిరపడండని విజ్ఞప్తి నిమంత్రిస్తోంది — అన్ని చోట్లా, యెప్పుడూ యిదే విషయం' అని నిజెగొరోద్స్కయా రైల్వే స్టేషన్ చిన్న భవనం దగ్గరికి చేరుతూ అనుకొంది. ఆమె సామాన్లు అందుకోవడానికి పోర్టర్లు పరిగెత్తుకుంటూ వచ్చేరు.

"ఒబిరాలొవ్కదాకా టికెట్ తీసుకోమంటారా?" అని ప్యోత్ర్ అడిగేడు.

తను యెక్కడికి యెందుకు వెడుతూ వున్నదీ ఆమె పూర్తిగా మరిచేపోయింది. అతనంటున్న దేమిటో ఆమెకి కష్టంమీద బోధపడింది.

"ఆఁ" అంటూ డబ్బు వున్న పర్సు అతనికి అందించింది. అప్పుడు చిన్న యెర్ర సంచీ తీసుకుని దిగింది.

ఆమె స్టేషన్లో వున్న జనం గుండా దారి చేసుకు ఫస్ట్ క్లాస్ వెయిటింగ్ రూమ్‌లోకి వెడుతూ వుంటే తన పరిస్థితికి సంబంధించిన అన్ని వివరాలూ, తను ఆలోచన చేస్తూ వున్న అన్ని నిర్ణయాలూ ఆమె మనసుకి క్రమంగా తట్టేయి. గాయపడి భీకరంగా కంపిస్తూ వున్న ఆమె హృదయంలో వొక సారి ఆశ, వొక సారి నిరాశ పాత పుళ్లమీద పూతపూస్తూ, కారం చల్లుతూ వచ్చేయి. ఆమె పంచకోణంగా వున్న సోఫామీద కూర్చుని లోపలికి, బయటికి వస్తూ పోతూ వున్న మనుషులకేసి చూస్తూ (యిప్పుడు వాళ్లందరూ ఆమెకి చెడ్డగా కనిపించేరు) ఆమె తను స్టేషన్‌కి రావడం, అతనికి చీటీ రాయబోవడం, తను రాయబోతున్న విషయం యేమిటైందీ దాన్ని గురించీ అనుకుంటూ వుంది. అతను (తన బాధలేమిటైందీ అవగాహన లేకుండా) తల్లికి యేం పితూరీ చేస్తూ వున్నదీ, తను యెలా గదిలోకి వెళ్లేదీ అతనికి యేం చెప్పబోయేదీ వూహించుకుంటూ వుంది. యింతలోకీ మళ్లీ తన జీవితం యింకా యెలా సుఖపడబోయేదీ, అతనిపట్ల ప్రేమ, ఘృణత్వం యెంత వేదనాభరితంగా వున్నదీ, తన గుండె యెంత భీకరంగా కొట్టుకుంటూ వున్నదీ వాటి గురించి ఆమె ఆలోచించింది.

## 31

స్టేషన్లో గంట మోగింది. అంద వికారమైన పొగరుబోతు పడుచు వాళ్లు యెవళ్లో కొంతమంది పక్కనుంచి దూసుకుపోయేరు. కాని అలా వెడుతూ వుంటే తనుని చూసి అక్కడి వాళ్లు యేమనుకుంటారో దానిపట్ల వాళ్లకి శ్రద్ధ. దవాలా వేసుకుని బొత్తాల బూట్లు

తొడుక్కున్న ప్యోత్ర్, — అతన్ది జడంగా వుండే మొద్దు మొహం — వెయిటింగ్ రూమ్‌లోంచి బయట పడుతూ వున్న ఆమె దగ్గరికి వచ్చేడు ఆమెని రైలు పెట్టెదాకా తీసుకువెళ్లేందుకు. ప్లాట్‌ఫాంమీద అన్నా ఆ గోల చేసే పడుచు వాళ్లని దాటి వెళ్లేటప్పుడు వాళ్లు గోల ఆపు చేసి కిమ్మన్నాస్తిగా వున్నారు. వాళ్లల్లో వొకడు పక్క వాడితో యేదో గుసగుసలాడుతూ చెప్పేడు. వాడు యేదో అశ్లీలమైన మాటే చెప్పి వుంటాడు. ఆమె యెత్తుగా వున్న మెట్లు యెక్కి వో ఖాళీ పెట్టెలోకి వెళ్లింది. వెళ్లి వో మరకలైపోయిన స్ప్రింగ్ బెర్త్‌మీద కూర్చుంది. వొకప్పుడు అది తెల్లగానే వుండి వుండేది. పెట్టెలో ఆమె వొక్కర్తీ వుంది. ఆమె సంచీ బెర్త్ స్ప్రింగుమీద పైకి లేచి పడింది. ప్లాట్‌ఫాంమీదనుంచే బుద్ధావతారంలా చిన్నగా నవ్వుతూ, బంగారు కుచ్చుతో వున్న టోపీ యెత్తి ప్యోత్ర్ కిటికీ అవతలినుంచే ఆమెకి సెలవు చెపుతున్నాడు. పొగరు మోతు కోచ్ కండక్టరు టకామని తలుపు మూసేసి గడియ వేశేడు. ఎత్తైన పిరుదు దిండ్లు గాగరా వేసుకున్న వో కురూపి ఆడమనిషీ (అన్నా తన మనోనేత్రం ముందు ఆమెని నగ్నంగా వూహించుకుని, ఆమె కురూపితనానికి స్తంభించి పోయింది) వో అమ్మాయీ తెచ్చి పెట్టుకున్న నవ్వు నవ్వుతూ కిటికీ పక్కనుంచి పరిగెత్తుతూ పోయేరు.

"ఎకతెరీనా అంద్రేయెవ్నా దగ్గర, అన్నీ ఆమె దగ్గరే వున్నాయి, ma tante[1]" అని ఆ అమ్మాయి అరిచింది.

'చూస్తే చిన్న పిల్లే అయినా బుద్ధి పాడైపోయింది, మహా కుటిలంగా తయారైంది' అనుకొంది అన్నా. యెవర్నీ చూడకుండా వుండేందుకని ఆమె ఖాళీగా వున్న ఆ పెట్టెలో అవతలి వేపు కిటికీ దగ్గరికి గబగబా లేచి వెళ్లింది. యెవరో ముసలాడు ఆ కిటికీ పక్కనుంచి వెళ్లేడు. అతను అందవికారంగా వున్నాడు. మురికిగా వున్నాడు. పని చేసేటప్పుడు పెట్టుకునే టోపీ పెట్టుకున్నాడు. టోపీ కిందనుంచి అట్టకట్టిన జుట్టు యివతలకి కనిపిస్తోంది. పెట్టె చక్రాలకి యేదో చెయ్యడానికని వొంగేడు. 'ఆ అందవికారమైన మనిషి పరిచితమైనవాడులాగానే కనిపిస్తున్నాడు' అనుకొంది అన్నా. ఆమెకి పీడకల గుర్తు వొచ్చింది. భయంతో కంపించిపోతూ లేచి నుంచుని గుమ్మానికి రాసుకుపోయింది. సరిగ్గా అప్పుడే కండక్టరు యెవళ్లో దంపతుల్ని లోపలికి రానిచ్చేందుకు తలుపు తీశేడు.

"యేం, అవతలికి వెడతారా?"

అన్నా జవాబు చెప్పలేదు. ఆమె ముఖం మేలి ముసుగులో కప్పి వుండడంవల్ల కండక్టరు గాని, పెట్టెలోకి యెక్కే దంపతులు గాని ఆమె ముఖంమీద కమ్ముకున్న భీతిని చూడలేకపోయేరు. ఆమె తన చోట్లోకి వెళ్లిపోయి కూర్చుంది. ఆ దంపతులు ఆమెకి యెదురుగా వున్న చోటుల్లో సర్దుకున్నారు. పైకి తేలకుండా గుట్టుగానే కాని జాగ్రత్తగా ఆమె బట్టలని పరిశీలించేరు. అన్నాకి భార్యా భర్తలిద్దరూ యేవగింపుగా కనిపించేరు. తను సిగరెట్ కాలుస్తే

---

1 పిన్నీ (ఫ్రెంచి).

అభ్యంతరం లేదు కదా అని భర్త అన్నాని అడిగేడు. సిగరెట్ కాల్చడం కంటే యెక్కువగా ఆమెతో మాట కదలేసేటందుకే అలా అడిగేడని స్పష్టం. అభ్యంతరం లేదన్నమీదట అతను భార్యతో ఫ్రెంచిలో మాట్లాడ్డం మొదలుపెట్టేడు. ఆ విషయాలు సిగరెట్ కాల్చడంకంటే అప్రస్తుతంగా వున్నాయి. వాళ్ళు అన్నా వింటుందనే ఉద్దేశంతోనే పనికి మాలిన వాటన్నిటి గురించీ మాట్లాడుకున్నారు. వాళ్ళిద్దరికీ వొకళ్ళంటే వొకళ్ళకి యెంత వెలపరంగా వున్నదీ, వొకళ్ళనొకళ్ళు యెంత యేవగించుకుంటూ వున్నదీ అన్నా స్పష్టంగా చూసింది. అలాంటి దరిద్రపు గొట్టు జీవుల్ని అసహ్యించుకోకుండా వుండడం అసంభవం.

రెండవ గంట మోగింది. వెంటనే సామాన్లు లాగే చప్పుడు, నవ్వులు, కేకలు వినవచ్చేయి. యెవళ్ళకీ, యే కారణంగానూ నవ్వే పని లేదని అన్నాకి స్పష్టంగా తెలుస్తూనే వుంది. అంచేత ఆమెకి ఆ నవ్వులు మంటగా వున్నాయి, యెంత చిరాకు తెప్పించేయంటే ఆమెకి చెవులమీద చేతులు పెట్టి మూసుకుందా మనిపించింది. ఆఖరికి మూడో గంట మోగింది. యీల వూదడం వినిపించింది. ఇంజన్ ఆవిరి కక్కింది. గొలుసులు చప్పుడు చేశాయి. అక్కడ కూచున్న దంపతుల్లో భర్త శిలువ గీసుకున్నాడు. 'అలా శిలువ గీసుకోవడంలో అతని ఉద్దేశం యేమిటో అడగాలని పిస్తోంది నాకు' అని అతనికేసి కొరకొర చూస్తూ అనుకొంది. కిటికీలో నుంచి బయటకి చూసింది. ప్రయాణీకులకి సెలవు చెపుతూ కిటికీ పక్కన ప్లాట్‌ఫాంమీద వున్న వాళ్ళకేసి చూసింది, ముందటిలాగానే వాళ్ళు దొర్లిపోతూ వున్నట్టుగా కనిపించేరు. రైలు ప్లాట్‌ఫాంనీ, వో రాతి గోడనీ, సిగ్నల్స్‌నీ, యితర రైళ్ళనీ దాటుకుంటూ జారిపోతూ వుంటే అన్నా కూర్చున్న పెట్టె రైలు పట్టాల జాయింట్లమీద టకటకా చప్పుడు చేస్తూ వెళ్ళింది. రైలు చక్రాల తిడిమి లయబద్ధంగా వుంది, కిటికీ అస్తమయ సూర్యుని ప్రకాశమాన కిరణాలలో ప్రతిఫలించింది. పిల్ల తెమ్మెరకి కిటికీ తెరలు వూగేయి. అన్నా రైలు కదలికతో వూగుతూ, తాజాగాలికి తెప్పరిల్లి పక్కన వున్న వాళ్ళ విషయం మర్చిపోయి మళ్ళీ తన ఆలోచనల్లో మునిగిపోయింది.

'ఆఁ, యెక్కడ తెగిపోయింది నా వూహ? ఆఁ, అవును, జీవితం వ్యధితంగా వుండని స్థితిని వూహించుకోవడం అసంభవం. జనం బాధలు పడడానికే పుట్టేరు. యీ విషయం మనకి తెలుసు. అయినా మనల్ని మోసం చేసుకునే మార్గాలని అన్వేషిస్తూనే జీవితాలు గడిపేస్తాం. కాని సత్యాన్ని చూస్తే యేం జరుగుతుంది?'

''మనిషికి అందుకనే బుద్ధిని యివ్వడం జరిగింది, యేమంటే మనిషికి వ్యథ కలిగించే దాన్నుంచి విముక్తి పొందేందుకు'' అని యెదర కూర్చున్న ఆడమనిషి ఫ్రెంచిలో అంటోంది. ఆమె నాలిక కొన బయటికి పెట్టి అన్న మాట ఆమెకే సంతృప్తి కలిగించినట్టు స్పష్టంగా తెలుస్తూనే వుంది.

ఆమె ఆ మాటలు అన్నా ఆలోచనలకి జవాబుగా అన్నట్టు కనిపించింది.

'మనిషికి వ్యథ కలిగించే దాన్నుంచి విముక్తి పొందేందుకు' అని అన్నా రెట్టించు

కుంది. ఆమె య్రెర బుగ్గల మొగుడికేసీ, యీనుపుల్లలా వున్న పెళ్లాంకేసి చూసింది. జబ్బుగా వున్నట్టు కనిపించే ఆ పెళ్లాం తను యేదో నిగూఢమైందన్నట్టు భావించుకుంటోందనీ, మొగుడు ఆమె అభిప్రాయం సరైందన్నట్టు ఆమెని మోసం చెయ్యడానికి దాన్ని వాడుకుంటు న్నాడనీ అన్నా గ్రహించింది. అన్నా వాళ్లమీద వెలుతురు ప్రసరింప చేస్తూ తను వాళ్ల జీవిత గాథని వాళ్ల హృదయాల్లోని రహస్య స్థానాలని చూస్తున్నట్టు కనిపించింది. కాని ఆమెకి అందులో ఆసక్తికరమైంది యేదీ వున్నట్టు తోచలేదు అంచేత తన ఆలోచనల వేపు మళ్లీ తిరిగింది.

'అవును, నేను చాలా వ్యధ పడిపోతున్నాను. అందుకనే విముక్తి పొందే బుద్ధి నాకు వుంది. అంచేత విముక్తి పొందాలి. చూసేందుకు యేమీ లేనప్పుడు, ప్రతీదీ యేవగింపుగా వున్న ప్పుడు యీ కొవ్వొత్తిని యెందుకు ఆర్పెయ్యకూడదు? కాని యెలా? కండక్టరు అలా కారి డర్‌లో పరిగెత్తి వెళ్లాడెందుకో? ఆ పెట్టెలో ఆ పడుచు వాళ్లు యెందుకు అలా అరుచు కుంటున్నారు? వాళ్లు యెందుకు మాట్లాడుకుంటున్నారు? యెందుకు నవ్వుతున్నారు? యేదీ నిజం కాదు, అంతా అబద్ధం, అంతా మోసం, అంతా చెడు.'

రైలు తను వెళ్లాల్సిన స్టేషన్ చేరి ఆగింది. అన్నా మిగిలిన ప్రయాణీకులతోబాటుగా దిగింది. కుష్ఠురోగులనుంచి దూరం పోయినట్టుగా వాళ్లనుంచి తప్పుకుంటూ, యెందుకు తను అక్కడికి వచ్చిందో, యే ఉద్దేశ్యంతో వచ్చిందో గుర్తు చేసుకో ప్రయత్నిస్తున్నట్టు ప్లాట్‌ఫాంమీద నుంచుంది. ముందు సాధ్యంగా కనిపించినవన్నీ యిప్పుడు బోధ పర్చుకోవడం మహా కష్టమైపోయినట్టు కనిపించాయి. ముఖ్యంగా యేహ్యకరమైన జన సమూహంలో అలా కనిపించేయి. యీ జనం ఆమెని మనశ్శాంతిగా వుండ నివ్వదలచుకున్నట్టు లేరు. మూటలు వుంటే తెస్తామంటూ ఓ సారి కూలీలు వచ్చిపోతున్నారు. మరుక్షణంలో కొంత మంది పడుచు వాళ్లు ప్లాట్‌ఫాం కొయ్య పలకల నేలమీద బరువైన బూట్లతో ధనధన చప్పుడు చేస్తూ, బిగ్గరగా మాట్లాడుతూ ఆమెని నఖశిఖ పర్యంతం చూస్తూ పక్కనుంచి పోతున్నారు. లేకపోతే యెదరనుంచి వచ్చే జనం ఆమెకి చిరాకు కలిగేటట్టు దగ్గరకంటా వచ్చి అటూ యిటూ పక్కలకి పోతున్నారు. తన చీటీకి జవాబు గనక రాకపోతే యింకా ముందుకు పోదామనుకున్న విషయం గుర్తు వచ్చి ఆమె వో కూలీని ఆపింది. కౌంట్ వ్రాన్‌స్కీకి ఉత్తరం పట్టుకు వెళ్లే బండి వాడెవరన్నా అక్కడ వున్నారా అని అడిగింది.

"కౌంట్ వ్రాన్‌స్కీ? వ్రాన్‌స్కీగారి బండి యిందాకనే యిక్కడ వుంది. ప్రిన్సెస్ సొరోకినాగారినీ, ఆమె కూతురుగార్నీ కలుసుకుందుకు వచ్చింది. బండివాడు యెలా వుంటాడు?"

ఆమె కూలీతో మాట్లాడుతూ వుండగా బండితోలే మిహాయిల్ ఆమె దగ్గరికి వచ్చేడు. అతని ముఖం య్రెరగా హుషారుగా వుంది. అతను చక్కని నీలం కోటు తొడుక్కు న్నాడు. గడియారం గొలుసు ఛాతీలోకి దోపుకున్నాడు. తన పనిని దివ్యంగా పరిపూర్తి చేశానన్న గర్వంతో అతను ఛాతీ విరుచుకుంటున్నట్టు స్పష్టంగా కనిపిస్తోంది. అతను ఆమెకి

యేదో చీటీని అందజేశాడు. ఆమె కవరుని చింపింది. యింకా చదవక ముందే ఆమె గుండె జారిపోయింది.

''చాలా విచారంగా వుంది నాకు, నీ చీటీ అందలేదు. పది గంటలకి యింటికి వస్తాను'' అని వ్రాన్‌స్కీ నిర్లక్ష్యంగా గిలికేడు.

'అదీ విషయం. నేనలానే అనుకున్నాను' అని ఆమె కసిగా మందహాసం చేస్తూ అనుకొంది.

''సరే మంచిది, నువ్వు యింటికి వెళ్లు'' అని మిహాయిల్‌తో మెల్లిగా చెప్పింది. ఆమె గుండె దడదడ కొట్టుకుంటూ వుండడంవల్ల వూపిరి పీల్చుకోవడం కష్టమై మెల్లిగా చెప్పింది. 'లేదు, నన్నిలా బాధా తప్తం చెయ్యనివ్వను నిన్ను' అని ఆమె అతనితోగాని తనతో గాని కాకుండా, తనని యాతన పెడుతూ వున్న ఆ శక్తిని ఉద్దేశించి చెపుతున్నట్టు ధిక్కారంగా అనుకొంది. అనుకొని స్టేషన్ భవనం దాటి ప్లాట్‌ఫాంమీద వెళ్లిపోయింది.

ప్లాట్‌ఫాంమీదకి వస్తూపోతూ వున్న యిద్దరు ఆడ పనిమనుషులు ఆమె బట్టలు చూసి గట్టిగా పైకే మాట్లాడుకున్నారు. ''అసలైంది'' అని ఆమె వేసుకున్న గౌను లేసు చూసి అన్నారు. ఆ పడుచు వాళ్లు ఆమెని మనశ్శాంతిగా వుండనివ్వలేదు. వాళ్లు ఆమె ముఖంలోకి తేరి చూసి నవ్వుతూ, తెచ్చి పెట్టుకున్న ఉత్సాహంతో యేదో అరుస్తూ ఆమె పక్కనే తిరిగేరు. స్టేషన్ మాస్టరు ఆమె పక్కనుంచి వెడుతూ ఆమె ఆ రైల్లో యింకా యెదరకి ప్రయాణం చేస్తోందా అని అడిగేడు. క్వాస్ పానీయం అమ్మే కుర్రాడొకడు ఆమెమీదనుంచి దృష్టి మళ్లించుకోలేకపోయేడు. 'భగవన్, యెక్కడికి వెళ్లను నేను?' అని ఆమె ప్లాట్‌ఫాం చివరికంటా వెడుతూ అనుకొంది. ప్లాట్‌ఫాం చివరకంటా చేరాక ఆగింది. కళ్లజోడు పెట్టుకున్న యెవరో పెద్ద మనిషిని కలుసుకోవడానికి వచ్చిన కొంతమంది ఆడవాళ్లూ పిల్లలూ ఉత్సాహంగా నవ్వుకుంటూ వున్నారు. ఆమె వాళ్ల దగ్గరికి వెళ్లగానే వాళ్లు మాటలు, నవ్వులు ఆపి ఆమెకేసి తేరి చూశారు. అన్నా నడక వేగం పెంచి ప్లాట్‌ఫాంమీద వో పక్కకి దూరం వెళ్లిపోయింది. వో గూడ్సు రైలు వస్తోంది. ప్లాట్‌ఫాం దడదడ ఆదిరింది. తను ఆ రైల్లో మళ్లీ వెడుతున్నానేమోనని అన్నాకి అనిపించింది.

తను మొట్టమొదటి సారి వ్రాన్‌స్కీని కలుసుకున్నప్పుడు రైలు కింద మనిషి పడడం హఠాత్తుగా ఆమెకి గుర్తు వచ్చింది. దాంతో తను యేం చెయ్యాల్సిందీ ఆమెకి అర్థమైంది. పంప్ హౌస్‌నుంచి రైల్వే లైను వేపు వెళ్లే మెట్లమీద గబగబా దిగి ఆమె అటు వెళ్లే రైలు బండి పక్కన నిలబడింది. పెట్టెల కింది భాగాల్నీ, సీలల్నీ, గొలుసుల్నీ పట్టాలమీద మెల్లిగా సాగిపోతూ వున్న మొదటి పెట్టె పెద్ద చక్రాల్నీ చూసింది. పెట్టె యెదర చక్రాలకీ వెనక చక్రాలకీ మధ్య భాగం గురించీ, తనకి యెదురుగ్గా అది వచ్చే క్షణం గురించి కంటి చూపుతోనే అంచనా వేసింది.

'అక్కడికి!' అని స్లీపర్ల మధ్య వున్న యిసిక, బొగ్గు మిశ్రమంమీద పడిన పెట్టె నీడని

చూస్తూ అనుకొంది. 'అదీ అక్కడ, సరిగ్గా మధ్యలో, నేను అతన్ని శిక్షిస్తాను, అందర్నీ తప్పించి, నానుంచీ విముక్తి పొందుతాను.'

మొదటి పెట్టె మధ్య భాగం తన యెదరకి రాగానే కింద పడి పోదామనుకొంది. కాని చేతిలో వున్న యెర్ర సంచీ తీసేసే లోపల ఆలస్యమైపోయింది. అది ముందుకు వెళ్లిపోయింది. రెండో పెట్టె రావడం కోసం చూడాల్సి వచ్చింది. చన్నీళ్లల్లో స్నానానికి మొదటి సారి దూకే ముందు యెలా వుంటుందో అలా ఆమెకి అనిపించింది. ఆమె తన పైన శిలువ గుర్తు గీసు కుంది. శిలువ గీసుకునే యీ చిరపరిచిత సంకేతం ఆమెలో బాల్య కౌమార గమి స్మృతుల్ని ఉద్భూతం చేసింది. హఠాత్తుగా తన జీవితంలో అన్నిటినీ ఆవరించిన అంధకారం పటాపంచలై పోయింది. గడిచిపోయిన మధుర ఘణతులతో క్షణ కాలం పాటు జీవితం తేజోవంతం అయి ఆమెకి సాక్షీభూతంగా నిలిచింది. కాని దగ్గరికి వచ్చేస్తూ వున్న రెండవ పెట్టె చక్రాలమీద నుంచి ఆమె చూపు తప్పించుకోలేదు. సరిగ్గా పెట్టె మధ్య భాగం యెదరికి రాగానే ఆమె యెర్ర సంచీని విసిరేసింది, భుజాల కిందికి తల వొంచి చేతులమీద ఆనుకుని పెట్టె కింద పడింది. వెంటనే చురుగ్గా కదిలి అప్పుడే లేవపోతూ వున్నట్టుగా, మోకాళ్లమీద లేచింది. తక్షణం తను యేం చేస్తోందో స్ఫురణకి వచ్చి భయ భ్రాంత అయిపోయింది. 'నేను యెక్కడున్నాను? యేం చేస్తున్నాను? దేని కోసం?' అనుకొని లేవబోయింది. వెనక్కి వాలిపోబోయింది. కాని మహా భారమైనదేదో, అనివార్యమైనదేదో ఆమె శిరస్సుని మోది, ఆమె వీపుని లాగి యీడ్చుకు పోయింది. 'ప్రభూ, నన్ను క్షమించు' అని, పెనుగులాటకి అశక్తు రాలినని తనకి తానుగా గ్రహించి, అనుకొంది. వో ముసలాడు తనలో తను యేదో గొణుక్కుంటూ యినప ముక్కతో యేదో చేస్తున్నాడు. వ్యథలు, మోసం, విచారం, దౌష్ట్యం నిండిన పుస్తకాన్ని తను యే కొవ్వొత్తి వెలుతుర్లో చదువుతోందో ఆ కొవ్వొత్తినుంచి వొక అపూర్వ మహా ప్రభ అంతవరకూ తమోరాశి కమ్మిన సర్వాన్నీ తేజోవంతం చేస్తూ ప్రసరిం చింది. తర్వాత అది మిణుకు మిణుకు మంటూ క్షీణించి శాశ్వతంగా ఆరిపోయింది.

# యెనిమిదవ భాగం

## 1

దగ్గర దగ్గర రెండు నెలలు గడిచిపోయేయి. యెండ పేల్చేసే వేసవి సగం గడిచిపోయింది. అయినా యిప్పుడే కోజ్నిషెవ్ మాస్కోనుంచి సెలవుకి వెళ్లడానికి యేర్పాట్లు చేసుకుంటున్నాడు.

యీ మధ్య కాలంలో అతని జీవితంలో కొన్ని ముఖ్య సంఘటనలు జరిగాయి. యేడాది కితం అతను ఆరేళ్ల శ్రమ ఫలితం అయిన 'యూరప్, రష్యాలలో పాలనా రూపాల సింహావలోకనం'' అన్న పుస్తకాన్ని పూర్తి చేశాడు. ఆ పుస్తకంలోని కొన్ని భాగాలు, ఆముఖం పత్రికలలో పడ్డాయి. కొన్ని భాగాలని కోజ్నిషెవ్ తన పరిచితులకి మిత్రులకి చదివి వినిపించేడు. అంచేత యీ పుస్తకంలో వెల్లడించిన అభిప్రాయాలు జనాలకి పూర్తిగా కొత్తవి కావు. అయినా కూడా పుస్తకం వెలువడ్డాక సమాజంలో పెద్ద సంచలనం కలుగుతుందని కోజ్నిషెవ్ ఆశించేడు. ఆ పుస్తకం విజ్ఞాన క్షేత్రంలో విప్లవం లేపకపోయినా విద్వత్ లోకంలో చాలా కలకలం రేపుతుందని కోజ్నిషెవ్ ఆశించేడు.

మొత్తంమీద నానాయాతనలూ పడి మెరుగులు దిద్ది కిందటేడాది కోజ్నిషెవ్ దాన్ని వెలువరింప చేశాడు. పుస్తక విక్రేతలకి అది చేరింది.

కోజ్నిషెవ్ యెవళ్లనీ యీ పుస్తకం గురించి అడగలేదు. యెలా పోతోందీ అని యెవళ్లేనా అడిగినప్పుడల్లా అనిష్టంగా, తెచ్చిపెట్టుకున్న ఉదాసీనతతో జవాబు చెప్పేవాడు. పుస్తక విక్రేతల్ని అది యెలా పోతోందీ అని అడగను కూడా అడిగేవాడు కాదు. అయినా గాని ఆ పుస్తకం జనంలో, సాహిత్య లోకంలో యెలాంటి సంచలనం రేకెత్తిస్తూ వున్నదీ మహా శ్రద్ధగా గమనించేవాడు.

వో వారం గడిచింది. రెండో వారం గడిచింది. మూడో వారం కూడా అయింది. కాని యెక్కడా సంచలనం కలిగిన సూచనలు కనబడలేదు. విషయజ్ఞులు, విద్వాంసులు అయిన అతని మిత్రులు కొందరు పుస్తకం గురించి అతనితో మాట్లాడేరు గాని అది యేదో మర్యాదకే అనే సంగతి స్పష్టంగా తెలుస్తూనే వుంది. యితర పరిచితులు శాస్త్రీయ గ్రంథం గురించి యే ఆసక్తీ చూపించలేదు, దాన్ని గురించి అతనితో యేమీ ప్రస్తావించనూ లేదు. జనం కూడా ఆ సమయంలో వేరే విషయాలతో వ్యస్తంగా వుండి యీ పుస్తకం గురించి యేం పట్టించుకోలేదు. నెలదాకా పత్రికల్లో యీ పుస్తకం గురించి వొక్క మాట కూడా రాలేదు.

సమీక్షలు రావడానికి యెంత వ్యవధి పట్టేదీ కోజ్నిషెవ్ లెక్క వేసుకున్నాడు. కాని వొక నెల గడిచింది, రెండో నెల గడిచింది. వొక్క ముక్క కూడా యెక్కడ్నుంచీ రాలేదు.

"ఉత్తరాది పట్టుపురుగు" అనే పత్రికలో కంఠం మూగబోయిన ద్రబాంతి అనే గాయకునిమీద అధిక్షేపంగా రాసిన వ్యాసంలో కోజ్నిషెవ్ పుస్తకం గురించిన ప్రస్తావన వున్న మాట నిజమే. అందులో ఆ పుస్తకం గురించి తీసి పారేస్తున్నట్టుగా కొన్ని మాటలు రాశారు. వాటి ఉద్దేశం యేమిటంటే యీ పుస్తకం సత్తా యేమిటో అందరికీ తెలుసనీ, అందరూ దాన్ని నవ్వులాటగా చూస్తున్నారనీనీ.

యెట్టకేలకి పుస్తకం వెలువడిన తర్వాత మూడవ నెలలో దానిమీద విమర్శ వో చెప్పుకో దగ్గ పత్రికలో పడింది. దాన్ని రాసిన వాళ్లెవరో కోజ్నిషెవ్‌కి తెలుసు. అతను ఆ విమర్శ రాసినతన్ని గొలుబ్‌త్సోవ్‌ల యింటి దగ్గర కలుసుకున్నాడు.

ఆ రాసినతను చాలా కుర్రాడు. జబ్బు మనిషి. హాస్యంగా వ్యంగ్యంగా రాస్తూ వుంటాడు. రాతకి సంబంధించి నిర్భీకుడే కాని అంత డొక్క శుద్ధి వున్న వాడు కాదు. నలుగురిలో చాలా పిరికిగా వుంటాడు.

ఆ కుర్రాడంటే కోజ్నిషెవ్‌కి యేవగింపు. అయినా కూడా ఆ సమీక్షని చాలా శ్రద్ధగా చదివేడు. ఆ వ్యాసం దారుణంగా వుంది.

ఆ హాస్య రచయిత ఆ పుస్తకాన్ని అర్థం చేసుకున్న తీరు యే మాత్రం క్షంతవ్యంగా లేదు. కాని అతను ఉల్లేఖనల్ని యెంత నేర్పుగా యెంచుకున్నాడంటే పుస్తకాన్ని చదవని వాళ్లెవరికేనా గానీ (మరి దాదాపు యెవళ్లూ పుస్తకాన్ని చదవలేదు) అది శబ్దాడంబర సమాసాల పోగు అనీ, ఆ శాబ్దిక ప్రయోగాలేనా తప్పుగా వాడినవనీ (వాటి ముందర పుష్కలంగా ప్రశ్నార్థక చిహ్నాలని పెట్టడంద్వారా అలా సూచించడం జరిగింది), పుస్తక రచయిత అలాంటి ఆ పుస్తకం రాయడానికి యే మాత్రం అర్హతలేని చవట అనీ అనిపిస్తుంది. దీన్నం తట్నీ యెంత యుక్తిగా చెప్పడం జరిగిందంటే కోజ్నిషెవ్ కూడా ఆ యుక్తిని కాదనలేడు. అదే అన్నిటికంటే దారుణమైన విషయం.

సమీక్షకుడి తీర్పుని కోజ్నిషెవ్ చాలా న్యాయంగా పరిశీలించేడు. అయినా సమీక్షకుడు యెత్తి పొడుస్తూ చూపించిన తప్పులమీదా, దోషాలమీదా మాత్రమే దృష్టి నిలిపెయ్యలేదు. ఆ తప్పులనీ దోషాలనీ అతగాడు ఉద్దేశపూర్వకంగా పట్టి చూపిస్తూ వున్నట్టు తెలుస్తూనే వుంది. కాని కోజ్నిషెవ్ ప్రస్తుతం తను మొదట సారి యీ సమీక్షకుణ్ని కలుసుకున్నప్పుడు జరిగిన ప్రతి చిన్న వివరాన్నీ తనకి తెలియకుండానే గుర్తు చేసుకోవడం మొదలుపెట్టేడు.

'అతన్ని యేమన్నా కష్టపెట్టానా నేను?' అనుకున్నాడు కోజ్నిషెవ్.

కొంచెం ప్రయత్నం చేసినమీదట గుర్తు వచ్చింది. ఆ సమీక్షకుడు వొక శబ్దాన్ని తప్పుగా ప్రయోగించేడు, దాన్ని కోజ్నిషెవ్ చూపించేడు. యిప్పుడు కోజ్నిషెవ్‌కి యీ సమీక్ష వెనక వున్న రహస్యం స్పష్టం అయింది.

యీ సమీక్ష తర్వాత అచ్చులో గాని, సంభాషణల్లో గాని యీ పుస్తకం గురించిన మాటా పలుకూ వినిపించలేదు. తను ఆరేళ్ళ పడ్డ శ్రమకి గుర్తులు కూడా మిగలకుండా పోతున్నాయని కోజ్నిషెవ్‌కి అనిపించింది.

యింత వరకూ తనకి తీరిక లేకుండా చేతి నిండుగా పని కల్పించిన యీ పుస్తకం పూర్తయింది. దాంతో చదువుకునే గదిలో కోజ్నిషెవ్‌కి చేసే పనీ లేకపోయింది. యీ కారణంగా అతని పరిస్థితి మరీ బేజారుగా తయారైంది.

కోజ్నిషెవ్ వివేకవంతుడు, సంస్కారి, ఆరోగ్యవంతుడు, కార్యశీలుడు. అంచేత తన కార్యశీలతని యెలా ఉపయోగ పెట్టాల్సిందీ అతనికి తెలియలేదు. కొంత సమయం డ్రాయింగ్ రూమ్‌ల కబుర్లలో, కమిటీలలో, సమావేశాల్లో, సభల్లో గడిచిపోతోంది. యెక్కడ సంభాషణలకి అనుకూలంగా వుంటే అక్కడల్లా గడిచిపోతోంది. కాని చాలా యేళ్ళగా నగరంలో వున్న వాడు కాబట్టి అనుభవంలేని తన పల్లెటూరి తమ్ముడు మాస్కోకి వచ్చినప్పుడు కబుర్లతో పొద్దు పుచ్చినట్టుగా, కోజ్నిషెవ్ కబుర్లతో కాలక్షేపం జరిపిం చెయ్యలేడు. దాంతో కోజ్నిషెవ్‌కి చాలా సమయం, మానసిక శక్తి మిగిలిపోయేయి.

తన పుస్తకం నెగ్గుకు రాకుండా పోతూ వున్న ఆ గడ్డు కాలంలో అతని అదృష్టవశాత్తూ వొకటి కలిసొచ్చింది. మామూలుగా వుండే ప్రసంగ విషయాలు — భిన్న మతాల సమస్య, అమెరికా మిత్రులు, సమారలో కరువు*, కళా ప్రదర్శనలు, మంత్రశక్తులు — వెనక్కి తగ్గి స్లావ్ సమస్య ముందుకు వచ్చింది. కొంత కాలంగా అది సమాజంలో రాజుకుంటూ వుంది. యీ సమస్యని మొదట్లో లేవనెత్తిన వాళ్ళల్లో కోజ్నిషెవ్ వొకడు. అంచేత యిప్పుడతను యీ పనిలో పూర్తిగా మునిగిపోయేడు.

కోజ్నిషెవ్‌తో సంబంధం వున్న వాళ్ళు యిప్పుడు స్లావ్ సమస్య గురించీ, సెర్బియన్ యుద్ధం గురించీ తప్ప మరి దేన్ని గురించీ రాయలేదు, మాట్లాడలేదు. యేదో కాలక్షేపం నూసుకుంటూ పొద్దు పుచ్చే తీరికగల కులాసా వర్గాల వాళ్ళు యిప్పుడు స్లావ్‌ల క్షేమం కోసం దృష్టి లగ్నం చేసి పొద్దు పుచ్చుతున్నారు. నాట్యాలు, కచేరీలు, విందులు, ఉపన్యాసాలు, మహిళల ఫేషన్లు, బీరు బార్‌లు, రెస్టారెంట్లు — వొకటేమిటి సర్వ స్థలాలూ స్లావ్‌లకి సానుభూతి ప్రకటన స్థలాలు అయేయి.

యీ విషయం గురించి రాసిన వాటినన్నిటినీ, చెప్పిన వాటినన్నిటినీ కోజ్నిషెవ్ వొప్పుకోలేదు. స్లావ్ సమస్య సమాజంలో కాలక్షేపం కోసం యెప్పుడూ మారిపోతూ వుండే మోజు విషయాల్లో వొకటి అయింది అని అతను గ్రహించేడు. చాలా మంది తను ఆత్మ తృప్తి కోసం, తమ సొంత ప్రయోజనాల కోసం యీ సమస్యని అంది పుచ్చుకున్నారనీ అతను కనిపెట్టాడు. పత్రికలు నలుగురి దృష్టిని ఆకర్షించడానికీ, యితరులకంటే యెక్కువగా అరిచి గోల చెయ్యడానికీ మాత్రమే అనవసరమైన వాటినో, అతిశయోక్తులనో చెరిగేస్తున్నాయనీ చూసాడు. సమాజంలో యిప్పుడున్న యీ ప్రవాహంలో అందరికంటే ముందుకి

వచ్చేసిన వాళ్ళు, అందరికంటే గట్టిగా చించుకుని అరుస్తూ వున్న వాళ్ళూ తమకిగా తమ జీవితాల్లో వోడిపోయిన వాళ్ళు, అలక్ష్యానికి గురైన వాళ్ళు – సైన్యాలులేని సేనాధిపతులు, మంత్రిత్వ శాఖలులేని మంత్రులు, పత్రికలులేని పత్రికా రచయితలు, పార్టీలులేని పార్టీ నాయకులు – అనే విషయాన్నీ అతను చూశాడు. దీనంతట్లోనూ పైపై మినుకు వుండడం, కొంత హాస్యాస్పదంగా వుండడం అతను చూశాడు. అయినా గానీ, అన్ని వర్గాల వాళ్ళనీ ఏకం చేస్తూ నిస్సందేహంగా యితోధికం అవుతూ వున్న ఉత్సాహాన్నీ అతను చూసాడు. దానిపట్ల సానుభూతి పొందకుండా వుండడం అసంభవం. స్లావ్ సహధర్మానుచరులు, సోదరులు హత్యా కాండకి గురి అవుతున్నారు, వాళ్ళపట్ల సానుభూతి, వాళ్ళ పీడకులపట్ల ఆగ్రహం కలుగుతున్నాయి. సెర్బులు, చెర్నోగోరియా వాసులు మహా సాహసోపేతంగా చేస్తూ వున్న పోరాటం మాటలతోగాక చేతలద్వారా తమ సోదరులకి సాయపడాలన్న కోరికని యావత్ దేశంలోనూ కలిగించింది.

అయినా కోజ్నిషెవ్‌ని యెంతగానో సంతోషపెట్టిన సంగతి మరోటె వుంది. స్పష్టంగా అభివ్యక్తం అయిన ప్రజాభిప్రాయం. సమాజం కచ్చితంగా తన అభిప్రాయాన్ని వెల్లడి చేసింది. అలా వెల్లడైంది స్పష్టమైన జాతీయ భావమేనని కోజ్నిషెవ్ నొక్కి చెప్పేడు. యీ ధ్యేయం కోసం అతను యెంతగా అర్పితమైతే, అంతగా యిది విరాట్ ప్రమాణాలకి విస్తరించుకుంటుందనీ, యుగ సంఘటన అవుతుందనీ అతనికి నమ్మకం కలిగింది.

అందుకని అతను యీ మహత్తర లక్ష్యం కోసం సంపూర్తిగా అర్పితమయ్యేడు. అలా అర్పితమవ్వడంద్వారా తన పుస్తకం గురించి ఆలోచించడం మానేశాడు.

యిప్పుడు అతనికి పొద్దు పుచ్చడం యెలా అనే ప్రశ్నే లేదు. నిజానికి తనకి అందుతూ వున్న ఉత్తరాలకీ, విజ్ఞప్తులకీ జవాబు యిచ్చే తీరికే వుండడం లేదు.

వసంతరుతువు మొత్తం, వేసవిలో కొంత భాగం అతను తీరిక లేకుండా పని చేశాడు. జూలైలో మాత్రమే అతను తమ్ముడి దగ్గరికి పల్లెటూరు వెళ్ళడానికి తయారవగలిగేడు.

కోజ్నిషెవ్ రెండు వారాలు విశ్రాంతిగా గడపడానికి, ఆ గడపడం కూడా సుదూర రష్యన్ గ్రామంలో పవిత్రాతి పవిత్రం అయిన రష్యన్ ప్రజల జాతీయ భావాభివ్యక్తి చూస్తూ, తనకీ సకల నగర వాసులకీ యే ఆత్మాభివ్యక్తి గురించి పూర్తి విశ్వాసం వుందో దాన్ని చూస్తూ, ఆనందించడానికి అతను అక్కడికి వెళ్ళేడు. వాళ్ళ వూరు వస్తానని లేవిన్‌కి యెప్పుడో మాట యిచ్చిన కతవాసొవ్ కూడా కోజ్నిషెవ్‌తో బయలుదేరాడు.

## 2

కోజ్నిషెవ్, కతవాసొవ్ మాస్కోలో కూర్‌స్క్ రైల్వే స్టేషన్ చేరారు. స్టేషన్ ఆ వేళ చాలా రద్దీగా వుంది. వాళ్ళు బండి దిగి, నౌకరు సామాను తెస్తున్నాడో లేదో చూసే

లోపలే నాలుగు బళ్లల్లో యుద్ధానికి వెళ్లే వలంటీర్లు* కూడా వచ్చేరు. మహిళలు వాళ్లకి పూలతో స్వాగతం చెప్పేరు. వాళ్ల వెనక్కాలే హితుల బృందం స్టేషన్ లోపలికి చేరింది.

వలంటీర్లకి వీడ్కోలు చెప్పడానికి వచ్చిన మహిళల్లో వొకామె వెయిటింగ్ రూమ్‌లోనుంచి యివతలకి వచ్చి కోజ్నిషెవ్‌తో మాట్లాడింది.

"మీరూ వలంటీర్లకి వీడ్కోలు చెప్పడానికి వచ్చేరా?" అని ఆమె ఫ్రెంచిలో అడిగింది.

"లేదు, ప్రిన్సెస్, నేనే వూరికి వెడుతున్నాను. మా తమ్ముడి దగ్గరికి విశ్రాంతిగా గడప డానికి. యేమిటి మీరు యిలా అస్తమానూ వీడ్కోలు చెప్పడానికి వస్తూ వుంటారా?" అని కోజ్నిషెవ్ రీలగా మందహాసం చేస్తూ అడిగేడు.

"అలా రావాలనే నాకు వుంటుంది. మన వూరినుంచి యెనిమిది వందల మంది వలంటీర్లని పంపించాం, నిజం కాదూ? నేనా ముక్క చెబితే మల్వీన్‌స్కీ నమ్మడం లేదు" అంది ప్రిన్సెస్.

"ఎనిమిది వందలకి పై బడి పంపించేం. యెకాయెకీ మాస్కోనుంచి కాక వేరే వూళ్ల నుంచి వచ్చిన వాళ్లని కూడా కలుపుకుంటే వెయ్యికి పై బడి వుంటారు" అని కోజ్నిషెవ్ అన్నాడు.

"అదో, చూశారా!" అని ప్రిన్సెస్ సంబర పడిపోయింది. "యేం, విరాళాలు కూడా పది లక్షలకి మించి వుండవూ?" అంది.

"యింకా యెక్కువే, ప్రిన్సెస్."

"సరే, యివాళ వార్త గురించి మీరే మనుకుంటున్నారు? మళ్లీ టర్కీ వాళ్లు వోడి పోయేరు."

"ఆఁ, ఆ వార్త చదివేను" అన్నాడు కోజ్నిషెవ్. వాళ్లు అంతకు ముందే అందిన టెలె గ్రామ్ గురించి మాట్లాడుకుంటున్నారు. మూడు రోజుల్లో అన్ని శ్రేణుల్లోనూ టర్కీ వాళ్లు మట్టి కరిచారనీ, వెనక్కి పారిపోతున్నారనీ, మర్నాటికల్లా అటో యిటో తేలిపోయే యుద్ధం జరుగుతుందనీ ఆ టెలెగ్రామ్‌లో వుంది.

"అయ్యో, మీకో మంచి వార్త చెప్పనే లేదు! వో మంచి కుర్రాడు, భేషైన కుర్రాడు వలంటీర్‌గా వస్తానన్నాడు. కాని యేం జరిగిందో తెలీదు అతనికి యేవో అడ్డంకులు వచ్చేయి. మీరు కొంచెం శ్రమ అనుకోకుండా అతని తరఫున వో చీటీ రాసివ్వాలి. కౌంటెస్ లిదియా ఇవానొవ్నా అతన్ని పంపించింది."

ఆ యువకుడి గురించి ప్రిన్సెస్ చెప్పిన దాన్నంతట్నీ విని కోజ్నిషెవ్ ఫస్ట్ క్లాస్ వెయి టింగ్ రూమ్‌లోకి వెళ్లి యీ విషయానికి సంబంధించిన వ్యక్తికి చీటీ రాసి ప్రిన్సెస్‌కి యిచ్చేడు.

"మీకు తెలుసో లేదో ప్రసిద్ధ... కౌంట్ వ్రాన్‌స్కీ కూడా యిదే రైలుకి వెడుతున్నాడు" అని ప్రిన్సెస్ చీటీ అందుకుంటూ ఉత్సాహంగా, అర్థగర్భితంగా మందహాసం చేస్తూ చెప్పింది.

''వెడతాడని విన్నాగాని యెప్పుడైందీ తెలీలేదు. యీ రైలుకే వెడుతున్నాడా?''

''నేనాయన్ని చూశాను. యిక్కడే వున్నాడు. వాళ్లమ్మగారొక్కరే ఆయన్ని సాగనం పడానికి వచ్చేరు. ఆయన ప్రస్తుతం వున్న పరిస్థితిలో యిదే ఉత్తమం, ఆయన చెయ్యగలిగిన పనులన్నింట్లోకీ.''

''ఆఁ, ఆఁ, అంతే మరి!''

వాళ్లు మాట్లాడుకుంటూ వుంటే జనం గుంపుగా స్టేషన్ రెస్టారెంట్లోకి తోసుకు పోయేరు. కోజ్నిషెవ్, ఆ ప్రిన్సెస్ కూడా జనంతో వెళ్లేరు. వలంటీర్లని ఉద్దేశించి, చేతిలో వైన్ గ్లాస్ పట్టుకున్న వొకాయన ఉచ్చై స్వరంతో మాట్లాడుతున్నాడు. ''మన ధర్మం కోసం, మానవజాతి కోసం, మన సోదరుల కోసం'' అని అతను స్వరం హెచ్చిస్తూ నినదిస్తున్నాడు. ''మీరీ మహత్తర కార్య నిమిత్తం వెడుతూ వున్నందుకు మాస్కో మాత మిమ్మల్ని ఆశీర్వదిస్తోంది. హుర్రా!'' అని అతను ఉచ్చై స్వరంతో, అశ్రు నయనాలతో ముగించేడు.

ప్రతి వాళ్లూ 'హుర్రా' అని అరిచేరు. యింకా యెక్కువ మంది ప్రేక్షకులు గదిలో మూగేరు, వాళ్లు దాదాపు. ప్రిన్సెస్‌ని తోటి పడేశారు.

''ఓహ్! ప్రిన్సెస్, చెప్పండి యెలా వుంది ఉపన్యాసం?'' అని అబ్లాన్‌స్కీ గుంపు మధ్యలో హఠాత్తుగా ప్రత్యక్షమై సంతోషంతో నవ్వుతూ అడిగాడు. ''యేం అద్భుతోపన్యాసం! యెంత హార్దికంగా వుంది! భేష్! కోజ్నిషెవ్‌గారూ, మీరూ యిక్కడే వున్నారా! మీరు కూడా రెండు ముక్కలు చెప్పకూడదూ? వూరికే ప్రోత్సాహం యివ్వడానికి, మీరు బాగా మాట్లాడతారు కదా'' అని అతను ఆదరపూర్వకంగా, మన్ననపూర్వకంగా, సావధానధరితంగా వుండే మందహాసంతో అన్నాడు. కోజ్నిషెవ్ చెయ్యి పట్టుకుని మెల్లిగా ముందుకు తోస్తూ అన్నాడు.

''అబ్బే, లేదు, నేను వూరికి వెడుతున్నా.''

''యెందాకా వెడుతున్నారో తెలుసుకోవచ్చా?''

''వూరికి, మా తమ్ముడి దగ్గరికి'' అన్నాడు కోజ్నిషెవ్.

''అయితే మా ఆవిడ్ని కలుసుకుంటారు. నేనామెకి ఉత్తరం రాశాననుకోండి, కాని ఉత్తరంకంటే ముందే మీరు కలుసుకుంటారు. మరేం అనుకోకుండా మీరు నన్ను చూశారనీ, యిక్కడ నేను all right[1]గా వున్నానని చెప్పండి. ఆమెకి అర్థమవుతుంది. ఆఁ, యీ ముక్క కూడా చెప్పండి నాకు బోర్డు ఉద్యోగం వచ్చిందని... ఆమెకి తెలుసు లెండి. యివన్నీ les petitesmisères de la vie humaine[2]'' అంటూ అతను మరేం అనుకోకండని క్షమాపణ అర్థిస్తున్నట్టు ప్రిన్సెస్‌కేసి తిరిగి అన్నాడు. ''మ్యాకయా ప్రిన్సెస్, లీజా కాదు

---

[1] బాగా (ఇంగ్లీషు).

[2] మానవ జీవితంలోని చిల్లరమల్లర విషయాలు (ఫ్రెంచి).

బీబిష్, వెయ్యి తుపాకుల్ని పన్నెండు మంది నర్సుల్ని పంపిస్తోంది తెలుసా? నే చెప్పలేదూ ఆమె పంపిస్తుందని?'' అన్నాడు.

''ఆఁ, విన్నాను'' అని కోజ్నిషెవ్ అంత ఉత్సాహం చూపించకుండా అన్నాడు.

''యేమిటో మీరు వూరికి వెళ్లిపోవడం బాగా లేదు!'' అన్నాడు అబ్లాన్‌స్కీ. ''రేపు మేం యిద్దరు వలంటీర్లకి వీడ్కోలు విందు యిస్తున్నాం — పీటర్స్‌బర్గ్ వాసి దీమెర్ బర్త్న్యాన్స్కీకీ, మన గ్రీష వెసెలోవ్‌స్కీకీ. యిద్దరూ వెడుతున్నారు. వెసెలోవ్‌స్కీకి మొన్న మొన్ననే పెళ్లయింది. భలే వాడు మనిషి, కదండీ ప్రిన్సెస్?'' అని ఆమెకేసి తిరుగుతూ అన్నాడు.

ప్రిన్సెస్ యే జవాబూ చెప్పకుండా కోజ్నిషెవ్‌కేసి తిరిగింది. తనని వదిలించుకోవాలని వాళ్లు చూస్తున్నారని గ్రహించినా అబ్లాన్‌స్కీకి అది బాధకం కాలేదు. అతను చిరునవ్వు నవ్వి ప్రిన్సెస్ టోపీకి తగిలించుకున్న యీకకేసీ, కాసేపు చుట్టూ వున్న మనుషులకేసీ దేన్నో గుర్తు చేసుకో ప్రయత్నిస్తున్నట్టుగా చూశేడు. చందాల కోసం డబ్బా చేత్తో పట్టుకుని వస్తూ వున్న వో ఆడమనిషిని చూసి తన దగ్గరికి రమ్మని పిలిచి అయిదు రూబుళ్ల నోటు అందులో వేశాడు.

''నా జేబులో పైసలు వుంటే చందా డబ్బా నన్ను మనశ్శాంతిగా వుండనివ్వదు'' అన్నాడు. ''యేమిటి వాళ్ల వార్తలు? చెర్నోగోరియా వాళ్లకి నిజంగా జోహార్'' అన్నాడు.

వ్రాన్‌స్కీ ఆ రైలుకి వెడుతున్నాడని ప్రిన్సెస్ అతనికి చెప్పింది. ''అరె, చెప్పరేం!'' అని అరిచేడు. వో లిప్త కాలం పాటు అతని ముఖం చింతా గ్రస్తంగా కనిపించింది. కాని మరుక్షణంలోనే అతను తూగు నడకతో వెయిటింగ్ రూమ్‌లోకి వెళ్లాడు. చేతుల్ని చెంపల మీద పెట్టుకుని దువ్వుకుంటూ అక్కగారి మృత దేహంమీద పడి తను యెలా వెక్కివెక్కి విలపించిందీ మర్చిపోయి, వ్రాన్‌స్కీ మూర్తిలో వొక వీరుణ్ణి, పాత మిత్రుణ్ణి దర్శిస్తూ అతన్ని కలుసుకుందుకు ఆ గదిలోకి వెళ్లాడు.

''యెన్ని లోటు పాట్లు వున్నా యితని సుగుణాల్ని చెప్పుకోవాలి, లేకపోతే అన్యాయం'' అని అబ్లాన్‌స్కీ వెళ్లిపోయేక ప్రిన్సెస్ కోజ్నిషెవ్‌తో అంది. ''అచ్చమైన రష్యన్. సిసలైన స్లావ్ తత్వం వున్న వాడు. కాని వ్రాన్‌స్కీకి యితన్ని చూడ్డం యిష్టంగా వుండదేమోనని నాకు భయంగా వుంది. మీరేం చెప్పండి, వ్రాన్‌స్కీ దురదృష్టం చూస్తే నాకు కడుపు తరుక్కు పోతోంది. ప్రయాణంలో ఆయనతో మాట్లాడండి'' అంది ప్రిన్సెస్.

''అవకాశం వస్తే యెందుకు మాట్లాడకుండా వుంటాను, మాట్లాడతాను.''

''ఆయనంటే నాకు యెప్పుడూ యిష్టంగా వుండేది కాదు. కాని ఆయన చేస్తున్న యీ పని ఆయనకి నిష్కృతిని ప్రసాదిస్తుంది. తనొక్కడే కాదు, మొత్తం వొక దండుని తన ఖర్చుతో తీసుకు వెడుతున్నాడు.''

''అట, నేనూ విన్నాను.''

గంట మోగింది. అందరూ గుమ్మం వేపు బయల్దేరేరు.

"అదుగో ఆయన!" అని ప్రిన్సెస్ వ్రాన్‌స్కీ వేపు సూచిస్తూ అంది. వ్రాన్‌స్కీ పొడుగాటి కోటు తొడుక్కున్నాడు. వెడల్పు అంచులున్న నల్లని టోపీ పెట్టుకున్నాడు. తల్లి చేతిని చేత్తో పట్టుకుని నడిచి వెడుతున్నాడు. అతని పక్కనే అబ్లాన్‌స్కీ మహా ఉత్సాహంగా మాట్లాడుతూ నడుస్తున్నాడు.

వ్రాన్‌స్కీ కనుబొమలు ముడుచుకుని యెదరకే చూస్తూ వున్నాడు, అబ్లాన్‌స్కీ చెప్పేది యేమీ విననట్టే కనిపించేడు.

బహుశా అబ్లాన్‌స్కీ చెప్పి వుంటాడు, ప్రిన్సెస్, కోజ్నిషెవ్‌లు నుంచున్న వేపు చూశాడు. వ్రాన్‌స్కీ. యేం మాట్లాడకుండా టోపీని యెత్తేడు. వయసు పైబడినట్టు, బాధతో వున్నట్టు కనిపించే అతని ముఖం శిలా నిర్మితంగా తోచింది.

ప్లాట్‌ఫాంమీదకి వచ్చేక అతను యేం మాట్లాడకుండా తల్లి పెట్టెలోకి వెళ్లేందుకు పక్కకి తప్పుకుని దారి యిస్తూ నుంచున్నాడు. తర్వాత తనే పెట్టెలోకి వెళ్లాడు.

ప్లాట్‌ఫాంమీద 'భగవంతుడు జార్‌ని కాపాడు గాక! '* అని గీతం పాడేరు. తర్వాత 'హుర్రా' అనీ 'జిందాబాద్' అనీ అరుపులు వినిపించేయి. వో వలంటీర్ తన ఫెల్ట్ టోపీని వొంచి వందనం చేస్తూ, పుష్ప గుచ్ఛం తలపైన వూపుతూ అట్టహాసం చేశాడు. అతను పొడుగ్గా వున్నాడు. చాలా పడుచు వాడు. అతని ఛాతీ ముడుచుకుపోయి వుంది. అతని పక్కన యిద్దరు ఆఫీసర్లు, వో వయసు మళ్లిన ఆయన — ఆయనకి గడ్డం వుంది, జిడ్డు టోపీ పెట్టుకున్నాడు — యెదరకి తోసుకుపోయేరు. వాళ్లూ వందనం చేశారు.

## 3

ప్రిన్సెస్ దగ్గర సెలవు తీసుకుని కోజ్నిషెవ్, కతవాసొవ్‌తో కలిసి కిక్కిరిసి వున్న పెట్టెలోకి వెళ్లేడు. రైలు కదిలింది.

త్సరీత్సినొ స్టేషన్లో యువ జనం 'యశస్సు మీది' అని పాడుతూ రైలుకి స్వాగతం చెప్పారు. మళ్లీ వలంటీర్లు కిటికీల్లోనుంచి వొంగి వందనం చేశారు. కాని కోజ్నిషెవ్ వాళ్లని పట్టించుకోలేదు. అతను చాలా మంది వలంటీర్‌లని చూశాడు. వాళ్లు యెలాంటి రకం వాళ్లు, యేమిటి వాళ్ల పరిస్థితి అని బాగా తెలుసు. అంచేత వాళ్లంటే అతనికి ఆసక్తి లేక పోయింది. కతవాసొవ్ పాండిత్య వ్యాసంగంలో తల మునకలైపోయి వుండడంవల్ల వలంటీర్ లని చూసే అవకాశం అంతకు ముందు లేకపోయింది అతనికి. దాంతో మహా కుతూహలంగా వీళ్లని చూసి, కోజ్నిషెవ్‌ని వాళ్ల గురించి అడుగుతూ వున్నాడు.

రెండవ తరగతి పెట్టెలోకి వెళ్లి వాళ్లతో మాట్లాడమని కోజ్నిషెవ్ అతనికి చెప్పేడు. తర్వాతి స్టేషన్లో కతవాసొవ్ ఆ సలహాని పాటించేడు.

రైలు ఆగినప్పుడు అతను రెండవ తరగతి పెట్టెలోకి వెళ్లేడు. వలంటీర్లతో పరిచయం కలిగించుకున్నాడు. వాళ్లు వో మూల చేరి గట్టిగా మాట్లాడుకుంటున్నారు. యీ కొత్తగా వచ్చిన మనిషి, యితర ప్రయాణీకులు తమని దృష్టి పెట్టి చూస్తున్నారన్న యెరుక వాళ్లకి వున్నట్టు తెలుస్తూనే వుంది. ముడుచుకుపోయిన ఛాతీ యువకుడు అందరి కంటే గట్టిగా మాట్లాడుతున్నాడు. అతను తాగినట్టు కనిపించేడు. బళ్లో శిక్షణ పొందేటప్పుడు జరిగిన దేన్నో వర్ణించి చెపుతున్నాడు. అతనికి యెదురు గుండా వో ఆఫీసరు కూర్చున్నాడు. అతను గార్డ్స్ యూనిఫాం చొక్కా వేసుకున్నాడు. వయసు మళ్లిన వాడిలాగే వున్నాడు. అతను ఆ యువకుడు చెప్పేది వింటూ చిరునవ్వు నవ్వి తడవతడవకీ అతని మాటలకి అడ్డం వెడుతూనే వున్నాడు. ఆర్టిల్లరీ యూనిఫాం వేసుకున్న మరో ఆఫీసరు పక్కనే వో సూట్‌కేస్‌మీద కూర్చున్నాడు. నాలుగో అతను నిద్రపోతున్నాడు.

కతవాసొవ్ పొడగరి యువకుడితో మాట కదలేశాడు. అతను మాస్కోలో ధనిక వర్తకుడని తెలిసింది. యిరవై రెండేళ్లు తిరక్కుండానే లక్ష్మీ ప్రసన్నం అయిందట. అతను సుకుమారంగా, దుర్బలంగా వుండడంవల్ల పొడయి పోయి వుండడంవల్ల అతనంటే కతవాసొవ్‌కి అయిష్టం కలిగింది. ఆ యువకుడు, ముఖ్యంగా మత్తెక్కి వుండడంవల్ల, తనో వీరుణ్ణని భావించుకుంటున్నాడు, చెడ్డ వెలపరం పుట్టించే తీరులో సొంత డబ్బా వాయించుకుంటున్నాడు.

సర్వీసునుంచి రిటైరైపోయిన మరో ఆఫీసరు కూడా కతవాసొవ్‌కి నచ్చలేదు. అతను జీవితంలో అన్ని రకాల ప్రయత్నాలూ చేశాడు. రైల్వేల్లో పని చేశాడు. నిగామానుగా వున్నాడు. ఫాక్టరీలు నడిపేడు. అతను యీ అన్నిటి గురించీ సమయం సందర్భం లేకపోయినా, పెద్ద పెద్ద మాటలని తప్పుగా వాడుతూ చెప్పేశాడు.

వీళ్లద్దరికీ భిన్నంగా ఆర్టిలరీ మనిషి కతవాసొవ్‌కి బాగా నచ్చేడు. అతను చాలా వినమ్రంగా వున్నాడు. తన గురించి వొక్క ముక్క కూడా చెప్పుకోలేదు. రిటైర్డ్ ఆఫీసరు పరిజ్ఞానం చూసీ, యువ వ్యాపారి వీరత్వం చూసీ ఆశ్చర్య చకితుడైపోయి తన గురించి యేమీ చెప్పుకో లేకుండా వున్నట్టు కనిపించేడు. తనెందుకు సెర్బియా వెడుతున్నాడని కతవాసొవ్ అతన్ని అడిగేడు.

"అందరూ వెడుతున్నారు. సెర్బ్‌లకి సాయపడాలి కదా. వాళ్లపట్ల జాలి చూపించకుండా వుండలేం" అని అతను వినయంగా జవాబు చెప్పేడు.

"అవును, వాళ్లకి ఆర్టిలరీ వాళ్లు మా చెడ్డ అవసరం" అన్నాడు కతవాసొవ్.

"నాకు ఆర్టిలరీలో పెద్ద అనుభవం లేదు. నన్ను ఇన్‌ఫాన్‌ట్రీలో గాని కావల్రీలో గాని వేస్తారేమో."

"ఆర్టిలరీ వాళ్లు బాగా అవసరం అయినప్పుడు ఇన్‌ఫాన్‌ట్రీలో యెందుకు వేస్తారు?"

అని కతవాసొవ్ వ్యాఖ్యానించేడు. ఆ మనిషి వయసుని బట్టి అతను పెద్ద రేంక్ వాడే అయివుంటాడని అతనికి కచ్చితంగా అనిపించింది.

''నేను ఆర్టిలరీలో యెక్కువ లేను. నేను రిటైరైన కేడెట్‌ని*'' అని తను పరీక్ష తప్పిందీ వివరించడం మొదలెట్టేడు.

వీళ్లందర్నీ చూసి కతవాసొవ్‌కి నిరుత్సాహం కలిగింది. వలంటీర్లు మద్యం తాగుదామని స్టేషన్లో దిగగానే యితరులతో మాట్లాడి తనకి కలిగిన అభిప్రాయం సరైందో కాదో చూసుకుందా మనుకున్నాడు కతవాసొవ్. మిలిటరీ యూనిఫాంలో వున్న వో ముసలాయన కతవాసొవ్ వాళ్లతో మాట్లాడ్డం విన్నాడు. కతవాసొవ్ వొంటరిగా వుండగా చూసి మాట కదలేశాడు.

''నానా రకాల జీవితాల వాళ్లు అక్కడికి పోతూ వున్నట్టుంది చూడగా'' అన్నాడు. కతవాసొవ్ తన అభిప్రాయం చెప్పి, దాంతోపాటుగా ముసలతని అభిప్రాయాలు తెలుసుకోవాలన్న తీరులో అన్నాడీ ముక్కని.

ఆ ముసలాయన ఆఫీసరు. రెండు యుద్ధాల్లో పాల్గొన్నాడు. సైనికుడు యెలా వుండేదీ అతనికి తెలుసు. యీ వలంటీర్‌ల నాజూకుతనం, వాళ్ల మాటలు, మద్యం తాగడానికి సీసాలు యెత్తడం చూసి వాళ్లు మంచి సైనికులు కాదు అని గ్రహించేడు. పైగా అతను వో స్థానిక పట్టణంలో వున్నాడు. తమ వూరినుంచి దొంగ, తాగుబోతు అయిన యువకుడొకడు యెవళ్లూ తనని పనిలో పెట్టుకోనందువల్ల వలంటీరు అయి వెళ్లే వైనం చెప్పబోయాడు. కాని ప్రస్తుతం ప్రజాభిప్రాయం వున్న తీరుని అనుభవంవల్ల గ్రహించి, తద్విరుద్ధంగా యేమన్నా అంటే యెంత ప్రమాదమో తెలిసి, ముఖ్యంగా వలంటీర్లని చులకన చేసే మాటలు అనడం యెంత ప్రమాదకరమో తెలిసి, అతను నోరు కుట్టేసుకున్నాడు. కతవాసొవ్‌తో మాట్లాడేటప్పుడు చాలా జాగ్రత్త, శ్రద్ధ చూపించేడు.

''ఆఁ, కదా, వాళ్లకి పోరాడేవాళ్లు కావాలి మరి'' అని కళ్లల్లో నవ్వు మెరిసేటట్టు అన్నాడు. దాంతో వాళ్ల సంభాషణ యుద్ధం గురించిన తాజా సమాచారానికి పరిమితం అయింది. టర్కులు అన్ని రంగాల్లోనూ వోడిపోయారని తాజా వార్తలు తెలియ చేస్తున్నాయి, అలాంటి సందర్భంలో మర్నాడు జరిగే యీ నిర్ణాయకమైన పోరులో యెవళ్లతో పోరాడాలని ప్లాన్‌లు చూస్తూ వున్నదీ ఆశ్చర్యంగానే వుంది, యీ యిద్దరూ వొకళ్లనుంచి వొకళ్లు యీ ఆశ్చర్యాన్ని పైకి కనపడకుండా దాచుకున్నారు. ఆ రకంగా యెవళ్లూ తమ అభిప్రాయాల్ని తేలకుండా విడిపోయేరు.

తన పెట్టెలోకి తిరిగి వెళ్లేక కతవాసొవ్ కోజ్నిషెవ్‌కి వలంటీర్ల గురించి మనసులో అనుకున్నది కాక వేరే అభిప్రాయం చెప్పేడు. అతని ప్రకారం వాళ్లు మంచి కుర్రాళ్లన్న అభిప్రాయం కలుగుతుంది.

తర్వాత పెద్ద స్టేషన్లో వలంటీర్‌లకి మళ్లీ పాటలతో జైజై ధ్వానాలతో స్వాగతం లభించింది. మళ్లీ చందాల డబ్బా చుట్టూ తిరిగింది. మళ్లీ స్థానిక మహిళలు పువ్వులు

లెచ్చేరు. వలంటీర్‌లు స్టేషన్ రెస్టారెంట్‌లోకి వెళ్లేరు. కాని యిదంతా మాస్కోలో వున్నంత ఉత్సాహంగా లేదు, తక్కువ స్థాయిలో జరిగింది.

## 4

రైలు వో గుబేర్నియా కేంద్రంలో ఆగింది. కోజ్నిషెవ్ ఫలహారశాలలోకి వెళ్లకుండా ప్లాట్‌ఫాంమీద అటూ యిటూ పచారు చెయ్యడం మొదలుపెట్టాడు.

మొదటి సారి వ్రాన్‌స్కీ పెట్టె పక్కనుంచి వెళ్లినప్పుడు కిటికీమీద తెర లాగి వుండడం చూశేడు. తర్వాత సారి వృద్ధ కౌంటెస్ కిటికీ దగ్గర కనిపించింది. ఆవిడ అతన్ని పిలిచింది.

“నేను మా వాడికి వీడ్కోలు చెప్పడానికి కూర్‌స్క్‌దాకా వెడుతున్నాను” అందావిడ.

“అలా అని విన్నాను” అని కోజ్నిషెవ్ కిటికీ పక్కన ఆగి లోపలికి తొంగి చూస్తూ అన్నాడు. “యెంత మహోన్నతమైన పని చేస్తున్నాడతను!” అని వ్రాన్‌స్కీ పెట్టెలో లేడని చూసి అన్నాడు.

“అంత ఘోరం జరిగేక మరింకేం చెయ్యగలడు?”

“దారుణం! మహా దారుణం” అన్నాడు కోజ్నిషెవ్.

“అబ్బ, యెంత దుర్భర వేదన అనుభవించా ననుకున్నారు! కాని లోపలికి రండి... అబ్బ, యెంత దుర్భర వేదన అనుభవించా ననుకున్నారు!” అని కోజ్నిషెవ్ పెట్టెలోకి వెళ్లి ఆవిడ పక్కన కూర్చున్నాక రెట్టించింది. “చెప్పినా నమ్మలేరు! ఆరు వారాల పాటు వొక మాటా పలుకూ కూడా లేదు. నేను కడుపూ కాళ్లూ పట్టుకు బతిమాలితే వో పిసరు కతికేవాడు. వొక్క క్షణం కూడా తనని వదిలిపెట్టి వుండడానికి వీల్లేకపోయింది. ప్రాణాపాయ కరంగా వుండే ప్రతిదాన్నీ అందుబాటులో లేకుండా చేసేవాళ్లం. మేం కింది భాగంలోనే వుండేవాళ్లం. అయితేనేం అనుక్షణం వో కంట చూసుకుంటూ వుండేవాళ్లం. మీకు తెలుసు కదా ఆ ఆడదాని కోసం వో సారి పిస్తోలు గుండు తనమీదనే పేల్చుకున్నాడు” అని ఆ స్మృతి రాగానే ముఖం ముడుచుకుని ఆవిడ చెప్పింది. “యేముందీ, తనలాంటి ఆడవాళ్లు యేం చేస్తారనుకుంటామో అదే చేసి ప్రాణం తీసుకుంది. తను చచ్చిన చావు కూడా నీచంగా, అసహ్యంగా వుంది” అని వ్యాఖ్యానించింది ఆవిడ.

“మనం యెవళ్లం నిర్ణయించడానికి కౌంటెస్” అని కోజ్నిషెవ్ నిట్టూరుస్తూ అన్నాడు. “కాని మీకిది యెంత నరక యాతనగా వుండిందో నేను అర్థం చేసుకోగలను” అన్నాడు.

“అబ్బబ్బ! చెప్పకండి! నేను జాగీర్లో వున్నాను, తనూ నాతోనే వున్నాడు. అప్పుడె

వళ్లో యేదో చీటీ తెచ్చేరు, దానికి జవాబు రాసి పంపేడు. ఆమె రైల్వే స్టేషన్ దగ్గర వుందని మాకు తెలవనే తెలవదు. రాత్రయింది, నేను నా గదికి వెళ్లేను, మా పని మనిషి చెప్పింది యెవరో ఆడావిడ రైలు కింద పడిందని. నాకా వార్త పిడుగు పాటులా వచ్చిందను కోండి. ఆమే అని నాకు అనిపించింది. నేను అన్న మొదటి ముక్క యేమిటో తెలుసా మీకు, తనకి యీ వార్త చెప్పద్దని! కాని వాళ్లు అప్పటికే చెప్పేశారు. బండి తోలేవాడు అక్కడే వుండి సర్వం చూశాడట. నేను వెంటనే మా వాడి గదిలోకి పరిగెత్తివెళ్లి చూద్దును కదా మనలో లేడు. మనిషిని చూడ్డానికే భయం వేసింది. నాతో వొక్క మాట కూడా అనకుండా స్టేషన్‌కి గుర్రాన్ని దౌడు తీయించి వెళ్లిపోయేడు. అక్కడేం జరిగిందో నాకు తెలీదు కాని శవాన్ని మోసుకొచ్చినట్టు తిరిగి మోసుకొచ్చారు వాణ్ణి! నేనే గుర్తు పట్టలేకపోయేను. Prostration complète[1] అన్నాడు డాక్టరు. తర్వాత మనిషికి పిచ్చెక్కినంత పనైంది.

"కాని యిప్పుడు ఆ చర్చ చేసి యేం లాభం?" అని కౌంటెస్ చెయ్యి విసురుతూ అంది. "చాలా ఘోరమైన రోజు లనుకోండి. మీరెన్ని చెప్పండి, ఆమె దుష్టురాలు. యింత భయం కరమైన వ్యామోహాలుంటాయని యెరుగుదునూ? తను మామూలు తరహా మనిషి కాదని చూపించడానికే అంతా చేసింది. చేసి చూపించింది. తననీ నాశనం చేసుకుంది, యిద్దరు మణిపూసల్లాంటి మగాళ్లనీ — తను కట్టుకున్న మొగుణ్ణీ, రాత బాగా లేని నా కొడుకునీ నాశనం చేసింది" అంది కౌంటెస్.

"ఆమె భర్త యెలా వున్నాడు?" అని కోజ్నిషెవ్ అడిగేడు.

"ఆమె కూతుర్ని తీసుకున్నాడు. మొదట్లో మా వాడు ప్రతిదానికీ వూఁ అన్నాడు. యిప్పుడు తన కూతుర్ని పరాయి వాళ్ల చేతుల్లో పడేశానే అని కుమిలిపోతున్నాడు. కాని మాట అనేశాక వెనక్కి తగ్గడం కుదరదు కదా. అంత్యక్రియలకి కరేనిన్ వచ్చేడు. కాని ఆయన మా అబ్బాయిని కలవకుండా వుండేటట్టు జాగ్రత్త పడ్డాం. భర్తగా ఆయనకి మేలే జరిగింది లెండి. ఆయన్ని బంధ విముక్తుణ్ణి చేసింది. కాని నా కన్న కొడుక్కి ఆమే జీవిత సర్వస్వం. ఆమె కోసం తను సర్వం అర్పించేడు. తన జీవికని త్యజించేడు. నన్ను త్యజించేడు. అయినా ఆమె మా వాడిపట్ల కనికరం చూపించలేదు; ఉద్దేశపూర్వకంగా కావాల్సికి ఆరు నిలువుల లోతు పాతేసింది. మీరెన్ని చెప్పండి, ఆమె చావు పాపం పుణ్యంలేని భయంకరమైన ఆడదాని చావు. యీ ముక్క అంటున్నందుకు దేవుడు నన్ను రక్షించాలి, కాని నా కొడుకు బతుకు బుగ్గి చేసినందుకు ఆమె పేరు చెబితే రోత కలక్కుండా వుంటుందా నాకు" అంది.

"అయితే అతను యిప్పుడెలా వున్నాడు?"

"దేవుడు చల్లగా చూసి యీ సెర్బియన్ యుద్ధాన్ని వరంలా ప్రసాదించేడు. నేను ముసలిదాన్ని, యీ గొడవేమిటో నాకు బోధ పడదు. కాని యీ యుద్ధాన్ని మా వాడి కోసం

---

[1] పూర్తిగా మతి తప్పిపోయింది (ఫ్రెంచి).

దేవుడు పంపించేడు. తల్లిగా నాకు భయం వుండడం సహజమనుకోండి. ముఖ్యంగా ce n'est pas très bien vu à Petersbourg[1] అని వినిపిస్తున్నది. కాని చేసేది యేముంది చెప్పండి. కేవలం యిదొక్కటే వాణ్ణి ఉత్తేజ పరుస్తుంది. మా వాడి నేస్తం యాష్విన్ జూదంలో అన్నిటినీ పోగొట్టుకుని సెర్బియాకి పోవాలని తీర్మానించుకున్నాడు. అతనొచ్చి మా వాణ్ణి బయల్దేర దీశాడు. యిప్పుడు మా వాడికి యిదంటే ఆసక్తి పుట్టింది. మీరు కొంచెం మా వాడితో మాట్లాడండి. వాడి మనసు మళ్లించాలి. అంతలా కుంగి పోయేడు. యివి చాలదన్నట్టు పంటి నొప్పి వొకటి సలుపుతోంది వాణ్ణి. మిమ్మల్ని చూస్తే చాలా సంతోషిస్తాడు. దయచేసి వాడితో మాట్లాడండి. వాడు యిక్కడే యెక్కడో పచార్లు చేస్తున్నాడు'' అంది ఆవిడ.

అతనితో మాట్లాడ్డం తనకి చాలా సంతోషంగా వుంటుందని కోజ్నిషెవ్ అని, అటు వేపు వెళ్లేడు.

## 5

ప్లాట్‌ఫాంమీద బస్తాలు లాట్లుగా పేర్చి పెట్టారు. సాయంకాలం నీడలు నిటారుగా పరుచుకుంటున్నాయి. వ్రాన్‌స్కీ పొడుగాటి కోటు తొడుక్కుని, మెత్తటి టోపీ కళ్లమీద వాలేటట్టు పెట్టుకుని, జేబుల్లో చేతులు పెట్టుకుని బోనులో పెట్టిన జంతువులాగా ఆటూ యిటూ తిరుగుతున్నాడు — యిరవై అడుగులు నడవడం, గిరుక్కున తిరగడం. తను దగ్గరకి వెడుతూ వుంటే వ్రాన్‌స్కీ చూశాడు గాని చూడనట్టు నటిస్తున్నాడని కోజ్నిషెవ్‌కి అనిపించింది. దానివల్ల కోజ్నిషెవ్‌కి ఫరవా యేమీ లేదు. వ్రాన్‌స్కీకీ, తనకీ మధ్యన వ్యక్తి గతంగా యే కోప తాపాలూ లేవు.

కోజ్నిషెవ్ దృష్టిలో వ్రాన్‌స్కీ యీ సమయంలో వొక మహత్తర లక్ష్యం కోసం నడుం కట్టిన ఘనమైన కార్యకర్త. అతన్ని ప్రోత్సహించి ధైర్యం చెప్పడం తన కర్తవ్యం అని అతనికి అనిపించింది. అందుకని అతని దగ్గరికి వెళ్లేడు.

వ్రాన్‌స్కీ ఆగి, అతనికేసి తేరి చూసి గుర్తు పట్టేడు. ముందుకు వచ్చి అతనికి చేతిని ఆప్యాయంగా అందించేడు.

''బహుశా మీకు నన్ను కలుసుకోవాలని అనిపించకపోవచ్చు. కాని మీకు నావల్ల యేమన్నా సాయం కావాలా?'' అని కోజ్నిషెవ్ అన్నాడు.

''మిమ్మల్ని చూస్తేనే మేలు, మరెవళ్లని చూసినా నాకు యీ మాత్రం యిది కూడా

---

[1] పీటర్స్‌బర్గ్‌లో యిదంటే యిష్టం లేదు (ఫ్రెంచి).

వుండదు. మరేం తప్పుగా అనుకోకండి. నా జీవితంలో యేదీ నాకు యిక సంతృప్తి కలిగించదు'' అన్నాడు వ్రాన్‌స్కీ.

''నాకు తెలుసు లెండి. కాని మీకు సాయపడాలను కుంటున్నాను'' అని కోజ్నిషెవ్ వ్రాన్‌స్కీ ముఖంకేసి చూసి అన్నాడు. వ్రాన్‌స్కీ వదనం బాధతో నలిగిపోయింది. ''రీస్తిచ్ గారికి గాని మీలన్‌గారికి గాని* యేదన్నా ఉత్తరం రాసి యమ్మంటారా?'' అని అడిగేడు.

''అబ్బెబ్బె, అఖ్ఖర్లేదు'' లని కోజ్నిషెవ్ అన్న మాటలు బోధపడ కొంత శ్రమ పడి నట్లు అన్నాడు వ్రాన్‌స్కీ. ''మీకేం యిబ్బంది లేకపోతే నాలుగడుగులు నడుద్దాం పదండి. పెట్టెలో చాలా ఉక్కగా వుంది. ఉత్తరం యిస్తానంటారా? అబ్బే, అవసరం లేదు. చచ్చి పోవడానికి సిఫార్సు యెందుకు? టర్క్‌లకి సిఫార్సు అంటారా...'' అని పెదాలతో లీలగా మందహాసం చేస్తూ అన్నాడు. అతని కళ్లు చిరిచిరలాడుతూ వ్యథని వ్యక్తం చేస్తున్నాయి.

''కాని యెవళ్లతోనో వొకళ్లతో సంబంధాలు పెట్టుకోవాలి కాబట్టి ఉత్తరంద్వారా ఆ వ్యక్తి పరిచయం అయితే బాగుంటుంది కదా అని. సరే, మీ యిష్టం. మీ నిర్ణయం విని నాకు చాలా సంతోషం కలిగింది. వలంటీర్ల గురించి నానా రకాల మాటలూ వినిపిస్తు న్నాయి. మీ బోటి వారివల్ల సంఘం దృష్టిలో వాళ్లపట్ల గౌరవం పెరుగుతుంది.''

''మనిషిగా నేను యీ లక్ష్యం కోసం బాగా పని కొస్తాను'' అన్నాడు వ్రాన్‌స్కీ. ''యేమంటే నా జీవితానికిప్పుడు యే విలువా లేదు. యిక యుద్ధ రంగంలోకి దూసుకుపోయి చంపడానికో, చావడానికో తగ్గ శారీరక శక్తి విషయం అంటారా, అది నాకు వుంది. నా జీవితాన్ని అర్పించ గల లక్ష్యం యేదో యింకా వున్నందుకు నాకు సంతోషంగా వుంది. నా జీవితం నాకు అవ సరం లేదని కాదు, కాని యేమిటో నాకు వెలపరంగా వుంది. యే కర్తవ్యానికేనా ఉపయోగ పడచ్చు'' అని అతను వొక్కలా సలుపు పెడుతూ, తను ఉద్దేశించిన రీతిలో మాటలు అననియ్యకుండా అవరోధంగా వున్న పంటి నొప్పివల్ల దవడ నొక్కుకుంటూ అన్నాడు.

''నేనిప్పుడు చెబుతున్నా గుర్తుంచుకోండి, మీరు నూతన జీవితంతో తిరిగి వస్తారు'' అని కోజ్నిషెవ్ నిజంగా స్పందించి అన్నాడు. ''మన సోదరుల్ని పారతంత్ర్య విముక్తుల్ని చేసే లక్ష్యం జీవించడానికీ, మరణించడానికీ యోగ్యమైంది. పరాత్పరుడు మీకు విజయాన్నీ, మనశ్శాంతినీ ప్రసాదిస్తాడు'' అని కోజ్నిషెవ్ చేతిని చాస్తూ అన్నాడు.

వ్రాన్‌స్కీ అతని చేతిని గట్టిగా అదిమేడు.

''సాధనంగా నేను పనికి రావచ్చు, కాని మనిషిగా శిధిలం అయిపోయేను'' అని గొణి గేడు.

పంటి నొప్పి సలపడంవల్ల నోరు లాలాజలంతో నిండి అతను గట్టిగా మాట్లాడ లేకపోయేడు. అతని కళ్లు పట్టాలమీద మెల్లిగా దొర్లుకుంటూ పాకిపోయే ఇంజన్ చక్రాలని చూశాయి, అతను యేమీ మాట్లాడలేకపోయేడు.

వున్నట్టుండి శారీరకమైన బాధకాక యేదో యాతనాపూర్వక ఆంతరంగిక నిశ్చేష్టత

క్షణకాలంపాటు అతని పంటి నొప్పిని మరపించింది. ఇంజన్‌నీ, పట్టాలనీ చూడగానే, ఆ విషాద సంఘటన తర్వాత యిప్పటిదాకా తను కలుసుకోని మిత్రునితో మాట్లాడేటప్పుడు, అతనికి "ఆమె", లేదా "ఆమె" పేరుమీద మిగిలిన అవశేషం, తను పిచ్చి వాడిలా రైల్వే స్టేషన్‌కి పరిగెత్తి వెళ్ళినప్పుడు కనిపించినటువంటిది, స్ఫురణకి వచ్చింది. అంతకు ముందు దాకా జీవిత పూర్ణత్వంతో తొణికిసలాడిన ఆమె శరీరం రక్తసిక్తమై పరాయి వాళ్ళ మధ్య నిస్సిగ్గుగా బల్లమీద వుంది. ఆమె తల యేమీ గాయపడలేదు, వెనక్కి వాలి వుంది. భారమైన కురులు ఆమె శిరసుమీదనుంచి వేలాడుతున్నాయి. కణతల దగ్గర ముంగురులు ఉంగరాలు చుట్టుకున్నాయి. యెర్రటి నోరు సగం తెరుచుకున్న ఆ అందమైన ముఖంలో వొక నిగూఢ ఘనీభూత భావం, దయనీయంగా తెరుచుకున్న కళ్ళమీదా, అధరాలమీదా భయంకరంగా ద్యోతకమైంది. కడసారి తాము దెబ్బలాడుకున్నప్పుడు ఆమె అన్న మాటలని అభివ్యక్తం చేస్తున్నట్టుగా వుందా భావం — 'నువ్వు యిందుకు పశ్చాత్తాప పడతావు.'

మొట్టమొదటి సారి రైల్వే స్టేషన్లో ఆమెని కలుసుకున్నప్పుడు యెలా వుందో ఆ రూపంలో ఆమెని గుర్తు చేసుకో ప్రయత్నించేడు — నిగూఢంగా, కమనీయంగా, ప్రేమపూరితంగా, ఆనందాన్ని పొందడానికీ అందివ్వడానికీ ఆతురంగా వున్న రూపంలో; కాని కడసారి కలుసుకున్న నాడు వున్న మాదిరీ క్రూరంగా పగతీర్చుకునే రీతిలో ఆమె స్మృతి మిగిలిపోయింది. తామిద్దరూ కలిసి గడిపిన మధుర క్షణాల్ని మననం చేసుకో ప్రయత్నించేడు. కాని ఆ క్షణాలు శాశ్వతంగా విష పంకిలం అయిపోయేయి. నిరర్థక, అనశ్వర పశ్చాత్తాపంతో అతనికి నాశనం కలగ చేస్తానన్న బెదిరింపుని అమలు జరిపి, తన మృతిద్వారా విజయం సాధించినట్టుగానే ఆమె అతని స్మృతికి వచ్చింది. దంత బాధని అతనిప్పుడు మరిచిపోయేడు. యెక్కి వస్తూ వున్న వెక్కిళ్లతో అతని ముఖం మెలికలు తిరిగిపోయింది.

బస్తాల దగ్గరికి యేం మాట్లాడకుండా వెళ్లి వొకటి రెండు సార్లు పచార్లు చేసి, కొంచెం చిక్క బట్టుకున్నాక వ్రాన్‌స్కీ శాంతంగా కోజ్నిషెవ్‌తో అన్నాడు:

"నిన్నటి వార్తల తర్వాత కొత్త సమాచారం యేమన్నా విన్నారా? టర్కులని మూడు సార్లు వోడించారని విన్నాను. కాని నిర్ణాయకమైన పోరు రేపు జరుగుతుంది."

మిలన్‌ని చక్రవర్తిని చేసిన సంగతి గురించీ, దాని ఫలితంగా వచ్చే బ్రహ్మాండమైన మార్పుల గురించీ కొంచెం సేపు మాట్లాడుకున్నారు. అప్పుడు రెండవ సారి మోగిన గంట విని యెవళ్ల పెట్టెలోకి వాళ్లు వెళ్లిపోయేరు.

## 6

తను మాస్కోనుంచి యెప్పుడు బయల్దేరబోయేదీ యిదమిత్థంగా తెలియకపోవడంతో కోజ్నిషెవ్ తమ్ముడికి స్టేషన్‌కి రమ్మని టెలిగ్రాం యివ్వలేకపోయేడు. స్టేషన్ దగ్గర

అద్దె బగ్గీ కుదుర్చుకుని కోజ్నిషెవ్, కతవాసావ్‌లు పోక్రోవ్‌స్కాయె చేరే వేళకి లేవిన్ యింట దగ్గర లేడు. కోజ్నిషెవ్, కతవాసావ్‌లిద్దరూ దుమ్ము కొట్టుకుపోయేరు. కిట్టీ తండ్రితో, దాలీతో కలిసి బాల్కనీలో కూర్చుంది. బావగార్ని గుర్తుపట్టి, అతన్ని కలుసుకుందుకు కిందికి పరిగెత్తింది.

"యేమిటి, కబురేనా చేశారు కాదు" అని చెయ్యి చాచి కోజ్నిషెవ్‌కి అందించి, అతను అభివాదపూర్వకంగా చుంబించడానికి నుదురు అతని ముందు పెడుతూ అంది.

"మేం హాయిగా యిక్కడికి వచ్చేం, మిమ్మల్ని యిబ్బంది పెట్టకుండా" అన్నాడతను. "చాలా దుమ్ము కొట్టుకు పోయి వున్నాను, నీ నుదురు చుంబించాలంటే భయంగా వుంది. బోలెడు పనులుండి పోవడంతో యెప్పుడు బయల్దేరతామో తెలీలేదు. మీరు మీ మీ లోకాల్లో హాయిగా మనశ్శాంతిగా వుంటున్నారు ముందటిలాగా" అని అతను చిరునవ్వుతో అన్నాడు. "యితను మా మిత్రుడు కతవాసావ్. ఆఖరికి యిక్కడికి రావడానికి తీరిక చేసుకున్నాడు" అన్నాడు.

"నన్ను చూసి నల్లని నీగ్రో అనుకునేరుస్మా! కాస్త కాళ్ళూ చేతులూ ముఖం కడుక్కున్నాక మళ్లీ మనిషవుతాను చూద్దురు గాని" అని కతవాసావ్ తన హాస్య ధోరణిలో అంటూ, దుమ్ము కొట్టుకుపోయిన ముఖంలో మరీ తెల్లగా మెరుస్తూ వున్న పల్లు కనిపించేట్టు చిరునవ్వు నవ్వుతూ చేతిని చాచేడు.

"తను చాలా సంబర పడిపోతాడు. పొలానికి వెళ్లేడు. వచ్చేస్తూ వుంటాడు."

"యింకా వ్యవసాయంలోనే యిరుక్కుపోయి వున్నాడు. తన వేరు లోకం" అన్నాడు కతవాసావ్. "బస్తీలో మాకు సెర్బియన్ యుద్ధం తప్ప వేరే యేం కనిపించడం లేదు. యేమంటున్నాడు మా మిత్రుడు దాన్ని గురించి? మామూలు మనుషుల మాదిరీ వుండదు, అది ఖాయం" అన్నాడు.

"అబ్బెబ్బె, కాదు. అందరూ అనుకుంటున్నట్టే అనుకుంటున్నాడు" అని కిట్టీ యిబ్బంది కరంగా కోజ్నిషెవ్‌కేసి చూస్తూ అంది. "నేను ఆయన కోసం కబురు చేస్తాను. నాన్నగారు యిక్కడే వున్నారు. ఆయన మొన్నీమధ్యనే విదేశాలనుంచి తిరిగివచ్చేరు" అంది.

ఆమె లేవిన్‌కి కబురు పంపించింది. వొకళ్లకి చదువుకునే గదిలోనూ, మరొకళ్లకి దాలీ పెద్ద గదిలోనూ వుండడానికి అతిథులకి యేర్పాట్లు చెయ్యమని పురమాయించింది. వాళ్ల స్నానాదికాలకీ, నాస్తాలకీ యేర్పాట్లు చేసింది. తర్వాత బాల్కనీలోకి తిరిగివెళ్లింది. కడుపుతో వున్నప్పుడు తన యిష్టం వొచ్చినట్టు చకచకా నడవనివ్వకుండా పోయిన అవకాశాన్ని ఉపయోగ పెట్టుకుంటున్నందుకు ఆమెకిప్పుడు ఆనందంగా వుంది.

"కోజ్నిషెవ్, ప్రొఫెసర్ కతవాసావ్ వచ్చేరు" అని చెప్పింది.

"అబ్బ, యీ యెండలో యెంత కష్టం!" అన్నాడు వృద్ధ ప్రిన్స్.

"లేదు, నాన్నా, ఆయన చాలా మంచి వాడు, మీ అల్లుడికి ఆయనంటే చాలా యిష్టం"

అని కిట్టీ తండ్రి ముఖంలో కనిపించిన హాస్యపూరిత ధోరణి చూసి ఆయన్ని వొప్పిస్తున్నట్టు చిరునవ్వు నవ్వుతూ అంది.

"ఆయనంటే నాకే వ్యతిరేకతా లేదు."

"వూ, నువ్వొక సారి వాళ్ల దగ్గరికి వెళ్లవూ" అని కిట్టీ దాలీతో అంది. "కొంచెం వాళ్లకి యేం కావాలో చూడు. స్టేషన్లో వాళ్లకి బావ కనిపించేట్ట. బాగా వున్నాడని చెప్పారు. నేను మీత్య దగ్గరికి వెళ్లాలి. పాపం వాడికి నాస్తా తర్వాత పాలు పట్టించలేదు. వాడు లేచి యేడుస్తున్నాడేమో మరి" అని స్తనాల్లో పాలు పొంగడం అనుభూతి చెందుతూ ఆమె చంటి పిల్లాడి గదికి వెళ్లింది.

ఆమె వాస్తవం వూహించిందని కాదు (శిశువుకీ తనకీ మధ్య యింకా శారీరక బంధనాలు వున్నాయి) కాని స్తనాల్లో పొంగుతూ వున్న పాల ప్రవాహాన్ని బట్టి వాడికి ఆకలిగా వుందని గ్రహించింది.

చంటి పిల్లాడి గదిలోకి వెళ్లక ముందే ఆమెకి తెలుసు వాడు యేడిచి గోల చేస్తూ వుంటాడని. నిజానికి వాడు యేడుస్తూనే వున్నాడు. వాడి యేడుపు విని ఆమె యింకా గబగబ నడిచింది. కాని ఆమె నడక వేగం హెచ్చే కొద్దీ వాడి యేడుపూ యెక్కువైంది. అది ఆరోగ్యంగా వున్న చక్కని గొంతుక, కాని ఆకలిగా చిరాగ్గా వున్న గొంతుక.

"దాదీ, చాలా సేపటిగా యేడుస్తున్నాడా?" అని కూర్చుని పిల్ల వాడికి పాలు పట్టించేందుకు తయారవుతూ గబగబా అడిగింది. "వాణ్నిలా యియ్యి, వూ గబగబా! అబ్బ, దాదీ, యేమిటా నిదానం! టోపీ తర్వాత కట్టచ్చులే" అంది.

పిల్లవాడు ఆకలితో గుక్క తిప్పుకోకుండా యేడుస్తున్నాడు.

"వుహూ, అలా చెయ్యడం సరి కాదమ్మా" అని దాదాపు రోజంతా చంటిపిల్లాడి గదిలోనే కాలక్షేపం చేస్తూ వున్న అగాఫ్యా మిహైలొవ్నా అంది. "చిన్న బాబుని సరిగ్గా ముస్తాబు చెయ్యాలి, ఛీ, ఛీ, ఛీ, ఛీ" అని పిల్లవాణ్ణి చూసి ముద్దులు కురిపిస్తూ, తల్లి మాటలు లక్ష్య పెట్టకుండా, అంది.

దాది పిల్లవాణ్ణి కిట్టీ దగ్గరికి తీసికెళ్లింది. అగాఫ్యా మిహైలొవ్నా స్నేహార్ద్ర వదనంతో కూడా కూడా వెళ్లింది.

"నన్ను గుర్తు పడుతున్నాడు, గుర్తు పడుతున్నాడు! దేవుడు సాక్షి! కిట్టీగారూ! చిన బాబు నన్ను గుర్తు పడుతున్నాడు!" అని అగాఫ్యా మిహైలొవ్నా పిల్లవాడి యేడుపు స్థాయికంటే హెచ్చు స్థాయిలో అరిచింది.

కాని కిట్టీ ఆమె మాటలు వినడం లేదు. పిల్లవాడి చిరాకుతో సమంగా ఆమె చిరాకూ యెక్కువవుతూ వుంది.

యీ చిరాకువల్ల తల్లీ పిల్లాడూ యిద్దరూ తంటాలు పడుతూ వున్నా లాభం లేక పిల్లవాడు స్తనాన్ని నోటి దగ్గరకి తీసుకోలేకపోయేడు, దాంతో మరింత గింజుకులాడి పోయేడు.

ఆఖరికి, వృధా ప్రయత్నాలు యేడుపులు అయిం తర్వాత అన్నీ గాడిలో పడ్డాయి. పిల్లాడూ తల్లీ శాంత పడ్డారు.

"అయ్యో, బాబూ, వొళ్లంతా చెమట పట్టేసింది కదరా" అని పిల్లాణ్ణి ముద్దు పెట్టుకుంటూ గుసగుసలాడింది కిట్టీ. "వీడు మిమ్మల్ని గుర్తుపట్టాడని యెలా అనుకున్నారు మీరు?" అని కిట్టీ తల వోరగా పెట్టి పిల్లవాడి కళ్లకేసి చూస్తూ అగాఫ్యా మిహైలొవ్నాని అడిగింది. పిల్లాడి కళ్లు టోపీ కిందనుంచి కొంటెగా మెరుస్తూ వున్నట్టు ఆమెకి అనిపించింది. వాడి బుగ్గలు హెచ్చు తగ్గులు లేకుండా చప్పరిస్తున్నాయి. యెర్రటి హస్తం వున్న వాడి చిన్న చెయ్యి గాలిలో చక్రాలు తిప్పుతోంది.

"అలా జరగదు! యెవళ్లనేనా గుర్తుపట్టగలిగితే అది నన్నే" అని కిట్టీ చిరునవ్వు నవ్వుతూ అగాఫ్యా మిహైలొవ్నా మాటకి జవాబుగా అంది.

కిట్టీ మందహాసం చెయ్యడానికి కారణం వుంది. పిల్లాడు ఆమెని గుర్తుపట్టలేడు అని తను అంటూ వున్నా, వాడు కేవలం అగాఫ్యా మిహైలొవ్నానే గాక వేరే వాళ్లు గుర్తుపట్టలేని, తెలుసుకోలేని చాలా వాటిని యెరుగుననీ, గుర్తుపట్టగలడనీ, పిల్లవాడి తల్లి అయిన తను కూడా వాడి పుణ్యమా అని వాటినన్నిట్నీ తెలుసుకోగలిగిందనీ ఆమెకి హృదంతరాళంలో తెలుసు. అగాఫ్యా మిహైలొవ్నాకి, దాదికి, తాతకి, తండ్రికి కూడా మీత్యా వొక ప్రాణి, కేవలం తన ఆలనాపాలనా చూడమని కోరే జీవి మాత్రమే. కాని తల్లికి మాత్రం వాడు యెప్పట్నుంచో వొక నైతిక అస్తిత్వం వున్న జీవి, వాడికీ ఆమెకీ మధ్య ఆత్మిక సంబంధాల పూర్తి చరిత్ర విద్యమానంగా స్థాపితమైంది.

"అదే నిజమైతే పిల్లాడు లేచాక మీరే స్వయంగా చూద్దురు గాని. నేను ఛీ, ఛీ అని లాలిస్తాను, బాబు మురుస్తాడు. యెంత ముద్దొస్తున్నాడు నాకు బాబు! యెంత కిలకిలలాడుతున్నాడు! సూర్యరశ్మితో ప్రకాశమానంగా వున్నట్టు!" అంది అగాఫ్యా మిహైలొవ్నా.

"సరే, మంచిది, అప్పుడు చూద్దాం. యిప్పుడు వెళ్లిపోండి, వాడి కళ్లు మూతలు పడుతున్నాయి" అని కిట్టీ మెల్లిగా అంది.

## 7

అగాఫ్యా మిహైలొవ్నా మునికాళ్లమీద అవతలికి వెళ్లిపోయింది. దాది తెరలు దించింది. పిల్లవాడి మంచంమీద తెరలో దూరిన యీగల్ని తోలేసింది. కిటికీ అద్దంమీద రొదపెడుతూ వున్న కందిరీగనీ తోలేసింది. అప్పుడు తల్లినీ పిల్లవాడినీ వాడిపోయిన బర్చ్ కొమ్మతో విసురుతూ కూర్చుంది.

"అమ్మమ్మ! యెంత వేడిగా వుంది! ఉఫ్! దేవుడు దయ తలచి వో జల్లు పడితే బాగుణ్ను!" అంది.

"ఆఁ, ష్... ష్..." అని మాత్రమే అంది కిట్టీ. మెల్లిగా వెనక్కీ ముందుకి కొంచెంగా వూగుతూ మిత్య కళ్లు మూస్తూ తెరుస్తూ, అలసంగా ఆడిస్తూ వున్న బొద్దు చేతిని మెల్లిగా ప్రేమగా అదిమింది. వాడి చేతి మణికట్టు దగ్గర వొత్తుగా ముడత పడింది. ఆ చెయ్యి కిట్టీని పురి కొల్పుతోంది. దాన్ని ముద్దుపెట్టుకుందామని ఆమెకి కోరిక పుట్టింది, కాని వాణ్ణి నిద్ర లేపుతామేమోనని వో పక్క భయం కలిగింది. ఆఖరికి ఆ చెయ్యి వూగడం ఆగింది. కళ్లు మూతలు పడ్డాయి. చను బాలు తాగే బిడ్డ కేవలం మధ్య మధ్య తన నిడుపాటి వంపులు తిరిగిన పక్ష్మాలు యెత్తి మసక వెలుతురుతో వున్న గదిలో నల్లగా నిగనిగలాడే కళ్లతో తల్లి కేసి చూశేడు. దాది విసరడం మానేసి జోగుతోంది. పైనుంచి వృద్ధ ప్రిన్స్ ఉచ్చై స్వనం, కతవాసొవ్ నవ్వు వినవచ్చేయి.

'నేను లేకపోయినా వాళ్లు కలిసి పోయినట్టున్నారు' అనుకొంది కిట్టీ. 'ప్చ్, యేమిటో తను యింకా యింటికి రాలేదు. మళ్లీ తేనెటీగల పెంపకం వాడి దగ్గరికి వెళ్లేడో యేమో. తను అక్కడ అంత సేపు గడపడం నాకు బాధగానూ వుంది, మరో పక్క సంతోషంగానూ వుంది. యీ పనులవల్ల అతని మనసు ధ్యాస మళ్లుతోంది. వసంతరుతువుతో పోలిస్తే అతను బాగున్నాడు, ఉల్లాసంగా వున్నాడు.

'...అప్పుడు యెంతో మబ్బుగా దిగులుగా వుండేవాడు. నాకు భయం వేసేది. యెంత వింత వ్యక్తి అతను...' అని కిట్టీ చిరునవ్వుతో గొణుక్కుంది.

భర్తకి యెందుకు దిగులుగా వుంటుందో ఆమెకి తెలుసు. అతని నాస్తికత. భగవంతుడి మీద విశ్వాసం లేకపోతే ఉత్తర జన్మలో శప్తుడవుతాడా అని ఆమెని అడిగితే అవునని ఆమె అనివుండేది. కాని అతనికి విశ్వాసం లేకపోవడం ఆమెకి బాధాకరం కాలేదు. నాస్తికులకి మోక్షం లేదని తెలిసినా, భర్తని అన్నిటికంటే యెక్కువ ప్రాణప్రదంగా చూసుకున్నా కూడా ఆమె చిరునవ్వుతో అతని నాస్తికత్వాన్ని గురించి ఆలోచించగలిగేది, అతను వింత వ్యక్తి అని తనకి తను చెప్పుకునేది.

'యెందుకని అతను యేటి పొడుగూతా తత్వశాస్త్రం చదువుతూ వున్నాడు? ఆ పుస్తకాల్లో సర్వం రాసి వుంటే యీ పాటికి అతను గ్రహించగలిగేవాడు. వొకవేళ వాటిలో సత్యం లేనట్లయితే చదవడం యెందుకు? విశ్వాసం కోసం తపిస్తున్నానని తనే అంటాడు మళ్లీ. మరి యెందుకు విశ్వసించలేడు? బహుశా అతిగా ఆలోచించడంవల్లనో యేమో అనిపిస్తుంది నాకు. యెప్పుడూ వొంటరిగా, వొక్కడూ వుండిపోతాడు అందుకని అతిగా ఆలోచిస్తాడు. మాతో ఆ విషయాలన్నిట్నీ చర్చించడు. నేననుకోవడం వీళ్లని, ముఖ్యంగా కతవాసొవ్‌ని, చూసి చాలా సంతోషిస్తాడని. ఆయనతో వాదనంటే అతనికి యిష్టం' అనుకొంది ఆమె. అప్పుడు కతవాసొవ్‌కి పడక యేర్పాట్లు బాగా వుండేటట్టు చెయ్యడం గురించి అనుకొంది. కోజ్నిషెవ్‌తో కలిసి వొక గదిలో వుంచాలా లేక వేరే గదిలో వుంచాలా ఆయన్ని అనుకొంది. యీ ఆలోచన వస్తూనే వెంటనే మరో ఆలోచనా తట్టింది, అది ఆమెని

వ్యాకుల పరిచి బెదరగొట్టింది. దాంతో ఆమె మీత్య నిద్ర చెడగొట్టింది. వాడు కళ్ళు తెరిచి యేమిటిదన్నట్టు కటువుగా ఆమెకేసి చూశేడు. 'చాకలి బట్టలు తేలేదు, చుట్టాల కోసం విడిగా పెట్టిన పక్క బట్టలన్నీ వాడేశాం. అగాఫ్యా మిహైలొవ్నాతో చెప్పకపోతే వాడిన పక్కబట్టలు కోజ్నిషెవ్‌కి యిస్తుందో యేమో!' అలాంటి ఆలోచన తట్టగానే ఆమెకి బుగ్గలు యెరుపెక్కిపోయేయి.

'ఆఁ, ఆమెతో చెప్తాను' అని సమాధాన పరచుకుని తన ముందటి ఆలోచనలకి మళ్ళింది. తను యేదో పెద్ద విషయాన్ని, ముఖ్యమైందాన్ని గురించి పూరా ఆలోచించలేదని గుర్తు వచ్చింది, అదేమిటైందీ గుర్తు చేసుకో ప్రయత్నించింది. 'ఆఁ, అతనికి విశ్వాసం లేకపోవడం గురించి' అని చిరునవ్వు నవ్వుకుంటూ జ్ఞాపకం చేసుకుంది.

'హుమ్! నాస్తికుడు! అతను అలా వుండడమే మెరుగు, మేడం స్తాల్‌లాగా వుండడం కంటే, విదేశాల్లో వున్నప్పుడు నేను వుండాలనుకున్న దానికంటే. వుహూఁ లేదు, అతను యెప్పుడూ వంచన చెయ్యడు.'

యిలా అనుకోగానే ఉదాహరణగా అతని ఔదర్య లక్షణం వొకటి ఆమెకి స్ఫురణకి వచ్చింది. రెండు వారాల కితం దాలీకి అబ్లాన్‌స్కీనుంచి పశ్చాత్తాపభరిత ఉత్తరం వొకటి వచ్చింది. అందులో అతను తన గౌరవం కాపాడమనీ, జాగీర్ అమ్మేసి తన రుణాలు తీర్చుకోవడానికి సాయపడమనీ ఆమెని వేడుకున్నాడు. దాలీ చాలా ఖేదపడిపోయింది. భర్తని అసహ్యించుకుంది. తిరస్కారంగా చూసింది. అతనిపట్ల ఆమెకి జాలి కలిగింది. అతని అభ్యర్థనని కొట్టి పారేద్దామనుకుంది. అతనికి విడాకులు యిచ్చేద్దామనుకొంది. కాని ఆఖరికి కొంత భాగం జాగీరు అమ్మడానికి సరేనంది. ఆ తర్వాత కిట్టీకి తన భర్త అప్పట్లో యెంత చింత పడిపోయిందీ, యీ సున్నితమైన విషయాన్ని ప్రస్తావించడానికి యెలా ప్రయత్నాలు చేసిందీ, ఆఖరికి వదినగారికి సాయం చెయ్యడానికి ఆమె అహం దెబ్బతినకుండా వొక్కటే మార్గం వుందని నిర్ణయించి ఆమెకి తన జాగీరు వాటా నిమ్మని అడిగిందీ — ఆ విషయం గురించి కిట్టీయే అసలు ఆలోచించలేదు — స్నేహార్ద్రపూరిత మందహాసంతో ఆమె గుర్తు చేసుకొంది.

'మరి తను నాస్తికుడా? అంత మంచి మనసు వున్న వాడు, యెవళ్ల హృదయమేనా, పిల్లల హృదయాన్ని కూడా, నొప్పించాలంటే భయపడే వాడు నాస్తికుడా? అన్నీ యితరుల కోసమే, తన కోసం యేమీ అక్కర్లేదు! తమ్ముడు తన జాగీరుకి నిగామాను అని కోజ్నిషెవ్ అనుకుంటాడు! అతని అక్కగారూ అలానే అనుకుంటుంది! యిప్పుడు దాలీకీ, దాలీ పిల్లలకీ కూడా ఆధారం అయేడు. యిక రోజూ అతని దగ్గరి కొచ్చి మొర పెట్టుకునే రైతులో, అక్కడికి అతను వాళ్ల సేవ కోసమే వున్నట్టు!

'బుజ్జీ, మీ నాన్నలాగా తయారవాలిరా నువ్వు కూడా, అచ్చు అలానే' అని ఆమె మీత్యని దాదికి అందిస్తూ, వాడి బుగ్గల్ని ముద్దుపెట్టుకుంటూ అంది.

లేవిన్ తన ప్రియమైన అన్నగారు మృత్యు శయ్యమీద వుండగా మొదటి సారి 'జీవితం — మృత్యువు' అనే సమస్య గురించి, నూతన విశ్వాసాలు అని తను భావించుకునే ఆ పట్టిక గుండా చూడ్డం ప్రారంభించేడు — తనకి యిరవై, ముప్పై నాలుగు యేళ్ల వయసు మధ్య కాలంలో క్రమేపీ మారుతూ బాల్య, యౌవనప్రాయ విశ్వాసాల స్థానం ఆక్రమించిన ఆ నూతన విశ్వాసాల పట్టిక గుండా చూడ్డం ప్రారంభించేడు. ఆ క్షణంనుంచీ అతనికి జీవితం గురించిన ఆలోచన, దీని ఆవిర్భావం యెక్కడ, యెందుకు వుంది, చరితార్థత యేమిటి, రూపం యేమిటి అనేవి సామాన్య బుద్ధికి అందని కారణంగా, మృత్యువు గురించిన దానికంటే యెక్కువ భయ భ్రాంతంగా కనిపించింది. జీవం, దాని నాశం, పదార్థ అనశ్వరత, శక్తి సంయోజనా నియమం, వికాసం అనే భావనలు అతనికి పూర్వం వుండే విశ్వాసం స్థానాన్ని ఆక్రమించేయి. యీ శబ్దాలు, అవి సూచించే భావనలు, బౌద్ధిక లక్ష్యాల దృష్ట్యా చూసినప్పుడు మహత్తరంగా భాసించేయి. కాని జీవితానికి సంబంధించి యేమీ పనికి రావు. లేవిన్‌కి వున్నట్టుండి తన స్థితి, ఫర్ కోటునిచ్చేసి దోమతెర గుడ్డ చొక్కా సంపాయించుకున్న మనిషి స్థితిల్లాగా, కనిపించింది. మొదటిసారి చలిలోకి వెళ్లినప్పుడు అతగాడికి తర్క వితర్కాలవల్ల కాకుండా తక్షణం కలిగే అనుభవంవల్ల తను దిగంబరుడిలా వున్నట్టూ తనకి అవశ్యం వ్యధా భరిత అంతం ప్రాప్తమవుతూ వున్నట్టూ తెలిసి వివశుడైపోతాడు.

ఆ క్షణంనుంచీ లేవిన్, యీ విషయం గురించిన చేతన లేకపోయినప్పటికీ, యధా ప్రకారం తన జీవితాన్ని సాగిస్తున్నప్పటికీ, తన అజ్ఞాన కారణంగా నిరంతర భయానుభూతికి గురవుతూ వున్నాడు.

విశ్వాసాలు అని తను అనుకునేవి కేవలం అజ్ఞానం మాత్రమే కాక యే జ్ఞానం తనకి అవసరమో దాన్ని పొందడానికి సంభవం కాని చింతనా ధోరణి కూడా అని అతనికి అస్పష్టంగా అంతరంగంలో అవగాహన వుంది.

పెళ్లయిన కొత్తలో కన్నెమెరుపు సుఖాలు, బాధ్యతలు యీ చింతనలని అతని బుర్ర నుంచి పూర్తిగా తప్పించేయి. కాని తర్వాత భార్య కాన్పు అప్పుడు, మాస్కోలో యే పనీ లేకుండా గడిపినప్పుడు అతనికి యీ ప్రశ్న యెక్కువ సార్లు, యెక్కువ తీవ్రంగా సమాధానాన్ని అన్వేషిస్తూ ప్రత్యక్షమైంది.

ప్రశ్న యిలా ప్రత్యక్షమైంది: 'నా జీవితానికి సంబంధించి క్రైస్తవ ధర్మం అందిస్తూ వున్న జవాబుల్ని నేను స్వీకరించకపోతే నేను యే జవాబుల్ని స్వీకరిస్తాను?' అతనికి తన మొత్తం విశ్వాస భాండారంలో జవాబు కనిపించక పోవడమే కాదు, జవాబుని పోలిన లాంటిది కూడా కనిపించలేదు.

అతను ఆట వస్తువుల దుకాణంలో, ఆయుధాల దుకాణంలో ఆహారం కోసం వెతికే వాడిలా వున్నాడు.

అప్రయత్నంగానే, తనకి తెలియకుండానే అతనిప్పుడు ప్రతి పుస్తకంలో, సంభాషణలో, ప్రతి వ్యక్తిలో యీ ప్రశ్నకి సంబంధించిన వైఖరుల్ని, దానికి జవాబుని అన్వేషిస్తున్నాడు.

తన వయసు వాళ్లు, తన పరిధి వాళ్లు చాలా మంది తనకిలాగానే తమ పాత నమ్మకాలని వదిలేసి కొత్త విశ్వాసాలని స్వీకరించినా, వాళ్లకి యే బాధా అనిపించకుండానే అంతకు పూర్వం మాదిరీ సుఖంగా మనశ్శాంతిగా వుండడం చూసి అతనికి ఆశ్చర్యమూ, మనస్తాపమూ కలిగేయి. దాంతో మౌలిక ప్రశ్నకి అదనంగా మరిన్ని జత అయేయి: యీ మనుషులు నిష్కపటంగా వుంటున్నారా లేదా? వాళ్లు వంచన చెయ్యడం లేదు కదా? తమని కలవర పెట్టే సందేహాలకి విజ్ఞానశాస్త్రం ప్రసాదించే జవాబులని తనకంటే మరింత స్పష్టంగా, భిన్న రీతిలో అవగాహన చేసుకుంటున్నారా? అంచేత యీ జనాల అభిప్రాయాల్నీ, యీ సమస్యలని స్పృశించిన గ్రంథాలనీ అతను దీక్షగా పరిశీలించేడు.

యీ ప్రశ్నలని గురించి అధ్యయనం చేసేటప్పుడు అతనికి విశదం అయిందేమిటంటే తన యౌవన దశని విశ్వవిద్యాలయం రోజులని ఆధారం చేసుకుని మతం గతం అయిపోయిందని, ప్రకృతంలో దానికి యే ఉనికీ లేదని తీర్మానించడం తప్పు అని. మంచి వాళ్లందరూ, తనకి సన్నిహితులైన అందరూ ఆస్తికులే. వృద్ధ ప్రిన్స్, తనకి బాగా యిష్టుడైన ల్వోవ్, కోజ్నిషెవ్, ఆడవాళ్లందరూ, తన భార్య కూడా, తను శైశవావస్థలో యెలాంటి ఆస్తికతతో వుండేవాడో అదే ఆస్తికతతో వున్నారు. తను యెంతో యెక్కువ ఆదర భావంతో చూసే సామాన్య జనం, అంటే రష్యన్ ప్రజలలో ముక్కాలు మువ్వీసం మంది, కూడా అంతే.

అతను అనేక పుస్తకాలు చదివేక మరో విషయాన్ని కూడా గమనించేడు. తనకిలాంటి అభిప్రాయాలున్న వాళ్లు వాటిని గాఢంగా అర్థం చేసుకున్న వాళ్లు కాదు; తమకి స్పష్టం కాకపోయినా, తను జవాబు లేకుండా బతకలేడనుకుంటూ వున్న ప్రశ్నలని వూరికే ఉపేక్షిస్తారు. నిజానికి వేరే సమస్యల్ని ముందు పెట్టే ప్రయత్నాలు చేస్తారు, తనకి యే మాత్రం ఆసక్తి లేనటువంటి వాటిని. ఉదాహరణకి ప్రాణి కోటి పరిణామం, ఆత్మకి సంబంధించిన యాంత్రిక వ్యాఖ్య లాంటివి.

యివి కాకుండా భార్య ప్రసవ సమయంలో అతనికి వొక అసాధారణ అనుభవం కలిగింది. నాస్తికుడైన తను భగన్నామ స్మరణ చేశాడు, అలా చేసేటప్పుడు విశ్వాసం వుంచేడు. కాని ఆ క్షణం గడిచిపోయింది. ఆ క్షణంలో కలిగిన మనస్థితి తన మామూలు జీవితంలో జీరగా వుండిపోయిందని తర్వాత అతను గమనించేడు.

ఆ సమయంలో తనకి సత్యం తెలుసునన్న విషయాన్నీ తను యిప్పుడు తప్పన్న విషయాన్నీ అతను అంగీకరించలేడు. యేమంటే దాన్ని గురించి శాంతంగా అవలోకించినప్పుడు

అది ఖండఖండాలై చెదిరిపోతుంది. పోనీ అప్పుడు తను తప్పుగా వున్నాడు అనే విషయాన్నీ వొప్పుకోడు. యేమంటే ఆ ఆధ్యాత్మిక అనుభవాన్ని పదిలంగా చూసుకుంటాడు కాబట్టి, ... యేదో క్షణిక దౌర్బల్యం కింద తీసిపారెయ్యడం ఆ క్షణాన్ని కలుషితం చెయ్యడం కాబట్టి. అతని లోపల వొక తీవ్రమైన సంఘర్షణ చెలరేగుతోంది. దీన్ని పరిష్కరించడానికి అతను యావత్ ఆత్మశక్తినీ కూడగట్టేడు.

## 9

లేవిన్‌కి యీ ఆలోచనలు వో సారి అధికంగా, వో సారి తక్కువగా పీడించాయి కాని సర్వదా అంటి పెట్టుకునే వున్నాయి. అతను పుస్తకాలు చదివేవాడు, ఆలోచించేవాడు. యెంత యెక్కువ చదివి, ఆలోచిస్తే అంత యెక్కువ దూరం పోయేది గమ్యం అనిపించింది అతనికి.

భౌతికవాదులు తన సందేహాలకి సమాధానాలు చెప్పలేరని నమ్మకం యేర్పడ్డాక అతను మాస్కోలో వున్నప్పుడూ తర్వాత పల్లెకి వచ్చినప్పుడూ ప్లేటో, స్పినోజ, కాంట్, షెల్లింగ్, హెగెల్, షొపెన్‌హొవర్‌లాంటి తత్వవేత్తల గ్రంథాల్ని*, జీవితాన్ని భౌతికవాద దృక్పథంతో విశ్లేషించని తత్వవేత్తల గ్రంథాల్ని చదివేడు.

వాళ్ల పుస్తకాలు చదివేటప్పుడూ, లేదా భౌతికవాదుల సిద్ధాంతాలని ఖండించే తర్కాన్ని గురించి తనే ఆలోచన చేసినప్పుడు ఆ భావాలు ఉత్తేజకరంగా కనిపించేయి. చదవడం పూర్తి చేసిం తర్వాత, కొన్ని సిద్ధాంతాల్ని ఖండించే ఆలోచనలు చేసాక మళ్లీ అదే ఫలితం తేలేది. 'ఆత్మ', 'సంకల్పం', 'స్వేచ్ఛ', 'తత్వం'లాంటి అపరిమేయ శబ్దాలకి అంగీకృత నిర్వచనాలని వొప్పుకున్నాక, దార్శనికులు గాని స్వయంగా తను గాని పెట్టుకున్న శాబ్దిక జాలంలోకి ఉద్దేశ్యపూర్వకంగా ప్రవేశించేక అతనికి యేదో బోధ పడినట్టే వుండేది. కాని కృత్రిమ విచార ధారని మరిచి, నిశ్చిత చింతన ధారానుకరణ చేస్తూ, తనకి సంతోష జనకంగా వున్న అది వాస్తవ జీవితంకేసి మళ్లుతూనే ఆ కృత్రిమ భవనం పేక ముక్కల యిల్లులాగా కుప్ప కూలిపోయేది. ఆ భవనం జీవితంలోని తర్క శక్తికంటే మహత్వమైన దానిమీద ఆధారపడని శాబ్దిక డాంభికతమీద నిర్మించిందని స్పష్టమయిపోయేది.

ఒక సారి షొపెన్‌హొవర్ పుస్తకం చదివేటప్పుడు అతను 'సంకల్పం' అనే మాట స్థానంలో 'ప్రేమ' అనే పదాన్ని పెట్టుకున్నాడు. ఆ ఉత్తరీయాన్ని వదిలేసే దాకా వొకటి రెండు రోజులు యీ కొత్త దర్శన అతనికి వూరట కలిగించింది. కాని అది కూడా జీవిత పార్శ్వం నుంచి చూడగానే కుప్ప కూలిపోయింది. అతనికి వెచ్చదనాన్ని యివ్వలేని దోమతెర గుడ్డ చొక్కాకంటే అధికంగా కనిపించలేదు.

ధర్మశాస్త్రాల గురించి ఖొమ్యకోవ్* రచనలు చదవమని కోజ్నిషెవ్ అతనికి సలహా యిచ్చేడు. లేవిన్ ఆ రచయిత రెండవ భాగం చదివేడు. తనకి నచ్చనటువంటి వివాదపూరిత, ఘనమైన, చమత్కార పూరిత ధోరణి రచయితకి వున్నా చర్చికి సంబంధించి ఖొమ్యకోవ్ బోధ ఆశ్చర్యకరంగా కనిపించింది. ఈశ్వరుని సత్యం బోధ పరచుకోవడం యే వొక్క వ్యక్తికో సాధ్యం కాదనీ, చర్చిద్వారా సూత్ర బద్ధంగా ప్రేమతో యేకమైన జనులందరూ కలిసి దీన్ని గ్రహించగలరనీ అతను చేసిన వాదన చూసి లేవిన్‌కి ఆశ్చర్యమైంది. అతనికి యీ వూహ అన్నిటికంటే సంతోషం కలిగించింది: సకల జనుల నమ్మకాలనీ సమూహితం చేసే విద్యమాన, ప్రకృత, సజీవ చర్చిని, చూడాలంకృత స్థానంలో ఈశ్వరుడు వుండడంవల్ల పవిత్రమూ పాప ముక్తమూ అయిన ఆ చర్చిని, విశ్వసించడం యెక్కువ సులభంగా వుంది. దవిష్ఠ, నిగూఢ భగవంతుడు, విశ్వ సృష్టిలాంటి పడికట్లతో ఆరంభించడం కంటే ఆ సులభమైన దాన్ని ప్రస్థాన బిందువు చేసుకుని ఈశ్వరుణ్ణీ, సృష్టిని, పతనాన్ని, మోక్షాన్ని విశ్వసించగలగవచ్చు అనే వూహ యిది. కాని తర్వాత అతను చర్చి పురాణాన్ని గురించిన వో కాథలిక్ రచయిత పుస్తకాన్నీ, రష్యన్ సాంప్రదాయిక రచయిత పుస్తకాన్నీ చదివేడు. నిర్వచన రీత్యా రెండు చర్చిలు సారభూతంగా పాపముక్తమైనవే అయినా వొక దాన్ని వొకటి ఖండించుకోవడం చూసి అతనికి ఖొమ్యకోవ్ బోధనా నిరాశ కలిగించింది. యీ భవనమూ దార్శనికుల భవనంలాగా కుప్పకూలిపోయింది.

ఆ వసంతరుతువు అంతా అతను అతనిలా లేడు, చాలా భయంకర క్షణాల యాతన అనుభవించేడు.

'నేనెవర్ని, యెందుకు యిక్కడ వున్నాను అనే దాన్ని తెలుసుకోకుండా నేను జీవించ లేను. కాని వీటి గురించి తెలుసుకోలేను. అంటే నేను జీవించలేనన్న మాట' అనుకున్నాడు లేవిన్.

'అనంత కాలంలో, అనంత రోదసిలో, అనంత ద్రవ్యరాశిలో జీవి రూపంలో వొక బుద్బుదం ప్రత్యక్షం అవుతుంది, అది క్షణకాలం వుంటుంది, రాపోతుంది. యీ బుద్బుదం నేనే.'

యిది వ్యధాకులితమైన అసత్యం. కాని యీ దిశలో యుగయుగాల మానవ చింతన చేరిన యేక మాత్ర అంతిమ పరిణామం యిది.

దాదాపు సకల క్షేత్ర మానవ చింతనలు అన్వేషణలు ఆధారితం అయిన అంతిమ విశ్వాసం యిదే. ప్రముఖతమ విశ్వాసం యిదే. మిగిలిన వాటికంటే యెక్కువ స్పష్టతరం కావడంవల్ల లేవిన్ దీన్ని, యెప్పుడు యెలా జరిగిందీ తనకి తెలియకుండానే, స్వీకరించేడు.

కాని యిది అసత్యం మాత్రమే కాదు, దుష్ట శక్తినుంచి ఉత్పన్నం అయిన క్రూర వ్యంగ్యం. యీ దుష్ట శక్తి ముందు, ఘృణిత శక్తి ముందు తలవంచడం ఉచితం కాదు.

యీ శక్తినుంచి విచ్ఛేదం పొందాలి. విచ్ఛేదం పొందడం ప్రతి వ్యక్తికీ అందుబాటులో

వుంది. దౌష్ట్య పాశంనుంచి తెంచుకోవాల్సిన అవసరం వుంది. దానికి సాధనం వొకటే — మృత్యువు.

హాయిగా సంసారం చేసుకుంటున్న వాడు, ఆరోగ్యవంతుడు అయిన లేవిన్ కొన్ని సార్లు ఆత్మహత్యకి యెంత సమీపవర్తిగా వెళ్ళాడంటే ఉరిపోసుకుంటా నేమోననే భీతి పుట్టి రజ్జువుల్ని దాచేశాడు. ఆ భీతి కారణంగా యెక్కడన్నా తనమీద యెక్కుపెట్టుకుని కాల్చు కుంటా నేమోనని చేతిలో తుపాకీ వుంచుకునేవాడు కాదు.

లేవిన్ తుపాకీతో కాల్చుకోలేదు, ఉరిపోసుకోలేదు. జీవిస్తూనే వున్నాడు.

## 10

లేవిన్ తనెవరూ, యెందుకు వున్నాడూ అనే వాటి గురించి ఆలోచన చేసినప్పుడు అతనికి యే జవాబులూ వచ్చేవి కాదు, అతను నిరాశపడి పోయేవాడు. కాని ఆ ప్రశ్నలు అనుకోకుండా వుంటే తనెవరైందీ యెందుకు బతుకుతూ వున్నదీ తెలిసినట్టే వుండేది. యేమంటే అతను నిశ్చిత ధ్యేయంతో, దృఢత్వంతో పని చేసేవాడు, జీవించేవాడు. యిటీవల కొంతకాలంగా అతను ముందటికంటే యెక్కువ దృఢత్వంతో, స్పష్ట లక్ష్యంతో జీవిస్తూ వున్నాడు.

జూన్ ఆరంభంలో పల్లెకి తిరిగివచ్చేక అతను యథాప్రకారం కార్యకలాపాలు అందు కున్నాడు. వ్యవసాయం పనులతో, రైతులతో, పొరుగు వాళ్లతో వుండే వ్యవహారాలతో, యింటి పనులతో, అక్కగారి ఆస్తినీ, అన్నగారి ఆస్తినీ అజమాయిషీ చెయ్యడంతో, పెళ్ళాన్నీ బంధువులనీ చూసుకోవడంతో, పిల్లవాడిపట్ల ఆసక్తితో, తేనెటీగల పెంపకంతో — వసంత రుతువులో అతనికి కొత్త సరదా వచ్చింది — అతనికి తీరికే వుండేది కాదు.

అతను యీ పనులన్నిటికీ అర్పితమయి పోవడానికి కారణం గతంలో మాదిరీ వాటిని ఉన్నత సిద్ధాంతాలతో సమర్థించుకోవడంవల్ల కాదు, అందుకు పూర్తి విరుద్ధం. ఓ పక్కన, సార్వజనిక సంక్షేమం కోసం లోగడ చేసిన పనుల వైఫల్యం నిరాశ కలిగించింది. రెండో పక్క తన ఆలోచనలూ, అన్ని వేపులనుంచీ యెదురైన పనులూ అతనికి ప్రజా సంక్షేమ కార్యాల గురించి ఆలోచించే తీరికే యివ్వలేదు. తను చేస్తూ వున్న దాన్ని చెయ్యవలసి వుంది కాబట్టీ, మరింక వేరే యేదీ చెయ్యలేకపోబట్టీ చేస్తున్నట్టు అతనికి అనిపించింది.

లోగడ (అంటే యించుమించు బాల్యంనుంచి యౌవన ప్రాంగణంలోకి అడుగు పెట్టే దాకా) అతను సకల మానవాళి సంక్షేమం కోసం, రష్యా కోసం, వూరి కోసం యెప్పుడన్నా అలా చెయ్యాలని ప్రయత్నం చేసినప్పుడు అతనికి ఆ వూహ సంతోష కారకంగా వుండేది. కాని చెయ్యడంలో యేదో లోటు వుండేది. తను చేస్తూ వున్నది నిజంగా యెంతో అవసరం అయింది అనే భరోసా అతనికి పూర్తిగా వుండేది కాదు. ఆరంభంలో మహత్తరమైనదిగా

కనిపించిన క్రియాశీలత క్రమేపీ తగ్గుతూ వచ్చి కడకి ముగిసిపోయేది. యిప్పుడు, వివాహం అయేక, తన జీవిత ప్రయోజనాల నిమిత్తం అధికాధికంగా తన కార్యకలాపాల్ని సీమితం చేసుకున్నప్పుడు అతనికి తను చేసేది అంత తృప్తికరంగా తోచేది కాదు. కాని తను చేస్తూ వున్నది అవసరం అని అతనికి ఖాయంగా అనిపించింది, ముందటికంటే యెక్కువ మెరుగ్గా సాగింది, యెక్కువ విస్తరించింది.

యిప్పుడతను తన యిచ్ఛకి వ్యతిరేకంగానే నాగలి క్రౌరులాగా నేలలోకి లోతుగా దిగుతున్నాడు, చాలుని తిప్పకుండా తను బయట పడలేదు.

తాతతండ్రులు అలవాటు పడిన రీతిలోనే సంసారం సాగాలనీ, అదే స్థాయి శిక్షణలో పరిస్థితుల్లో సంతానాన్ని పెంచి పెద్ద చెయ్యాలనీ నిస్సందేహంగా మనసులో నాటుకు పోయింది. ఆకొన్న వాడికి అన్నంలాగా యిది అత్యవసరం. అందుగ్గాను అన్నం వండడం యెంత అవసరమో ఆదాయం రాబట్టడానికి పొక్రోవ్స్కోయె జమీని బాగా నిర్వహించడమూ అంతే అవసరం, రుణాలు తీర్చడం అవసరమైనట్టే పైతృక జిరాయితీని అదే స్థితిలో వుంచడమూ అవసరం. యేమంటే తను, లేవిన్, తాతముత్తాతలకి దాన్నలా పెంచి పోషించినందుకు కృతజ్ఞతా బద్ధుడైనట్టు, ఉత్తరాధికారిగా పుత్రుడు దాన్ని అందుకుని కృతజ్ఞతా బద్ధుడవడానికి. మరి అందుగ్గాను తను భూమిని కౌలుకి యివ్వకూడదు, స్వయంగా తనే సాగు చెయ్యాలి, పశుగణం వృద్ధి చెయ్యాలి, పొలాలకి యెరువు వెయ్యాలి, అడవులు పెంచాలి.

కోజ్నిషెవ్ ఆస్తినీ, అక్కగారి వ్యవహారాలనీ నిర్లక్ష్యం చెయ్యనూ లేదు. తన దగ్గరికి సలహా సంప్రదింపుల నిమిత్తం వచ్చే రైతుల బాగోగులు చూడకుండానూ వుండలేదు. తన వొళ్లో బాధ్యతగా వుంచిన బిడ్డని తోసెయ్యడం అసాధ్యం అయినట్టే యివీ అసాధ్యమే. తను భార్యకీ కొడుక్కీ సుఖంగా వుండేటట్టు చూడాలి, వదినగారికీ ఆవిడ పిల్లలకీ సుఖంగా వుండేటట్టు చూడాలి. యెంతో కొంత వ్యవధి వాళ్లతో గడపగలగాలి.

యీ కార్యకలాపాలు, వేట, అలాగే తేనెటీగల పెంపకం అనే కొత్త సరదా లేవిన్కి తీరిక లేకుండా చేశాయి, ఆలోచిస్తే సారహీనంగా కనిపించిన జీవితంలో తీరిక లేకుండా చేశాయి.

తను యేం చెయ్యాల్సి వున్నదీ అనుమానం లేకుండా తనకి తెలిసినట్టే, యెలా చెయ్యాల్సిందీ కూడా అనుమానం లేకుండా లేవిన్కి తెలుసు. యేది ముఖ్యమైనదో కూడా అతనికి తెలుసు.

కూలీలని అతిచవకగా కుదుర్చుకోవాలని అతనికి తెలుసు. అలా అని తనకి యెంత లాభదాయకంగా కనిపించినా వాళ్ల అవసరాల్ని వాటంగా వాడుకుని ధర్మంగా యివ్వవలసిందాని కంటే తక్కువా యివ్వకూడదు. రైతుల పశువులకి మేత కరువైనప్పుడు తను రైతులకి పశుగ్రాసం అమ్ముతాడు, అందుగ్గాను వాళ్ల దగ్గర్నుంచి సొమ్ము తీసుకోవడం బాధాకరంగా కనిపించినా. కాని సారాదుకాణాన్నీ కల్లు అంగడినీ తీసెయ్యాలి, అవి తనకి ఆదాయం తెచ్చి

పెట్టినా. తన అడవిలో కలప కాజేసినందుకు రైతులకి గట్టిగా బుద్ధి చెప్పాలి కాని తమ పశువుల్ని వాళ్ళు తన పచ్చిక బీళ్ళమీదికి మేత కోసం తోలినప్పుడు జరిమానా వెయ్యకూడదు. అ కాపలా వాడికి కోపం తెప్పించినా, రైతులు మళ్ళీ పశువుల్ని పచ్చిక బీళ్ళల్లోకి తోల బోయినా, పశువుల్ని వాళ్ళకి తిరిగి అప్పగించెయ్యాలి.

ప్యోతర్ ప్రతి నెలా పది శాతం వడ్డీ కడుతూ వుండే రుణదాతనుంచి విముక్తి పొందేందుకు అతనికి సొమ్ము తను యిస్తాడు. కాని రైతులు శిస్తులు చెల్లించకుండానో, బకాయిలు పెడుతూనో వుంటే వొప్పుకోకూడదు. నిగామాను పచ్చిక బీళ్ళ గడ్డినంతట్నీ కోయించే టట్టూ, దాన్ని మంచి ధరకి అమ్మించేటట్టూ చూడాలి. కాని తను రెండు వందల యెకరాల భూమిలో పెంచుతూ వున్న అడివిలో గడ్డిని యెట్టి పరిస్థితుల్లోనూ కొయ్యనివ్వకూడదు. పని మంచి ముమ్మరంగా సాగాల్సిన సమయంలో తండ్రి చచ్చిపోయేడనే నెపంతో నెల్లాళ్ళ వూరికి వెళ్ళే కూలీకి, అతని కష్టానికి సానుభూతి చూపించినా, మజూరీ యివ్వకూడదు, నష్టపోయిన కాలానికి నాగా కట్టాల్సిందే. కాని ముసలీ ముతకా నౌకర్లకి నెలవారీ జీతాలు యిస్తూనే వుండాలి.

యింటికి తిరిగివెళ్ళగానే మొదటగా వొంట్లో బాగా లేని భార్య దగ్గరికి వెళ్ళాలి, తన కోసం మూడు గంటలుగా చూస్తూ వున్న రైతులు మరో కొంచెం సేపు నిరీక్షించగలరు, అనీ లేవిన్‌కి తెలుసు. తేనెటీగల క్షేత్రంలో తనని కలుసుకుందుకు వచ్చిన రైతులతో మాట్లాడేందుకు గాను తేనెటీగల గుంపుని పట్టులో పెట్టే తన సరదాని వదలుకుని క్షేత్రం కాపలా ముసలతన్ని ఆ పని చెయ్యనివ్వాలి అని అతనికి తెలుసు.

తను చేసే పని తప్పో వొప్పో అతనికి తెలీదు. ఆ విషయం గురించి చర్చించడం గాని, ఆలోచించడం గాని అతనికి యిష్టం వుండదు.

చర్చలవల్ల శంకలు పెరుగుతాయంతే. తను యేం చెయ్యాలో యేం చెయ్యకూడదో చూడకుండా అడ్డం పడతాయంతే. ఆలోచించకుండా జీవిస్తూనే వుండగా, యిది మంచిదా అది మంచిదా అని సందిగ్ధ స్థితి వచ్చినప్పుడు యెప్పుడూ సరైందే జరిపించే నిర్ణాయక శక్తి ఆత్మలో వుంటున్నట్టు అతని చేతనకి వచ్చింది. తను చెయ్యకూడని దాన్ని చేసిన ప్రతి సారీ అతనికి వెంటనే అది తెలిసిపోయేది.

ఆ రకంగా అతను తనెవరైందీ, తనెందుకు యీ లోకంలో జీవిస్తూ వున్నదీ తెలియకుండానే, తెలుసుకునే అవకాశం కనిపించకుండానే జీవిస్తూనే వున్నాడు. జ్ఞాన అభావం అనే యీ వ్యథ యెంత తీవ్రంగా వుందంటే, తను ఆత్మహత్య చేసుకుంటానేమోననే భయం అతనికి కలిగింది. కాని మళ్ళీ తన వ్యక్తిగత జీవన పథాన్నీ యేర్పాటు చేసుకుంటూ వున్నాడు.

# 11

కోజ్నిషెవ్ పొక్రోవ్స్కొయెకి వచ్చిన రోజు లేవిన్ మహా యాతనపడే పరిస్థితిలో వున్నాడు.

వూపిరి పీల్చుకోవడానికి తీరిక వుండని సమయం అది. వూళ్ళో వాళ్ళందరూ పిసరు కూడా వొళ్ళు దాచుకోకుండా తీవ్రంగా పనికి అర్పితమైపోయే సమయం అది. అలా అర్పితమైపోవడం జీవితంలో మరే రంగంలోనూ వుండదు. ఆ పనిలో నిమగ్నం అయిన వాళ్ళు స్వయంగా దాని మహౌన్నత్యాన్ని ప్రకటించుకున్నట్లయితే గనక, ఆ పని సాలుసాలుకీ పౌనఃపున్యంగా రాకుండా వుంటే గనక, యీ శ్రమ ఫలితాలు యింత నిత్య జీవితానుభవం కాకుండా వుంటే గనక దీని మహౌన్నత్యానికి గుర్తింపు వచ్చి వుండేది.

రై ధాన్యాన్నీ, ఓట్ ధాన్యాన్నీ కోసి, మోపులు కట్టి బళ్ళకెత్తడం, పచ్చిక బీళ్ళని దున్నడం, నేలని మళ్ళీ దున్నడం, విత్తులు జల్లించడం, శీతకట్టు గోధుమ చల్లడం — యివన్నీ సాదాగా, సామాన్యంగా కనిపిస్తాయి. కాని దీన్నంతటన్నీ అదునులో జరిపించడానికి వూళ్ళో వాళ్ళంతా ఆబాలవృద్ధం వొంచిన నడుం యెత్తకుండా మామూలుకంటే మూడు రెట్లు యెక్కువగా మూడు నాలుగు వారాలు పని చెయ్యడం అవసరం. రాత్రి పూట కూడా కోతలు సాగించాలి, మోపులు కట్టించాలి. రోజుకున్న యిరవై నాలుగ్గంటల్లోనూ రెండు మూడు గంటలకంటే యెక్కువ నిద్రపోలేరు. నల్ల రొట్టెనీ, ఉల్లి పాయల్నీ మాత్రమే తింటూ, క్వాస్ పానీయం మాత్రమే తీసుకుంటూ గడపగలరు. మరి యీ పని రష్యా అంతటా ప్రతి యేడూ జరుగుతూనే వుంటుంది.

లేవిన్ జీవితంలో యెక్కువ భాగం పల్లెటూళ్ళో గడిపేడు. రైతులతో సన్నిహితంగా వుంటూ గడిపేడు. యీ మాసూళ్ళ సమయంలో రైతుల ఉత్సాహం అతనికీ ఉత్సాహాన్ని కలిగించేది.

వేగు చుక్క పొడుస్తూనే పొలంలోకి వెళ్ళిపోయేవాడు. శీతకట్టు రై విత్తడం, ఓట్ల ధాన్యాన్ని మోపులు కట్టి బళ్ళకెత్తడం చూసేవాడు. యిదంతా అయేక భార్యా, వదినగారూ కాఫీ తీసుకునే వేళకి వచ్చేవాడు, తనూ వాళ్ళతో కలిసి కాఫీ తాగేందుకు. ఆ తర్వాత కాలి నడకన క్షేత్రంలోని కొట్టం దగ్గరికి వెళ్ళేవాడు. అక్కడ విత్తనాలని శుద్ధి చెయ్యడానికి కొత్త నూర్పుడు యంత్రాల్ని పనిలో పెడతారు.

నిగామానుతో, రైతులతో, భార్యతో, దాలీతో, ఆమె పిల్లలతో, మామగారితో మాట్లాడుతూ వున్నా వ్యవసాయం పనుల గురించిన ఆలోచనలతోబాటుగా రోజంతా వొక దాన్ని గురించే అనుకుంటూ వుండేవాడు: 'నేనెవరు? యెక్కడున్నాను? యెందుకు వున్నాను?' అనే ప్రశ్నలకి జవాబు శోధిస్తూనే వుండేవాడు.

లేవిన్ అంతకు ముందే కప్పు నేయించిన గాదెల నూర్పుడు కళ్ళం చల్లదనంలో నుంచుని

తాజాగా బెరడు వొలిచిన యాస్ప్ కాండాలనుంచీ, యింకా పత్రశోభితంగా వున్న హేజెల్ తీగలనుంచీ వస్తూ వున్న సుగంధాన్ని ఆస్వాదిస్తూ తలుపులు తెరిచి వుంచిన గుమ్మం గుండా చూస్తూ వున్నాడు. నూర్పుడు కళ్లంలో ఘాటైన పొడి ధూళి లేచి సుళ్లు తిరుగుతూ పోతూ వుంది. అక్కడ యెండలో మెరుస్తూ వున్న గడ్డికేసి, కొట్టంనుంచి అప్పుడే తెచ్చిన ఎండు గడ్డికేసీ చూస్తూ వున్నాడు. గాదెల దగ్గరి ఛాయలో ధూళిలో స్థూల రేఖా రూపం తోపింప చేస్తూ కూతలు కూస్తూ కప్పు కిందకి దూసుకు వస్తూ తెల్లని ఛాతీలు, పొడల పొడల తలలు వున్న స్వాలో పిట్టలకేసి చూస్తూ వున్నాడు. నూర్పుడు కళ్లం ధూళిలో, మసకలో తిరుగుతూ వున్న మనుషులకేసి చూస్తూ వున్నాడు. అలా చూస్తూ వుంటే అతనికి వింత వింత వూహలు రేగాయి.

'యెందుకని దీన్నంతటినీ చేస్తున్నట్టు? నేనెందుకు యిక్కడ నుంచున్నాను? వీళ్ల చేత యెందుకు శ్రమ చేయిస్తున్నాను? తాము యెంతో చిత్త శుద్ధిగా పని చేస్తున్నట్టు నాకు కనిపించాలని వాళ్లు అంత తాపత్రయ పడుతున్నారెందుకు? నాకు బాగా పరిచితం అయిన మాత్రోనా యెందుకంత యెక్కువ పని చేస్తోంది? (అగ్ని ప్రమాదం జరిగినప్పుడు ఆమెమీద దంతె పడినప్పుడు ఆమెకి నేను వైద్యం చేశాను)' అని అతను బక్కపల్చగా వున్న వో రైతు ఆడమనిషిని చూసి అనుకున్నాడు. ఆమె ఆట కొర్రుతో విత్తనాలని కదలేస్తోంది. యెండకి కమిలిన దిసపాదాలతో గతుకులు గతుకులుగా గట్టిగా వున్న నూర్పుడు కళ్లంలో తిరుగుతూ పని చేస్తోంది. 'అప్పుడు కోలుకుంది. కాని యివాళో, రేపో లేకపోతే పదేళ్ల తర్వాతో మట్టిలో కలిసిపోతుంది, ఆమె అంటూ యేం మిగలదు. ఎర్ర గౌను తొడుక్కుని చలాకీగా సొగసుగా గింజల్నుంచి పొట్టు రాలుస్తూ వున్న ఆమె కూడా మిగలదు. ఆమె కూడా మట్టిలో కలిసి పోతుంది. ఆ పంచకల్యాణి గుర్రం యింకా పెందరాళే వెళ్లిపోతుంది' అని వేలాడే పొట్ట, వెడల్పైన నాసికాపుటాలు వున్న గుర్రాన్ని చూసి అనుకున్నాడు. 'గుర్రం మట్టి కలిసి పోతుంది. ఉంగరాల గడ్డంలో గడ్డి పరకలు తగులుకున్న ఫ్యోదొర్, చొక్కా చిరుగుల్లోనుంచి తెల్లని భుజాలు కనిపిస్తున్న యీ ఫ్యోదొర్‌నీ మట్టిలో పూడ్చి పెట్టేస్తారు. అయినా చిత్రం అతను యెంత కష్టపడి పనలు మోపులు కదుపుతున్నాడు, ఆడవాళ్లని కూక లేస్తున్నాడు పనులు పురమాయిస్తున్నాడు, యెంత నేర్పుగా చక్రం బెల్టు సరిదిద్దుతున్నాడు. వాళ్లే యేమిటి, నన్నూ పూడ్చి పెడతారు, యేమీ మిగలదు నేనంటూ. దీనంతటి అర్థం యేమిటి అని?'

అతను అలా ఆలోచించుకుంటూనే వున్నాడు. అప్పుడే మళ్లీ గడియారంకేసీ చూశేడు. గంటలో యెంత నూర్చేరా అని లెక్క వేసుకున్నాడు. దీన్ని బట్టి మర్నాడు పనిని నిర్ణయించాలి.

'దాదాపు గంటయింది. కాని వీళ్ళు మూడో కుప్ప మొదలు పెడుతున్నారు' అనుకున్నాడు లేవిన్. అనుకుని యంత్రంలోకి మోపులు తోస్తూ వున్న ఫ్యోదొర్ దగ్గరికి వెళ్లేడు. యంత్రం చప్పుడు చేస్తోంది, అంచేత గొంతు పెంచి అతన్ని యంత్రంలోకి తక్కువ వెయ్యమని చెప్పేడు.

"మరీ యెక్కువ మోపులు వేస్తున్నావు ఫ్యోదొర్! చూడు, యిరుక్కుపోయి యంత్రం ఆగిపోతుంది. త్వరగా అవదు. కొంచెం కొంచెం వెయ్యి."

ఫ్యోదొర్ మొహం చెమటకి తడిసిన దుమ్ము మరకలు అయేయి. అతను జవాబుగా యేదో అరిచేడు, కాని పని మార్చకుండా అలానే చేస్తూ వున్నాడు.

లేవిన్ యంత్రం దగ్గరికి వెళ్లి అతన్ని పక్కకి తోసేసి తనే మోపులు వెయ్యడం మొదలుపెట్టేడు.

కొంచెం సేపట్లోనే భోజనాల వేళ అయింది. అప్పటిదాకా రైతులతో లేవిన్ పని చేశాడు. తర్వాత ఫ్యోదొర్‌తో కలిసి యివతలకి వచ్చి యింకా నూర్చవలసి వున్న పసుపుపచ్చ రై ధాన్యం కుప్ప దగ్గర అతనితో మాట్లాడ్డానికని ఆగేడు.

ఫ్యోదొర్ దూరం వూరివాడు. లేవిన్ అక్కడున్న తన పొలాన్ని లోగడ సహకార సంఘానికి కౌలుకి యిచ్చేడు. యిప్పుడు దాన్ని ధనిక రైతు కిరీల్లొవ్‌కి కౌలుకి యిచ్చేడు.

లేవిన్ యీ కౌలు భూమి సంగతే ఫ్యోదొర్‌తో మాట్లాడాలనుకున్నాడు. ఆ వూళ్లో వుండే విశ్వసనీయమైన ధనిక రైతు ప్లతోన్ ఆ భూమిని ఆ మరుసటి యేడు తీసుకుంటాడా అని అడిగేడు.

"కౌలు చాలా యెక్కువండయ్యా, ప్లతోన్ అంత యిచ్చుకోలేడు" అన్నీ చొక్కాలో ఛాతీమీద గుచ్చుకున్న గడ్డి పరకలు తీసేస్తూ అన్నాడు ఫ్యోదొర్.

"మరి కిరీల్లొవ్ యెలా యివ్వగలుగుతున్నాడు?"

"ఓ, మీత్కా" (అతను కిరీల్లొవ్‌ని అలా తిరస్కారంగా పిలుస్తాడు) "యిసికలోనుంచి నూనె పిండే రకం. పనివాళ్లని పిండి వసూలు చేస్తాడు. మనిషిమీద జాలి చూపించడు. ఫొకానిచ్ మామ" (ప్లతోన్‌ని అలా అని పిలుస్తాడు) "అలాంటి వాడు కాదు. మామ యెప్పుడన్నా యెవళ్లనన్నా నిలువు దోపిడీ చేశాడా? యెవళ్లకన్నా అప్పు పెట్టినా, వోకో అప్పుడు వెనక్కి తీసుకోను కూడా తీసుకోడు. యెవళ్లనీ పీల్చి పిప్పి చెయ్యడు. మనిషి జాలీ నాలీ వున్న వాడు, ఆఁ" అని చెప్పేడు.

"అప్పు రాబట్టుకోకుండా వదిలెయ్యడం యెందుకు?"

"మనుషులు రకరకాలుగా వుంటారయ్యా! వొకోడున్నాడంటే తన కడుపే కైలాసంగా చూసుకుంటాడు మీత్కాలాగా. తన చిన్ని బొజ్జకి శ్రీరామ రక్ష అనే రకం వోడు ఆడు. కాని ఫొకానిచ్ మామ మనిషంటే! పరమార్థం కోసం వుంటాడు. దేవుడంటే భక్తి వున్న వాడు."

"పరమార్థం కోసం వుండడం, దేవుడంటే భక్తి వుండడం అంటే యేమిటి నీ ఉద్దేశం?"

"యేమిటి బాబూ, యిశదమే కదా! నిజాయితీగా బతుకుతాడు, దేవుడి దారిలో బతు

కుత్తాడు, సూశారా! మనుషుల్లో తేడా! మాటకి మిమ్మల్నే తీసుకోండి, మీరు కూడా యెవళ్ల మనస్సునీ నొప్పించరు..."

"అలాగా, సరే, నే వెడతా" అని లేవిన్ ఉత్తేజంతో ఉక్కిరిబిక్కిరి అవుతూ అన్నాడు. గిరుక్కున తిరిగి కర్ర చేత్తో అందుకుని గబగబా యింటి దారి పట్టేడు. ఫొకానిచ్ మామ సన్మార్గంలో, దైవ పథంలో, పరమార్థం కోసం వుంటున్నాడన్న మాటలు తాళం పెట్టి లోపల బిగించి వున్న వూహా సమూహాన్ని వొక్క సారి బయటికి వదిలేయి. తన ఆలోచనల నన్నిట్నీ వొకే లక్ష్యం వేపు నడిపిస్తూ, వాటిని ప్రకాశమానం చేసి మిరుమిట్లు గొలుపుతూ తన మనసులో సుళ్లు తిరిగేయి.

## 12

లేవిన్ పెద్ద రాస్తామీద పెద్ద పెద్ద అంగలు వేస్తూ నడుస్తూ వున్నాడు. తన ఆలోచనలమీద అంత దృష్టి పెట్టలేదు (వాటిని బాగా అర్థం చేసుకోవడానిక్కూడా అత నికి శక్తి కాలేదు) అంతకు ముందు యెన్నడూ యెరగని మానసిక స్థితిపట్ల పెట్టినంత దృష్టి.

ఫ్యోదొర్ అన్న మాటలు అతనిమీద విద్యుత్ తరంగంలా పని చేశాయి. వ్యస్తంగా వున్న ఆలోచనలని, తన మనసుని క్షణం కూడా వదలకుండా నిష్ప్రయోజనకరంగా, అనేకంగా వున్న ఆ ఆలోచనలని హఠాత్తుగా పరివర్తన చెందించి సమ్మేళనం చేశాయి. ఫ్యోదొర్‌తో మాట్లాడేటప్పుడు కూడా అతనికి తెలియకుండానే ఆ ఆలోచనలు అతని మనసులో తార ట్లాడుతూ వున్నాయి.

తన ఆత్మలోకి యేదో నూతనమైంది వచ్చినట్లు అతనికి అనిపించింది. అదేమిటైందీ ఆవిష్కరించుకోవాలని ఆతృత పడుతూ ఆ నూతన మైనదాన్ని పరిశీలించే ఆనందాను భూతి పొందేడు.

'తన పొట్ట కోసం, తన అవసరాల కోసం కాకుండా భగవంతుడి కోసం జీవిస్తున్నాడు. యే భగవంతుడి కోసం? ఆ రైతు అన్న మాటలకంటే అర్థం పర్థం లేనిది వుంటుందా? మన అవసరాల కోసం మనం బతక్కూడదన్నాడు, అంటే మనకి బోధ పడేదాని కోసం, మనల్ని ఆకర్షించేదాని కోసం, మనం కోరుకున్న దాని కోసం కాక మనకి అర్థం అవని దాని కోసం, యెవళ్లూ అర్థం చేసుకోలేని, ఫలానా అని వివరించలేని భగవంతుడి కోసం బతకాలి. అంటే యేం తేలినట్టు? ఫ్యోదొర్ అన్న ఆ అర్థరహితమైన మాటలు నాకు బోధపడలేదూ? బోధపడ్డాక అవి న్యాయంగా లేవని అనుమానించేనా? అవి నాకు మూర్ఖంగా గజిబిజిగా, అస్పష్టంగా కనిపించేయా?

'లేదు. సరిగ్గా అతను అర్థం చేసుకున్న రీతిలోనే సరిగ్గానే అర్థం చేసుకున్నాను. బాగా అర్థం చేసుకున్నాను. నాకర్థం అయ్యే వాటన్నిటికంటే స్పష్టంగా అర్థం చేసుకున్నాను. వాటి గురించి నాకు జీవితంలో యెప్పుడూ సందేహం కలగలేదు, కలగబోదు. నేనొక్కణ్ణే కాదు, ప్రతివాళ్ళూ, లోకంలో యావన్మందీ దీన్ని బాగా అర్థం చేసుకుంటారు. యెవరూ సందేహించరు దీన్ని, ప్రతివాళ్ళూ అంగీకరిస్తారు.

'కౌలుకి తీసుకున్న కిరీల్లొవ్ తన కడుపే కైలాసంగా బతుకే మనిషని ఫ్యోదొర్ అన్నాడు. అది అర్థం అవుతూనే వుంది, సబబుగానూ వుంది. బుద్ధి వివేచన వున్న జీవులందరం పొట్ట కోసమే బతుకుతున్నాం. కాని పొట్ట కోసం బతకడమే తప్పు అని ఫ్యోదొర్ అన్నాడు. మనం మంచి కోసం, భగవంతుడి కోసం బతకాలన్నాడు. మరి ఆ మాటలు వెంటనే నాకు బోధపడ్డాయి. నేను, అలాగే శతాబ్దాల ముందు యిప్పుడు యీ భూమ్మీద బతుకుతూ వున్న కోట్ల కోట్ల ప్రజానీకం, రైతులు, బుద్ధి విశేషంలేని వాళ్ళు, యీ విషయం గురించి ఆలోచనలు చేసి తమ అస్పష్ట భాషలో రాసినటువంటి మహావిద్వాంసులు అందరం వొక విషయం గురించి వొప్పుకుంటున్నాం – యెందుకోసం బతకాలి యేది మంచిది అనే విషయం గురించి. అందరితోబాటుగా నాకూ వొక దృఢ నిర్వివాద స్పష్ట అవగాహన వుంది, దీన్ని బుద్ధితో విశ్లేషించలేం. బుద్ధి విశ్లేషణకి అతీతమైంది యిది, దానికి వొక కారణం లేదు, పరిణామం లేదు.

'శివం అయిన దానికి కారణం యేదన్నా వుంటే అది శివం కాదు. దానికి అర్థతః యేదన్నా పురస్కారం వుంటే అది శివం కాదు. అంటే తేలేది యేమన్న మాట శివం అనేది కార్యకారణ పరిణామ శృంఖలాతీతమైంది.

'యిది నాకు తెలుసు, అలాగే అందరికీ తెలుసు.

'నేను మహిమల కోసం చూశాను. అయ్యో మహిమ జరగలేదే అని బాధ పడ్డాను, అదుంటే నాకు విశ్వాసం కలుగుతుంది అనే ఉద్దేశ్యంతో. యిదిగో మహిమ యిక్కడుంది – సంభవమైన వొక్కటీ, స్థాయీ రూపంలో విద్యమానమైనటువంటిది, అన్ని వేపులనుంచీ నన్ను పరివేష్టించి వున్నటు వంటిది. కానైతేనేం, నేను దీని వేపు దృష్టి పెట్టలేదు!

'యింతకంటే గొప్ప మహిమ యేముంటుంది?

'నా సందేహాలన్నిటికీ సమాధానం దొరికినట్టేనా? నా వ్యథలన్నీ అంతమైనట్టేనా?' అని దుమ్ము కొట్టుకుపోయిన దారిలో వెడుతూ అనుకున్నాడు లేవిన్. తన అలసటగాని, తాపంగాని గుర్తే లేవు. దీర్ఘ వ్యథలన్నీ అంతమైనప్పుడు కలిగే సౌఖ్యం మాత్రమే కలుగుతోంది. అతనికి యెంత సౌఖ్యప్రదంగా వుందంటే దాన్ని నమ్మలేకపోయేడు. ఉత్తేజం కారణంగా ఉక్కిరిబిక్కిరి అయేడు. ముందుకు నడవడం కష్టమనిపించింది. దారిమీదనుంచి పక్కకి మళ్ళి అడివిలోకి వెళ్ళేడు. ఆస్పెన్ వృక్షాల నీడలో గడ్డిమీద కూర్చున్నాడు. చెమటకి

తడిసిన తలమీదనుంచి టోపీ తీసేశాడు, బోటుగా మోచెయ్యి యెత్తి పెట్టుకుని తల ఆన్చుకుని కోమలమైన గడ్డిమీద చాచుకుపడుకున్నాడు.

'నేను శాంతంగా దీని గురించి పరిశీలనగా చూడాలి' అని తన ముందు వూగులాడే గడ్డికేసి, అణగదొక్కని గడ్డికేసి చూస్తూ అనుకున్నాడు. గొల్లభామ వొకటి గడ్డి పరక రెమ్మ మీద పాకుతూ, దాని దారికి అడ్డంగా వున్న మరో గడ్డి రెమ్మ దగ్గర ఆగిపోతూ వుంది. లేవిన్ దానికేసీ చూస్తూ వున్నాడు. 'ఒం ప్రథమంనుంచీ అన్నిటి గురించీ ఆలోచించుకోవాలి' అనుకుంటూ గొల్లభామకి అడ్డం పడిన రెమ్మని తొలగించి, అది పక్క రెమ్మమీదకి మళ్ల గలందులకు వీలుగా మరో గడ్డి పరకని వాల్చేడు. 'యెందుకు నాకు యింత సంతోషం కలుగుతోంది? యేమి ఆవిష్కరించేను?'

'నా శరీరంలో, యీ గడ్డికి, యీ గొల్లభామ శరీరంలో (అదీ మరి, గొల్లభామ ఆ రెమ్మమీదకి వెళ్లాలనుకోలేదు, రెక్కలు చాచి యెగిరిపోయింది) భౌతిక, రసాయనిక, శారీరక నియమానుసారం పదార్థ పరివర్తన సర్వదా జరుగుతూనే వుందని యిదివరలో అనుకుంటూ వుండేవాణ్ణి. ఆస్పెన్ చెట్లు, ఆ మేఘాలు, నీహారికా సమేతంగా యావత్తూ నిరంతర పరివర్తనంతో వున్నాయనుకునేవాణ్ణి, దేన్నుంచి, దేని వేపు? అనంత వికాసం, సంఘర్షణ? అనంతమైనదాంట్లో వొక దిశ, సంఘర్షణ వున్నట్టు! నాకాశ్చర్యం వేసింది, యీ పంథాలో తీవ్రంగా ఆలోచనలు చేసినప్పటికీ కూడా నాకు జీవిత అర్థం, అంతః ప్రేరణలకీ ఆకాంక్షలకీ వున్న అర్థం బోధ పడలేదు. నా అంతః ప్రేరణల అర్థం యెంత స్పష్టంగా వుందంటే నిరంతరం వాటి అనుగుణంగా బతుకుతున్నాను. అయినా గాని ఆ రైతు దాన్ని గురించి యేదో చెప్పగానే ఆశ్చర్యానందాలు నన్ను ముంచెత్తాయి: భగవంతుడి కోసం, పారమార్థికం కోసం జీవించడం!

'నేను కొత్తగా కనిపెట్టింది యేమీ లేదు. నాకిది వరకే తెలిసిన దాన్నే గుర్తించేనిప్పుడు. నాకు లోగడ జీవితాన్ని యివ్వడమే కాక యిప్పుడు కూడా యిస్తూ వున్న ఆ శక్తిని అర్థం చేసుకున్నాను. నేను భ్రమలనుంచి విముక్తుణ్ణి అయేను. నేను స్వామి యెవరో గుర్తించేను.'

తనకి గత రెండేళ్లుగా వున్న పూర్తి ఆలోచనా ధారని క్లుప్తంగా తన మనసులో నెమరు వేసుకున్నాడు. ఆ చింతన తను ప్రాణాధికంగా ప్రేమించిన అన్నగారు మృత్యుశయ్యమీద వున్నప్పుడు మృత్యువు గురించి స్పష్టంగా ప్రత్యక్షంగా కలిగిన ఆలోచనతో ఆరంభమైంది.

అప్పుడు మొట్టమొదటి సారిగా ఆతనికి విశదంగా బోధ పడింది — ప్రతి వ్యక్తికీ, తనకి కూడా, వ్యథ, మృత్యువు, శాశ్వత విస్మృతి తప్ప మరేదీ లేదని, అవే ఆసన్నంగా వున్నాయని. అలా తను జీవించడం కుదరదని అతను నిశ్చయం చేసుకున్నాడు. తను జీవిత పరమార్థం

యేమిటి, జీవితం దేవతల దరస్మితమా లేక దయ్యాల వికటాట్టహాసమా అనేదాన్ని తెలుసు కోవాలి. లేకపోతే తుపాకీ యెక్కుపెట్టి పేల్చుకోవాలి.

కాని అతను యీ రెండింటిలో దేన్నీ చెయ్యలేదు. జీవిస్తూనే వున్నాడు, ఆలోచిస్తూనే వున్నాడు, సంవేదనలు పొందుతూనే వున్నాడు. ఆ సమయంలో వివాహం కూడా చేసుకున్నాడు, యెన్నో మధుర క్షణాలని అనుభవించేడు, జీవితానికి అర్థం యేమిటి అన్న చింతన కలిగే దాకా ఆనందంగా వున్నాడు.

దీనివల్ల యేం రుజువవుతుంది? తను సవ్యంగానే జీవిస్తూ వున్నాడనీ, కాని ఆలోచన అపసవ్యంగా వుందనీ రుజువవుతుంది.

అతను మాతృపయోపానంతో జీర్ణించుకున్న మానసిక సత్యాల ప్రకారం జీవిస్తూనే వున్నాడు (ఆ విషయం తెలియకుండానే) కాని ఆలోచనలో యీ సత్యాల్ని స్వీకరించక పోవడమే కాక ప్రయత్నపూర్వకంగా తొలగించేడు.

యిప్పుడతనికి స్పష్టపడింది యీ విషయం: తనని పెంచి పోషించిన ఆ విశ్వాసాల ఆధారంగానే తను జీవిస్తూ వున్నాడు.

'యీ విశ్వాసాలు లేకపోయినట్లయితే, నా అవసరాలు తీరడం కోసం కాక భగవంతుని కోసం బతకాలని నాకు తెలియక పోయినట్లయితే యెలా వుండేది, నా జీవితాన్ని యెలా గడిపి వుండేవాణ్ణి? నేను యితరుల్ని దోచుకుని వుండేవాణ్ణి, అబద్ధాలకోరుని అయి వుండేవాణ్ణి, హత్యలు చేసి వుండేవాణ్ణి. నా జీవితంలో మహదానందదాయకంగా వుండే వాటిలో వొక్కటి కూడా, వొక్కటి కూడా, నాకు వుండేది కాదు.' యెందుకు జీవిస్తూ వున్నదీ తనకి తెలియక పోతే తను యెలాంటి దుష్టమృగం అయివుండేదీ యెంత తీవ్రంగా ప్రయత్నించినా గానీ అతని వూహకి అందలేదు.

'నేను నా ప్రశ్నకి సమాధానాన్ని అన్వేషించాను. కాని ఆలోచన, తర్కం నా ప్రశ్నకి సమాధానాన్ని యివ్వలేదు. అవి ప్రశ్నతో తూగలేదు. జీవితమే నాకా బోధ అందించింది. యేది మంచి యేది చెడ్డ అనే జ్ఞానం జవాబుని యిచ్చింది. యీ జ్ఞానం నా అంతట నే పొందలేదు. యితరులందరిలాగా నాకు లభించింది. యెందుకు 'లభించింది' అంటే నేను దాన్ని యే సాధనాలద్వారానూ పొందలేను గనక.

'అది నాకు యెలా లభించింది? నేను నా పొరుగు వాణ్ణి ప్రేమించాలి, వాడి పీక తెగ్గొయ్యకూడదు అనే అవగాహన యే తర్కంవల్ల యే బోధవల్ల నాకు లభించింది? దీన్ని నాకు నా బాల్యంలో చెప్పేరు. నేను దాన్ని సంతోషంగా నమ్మేను యేమంటే అది అప్పటికే నా ఆత్మస్థితమై వుంది గనక. దీన్ని యెవరు ఆవిష్కరించేరు? తర్కం కాదు. తర్కం అస్తిత్వ సంఘర్షణనీ, నీ యిచ్ఛా పరిపూర్తికి బాధాకరంగా పరిణమించిన వాళ్లందరి పీకలూ ఉత్తరించే నియమాన్నీ ఆవిష్కరించింది. తర్క బోధ పరిణామం అదీ. కాని నీ

పొరుగు వాణ్ణి ప్రేమించు అనే బోధని తర్కం ఆవిష్కరించలేదు యేమంటే అలా చెయ్యడం హేతుబద్ధం కాదు కాబట్టి.'

'ఆఁ, అహం' అని అతను బోర్ల పడుకుంటూ గడ్డి పరకని చించకుండా ముడి వెయ్య బోతూ అనుకున్నాడు.

'బౌద్ధిక అహం మాత్రమే కాదు దాని మూర్ఖత కూడా. యిక అన్నిటికంటే అధ్వాన్నం అయిన వంచన, బుద్ధి వంచన. బుద్ధి కాపట్యం' అని రెట్టించుకున్నాడు.

## 13

కొద్ది రోజుల కితమే దాలీకీ ఆమె పిల్లలకీ జరిగిన వొక సంఘటన లేవిన్‌కి గుర్తు వచ్చింది. యెవళ్ళూ లేకుండా చూసి పిల్లలు పాల కప్పుల్లో రాస్ప్‌బెర్రీలని కొవ్వొత్తులమీద ఉడికిస్తూ వొకళ్ల నోట్లో వొకళ్లు ఫౌంటెన్లనుంచి చిమ్మినట్టుగా పాలని చిమ్ముతూ ఆడు కుంటున్నారు. వాళ్ళా పని చేస్తూ వుంటే దాలీ చూసి లేవిన్ యెదురుగుండానే పిల్లలకి హితబోధ మొదలుపెట్టింది. తాము పాడు చేస్తూ వున్న వాటిని తయారు చెయ్యడానికి పెద్ద వాళ్లు యెంత శ్రమ పడిందీ, తమ కోసం ఆ శ్రమ యెలా అర్పితమైందీ, వాళ్లు గనక కప్పులని పగలగొడితే తాగడానికి కప్పులు యెలా లేకుండా పోయేదీ, పాలు వొలక పోస్తే తినడానికి తాగడానికీ యేదీ యెలా మిగలకుండా పోయేదీ, ఆకలికి మాడి యెలా చచ్చిపోయేదీ ఉపన్యాసం మొదలుపెట్టింది.

పిల్లలు తల్లి దంచుతూ వున్న ఆ ఉపన్యాసాన్ని విసుగ్గా, యేం పట్టని అపనమ్మకంతో వినడం చూసి లేవిన్‌కి ఆశ్చర్యం కలిగింది. వాళ్లకి బాధ కలిగించిందల్లా తమ సరదా పాడైం దనే. ఆమె చెప్పిన దాంట్లో వొక్క ముక్క కూడా వాళ్లు నమ్మలేదు. వాళ్ళు నమ్మలేరు యేమంటే, వాళ్లు ఉపయోగించే వస్తువుల సంఖ్య గురించి వాళ్లు వూహించను కూడా వూహించలేరు. అందుకని తాము పాడు చేస్తూ వున్న ఆ వస్తువులు అతిముఖ్యం అని వాటివల్ల జీవితం వుందని వాళ్ళు వూహించలేరు.

'అవన్నీ వాటంతట అవే వచ్చేయి' అని వాళ్లు అనుకున్నారు 'యెప్పుడూ అలానే వున్నాయి, అలానే వుంటాయి. అంచేత వాటి గురించి రాద్ధాంత సిద్ధాంతాలు దండుగ. అస్తమానూ అదే పాట. దాన్ని గురించి ఆలోచించడం కూడా అనవసరం. అవి తయారై సిద్ధంగా వున్నవే. మాకు కావాల్సింది కొత్తవి భిన్నమైనవి. అందుకనే మేం కప్పుల్లో రాస్ప్ బెర్రీలని ఉడకబెడుతున్నాం, పాలని వొకళ్ల నోళ్లల్లోకి వొకళ్లం చిమ్ముకుంటున్నాం. యిది కొత్తగా వుంది, మనసుకి రంజుగా వుంది, కప్పులతో పాలు తాగడంలాగా వుంది.'

'మరి మనం, నేను కూడా బుద్ధిద్వారా ప్రాకృతిక శక్తుల మహత్వాన్నీ, మానవ జీవిత అర్థాన్ని అన్వేషించడం అలా చెయ్యడం కాదా?' అనుకున్నాడతను.

'సకల దర్శనాలు కూడా అలా చెయ్యడం లేదూ? ఆలోచనల మార్గంలో, మానవునికి పరాయిగా, అస్వాభికమైనదిగా వుండే మార్గంలో మానవునికి సర్వదా తెలిసి వున్నటువంటి జ్ఞానాన్ని, అది లేకుండా జీవితమే లేదన్నంత బాగా తెలిసిన జ్ఞానాన్ని బోధపరచడం లేదా? ప్రతి దార్శనికుని సిద్ధాంత వికాసంలోనూ, రైతు ఫ్యోదొర్‌కిలాగానే నిశ్చితంగా, అంతకంటే స్పష్టంగా కాక, జీవిత పరమార్థం ముందే తెలుసుననీ, అందరికీ తేటతెల్లంగా వున్న యీ విషయానికి సందేహపూర్వక బౌద్ధిక మార్గంద్వారా మాత్రమే తిరిగి రావాలనీ వున్నట్టు స్పష్టంగా కనిపించడం లేదూ?

'కాని కొంచెం అదే పిల్లల్ని వాళ్ల మానాన వాళ్లని వొదిలిపెట్టేస్తే, – వాళ్లే స్వయంగా సంపాదించుకుంటారు కప్పలు తయారు చేసుకుంటారు, పాలు పితుక్కుంటారు, అన్నిట్నీ అలా వాళ్లే చేసుకుంటారు అని. అప్పుడు వాళ్ల కొంటె పనులు వుంటాయా? వాళ్లు ఆకలికి మాడి చచ్చిపోతారు. యిదే రకంగా మనం మన చిత్తవృత్తుల్ని, చింతనలని ఏక ఈశ్వరుడు, సృష్టికర్త అనే భావన లేకుండా విశృంఖలంగా వదిలిపెట్టేస్తే? యేది మంచి యేది చెడు అనే అవగాహన లేకుండా, చెడు అంటే యేమిటి అన్న వ్యాఖ్య లేకుండా వదిలిపెట్టేస్తే?

'అలాంటి అవగాహన లేకుండా యెక్కడ తేలతాం?

'మనం అన్నిట్నీ నాశనం చేస్తాం యేమంటే ఆత్మిక రూపంలో మనం నిండుగా వున్నాం కాబట్టి! పిల్లల్లాగా!

'మనశ్శాంతిని ప్రసాదించే యీ సంతోషభరిత జ్ఞానం రైతుతోబాటుగా నాకు యెలా వచ్చింది? యెక్కడినుంచి దీన్ని పొందేను?

'భగవంతుడు, క్రైస్తవ ధర్మం అనే భావలలో పెరిగి, క్రైస్తవ ధర్మం ప్రసాదించిన ఆత్మిక వరాలతో జీవితాన్ని సుసంపన్నం చేసుకుని, వాటితో జీవితాన్ని ఓతప్రోతం గావించుకుని వాటి సహాయంతో జీవించే నేను పిల్లల మాదిరిగా నాకు తెలియకుండానే వాటిని నాశనం చేస్తున్నాను, నేను జీవించడానికి సహకరిస్తూ వున్న వాటిని నాశనం చేస్తున్నాను. కాని నా జీవితంలో కీలకమైన ఘట్టాలు వచ్చినప్పుడు, చలి, ఆకలి యెదురైనప్పుడు పిల్లల మాదిరీ భగవంతుడికేసి పోతున్నాను. కాని కొంటె పనులు చేసినప్పుడు తల్లి కేకలు వేస్తే పిల్లలు బాధపడేదానికంటే, వస్తు బాహుళ్యం కారణంగా నా పిల్ల చేష్టలు చేసినందుకు నాకు తక్కువ బాధ్యత వుంటోంది.

'నాకు తెలిసింది బుద్ధిద్వారా తెలిసింది కాదు. నాకు దాన్ని ప్రసాదించిన దానివల్ల, నా ముందు ఆవిష్కరించుకున్న దానివల్ల. దాన్ని నా హృదయంతో గ్రహిస్తున్నాను, క్రైస్తవ ధర్మం నాకు బోధించిన ముఖ్య విషయాన్ని విశ్వసిస్తున్నాను.

'క్రైస్తవ ధర్మం? క్రైస్తవ ధర్మం!' అని లేవిన్ రెట్టించుకున్నాడు. అతను మరో పక్కకి మళ్లి మోచేతిమీద ఆనుకుంటూ, నది అవతలి వేపున గట్టుమీద మేస్తూ వున్న ఆవుల మంద నీటి వారకి దిగివస్తూ వుంటే చూస్తూ వున్నాడు.

'కాని క్రైస్తవ ధర్మ సర్వబోధననీ విశ్వసిస్తున్నానా?' అని తనని తను పరీక్షించుకుంటూ, తన ప్రస్తుత మనశ్శాంతికి భంగం కలిగించగల వాటినన్నిట్నీ కూడా గుర్తు చేసుకుంటూ అనుకున్నాడు. తనకి సర్వదా యెంతో విచిత్రంగా కనిపిస్తూ, సందేహకారకమవుతూ వున్న క్రైస్తవ బోధనలని కావాల్సికి గుర్తు చేసుకున్నాడు. 'సృష్టి? కాని అస్తిత్వాన్ని యెలా విశదం చేసుకున్నాను? అస్తిత్వంద్వారా? అసలు విశదం చేసుకున్నానా అని. సైతాన్, పాపం? పాపం అనే వాటిని యెలా అర్థం చేసుకోవాలి?.. మోక్షదాత?...

'లేదు, ప్రతివాళ్లకీ తెలిసిన దాన్ని తప్ప వేరే దాన్ని నేను తెలుసుకోలేను.'

యిప్పుడతనికి వొక విషయం ప్రతీతం అయింది, క్రైస్తవ ధార్మిక విశ్వాసాల్లో వొక్కటి కూడా ముఖ్య బోధనని – మానవ జీవిత యేకైక లక్ష్యంగా భగవంతునిమీద, మంచిమీద నమ్మకాన్ని – ఖండించడం లేదు.

యీ రకంగా క్రైస్తవ బోధనలో ప్రతి సూత్రంలోనూ యెవళ్లకి అనుకూలమైం దాన్ని వాళ్లు జరిపించుకోవడం గాక ధర్మమైంది ఆచరించడంలో విశ్వాసం వుంది. యే వొక్క సూత్రం కూడా దీన్ని ఖండిచడం లేదు సరికదా ప్రతి సూత్రం దీన్ని అజరామరం చేస్తోంది. యీ పృథ్వీమీద స్థాయీ రూపంలో వున్న ముఖ్య అద్భుతం యిదే. కోట్లాది విభిన్న జీవుల తోబాటుగా – వివేకవంతులు, బుద్ధిహీనులు, పడుచువాళ్లు, వృద్ధులు, రైతులు, ల్వోవ్, కిట్టీ, చక్రవర్తులు, సన్యాసులు – ప్రతి వ్యక్తికి నిస్సందేహంగా సమాన స్థితిలో ఆమోద యోగ్యం చేసి, అర్థవంతమూ, జీవన యోగ్యవంతమూ అయిన పారమార్థిక జీవితాన్ని సంభవం చేస్తుంది.

అతను వెనక్కి వాలి పడుకుని పైన యెత్తులో వున్న నిర్మల ఆకాశాన్ని చూశేడు. 'అది వృత్తాకారంగా వున్న గుమ్మటం గాక సీమాతీత విస్తారమని నాకు తెలియదా? కాని యెంతలా కళ్లు లగ్నం చేసుకున్నా, యెంత కళ్లు పోటు పెట్టేటట్టు చూసినా నాకు ఆ సీమితమైన గుమ్మటమే కనిపిస్తుంది. సీమాతీత విస్తారమని నాకు యెంత జ్ఞానం వున్నా అది ఘనమైన నీలి గుమ్మటం గానే కనిపిస్తోంది అనిపించడంలో లవ లేశం నా పొరపాటు లేదు, నిజానికి గుమ్మటం కాక అవతల యేదో వుందని కళ్లు నొప్పి పుట్టేటట్టు చూడ ప్రయత్నించే దానికంటే యేం పొరపాటు కాదు యిది.'

లేవిన్ ఆలోచించడం మానేసి, యేదో నిగూఢ ధ్వనుల్ని అంతరంగంలో దేన్ని గురించో సంతోషభరితంగా, త్రికరణ శుద్ధిగా తదేకధ్యానంతో మాట్లాడుకుంటూ వున్నట్టు, విన్నాడు.

'దీన్ని ఆస్తికత అనవచ్చునా?' తనకి కలిగిన అంత సంతోషాన్ని నమ్మడానికి భయపడుతూ

అనుకున్నాడు. 'ఈశ్వరా! నీ దాసుణ్ణి' అని రెండు చేతులతోనూ కన్నీళ్లు తుడుచుకుంటూ, రుద్ధ కంఠంలో ఉబుకుతూ వున్న వెక్కుని దిగమింటుకుంటూ గొణుక్కున్నాడు.

## 14

లేవిన్ యెదరకి చూశేడు. పశువుల మందనీ, తర్వాత నల్ల గుర్రం కట్టిన తన గుర్రబ్బగ్గీనీ చూశేడు. బండివాడు బండిని తోలుకు వస్తున్నాడు. బండి మంద దగ్గరికి రాగానే తోలేవాడు కాపర్లతో యేదో మాట్లాడేడు. కొంచెం సేపటి తర్వాత తన దగ్గరికి వస్తూ వున్న బండి చక్రాల చప్పుడు, గుర్రం సకిలించడం వినిపించేయి. కాని అతను తన ఆలోచనల్లో తదేకధ్యానంతో లగ్నమైపోయి బండివాడు తన దగ్గరికి వచ్చేందుకు కారణం యేమై వుంటుందో పట్టించుకోలేదు.

బండితోలేవాడు దగ్గరికి దగ్గరకంటూ వచ్చి పిలిచినప్పుడు మాత్రమే అతనికి తట్టింది.

"అమ్మగారు నన్ను పంపేరండి. తమరి అన్నగారు, మరో ఆయనా వచ్చారండి" అని చెప్పేడు.

లేవిన్ బండి యెక్కేడు, తనే తోలేందుకు కళ్లేలు అందుకున్నాడు.

గాఢమైన నిద్రపోతూ వుంటే లేపిన వాడి మాదిరీ వుంది లేవిన్‌కి, చాలా సేపటిదాకా యేదీ యేమిటీ అని బుర్రకెక్కలేదు. అతను నాజూగ్గా వున్న గుర్రంకేసి చూశేడు; దాని మెడమీద ముస్తీబు వొరుసుకుంటూ వున్న చోటునీ, చెమట నురగలు కక్కుతూ వున్న కటి ప్రదేశాన్నీ తన పక్కన కూర్చున్న బండితోలే మనిషి ఇవాన్‌నీ చూశేడు. తను అన్నగారు వస్తాడని యెదురు చూడ్డం గుర్తు వచ్చింది. తను చాలా సేపు రానందుకు భార్య ఆందోళన పడుతూ వుంటుందని భయం వేసింది. ఆ వచ్చిన పెద్ద మనిషి యెవరై వుంటారా అని వూహించేడు. తన అన్నగారు, భార్య, ఆ కొత్త వ్యక్తి కొత్త రీతిలో, అంతకు ముందు లేని రీతిలో, తోచేరు. యిప్పుడు అందరితోనూ తన సంబంధాలు భిన్నంగా వుంటాయని అతనికి అనిపించింది.

'అన్నయ్యకీ నాకూ మధ్య యెప్పుడూ వుంటూ వున్న ఆ దూరం యిక వుండదు. వాదవివాదాలు వుండవు. కిట్టీతో యెన్నడూ పోట్లాడను యిక. ఆ వచ్చిన చుట్టం యెవరో మరి అతనితో ఆప్యాయంగా ఆదరంగా వుంటాను. నౌకర్లతో, మాటకి యీ ఇవాన్‌తో, సరసంగా వుంటాను.'

యిక తాళ లేనట్టు సకిలిస్తూ, కళ్లెం సడలిస్తే వొక్క ఉదుట్న దౌడు తియ్యడానికి సిద్ధంగా వున్న గుర్రాన్ని అదుపు చేసి లేవిన్ తన పక్కన కూర్చున్న ఇవాన్‌కేసి చూశేడు. ఇవాన్‌కి చేతుల్లో కళ్లేలు లేకపోవడంతో యేం చెయ్యాలో తోచక చొక్కా చివళ్లు గుంజు కుంటున్నాడు. అతనితో మాట్లాడ్డానికి యేం దొరుకుతుందా అని లేవిన్ చూశేడు. జీనుని

గట్టిగా బిగించావని అందామనుకున్నాడు. కాని ఆ ముక్క అతన్ని తప్పు పట్టుకోవడం అవుతుందనిపించింది. అతనికి యిష్టం కలిగించే మాటలు కాసిని అనాలనుకున్నాడు. కాని వేరే యేమీ అతనికి దొరకలేదు.

"గుర్రాన్ని కుడి వేపు మళ్లించండయ్యా అక్కడ మోడు వుంది" అని అతను కళ్లేలు అందుకోబోయేడు.

"కళ్లేలు పట్టుకోవద్దు, నాకు పాఠం చెప్పొద్దు" అని లేవిన్ బండివాడి జోక్యంతో చిరెత్తి అరిచేడు. అది అతనిలో వో బలహీనత, యెవళ్లేనా జోక్యం చేసుకుంటే సహించలేడు. కాని యీ సారి అతనికి మనసుకి బాధ కలిగింది, యేమంటే తనలో వచ్చిన నూతన ఆధ్యాత్మిక పరివర్తనతో వెంటనే చిన్నా చితకా చిరాకులు మారిపోతాయని అనుకోవడం యెంత తప్పో తెలిసింది.

దాదాపు యింటి దాపులకి వచ్చే వేళకి గ్రీష, తాన్యా తను వేపు పరిగెత్తుకుంటూ రావడం లేవిన్‌కి కనిపించింది.

"బాబాయ్, అమ్మ వస్తోంది, తాతగారు, కోజ్నిషెవ్‌గారు, యింకో ఆయనా వస్తున్నారు" అని వాళ్లు బండిలోకి యెక్కుతూ అన్నారు.

"యింకో ఆయన యెవరు?"

"భలే చిత్రంగా వున్నాడు. చేతుల్ని యిలా ఊపుతాడు" అని తాన్యా బండిలో యెక్కేది ఆగిపోయి కతవాసొవ్ అలవాటుని అనుకరిస్తూ చెప్పింది.

"పడుచతనా ముసలతనా" అని లేవిన్ నవ్వుతూ అడిగేడు. తాన్యా అనుకరణతో అతనికి యెవరో గుర్తువచ్చేరు.

'అయిష్టుడైన మనిషి కాకుండా వుంటే బాగుండును' అని మనసులో అనుకున్నాడు.

దారి మలుపు తిరగ్గానే లేవిన్‌కి తను వేపు వస్తూ వున్న మనుషులు కనిపించేరు. గడ్డి టోపీ పెట్టుకున్న కతవాసొవ్‌ని అతను వెంటనే గుర్తించేడు. కతవాసొవ్, అచ్చు తాన్యా చేతులు వూపి అనుకరించిన రీతిలోనే చేతులు వూపుతున్నాడు.

కతవాసొవ్‌కి తత్వశాస్త్ర చర్చ అంటే యిష్టం. అతని భావాలు ప్రకృతి శాస్త్రజ్ఞుల నుంచి గ్రహించినవి. ప్రకృతి శాస్త్రజ్ఞులు తత్వశాస్త్రాన్ని యెప్పుడూ లోతుగా అధ్యయనం చెయ్యరు. లేవిన్ కిందటి సారి మాస్కో వెళ్లినప్పుడు చాలా సార్లు వాదనలు చేశాడు.

కతవాసొవ్‌ని చూడగానే లేవిన్‌కి లోగడ జరిగిన వొక వాదన గుర్తు వచ్చింది. ఆ వాదనలో తన తక్కెడకేసి మొగ్గు వుందని కతవాసొవ్‌కి నమ్మకం కలిగింది.

'అబ్బే, అతనితో వాదించను, తెలివితక్కువతనంగా నా అభిప్రాయాలు వెల్లడించను యేమైనా' అని లేవిన్ నిశ్చయంగా అనుకున్నాడు.

బండిలోనుంచి కిందికి దిగేక అన్నగారినీ, కతవాసొవ్‌నీ ఆప్యాయంగా పలకరించి, భార్య యేదని అడిగేడు.

"కొడుకుని కోలక్‌కి తీసుకువెళ్ళింది (యింటి దగ్గరున్న తోపు అది). వాడికి అక్కడ బాగుంటుందని, యింట్లో చాలా వేడిగా వుంది" అని దాలీ చెప్పింది.

కుర్రాణ్ణి ఆ అడివిలోకి తీసుకెళ్ళద్దని లేవిన్ పెళ్ళానికి యెప్పుడూ చెబుతూనే వుండేవాడు, అక్కడ ప్రమాదంగా వుంటుందని అతని భయం. దాంతో యీ వార్త గాబరా పెట్టింది.

"వాణ్ణి యిక్కడికీ అక్కడికీ పిల్లి పిల్లల్ని తిప్పినట్టు తిప్పేస్తుంది. పిల్లాణ్ణి మంచు యింట్లో పెట్టమని సలహా యిచ్చేను" అని వృద్ధ ప్రిన్స్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"తను తేనెటీగల క్షేత్రం దగ్గరికి వెడదామనుకుంది. నువ్వక్కడున్నా వనుకుంది. మేమూ అక్కడికే వెడదామ నుకుంటున్నాం" అంది దాలీ.

"అయితే ప్రస్తుతం యేం చేస్తున్నావు?" అని కోజ్నిషెవ్ తమ్ముడితో మాట్లాడేం దుకు వెనకబడుతూ అడిగేడు.

"ఫలానా అని ప్రత్యేకం యేం లేదు. యెప్పటిలాగా వ్యవసాయం పనులే సరిపోతున్నాయి" అని లేవిన్ బదులు చెప్పేడు. "కాసిని రోజులు వుంటావు కదూ? వస్తావు వస్తావు అని చాలా రోజులుగా చూస్తూ వున్నాం" అన్నాడు.

"రెండు వారాలుంటాను. మాస్కోలో చాలా పన్లున్నాయి."

కోజ్నిషెవ్ ఆ మాట అంటూ వుండగా అన్నదమ్ములు వొకళ్ల కళ్లల్లోకి వొకళ్లు చూసుకున్నారు. అన్నగారితో స్నేహపూర్వకంగా, యే మాత్రం బెరుకు లేకుండా సాఫీగా వుండాలని లేవిన్‌కి సదా కోరిక వున్నా, ప్రస్తుతంలో ఆ కోరిక ప్రబలమైందిగా వున్నా, చూపులు కలవగానే అతనికి ఆ బెరుకు మళ్లీ వచ్చేసింది. దాంతో యేం చెప్పాల్సిందీ తెలీక అతను కళ్లు వాల్చుకున్నాడు.

అతను కోజ్నిషెవ్‌కి ఆసక్తికరంగా వుండే ప్రసంగ విషయాల గురించి మనసులో అనుకున్నాడు. సెర్బియన్ యుద్ధం గురించీ, స్లావ్ సమస్య గురించీ అతని ధ్యాస మళ్లించే ప్రసంగ విషయాల గురించి అనుకున్నాడు. తన మాస్కో పనుల గురించి చెప్పడంలో కోజ్నిషెవ్ ఆ విషయాలనే సూచించేడు. లేవిన్ అన్నగారి పుస్తకం గురించి మాట కదలేశాడు.

"నీ పుస్తకంమీద సమీక్షలు యేమన్నా వచ్చేయా?" అని అడిగేడు.

లేవిన్ ముందే అనుకుని యీ ప్రశ్న అడిగినట్టు కోజ్నిషెవ్ మందహాసం చేశేడు.

"యెవళ్ళూ దాన్ని గురించి అనుకోవడం లేదు, నేను కూడా" అన్నాడతను. "దాలీగారూ, చూడండి అటు వాన కురిసేటట్టు వుంది" అంటూ ఆస్పెన్ చెట్ల పైన ఆకాశంలో కనిపిస్తూ వున్న తెల్లని మేఘాలకేసి గొడుగుతో చూపిస్తూ అన్నాడు.

యీ మాటలు అనగానే అన్నదమ్ములిద్దరి మధ్యా వున్న సంబంధం, వైషమ్య పూరితమైంది కాకపోయినా దూరస్థమైనటు వంటిది, లేవిన్ తొలగించాలని యెంతో ఆపుర్దా పడినటువంటిది తిరిగి చోటు చేసుకుంది.

లేవిన్ కతవాసొవ్ దగ్గరికి వెళ్లేడు.

"నాకు చాలా సంతోషంగా వుంది మీరిక్కడికి వచ్చినందుకు" అన్నాడు.

"చాలా కాలంగా అనుకుంటూనే వున్నాను. యిప్పుడు మనం తనివితీరా మాట్లాడు కోవచ్చు. ఆఁ, స్పెన్సర్* పుస్తకాలు చదవలా?"

"ఆసాంతం చదవలా, యిప్పుడా చదవడమూ అవసరం లేదు నాకు" అని లేవిన్ అన్నాడు.

"అదేమిటి? తమాషాగా వుందే! యెందుకని?"

"స్పెన్సర్ గాని, ఆయనలాంటి వాళ్లు గాని నా సమస్యలకి జవాబులు యివ్వలేరని నాకు నమ్మకం కలిగింది. యిప్పుడు..."

కాని కతవాసొవ్ ముఖంలో ద్యోతకమైన శాంత ప్రఫుల్ల భావం హఠాత్తుగా అతన్ని చకితం చేసింది. యీ సంభాషణ మొదలెట్టి తన సంతోషభరిత మనఃస్థితిని పాడు చేసు కున్నానని బాధ కలిగింది. అలా చెయ్యకూడదన్న తన సంకల్పాన్ని గుర్తు చేసుకుని అతను మధ్యలోనే మాట తెంపేశాడు.

"సరే వాటి గురించి తర్వాత మాట్లాడుకుందాం" అన్నాడు. "మనం తేనెటీగల క్షేత్రానికి వెళ్లాలనుకుంటే యిటు రండి" అని అందర్ని ఉద్దేశించి అన్నాడు.

వాళ్లు యిరుగ్గా వున్న దారిలో వెళ్లారు. గడ్డి నిండుగా వున్న మైదానంమీదకి చేరారు. దానికి వో పక్క గుబురుగా పెరిగిన నదురైన పువ్వుల పొదలున్నాయి. వాటి మధ్యలో ముదురా కుపచ్చ హెల్‌బరీ పొదలున్నాయి. లేవిన్ తన అతిథుల్ని లేత ఆస్పెన్ చెట్ల దట్టమైన నీడలో బెంచీలమీద దుంగలమీద కూర్చోబెట్టేడు. తేనెటీగలంటే భయపడే ఆగంతుకుల నిమిత్తం వాటిని అక్కడ యేర్పాటు చేశారు. తను మాత్రం తేనెటీగల క్షేత్రానికి వెళ్లేడు, అతిథులకి తాజా దోసకాయలు, తేనె, రొట్టె పట్టుకు వద్దామని.

యిష్టం వొచ్చినట్టు వూగకుండా జాగ్రత్త పడుతూ, ముందుకు వెడుతూ యెక్కువ సంఖ్యలో జుమ్మంటూ ముసురుతూ వున్న తేనెటీగల సంగీతం వింటూ అతను వో కొయ్య గుడిసె దగ్గరకి వెళ్లేడు. గుమ్మం దగ్గర వో తేనెటీగ అతని గడ్డంలో చిక్కుకుని జోరుగా మోత మొదలెట్టింది. అతను జాగ్రత్తగా దాన్ని గడ్డంలోనుంచి తీసి అవతలకి విసిరేశాడు. లోపలికి వెళ్లేక అతను కొక్కేనికి తగిలించిన చిక్కం తీసి తలమీద తగిలించుకుని చేతుల్ని జేబుల్లో పెట్టుకున్నాడు. అప్పుడు కంచెకట్టిన తేనె పట్లు దాకా వెళ్లేడు. గడ్డి కోసి చదును చేసిన చచ్చౌకంలో వరసలుగా పాత తేనె గూళ్లు గుంజలకి నార పట్టెలతో కట్టి వున్నాయి. ప్రతీ తేనె గూడు అతనికి తెలిసినదే. ప్రతిదానికీ దాని పుట్టు పూర్వోత్తరాలు వున్నాయి. యీ యేడాదే పెట్టిన కొత్త తేనె గూళ్లు వరసగా కంచెవారనే వున్నాయి. ప్రతి గూడు దగ్గరా తేనెపట్టు గదుల ముందు వొకే చోట గుంపుగా మూగి, క్రీడిస్తూ చుట్టూ తిరుగుతూ వున్న తేనెటీగలదీ, పోతుటీగలదీ మెరుపు కనిపిస్తోంది. పని చేసే తేనెటీగలు వొకే దిశలో,

అడివిలో పుష్పిస్తూ వున్న లైమ్ చెట్టుకి వెడుతూ, అక్కడినుంచి మధువుతో తిరిగి గూళ్ళకేసి వస్తూ వున్నాయి.

తేనె గూళ్ళల్లోనుంచి వస్తూ వున్న ఝుంకార నాదాలు యెడతెగకుండా వినిపిస్తూనే వున్నాయి. పనిలో వున్న కార్మిక తేనెటీగల హోరు, సోమరి పోతుటీగల ధ్వనులు, కాపలా కాసే తేనెటీగల ఆందోళనా నాదాలు వినిపిస్తున్నాయి. శత్రువు బారినుంచి తమ మధుసంపదని రక్షించుకుందుకూ, హద్దుమీరి చరించి వచ్చిన వాళ్ళని కుట్టడానికీ అవి తయారుగా వున్నాయి. కంచె అవతలి వేపున తేనెటీగల క్షేత్రం ముసలి కాపలా వాడు కర్రకి కట్టిన కొక్కేన్ని సవరిస్తున్నాడు, లేవిన్‌ని చూడలేదు. అతన్ని పిలవకుండానే లేవిన్ తేనెటీగల గూళ్ళ మధ్యలో నుంచున్నాడు.

వొంటరిగా వున్నందుకు, తన మనఃస్థితిని బాగా పాడు చేసిన పరిసరాలనుంచి గబగబా తప్పించుకు రాగలిగినందుకు, ఆతనికి సంతోషం కలిగింది.

తను ఇవాన్‌మీద చిరాకు పడ్డాడు, అన్నగారిపట్ల ఆప్యాయత చూపించలేదు, కతవాసాన్‌తో తెలివితక్కువగా మాట్లాడేడు అని గుర్తు వచ్చింది.

'యేమిటి అది ఛాయా మాత్రంగా చిహ్నాల్ని వదలకుండా మాయమైపోయే క్షణిక మనఃస్థితేనా?' అనుకున్నాడు.

కాని ఆ క్షణంలోనే ఆ మనఃస్థితి మళ్ళీ ఆవహించింది. యేదో నవ్యమైనదీ ప్రముఖమైనదీ తన అంతరంగంలో రూపు తీసుకుందన్న సహర్ష చేతన అతనికి కలిగింది. పరిసరాలు తాత్కాలికంగానే అతని ఆత్మిక శాంతిమీద పరదా కప్పేయి. కాని అది అంతరంగంలో అక్షీణంగానే వుంది.

తన చుట్టూతా ముసురుకుంటూ, భయ పెడుతూ దృష్టిని మళ్ళిస్తూ శారీరకంగా భద్రత లేకుండా చేస్తూ వున్న తేనెటీగల మాదిరిగానే ప్రాపంచిక చింతలు తను బండిలో కూర్చోగానే తనమీద దాడి చేసి, ఆత్మిక శాంతిని లేకుండా చేశాయి. కాని తను ఆ ప్రాపంచిక చింతల మధ్య వున్నంత సేపే ఆ స్థితి వుంది. తేనెటీగల భయం వున్నా తన శారీరక భద్రత దెబ్బ తినలేదు, చెక్కు చెదరకుండా వుంది. అలానే అంతరంగంలో నూతనావిష్కృత ఆత్మిక శాంతి పదిలంగా వుంది.

## 15

"నీకు తెలుసా మీ అన్నయ్యగారు రైల్లో యెవరితో కలిసి ప్రయాణం చేశారో?" అని పిల్లలకి తేనె, దోసకాయలూ పంచి యిస్తూ లేవిన్‌ని అడిగింది దాలీ. "వ్రాన్‌స్కీతో. అతను సెర్బియా యుద్ధంలో పాల్గొందుకు వెడుతున్నాడట" అని చెప్పింది.

"యెక్కడూ వెళ్లడం కాదు, తన సొంత ఖర్చుమీద వొక దండుని కూడా తీసుకు వెడుతున్నాడు" అన్నాడు కతవాసొవ్.

"అతనికి తగినట్టే వుంది" అన్నాడు లేవిన్. "అయితే వలంటీర్లు యింకా వెడుతున్నారన్న మాట?" అని కోజ్నిషెవ్‌కేసి తిరిగి అడిగాడు.

కోజ్నిషెవ్ జవాబు చెప్పకుండా తన కప్పు అడుగున తేనెపట్టు ముక్కలో చిక్కుకుని యింకా సజీవంగా వున్న వో తేనెటీగని బండగా వున్న చాకుతో సావధానంగా యివతలికి తీస్తూ వుండిపోయేడు.

"వెళ్లకపోవడమేమిటి? స్టేషన్లో నిన్న మీరు చూసి వుండాల్సింది" అని కతవాసొవ్ దోసకాయని కటక్కని కొరుకుతూ అన్నాడు.

"యేమిటి దీనంతటికీ అర్థం? యీ వలంటీర్లు అందరూ యెక్కడికి పోతున్నారో యెవరితో పోరాడుతున్నారో దేవుడి సాక్షిగా నాకు వివరించి చెప్పండి కోజ్నిషెవ్‌గారూ" అని వృద్ధ ప్రిన్స్ అన్నాడు. లేవిన్ లేనప్పుడు మొదలైన సంభాషణని అందుకుంటూ అతనా ముక్క అంటున్నట్టు తెలుస్తూనే వుంది.

"టర్కులతో" అని కోజ్నిషెవ్ తేనెటీగని యివతలికి తీసిపారేసి ప్రశాంతంగా మందహాసం చేస్తూ అన్నాడు. ఆ తేనెటీగ తేనెతో నల్లబడి నిస్సహాయంగా గిజగిజ లాడుతోంది. దాన్ని కోజ్నిషెవ్ చాకుమీదనుంచి పెళుసుగా వున్న ఆస్పెన్ పర్ణంమీదకి చేర వేశాడు.

"కాని టర్కులమీద యుద్ధాన్ని యెవళ్లు ప్రకటించేరంటారు? మేడం స్థాల్‌తో కలిసి ఇవాన్ ఇవానొవిచ్ రగోజొవ్, కౌంటెస్ లిదియా ఇవానొవ్నాగార్లు అంటారా?"

"యెవళ్లూ యుద్ధం ప్రకటించలేదు. కాని తమ సోదరుల బాధలు చూసి ప్రజలకి సానుభూతి కలిగింది. వాళ్లకి సాయం చెయ్యాల నుకుంటున్నారు" అన్నాడు కోజ్నిషెవ్.

"ఆయన అడిగింది సాయం గురించి కాదు, యుద్ధం గురించి" అని లేవిన్ మామగారిని బలపరుస్తూ అన్నాడు. "ప్రభుత్వ అనుమతి లేకుండా వ్యక్తులు సొంతంగా యుద్ధంలో పాల్గొనేందుకు హక్కు లేదు" అన్నాడు.

"లేవిన్ తేనెటీగ చూడు! కుదుతుందేమో" అని డాలీ కందిరీగని చేత్తో తోలేస్తూ అంది.

"అది తేనెటీగ కాదు, కందిరీగ" అన్నాడు లేవిన్.

"అయితే, యేదీ, కానీండి మీ సిద్ధాంతం యేమిటో చెప్పండి" అని కతవాసొవ్ వాదనకి దిగమని కాలుదువ్వుతున్నట్టుగా లేవిన్‌ని పురికొల్పేడు. "వ్యక్తులకి యెందుకు హక్కు వుండకూడదా?" అని అడిగేడు.

"నా సిద్ధాంతం యిదీ: యుద్ధం అనేది వో పక్క క్రూరమైన, పాశవికమైన భయంకరమైన విషయం. అంచేత యే వొక్క వ్యక్తీ, క్రైస్తవుడన్న వాడి మాట సరేసరి, యుద్ధం ఆరంభించే బాధ్యత తీసుకోడు. ప్రభుత్వమే ఆ పని చెయ్యాలి. ప్రభుత్వాలకి ఆ అధికారం

వుంది, ప్రభుత్వాలు అలా చెయ్యవలసిన పరిస్థితులు వస్తాయి. మరో పక్క సూత్ర రీత్యా చూసినా, లోకజ్ఞానం దృష్ట్యా చూసినా ప్రభుత్వ వ్యవహారాలకి సంబంధించీ యుద్ధం చెయ్యడం విషయానికి సంబంధించి ముఖ్యంగానూ, మామూలు పౌరులు తమ కోరికలని పరిత్యజించాలి'' అన్నాడు.

కతవాసొవ్, కోజ్నిషెవ్‌లిద్దరూ వొక్క సారే తయారుగా వున్న తమ వాదనాయుధాలు తీసుకుని రంగంలోకి దూకేరు.

''అదీ బాబూ సంగతి. ప్రజల కోరికలని ప్రభుత్వం పరిపూర్తి చెయ్యలేని సందర్భాలూ వుంటాయి, అంచేత ప్రజలు తాము కోరుకున్న దాన్ని ప్రకటిస్తారు'' అన్నాడు కతవాసొవ్.

కోజ్నిషెవ్‌కి యీ వాదన నచ్చినట్టు లేదు, యేమంటే అతను కనుబొమలు చిట్లించి తన వాదన చెప్పేడు.

''సమస్యని అలా పెట్టకూడదు, తప్పు. యుద్ధం ప్రకటించడానికి సంబంధించిన విషయం కాదు యిది. మానవత్వపూరిత, క్రైస్తవ భావాల్ని వ్యక్తం చెయ్యడం. మన సోదరులు, యేక రక్త బంధువులు, వొకే రకమైన ధార్మిక విశ్వాసాలు వున్న వాళ్ళు హతులై పోతున్నారు. వాళ్ళు మన సోదరులు కాకపోయినా వొకవేళ, ఆడవాళ్ళు పిల్లలు ముసలాళ్లు మాత్రమే అయినా మన రష్యన్లం ఆగ్రహపూరితులమై దారుణ కృత్యాల్ని అంతం చేసేందుకు, వాళ్ళ రక్షణకి హుటాహుటీ వెళ్ళాలి. మాటకి నువ్వు రోడ్డుమీద వెడుతున్నావు, యెవడో తాగుబోతు వో ఆడమనిషినో, పిల్లనో కొడుతున్నాడనుకో, ఆ సందర్భంలో నువ్వు యీ వ్యక్తికి వ్యతిరేకంగా యుద్ధం ప్రకటించడం జరిగిందా లేదా మీమాంస చేస్తూ కూర్చోవు కదా. ఆ నిస్సహాయుల్ని కాపాడ్డానికి దూకవూ'' అన్నాడు.

''కాని నేనతన్ని చంపినట్టు కాదుగా'' అన్నాడు లేవిన్.

''లేదు, హత్యా చెయ్యచ్చు.''

''యేమో చెప్పలేను, అలాంటిది నా కళ్ళబడితే నాకప్పుడేది తోస్తే దాన్ని చేస్తాను. యేం చెయ్యబోయేదీ ముందే చెప్పలేదు. పీడితులైన స్లావ్‌లకి సంబంధించి అలాంటి సద్యోజనిత ఉద్రేకం లేదు, వుండదు.''

''నీకు వుండకపోవచ్చు, యితరులకి వుంటుంది'' అని కోజ్నిషెవ్ అనిష్టంగా ముఖం చిట్లించుకుంటూ అన్నాడు. ''తెలుసా 'కాఫిర్ తాతార్ల'* పదఘట్టన కింద నలిగిపోయిన క్రైస్తవమత అనుయాయుల బాధల గాథలు యింకా స్మృతిలో వున్నాయి. మన ప్రజలు తమ సోదరుల బాధల గురించి విన్నారు, తమ యిచ్ఛని ప్రకటించేరు.''

''అయి వుండచ్చు'' అని లేవిన్ దాట వేస్తున్నట్టు అన్నాడు. ''కాని నేనలా చూడడం లేదు. నేనూ ప్రజల్లో వొకణ్నే, నాకలా అనిపించడం లేదు'' అన్నాడు.

''నాకూనూ'' అని వృద్ధ ప్రిన్స్ అన్నాడు. ''నేను విదేశాల్లో వున్నప్పుడు పత్రికలు చదివేవాణ్ణి. నేనీ మాట వొప్పుకోవాలి, బల్గేరియన్ దురన్యాయాలకి ముందు కూడా నాకర్థం

కాలేదు, యెందుకు రష్యన్లకి వున్నట్టుండి తను తోటి స్లావ్‌పట్ల యింత ప్రేమ పుట్టుకు వచ్చిందో. నాకు వాళ్లపట్ల అంత ప్రేమ పుట్టలేదు మరి. నాకు చాలా బాధ కలిగింది. నేను తిక్కవాణ్ణనో, జర్మన్ కారల్స్‌బడ్ నీళ్లు నన్నలా చేసాయనో అనిపించింది. నేను యింటికి తిరిగివచ్చేక నేనొక్కణ్ణే కాదు, స్లావ్ సోదరులని ఉమ్మడిగా కలుపు కొచ్చేటట్టు కాకుండా రష్యాకే తమ ఆసక్తులు పరిమితమైన వాళ్లు యింకా వున్నారు అని చూసి ధైర్యం చిక్కింది. ఉదాహరణకి లేవిన్'' అన్నాడు.

''సొంత అభిప్రాయాలకి యీ విషయంలో ప్రాముఖ్యం లేదు'' అన్నాడు కోజ్నిషెవ్. ''యావత్ రష్యా, యావత్ ప్రజానీకం తమ సంకల్పాన్ని ప్రకటించేక సొంత అభిప్రాయాల్ని యెవళ్లు ఖాతరు చేస్తారు?'' అన్నాడు.

''మాటకి అడ్డం వస్తున్నందుకు మన్నించండి, నాకెక్కడా అలా కనిపించడం లేదు. ప్రజలకి యేం తెలీదు, యేం తెలుసుకోవాలనుకోవడమూ లేదు'' అన్నాడు ప్రిన్స్.

''లేదు నాన్నా... యెందుకు తెలీదు? ఆదివారం నాడు చర్చిలో?'' అంది దాలీ. ''ఆ తువ్వాలు యిలా యియ్యి'' అని పిల్లలకేసి చూసి చిన్నగా నవ్వుతూ వున్న ముసలి కాపరిని అడిగింది. ''అలా జరగదు యీవన్నందీ...''

''సరే, ఆదివారం నాడు చర్చిలో యేం జరిగింది? ఫలానా ఫలానా సూచనలు చదవ మని పురోహితుడికి ఆజ్ఞలు వచ్చేయి, చదివేడు. వాళ్లకి యేమీ అర్థం కాలేదు. ఆరాధన జరిగేటప్పుడు యెప్పుడూ చేసేటట్టే హుస్సు హుమ్మ అనుకుంటూ వున్నారంతే'' అని ప్రిన్స్ చెప్పేడు. ''పుణ్యకార్యాల నిమిత్తం చందాలు వసూలు చేస్తున్నారని చెప్పగానే వాళ్లు జేబు ల్లోనుంచి కోపెక్కులు తీసి పళ్లెంలో వేశారు. యెందుకు వేశారో వాళ్లకి తెలీదు'' అన్నాడు.

''ప్రజలకి తెలియకుండా వుండదు. వాళ్లకి తమ విధి గురించిన చైతన్యం గాఢంగా వుంటుంది. యిలాంటి సమయాల్లో అది మరింత స్పష్టంగా వెల్లడవుతుంది'' అని కోజ్నిషెవ్ తేనెటీగల క్షేత్రం కాపలా వృద్ధునికేసి తిరిగి అన్నాడు.

ఆ ముసలతను అందంగా వున్నాడు. అతనికి నెరిసిన వొత్తు జుట్టు వుంది. అతని గడ్డం జేగురు రంగు తిరిగింది. అతను తేనె కూజా చేత్తో పట్టుకుని నిశ్చలంగా అక్కడ నుంచున్నాడు. తను యెత్తరిగా వుండడంవల్ల పైనుంచి యీ పెద్ద మనుషులకేసి నిదానంగా, స్నేహపూరితంగా చూస్తూ వున్నాడు. వాళ్లు యేం మాట్లాడుకుంటున్నదీ అతనికి అర్థం కావడం లేదనీ, అర్థం చేసుకునే కోరికా అతనికి లేదనీ తెలుస్తూనే వుంది.

''నిజం అంతేనండయ్యా'' అని అతను కోజ్నిషెవ్ చూసిన దృక్కుకి జవాబుగా నన్నట్టు గొప్పగా తల వూపుతూ అన్నాడు.

''యితన్ని అడిగి చూడండి. అతనికి యేం తెలీదు, యేమీ పట్టించుకోడు'' అన్నాడు లేవిన్. ''మిహైలిచ్, యుద్ధం గురించి విన్నావా?'' అని అతన్ని అడిగేడు. ''చర్చిలో వాళ్లు

చదివి వినిపించింది విన్నావా? నీ అభిప్రాయం యేమిటి? మన తోటి క్రైస్తవుల కోసం పోరాడాలంటావా?'' అని అడిగేడు.

''అలాంటి విషయాలు మాకెందుకండయ్యా? చక్రవర్తి అలెగ్జాండర్ నికొలాయెవిచ్* మా తరపున ముందే అట్లాంటి విషయాల గురించి చూసుకుంటారు. మాకంటే చక్రవర్తికి అన్నీ యిశదంగా తెలుస్తాయి. యింకో రొట్టె తెమ్మంటారా? అబ్బాయిగారికి యింకోటి కావాలేమో'' అని గ్రీషని ఉద్దేశించి తల వూపుతూ గ్రీష తనకి పెట్టిన ముక్కని పూర్తి చేస్తూ వుండడం చూసి దారీని అడిగేడు.

''అడిగే అవసరం నాకు లేదు'' అన్నాడు కోజ్నిషెవ్. ''మా కళ్లతో మేం వందలాది వేలాది ప్రజలు సర్వస్వం వదిలి పెట్టేసి వొక మహత్తర కార్యం కోసం అర్పితం కావడానికి రష్యా నాలుగు మూలలనుంచీ రావడం, నీళ్లు నమలకుండా తమ లక్ష్యాలూ, ఉద్దేశాలూ చెప్పడం చూశాం, చూస్తున్నాం. తమ కోపెక్కులు తామే తెచ్చుకుని తమ సేవలని ఐచ్ఛికంగా అందిస్తున్నారు. తాము చేసే పని యేమిటో తేటతెల్లంగా చెబుతున్నారు. దాని అర్థం యేమిటి?'' అని అడిగేడు.

''నా అభిప్రాయం ప్రకారం దీని అర్థం యేమిటంటే'' అని లేవిన్ కొంచెం కోపం తెచ్చుకుంటూ చెప్పడం మొదలుపెట్టాడు. ''ఎనిమిది కోట్ల ప్రజానీకంలో యెప్పుడూ కూడా, యిప్పట్లాగా వందలూ పదులూ కాక వేల సంఖ్యలో యేదో సాహసకృత్యంలో పిల్లనే వాళ్లుంటారు, తమ సామాజిక స్థితి పోగొట్టుకునో లేకపోతే అలాంటి దుందుడుకు పన్లకో — పుగచేవ్ దండో, ఖీవాయో,* సెర్బియాయో — వెళ్లడానికి తయారుగా వుంటారు...''

''నే చెపుతున్నా వందలు కాదు, దుందుడుకులు కాదు, రష్యన్ ప్రజలలో ఉత్తమ శ్రేణులలాంటి వాళ్లు!'' అని కోజ్నిషెవ్ తన ఆఖరి కోపెక్కుని దక్కించుకునే వాడిలా గట్టిగా చించుకుంటూ అన్నాడు. ''మరి ఆ చందాలు చూడు! యావన్మంది ప్రజలు తమ కోరికని ఆ రకంగా వెల్లడి చేస్తున్నారని పిస్తుంది'' అన్నాడు.

''యీ పదం వుందేం 'ప్రజలు' అనేది, చాలా అస్పష్టంగా వుంటుంది'' అన్నాడు లేవిన్. ''వో జిల్లా గుమాస్తాయో, ఉపాధ్యాయుడో, వెయ్యి మందిలో వో రైతో వ్యవహారం అంటే యేమిటో అర్థం చేసుకోగలరు. మిగతా ఎనిమిది కోట్ల మందీ మిఖైలిచ్‌లాగా తమ ఉద్దేశం యేమిటైందో చెప్పకపోవడమే కాదు, తమ ఉద్దేశం దేన్ని గురించి వ్యక్తం చెయ్యాలో కూడా తెలియని వాళ్లు, అంచేత యిది ప్రజల సంకల్పం అని చెప్పే హక్కు మనకి యేది?'' అన్నాడు.

## 16

తర్కవితర్క విద్యలో అందె వేసిన చెయ్యి అయిన కోజ్నిషెవ్ యే అభ్యంతరమూ చెప్పకుండానే సంభాషణని వేరే దిశకి మళ్లించేడు.

'ప్రజల ఆత్మని గ్రహించడానికి గుణకారాలూ భాగారాలూ మొదలెడితే నువ్వెప్పటికీ అర్థం చేసుకోలేవు. మన దగ్గర యింతవరకూ యెవళ్ల అభిప్రాయం యేమిటో తెలుసుకునే యెన్నిక పద్ధతి లేదు. అది సంభవమూ కాదు యేమంటే దానివల్ల ప్రజాభిప్రాయం తేలదు. కాని ప్రజాభిప్రాయం యేమిటో తెలుసుకునే యితర పద్ధతులు వున్నాయి. దాన్ని వాతావరణం చూసి గ్రహించవచ్చు. హృదయంతో గ్రహించవచ్చు. ప్రజలు అనే మహా సముద్రంలో అంతర్గతంగా ఉబికి వచ్చే తరంగాల గురించి నే చెప్పడం లేదు, వాటిని మత్సరగ్రస్తులైన మనుషులు తప్ప యెవళ్లన్నా గ్రహించగలరు. నువ్వు, పోనీ, సంకుచిత అర్థంలోనే సమాజంకేసి చూడు. యిప్పటిదాకా కారాలూ మిరియాలూ నూరుకుంటూ వుండే బౌద్ధిక లోకంలోని విభిన్న పక్షాల వాళ్లూ దగ్గరయేరు. అన్ని అభిప్రాయ భేదాలూ మరిచిపోయేరు. అన్ని ప్రజా సంఘాలూ వొక విషయాన్నే చెపుతున్నాయి. తమని ఆవహించి వొకే దిశలో అందర్నీ నడిపిస్తూ వున్న ఆ స్వతః స్ఫూర్త శక్తిని చూడగలుగుతున్నారు'' అన్నాడు.

''ఆఁ, పత్రికలన్నీ వొకే విషయం గురించి రాస్తున్నాయి, నిజమే'' అని ప్రిన్స్ అన్నాడు. ''తుఫాన్ వచ్చే ముందు వొక్కలా బెకబెక మంటూ అరిచే కప్పల్లాగా వొకటే పాట పాడుతున్నాయి. బెకబెకలు తప్ప మరేం వినిపించడం లేదు అందుకనే'' అన్నాడు.

''కప్పలో కాదో నాకు తెలీదు. నాకే సొంత పత్రికా లేదు, పత్రికలని సమర్థించడమూ లేదు. నే చెప్పేదేమంటే మేధావులంతా యేకాభిప్రాయంతో వున్నారని మాత్రమే'' అన్నాడు కోజ్నిషెవ్.

లేవిన్ జవాబు చెప్పబోయేడు కాని వృద్ధ ప్రిన్స్ మొదట మాట్లాడేడు.

''కాని యీ యేకాభిప్రాయం విషయం గురించి మరోటి కూడా చెప్పచ్చు. మా అల్లుడు అబ్లాన్స్కీని తీసుకోండి. మీరతన్ని యెరుగుదురు కదా. అతన్ని యేదో కంపెనీకి, దాని పేరేమిటో గుర్తు లేదు, కార్యదర్శిగా వేశారు. అక్కడ అతను చేసే పనేం లేదని మాత్రమే నాకు తెలుసు – యేమమ్మా దాలీ, యిదేం రహస్యం కాదు కదా – సాలుకి ఎనిమిది వేల రూబుళ్ల జీతంతో! యేం తన ఉద్యోగం ఉపయోగపడేదా చెప్పేదా అని అడగండి, లోకంలో అంతకంటే ఉపయోగకరమైంది లేదని ఢంకా బజాయించి మరీ రుజువు చేస్తాడు. మరి అతను నిజాయితీ వున్న వాడే. కాని ఎనిమిది వేల రూబుళ్ల ఉపయోగకరమైన దాన్ని యెవడు కాదంటాడు?'' అన్నాడు ప్రిన్స్.

''ఆ చెప్పడం మరిచేను, తనకా ఉద్యోగం వచ్చిందని మీకు చెప్పమన్నాడు దాలీగారూ'' అని. కోజ్నిషెవ్ ప్రిన్స్ వ్యాఖ్య అనుచితంగా వుందని బాధ కనిపింప చేసే చూపుతో అన్నాడు.

''అంచేత మన పత్రికల ఏకాభిప్రాయానికి సంబంధించి అంతే. నాకు బోధ పడిందేమంటే యుద్ధంవల్ల వాటి లాభాలు రెండింతలు అవుతాయి. వాళ్లకి ప్రజల భవిష్యత్తు లాంటివి... స్లావ్ సోదరుల భవిష్యత్తు లాంటివి... కావాల్టండీ!'' అన్నాడు ప్రిన్స్.

'చాలా పత్రికల్ని నేను వొప్పుకోను కాని మీరు మరీ అన్యాయంగా మాట్లాడుతు న్నారు'' అన్నాడు కోజ్నిషెవ్.

"నన్నడిగితే వొక షరతు పెట్టాలంటాను" అని ప్రిన్స్ కొనసాగించేడు. "ప్రష్యా యుద్ధానికి ముందు అల్ఫాన్స్ కార్* యీ విషయం గురించి చక్కగా రాశేడు. 'యుద్ధం అవసరం అని మీ అభిప్రాయమా? బాగుంది. కాని యుద్ధ ప్రచారం చేసేవాళ్లందర్నీ ప్రత్యేక అగ్రగపటాలంగా యేర్పాటు చేసి అందరికంటే ముందు దాడి చేసేందుకు పంపించండి' అన్నాడు'' అని ప్రిన్స్ చెప్పేడు.

"మన సంపాదకుల అసలు రంగు తేల్తుందప్పుడు" అని కతవాసొవ్ తన మనో నేత్రం ముందు తనకి తెలిసిన సంపాదకుల యెలగోలు దండుని దర్శించుకుంటూ పకపకా నవ్వేడు.

"వాళ్లా, తోకలు ముడిచి పారిపోతారు. అంతా తగలేసి పెడతారంతే" అంది దాలీ.

"పారిపోతే వెనకనుంచి గుళ్లవర్షమో, గుర్రాలమీద కోసక్కుల కొరడాలో మజా చూపిస్తాయి" అన్నాడు ప్రిన్స్.

"యిది గనక పరిహాసం అనుకుంటే, చవకబారు పరిహాసం అని చెప్పాలి, ప్రిన్స్" అన్నాడు కోజ్నిషెవ్.

"నాకిది పరిహాసంలాగా కనిపించడం లేదు. నేననుకోవడం యిది..." అని లేవిన్ మొదలుపెట్టబోయేడు కాని కోజ్నిషెవ్ అడ్డం వెళ్లేడు.

"సమాజంలోని ప్రతి వ్యక్తికీ వాళ్ల వాళ్ల శక్తి సామర్థ్యాలని బట్టి ఆయా పనులు వుంటాయి" అన్నాడు. "మేధావులు ప్రజాభిప్రాయాన్ని వ్యక్తం చేసేటప్పుడు తమ కర్త వ్యాన్ని నిర్వహిస్తున్నారంతే. ప్రజాభిప్రాయాన్ని పూర్తిగా వ్యక్తం చేసేవి పత్రికలు, వాటి సేవని మనం ఆదరించాలి. యిరవై యేళ్ల నాడు నోరు మూసుకు కూర్చుని వుండేవాళ్లం. కాని యివాళ రష్యన్ ప్రజల గొంతుక వినిపిస్తోంది. యివాళ రష్యన్ ప్రజానీకం వొక్క వ్యక్తిగా సంఘటించి ఉద్యుక్తమై తమ పీడిత భ్రాతృజనం కోసం అసువులు అర్పించడానికి సిద్ధంగా వున్నారు. అది మహత్తరమైన ముందడుగు, మన శక్తికి అభివ్యంజకం" అన్నాడు కోజ్నిషెవ్.

"తమ అసువులు అర్పించడమే కాదు టర్కులని చంపడాని క్కూడా" అని లేవిన్ మెల్లిగా అన్నాడు. "ప్రజలు తమ ఆత్మ కోసం జీవితాల్ని బలిదానం చెయ్యడానికి తయారుగా వున్నారు, సర్వదా వుంటారు. కాని చంపడానికి కాదు" అని సంభాషణని తనకి తెలియకుండానే తన మనసులో అంతకు ముందే ఉదయించిన ఆలోచనలకి జత చేస్తూ అన్నాడు.

"తమ ఆత్మల కోసం? శాస్త్రజ్ఞులకి యిది తేలికైన భావన కాదు. ఆత్మ అంటే యేమిటి?" అని కతవాసొవ్ చిరునవ్వు నవ్వుతూ అడిగేడు.

"మీకే తెలుసు అది."

"దేవుని తోడు నాకు తెలీదు" అని కతవాసొవ్ నవ్వుతూ అన్నాడు.

"'నేను శాంతిని గాక కరవాలాన్ని పుచ్చుకు వస్తున్నాను' అన్నాడు క్రీస్తు" అని కోజ్ని

కొత్త నిబంధనమంచి ఉల్లేఖించేడు, లేవిన్‌కి యెప్పుడూ వడుగురాయిలా వున్న యీ ముక్క ప్రపంచంలో అతి సుబోధకంగా వున్నట్టు.

"నిజమండయ్యా" అని తేనెటీగల క్షేత్రం కాపరి తనకేసి యాదృచ్ఛికంగా చూసిన దృక్కుకి జవాబు చెపుతున్నట్టు అన్నాడు.

"అద్దదీ, చిత్తు అయిపోయేరు బాబూ పిసరు మిగలకుండా చిత్తు అయిపోయేరు" అని కతవాసావ్ సంతోషంతో నవ్వుతూ అరిచేదు.

లేవిన్ ముఖం చిరాకుతో యెఱ్ఱబడింది. వాదనలో తను చిత్తు అయిపోయినందుకు కాక, వాదించకూడదని తను చేసుకున్న నిర్ణయాన్ని ఉల్లంఘించినందుకు అతనికి బాధ కలిగింది.

'నేను వాదించకూడదు వీళ్లతో. వాళ్లు కవచధారులు నేను నగ్నంగా వున్నాను' అను కున్నాడు లేవిన్.

అన్నగార్ని, కతవాసావ్‌నీ వొప్పించడం అసాధ్యంగా కనిపించింది. వాళ్ళు చెప్పేదాన్ని వొప్పుకోవడం యింకా అసాధ్యంగా కనిపించింది. తనని దాదాపు ముంచేసిన బౌద్ధిక అహాన్ని వాళ్ళు ప్రచారం చేస్తున్నారు. రాజధాని గుండా వెళ్లే వాచాల వలంటీర్లు చెప్పే మాటల్ని బట్టి తామూ పత్రికలూ ప్రజాభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నాం అని నొక్కి చెప్పే అధికారం అన్నగారికీ పదుల సంఖ్యలో మనుషులకి వుందని అతను వొప్పుకోలేదు. అది కసి తీర్చడం, చంపడం అంతే. అతను దాన్ని వొప్పుకోలేకపోవడానికి కారణం తను యెవళ్ల మధ్య బతుకుతు న్నాడో ఆ ప్రజల అభిప్రాయంగా కనిపించడం లేదు యిది. తన అంతరంగంలోనూ యీ అభిప్రాయం కనిపించలేదు (అతను తనని రష్యన్ ప్రజలకంటే భిన్నమైన వాడుగా భావించు కోవడానికి సిద్ధంగా లేడు). దాన్ని వొప్పుకోకపోవడానికి అన్నింటికంటే ముఖ్య కారణం యేమిటంటే మొత్తంగా ప్రజలు గాని, తను గాని సార్వజనీన కల్యాణం యేమిటైందీ తెలుసు కోకపోవడం, తెలుసుకోలేకపోవడం. కాని యేది కల్యాణదాయకమైందో దాన్ని, ఈ సార్వ జనీన కల్యాణాన్ని ప్రతి వ్యక్తికీ వెల్లడి అయిన మంచి చెడు నియమాన్ని కచ్చితంగా పాటించ డంద్వారానే సాధించవచ్చు అని, అందుకనే యే రకమైన దురవగాహ్య లక్ష్యాల నిమిత్తమూ యుద్ధాన్ని కోరలేడనీ, యుద్ధాన్ని ప్రచారం చెయ్యడం జరగదు అని అతనికి నిస్సందేహంగా తెలుసు. అతని వైఖరి వృద్ధ తేనెటీగల క్షేత్రం కాపరిలాంటి వైఖరి, యావన్మంది ప్రజల వైఖరి. స్కాండినేవియన్లని ఆమంత్రణం చేస్తూ వున్న కథ*లో అది చక్కగా వెల్లడైంది — "మాకు రాజులై మమ్మల్ని యేలుకోండి. మేము సహర్షంగా మీకు అధీనులం అవుతాం. యావత్తు శ్రమనీ, యావత్తు అవమానాన్నీ, యావత్తు బలిదానాన్నీ మేమే భరిస్తాం. కాని మేం తీర్పు చెప్పం, నిర్ణయాలు చెయ్యం." యిప్పుడు కోజ్నిషెవ్ మాటల ప్రకారం ప్రజలు యింత మూల్యం చెల్లించి సాధించుకున్న యీ హక్కుని పరిత్యజిస్తున్నారు.

ప్రజాభిప్రాయాన్ని యింత ఘనంగా భావిస్తూ వున్న వాళ్లయితే స్లావ్‌లకి సాయం చేసే ఆందోళన అంత ధర్మబద్ధమైంది గానూ విప్లవాన్నీ, కమ్యూన్‌నీ యెందుకు వరిగ

ణించరు అని అతను అడుగుదా మనుకున్నాడు. కాని యివన్నీ దేన్నీ పరిష్కరించలేని వాదనలు. కాని వొక సంగతి మాత్రం స్పష్టంగా కనిపిస్తోంది — యిప్పుడు వాద ప్రతివాదనతో కోజ్నిషెవ్ చిరాకు పడుతున్నాడు, అంచేత వాదన చెయ్యడం ఉచితం కాదు. లేవిన్ వాదించకుండా మౌనంగా వుండిపోయి ముసురుకుంటూ వస్తూ వున్న మేఘాలకేసి చూపించి వాన మొదలకుండానే యింటికి వెళ్లడం మంచిదని చెప్పేడు.

## 17

వృద్ధ ప్రిన్స్, కోజ్నిషెవ్ బండి యెక్కి వెళ్లిపోయేరు. మిగిలిన వాళ్లు గబగబ నడుస్తూ యింటికి బయల్దేరారు.

కాని తెల్లగా, నల్లగా వున్న మేఘాలు దూకుడుగా ముసురుకుంటూ రావడంతో వాన మొదలవక ముందే యింటికి వెళ్లాలంటే వాళ్లు యింకా వేగంగా నడవాల్సి వచ్చింది. నల్లగా దట్టమైన మసిలాగా ముసురుకుంటూ మేఘాలు విపరీతమైన వేగంతో దూసుకు వచ్చేస్తున్నాయి. యిల్లు యింకా రెండు వందల అడుగుల దూరమో యేమో వుంది. అంతట్లో గాలి లేచింది, తుఫాను విరుచుకుపడేటట్టుగా వుంది.

పిల్లలు బెదిరి, సంతోషంతో కేరింతాలు కొడుతూ ముందుకు పరిగెత్తి పోయేరు. దాలీ పిల్లలమీదే కన్నేసి వుంచి కాళ్లకి అడ్డం పడుతూ వున్న లంగా కుచ్చెళ్లలో తంటాలు పడుతూ పరుగు తీసింది. మగాళ్లు టోపీలు పట్టుకుని నడక జోరు చేశారు. పెద్ద పెద్ద చినుకులు మొదలై నీటి గొట్టంపైన టపాటపా చప్పుడు చేస్తూ పడేటప్పటికి వాళ్లు వరండా దగ్గరికి చేరారు. పిల్లలు, వాళ్ల వెనక్కాలే పెద్ద వాళ్లు హుషారుగా కబుర్లాడుతూ చూరు కిందకి పరిగెత్తేరు.

"అమ్మగారు యెక్కడ?" అని లేవిన్ అగాఫ్యా మిహైలొవ్నాని అడిగేడు. ఆమె దుప్పట్లు, తువ్వాళ్లు పట్టుకుని గుమ్మంలో యెదురైంది.

"ఆవిడ మీతో వున్నారని మేం అనుకుంటున్నాం" అందామె.

"మరి మిత్య?"

"దగ్గర్లోని అడివిలో వుండి వుంటారు, దాది కూడా వుంది."

లేవిన్ వొక్క ఉదుటన దుప్పట్లు లాక్కుని అడివికేసి పరిగెత్తేడు.

యీ కొంచెం సేపట్లోనే మేఘాలు దట్టంగా ముసురుకుని సూర్యుణ్ణి కమ్మేశాయి. గ్రహణం పట్టినప్పటి మాదిరిగా చీకటై పోయింది. గాలి చాలా యెదురుగా వీస్తూ లేవిన్ని విసిరి కొడ్తోంది. లిండెన్ చెట్ల ఆకులు, పువ్వులు రాలి పడిపోతున్నాయి. బర్చ్ చెట్ల ఆకులు రాలి పోతున్నాయి, కొమ్మలు వొంగి పోతున్నాయి. గడ్డి, పువ్వులు, తుప్పలు, అకేసియాలు, చెట్ల శిఖరాలు అన్నీ వొకే దిశలో వొంగి పోతున్నాయి. తోటలో పని చేస్తూ వున్న ఆడవాళ్లు

కేమమని అడుచుకుంటూ నౌకర్ల మకాంలకేసి పరిగెత్తిపోయేరు. కుండపోతగా కురుస్తున్న వాన తెల్లని తెర కట్టినట్టుగా దూరంలో వున్న అడివినీ, దగ్గర్లో వున్న మైదానాన్నీ సగం కప్పేసి దగ్గర్లో వున్న అడివికేసి గబగబా దూసుకు పోతోంది. తుంపర్లుగా చెదిరిన వర్షపు చినుకుల చెమ్మతో గాలి నిండిపోయింది.

తల ముందుకు వొంచి, దుప్పట్లని యెగర కొడుతూ రంయ్యిన వీస్తూ వున్న గాలికి చేతులు అడ్డం పెట్టుకుని పరిగెడుతూ లేవిన్ చిన్న అడివి చేరుకున్నాడు. అతనికి వో భారీ ఓకు చెట్టు వెనక మసకగా యేదో తెల్లనిది ఆసిందో లేదో, హఠాత్తుగా వో మెరుపు సర్వ ప్రపంచాన్ని జ్వలింపచేసింది, వో ఉరుము ఆకాశ కర్పరాన్ని చీల్చినట్టు ఉరిమింది. లేవిన్ మెరుపు కాంతితో మిరుమిట్లు కమ్మిన కళ్లని తెరిచి తనకి, అడవికి మధ్య కుండపోతగా కురిసే దట్టమైన వర్షపు తెర అడ్డంగుండా చూశేడు. మొట్టమొదటగా అతనికి అడివిలో బాగా పరిచితం అయిన ఓకు చెట్టు హరిత శిఖరం వింతగా మారిపోవడం కనిపించింది. అతను స్తంభీభూతుడైపోయేడు. 'అయ్యో పిడుగు పడిందా యేమిటి?' అనే ఆలోచన లేవిన్‌కి తగిలిందో లేదో, ఓకు చెట్టు అగ్రభాగం మహా వేగంతో పడిపోతూ మిగిలిన చెట్లలో అదృశ్యం అయిపోయింది. వొక మహా వృక్షం ఫెళఫెళా విరుచుకు పడిపోయే చప్పుడు అతనికి వినిపించింది.

మిరుమిట్లు గొలిపే మెరుపు, మేఘగర్జ, అతని శరీరమంతా హఠాత్తుగా వ్యాపిస్తున్న వొణుకు -- యివన్నీ మిళితమై మహా భయానక రూపం ధరించేయి.

"హే భగవన్! భగవన్! ఆ చెట్టు వాళ్లమీద విరుచుకు పడకుండా చెయ్యి" అని ప్రార్థించేడు.

అప్పటికే విరిగి పడిపోయిన ఓకు చెట్టు కింద పడి వాళ్లు చనిపోకుండా కాపాడమని ప్రార్థించడం యెంత అర్థం లేని పనో ఆ క్షణంలోనే అతని బుర్రకి తట్టినా కూడా అతనా ప్రార్థనని రెట్టిస్తూనే వున్నాడు. యేమంటే అర్థహీన ప్రార్థన చెయ్యడం వినా తనేం చెయ్య లేనని అతనికి తెలుసు.

పిల్లవాడితో, దాదితో కిట్టీ వుంటుందనుకున్న చోటికి అతను పరిగెత్తి వెళ్లేడు. కాని వాళ్లు అక్కడ కనిపించలేదు.

వాళ్లు అడివికి రెండో వేపున పాత లైమ్ చెట్టు కింద వున్నారు. అతన్ని పిలిచేరు. నల్లని గౌన్లలో (అవి ముందు తెల్లగానే వున్నాయి) రెండు ఆకారాలు దేనిమీదకో వొంగి నుంచున్నాయి. ఆ ఆకారాలే కిట్టీ, దాదీ. లేవిన్ వాళ్ల దగ్గరికి వెళ్లే వేళకి వాన వెలిసింది, వెలుతురు వస్తోంది. దాది గౌను చివళ్లు పొడిగా వున్నాయి కాని కిట్టీ ఆపాదమస్తకం తడిసి పోయింది. ఆమె బట్టలు వొంటికి అంటి పెట్టుకుపోయేయి. తుఫాను విరుచుకు పడినప్పుడు యెలా నుంచున్నారో అలానే నుంచున్నారు వాళ్లు, యిప్పుడు వాన వెలిసినా కూడా. యిద్దరూ ఆకుపచ్చ గొడుగు విప్పిన చంటి పిల్లల తోపుడు బండిమీద వొంగి వున్నారు.

''యేం అవలేదు కదా? దెబ్బ తగల్లేదు కదా? దేవుడి దయ'' అని అతను నీళ్ళ నిండిన బూట్లతో తపతపా అడుగులు వేస్తూ నీటి కుంటల్లోనుంచి వెడుతూ అన్నాడు.

కిట్టీ ఎర్ర బుగ్గల ముఖం వానకి తడిసిపోయింది. ఆమె అతనికేసి తిరిగి, నీళ్ళు వోడుతూ వున్న టోపీ కిందనుంచి బెరుగ్గా మందహాసం చేసింది.

''సిగ్గు లేదూ? యింత అజాగ్రత్తగా యెలా వుంటారో నాకర్థం కాదు'' అని అతను పెళ్ళాన్ని కసురుకున్నాడు.

''దేవుడి తోడు, నా తప్పేం లేదు. యిక యింటికి బయల్దేరదా మనుకుంటున్నాం, వాడు లేచేడు. చిరాగ్గా యేడుపు లంకించుకున్నాడు. వాడికి బట్టలు మార్చాల్సివచ్చింది. మేం యిప్పుడే...'' అని కిట్టీ సమర్థించుకుంటూ మొదలుపెట్టింది.

మీత్య శుభ్రంగా వున్నాడు, తడవ లేదు. హాయిగా నిద్రపోయేడు.

''హమ్మయ్య! దేవుడి చలవ! నేనే మంటున్నానో నాకే తెలీటం లేదు!''

తడిసిపోయిన పాత్తి గుడ్డల్ని యేరారు. దాది పిల్లవాణ్ణి యెత్తుకుంది. వాళ్ళు యింటికి బయల్దేరారు. కసురుకున్నందుకు నొచ్చుకుంటూ లేవిన్ భార్య పక్కనే నడిచేడు. దాది చూడకుండా పెళ్ళాం చేతిని అదిమేడు.

## 18

ఆ మిగిలిన పూటంతా లేవిన్ వైవిధ్యభరిత సంభాషణల్లో అర్థ మనస్కంగానే పాల్గొన్నాడు. తన అంతరంగంలో పరివర్తన వస్తుందని ఆశించి దానికి సంబంధించి నిరాశ కలిగినా హృదయస్థిత ఆనంద చేతన మరపున పడలేదు.

వాన తర్వాత బురద బురదగా వుండటంతో షికారుకి వెళ్ళడం వీలు పడలేదు. అదీ కాకుండా ఆకాశపు టంచుల్లో కింది కంటా దిగులూ, ఉరుములు ఉరుముతూ తుఫాను మేఘాలు దిఙ్మండలంమీద తచ్చాడుతూనే వున్నాయి. దాంతో అందరూ యెక్కడికీ కదలకుండా యింట్లోనే వుండిపోయేరు.

తర్వాత మళ్లీ యే వాదనలూ రేగలేదు, సరికదా, భోజనాల తర్వాత ప్రతివాళ్ళూ మాంచి హుషారుగా వున్నారు.

కతవాసొవ్ మొదట ఆడవాళ్లందర్నీ హాస్య ధోరణిలో నవ్వించేడు, దాంతో అతనితో తొలిసారి పరిచయం అయిన వాళ్ళకి అతనంటే మరపురాని యిష్టం కలుగుతుంది. తర్వాత కోజ్నిషెవ్ సూచనమీద అతను యీగల్లో కనిపించే ఆడ, మగ యీగల గురించి, వాటి జీవితం గురించి,

విభిన్న లక్షణాల గురించి వాటి ముక్కూ మొహాల గురించీ కూడా రంజుగా తాను చేసిన పరిశీలన ఆధారంగా వర్ణించి చెప్పేడు. కోజ్నిషెవ్‌కూడా మంచి హుషారుగా వుంది. టీ తాగేటప్పుడు లేవిన్ అడిగిన మీదట కోజ్నిషెవ్ ప్రాచ్య సమస్యకి సంబంధించి తన వైఖరి యేమిటైందీ యెంతో సరళంగా, సుబోధకంగా, అందరూ చెవులప్పగించి సరదాగా వినేటట్టు, చెప్పేడు.

కిట్టీ వొక్కత్తే అతను చెప్పే దాన్నంతట్నీ పూరా వినలేకపోయింది. మీత్యకి స్నానం చేయించేందుకు రమ్మని ఆమెని పిలిచేరు.

ఆమె వెళ్లిన కొంచెం సేపటికే లేవిన్‌కీ రమ్మని కబురు వచ్చింది.

టీ తాగుతూ వుండగా మధ్యలో వెళ్లిపోతున్నందుకూ, సరదాగా వున్న సంభాషణ వినకుండా వెళ్లిపోతున్నందుకూ అతను నొచ్చుకుంటూ వెళ్లేడు. కాని యెందుకు పిలిచేరో యేమిటో తెలుసుకోవాలనీ అతనికి ఆదుర్దా కలిగింది. యేమంటే అతన్ని అలా యెప్పుడో గాని పిలవరు.

విముక్తమైన నాలుగు కోట్ల స్లావ్‌లు రష్యన్లతో కలిసి చరిత్రలో వొక నూతన యుగాన్ని యెలా ప్రారంభించబోయేదీ కోజ్నిషెవ్ ఆలోచనలు తనకి చాలా కొత్తగా బాగా ఆసక్తికారకంగా వుండి కడదాకా వినలేకపోతూ వున్నాగానీ, యెందుకు తనని పిల్లల గదికి రమ్మని పిలిచేరో తెలుసుకోవాలని ఆదుర్దాగా వున్నాగానీ డ్రాయింగ్ రూమ్ బయటికి వెళ్లి వొంటరిగా వుండగానే లేవిన్‌కి ఆ ఉదయం పూట కలిగిన ఆలోచనలు మళ్లీ గుర్తుకు వచ్చేయి. తన ఆత్మలో ఉప్పొంగిన మధురోహలతో పోల్చుకుంటే ప్రపంచేతిహాసంలో స్లావ్ తత్వ మహత్వానికి సంబంధించిన సకల బలమైన వాదనలూ దిగదుడుపు అయిపోయేయి. అతను వెంటనే వాటన్నిటి గురించీ మరిచిపోయేడు, ఉదయం పూట వున్న మనఃస్థితి పునరావహించి పరవశించేడు.

యీసారి ముందటిలాగా అన్ని ఆలోచనలనీ తిరిగి మననం చేసుకోలేదు (యిప్పుడతనికి దాని అవసరమూ లేదు). అతను వెంటనే తనని సంచాలనం చేస్తూ వున్న ఆ భావనా స్థితికి, తన ఆలోచనకి సంబంధించిన ఆ భావనా స్థితికి చేరుకున్నాడు. ఆ భావనా స్థితి ముందటి కంటే బలీయంగా, మరింత స్పష్టంగా వున్నట్టు అతనికి అనిపించింది. యిదివరలో ఆలోచనధారద్వారా చిత్తశాంతిని అన్వేషించేటప్పుడు తను శోధించే ఆ అనుభూతిని అందుకోవడం కోసం అతను సంపూర్తిగా ఆలోచనా సరళిని పునరవలోకించుకోవాల్సి వచ్చేది. యిప్పుడు తద్భిన్నంగా, సంతోషం శాంతి ముందటికంటే యెక్కువ శక్తివంతంగా వున్నాయి. ఆలోచనలు యీ అనుభూతులతో అందుకోలేకుండా వున్నాయి.

అతను వరండాలో వెడుతున్నాడు. చీకటి పడుతూ వున్న ఆకాశంలో రెండు నక్షత్రాలు మిణుక్కుమంటూ మెరవడం కనిపించింది. వెంటనే అతనికి గుర్తు వచ్చింది. 'అవును,

ఆకాశం చూస్తూ వున్నప్పుడే నాకనిపించింది నేను చూస్తూ వున్న యీ కప్పు భ్రమ కాదు అని. కాని ఆసాంతం దాన్ని గురించి ఆలోచించలేదు. యేదో కొంత నానుంచి మరుగున పడే శాను. సరే, అదేదైతేయేం గాక, దానివల్ల మునిగిపోయేదేమీ లేదు. నేను ఆలోచించగానే అన్నీ తేటతెల్లం అవుతాయి అంతే' అనుకున్నాడు.

పిల్లల గదిలోకి అడుగెట్టబోతూ వుండగా తననుంచి దాచి పెట్టుకున్న దేమిటో అతనికి గుర్తు వచ్చింది. అదేమిటంటే: భగవంతుడి అస్తిత్వం గురించి అన్నిటికంటే ప్రబలమైన ప్రమాణం మంచి చెడులకి సంబంధించిన రహస్యోద్ఘాటన అయితే అది కేవలం క్రైస్తవ ధర్మం మేరకే పరిమితం అయివుండడం యేమి? బౌద్ధులున్నారు, మహమ్మదీయులున్నారు, మరి వాళ్లకి సంబంధించి యేమిటి? వాళ్లు కూడా క్రైస్తవ మతస్థుల మాదిరీ మంచే చేస్తున్నారు, దాన్ని ఉపదేశిస్తున్నారు కదా?

తన దగ్గర యీ ప్రశ్నకి జవాబు వుంది అని అతనికి అనిపించింది. కాని అదేమిటైందీ తనకి తాను చెప్పుకునే లోపలే అతను పిల్లల గదిలోకి వెళ్లేడు.

కిట్టీ గౌను రెక్కలు పైకి మడుచుకుని నీళ్ల తొట్టి దగ్గర నుంచుంది. తొట్టిలో పిల్ల వాడికి నీళ్లు పోస్తున్నారు. భర్త అడుగుల చప్పుడు విని అటు తిరిగి చిరునవ్వు నవ్వుతూ తన దగ్గరికి రమ్మని పిలిచింది. ఆమె వొక చేత్తో పిల్లవాడి తల పైకెత్తి పట్టుకుంది. వాడు కిలకిల మంటూ కాళ్లు కొట్టుకుంటూ నీళ్లమీద తేలుతున్నాడు. కిట్టీ రెండో చేత్తో లయబద్ధంగా స్పాంజ్‌తో వాడిమీద నీళ్లు పోస్తోంది.

''చూడు, చూడు!'' అని భర్త దగ్గరికి రాగానే అంది. ''అగాఫ్యా మిహైలొవ్నా అన్న ముక్క నిజమే. పిల్లాడు గుర్తుపడుతున్నాడు'' అంది.

వాడు ఆ రోజునుంచే నిస్సందేహంగా తన వాళ్లని గుర్తు పట్టగలుగుతున్నాడు అని చెప్పేందుకే అతన్ని ఆమె పిలిచింది.

లేవిన్ నీళ్ల తొట్టి దగ్గరికి వెళ్లగానే ఆ ప్రయోగం రుజువైంది, మహా విజయవంతంగా. యీ ప్రయోగం కోసం పిలిపించిన వంటమనిషి నీళ్ల తొట్టిమీద వొంగగానే పిల్లవాడు ముక్కు మొహం చిట్లించుకుంటూ తల అటూ యిటూ యిష్టం లేనట్టు వూపేడు. తర్వాత కిట్టీ వాడిమీదకి వాలింది. వాడు కిలకిలా నవ్వేడు. స్పాంజ్‌ని తన చేత్తో పట్టుకుని, పెదాలతో యేదో తెలియని హర్షభరిత ధ్వని చేశాడు. దాంతో కిట్టీ, దాదీలే కాకుండా లేవిన్ కూడా సంతోష పారవశ్యంతో పొంగిపోయేడు.

పిల్లవాణ్ణి నీళ్ల తొట్టిలోనుంచి తీసి, వాడిమీద కూజాలోని శుభ్రమైన నీళ్లు పోశారు. తర్వాత వాడికి తువ్వాలు చుట్టి తుడిచి తల్లికి అందించేరు. అంత సేపూ వాడు కేరింతాలు కొడుతూనే వున్నాడు.

''నాకు సంతోషంగా వుంది నీకు వీడంటే ప్రేమ పుట్టింది'' అని కిట్టీ పిల్లవాడికి

పాలు యివ్వడానికి యథా స్థానంలో కూర్చుని సర్దుకుంటూ భర్తతో అంది. "నాకు చెప్ప లేనంత సంతోషంగా వుంది. నాకు అయ్యో అని బాధ కలిగింది నువ్వన్న మాటకి, పిల్లాడి పట్ల నీకు అభిమానం కలగడం లేదన్నావు నువ్వు" అంది.

"అబ్బే అలాంటిదేం అని వుండను. నాకు నిరాశ కలిగిందని మాత్రమే అన్నాను."

"అంటే, ఏడి పట్ల?"

"వాడి పట్ల కాదు. నేనెంతో ఆశించిన దాని పట్ల, నేనింకా యేదో ఆశించేను. నాలో యేదో ఒక నూతన మధుర భావన విరుస్తుందనుకున్నాను ఆశ్చర్యం కలిగినట్టుగా. కాని దాని బదులు యేవగింపు, దయ కలిగేవి..."

ఆమె పిల్లాడికి పాలు యిస్తూనే సన్నగా వున్న తన వేళ్ళకి ఉంగరాలు పెట్టుకుంటూ — వాటిని పిల్లాడికి స్నానం చేయించేటప్పుడు తీసేసింది — అతను చెప్పేదాన్ని శ్రద్ధగా వింది.

"అన్నిటికంటే పెద్ద గొడవేమిటంటే సంతోషంకంటే భయమూ, దయా యెక్కువ కలిగేయి. కాని యివాళ తుఫాన్ వర్షం అప్పుడు నాకు కలిగిన భయం తర్వాత నాకు అర్థ మైంది నేను వాణ్ణి యెంతలా ప్రేమిస్తూ వున్నదీనీ" అన్నాడు.

కిట్టీ ముఖం మందహాసంతో విరిసింది.

"నీకు బాగా భయమేసిందా?" అని అడిగింది. "నాకూనూ, కాని అది గుర్తు వస్తే యిప్పుడు యింకా భయం కలుగుతోంది. వో సారి వెళ్ళి ఆ ఓకు చెట్టుని చూడాలి. కతవాసోవ్ యెంత ముచ్చటైన మనిషి. మొత్తంమీద యీ రోజంతా చాలా బాగా గడిచింది. మీ అన్న య్యతో నువ్వు భలే కలిసిపోయి వుండగలవు, నువ్వు కావాలనుకుంటే... వూఁ, సరే, నువ్వు వాళ్ళ దగ్గరికి వెళ్ళు, స్నానం తర్వాత యిక్కడ యెప్పుడూ వేడిగా వుంటుంది, ఆవిరి లేస్తుంది..."

## 19

పిల్లల గదిలోనుంచి బయటకి రాగానే లేవిన్‌కి వెంటనే మునుపటి ఆలోచనలు తిరిగి వచ్చేయి. అవి అతనికి యింకా స్పష్టం కాలేదు.

డ్రాయింగు రూమ్‌లోకి యెకాయెకీ వెళ్ళకుండా వరండాలో ఆగిపోయేడు. డ్రాయింగ్ రూమ్‌లోనుంచి మాటలు అతనికి వినిపిస్తున్నాయి. వరండాలో యినప కమ్మీలమీద ఆనుకుని ఆకాశంకేసి చూస్తూ వుండిపోయేడు.

బాగా చీకటి పడింది. అతను దక్షిణాభి ముఖుడై నుంచున్నాడు. దక్షిణం వేపు మేఘాలు యేమీ లేవు. మేఘాలు వ్యతిరేక దిశలో వున్నాయి. అటు వేపు మెరుపులు మెరుస్తున్నాయి,

ఉరుములు ఉరుముతున్నాయి. తోటలో లైమ్ చెట్లమీదనుంచి పడుతూ వున్న నీటిబొట్ల చప్పుడు లేవిన్‌కి వినిపిస్తూ వుంది. అతను బాగా తెలిసిన నక్షత్ర త్రికోణంకేసీ, మధ్యలో దూసుకుపోతూ వున్న పాలపుంతకేసీ, దాని శాఖలకేసీ చూస్తూ వున్నాడు. మెరిసిన ప్రతి మెరుపూ పాలపుంతనే గాక, తేజోవంతంగా ప్రకాశించే నక్షత్రాల్ని కూడా కంటికి గోచరం కాకుండా చేస్తోంది. మెరుపు మణగ్గానే మళ్లీ అవి అదే స్థానంలో, యేదో హస్తం సరిగ్గా గురి చూసి విసిరి పడేసినట్టు ప్రకాశిస్తూ గోచరమయేయి.

'నన్ను యేది కలత పెడుతోందో?' అని లేవిన్ యీ సందేహానికి సమాధానం, అదే మిటైందీ తెలియకపోయినా, తన ఆత్మలో సిద్ధ రూపంలో వుందని తోస్తూ వుండగా ప్రశ్నించుకున్నాడు.

'అవును, భగవంతుని అస్తిత్వానికి సంబంధించి వొక స్పష్టమైన, నిర్వివాదమైన ప్రమాణం శివం అనే సూత్రం. యీ లోకానికి యిది దివ్యజ్ఞానంద్వారా అందింది. దీన్ని నేను నా అంతరంగంలో అనుభూతి చెందుతున్నాను. దీన్ని మన్నిస్తూ నేను చర్చి దూటమి అనిపిలిచే ధార్మిక విశ్వాసపూరిత యితరుల సంఘంలో, సూత్ర బద్ధంగా కాకపోయినా, నా యిచ్ఛా ప్రమేయం లేకుండా జత అయేను. మరి యూదులు, మహమ్మదీయులు, కన్ ఫ్యూషియన్లు, బౌద్ధులు వున్నారు కదా? వాళ్ల మాట యేమిటి?' అతను తనకి భయకారక మైన ప్రశ్నని వేసుకున్నాడు. 'యీ కోట్లాది ప్రజానీకం, యేది లేకుండా జీవితం అర్థహీన మవుతుందో, ఆ వరం దక్కని వంచితులేనా?' అతను ఆలోచనలో పడిపోయేడు, వో క్షణం లోనే తేరుకున్నాడు. 'నేను యేమిటి ప్రశ్నించుకుంటున్నాను?' అని తనలో తను అనుకు న్నాడు. 'భగవంతుడి పట్ల సకల దేశాల సర్వధార్మిక వైఖరుల గురించీ ప్రశ్నిస్తున్నాను. నాకు స్పష్టంగా తెలియని యీ విషయాలన్నిటితోబాటుగా సర్వప్రపంచానికీ భగవంతుడు సామాన్యంగా ప్రకటితమవడం గురించి ప్రశ్నిస్తున్నాను. యెందుకు చేస్తున్నాను అలా? వ్యక్తిగతంగా నాకు సంబంధించి నా హృదయంలో నిశ్చయంగా దివ్యజ్ఞానం ప్రాప్తమైంది. అది బుద్ధివల్ల ప్రాప్తం కాదు. అయినా నేను హఠంగా దాన్ని బుద్ధిద్వారా, మాటలద్వారా వ్యక్తం చెయ్యాల నుకుంటున్నాను.

'నాకు తెలియదా నక్షత్రాలు స్థిరంగా వుంటాయని?' అని అతను బర్చ్ చెట్టు శిఖరం పైకి యెక్కి వచ్చిన తేజోవంతమైన గోళాన్ని చూసి అనుకున్నాడు. 'కాని నభోవీధిలో కదిలే నక్షత్రాల్ని చూసినప్పుడు, భూగోళం పరిభ్రమిస్తూ వుందన్న విషయాన్ని వూహించ లేకపోతాను, అంచేత నక్షత్రాలు పరిభ్రమిస్తున్నాయి అని చెప్పి అదే వొప్పు అనుకుంటాను.

'మరి ఖగోళశాస్త్రజ్ఞులు భూగోళ సంక్లిష్ట, విభిన్న గతులన్నిట్నీ దృష్టిలో వుంచు కుంటే యేమన్నా అవగాహన చేసుకోగలరా, లెక్కలు గుణించడంలో నెగ్గగలరా? ఆకాశంలో చరించే గ్రహాల దూరం, భారం, గతులు, వ్యతిక్రమణలకి సంబంధించి వాళ్ల అద్భుత సూత్రీ

కరణలు అన్నీ కూడా నిశ్చలమైన భూగోళం చుట్టూతా తిరిగే తారకలమీద ఆధారపడినవి, యీ సమయంలో నా యెదర వున్న చలన శీలతమీద ఆధార పడినవి. వీటిని శతాబ్దాల తరబడి అర్బుదాల ప్రజలు యిలాగే దర్శించేరు; యిది సర్వదా యిలాగే వుంది, వుండబోతుంది. దీన్ని సర్వదా విశ్వసించవచ్చు. వొక నిర్దిష్ట అక్షాంశ రేఖమీదా, దిఙ్మండల బిందువుమీదా దృశ్యమాన ఆకాశానికి సంబంధించిన పరిశీలనలు ఆధారపడ లేనట్లయితే ఖగోళశాస్త్రజ్ఞుల సూత్రీకరణలు పనికి రానివిగా, అనుమానాస్పదం అయిపోయి నా సూత్రీకరణలు కూడా సర్వదా సర్వకాలాలలోనూ మానవులకి అదే రీతిగా వున్నటువంటి, క్రైస్తవ మతంద్వారా నాకు బోధ పడినటువంటి, నా ఆత్మ విశ్వసిస్తున్నటువంటి శివం గురించిన వివేచనా అవగాహన మీద ఆధార పడక పోయినట్లయితే పనికి రానివిగా, అనుమానాస్పదంగా వుంటాయి. యితర ధార్మిక విశ్వాసాలకి సంబంధించి, భగవంతుడి పట్ల వాటి వైఖరుల గురించి తలెత్తే ప్రశ్నకి సమాధాన అన్వేషణకి సంబంధించి నాకా అధికారమూ లేదు, సంభావ్యతా లేదు.'

"యేమిటి నువ్విప్పటిదాకా యిక్కడే వున్నావా?" అని కిట్టీ అటునుంచే డ్రాయింగ్ రూమ్‌లోకి వెడుతూ అన్న మాటలు హఠాత్తుగా వినిపించేయి. "యేం మనసు బాగోలేదా? వూఁ?" అని ఆమె నక్షత్ర కాంతిలో అతని ముఖాన్ని పరిశీలనగా చూస్తూ అడిగింది.

ఆ క్షణంలో వో మెరుపు మెరిసి నక్షత్రాలని కమ్మేసి అతని ముఖాన్ని వెలుగుతో ప్రకాశింప చేయకుండా వున్నట్టయితే ఆమె స్పష్టంగా దాన్ని చూసి వుండేది కాదు. అతను శాంతంగా, ప్రసన్నంగా వున్నాడని ఆమె చూసింది. చిరునవ్వు నవ్వింది.

'ఆమెకి అర్థమవుతుంది' అనుకున్నాడతను. 'నేను దేన్ని గురించి ఆలోచించేదీ ఆమెకి తెలుసు. ఆమెకి చెప్పనా వద్దా? వూఁ, చెప్తాను' అనుకున్నాడు. అతను మాట మొదలుపెట్టే వేళకే కిట్టీ కూడా మాట్లాడ్డం మొదలెట్టింది.

"చూడు, కొంచెం యీ పని చేసి పెట్టు నా కోసం! ఆ మూల గదికి వెళ్ళి మీ అన్నయ్యకి అన్నీ యేర్పాట్లూ అయాయో లేదో చూడవూ? నే వెళ్ళడం బాగోదు. కొత్త వాష్ బేసిన్ తెచ్చారో లేదో చూడవూ?" అంది.

"యెందుకెళ్ళను? యిప్పుడే వెడతాను" అని లేవిన్ లేస్తూ ఆమెని ముద్దుపెట్టుకుంటూ అన్నాడు.

'వుహుఁ, తనకి చెప్పను' అని ఆమె యెదరకి వెడుతూ వుండగా అనుకున్నాడు. 'యిది నాకు మాత్రమే సంబంధించిన ప్రాణభూత రహస్యం. దీన్ని మాటలలో పెట్టలేం.'

'యీ నూతన భావనవల్ల నాలో యే పరివర్తనా లేదు. నేను ఆశించినట్టుగా యిది నన్ను సౌఖ్యప్రదంగా చెయ్యలేదు, వికాసవంతం చెయ్యలేదు, పిల్లవాడి పట్ల నా ప్రేమ మాదిరిగా. యేదో ఆశ్చర్యకరమైందీ భళ్ళున తెల్లవారినట్టు జరగలేదు. యిది నా విశ్వాసమూ లేక మరేదన్నానా? యేమో నాకు తెలీదు. కాని యిది మానసిక అశాంతిద్వారా అగోచరంగానే నా ఆత్మలోకి ప్రవేశించింది, స్థిరంగా పాదుకొంది.

'బండి తోలే ఇవాన్‌మీద మునుపటిలాగా కోప్పడతాను, యింకా వాదనలు చేస్తాను, అనవసర ప్రసంగంగా నా ఆలోచనలు వ్యక్తం చేస్తాను, నా అంతరంగం లోతులకీ యితరులకీ మధ్య, నా భార్యకి నాకూ మధ్య కూడా గోడ వుంటుంది, ముందటి లాగానే నా భయాలకి ఆమెని తప్పు పడతాను, అందుకు పశ్చాత్తాప పడతాను, యెందుకు ప్రార్థన చేస్తున్నదీ నా వివేచనద్వారా అర్థం చేసుకోలేకపోతాను కాని ప్రార్థన చేస్తూనే వుంటాను. కాని యిప్పుడు నా జీవితం, నాకు యేం జరిగినా జరగనీ గాక, నా యావజ్జీవితం, జీవితంలోని ప్రతిక్షణం ముందటిలాగా అర్థహీనంగా వుండదు. కాని శివం అంటే తిరుగులేని అర్థం వుంది, దాన్ని అలా అర్థవంతం చేసుకునే సామర్థ్యం నాకు వుంది.

అయిపోయింది

# వివరణలు

పేజి 5 – లెంట్: మత సంప్రదాయానుసారం ఉపవాసం పాటించే రోజుల్లో చర్చిలో వివాహాలు జరపరు. లెంట్ యేడు వారాల ఉపవాసం పాటించాల్సిన సమయం (ఫిబ్రవరినుంచి ఏప్రిల్ మాసాలదాకా). లెంట్ తర్వాత ముఖ్య క్రైస్తవ పర్వదినం ఈస్టర్ వస్తుంది. (ఉపవాసాలకి సంబంధించి మొదటి వాల్యూమ్‌లో 167 పేజికి యిచ్చిన వివరణ చూడండి.)

పేజి 11 – రాజీ కోర్టులో జడ్జి: చిన్న చిన్న పౌర, నేర సంబంధమైన కేసుల్ని విచారించే కోర్టులో జడ్జి. యీ కోర్టులు 1864 న్యాయశాఖ సంస్కరణ ప్రకారం అమలులోకి వచ్చాయి. వాటి సభ్యుల్ని జేమ్‌స్త్వో కౌన్సిళ్లు యెన్నుకునేవి.

పేజి 12 – "చాలా మంది యీ రెండింటినీ కలగాపులగం చేసేస్తారు. నేను ఆ బాపతు వాణ్ణి గాను": రష్యన్ రచయిత అలెగ్జాండర్ గ్రిబొయేదొవ్ (1795–1829) రాసిన "తెలివితేటలు కడగండ్లకు దారితీస్తున్నాయి" కామెడీనుంచి ఉల్లేఖన.

పేజి 13 – "గోగొల్ కామెడీలోని నాయకుడిలాగా కిటికీలోనుంచి దూకి పారిపోవాలని...": మహా రష్యన్ రచయిత నికొలాయ్ గోగొల్ (1809–1852) రాసిన "పెళ్లి" అనే కామెడీకి ప్రస్తావన. యీ నాటకంలో నాయకుడు ఆఫీసరు. పెళ్లి జరగ బోయే ముందు కిటికీలోనుంచి బయటకి దూకి పారిపోతాడు.

పేజి 13 – త్వేర్: మాస్కోకి దగ్గర్లో వున్న వొక పట్టణం. యిప్పుడు కలీనిన్ అని పిలు స్తారు.

పేజి 18 – నారింజ పువ్వు: తెల్లదనం, అమలినత్వానికి ప్రతీక.

పేజి 22 – సినాద్: విప్లవాత్పూర్వం రష్యన్ ఆర్థడాక్స్ చర్చి కార్యకలాపాలు చూసే ఉన్నత స్థాయి శాఖ.

పేజి 27 – "యిదిగో చూదొవొ చర్చి గాయక బృందం." – "వుహూఁ కాదు సినాద్‌వాళ్లు": మాస్కోలో అప్పట్లో రెండు ప్రఖ్యాత గాయక బృందాలుండేవి. ఒకటి చూదొవొ చర్చిది, రెండవది సినాద్ చర్చిది.

పేజి 28 – "...ఐజక్ రెబెకాలమీద, జోసెఫ్‌మీద, మోజెస్, జిప్పొరాహ్‌ల...": అంటే బైబిల్‌నుంచి పెద్ద సంతానం వున్న కథల పాత్రలకి ప్రస్తావన.

పేజి 29 – "సంతోషింత రంగుడవుకమ్ము ఇసయా" – ఆర్తడాక్స్ చర్చిలో వివాహం క్రతువు చివరిలో పాడే గీతం.

పేజి 30 – పేజ్‌కోర్: మిలిటరీ పాఠశాల. (మొదటి వాల్యూంలో 84 పేజికి యిచ్చిన వివరణ చూడండి).

పేజి 31 – "...పౌర హోదా సంపాదించుకుని...": పేజ్‌కోర్‌లో చదువుకున్న వాళ్ళు సైనిక కొలువుకీ, పౌర కొలువుకీ వెళ్లచ్చు. పౌర కొలువుకి వెడితే పౌర హోదా యిస్తారు.

పేజి 33 – తిన్‌తోరెత్తో యాకొపొ (1518–1594) – ఇటాలియన్ చిత్రకారుడు.

పేజి 39 – "ఇవానొవ్ – ష్ట్రౌస్ – రెనాన్ ధోరణి...": ఇవానొవ్ (1806–1858) – రష్యన్ చిత్రకారుడు, ముఖ్య చిత్రం "క్రీస్తు ప్రజల దర్శనలో" అన్నది. ష్ట్రౌస్ డేవిడ్ ఫ్రెడరీక్ (1808–1874) – జర్మన్ తత్వవేత్త, థియాలజీ "జీసస్ జీవితం" అనే గ్రంథం రాశాడు. రెనాన్ జోసెఫ్ ఎర్నెస్ట్ (1823–1892) – ఫ్రెంచి రచయిత, "క్రిస్టియానిటీ ఆవిర్భావం – చరిత్ర" అనే గ్రంథం రాశాడు. వాళ్లందరికీ క్రీస్తుపట్ల చారిత్రక వైఖరి వుండేది.

పేజి 39 – "...చరిత్రనుంచి సోక్రటీస్‌నో ఫ్రాంక్లిన్‌నో లేదా షార్లెత్ కోర్దేనో...": సోక్రటీస్ – ప్రాచీన గ్రీకు తత్వవేత్త (క్రీ.పూ. 470/469–399), ప్లేటో గురువు. గ్రీకు తత్వశాస్త్రానికి పితామహుడు. ఫ్రాంక్లిన్ బెంజమిన్ (1706–1790) – అమెరికన్ వికాసదాయకుడు, రాజకీయవేత్త. అమెరికా స్వాతంత్ర్య ప్రకటన పత్ర రచయితల్లో ఒకరు. షార్లెత్ కోర్దే (1768–1793) – ఫ్రెంచి గొప్ప వంశీకురాలు. మహా ఫ్రెంచి విప్లవంలో జాన్ పోల్ మరాత్ అనే నాయకుణ్ణి చంపింది.

పేజి 41 – "...évolution, ప్రాకృతిక వరణం, అస్తిత్వ సంఘర్షణ...": ఇంగ్లీషు నాచురల్ సైంటిస్టు చార్లెస్ రాబర్ట్ డార్విన్ (1809–1882) – ప్రతిపాదించిన పరిణామ సిద్ధాంతానికి ప్రస్తావన.

పేజి 43 – రాఫేల్ (1483–1520) – ఇటలీ సాంస్కృతిక పునరుజ్జీవన కాల మహా చిత్రకారుడు.

పేజి 44 – "...రాఫేల్ పూర్వ శైలీ వైఖరి...": 19వ శతాబ్దంలో ఆంగ్ల చిత్ర కారుల, రచయితల బృందం. మధ్య యుగాల నాటి, అంటే రాఫేల్ పూర్వ శైలిని అనుసరించడం వాళ్ళ ఆదర్శం.

పేజి 45 – టిట్సియాన్, రాఫేల్, రూబెన్స్‌లు: టిట్సియాన్ (మరణం 1576) – ప్రఖ్యాత ఇటాలియన్ చిత్రకారుడు. రాఫేల్ – 43 పేజికి నోట్ చూడండి. రూబెన్స్ పీటర్ పాల్ (1577–1640) – ప్రఖ్యాత ఫ్లెమిష్ చిత్రకారుడు.

పేజి 46 – రాషేల్ (1821–1858) – ఫ్రెంచి నటి, విషాద నాటక నాయకి.

పేజి 48 – ఇవానొవ్: 39 పేజికి నోట్ చూడండి.

పేజి 61 – "కపూాయ నగర జీవిత సౌఖ్యప్రద జీవితం...": నేపుల్స్ దగ్గర వో పట్టణం కపూాయ. రోమ్ చిత్రకారుడు టిట్ లివియ్‌ని ప్రకారం రెండవ పున్య యుద్ధ కాలంలో హన్నిబాల్ సైన్యాలు శీతకాలం గడిపేయి. అక్కడ గడపడంవల్ల సైనికులు శారీరక, మానసిక జడత్వం పాల పడ్డారు. ఫలితంగా హన్నిబాల్ సైన్యం ఓటమి పాలయింది.

పేజి 73 – "మహర్షులకు బోధపడని రహస్యాన్ని...": సువార్తనుంచి ఉల్లేఖన.

పేజి 92 – "ముగ్గురు స్లావ్‌లని, కొమిస్సారొవ్‌ని...": స్లావ్‌లు – యిక్కడ – సెర్బియా, చెర్నోగోరియా, బల్గేరియా అనే స్లావ్ రాజ్యాల ప్రభుత్వ, సామాజిక కార్య కర్తలకు ప్రస్తావన. కొమిస్సారొవ్, ఒసిప్ (1838–1892) – రష్యన్ రైతు. విప్లవకారుడు ద్మిత్రీ కరకోజొవ్ (1840–1866) రష్యన్ చక్రవర్తి అలెగ్జాండర్ IIని కాల్చి చంపకుండా అడ్డం వెళ్లి కాపాడేడు. కొమిస్సారొవ్‌కి

కులీనుల అంతస్తు హోదా లభించింది. రష్యాలో ఉన్నత సమాజం వాళ్ళు అతన్ని ఆరాధించారు.

పేజి 92 – ''స్లావ్ సమస్య లేకపోయినట్లయితే గనక రీస్తిచ్–కుడ్‌జీత్‌స్కీని ప్రేమించి వుండేది కాదు'': రీస్తిచ్–కుడ్‌జీత్‌స్కీ – సెర్బియాలో ఒక రాజకీయవేత్త. రష్యా – టర్కీ యుద్ధకాలంలో (1876) సెర్బియాకి విదేశాంగ మంత్రి. స్లావ్ సమస్య – టర్కీ పాలనకింద వున్న స్లావ్ ప్రజల (సెర్బియా, చెర్నోగోరియా, బల్గేరియా వాసుల) స్వాతంత్ర్యం కోసం పోరాటం. 1876లో సెర్బియా టర్కీల మధ్య జరిగిన యుద్ధం సందర్భంగా స్లావ్ సమస్యని టాల్‌స్టాయ్ నాటి సమాజంలో యెక్కువగా చర్చించేవాళ్ళు.

పేజి 95 – అలెగ్జాండర్ నేవ్‌స్కీ ఆర్డరు: విప్లవానికి ముందు అత్యున్నత పతకాలలో ఒకటి. రష్యన్ రాజకుమారుడు నేవ్‌స్కీ (1220–1263) పేరుమీద స్థాపితం అయింది. ఆయన స్వీడిష్ దురాక్రమణదార్లమీద విజయం సాధించేడు. ఆ రకంగా రష్యన్ పశ్చిమ సరిహద్దుల్ని భద్రం చేశాడు.

పేజి 95 – రాజకీయ మండలి: రష్యన్ సామ్రాజ్యంలో ఉన్నత శాసన ప్రతిపాదన శాఖ.

పేజి 95 – కామ్మెహెర్: జారిస్టు రష్యాలో అత్యున్నత దర్బార్ బిరుదు.

పేజి 103 – సమ్మర్ గార్డెన్: పీటర్స్‌బుర్గ్‌లో నేవా నది తీరంలో ఉద్యానవనం. పాల రాతి విగ్రహాలతో, నాజూకైన లతల చట్టాలతో అలంకరించినటు వంటిది.

పేజి 104 – ''వ్లదీమిర్ పతకం దాని కంటే పెద్దదని...'': జారిస్టు రష్యాలో పతకాల వరస. క్రమంలో అంద్రేయ్ మొదటి చిహ్నం, తర్వాత వ్లదీమిర్ మొదటి గ్రేడ్‌ది, తర్వాత అలెగ్జాండర్ నేవ్‌స్కీ.

పేజి 126 – పత్తి: కర్లోతా పత్తి (1835–1889) – ఒపెరా గాయని. 1872–75లలో రష్యా పర్యటన జరిపింది.

పేజి 141 – పేరింటి రోజు: కాథలిక్ ఆర్తడాక్స్ సంప్రదాయంలో చర్చి సెయింట్ పేరున జరిపే దినం. ఆ రోజున జన్మించిన వాళ్ళు తమ పుట్టిన రోజుతోబాటు దీన్ని జరుపుకునేవారు.

పేజి 160 – వెర్స్తు: పాత రష్యన్ దూరంకొలత. 1.06 కి. మీ. సమానం.

పేజి 168 – "...ఆరు పూడ్లేనా...": పూడ్ – పాత రష్యన్ కొలమానం. 16.3 కే.జీలు సమానం.

పేజి 171 – ఆటోమెడాన్: హోమెర్ కృత "ఇలియడ్" మహాకావ్యంలో రథసారథి.

పేజి 178 – పన్నులు దండుకునేవాళ్లు: కొన్ని పన్నులు వసూలు చేసి పనులు నిర్వహించేందుకు హక్కు వున్న వ్యక్తులు. రష్యాలో 1863లో నిషేధించిన వ్యవసాయ పద్ధతి.

పేజి 179 – "Le roi est mort, vive le roi!" (రాజు లేడు, రాజు వర్ధిల్లాలి!): మధ్య యుగాల్లో ఫ్రాన్స్‌లో యధావిధిగా వల్లించే మాటలు. ఒక రాజు తర్వాత కొత్త రాజు పట్టాభిషేకానికి యిలా అనేవారు.

పేజి 182 – గ్రెట్‌ఛెన్ (మర్గరీతా): మహా జర్మన్ రచయిత గాథే (1749–1832) రాసిన విషాద నాటకం "ఫౌస్ట్" నాయిక పాత్ర. అమలిన సౌందర్యానికీ, పాతి వ్రత్యానికీ ప్రోది.

పేజి 192 – "తలమీద మనోమాఖ్ కిరీటం మోసేవాడికి మనశ్శాంతి వుండదు": బొరీస్ గొదునోవ్ అనే పూష్కిన్ కావ్యంలోనుంచి ఉల్లేఖన. మనోమాఖ్ కిరీటం సూటిగా వజ్రాలంకృతమై, శిలువతో వుండే టోపీ. రష్యన్ జార్‌లకి అలంకారం.

పేజి 232 – "...జేమ్‌స్త్వో సంస్థలు, రాజీ కోర్టులు...": జేమ్‌స్త్వో – స్థానిక స్వయం పాలిత సంస్థ. (వివరంగా మొదటి వాల్యూం 38 పేజికి ఇచ్చిన వివరణ చూడండి.) రాజీ కోర్టులు – 11 పేజికి ఇచ్చిన వివరణ చూడండి.

పేజి 247 – "...భూముల రొఖ్ఖం వసూలు...": 1861 భూసంస్కరణల ప్రకారం రైతులు భూమి లేకుండా ఫ్యూడల్ దాస్యంనుంచి విముక్తం అయేరు. పూర్వపు భూస్వాములు వాళ్లకి కమతాల్ని కాలపరిమితి మేరకి కొంత శిస్తుకి యిచ్చేరు. (వివరంగా మొదటి వాల్యూంలో 122 పేజికి యిచ్చిన వివరణ చూడండి.)

పేజి 261 – "పాత కాలం వేస్తా దేవత పవిత్ర కన్యలకి పవిత్రాగ్ని రక్షణ బాధ్యత వున్నట్టు": వేస్తా దేవత స్త్రీ పూజార్లు. ప్రాచీన రోమ్‌లో గృహ దేవత.

పేజి 264 – "మార్షల్‌కంటే డిప్యూటీ మార్షల్‌కి యెక్కువ వోట్లు రావచ్చు": గొప్ప వంశీకుల ఎన్నికలో మార్షల్‌నీ, డిప్యూటీ మార్షల్‌నీ యెన్నుకునేవారు. డిప్యూటీ మార్షల్ అభ్యర్థికి గనక మార్షల్‌కి వచ్చిన వోట్లకంటే యెక్కువ వస్తే ఆ వ్యక్తి మార్షల్ అవవచ్చును. యిక్కడ అలానే జరుగుతుంది.

పేజి 272 – టైయిన్, ఇప్పోలీట్ (1828–1893) – ఫ్రెంచి చరిత్రకారుడు, విమర్శకుడు, రచయిత.

పేజి 278 – "...క్లబ్బులో భోజనం చేస్తావని...": మాస్కో ఇంగ్లీషు క్లబ్బుకి ప్రస్తావన. ఉన్నత సమాజ క్లబ్బు.

పేజి 283 – "వూఁ, అయితే చెర్నోగోరియా వాసుల గురించి యేమంటావ్?": టర్కీ యుద్ధం తర్వాత చెర్నోగోరియా సుల్తాన్ పాలన కింద వుండేది కాని విదేశీ ఆధిపత్యానికి వ్యతిరేకంగా వాళ్ల పోరాటం సాగింది. 1876లో చెర్నోగోరియా తిరుగుబాటు చేసింది.

పేజి 285 – "యివాళ స్విన్తిచ్ యాభైయ్యవ వర్ధంతిని...": స్విన్తిచ్ – కల్పిత నామం. నానారకాల ఉత్సవ నిర్వహణలనీ టాల్‌స్టాయ్ అధిక్షేపిస్తున్నాడు.

పేజి 288 – "Journal de St.-Pêtersbourg": రష్యన్ పాక్షిక అధికారిక పత్రిక, పీటర్స్‌బుర్గ్‌లో ఫ్రెంచిలో అచ్చయేది. ఉన్నత వంశీకుల అభిప్రాయాల్ని ప్రతిబింబించేది.

పేజి 288 – "...బుస్లాయెవ్ రాసిన వ్యాకరణం పుస్తకం...": బుస్లాయెవ్ ఫ్యోదొర్ (1818–1897) – రష్యన్ భాషా శాస్త్రజ్ఞుడు, రష్యన్ వ్యాకరణంమీద ప్రముఖ గ్రంథం రాశాడు.

పేజి 290 – "...హెర్‌జెగొవీనా గురించి...": హెర్‌జెగొవీనా, బోస్నియాలలో టర్కీకి వ్యతిరేకంగా జరిగిన ప్రజా విమోచనోద్యమానికి ప్రస్తావన.

పేజి 290 – నగర దూమ: రష్యాలో నగర పరిపాలనా సంస్థ.

పేజి 291 – "పచ్చిక బీటోల్లో కింగ్ లియర్": ఇంగ్లీషు మహా కవి షేక్స్పియర్ (1564–1616) రాసిన "కింగ్ లియర్" అనే విషాద నాటకాన్ని అనుసరించి రాసిన సంగీతకృతి.

పేజి 291 – బాఖ్ యోగాన్ సెబాస్త్యన్ (1685–1750) – మహా జర్మన్ సంగీతకర్త.

పేజి 292 – కార్డీలియా: షేక్స్పియర్ రాసిన ట్రాజెడీ "కింగ్ లియర్"లో చక్రవర్తి మూడవ కుమార్తె.

పేజి 292 – వాగ్నర్, రిఖర్డ్ (1813–1883) – జర్మన్ మహా వాగ్గేయకారుడు.

పేజి 293 – రాఫేల్ పూర్వ శైలి వైఖరి: 44 పేజికి యిచ్చిన వివరణ చూడండి.

పేజి 294 – folle journée (పిచ్చి రోజు): నాట్య వినోదాల్ని విందుల్ని అలా పిలిచే వాళ్లు.

పేజి 295 – "...విచారణ జరుగుతూ వున్న వొక విదేశీయుడికి విధించవలసివచ్చిన దండన గురించి": 1875లో సంచలనాత్మక నేర విచారణ బి. జి. స్ట్రూస్బెర్గ్ మీద జరిగింది. అతను పెద్ద మోసం చేశాడు. కోర్టు తీర్పు మేరకి విదేశాలకి పంపేశారు.

పేజి 295 – క్రిలోవ్, ఇవాన్ (1769–1844) – ప్రఖ్యాత రష్యన్ నీతి కవితా రచయిత.

పేజి 307 – జోలా, దొదే: జోలా ఎమిలీ (1840–1902), దొదే అల్ఫాన్స్ (1840–1897) – ప్రఖ్యాత ఫ్రెంచి రచయితలు.

పేజి 336 – "...రూరిక్ వంశం...": రష్యన్ ఇతిహాసం ప్రకారం 9వ శతాబ్దంలో రష్యా ఉత్తర ప్రాంతాలకి వచ్చిన స్కాండినేవియన్ రాకుమారుడు. (ఉపవాసాలకి సంబంధించి మొదటి వాల్యూమ్లో 26 పేజికి యిచ్చిన వివరణ చూడండి.)

పేజి 361 – "వెడితే సోమవారం వెళ్లడం లేకపోతే లేదంతే": ఇక్కడ టాల్స్టాయ్ పొరపాటు. ముందు ఆదివారం వెళ్లాలని అన్నా అంది.

పేజి 378 – మితీష్చి నూతులు: మాస్కోకి దగ్గర ఒక గ్రామం. అక్కడి నీళ్లు రుచిగా వున్నట్టు పేరు వుంది.

పేజి 378 – త్రోయిత్సా మఠానికి: – సేర్గియెవ్‌స్కీ ఆర్థడాక్స్ పురుష మొనాస్టరి ప్రస్తావన. 14వ శతాబ్దంలో స్థాపించారు. మాస్కోకి 80 కి. మీ. దూరంలో వుంది. ఆస్తికులు అక్కడికి యాత్ర చేశారు.

పేజి 395 – "భిన్న మతాల సమస్య, అమెరికా మిత్రులు, సమారలో కరువు...": భిన్న మతాల సమస్య – పశ్చిమ ఉక్రేయిన్‌లో కాథలిక్ ప్రజల్ని ఆర్థడాక్స్ ఆస్తికులుగా మార్చడానికి సంబంధించిన సమస్య.

అమెరికా మిత్రులు – కరకోజొవ్ జార్ అలెక్సాండర్ II పై హత్యా ప్రయత్నం జరిపిన తర్వాత (92 పేజికి వివరణ చూడండి) పీటర్స్‌బుర్గ్‌కి అమెరికన్ దౌత్య ప్రతినిధివర్గం వచ్చింది. అది "మొత్తం అమెరికా జాతి తరపున సానుభూతి, గౌరవాదరాభిమానాలు" ప్రకటించింది. "అమెరికన్ స్నేహితుల"కి బిగ్గరగా స్వాగతం చెప్పారు.

"సమారలో కరువు": సమార – వోల్గా నది తీరాన ఉన్న నగరం. ఈ ప్రాంతంలో కరువులు తరచుగా వచ్చేవి. 1873లో తీవ్ర కరువు వచ్చింది. అప్పుడు టాల్‌స్టాయ్ కరువు బాధితులకి సాయం చేయడానికి చురుగ్గా పని చేశాడు.

పేజి 397 – "యుద్ధానికి వెళ్లే వలంటీర్లు": సేర్బియా టర్కీల మధ్య యుద్ధం మొదలవగానే రష్యాలో వలంటీర్ల కమిటీలు స్థాపించారు. రష్యా రాజ్యం టర్కీకి వ్యతిరేకంగా యుద్ధాన్ని 1877లో మాత్రమే ప్రకటించింది. కాబట్టి ముందుగా యుద్ధానికి వెళ్లాలనుకున్న మిలిటరీ ఆఫీసర్లు రిటైరవాలి.

పేజి 400 – 'భగవంతుడు జార్‌ని కాపాడు గాక!': జార్ రష్యా జాతీయ గీతాలలో మొదటి చరణం.

పేజి 402 – "నేను రిటైరైన కేడెట్‌ని": కేడెట్ – 19వ శతాబ్దంలో 60ల మధ్యదాకా కులీనుడైన సబ్ ఆఫీసరు. కేడెట్‌కి మిలిటరీ ట్రెయినింగ్ లేదు. నిర్ణీత కాలం సేవ చేసి పరీక్ష పాసయితే ఆఫీసరు అవగలడు.

పేజి 406 – "రీస్తిచ్‌గారికి గాని మీలన్‌గారికి గాని...": రీస్తిచ్ – 92 పేజికి వివరణ చూడండి.

మీలన్, ఒబ్రేనొవిచ్ (1852–1901) – 1858–1882లలో సేర్బియా రాజు.

పేజి 415 – "...ప్లేటో, స్పినోజ, కాంట్, షెల్లింగ్, హెగెల్, షోపెన్‌హోవర్‌లాంటి తత్వ వేత్తల గ్రంథాల్ని...": ప్లేటో (క్రీ. పూ. 428–348) – ప్రాచీన గ్రీకు తత్వవేత్త, భావవాది తత్వశాస్త్ర పితామహుడు, సోక్రటీసు శిష్యుడు. స్పినోజ, బెనెడిక్ట్ (1632–1677) – నెదర్‌లాండ్ భౌతికవాద తత్త్వవేత్త, నాస్తికుడు. కాంట్, ఇమ్మనుయేల్ (1724–1804) – జర్మన్ అజ్ఞేయవాద తత్వవేత్త, సంప్రదాయిక జర్మన్ తత్వవాద పితామహుడు. షెల్లింగ్, ఫ్రెడరీహ్ (1775–1854) – జర్మన్ తత్వవేత్త, భావవాది. హెగెల్, జార్జి విల్‌హెల్మ్ ఫ్రెడరీహ్ (1770–1831) – జర్మన్ తత్వవేత్త, భావవాది, గతితర్క సూత్ర స్థాపకుడు. షోపెన్‌హోవర్, ఆర్థర్ (1788–1860) – జర్మన్ తత్వవేత్త, అహేతుకవాది.

పేజి 416 – ఖొమ్యకోవ్, అలెక్సేయ్ (1804–1860)–రష్యన్ మత తత్వవేత్త, రచయిత.

పేజి 433 – స్పెన్సర్, హెర్బర్ట్ (1820–1903) – ఇంగ్లీషు బూర్జువా తత్వవేత్త, శాస్త్రజ్ఞుడు.

పేజి 436 – 'కాఫిర్ తాతార్లు': తాతార్ తెగవాళ్లు, ముస్లిం సంప్రదాయం ప్రకారం ముస్లిమేతరులు 'కాఫిర్లు' నాస్తికులు. అందుకని క్రైస్తవులు అలా వ్యవహరిస్తూ వాళ్లని పిలిచేరు.

పేజి 438 – "చక్రవర్తి అలెగ్జాండర్ నికొలాయెవిచ్...": రష్యన్ చక్రవర్తి అలెగ్జాండర్ II, 1855నుంచి 1881దాకా పాలించేడు.

పేజి 438 – "...పుగచేవ్ దండో, ఖీవాయో...": పుగచేవ్, ఎమిల్యాన్ (1742–1775) – 1773–75లలో రష్యాలో జరిగిన రైతు తిరుగుబాటుకి నాయకుడు. ఖీవా – మధ్య ఆసియాలో రాజ్యం. 1873లో రష్యన్ సైనిక దండయాత్ర లోబరుచుకుంది.

పేజి 440 – అల్ఫాన్స్ కార్ (1808–1890) – ఫ్రెంచి జర్నలిస్టు, వ్యంగ్య రచయిత.

పేజి 441 – "స్కాండినేవియన్లని ఆమంత్రణం చేస్తూ వున్న కథ...": రష్యా ఉత్తర ప్రాంతాలకి వచ్చిన స్కాండినేవియన్ రాకుమారుడు రూరిక్ కథకి ప్రస్తావన. (ఉపవాసాలకి సంబంధించి మొదటి వాల్యూమ్‌లో 26 పేజికి యిచ్చిన వివరణ చూడండి.)

పాఠకులకు మనవి

ఈ పుస్తకం గురించీ, దీని అనువాదం గురించీ మీ అభిప్రాయాలను "రాదుగ" ప్రచురణాలయానికి దయచేసి తెలుపండి.

మీ అభిప్రాయాలను ఈకింది చిరునామాకు పంపండి:

Raduga Publishers
17, Zubovsky Boulevard
Moscow, USSR

మా ప్రచురణలు దొరికే చోట్లు:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్ – 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్
ఏలూరు రోడ్డు
విజయవాడ – 520 002

విశాలాంధ్ర బుక్ హౌస్
సుల్తాన్ బజారు
హైదరాబాద్ – 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్
కాలేజీ రోడ్డు
అనంతపురం – 515 004

విశాలాంధ్ర బుక్ హౌస్
11-1-37 గాంధీ రోడ్డు
తిరుపతి – 517 501

విశాలాంధ్ర బుక్ హౌస్
సూపర్ బజారు ఎదుట
మెయిన్ రోడ్డు
విశాఖపట్నం – 530 002

విశాలాంధ్ర బుక్ హౌస్
మెయిన్ రోడ్డు
హనుమకొండ
వరంగల్ – 506 011

విశాలాంధ్ర బుక్ హౌస్
మెయిన్ రోడ్డు
అరండల్ పేట
గుంటూరు – 522 002

త్వరలో వెలువడుతోంది!

మిహాయిల్ షోలొహోవ్ – "కథలు"

మిహాయిల్ షోలొహోవ్‌ని ప్రపంచ పాఠకులకి పరిచయం చెయ్యబోవడం సూర్యుడికి దివిటీ చూపించడం లాంటిది. ఆయన విప్లవానంతర సోవియట్ రష్యా మహా రచయిత, నోబెల్ బహుమతీ గ్రహీత. దాన్ నది యీయన రచనల్లో తరంగించింది. ఆ మహత్తర రష్యన్ నది ఉరవళ్ళు, వడి, ప్రశాంత గంభీరత షోలొహోవ్ రచనల్లో పాఠకులని స్పందింప చేస్తాయి.

యీ సంపుటిలో అంతర్యుద్ధ కాలాన్ని ప్రతిబింబించే కథలు "దొంగ ముండకొడుకు," "నీలిరంగు స్తెప్‌మైదానం," "గుర్రప్పిల్ల," "గొడ్లకాపరి," "పుట్టుమచ్చ" అనేవి, మహా దేశభక్తియుత ద్వితీయ సంగ్రామ కాలాన్ని ప్రతిబింబించే "మానవుని రాత" అన్న కథ వున్నాయి.

"రాదుగ" ప్రచురణాలయం షోలొహోవ్ కథల్ని ప్రచురిస్తోంది. మీ కాపీ కోసం "విశాలాంధ్ర ప్రచురణాలయం" వారిని సంప్రదించండి!

చదవండి!

త్వరలో వెలువడుతోంది — చదవండి

జెంఘిజ్ ఖాన్

వి. యాన్

''జెంఘిజ్ ఖాన్, తామర్లేనూ
నాదిర్షా ఘజినీ గోరీ''

అని మహాకవి ''దేశ చరిత్రలు'' ఖండికలో నరహంతల పట్టీలో చేర్చిన జెంఘిజ్ ఖాన్ యెవరు? నిజంగా హంతకుడేనా లేక మహానేతా! పాశ్చాత్య చరిత్రకారులు అలెగ్జాండర్ ది గ్రేట్‌ని మహా విజేతగా కీర్తించారు. కాని జెంఘిజ్ ఖాన్‌ని మహా రక్తపిపాసి అన్నారు. రక్తపిపాసి, హంతకుడు, నరరూప రాక్షసుడు అయినవాడు వొక మహా సామ్రాజ్యాన్ని స్థాపించ గలడా? నిలబెట్టగలడా? యాన్ సుప్రసిద్ధ సోవియట్ రచయిత. ఆయన రాసిన నవల ''జెంఘిజ్ ఖాన్.'' ''రాదుగ'' ప్రచురణాలయం త్వరలో యీ నవలని తెలుగులో ప్రచురిస్తోంది. చదవండి! చరిత్ర పుటల్లోకి వెళ్లండి!

భారతదేశంలో విస్తృత ఆదరణ లభించిన యూరపియన్ రచయితల కోవలో వాడు లియో టాల్‌స్టాయ్. దీనికి కారణం టాల్‌స్టాయ్ రచనల్లో వున్న గొప్ప సుగుణాలు మాత్రమే కాదు, ఆయనకీ మా మహా నాయకుడు మహాత్మా గాంధీకిగల ఆత్మిక బంధం కూడా. గాంధీ తన వ్యక్తిత్వం రూపు తీసుకునే దశలో టాల్‌స్టాయ్ ప్రభావంకింద వున్నాడు.

అంచేత ఆ మహా రష్యన్ రచయితకి నివాళులు అర్పించడానికి నాకు ఆనందంగా వుంది... ఆయన శాశ్వతంగా స్మృతిలో మిగిలిపోయే కొద్దిమంది ప్రపంచ రచయితల కోవకి చెందుతాడు...

జవహర్‌లాల్ నెహ్రూ